## Bibliographic Record Target

వేమన.

The verses of Vemana : with notes.- Madras : V. Ramaswamy Sastrulu and Sons, 1925.

62, 978, 61, (1) p. : ill. ;17 cm.

Record no. 642

Vēmana.

The verses of Vemana : with notes.- Madras : V. Ramaswamy Sastrulu and Sons, 1925

62, 978, 61, (1) p. : ill. ;17 cm.

Record no. 642



వే మ న.

"తల్లిగర్భమందుఁ దాఁ బుట్టినప్పుడు
మొదల బట్టలేదు తుదనులేదు
నడుమబట్టఁ గట్ట నగుఁబాటు కాదొకో వి॥"

(తంజావూరి రాచనగరునందలి చిత్రపటమునుండి తీసినది.)

By the Courtesy of
Rao Sahib **R. KRISTNA RAO Bhonsle, M. R**

# ప్రార్థనపద్యములు.

---

అవతారిక. యోగివర్యుఁడును ఆగతానాగతవేత్తయుం రాజయోగధురంధరుఁడును మహానుభావుండును నగువేమనమహాత్ముఁడు ప్రపంచోద్ధరణార్థమై వివిధ విషయములతో పద్యములను రచించి జ్ఞానోపదేశము గావింప నిశ్చయించి కావ్యమునకు శ్రేయస్సాధనమని "ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశోవాపితన్ముఖమ్" అనునాలంకారికసూక్తి ననుసరించి నిర్విఘ్నముగా కావ్యము సమాప్తియగుటకు నిష్టదైవత మగుపరమేశ్వరుని ధ్యానముచేయుచున్నాఁడు—

క. శ్రీమదుమాపతి యగు నా
స్వామికి దాసుం డనంగ జగములు పొగడన్
వేమన యని యెడుధీరుఁడు
నేమంబునఁ జెప్పు దీని నిజముగ వేమా.

క. శ్రీరామరామనామము
మారాడక విను నరునకు మహితాత్ముండై
యూరూరఁ దిరిగి చెప్పుమి
యారూఢతపఃఫలంబు లగు వేమపతీ.

క. శ్రీయన మంగళదేవత
శ్రీయనఁగా విష్ణుపత్ని సిరి సంపదయున్
శ్రీయనెడు మూలశక్తిని
శ్రీయని వర్ణింపు మెపుడు స్థిరమతి వేమా.

క. శ్రీమూలశక్తి యనఁదగు
నామూర్తులఁ గన్నతల్లి నాగాదనకన్
ధీమూర్తి నెంచిచూడుము
నీమూర్తికి సాటిలేదు నిజముగ వేమా.

క. శ్రీరామ యనెడుమంత్రము
తారకమని యెఱిఁగి మదిని ధ్యానపరుండై
సారము గ్రోలిన నరునకు
చేరువగను బరమపదవి చేకురు వేమా.

క. శ్రీకర బ్రహ్మాకారుని
ప్రాకటముగ మదినిజేర్చి ప్రణవాకృతితో
సోఁకి నటించెడి జ్ఞప్తిని
పాకము గని దాటువాఁడె భక్తుఁడు వేమా.



# పీఠిక.

---

ఫలాపేక్ష లేక, యితరులను సంతోషపఱుచుటకుఁ గాక, తాము చేయుపనికి భవిష్యత్కాలమునఁ గలుగఁగల విలువను గమనింపక, కేవలజిహ్వాచాపల్యమును దీర్చుకొనుటకై స్వాభావికముగఁ గవన మల్లువారు ఏవాఙ్మయమునఁగాని యనేకులుండరు. కావ్యమును దమ యిచ్ఛవచ్చినట్లు తీర్చుటచేఁ గలుగుమానసికానందము, పరాభిప్రాయములకు దాసులై చేయుటచే గలుగు బాహిరసౌఖ్యానందములకన్న వేయిరెట్లు నిష్కల్మషమును నిస్సమానమును నైన దనుతత్త్వమును గమనించిన కర్తలరుదు. తాతలమతము, తమ్ముఁ బోషించు పాళయగాండ్రమతము, ఈ రెంటి ననుసరించుటకుఁ బోయి యాంధ్రకవులు తమసారస్వతమును నలుదిక్కుల బంధించిరి. కాని, యాత్రాళ్ళను ద్రెంచికొను సామర్థ్యము గలకవులుగూడ నందందు భాగ్యవశమున లేకపోలేదు. త్యాగరాజు, క్షేత్రయ, మొదలగువారు నిదర్శనభూతులు. ప్రాయికముగ నీతిబోధకై యేర్పడిన శతకకర్త లనేకు లీజాతివారే.

ఈ తెగకవులపద్ధతి యిది: జనసామాన్యము

యొక్క నిందనము నందనము రెండును వీరి కొకటే.
'నీకవనముఁ బాగుగ లేదు. నీరస' మని యెవ్వరైనఁ
దిరస్కరించిరేని యది బాగున్న దని కాని యందు
రసము గల దని కాని వారితో వాదించి స్థాపింప
వలసినది లేదు. వీరలు నూతనముగ నభిరుచిని
గల్పించువారే కాని యున్న యభిరుచి కేయుదాహర
ణము లిచ్చువారు గారు. మఱియు లేని యభిరుచిని
గల్పింపవలయు ననునుద్దేశమును వారి కుండదు.
కాఁబట్టియే కవిత్వ మను పేరు విన్నమాత్రమున
సామాన్యముగ దాని కావశ్యకము లని మనకుఁ
దోఁచునట్టి వ్యాకరణశుద్ధి, ఛందోనియమము, అలం
కారవిభేదములు మొదలగు సారస్వతనియమము
లను వీరు గమనింపరు. మఱియు నొక్కొక్కనికవి
త్వముఁ జదివినప్పు డెల్ల వానివలె వ్రాయవలయు
నను పిచ్చిపట్టి, నేఁడు తిక్కనవలె, రేపు రవీంద్రనా
థునివలె, మరునాఁడు మఱొక్కనివలె వ్రాయఁ
బోయి మూఁడును జెడిన నేఁటియంగడికవు లనేకు
లవలె నొకదారి తెన్ను లేని బ్రదుకుఁ బ్రతుకువారు
గారు. ఇచ్చవచ్చినప్పు డిచ్చవచ్చినట్లు తమంతటఁ
గవిత్వమును పాడుకొని సంతోషించుటయే వీరి
స్వభావము. అట్లగుటచే వీరికవిత్వమున కొకపరిణా
మముగాని నియమముగాని లేదు. మఱియు నేభావ
మెప్పుడు దోఁచునో దాని



నప్పుడు పద్యరూపముగానో పదరూపముగానో
యల్లుకొని పాడి సంతసించుట, తరువాత మఱచి
పోవుటతప్ప, తమకు స్ఫురించినభావము యుక్తమా,
యయుక్తమా, నీతియా, దుర్నీతియా, సకార
ణమా, నిష్కారణమా యను చర్చలఁ జేయరు. తా
ర్కికులకును ధర్మప్రవర్తకులకును దగిన యీ కార్య
కారణభావ విమర్శము వారిహృదయములకంటని
తత్త్వశాస్త్రము. కావుననే వారిభావములు కొన్ని దు
ర్నీతిప్రదములని మనము నిరసించుటయు, మఱికొ
న్నిటి ననుభవించి సత్యాపనము చేయఁజాలక పిచ్చి
కూఁత లని తిరస్కరించుటయు సంభవించుచున్నది.
వీరియందు సామాన్యముగఁ దా మనుసరించు పద్ధ
తులే సర్వోత్తమము లనుట, యితరులను నిర్దాక్షి
ణ్యముగా ఖండించుట మొదలగు నభిమానిగుణ
ములు మెండుగా నుండును.

వేమన యీజాతికిఁ జేరినకవి. ఇతని కాలమును
గూర్చి మన కేమియు నాధారము లభింపదు. శాస
నాద్యాధారములఁ బ్రతిష్ఠించు రాజుల నాశ్రయించి
జీవించుచుండిన ప్రబంధపురాణకవులే యనేకులు
నేఁటి కింకను నేకాలమునకును జేరక యుండఁగా,
ఈప్రపంచమందే జిహాస గలిగి నిరపేక్షుఁడై సిద్ధుఁ
డైన వేమనవంటివానికవనమున నాతని కాలము
నిర్ణయించుటకుఁ దగిన యాధారము లుండు నని

యూహించుట నిరర్థకము. మఱియుఁ గొంత వ్యాప్తినిసంపాదించిన ప్రాచీనపురుషుల విషయమున లేనిపోనికథలను దమకును దెలియకయే యల్లుట జనసామాన్యస్వభావము గావున నట్టి వేమనను గూర్చి వాడుకలో నున్న యట్టికథలన్నియుఁ బ్రకృతవిమర్శకాధారము లని భావించుట యుక్తము కాదు. కొందఱు భావించిన ట్లితఁడు పదునైదవశతాబ్దివాఁడై నను, బ్రౌనుదొరగారు భావించినట్లు పదునేడవ శకమువాఁడై నను గావచ్చును. రెండును గాకపోవ వచ్చును. ఎందు కనఁగా రెండుసిద్ధాంతములును నిష్కారణములు గాన కావున నవియన్నియు విడిచి వేమన పద్యములనుండియే మన మే యేవిషయముల గ్రహింపఁగల్గుదుమో చూతము. అంతమాత్రమే సత్యమని నమ్ముదము.

ప్రకృత మనేకులచేఁ బ్రకటింపఁబడిన వేమన పద్యములను జూడఁగా నవి మూఁడు వేలను మించిన వని తేలుచున్నది. ఇంకను గొన్ని తదీయపద్యములు కింవదంతీప్రవాహమున మునిఁగిపోయినవని కూడ మనము నమ్మవచ్చును. అతఁడే యొకచోట 'వ్రాలకందనిపద్యముల్ వేలసంఖ్య'గాఁ జెప్పితి నని వాకొనుచున్నాఁడు. అతఁడే వచింపఁగా విన్నవారును, వారినుండి విన్నవారును, ఎంతవఱకు జ్ఞప్తియందుంచుకొనఁ గల్గిరో యన్ని పద్యములలోఁ గూడఁ గొన్ని



మాత్రమే ప్రకాశకులకు లభింపఁ గల్గినవి. తెనుఁగుదేశ మంతయు గాలించి చూచుట యే ప్రకాశకునకుఁ గాని యసాధ్యము. మఱియు నీతనిపద్యములు తెనుఁగు దేశమందే కాక కన్నడపు దేశమందును వ్యాప్తిఁ గాంచినవి. కర్ణాటవాఙ్మయమున 'సర్వజ్ఞమూర్తి' యనుకవి యొక్కఁడు గలఁడు. అతఁడు సర్వవిధముల వేమన్న ననుకరించువాఁడు. వేమనయందలి సుగుణదుర్గుణము లన్నియు సర్వజ్ఞునియందును గలవు. తెనుఁగున వేమన కెంత మర్యాద గలదో సర్వజ్ఞునకును కన్నడమున నంత మర్యాద గలదు. వీరు సమకాలికు లని కర్ణాటకుల వాడుక. దానికిఁ దగినట్లు 'సర్వజ్ఞ వేమన్న సంవాద' అనుపేర నించుమించు సమానార్థకము లగునిరువురపద్యములను గ్రమముగా నొకబజారువర్తకుఁడు కన్నడమునఁ బ్రకటించిన పుస్తకమును నేఁ జూచియున్నాను. సర్వజ్ఞుఁడు సుమారు నూటయేఁబదియేండ్లలోపలివాఁడని కన్నడపువారినమ్మకము. అంతే కాని వేమనకాలచరిత్రాదివిషయమున మనకెన్ని సందేహములుగలవో సర్వజ్ఞునికాలచరిత్రాదివిషయమునఁ గర్ణాటకవిమర్శకులకుఁ గూడ నన్ని సందేహము లుండుటచే నతనివిచార మిప్పుడు మన కేమియుఁ బనికి రాదు.

మఱియు నిప్పుడు ప్రకటింపఁబడిన పద్యములలో వేమన వ్రాసిన వన్నియుఁ గల వని యెట్లు

చెప్పలేమో, యట్లే ప్రకటితపద్యము లన్నియు వేమన చెప్పినవే యనియుఁ జెప్పలేము. వేమన వంటిసర్వజనీనుఁ డగుకవి లభించినపుడు ప్రక్షేపము లందు వేయకుండిరేని హిందువులకుఁ గులముతప్పు గదా! తమతమయభిప్రాయములకు గౌరవము రావలయు నని వేమనమతపువారును తద్విరుద్ధమత మువారును అతనియంకితమునే యుంచుకొని పద్యములరచించి చేర్చినారు.

"వైష్ణవు లనునట్టివా ర్తమాత్రమె కాని
ప్రజలఁ జెఱుతురయ్య భ్రష్టులగుచు"

అని నోరునిండ వచించినవాఁడే మరల వేఱుచోట,

'ప్రాణికోటు లెల్ల బరఁగ వైష్ణవులయా'

యని వచింపఁగలఁడా? మఱియు నెవఁడు 'ధరణిసురు లకన్న దాసరిమత మెచ్చు' గా భావించెనో యతఁడే మరల.

"తిరుమలకును బోవఁ దురక దాసరి గాఁడు
కాశి కేఁగఁ బంది గజము గాదు
వేఱుజాతివాఁడు విప్రుండు గాఁడయా"

యని చాటు నని యూహింపనగునా? ఇట్లే.

"వదరి వదరి వదరి వాఁడు రండాయెను
తిరిగి తిరిగి తిరిగి ద్రిమ్మ రాయె
మునిఁగి మునిఁగి మునిఁగి ముండయై పోయెరా"

యనుపద్యమునకును,



"దేవతార్చన జపతప తీర్థయాత్ర
దానధర్మముల్ క్రతుఫలు దలఁచి చూడ
పుణ్యసాధనవృత్తులు పుడమిలోన"

అను పద్యాంతరమునకును ఎంతశత్రుత్వము గలదో మనకు దుర్గ్రహము గాదు. మఱియు,

"సస్య మేసినవాఁడు నరలోకపూజ్యుండు
సస్య మేయనివాఁడు సంబివెధవ"

ఇత్యాది కృతక వేమనపద్యమును తెనుఁగువా రందఱెఱుఁగుదురు.

కాని యొకమాట. ప్రకృతము మనకు లభించు వేమనపేరిపద్యములలోఁ దొంబదిపాళ్ళాతని వేయని నిక్కముగా నమ్మవచ్చును. కారణ మేమనఁగా, కవియందొకగొప్ప ప్రామాణ్యజ్ఞానము లేదేని యందుఁ బ్రక్షేపములఁ జేర్పగోరువారు చాలమంది యుండరు. వేమనవాక్యము లన్నియు వేదవాక్యములుగా భావింపఁబడవలసినంత ప్రామాణ్యము నాతఁడు సంపాదించి యుండెనేని యతనిపద్యములు నేఁటికి నాల్గువేదములసంఖ్యను మీఱి యుండును. అదృష్టవశమునఁ దెలుఁగువారికి వేమనకవిత్వమం దెంత రుచియున్నదో యంతగూడ ప్రామాణ్యమాతనియందు లేదు. కారణ మతఁడు విద్యావంతుఁడు గాకపోవుటయే. ఏవైరాగి యుపదేశము చేతనో యోగసిద్ధాంతరహస్యములఁ గొన్నిటి నను

భవపూర్వకముగా గ్రహించి, యాత్మబ్రహ్మాద్వైతమ తము నాశ్రయించి యదియే శాశ్వతసిద్ధాంతముగా నమ్మి, ప్రపంచవ్యవహారముల నన్నిటిని దిగవిడిచి, యావిషయములనే నోటికివచ్చిన తెలుఁగునబోధింప మొదలిడినవాఁడే కాని, కొంతవిద్యాగంధము గల వారి నావర్జింపఁగల పాండిత్యాదిగుణము లేవియు వేమన సంపాదించినవాఁడు గాఁడు. ఇతఁడు చింతామణీమంత్రోపదేశ ప్రభావముచే 'వేదవేదాంగాది సమస్తవిద్యలను' నేర్చినవాఁడని కట్టుకథలు ఘోషించుచున్నను ఇతనిపద్యములలో నొకటియు నాగంధమునైనఁ జూపదు. 'వేదసార మెల్ల వేమనయెఱుఁగు'ననియతఁడు చెప్పుకొనుటనాకుజూడఁగా 'బడాయి' మాటతప్ప వేఱుగాదు. కావున శాస్త్రీయ వాగ్వాదములచే సిద్ధాంతముల నిర్ణయించుచు, ప్రాచీనపద్ధతులను నిస్సందేహముగా నాచరించు విద్యావంతులగువారికిని, వారిశిష్యులకును, ఈతని యెడఁగాని యీతనిబోధనలయెడఁగాని భక్తియుఁ బ్రామాణ్యమును జనింపదు. వాచాలుఁడైనవాఁడు వేయుప్రశ్నములకుధీరముగానకారణముగా బ్రత్యుత్తర మిచ్చుటకెవరిచేతఁగాదో, విద్యలేకపోవుటచే దన్మూలమగు కారణవిమర్శశక్తి లేక యోగ్వాశిహ్వాదయములు యోగాభ్యాసము, ప్రాపంచికవ్యవహారనివృత్తి, నిష్కామప్రవృత్తి, రసవాదము మొదలగు



గుణములచే సులభముగా వశీకరింపఁబడునో యట్టి పామరజనులకుమాత్ర మీతనివంటివానియెడభక్తి గౌరవాదులు జనించుటస్వాభావికము. అట్టివారిలో ననేకులకు ప్రక్షేపించుసామర్థ్య ముండదు. ఇఁక పండితుల కితఁడు 'వెఱ్ఱివేమన' యనియే జ్ఞానము గలదు గావున వారి కాయావశ్యకత లేదు. కాఁబట్టి యవివేకపామరజనుల రంజించుటకుఁ బూనుకొన్న యర్ధపండితులైనయాచార్యపురుషులవంటికొందఱు మాత్రము, 'వేమన యిట్లు చెప్పినాఁడే, యన్న 'అట్లుగా దిట్లు గూడఁ జెప్పినాఁ, డని వారినోరు మూయుట కనువుగా నతనిపద్యములవంటిపద్యములనే కల్పింపవలసియుండుదురు. కావున సామాన్యముగ వేమనపేరిపద్యములలోఁజాలవఱకతఁడురచించినవే యని నమ్ముట యుక్తము. ఏపద్యములుసంపూర్ణముగాఁ బూర్వోత్తరవిరోధమును స్పష్టముగాఁ జాటునో, యట్టివైఁజెప్పిన పద్యములవంటివి ప్రక్షిప్తములని నమ్మక తప్పదు.

జాతిచే నితఁడు కాపువాఁడు. ఇతని సంతతివారు నేఁటికిని కదిరితాలూకాలోని నల్లచెరువు, కటారపల్లి గ్రామములలో నితనిసమాధికిఁ బూజాదులు నడుపుచు ధర్మకర్తలైయున్నా రని వినుచున్నాను. ఇతఁడు కర్నూలియనవేమారెడ్డి కుటుంబమునకు సంబంధించినట్లును వాడుక కలదఁట.

"కలియుగమున నున్న కాఁపుకులానకు
వేమన తనకీర్తి విక్రయించె
నున్నధర్మ మెల్ల నుర్విలో నోరులకుఁ
గొల్లఁబెట్టెఁ బరము గోరి వేమ."

యనుపద్యము వేమన చెప్పినదైనను కాకున్నను ఈవిషయమునఁ బూర్తిగాఁ సాక్ష్య మీయ గలదు. మఱియు.

"ఒరులకొఱకు భూమి నొరసెడువారును
అవనిపతికి వశ్యులైనవారు"

నగు కాఁపువారికులమును పాలవంటికులము'గా వచించుట ముఖ్యముగా స్వజాతియం దితనికిఁ గలనిక్కల్మషాభిమానమునే సూచించుచున్నది. కావున బ్రౌనుదొరగా రితనిని జంగాలజాతిలోఁ జేర్చుట న్యాయము గాదు. జంగాలమతము లింగధారి మతము. వేమన యభిప్రాయము ప్రకారము 'లింగధారికన్న దొంగలు లేరు.' మఱియు

"........శిల లింగంబు
నిష్ఠ మీఱి మెడను నీల్గఁ గట్టి
కష్టపడుటె కాని కలుగదు మోక్షంబు."

కావున 'ఈమత మొక్కటిమాత్రమే యతఁడు నిందింపని' దని వారనుకొనుట పొరఁబాటు. ఇతఁడు వాస్తవముగ నిందింపనిది కాఁపుజాతి యొక్కటే.



"వాగు లడ్డగట్టి వల్ల కాడులుదున్ని
మును నడిచెడి త్రోవ ముల్లుగొట్టి
పైరుఁ బెట్టునట్టిపాపులు గలరొకో!"

యని యొకచోనితఁడు వచించినపద్యము, ఎన్నఁడో యొకనాఁడు తొలుత వచ్చినదారివెంటనే రాఁబోయి, యది తోఁటగా మార్పఁబడి యుండి ముండ్లకంచెచే నావృతమై యుండఁగాఁ గని తిరిగి పోవు నంతటియోర్పు లేక యాకస్మికముగాఁ దిట్టినతిట్టే కాని యొకకాఁపుజాతిని నిందించుటయే కాదు. ఈకార్యము విప్రులాదిగా నందఱును జేయునదే కావున నీయాశీర్వాదమున కందఱును భాగులే.

జన్మమును గాక యాచారమునుబట్టి నిర్ణయింపఁజూచెదమేని వేమన కే జాతియు లేదు. నాకుఁ జూడఁగా జాతిభేదములు ఖండింపఁబూనిన యాంధ్రులలో వేమనయే మొదటివాఁ డని తోఁచెడిని. ఇప్పటివారు దేశాభివృద్ధికి భంగకరమని జాతిభేదము వల దందురు. కాని వేమన కట్టి యుద్దేశము లేవియు లేవు. సముదాయము యొక్క యిహలోకసౌఖ్యమున కన్న నొక్కొక్కని పరలోకసౌఖ్యము ముఖ్యముగా గమనింపఁదగినది. శమదమాదిగుణములు దానికి సాధనములే కాని జాతిభేదాదులచేఁ దద్వ్యతిరిక్తము లగురోషాహంకారాదులు బలి

యును గావున నివి ముక్తికి సాధనములు గావు. ఇదిగాక జన్మముతో నెచ్చుదక్కువలు రావు. నిజము చూడఁగా 'ఇందు నందు శివుఁడె యేకమై యుండును, గాన, 'కులము హెచ్చుతగ్గుకొందవలు పని లేదు.' మఱియు గౌరవమునకు ముఖ్యకారణ మెఱుక. ఎఱుక లేనివార లేజాతి వైనను, మాల కంటె చెడుగు.' ఇందు 'మాల'పదముగూడ నీచార్థ బోధకమే కాని జాతితక్కువను బోధింపదు. మాలవాఁడైనను 'ఆత్మమీఁదను మనసు నిల్పెనేని మాల గాఁడు' ఇతనిమతమున మాలలకును ఇతరులకును భేద మేమనఁగా: మాలవాఁడు గోవుమాంసము దినును; తదితరులుక్రొవ్వు (నేయి) తిందురు. ఇంతే. ఇట్లు హిందువులలోని యవాంతరభేదములను ఖండించుటయే కాక, 'అన్నిటిఁ బరిపూర్ణమల్లామహాత్మ్యుఁ' డని చాటుచు దేశభేదప్రయుక్తమగు జాతిభేదమును గూడ నిరాకరించినవాఁడితఁడు. 'తమకు భేద మైనఁ దత్త్వంబు భేదమా?', యని యతని ప్రశ్న. కావున,

"ఉర్వివారి కెల్ల నొక్కకంచముఁ బెట్టి
పొత్తు గుడిపి కులము పొలియఁ జేసి
తలను చేయిఁ బెట్టి తగనమ్మఁ జెప్పరా!"

యని యుద్ఘోషించినాఁడు.



ఇట్లు మనుష్యజాతి కెల్ల నభేదమును స్థాపింప మొదలిడినవాఁడు కావుననే యందఱిలో నగ్రజాతి యని పిలువఁబడెడు బ్రాహ్మణులనితఁ డతితీవ్రముగా ఖండించెను. జన్మముచే శూద్రతుల్యుఁడై యుపనయనాదికర్మములచే బ్రాహ్మణుఁడగునని ద్విజులాడుకొనువాదమున కితని ప్రతిప్రశ్న యేమనఁగా: నీతల్లికెట్లు ద్విజత్వమని? ఆమె కుపనయనము లేదు కదా! ఇఁక 'తల్లి శూద్రురాలు; తా నెట్లు బాపఁడు?' ఇఁక 'సతికి శూద్రతనము సర్వదాను!' ఇట్లుండ 'ద్విజుఁడు నే ననఁగ నధిక మేమి తనవల్ల?' కాఁబట్టి సత్య మేమనఁగా,

"బాపఁ డనఁగ నేమి? భక్తుఁ డనఁగ నేమి?
జోగి యనఁగ నేమి? సొంపు లేక
యొన్ని పేరు లైన నినజుఁడు పనిఁ దీర్చు."

అట్లగుట ద్విజు లాచరించు, ఆచరింపఁ జేయుకర్మములలో నితఁడు మెచ్చున దొకటియు లేదు. వ్రతములు, ఉపవాసములు, సన్న్యాసము, యజ్ఞములు విగ్రహపూజ, ఉపనయనము, తీర్థయాత్ర మొదలగున వన్నియు నితనిఖండనఖడ్గమునకు లోఁబడినవే. వారికి పరమప్రమాణమైన 'వేదవిద్యలెల్ల' నితనికి 'వేశ్యలవంటివి' ఇఁక 'శాస్త్రసంచయములు సర్వపురాణముల్ జబ్బులు' కారణ మేమనఁగా: నవి 'భ్రమలఁ బెట్టి తేటపడఁగనీ' వఁట! కాఁబట్టి 'వెఱ్ఱినక్కల

వలె వేదముల్ చదివెదరు. గాని 'యయ్యగార్లు' 'ఆశ్రయమెఱుఁగ'రఁట. కాఁబట్టియీవైదికమతము నాశ్రయించి 'బ్రహ్మవేత్తల మని పౌరుషమాడే' వారిలోనెవ్వనికిఁగాని పరబ్రహ్మము 'తెలుపోనలుపో యెఱుపో, తెలియదు. వీరి పన్నియువట్టివేషములు. సమయము వచ్చినప్పు డందఱును 'పసిడిగల్గువాని బానిసకొడుకులు.' వారి ననుసరించుసామాన్యజను లెల్ల 'గొయ్యగులాములు.' వారికి 'జ్ఞానము వెయ్యేనా తెలుపరాదు'!

కావున సర్వసమత్వ మితనిమతము. ఒకరి యెక్కువయు మఱొక్కరి తక్కువయు నుండరాదు. బ్రహ్మజ్ఞానమే సాధ్యము. అదియే ముక్తి. 'బ్రహ్మ మనఁగ వేఱె పరదేశమున లేదు'. తానే బ్రహ్మము. ప్రతిజంతువును తనంతట బ్రహ్మస్వరూపమే. అది యెఱిఁగి దానికిని దనకు నభేదమును గుర్తించి యనుభవించుటయే ముక్తి. దానిని సాధించుటకు మున్ను అహింస, జితేంద్రియత్వము, సర్వసమత మొదలగు వాని నభ్యసించి గురూపదేశాధీనుఁడై యోగసాధనమునకుఁ బూనుకొనవలయును. సోమయాజుల మనుపేర మేకపోతుఁ బట్టి మెడలువిఱుచుచుస్వర్గ లోకమున రంభాసంభోగమున కాశించి 'పంచబాణునకు బానిసకొడుకులై' మే మెక్కువ యని విఱ్ఱవీఁగుద్విజులందఱును తక్కిన ప్రాణులవలె 'యముని



బారి గొఱ్ఱెలై' యుందురే కాని వారికి 'పరమపద మురాదు.' దారపుత్రాదిసంసార మంతయును నిరర్థకము. యోగ్యులగు భార్య పుత్త్రుఁడు మొదలగు వారు పొగడఁదగినవారే కాని వారు ముక్తిమార్గమునకు భంగకరులు. వారిని మనమై దగ్గరఁ జేర్చుకొనుట 'నేలమీఁదిరాయి నెత్తి కెత్తినయట్లు.' ప్రాణు లెల్ల కర్మాధీనులై యున్నను బ్రహ్మజ్ఞానముచే నాకర్మములనుద్రెంచివేయవచ్చును. ఆబ్రహ్మమునకు హరిహరాది నామరూపములు కల్పితములే కాని సత్యములు గావు. రామకృష్ణాదులు దేవతలు గారు.

> "కనకమృగము భువిని కద్దు లే దనకయు
> తరుణి విడిచిపోయె దాశరథియు
> తెలివిలేనివాఁడు దేవుఁ డెట్లాయెరా ?"

ఇవియే యితని ముఖ్యమతసిద్ధాంతములు. ఐన నొకటి. పరబ్రహ్మమునకు విష్ణుపర్యాయనామములు గూడ నందందు వాడఁబడినను శివపర్యాయనామముల నతనిఁ బేర్కొనుటయందే యితని కభిమానము మెండు. ఇదియే యితనిని జంగాలలో బ్రౌను చేర్చుటకుఁ గారణమని తోఁచెడిని. కాని యితఁడు 'హరిహరాదులందు నాసవిడిచి'నవాఁడు. 'తానె నేను, నేనె తాను' అనుటయే యితని సత్యమతము.

ప్రాయికముగఁ బ్రతిపద్యాంతమునందును ఇతఁ డుంచుకొనుచుండు *'విశ్వతాభిరామ' యను విశేషణ మీయర్థమునే చాటుచున్నది.

ఈ సిద్ధాంతములను బోధించుటకై, మఱియుఁ దద్విరుద్ధము లగు ప్రాచీనపద్ధతులను ఖండించుటకై దేశములను దిరుగుచుండినవాఁ డితఁడు. కాఁబట్టియే యితనిస్థల మిదియే యని యేర్పఱుపఁగాదు. తెలుఁగు దేశమంతయు నించుమించుగ నితనిస్థలమే. 'వేమన యోగిజీవిత' కర్తలు 'భాషావైఖరినిబట్టిచూడఁగా నితఁడు కొండవీటికి సంబంధించినట్లు గానవచ్చుచున్నది' అని వ్రాసిరి. ఆ 'భాషావైఖరి' యేదో వారు తెలుపలేదు. కాని యితనిపద్యములందు అనంతపురము కడపజిల్లాలయందు ముఖ్యముగా వాడుకలో నుండుపదములు కొన్ని గలవు. 'అలిగండ్లు మలిగండ్లు' 'తారాడక' 'దుడ్డు' (డబ్బునకు) 'బసివి' 'సొద్దు' 'కుళ్లుపోతు' ఇత్యాదులఁ జేర్కొనవచ్చును. మఱియు,

---

* విశ్వతా+ప్రపంచత్వము. అనఁగా నందఱును దానైయుండుట. దానిచే నభిరాముఁ డని యర్థము. 'విశ్వదాభిరామ'యనుట నాకుఁ జూడ నుచ్చారణవికారమే కాని వేఱు గాదు. 'విశ్వథాభిరామ' యనియు, 'విశ్వతోభిరామ' యనియుఁ బాఠాంతరములు. మొదటిదే యుక్తము. దీనికి సంబంధించిన 'అభిరామయ్య'కథ కాళ్లలేనిది.



“గండికోటలోన కత్తిఁ బట్టినయంత
రాజుగారి దొడ్డరౌతు గాఁడు”

అనుపద్యము గండికోట కితఁడు సమీపస్థుఁ డని సూచించుచున్నది. పై గండికోట యనంతపురము కడపజిల్లాల సంధిప్రదేశమున నున్నది. మఱియు నిన్నాళ్లును కడపమండలమునకుఁ జేరియుండి ప్రకృత మనంతపుర మండలమునకుఁ జేర్పఁబడిన కదిరి తాలూకాలోని కటార్లపల్లిలో నితని సమాధి యున్నది. కాఁబట్టి బ్రౌనుదొరగా రూహించిన ట్లితఁడు తెలుఁగుదేశము ప్రత్యగ్దక్షిణభాగమునకుఁ (అనఁగా దత్తమండలములకు) జేరినవాఁడే యని తలఁచుట న్యాయ్యతరము. ఎట్లును ఇతఁ డాంధ్రదేశము చాలవఱకు సంచరించినాఁడని యూహింపవచ్చును. సమయము తటస్థించినపుడు జ్ఞప్తియున్న ప్రాఁతపద్యముల నుదాహరించియో, నూతనపద్యముల నప్పుడె కల్పించియో, మాటాడుచుండువాఁడు. కావుననే యనేక పద్యములకు రూపము మాఱియున్నను లోపలియర్థ మొక్కటే. మఱియుఁ గొన్నిటికి రూపభేదమును అంతగానుండదు. ఇంతేకాక తోఁచినమాట తోఁచినప్పుడు వచించువాఁడు గావుననే కొన్నిస్థలములఁ బూర్వోత్తరభావములకు విరోధమును సంభవించుచున్నది. వెనుకఁ జెప్పినవిషయమునే వేఱొకచోట ఖండించునట్లు దోఁచును. అట్టిచో నవి ప్రక్షిప్త

పద్యము లని యొకమాటచేఁ ద్రోసివేయుదురేమో కాని నాకుఁ జూడ నది యుక్తిసహముగాదు. వేమనపద్ధతులను స్వభావమును జక్కఁగా విమర్శించిన నీవిషయము స్పష్టమవును. పద్యము లన్నియుఁ బరస్పరసంబంధము లేని వయ్యును మూఁడు నాల్గు చేరి యొకయర్థము నిచ్చుచు నేకకాలమున వ్రాయఁబడినవని యూహింప ననువగునవిగూడ నందందుఁ గలవు. పోయినచోటఁ దనమాట లెవరు విందురో యట్టివారికిఁ దనయభిప్రాయములను యోగశాస్త్రమర్మములను ఉపదేశించుచుఁ బద్యములు చెప్పి, విననివారిని బూతులు తిట్టుచు ముందుకు వెడలుచుండువాఁడు ఇతనికి సహజమైనయాకారము తప్ప కృత్రిమమైన యేవెలుపలిమార్పును సరిపడదు. భస్మపుండ్రాదులను ధరించుట, కావిబట్టలు గట్టుట, తలలు బోడించుకొనుట మొదలగు బాహిరవేషములన్నియు నాంతరంగికవిద్య కేమాత్రము నుపకరింపవు; ఇంతేకాక వీనియం దెక్కువగ మనము గలవారి కంతరంగశుద్ధి యుండ దనియు నితనిమతము. తుదకుఁ దాను వస్త్రధారణమైనను జేసినవాఁడు గాఁడు. కౌపీనముమాత్ర మొక్కటిగలదేమో! అదియు సందేహమే. స్నానముగూడ నితనికి నిరర్థకమే. ఎందు కనఁగా:



"మలము మూత్ర రక్తములు మాంసయుక్తమా
ముట్టుకుండ నీళ్ల ముంప నేల?
పైమురికియె కాని లోమురికియుఁ బోదు."

లజ్జాసంకోచాదు లతని కెన్నఁడును లేవు. 'లజ్జ గలుగువాని లాభంబు లేమయా?' యని యితనిప్రశ్న. మఱియు 'తనకుఁగల్గు సిగ్గు దైవ మెఱుంగును.' ఏయూరనో యితనిని,

"గోచి తీసె ననుచుఁ గొట్లాట లాడించి
వెఱ్ఱి యనుచు నూరు వెళ్లఁగొట్టి"

రఁట! ఎట్టినిష్ఠురుఁ డైనను నిందాభినందనముల లెక్కింపనివాఁ డైనను ఇట్టిసమయములందు తన వర్తనముల స్థాపించుకొనక యుండ సాధ్యముగాదు. కావున నప్పుడు వారి కితఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు:

"తల్లిగర్భమునను దాఁ బుట్టినప్పుడు
మొలను బట్ట లేదు మొనసిచూడ
నడుమ బట్ట గట్ట నగుబాటు గాదొకో"

ఇత్యాదిసిద్ధాంతములను విన్నవా రితనిని వెఱ్ఱివాఁడనిన నాశ్చర్య మేమి? తన్ను వెఱ్ఱివాఁడని జనులన్నను ఇతఁడు మనసు నొచ్చుకొనలేదు సరిగదా, తానే తన్ను 'వెఱ్ఱివేమన' యని పిలుచుకొనుచున్నాఁడు! అతని కది యొకయానందము! కాని గురు

పున కున్నంతయోర్పు శిష్యుల కుండునా? పూర్తిగా వెఱ్ఱి ముదరనిది యీవేషములు నీసిద్ధాంతములును సాధువులని నమ్మి పూజించుట కష్టము. వారే యొకతూరి వినయపూర్వకముగా నిట్టి వేషమున కర్థమేమని యడిగిరి కాఁబోలు; నిట్లు బదు లిచ్చినాఁడు:

"చిఱుగుబట్ట గాదు చీనాంబరము గాని
మురికియొడలు గాదు ముక్తి గాని
పరమయోగిమహిమ పరికింప నరుదురా."

ఈపరమయోగిమహిమకు వన్నె పెట్టునది రసవాదము; అనఁగా కృత్రిమముగా సువర్ణరజతాదులు తయారు చేయుట. నేఁటిప్రకృతిశాస్త్రజ్ఞు లీవిషయమును సంపూర్ణముగా మిథ్యయని తిరస్కరించినను, ఇప్పుడు గూడ నావిద్యను త్రికరణశుద్ధిగా నమ్మి తత్సంపాదనమునకై వేలకొలఁది వెచ్చపెట్టువారు లేకపోలేదు. మనము నమ్మినను సరే నమ్మకున్నను సరే; వేమన్నకు మాత్ర మందు సంపూర్ణవిశ్వాసము గలదు. అంతే కాక దానిని దానే చేయ నెఱిఁగినవానివలెనే చాటుచున్నాఁడు. ఇతనికి రెండేవిద్యలు వలసినవి.

"ఇహమున సుఖియింప హేమతారకవిద్య
పరమున సుఖియింప బ్రహ్మవిద్య
కడమవిద్య లెల్ల కల్ల మూఢులవిద్య"



ఆహేమతారకవిద్యను గూర్చి సుమారు పదునైదు పద్యములు మనకు లభించును. స్వర్ణయోగమును గూర్చినపలు దెఱఁగు లందు వివరింపఁబడినవి. కాని యర్థముమాత్రము గాదు. ఎచ్చోటనో యింగిలీకముతో చిత్రమును వ్రాసియుండఁగాఁ జూచి యితఁ డిట్లు చింతించుచున్నాఁడు:

"ఇంగిలీకమహిమ హేమింపనేరక
చిత్రపటము వ్రాసి చెఱిచినారు
బొంతజెముడుపాలఁ బొంగించ నేరరు"

ఎంతసులభవిద్య! ఇంగిలీకమునకు గురువు లేదు; బొంతజెముడును గన్నచోటనెల్ల నున్నది. ఐన నా 'పరమయోగిమహిమ' యెట్టిదో కాని, నేఁడు బంగారము వెల దినదినము హెచ్చుచునే యున్నది. వేమన మనల నెన్ని తిట్లు తిట్టినను బాధలేదుగాని యీవిద్య యొక్కటి హిందువుల కెఱుఁగఁ జెప్పియుండెనా మూఁడుమూర్తులను మూలకుఁ ద్రోసి నాలవ మూర్తిగా నతనికి నమస్కారములు పెట్టుచుండి యుందుము. ఇంతేకాక యితనికి వైద్యవిద్యగూడఁ గొంతవఱకును దెలిసినట్లు గానవచ్చుచున్నది.

ఇట్లితనివేషచారిత్రాదు లెంతవిచిత్రములో యితఁడు బోధించునర్థములుగూడ నంత దుర్గ్రహ

ములు. దుర్గ్రాహములనఁగాఁ గొన్ని యర్థమే కావు; మఱికొన్ని యర్థమైనను ఆచరింప మన కిష్టము లేదు. ఎన్నియో శతములయేండ్లనుండి హృదయము లందు స్థిరముగా నాఁటియున్న సిద్ధాంతముల నన్నిటిని కల్లలని నిస్సందేహముగా మోమోటము లేక వచించినాఁడు. సామాన్యముగ ననుభవము నభ్యాసమును లేక సత్యాపనము చేయరాని యోగ సిద్ధాంతములే జీవితమును దరింపఁజేయుమార్గము లని చాటుచున్నాఁడు. వచించువానియందు నిష్కారణమైన పిచ్చినమ్మిక భక్తిగలవారు తప్ప కారణ విమర్శకుఁ బూనుకొనువా రందఱు ననుభవమాత్ర గమ్యము లైన యావిషయముల నమ్మరు. ఎందైన నితఁడు కారణముల వచించినను అవి దూషణమున కుపయోగించునంత సిద్ధాంత సత్యాపనముల కుపయోగింపవు. కావుననే యనేకుల కితనిశిష్యులకే యితనిబోధలు గ్రహింప నలవిగాకుండెను. గ్రహింపఁ జాలనివారికి నిదానముగా బోధించి గ్రహింపఁ జేయునంత పాండిత్యమును ఓర్పును లేనివాఁడు గావున నొకచో నిట్లు వేసరపడుచున్నాఁడు:

"యెద్దు కైనఁ గాని యేడాది దెల్పిన
మాటఁ దెలిసి నడుచు మర్మ మెఱిఁగి
మొప్పె దెలియ లేఁడు ముప్పదేండ్లకు నైన."



ఇంతయే కాక యితనిపద్యములలో 'కూటము' లనఁబడు భావగుప్తపద్యము లనేకములు గలవు. ఏ యుద్దేశముతో నివి వ్రాసినాఁడో వచింపలేను. సామాన్యముగ నిట్టిపద్యముల రచించువారికి, ఇతరుల కర్థము కానిపద్యముల వ్రాయఁగల ననునహంకారమును, ఇతరులను సభలలోఁ బరాభవింపవలయు ననుటయు నుద్దేశములుగా నుండును. ఒకవేళఁ దన్ను పామరుఁ డని యుదాసీనులుగా నుండు పండితులఁ బరాభవించుటకో, వారికన్నఁ దా నెఱిఁగినవాఁడని స్వశిష్యులకుఁ దెలుపుకొనుటకో, యితఁ డిట్టివి వ్రాసినాఁ డనియు నూహింపవచ్చును. లేక వినోదమునకుఁ గూడ నిట్టివి వ్రాయుట కలదు గావున నదియే యతనియుద్దేశమైనను గావచ్చును. ఎట్లును అతని కూటపద్యముల కనేకముల కతఁడే యర్థమును వచింపవలసియున్నది. తొంబదిపాళ్లు నాకర్థము దుర్గ్రాహమని నాయొక్క నియశక్తి యైన నంగీకరింపకతీఱదు.

" మూఁటి నాగ్రహించి మూఁటి విసర్జించి
మూఁటి మూఁటి మూఁటి మూఁటి రోసి
మూఁటి మూఁటి మూఁటి మూఁటనే తత్త్వంబు"
" విత్తులేనియట్టి వృక్ష మొక్కటి పుట్టె
ఫలము పువ్వు మొదటఁ బత్రి లేదు
స్వాదు లేదు చూడ సాపాటునకు లెస్స
దీనిభావ మేమి తెలుపు వేమ."

వీనిలోఁ గొన్నిపద్యములకు 'తిరుమలేశ'కు బదులుగా 'తెలుపువేమ' యనుపదము వ్యవహారప్రమాదమునఁ బడియున్నను బడియుండవచ్చును. ఇట్టివానిని గూర్చియే కాఁబోలు

"వేయివిధము లమర వేమనపద్యంబు
లర్థ మిచ్చు వాని నరసి చూడఁ
జూడఁ జూడఁ గల్గుఁ జోద్యమాజ్ఞానంబు"

అనుపద్య మొకటి వేమనపేరనే యున్నది.

పైఁ జెప్పినయోగశాస్త్రాస్వాదము, సంస్కారకత్వము, బోధకత్వము, విద్యాద్వేషము మొదలగుగుణము లతనికి బిగువుగాఁ బట్టువడి, యితనిని స్వాభావికముగ కఠినస్వభావునిగను, ప్రపంచపునడవడులం దేమాత్రము సానుభూతి లేనివానిగను, స్వాభిమానపూరితునిగను, ముంగోపిగను జేసినవి. ఖండింపవలయుననితోఁచినతోడనే వెనుకముందులు చూడక, బూతుసాతులు లెక్కింపక, న్యాయాన్యాయముల విచారింపక, నోటికివచ్చినమాటలతో రెండుతుండ్లుగాఁ గత్తరించుటయే యితని మతము.

'వినినంతనె వేగపడక వివరింపవలెన్'

అనుట యితఁ డితరులకు బోధించినదే కాని, తనకు మాత్రము,

'కనినంతనె చూడకుండ ఖండింపవలె'



ననుటయే సిద్ధాంతము. స్త్రీలు, బ్రాహ్మణులు, మొదలగువారియం దితని కొకతూరి జిహాస గలిగినది. గడియవలపులు గలకొందఱుస్త్రీలును, వేషధారులై వంచకులగు కొందఱుబ్రాహ్మణులును కారణములుగావచ్చును. అట్టివారు లేకపోలేదు. తన్మాత్రమున 'స్త్రీలనడతవలన సిగ్గుపోయె' ననియు, 'ఇటునటుఁ బుట్టినఋషులకు, బటుతరముగఁబుట్టినట్టిబాపనవార' లనియుఁ గారణవిమర్శాదులు లేక సముదాయమునే బూతులు దిట్టుట యితనిమన్నింపరానియపరాధములలో మొకటిది. ఇంకను నీచతరములైనమాటలును భావములు నుపయోగింపఁబడినవని చదువరు లెఱుఁగుదురు. 'మఱుఁగు మర్యాద లేని మోటువిధముగా నితఁడు తిట్టఁడు' అని శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు వచించుటనాకుఁ జూడ పైమాట. కోపము జనించినప్పుడా రెండుపదములును వేమనవాఙ్మయమున లేవు.

నేను బ్రాహ్మణుఁడ నగుటచే నాజాతి నితఁడు దూషించినాఁడని, యందుచే నా కేమో నష్టము కలిగినదని కాని తలఁచి, తన్మూలమున నెన్నఁడో సమాధినిష్ఠుఁ డైనవేమనపై నిప్పుడు ద్వేషము సాధించుచున్నాఁడ నని చదువరులు తలంపరాదు. ఇతనిచే దూషింపఁబడనివారు లేరు. కంసాలివారు,

జంగాలు, శైవులు, వైష్ణవులు, వైశ్యులు, వేశ్యలు,
ఆచార్యపురుషులు మొదలగునెవ్వరినిగానియితఁడు
మర్యాదపెట్టినవాఁడు గాఁడు. ఎట్లో 'గంటిపల్లెము
త్తఁ'డను నొక్కఁ డే జాతికిఁ జేరినవాఁడో యితని
భూషణమునకుఁ బాత్రుఁడైనాఁడుకాని తక్కినవా
రందఱు కొంచెమో గొప్పయో యితనివషట్కార
ములకు లోఁపడియే యున్నారు. మొత్తముమీఁదఁ
జూడఁగా నితనికాలముననే కలియుగము మునిఁగి
యాజలప్రళయములో హిందూశబ్దమునకు సంబం
ధించిన దంతయు నూపిరాడక నశించి యుండెనేని
యితనికి సంతోషముగా నుండియుండునేమో !
కావున నట్లు గానిచింత యతనిదే. మన కదేమియుఁ
బనిలేదు.

ప్రకృతము మనచింత వేఱు. వేమన నొకగొప్ప
సంస్కారకునిగానో బోధకునిగానో మనము గమ
నింపము. అతనిజీవితకాలమునందే యతని కాబిరు
దము జనాంగీకృతము కాలేదు. అతనికి తనయం
దున్నంత ప్రత్యయము మన కాతనియందు లేదు.
మనకన్నుల కతఁడు ప్రకృత మొకకవిగామాత్రము
కానవచ్చును. కానిసంస్కారకత్వమునుకవిత్వమును
అవినాభూతములై యతని నాశ్రయించి యనేకస్థల
ములఁ గవిత్వమును వృద్ధిఁ జెందనీకపోవుటయేకాక



తప్పుదారికిఁ గూడ నీడ్చినవని యెఱిఁగి చింతింపవలసి
యున్నది.

శబ్దశుద్ధి, ఛందోనియమము మొదలగునవి కవి
త్వమున నంతముఖ్యస్థానము నహింపవని యాధుని
కుల రాద్ధాంతము. కానిండు. అవి రెండు నంతగా
గమనింపమిచే వేమనకుఁ గాని మనకుఁ గాని యంత
నష్టము లేదనుకొందము. కాని కవికిఁ గావలసిన
ముఖ్యలక్షణము మృదుహృదయము సౌమనస్యముఁ
గలిగియుండుట యని యంద ఱంగీకరింపవలసినదే.
పై యితని సంస్కారకత్వాదిగుణములీగుణమునీతని
నుండి పూర్తిగా విడఁదీసినది. కథను జెప్పుచు నిత
రులవాక్యముల ననువదించునప్పుడు కవి యెంత
క్రూరచిత్తుఁడుగా నుండినను జెల్లును. అందు నిం
దార్హుఁ డనువదింపఁబడినపాత్రమే కాని యనువ
దించువాఁడు గాఁడు. మఱియు నట్టిచోట్లఁ బరాను
సరణమను శిల్పచాతుర్యమును కవియందు మనము
గమనింతుము. కాని తానై తనభావములను వచిం
చునప్పుడు కవికి వలసినవి మృదుమనోభావములు:
సంతోషము, దయ, దాక్షిణ్యము, సానుభూతి,
శోకము, భక్తి, వాత్సల్యము, ప్రణయము ఇత్యా
దులు. ఇవి యెచ్చటనున్నను దమంతహృదయమును
గరఁగింపఁగలవు. అట్లుగాక, జిహాస, అసూయ,

రోషము, కోపము, మత్సరము, అహంకారము ఇత్యాదితీక్ష్ణగుణములు ప్రధానములుగా నుండెనేని కవి మనోభావములతో చదువరు లేకీభవించుట సంభవింపదు. సంస్కారికే యీగుణములు యుక్తములు గావన్నపుడు కవికి వేఱ వచింపవలయునా? హృదయముల వశీకరింపఁజేసుకొనుట కవిధర్మమే కాని వెగటు పుట్టించుట కాదు కదా! యోగరహస్యముల నిర్వచించుపద్యముల విడిచినఁ దక్కిన యితని పద్యములలో నూటఁదొంబదిపద్యములు పైస్వభావమునే చాటుచున్నవి. ఇప్పటికే యెక్కువయుదాహరించితిని. ఐనను మఱి రెండుదాహరించెదను:

"బోడిఁజేసి జడలు భస్మంపుఁబూఁతలు
మరునితోడ మాఱుమలయఁ గలరు
ముండకొక తెల్ల లంజకొకల కాయె"
"ఒక్కప్రొద్దు లున్న సూరఁబందై పుట్టుఁ
బృథివిఁ దపము చేయఁ బేద యగును
నిగిడి శిలకు మ్రొక్క నిర్జీవులాదురు"
"కూలినాలి చేసి గుల్లాముపని చేసి
తెచ్చిపెట్టెనేని మెచ్చునాలు
చిక్కుపడ్డవేళఁ జీకాకుపఱుచురా"

ఇత్యాదులు. "ఇతఁడు మతబోధకై వెడలినవాఁడే కాని కవిత్వమునకై కాదు. కావున నివి యితని



దోషములు గా"నందురేమో! ఇతనికిఁ దాను కవి యనుభావము సంపూర్ణముగాఁ గలదు.

"రవి కననిది కవి యెఱుఁగును
కవి యెఱుఁగనిచోటు రవియుఁ గానఁడు ధరలో
రవికన్న మిగుల నెక్కువ
కవియే విలసిల్లు నీవు గానవె వేమా!"

ఇట్లైనను మనకు వేమనపద్యములం దున్నంత యాదరము భక్తియు ననేకప్రబంధ పురాణకవుల యం దుండదు. కారణమేమి? వారియందు దట్టముగఁ గానవచ్చుదుర్గుణము పారతంత్ర్యము, శైలి, భావము, కల్పన మొదలగువానియందెల్ల వారు పరులకు దాసులై గీసినగెఱ దాఁటకయుందురు. వేమన దీనికి పూర్ణముగా వ్యతిరేకదృష్టాంతము. ఇతరానుసరణవిషయమున నితఁడు 'తెగినగాలిపటము' నావలె నేనుందు ననువాఁడేకాని యొకరివలె నుండవలె ననుట కలలోఁ గూడ నితఁడు తలఁచినవాఁడు కాఁడు. ఈస్వాతంత్ర్యబుద్ధి కవికిఁ గీర్తిఁ దెచ్చు ముఖ్యగుణములలో నొకటి. ఇందు వేమనకుఁ గల్గులాభ మేమనఁగా నితనిప్రతిపద్యమునందును 'నవ్యత' యనుగుణము తాండవ మాడుచుండును. ప్రాతకవిసమయములు గాని, ప్రాతదృష్టాంతములు

గాని, ప్రౌఁతయలంకారములుగాని లేవు. కావున నొకవిధముగాఁ జెఱిచినవైనను బైసంస్కారకత్వాదిగుణములు వేఱొక్కవిధముగా నితనికవిత్వమునకు వన్నెఁదెచ్చినవే. అట్లుగాక యందఱవలె నితఁడును గురుమూలకముగ సాహిత్యాది విద్య లభ్యసించి కవిత్వమున కారంభించి యుండెనేని యందఱకువలెభావముల యొక్కయు, భావనాశక్తి యొక్కయు నవకాశము సంకుచితమై యితనినోటి నుండియు నేదో యొక 'పరిణయము' బైటఁబడి సముద్రములో నుప్పురాయి యగుచుండెనేమో!

ఇఁక రెండవగుణ మితనికి నాంధ్రభాష పూర్ణముగా స్వాధీనపడియుండుట. తక్కినకవుల కందఱి కించుమించు చదివినచదువంతయు, నేఁటిచదువాంగ్ల వాఙ్మయమునకువలె, సంస్కృత వాఙ్మయమునకుఁ జేరియుండుటచే, వారికవిత్వము,శిఖాయజ్ఞోపవీతాదులు ధరించినయాంగ్లేయునివలె, తెనుఁగువేషము ధరించియున్నను నిజమునకు సంస్కృతమే యగుచున్నది. వేమన పాపము జన్మమందైన నాగంధ మెఱుఁగనివాఁడు గావున నితనిపద్యములలో నిజమైన తెనుఁగుజీవితము ప్రతిబింబించుచుండును. తెలుఁగువారిమనోధర్మముల కితనికవిత్వ మొకసాటి లేనిదృష్టాంతము. కావుననే పండితపామరభేదము



లేక యవి హృదయముల నంటుచున్నవి. అనఁగా సంస్కృతపదముల నితఁడు వాడఁడని కాదు. వాడినను ఆపదము లన్నియు విన్నవే కాని నేర్చినవి కావు. కావుననే భాషకు సంబంధించిన లోపము లతనియం దేవైనఁ గలవేని యవి చాలవఱకును సంస్కృతపదములకు సంబంధించినవే యై యుండును. మఱియు సంస్కృతపదభూయిష్ఠపద్యము లన్నియు యోగశాస్త్రమునకు సంబంధించినవే. వానియందుఁ గవిత్వగంధమే లేదు. కావున మనకు వానిచర్చ పనిలేదు. తెనుఁగులో వ్యాకరణకారు లంగీకరింపనివాడుకలో నిరూపములు కొన్ని గలవుగాని వాని నితరకవులు గూడఁ గొంతవఱ కంగీకరించినవారే. కావునఁ దెనుఁగుభాషలో సత్యమైన 'యచ్చ తెనుఁగు' కావ్యమును రచించినవాఁడు వేమనయే కాని, 'భూమి'కి 'బూమి' యనియు, 'బుద్ధి'కి 'బుద్ది' యనియు మహాప్రాణముల నల్పప్రాణములుగా మార్చుకొన్నవారి కవనమునందు అచ్చమును తెనుఁగును రెండును లేవు.

అన్నిటికన్న ముఖ్యమై హృదయముల నాకర్షించుగుణము ఇతఁడుస్వాభావికముగఁగవిగానుండుట. కవి కావలయువానికి ప్రకృతిమాడ యెన్నిగుణముల నొసఁగఁగలదో యవన్నియు నితని యందున్నవి.

వానికితఁడు కల్పితములైనమెఱుఁగులు మాత్ర మిచ్చినవాఁడు గాఁడు. ఎంత కొంచెముమాటలలో నెంతయర్థ మిమిడింపవచ్చునో యితనికిఁ గాని యితరులకుఁ దెలియదు. తిక్కన కీగుణము కలదు గాని యీసౌలభ్య మతనియం దపూర్వము. ఏమాట నే చోట నుపయోగించిన హృదయమున నాటునో యితఁడే యెఱిఁగినవాఁడు. సంగ్రహశక్తియందలి సత్తువ యితనివలెఁ జూపఁగలవాఁడు లేఁడు. వీనికిఁ దోడు సహజమైన హాస్యప్రియత్వ మొకటి నిండియున్నది. ఖండించుసమయములందెల్లఁ బ్రాయికముగ రోషావిష్టుఁడై జిహాస నుపయోగించునుగాని, యెందైనహాస్య ముపయోగించెనేని తలఁచుకొని తలఁచుకొని కడుపులు చెక్కలగునట్లు నవ్వఁజేయఁగలడు. 'తిట్టిననుసరే బాగుగాఁ దిట్టినాఁడురా' యని తిట్టించుకొన్నవారే మెచ్చవలసియుండును. ఇదియే యితనియందలి యింద్రజాలవిద్య!

"లోభివానిఁ జంప లోకంబులోపల
మందు లేదు వేఱె మతము గలదు
పైక మడిగినంత భగ్గునఁ బడి చచ్చు"
"సకలతీర్థములను సకలయజ్ఞంబులఁ
దలలు గొరుగకున్న ఫలము లేదు
మంత్రజలముకన్న మంగలి జలమెచ్చు"



ఇత్యాదు లనేకములు. లోకోక్తు లితనికవితలోని జీవితములు. లోకోక్తులనఁగా వాడుకలోనున్న సామెతలను ప్రస్తావాప్రస్తావాది వివేకము లేక యుద్దేశపూర్వకముగాఁ దూర్చినాఁడని కాదు. ఇతనిజన్మమునందే యట్టిపరదాస్యమునకుఁ జోటులేదు. మఱి తానే వానిని సృజించినాఁడనుట. కొండంతయర్థమును గోరంతచోటున ముద్దుముద్దుగా విశదముగా నితఁడు నిర్వచించుట నొకమాఱు వింటిమేని మరల నెన్నఁడును దాని మఱవలేక యవసరము సంభవించునప్పుడెల్ల దానినే జపించుచుందుము.

'కొయ్యబొమ్మఁ దెచ్చి కొట్టినా పలుకదు'
'పంది బురద మెచ్చుఁ బన్నీరు మెచ్చునా'
'తలలు బోడులైనఁ దలఁపులు బోడులా'
'ముక్కువంకఁ జూచి ముకురంబు దూఱుట'
'పండ్లు పడ్డకుక్క పసరంబుఁ గరువదా'
'దాసరయ్య తప్పు దండంబుతో సరి'

ఇత్యాదివాక్యముల మాధుర్యవైశద్యములును సర్వజనీనతయు నేను వేఱ వివరింపఁబనిలేదు.

శ్రీనాథునకు సీసమును, తిక్కనకు కందమును వలె వేమన కాటవెలఁది వెన్నంటివచ్చిన వృత్తము. తక్కినవృత్తములఁ గూడ నితఁడు రచించినాఁడు గాని యవి యతని యాటవెలఁదిసొగసునకు దీటు రావు. ఈవృత్తమునం దితఁడు చూపినంత ప్రౌఢి

మఱియు మాధుర్యమును శ్రీనాథుఁడు సీసమందుఁ గాని తిక్కన కందమందుఁ గాని చూపలే దనుట యతిశయోక్తి గాదు. ఇదియుఁ బ్రకృతిదత్తప్రసాదములలో నొకటిగాని వేఱుగాదు. వృత్తము తనంతఁ జిన్నది. తెనుఁగున నింతకన్నఁ జిన్నవృత్తము వాడుకలో లేదు. అందును నాలవపాద మంకితముతో ముగియును. తక్కిన మూఁడుపాదముల నడుగడుగునకును యతినియమము వదలఁడు. యతియందును తిక్కనాదులు వాఁడునట్లు పదమధ్యవిచ్ఛేదము గాదు. యతిస్థానమునకు సరిగఁ బదమును అనేకస్థలముల భావమును గత్తరింపఁబడినట్లు తునకలై పడును. అట్లని యధికపదము లేవైనఁ గలవందమా? మందునకును దొరకవు. ఐనను, కుంతికడుపునుండి కర్ణునివలె, సద్యోగర్భముచే సహజాలంకృతమై యాటవెలఁది వేమననోటినుండి క్రిందికి దూఁకుచున్నది!! హృదయమునందు భావసంయోజనము, నోటఁ బదములరచన, ఉచ్చారణయు నేకకాలమందే యొకటితో నొకటి మాటలాడుకొని కుప్పించుచున్నవో యని యాశ్చర్యపడునట్లు చేయు పద్యరత్నము లిం దనేకములు గలవు.

"చెప్పులోనిరాయి చెవిలోనిజోరీగ
కంటిలోనినలుసు కాలిముల్లు
ఇంటిలోనిపోరు నింతంత గాదయా!"



"పనసతొనలకన్నఁ బంచదారలకన్న
జుంటితేనెకన్న జున్నుకన్నఁ
జెఱకురసముకన్నఁ జెలిమాట తీపురా!"

"జారపురుషునకును జాజిపువ్వులతోడఁ
బాన్పు వేయునయ్య ప్రాఁతలంజ
సొంతమగనిమీఁదఁ జింతనిప్పులు చల్లు"

ఇట్లితని యెడ మహాకవులకుఁ గావలసినరచనాసౌమనస్యము, వాగ్మిత్వము, మొదలగుగుణములు సమృద్ధిగా నున్నవి. భావసౌమనస్యము మాత్ర మనేకస్థలములఁ గుంటుపడినదనుట మాచదువరులకు దుర్గ్రహము గాదు. అదొక్కటి మఱచితిమేని యాంధ్రభాషలో నింతటికవి లేఁడని కంఠోక్తముగా వచింపవచ్చును. మఱియు,

"వేమఁ డిట్లు చెప్పు వేయిపద్యంబులు
తప్పులెన్నియున్న నొప్పియుండు"

నను పద్యము వేమనదైనను కాకున్నను దానిని జెప్పినవాఁడు జనులమనస్తత్త్వము నెఱుఁగనివాఁడు కాఁ డనుట ముమ్మాటికి సత్యము.

పైంగళ భాద్రపదకృష్ణ త్రయోదశి శనివారము. } రాళ్లపల్లి. అనంతకృష్ణశర్మ.
శ్రీమహారాజావారి కాలేజి,
మైసూరు.

# వేమన కవి జీవితము.

---

సీ. తేట తెనుంగులనీటిలో వేదవే
దాంతసారంబుల నలవరించి
దివ్యధారారూఢి తేటగీతములలో
భావవంతంబుగాఁ బాడుకొల్పి
పసిబిడ్డలకుఁ దేటపడుమాట పొందికల్
తేజరిల్లంగఁ బద్యములు తీర్చి
పరమార్థబోధకై భాషామహారాజ్య
సింహపీఠికపయిఁ జేయివైచి
తే. అద్వితీయ ప్రతిష్ఠతో నాంధ్రదేశ
మెల్ల చరియించి మించి యెల్గెత్తి శాంత
గీతికలఁ బాడి సంతతఖ్యాతిగనిన
వేమనకవీంద్రు మానసవీథి నంతు.

వేమనయోగీంద్రుఁ డాంధ్రులకుఁ జిరకాలపరిచయుఁడు. తన మధురకవితామృతముచే నాంధ్రదేశమునంతయు నొక్కమాఱు పునీతము గావించి తరతరములవఱకు మఱచిపోఁదగని సందేశము నొసంగి కావ్యప్రపంచమున సజీవుఁడై యున్న వేమనయోగి చరిత్రము రెండుమూఁడు సంవత్సరముల క్రిందటివఱకు సమగ్రముగా నాంధ్రజనులకుఁ దెలియదనుట సాహసముగాదు. కవిచరిత్రకారులగు వీరేశ



లింగముపంతులువారుగాని గురుజాడ రామమూర్తి పంతులువారుగాని వేమనజీవితమును గూర్చి మన్నకేమియుఁ దెలుపరైరి. ఆంధ్రవాఙ్మయవిషయమున మిగుల శ్రద్ధఁదీసికొనిన బ్రౌనుదొరవారి వేమనపద్యముల నాంగ్లీకరించుటతో విద్యాధికుల కీపద్యములపై నొకవిధమగు గౌరవము కుదిరినది. ఆధునికవిమర్శకాగ్రేసరులగు కట్టమంచి రామలింగారెడ్డి, ఎం.ఏ., గారు తమ కవిత్వతత్త్వవిచారములో వేమనకవితాతత్త్వము నీక్రిందివిధముగా శ్లాఘించియున్నారు

"ఈతత్త్వమునకుఁ బ్రమాణమైనవాఁడు వేమన. ఇతనికి పుస్తకజ్ఞాన మించుమించుగ సున్న. వ్యాకరణము ఛందస్సు అలంకారశాస్త్రము మొదలగువానిలో నితనికి శక్తి యెంతతక్కువో భక్తియును నంత తక్కువ. కుటిలమతాచారములు, మూఢభక్తి వేషధారితనము మొదలగువానిని దూలనాడుట యందీతం డద్వితీయుఁడు... వేమన్న... కారణ విమర్శనశక్తికి పట్టాభిషేకము చేసిన మహాత్ముఁడు. ఇతని పద్యము లన్నియు లోకోక్తులు, అనఁగా బలికినవాఁడతఁ డయ్యుపలుకఁబడినమాటలు లోకము వారి హృదయములలోఁ బూర్వమే యుండినట్టివియో లేక అతనిచే నచలముగా నాటఁబడినట్టివియో యైన వనుట: ఇతనిపద్యములలోఁ బరిహాసరసము దట్టము.

మఱుగు మర్యాదలులేని మోటువిధముగాఁ దిట్టెడు. నొప్పిచెందువారు సైతము ఇతరులతోఁ గలసి నవ్వునట్లుల సేయ సమర్థుఁడు...నిదర్శనములను జూపుటలో నితఁ డద్వితీయుఁడు. మఱి అవి యెవ్వియు గూఢములు గావు. స్పష్టములు. శ్లేషచే స్థాపింపఁబడిన సామ్యము లట్లు దిక్కును అర్థమును లేనివి కావు. వైశద్యము అనుగుణము ఇతనియందు ప్రబలము. మనము ప్రతిదినమందును జూచుచు నింతే యని యాదరము నవధానము నుంపక పోవు విషయములనే యీతఁడు గ్రహించి భావనాశక్తిచేఁ గాంతి, రూపము, ప్రాణము. నావహింపఁజేసి యెదుటనిల్పఁగా నపుడు గుర్తుదెలియక పూర్వము మనచేగర్హింపఁబడినవియును నివియేవో యమానుషవిగ్రహములని విస్మయముఁజెంది గారవింతుము, ఈగారడీవిద్యలోఁ వెనుఁగున నితఁడు ప్రథముఁడు."

కవిత్వతత్త్వవిచారము ౧౦. ౧౧. ౧౨.

వేమనజీవితము నెఱుంగుటకుఁ దొలుత చరిత్ర పరిశోధనము గావించినవారు కీర్తిశేషులగు శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుపంతులువారు. వీరొకసభలో నుపన్యసించుటకు వ్రాసిన వేమనజీవితము వలన నీతనిగూర్చి కొంతవఱకుఁ దెలుఁగుదేశమునకుఁ దెలిసెను. ఈవిషయమున మిగులఁ గృషిచేసి ప్రత్యేక



గ్రంథము వ్రాసిన వంగూరు సుబ్బారావుగారు ప్రశంసాపాత్రులు.

## వేమనకులము

వేమన రెడ్డిశాఖకుఁ జెందినవాఁడు. ఈయన కొండవీటి వేమారెడ్లకుటుంబమునకుఁ జెందినవాఁడని ప్రవాదముగలదు. దీనిగూర్చి దండకవిలెలలోఁ గూడఁ గొంచెము వ్రాయఁబడియున్నది గాని యవి చరిత్రముతో సమన్వయింప వీలు చిక్కుటలేదు.

"ఎడ్డె రెడ్డి కులమ దేమని చెప్పుదు"
"విదితముగాఁగను వేమనరెడ్డి"
"కలియుగమున నున్న కాపుకులానకు
వేమన తనకీర్తి విక్రయించె"

లోనగుపద్యభాగములవలన రెడ్డికులమున వేమన జనియించెననియు "వేమనృపాలశేఖరా" యనుసంబోధనమునుబట్టి వేమనకవి, రాజవంశమున జనించెననియుఁ దెలిసికొనవచ్చును. వేమన రెడ్డివంశీయుఁడనుట కాధారములు చాలఁగలవు. ఇతఁ డేరెడ్డిశాఖవాఁడో నివాసమేదియో తెలిసికొందము.

"ఊరు కొండవీడు నునికి పశ్చిమవీధి
మూఁగచింతపల్లి మొదటియిల్లు
ఎడ్డిరెడ్డికులమదేమని తెలుపుదు"

ఈపద్యములవలన వేమన జన్మస్థానము వంగవోలు తాలూకాలోని మూగచింతపల్లి యనియుఁ గొండవీడు పిదప నివాసస్థలమనియుఁ దెలియుచున్నది. వేమన చిరకాలము మహాత్ములదర్శించుచు యోగులను సేవించుచుఁ బ్రపంచవర్తనములు విమర్శించుచు దురాచారములను ఖండించుచు దేశములన్నియుఁ దిరిగియున్నాఁడు. వేమనపద్యము లని చెప్పఁబడు లిఖితప్రతులన్నియు నొకవిధముగా నొకయనుక్రమణికగా లేవు. ఒకప్రతికి మఱియొకప్రతికి సంబంధము లేదు. వీనిని సమన్వయించి చూచితిమేని వేమనయోగి దేశమునందంతటను దిరుగుచుఁ దోఁచినటులఁ బద్యములు రచించుచుఁ బోయెననియు వేమనసూక్తిరత్నములు సమీపస్థులు ప్రాప్తానుసారముగ నేరికొని యాంధ్రభారతి కుపాయనముగా నర్పించిరనియుఁ దలంపఁదగును. వేమన సిద్ధినొందిన స్థలమాంధ్రదేశమున సుప్రసిద్ధమై గ్రంథస్థమై పవిత్రమగు క్షేత్రముగాఁ బరిగణింపఁబడుచున్నది. బాలచక్రవేమ శతకములో వేమన నివాసాదికములు దెలుపు నీపద్యములు గలవు.

తే. కదిరి తూర్పుదిక్కు ఘనతశోభిల్లఁగాఁ
బరగ వర కటారుపల్లి యనఁగ
అచట నునికిఁ జేసి యమరియుండుదురయా
బాలచక్రవేమ భవ్యనామ.



తే. తల్లిదండ్రి యన్నదమ్ము లాత్మసఖులు
ఎలమి బంధువు లాది యెల్లజనులు
గలిగి వర్ధిల్లి రాపూరు ఘనతమీఱ.

ఈపద్యములవలన వేమనకవి దత్తమండలములోని దగు కదిరి చెంతఁగల కటారుపల్లెలోఁ బుట్టి యచటనే మరణించెనని తెలియుచున్నది. వేమనచరిత్ర ద్విపదకూడ నీవిషయమునే స్థాపించుచున్నది. కటారుపల్లెలో వేమన సమాధి కలదు. సమాధిని గలుపుకొని యట నొకయిల్లు కట్టబడియున్న దనియు వేమన ధరించినదుస్తులు పావుకోళ్లు నాగృహమునఁ దద్వంశీయులచేఁ బూజింపఁబడుచున్నవనియుఁ దెలియుచున్నది. వేమన్న పేరుతో సమాధిచెంత నొకవికృత మగుకఱ్ఱ విగ్రహము గలదని క్యాంబెలుదొరగారు వ్రాసియున్నారు. వేమన శార్వరినామసంవత్సర చైత్రశుద్ధ నవమి దినమున సిద్ధిపొందినటులఁ గటారుపల్లెవారు చెప్పుచుందురు. వేమనవంశీయులు ప్రతిసంవత్సరము నుత్సవాదులఁ జేయుచు నున్నతాశ్వములనెక్కి పసపుగుడ్డలతో వేమన్నలమని చెప్పుకొనుచు నుత్సవాదులకు ధనము ప్రోవుచేయుచున్నారు.

ఈకవివంశీయులమని చెప్పుకొను కటారుపల్లె ప్రాంతస్థులు పాకనాటి రెడ్లగుటవలన వేమనయుఁ

పాకనాటి రెడ్డి యనియు నుత్తరవయస్సులోఁ గటారుపల్లెలో సిద్ధినొందెననియు నిశ్చయింప వీలగుచున్నది. వేమనపద్యములలోని మాటలనుబట్టి యీ ప్రాంతమువాఁడని నిరూపింప నెంతమాత్రము వీలుకాదు. వేమన యాంధ్రదేశములోఁ దిరుగని చోటు లేదు. ఆతఁడు విమర్శించినజాతులు నాచారములు కులములు వంచకులు లోనగునవి పరిశీలింతుమేని "ఉదారచరితానాంతు వసుధైవకుటుంబకం" అను నార్యోక్తిప్రకారము వేమన యాంధ్రదేశమునందుఁ బలుతావుల చరించినటులు సువ్యక్తమగును. ఇట్టి పదజాలమునుబట్టి స్థలమునిర్ణయించుట ప్రమాదముకాదా!

వేమనకాలమును గుఱించి యించుక చర్చించి చూతము. వేమన కొండవీటి రెడ్డిరాజుల కుటుంబములోనివాఁడు కాఁడు. కొండవీటి రెడ్డిరాజులు పంటరెడ్లు. వేమనకవి పాకనాటి రెడ్డిగాన బాంధవ్యసంబంధ ముండఁజాలదు. వేమనను బూర్వకవులు పొగడిరని వంగూరు సుబ్బారావుగారు కొన్నియుదాహరణములొసంగిరి. నాగరఖండము, అన్యవాదకోలాహలము, తోభ్యచరిత్రము, ఏకామ్రలింగశతకము, మల్హణచరిత్రములనుండి వేమన యను పేరు కవిస్తుతిలోఁ జూపిరి. ఇంతమాత్రమునత నిందలి



వేమన — వేమనపద్యములు వ్రాసినకవి యన వీలు లేదు. ఆరాధ్యకవులలో శైవమతప్రచారకులగు వేమనారాధ్యులు పెక్కండ్రు గలరు. వారిలోఁ గొందఱు కవులుగూడ నైయున్నారు. ఈకవులు నుతించినది యోగియు వేమనపద్యములు వ్రాసినవాఁడు నగు వేమననే యని నిర్ణయము చేయ వీలుచిక్కునఱకు గ్రంథస్థములగు పద్యములనుబట్టి వేమన కాలము నెఱుంగుట కవకాశము లున్న యెడలఁ దెలిసికొనఁ బ్రయత్నింతము.

తే. పరగరాయనికుల బాచనిధన మెల్ల
భట్లపాలు కవులపాలు దలఁప
నొనర హీనజనుని ధనము దాయాదుల
పాలు జారకాంత పాలు వేమ.

ఆ. తిరుమలకును బోవఁ దురక దాసరి గాఁడు
కాశిఁబోవ లంజె గాదు గరిత
కుక్కసింహ మౌనె గోదావరికిఁ బోవ.

ఆ. అధముఁ డైన మనుజుఁ డర్థవంతుం డైన
నతనిమాట నడచు నవనిలోన
గజప తింట నెన్న గవ్వలు చెల్లవా. వి.

క. నందన సంవత్సరమునఁ
బొందుగఁ గార్తికశుద్ధ పున్నమనాఁడున్
వింధ్యాద్రిసేతుబంధన
సందున నొకవీరుఁ డేలు సరగున వేమా.

ఈపద్యములే వేమన కాలనిర్ణయమునకుఁ దోడు పడుచున్నవి. మొదటిపద్యములో రాయనిభాస్కరుని జెప్పియున్నాఁడు. రాయభాస్కరుఁడు స్తోత్రప్రియుఁడు గదా! భట్టురాజులస్తోత్రములతో నానందించుచుఁ జేకొత్తిదానములు గావించువాఁ డొకఁడు. లౌకికోద్యోగులయందుఁ బే రెన్నికగన్నవాఁ డొకఁడు. ఇరువురు రాయనిభాస్కరులు సుప్రసిద్ధులు భిన్నకాలములలోఁ గానవచ్చుచున్నారు. గావిపాటి త్రిపురాంతకుని చాటుధారయగు నీక్రిందిపద్యము క్రీ. శ. 1386 ప్రాంతమున నొకరాయనిభాస్కరుఁ డున్నటులఁ దెలియును.

చ. కలయ పసిండిగంటమునఁ గాటయ వేము సమక్షమందు స,
త్ఫలముగ రాయనిప్రభుఁడు బాచఁడు వ్రాసినవ్రాల
వ్రాఁతలన్, గలుగలు గల్లుగల్లు రనఁ గంటకమంత్రుల
గుండె లన్నియున్, జలుజలు జల్లుజల్లు రనె సత్కవివర్యులు
మేలు మే లనన్.

భట్టురాజులవలనఁ బొగడికలుగొని వారికిఁ గామితార్థము లొసంగువాఁడే వేమనకుసమకాలికుఁడు. పైపద్యములోని రాయనిబాచఁడు రాజ్యతంత్రప్రవీణుఁడు గాన వేమనచెప్పిన గుణములుగల రాయని బాచనికొఱకు వెదుక నగును! క్రీ. శ. 1516 ప్రాంతములలో నొకరాయని బాచఁడు గలఁడు. ఆతఁడు



నందిస్తోత్రప్రియుఁడని చాటుపద్యరత్నాకరములోని యీక్రిందిపద్యము తెలుపును.

సీ. భట్టు దీవించుచు బాసికంబును జూప
వెలయఁ బెండిలిచేసి వేడ్కఁ బంపెఁ
జొప్పకట్టెలమీఁద సోలియుండఁగఁ జూచి
పట్టెమంచము పాన్పు బట్టుకొసఁగె
పలెత్రాడుఁ జూపిన చెలఁగి యెద్దు నొసంగెఁ
బలుపుఁ జూపినఁ బాఁడిపశువు నిచ్చె
కల్లెంబుఁ జూపినఁ గడగి గుఱ్ఱము నిచ్చెఁ
జుట్టఁజూపిన దాసి సుదతి నిచ్చె
తే. స్నాన మాడంగఁ గడియంబు జాఱఁగడమ
కడియమ్మును వేయ శాంభవి కరము జూపె
వెలయ రాయలకుం గ్రమ్ము వేసి చూపె
సర్వమాన్యుండు వినుకొండశాసనుండు
భవ్యభరతుండు రాయని భాస్కరుండు.

పైపద్యమువలన రాయనిభాస్కరుఁడు భట్టుల గౌరవించుచు నుండెను. గాన వేమనచెప్పిన భట్టురాజులఁబోషించు రాయనిబాచఁడు క్రీ.శ.1516 ప్రాంతములనున్న రాయనిభాస్కరుఁడే. ఈయంశము నితరాధారములచే సమర్థింపవచ్చును. తిరుపతికిఁ బోయినంతనఁ దురక దాసరి కాఁడని చెప్పుటవలన మహమ్మదీయు లాంధ్రదేశము నాక్రమించి దేవస్థానముల ముట్టడించినకాలమున వేమన యున్నటుల నూహిం

పవీలగును. రెడ్డిరాజులు కొండవీడు, రాజమహేంద్రవరము పాలించువఱకుఁ దురకలు తెలుఁగుదేశములోఁ బ్రవేశించి నిలువలేదు. తురకలు తెలుఁగుదేశములలో క్షేత్రములలోఁ బ్రవేశించి కఱకుఁదనముజూపినది రెడ్డిరాజ్యావసానముననే గాన మహమ్మదీయ విజృంభణకాలమగు క్రీ. శ. 1525 ప్రాంతములలో వేమన్నపైనుడి వాకొనియుండును. ఇందువలన రాయనబాచనికాలము మహమ్మదీయ రాజులకాలము కొంచె మించుమించుగాఁ గలియును. 'గజపతింట నెన్న గవ్వలు చెల్లవా' యని వేమన చెప్పియున్నాఁడు. గజపతులోఢ్రదేశమునుండివచ్చి కొండవీడు, కొండపల్లి, ఓరుగల్లు, ఉదయగిరి, కనిగిరి దుర్గముల నాక్రమించి స్వతంత్రులై వర్తించిరి. వారికాలమున గవ్వలె నాణెములుగాఁ జెల్లియుండును. గజపతి రాజ్యము చాలవఱకుఁ గృష్ణదేవరాయలే రూపుమాపెను. కృష్ణదేవరాయల బాల్యావస్థలో (రెడ్డిరాజ్యాంతమున) గజపతులరాజ్యము మహోన్నతముగా నున్నకతన వేమనచెప్పిన గజపతులకాలము తప్పక క్రీ. శ. 1520 ప్రాంతమై యుండుననుటకు సంశయ ముండఁజాలదు. వంగూరి సుబ్బారావుగారు వేమన్నను పొగడినటుల నిచ్చిన కవుల పట్టికయే విశ్వసనీయమైనను మనకాలనిర్ణయమున కడ్డము



రాదు. ఎంతయోకాలము కృష్ణదేవరాయల కావల నున్న యెడపాటి యెఱ్ఱాప్రగడ వేమన్నను బూర్వకవిగాఁ బొగడుటవలన యెన్నటికిఁ బూర్వుఁడు కాఁజాలఁడు. ఏమందురా? వేమన్న నటుండనిత్తము. ఎడపాటి యెఱ్ఱన శ్రీకృష్ణదేవరాయల యాస్థానమున నున్న ధూర్జటినే పూర్వకవిగా జెప్పియున్నాఁడు. అందువలన నెఱ్ఱన ధూర్జటికావలివాఁడని తెలియుచుండ వేమన్న నొకశతాబ్ది వెనుకకుఁ దీసికొనిపోయి కూర్చుండఁబెట్టవలసిన యవసరముకనుపింపదు. వంగూరి సుబ్బారావుగారుచూపినయాధారములలోఁ బ్రధానమైనది వేమన్న కృష్ణరాయలకుఁ బూర్వుఁడని నిర్ణయించుటకు నాధారము జేసికొన్నపద్య మిదియే.

చ. వినుతు లొనర్తు నాంధ్రసుకవిప్రభు నన్నయభట్టు దిక్కయా
జ్వను శివదేవు భాస్కరుని జక్కయ నాచనసోము సర్వదే
వుని భవదూరు వేము నలపోతనఁ బిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని శరభాంకు వీరకవి ధూర్జటిఁ గేతన బాణభట్టులన్.

రాయలకాలములోనున్న ధూర్జటిపూర్వకవి యగుటవలన ఎడపాటి యెఱ్ఱన రాయల కావల ధూర్జటిప్రశస్తి బాగుగా వ్యాపించినకాలములో నుండియుండును. అట్టివాఁడు పొగడినందున వేమన రాయలకంటెఁ బూర్వుఁడని సిద్ధాంతముచేయ వీలుండదు. దీనిగుఱించి యింకను వ్రాయవలసియున్నది

గాని విస్తార మగునని వదలితిమి. నాగరఖండము లోని కవిస్తుతిలోని వేమనప్రశంస యసంగతమని వంగూరి సుబ్బారావుగారే యొప్పుకొనిరి. మిగిలిన కవిప్రశంసలలోని వేమనవేరు పదియాఱవశతాబ్ది కీవలిదిగాన వేమన శ్రీకృష్ణరాయలకంటెఁ బూర్వుఁ డనిన సిద్ధాంతము నిలువలేదు. నందనసంవత్సరమున గార్తిక పూర్ణిమనాఁ డాసేతు హిమాచలపర్యంత మేలురాజు జన్మించు ననుపద్యము ఐశ్వర్యవిముఖుఁ డై గోఁచిపాఁతతో దేశదేశములు ద్రిమ్మరు వేమన కన్వయింపదనియు నది వీరభోగవసంతరాయని గూర్చినదో "నందా నందనయోర్మధ్యే" అను మార్కండేయపురాణోత్తరభాగమునకనుకరణమో చెప్పలేము. ఇంతవఱకుఁ గావించిన చరిత్రపరిశోధనమువలన వేమన్నను క్రీ. శ. 1520 లోనికిఁ దెచ్చితిమి. పదిబార లటు పదిబార లిటు నీజోగిరాయని లాఁగక యొకచోఁ బ్రతిష్ఠింపదగిన యవకాశము నెమకుదము.

తే. ప్రాకటముగ నిట్టె లోకములో గుంటు
పల్లి ముత్తఁ డెన్నఁ బరమగుణుఁడు
అన్నదానమునను హరువ్రాజచేతను
హరునిలోనఁ గాంచె నరసి వేమ.

అనుపద్యములవలన వదాన్యశేఖరుఁడగు గుంటపల్లి ముత్తనామాత్యుని కాలమునందు వేమన యుం



డెనని స్పష్టమగుచున్నది. పూర్వవిమర్శితనిర్ణయముల నమ్మి వంగూరు సుబ్బారావుగారీపద్యము ప్రక్షిప్తమనిరి. తమకు బాధకమగుపద్యము ప్రక్షిప్తమగు ననుట స్వపక్షబలమునకు మనవారు చూపుసాధనములలో నొకటి. గుంటుపల్లి ముత్తనామాత్యుఁడు సామాన్యుఁడు గాఁడు. ఈతని వివరములు చాటుపద్యమణిమంజరి రత్నాకరము లెగాక ముత్తనామాత్యచరిత్ర మనుగ్రంథమువలన విరళముగాఁ దెలియఁగలవు. ముత్తనామాత్యుఁడు దాతయై యడిగిన కవిగాయకభట్టుమూర్తులకు లేదనక దానములు గావించుచు వితరణకర్ణుఁడని ప్రశస్తి వహించెను. ఇతఁడు గోలకొండ నవాబులకుఁ బ్రతినిధియై సర్వాధికారములతో కొండవీడు వినుకొండ బెల్లముకొండ నాగార్జునకొండ యను నాలుగుదుర్గములకు నధ్యక్షుఁడై యుండి శ్రీశైలము మొదలు రామేశ్వరమువఱకుఁ గల దేవస్థానములలో దానములు గావించెను. ఇతని ప్రశస్తిని చాటుపద్యము లుదాహరించెదము.

ఉ. సంతత మారగించు నెడ సజ్జనకోటులఁ బూజసేయఁ శ్రీ
మంతుఁడుగుంటుపల్లి కులమంత్రి శిఖామణి ముత్తమంత్రి మే
ల్బంతియె బంతిగాక కడు పందగులాములమంత్రులెల్ల నా
ల్బంతుల దుక్కిటెడ్ల మెడ బంతులు విప్రవినోదిగారడీ
బంతులు దొంగవాండ్రములుబంతులుసుమ్ము ధరాతలంబునన్.

మ. అనిసీవైరులు మంత్రు లిట్లనినని స్నార్యుల్ కవుల్ పండి
తుల్, ఘనదానంబున మేఘునిన్ శిబిఘనున్ స్కంధీశ్వరున్
కర్ణునిన్, జనులెల్లన్ వినుతింప గెల్చె నని విశ్వాసంబుగాఁ
బల్కెరా, మును నీ నేయుతపంబు పెంపునను శ్రీముత్త
ప్రధానాగ్రణీ.

చ. కమలభవాండభాండమనఁ గల్గిన నందవరంపు టెండ్లలో
ప్రముఖుఁడురాయనప్రభునిభాస్కరుఁడే నెఱదాతపిమ్మటన్,
విమలచరిత్ర గుంటుపలి వీరయముత్తఁడె దాత భట్టసం
భ్రమఘనదానరూఢి నొకపాటెవదాన్యుల నెన్న నేటికిన్.

మ. అనఘ ప్రాభవ గుంటుపల్లి సచివేంద్రాముత్తనామాత్య నీ,
ఘనహస్తాబ్జసుగంధవాసన మదంగవ్యాప్తమైనప్పుడే, కనుఁ
గొంటిన్ జతురంతయాన పదవుల్ గైకొంటి మేల్వస్తువుల్,
కనకస్నానము లబ్బె మాకు నెలవా! కర్ణాటక క్షోణికిన్.

ఈపద్యములవలన ముత్తనామాత్యుఁడు అన్నదానమున హరుని పూజయందు నసమానుఁడని చెప్పవచ్చును. అట్టిచో వేమన పొగడుటలో నించుకేని వింతలేదు. ఇది ప్రక్షిప్తమని యనుకొనవలసినంత యవసరము కానరాదు.

క. పొందుగ శరజలనిధి హరి
చందనతరు చంద్రసంఖ్య శకవర్షంబుల్
దుందుభి నాషాఢంబున
నందముగా వీరముత్తఁ డరిగె న్దివికిన్.

అనుపద్యమువలన ముత్తనామాత్యుఁడు శా. శ. ౧౫౪౫ లకు సరియగు క్రీ. శ. 1623 లోఁ బరమపదవి నలంకరించెను. ఈచరిత్రాంశములను సమన్వయించి చూచితిమేని వేమన యోగిరాయని బాచనిఁ (భాస్కరునియంత్యము క్రీ. శ. 1520) చివరకాలమునను గుంటుపల్లి ముత్తనామాత్యుని మధ్యకాలమునను గజపతుల రాజ్యకాలమున క్రీ. శ. 1540 మొదలు 1600 వఱకు నుండియుండునని తలంపవచ్చును. ఇంతటితోఁ గాలనిరూపణమును గూర్చి ప్రయత్నము ముగించి వేమన కవితాతత్త్వమును అనుకరణములను గూర్చి తెలిసికొందము.



## వేమనకవిత్వము.

వేమన్న నీ యిరువదవశతాబ్దమున నాంధ్రమహాశయులు కవియని యెంతగౌరవదృష్టితోఁ జూచుచున్నారో ప్రాచీనకవులంద అంతయనాదరదృష్టితోఁ గాంచిరి. వేమన్నకు నిరర్గళ మగుకవితాధారయు సమయానుకూలమగు విషయవిమర్శనపటుత్వమును నోహరమగునుపమాకల్పనప్రతిభయుఁగలదు. ఇతని పదజాలము నిఘంటువులనుండి వెదకి తెచ్చినదికాదు. కావ్యములనుండి సంగ్రహింపఁబడినదికాదు. గ్రంథపఠనమువలన సంపాదింపఁబడినదికాదు. ఆంధ్రప్రపంచమున వ్యవహారదృష్టమైనది. కావున నీతనిశైలి యాబాలవేద్యముగ నుండును. తంబుర మీటు

చు వేమనపద్యములను బాటలవలెఁ బాడుభిక్షుకులను పెక్కండ్రఁ గాంచుచున్నారము. వేమన్న గండికోట మొదలు గజపతులరాజ్యముగనున్న కటకము వఱకును గోలకొండ లోనగు మహమ్మదీయ రాజన్యుల రాజ్యములప్రాంతములందును శిష్యసహితముగా సంచారము చేయుచుఁ దనకంటఁబడిన దురాచారముల వెంటవెంటనే ఖండించుచుఁ బద్యరూపమున గానము చేయసాగెను. వేమన శిష్యకదంబమాపద్యముల సేకరించియుండును. సన్యాసి శిష్యపరంపరలో భిన్నభిన్నరూపములగు వేమన పద్యములప్రతులు గానవచ్చుట కిదియె కారణమై యుండును. వేమన బ్రాహ్మణులను లింగధారులను వైశ్యులను విశ్వకర్మవంశీయులను యోగులను కవులను భాగవతులను విగ్రహారాధనమును విద్యాపఠనమును గురుకులవాసమును మంత్రోపదేశమును ఇది యది యననేల? ఆంధ్రదేశమునఁ దనకుఁ గానవచ్చిన సమస్తవిషయములను దీవ్రముగానెదటివాని మనస్సు నొచ్చునేమో యనుకొనకుండ విమర్శించెను. కక్షపాలయుఁ గౌపీనముదప్ప నైహికముల నాశింపని మహాత్యాగులగు యోగులకు లేనిస్వతంత్రమింకొకరి కుండునా? ఇందువలన నుత్తమ కులజులకు వేమనయందు లక్ష్యము తొలంగుటయు



నానాజాతు లీతనిపద్యములను వేదసూక్తులవలె గౌరవించుటయుఁ దటస్థించినది. రానురాను బూర్వాభిమానములు తొలంగి యాంధ్రజాతి జాతీయాభిముఖమైనకొలంది వేమనపద్యములు గుణవంతములని పఠనీయములని తెలియవచ్చెను. కావ్యముల వలన లోకమున కెంతయో మేలుకలుగును. కథాప్రధానములగు కావ్యములే ప్రపంచమునకు మేలు చేయుటకు సమర్థములై యుండ నిఁకనీతిబోధకములు దురాచారవిమర్శములు గలవిషయప్రధానములగు నీతికావ్యములవలన లోకమునకుఁ గలుగుమేలు చెప్పనీలుకాదు. ప్రాచీనాలంకారికులు కావ్యప్రయోజన మిట్టుల నిరూపించియున్నారు.

చతుర్వర్గఫలప్రాప్తిః సుఖాదల్పధియామపి కావ్యాదేవ ...

విశ్వనాథ కవిరాజు.

ఇందువలనఁ గావ్యము ధర్మార్థకామమోక్షములను మందమతులకు సయితము ప్రసాదించునని తెలియుచుండ సుధీబృందమునకుఁ ద్యాగశిరోమణియుఁ బ్రపంచాతీతుఁడు నగుయోగి రచించు నీతికావ్య మెంతనీతిబోధించునో తెలుపఁ బనిలేదు. వేమన ప్రపంచమునకు లోఁబడిన కవికాఁడు ఇతని విమర్శనాశరమునకు గుఱికాకుండుటకుఁ బ్రపంచమే భయపడవలసియుండును. మరుగు మర్యాదలతో నన్యాపదేశముగ లోకము నీతఁడు విమర్శింపఁడు.

'సిద్ధి ర్లోకాత్ దృశ్యా' యను వాగనుశాసనసూక్తి ప్రకారము ప్రపంచవ్యవహారలభ్యమైన భాషాపరిజ్ఞానముతో నీతఁడు తనకు వ్యతిరేకముగఁ దోఁచిన యంశమును మిన్నువిఱిగి మీఁదఁబడినను విమర్శింపక మానఁడు. ఇతనిపద్యములు రమారమి అయిదు వేలవఱకు ముద్రితములైయున్నవి. అవియన్నియుఁ గాక యింకఁ గొన్ని వేలపద్యములు మనకు లభింపవలసియున్నవి. అందుగల విషయముల నన్నింటిని గ్రహింపఁదగిన సుదిన మాంధ్రుల కెన్నఁ డేతెంచునో? లభ్యములగుపద్యము లన్నింటి నొకమాఱు పరిశీలించితిమేని మానవస్వభావమును వేమనవలె గుర్తించినకవి వేఱొకఁడు లేఁడనియుఁ బ్రతిమానవస్వభావము వేమన విమర్శించియుండుటచే వేమనచేఁ జెప్పఁబడని మానవస్వభావము లోకమున నుండదనియుఁ దోఁచును. వేమన తనకుఁ దోఁచినటులఁ దాను జెప్పుచుండును. దానిని లోకము పాటించుచున్నదా లేదా? పాటించునటులఁ జేయవలయునన్న యేమార్గములఁ ద్రొక్కవలయునని వేమన యోచించినవాఁడు కాఁడు. తనవాక్యములందు గుఱియున్నవారు తనసందేశము నాదరింతురని నమ్మినటుల నాతని పద్యములవలన నెఱుంగవచ్చును. దృష్టాంతము చూడుఁడు.



క. కాదనఁ డెవ్వరితోడను
వాఁదాడఁగఁ బోఁడు వెఱ్ఱివానివిధమునన్
భేదాభేద మెఱుంగును
వేదాంతరహస్యములను వేమన నుడువున్.

ఈపద్యమువలన వేమనవాదములు పూర్వపక్ష సిద్ధాంతములు ప్రపంచజిగీష పెట్టుకొనలేదనియుఁ దా నెఱింగినవేదాంతసారమును వెఱ్ఱివానివలె నుపన్యసించెననియుఁ దెలియవచ్చును.

క. ధరఁబుట్టి భోగి నైతిన్
బరమం దిచ్చలనుమాని పడఁతులకై నే
దిరిగి యలసితిని ద్రవ్యము
మఱి యార్జించితిని గడకు మరణము వేమా.

గీ. మానినీ మనోజమందిరానంద దైక
లోలుఁ డొల్లఁ డితరలోక సుఖము.

గీ. పనసతొనలకన్న పంచదారలకన్న
జుంటితేనెకన్న జున్నుకన్న
చెఱకురసముకన్న చెలిమాట తీపురా.

తే. పూఁపచనులనాఁడు భూ మెల్లఁజేయును
కాదమచనులనాఁడు కోటిసేయు
తటుకుచనులనాఁడు దయ్యాలు నొల్లవు

తే. మొలకచనులనాఁడు మోహంబు పుట్టించు
గుబ్బచనులనాఁడు కోర్కెదీర్చు

లోనగుపద్యములవలన వేమన విషయానుభవ

మునఁ జిరకాలము వర్తించి కడకు విరాగియయ్యె నని తోఁచును. వేమన పదిమాటల కొకమాటైనను సుందరుల హావభావముల విమర్శింపక మానఁడు. ఇతనిపద్యములను బాగుగాఁ జూచితిమేని విషయలాలసత్వ మితఁడు బలిమిమై చంపుకొనినటులఁ దోఁచునుగాని యింద్రియనిగ్రహ మాబాల్యమున నిర్వహించినటులఁ దోఁచదు. యోగులకు హేమకారవిద్యయు వైద్యము సహజముగ నభ్యస్తమై యుండునని లోకులు భ్రమనొందుటగలదు. ఆభ్రాంతి బహుశః వేమనదగ్గరనుండి లోకమునకు సంక్రమించెనేమో! వేమన రోగములను నివారించుటకు బెక్కు యోగములు మూలికలు ఔషధములు తెలుపుటయేగాక లోహములను సువర్ణముగాఁ జేయు విధమును గూడఁ జెప్పియున్నాఁడు. వేమనచెప్పిన ఔషధయోగము లెల్ల నాచరణములోఁబెట్టి రోగముక్తులైనవారు వేమనచెప్పిన స్వర్ణకారయోగములను నమ్మి స్వర్ణాశతో బైరాగులై మతిభ్రష్టులై తిరుగువారు పెక్కండ్రు కలరు. లోహములను బంగారుగాఁజేయుట సులభసాధ్యమని వేమన నెత్తిన నోరు బెట్టుకొని కొట్టుకొనుచున్నాఁడు. మనవా రది సాధింపలేక నోటఁ జేయి బెట్టి కొట్టుకొనుచున్నారు. ఔషధయోగములు



స్వర్ణయోగములుగల పద్యములు కొన్ని యిచట నుదాహరించుట ప్రకృతమే.

ఆ. ఉక్కుచూర్ణము దిన నుడుగును కష్టంబు
ఉక్కుచూర్ణము దిన నుడుగు క్షయయు
ఉక్కుచూర్ణము దిన నుడుగును కర్మముల్. వి.

ఆ. పేడు ముదురుకాయ పెనుబాము కుబుసంబు
జోడుకూర్చి రసము సోఁకఁజేసి
యొక్కయేడు తినఁగ నుర్విహేమము తానె. వి.

ఆ. పాముకప్పుచేతఁ బరగ జంబీరంబు
వరుస దీపపుసెగ వండి దించి
రాగిమీఁద వేయ రమణ బంగారమా. వి.

ఆ. తాళకంబు తెచ్చి తాటికమ్మరసాన
వండు నిపుణతెఱుగ వెండి యగును
కల్లగాదు నిజము కరకంఠ నీయాన. వి.

ఆ. ఇంగిలీకమహిమ హేమింపనేరక
చిత్రపటము వ్రాసి చెఱచినారు
బొంతజెముడుపాలఁ బోసఁగింప నేరరు. వి.

ఇట్టిపద్యము లెన్నియో వేమన పద్యరత్నముల లో నున్నవి. వీనియనుభవము మనకుఁ దెలియదు గాని వేమన వైద్యుఁ డనుటకు హేమకారవిద్యానిపుణుఁ డనుటకు మాత్రము తార్కాణములుగా

నున్నవి. ఇందలి యొకపద్యమువలన వేమన రసవాదమునఁగూడ నిపుణుఁ డనియు నింగలీకమును జిత్తరువులకొఱకుదుర్వినియోగము చేయుటకు సహింపఁడాయె ననియుఁ దెలియును. దీనివలన వేమన మొగలుచిత్రవిద్యవ్యాప్తిగలకాలములో నుండె నని తోఁచును.

## అనుకరణములు.

వేమనకవితలోఁ బలువురు పూర్వకవుల ననుకరించెను. తాను విన్నపద్యములలోనిభావము తేటతెల్లమగునటుల గీతములలో నిమిడ్చెను. ఇటుల వేదాదులందు శాస్త్రములం దున్న తత్త్వవిషయములనుగూడ గీతములలో నిమిడించెను. వేమన యనుకరణపద్యము లివిగో చూడుఁడు.

ఆ. జంగమైన వెనుక జాతి నెంచవలదు.

ఇది బసవేశ్వరుని వీరశైవమతసిద్ధాంతమునకు జోడు.

ఆ. లోభివాని జంప లోకంబులోపల
మందు వలదు వేఱె మతముగలదు
పైక మడుగ నతఁడు భగ్గురు మని చచ్చు. విశ్వ.



చ. ఘనతరకష్టలోభితమకంబునఁ జంపెడు నంత యల్క నె
మ్మనమునఁ బుట్టెనేని విషమారణకర్మ కృపాణ ముఖ్యసా
ధనములు గూర్ప నేల ప్రమదంబున దగ్గఱి కాసు వీస మి
మ్మనుటయె చాలు వాని నిమిషార్థమునన్ మృతినొందఁ
జేయఁగన్.

హరిభట్టువరాహపురాణము.

ఆ. కైకపుట్టి చెఱిచెగా రాముపట్టంబు
సీతపుట్టి లంకఁ జెరిచెఁ గాదె
కౌరవులను జెఱిచె గద ద్రౌపదియుఁగూడ.

శ్లో. కృతేతురేణుకామృత్యుః త్రేతాయాం జనకాత్మజా
ద్వాపరే పాండుపత్నీచ...

ఆ. పాలు పెరుగు నేయి బరగు నన్నము దిని
స్త్రీలఁ గననివాఁడు శీలవంతుఁడు.

శ్లో. శాల్యన్నం సఘృతం పయోదదిఘృతం భుంజంతి యే మాన
వాః, తేషాం ఇంద్రియనిగ్రహో యది భవేత్.

భర్తృహరి.

ఇట్టి యనుకరణములు వేమనపద్యములయం దింకనెన్నియో గలవు. వానిని జూపుటచే గ్రంథము పెరుగును. వేమన భాషాపరిచయముగలవాఁడై యితరగ్రంథములసారము గ్రహించి సొంతమాటలతోఁ గొన్ని తావులఁ జెప్పియుండెనని యుదాహృత పద్యములవలన నూహింపవచ్చును.

వేమనచిత్రపటమును ప్రచురించి వేమన దిగంబరుఁడని వంగూరి సుబ్బారావుగారు నిర్ణయించిరి. దానికిఁ దార్కాణగా నొకపద్యము నుదాహరించిరి. కాని వేమన దిగంబరుఁడనుట యనుమానాస్పదము. ఆతఁడు పెక్కువిషయములు పెక్కుధర్మములు చెప్పుచు సందర్భములోఁ దోఁచినటులఁ జెప్పినయంశములన్నియు నాతనిజీవితమునకు లంకెఁబెట్ట వీలుకాదు. వేమన రాజయోగి. కపటవేషములు, ఉపవాసములు, ఆడంబరము నామోదింపఁడు. బ్రహ్మవంశజులు తదితరులకంటె గొప్పయని యంగీకరింపఁడు. ఇట్టివాదముల కీతఁడె ప్రథముఁడు. పంచముల నుద్ధరించును. వర్ణాచారవిరోధములు మతములు దగవని వేమన తలంపు. ప్రపంచజ్ఞానమును సులభశైలిలో దేశమునకు సాటి యద్వితీయకవితాధారతో లోకమును వశపఱచుకొన్న వేమనయెడలఁ గృతజ్ఞతఁ దెలుపుట కీచిన్న చారిత్రికవిమర్శనమువ్రాసి యాతనియెడ మేముపడిన పఠనపరిచయ ఋణము దీర్చుకొనుటకుఁ దోడ్పడిన శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారికి వందనములు. కవికాలనిరూపణములో మేముపోయినత్రోవ సరికాదేని పండితులు సవిమర్శముగఁ దెలుపుదురేని కృతజ్ఞులము.

నందిగామ 1-8-1925 } శేషాద్రిరమణకవులు. శతావధానులు.



శ్రీరస్తు.

# వేమనపద్యములు.

---

## మూర్ఖపద్ధతి.

అవతారిక:—తమకు తెలియదు. ఒకరుచెప్పినను వినరు. మంచిపని యని తెలిసినను తెలియకున్నను తాముపట్టినకుందేలికి మూఁడుకాళ్లన్నట్టులు పెంకిపట్టుఁబట్టి కూర్చుందురు. ఇట్టివారలే మూర్ఖులు. లోకములో దుస్సాధ్యములగు ననేకకార్యములకు పనులకును మందుకలదు, కాని యిట్టి యద్భుతరోగమునకుమందు లేదు. వీరు అజ్ఞులునుకారు. ప్రాజ్ఞులును కారు. ఇట్టిమూర్ఖులను లోకులు నిందింతురు. కావున బుద్ధిమంతులు మూర్ఖకృత్యములను తెలిసికొని మూర్ఖులుగాక విద్వాంసులై మెలఁగవలయునని ఈ పద్ధతిలో మూర్ఖులనుగూర్చి వేమన చెప్పుచున్నాఁడు:—

క. అజ్ఞానమె శూద్రత్వము  
సుజ్ఞానము బ్రహ్మమౌట శ్రుతులను వినరా  
అజ్ఞానమణఁచి వాల్మికి  
సుజ్ఞానపు బ్రహ్మమొందెఁ జూడర వేమా. 1

తాత్పర్యము.—"మేము గొప్పకులపువారము. వీరు తక్కువజాతివారు" అని మూర్ఖులు తెలియక నోరికి వచ్చినట్టులు ప్రేలు

చుందురు. నిజమును విచారించితిమా శూద్రులు శూద్రులని వేరుగాలేరు. తెలివిలేకపోవుటయే శూద్రత్వము. జ్ఞానమే బ్రహ్మము అదిగలవాఁడే బ్రాహ్మణుఁడు. ఈచెప్పినమాట పొల్లుమాటకాదు. ఇది వేదవాక్యము. "ప్రజ్ఞానమే బ్రహ్మము" అని కలదు. అజ్ఞానము తొలఁగించుకొని బోయవాఁడగువాల్మీకి మోక్షము నొందెను. కావున మూర్ఖుఁడవై చెడిపోక యజ్ఞానమును బోఁగొట్టుకొని జ్ఞానము నొంది వెలయుటకై ప్రయత్నమును జేయుము.

ఆ. అడవియడవి దిరిగి యాసను విడలేక
గాసిపడెడువాఁడు ఘనుఁడుగాఁడు
రోసిరోసి మదిని రూఢిగా నిలిపిన
వాఁడె పరముగన్నవాఁడు వేమ. 2

చెట్టులను బుట్టలను నాశ్రయించి యెచటనో యేమో యున్నదని కానఁబడినశిలకుఁ జెట్టునకు మ్రొక్కుచు సంచరించువాఁడు జ్ఞాని కాఁజాలఁడు. ఏకాగ్రముగా హృదయమును నిల్పి కామాదివికారములకు లోను గాక సంచరించువాఁడె జ్ఞాని; వాఁడె పరమాత్మను గనుఁగొనఁ గలఁడు. హృదయస్థమగు పరమాత్మను మఱచి యడవులలోఁ దిరుగుట మూరలక్షణము.

ఆ. అదిమి మనసునిలిపి యానందకేళిలో
బ్రహ్మమయుఁడు ముక్తిఁ బడయఁగోరు
జిహ్వారుచులచేత జీవుండు చెడునయా
విశ్వదాభిరామ వినరవేమ. 3



బుద్ధిమంతుఁడు, మనస్సు దానియిచ్చవచ్చినట్టులు పోవుచున్నయెడల బలాత్కారముగా నదిమిపట్టికొని బ్రహ్మస్వరూపుఁడై యానందమునొందఁ బ్రయత్నించును. మూర్ఖుఁడన్ననో మనంబును జయింపలేక చిక్కువడి జిహ్వాచాపల్యముచేతఁ దినరానిపదార్థములఁ దిని చెడిపోవును. కాఁబట్టి బుద్ధిమంతులు మూర్ఖకృత్యమిది యని తెలిసికొని జిహ్వాచపలతను బోఁగొట్టికొనవలయు.

తే. అరయ సుఖమొంది దుఃఖమ్ము నార్ప లేక
విధిని దూఱంగ ఫలమేమి వేడుకలర
బుద్ధినొక్కినఁ బరిపూర్తిఁ బొందునయ్య
అట్లుకా కూరకయె యుండనగునె వేమ. 4

అజ్ఞుఁడు సుఖము వచ్చినప్పుడు తనప్రయోజకత్వముచేత సంపాదించితినని యెగిరిపడి దుఃఖమువచ్చినప్పుడు మూర్ఖుఁడై దాని నుపశమింపఁజేయలేక దేవుని నిందింప మొదలువెట్టును. దానివలన నిసుమంతయును బ్రయోజనములేదు. మూర్ఖుఁడు తెలిసికొనలేఁడు గాని మనస్సును చిక్కఁబట్టినయెడల పరిపూర్ణుఁడై సుఖములనొందును. చేతఁగానిచో నితరదూషణమునుమాని నిబ్బరించి యూఱకుండుట మంచిది. విధిని దూషించినచో నిహపరములకు వెలిగావలసివచ్చును.

ఆ. అనువుగానిచోటఁ బనిగొని జూదము
నాడి కూడి యోడి యడవిసొచ్చు
ఘనునిజూడఁ జూచి గడువుము మూర్ఖత, విశ్వ. 5

మూర్ఖుల తెలివితక్కువ నేమని చెప్పవచ్చును? బుద్ధిమంతుఁడు తనకు తగినచోట నేపనిఁ జేసినను చెల్లును. మూర్ఖుఁడో - తనకు అనువుగాని స్థలమునందుఁ బిలువని పేరంటముగాఁ బ్రవేశించును. జూదమాడును. ఓడిపోవును. పిమ్మట నేడ్చుచు నడవులఁ బడును. కావున నో బుద్ధిమంతుఁడా! అట్టి మూర్ఖుల మూర్ఖతవలనఁ గలిగిన ఆపదలనుజూచి తెలివి తెచ్చుకొని యోగ్యులవలన యోగ్యమగునడవడి నేర్చుకొని మూర్ఖతవిడచి సంచరింపుము. అంతియగాని ధర్మజుఁడు నలుఁడు మొదలగు నుత్తముల జూదరితనముమ దృష్టిలోనుంచికొని చెడకుము.

ఆ. అలయఁ జేసి మలచి యడిగండ్లు మలిగండ్లు
తిరిపెమిడెడు కటికదేబెల్లెల్ల
నెలమి మన్ను దినెడు నెఱ్ఱలౌదురుసుమీ, విశ్వ...

మూర్ఖులు వెనుకముందు లరయక సంపదలే తమకు శాశ్వతములని తలఁచి బుద్ధిలేనివారై ఇంటికివచ్చిన యతిథిని త్రిప్పి త్రిప్పి చివరకు అడుగుచిక్కినమన్ను మశానము గలసిన తరకలను బిచ్చము వైతురు. ఆహా! ఎంతటి మూర్ఖులు? వీరు తమయైశ్వర్యములను శాశ్వతము లనుకొందురుగాని యాచకులకు మనము మట్టితో బిచ్చముపెట్టితిమి గదా! ఆపాపమునకుఁ బ్రతిఫలముగా రాఁబోవు జన్మములో మన్నుదిని బ్రతుకు ఎఱ్ఱలై పుట్టవలయునని యోజింపరు. మూర్ఖత మానవుల నెంతయధోగతికిఁ ద్రోయుచున్నది.



ఆ. అవులఁగా మెఱుఁగక యజ్ఞానజీవులు
మూలమును దెలియక ముట్టుచేత
ననుదినము సృజింతు రాత్మఁ దెలియలేక, విశ్వ...

మూర్ఖులు 'ఇదిట్టులగును. ఇయ్యది కాదు.' అని తెలిసికొనలేరు. ఏదేని యొక కార్యము వచ్చిన కారణము నరయలేరు. ఇంతతో నూఱకయైన నుండరు. ప్రతిదినమును తాము విశ్వమున కంతకును శ్రేష్ఠమగు గొప్ప యుపకారమును చేయుచున్నట్టులు సృష్టి చేయుచుందురు. కాని వీరిద్దానినంతయును తెలిసి చేయుచున్నారా? లేదు. వీరు అనాత్మజ్ఞులు తామెవ్వరో తెలిసికొనలేకయే లోకులకు అంటుముట్టుల నంటఁగట్టెదరు.

ఆ. ఆత్మ నెఱుఁగని నుతి యట్టిట్టు చేసిన
వాని మెచ్చువాఁడు వట్టివాఁడె
ముక్కిడిదియుఁ బాడ మొండియు మెచ్చఁడా, వి.

కొందఱు వాచాటులగు స్తోత్రపరాయణులు ఎదటివాని హృదయము గుర్తింపక బహిరంగాకారమునకు మురిసికొని యాడుచుందురు. తనను వంచించుటకై కొనియాడుచున్నారని గ్రహింపక యాస్తోత్రప్రియుఁ డానందించుచుండును. ఈయిరువురు మూర్ఖతలో సమానులు. ఎట్లనెదరా? ముక్కిడిది పాడ నారంభించిన మొండిది మెచ్చుకొనినట్టులే. ఇద్దఱును వికలాంగులే, మూర్ఖులే, కావున ప్రాజ్ఞుఁ డిట్టిమూర్ఖులకు దూరముగా నుండవలెను.

ఆ. అభిజాత్యమున నె యాయువున్నంతకుఁ
దిరుగుచుండ్రు భ్రమలఁ దెలియలేక
మురికిభాండమునను ముసరు నీఁగలరీతి, విశ్వ....

మూఢుఁడు "నేను సత్కులములో పుట్టితిని" అను అభిమానముతో ఆయుష్య మున్నంతవఱకు ఆకులాచారములకు లోనై మెలఁగుచుండునేగాని నేను భ్రాంతిపడుచున్నాను. మోక్షసాధనము కులముకాదని తెలిసికొనఁజాలఁడు. ఉదాహరణము చూడుఁడు. ఒక ముఱికికుండనుచూచిన ఈఁగలు ఆ మురికినిచూచి సంతసించి ముసురుకొనవలయు నని తలంచునే కాని "ముఱికి. ఇది మ్రుక్కు బ్రద్దలయిపోవుచున్నది. మేము తెలివిలేక దీనినే మంచిదానినిగా తలఁచితిమి" అని తమ యజ్ఞానమును తలఁచికొనలేవు గదా!

ఆ. ఆలిమాటలువిని యన్నదమ్ములరోసి
వేఱుపడుచునుండు వెఱ్ఱిజనుఁడు
కుక్కతోఁకఁబట్టి గోదావరీఁదును, విశ్వ....10

మూర్ఖుఁడు తనను చిన్నప్పటినుండి సాకి సంతరించిన తల్లిదండ్రులను అన్నదమ్ములను చూచి యసహ్యించుకొనుచు సంతట నూరుకొనక తనను గంగలోదింపు పెండ్లము మాటలను విని తన వారిని వదలివైచి వేఱుగాఁబోయి కాఁపురము సేయుచుండును. ఎంత తెలివితక్కువ? ఏమనియందురా? తనను కన్నతల్లిదండ్రులే సంతరించలేరని యనుకొన్న యామూర్ఖుఁడు నడుమ నాలుగు రోజులక్రిందవచ్చిన పెండ్లము సంతరించునని తలంచుట తెలివి తక్కువగాదా? ఇట్లు చేయుట నాకుక్కతోఁకను పట్టుకొని, పెద్దయోడలచేత దాఁటఁదగిన గోదావరీమహాప్రవాహమును ఈఁదినట్టు లుండును. కావున బుద్ధిమంతుఁడు ఇట్టివానిని మూర్ఖునిపనులని తెలిసికొని తెలివిగలిగి నడవవలయును.

ఆ. ఆసనం బెఱుఁగక యానామకర్మంబు
గురువుచేతఁ దెలిసి గూర్పకున్న
మనసు నిలుపకున్న మఱి ద్విజుండెట్లగు, వి....

మూర్ఖుఁడు ఎవనినైన నొకని గురువుగాఁ జేసికొనిన యెడల తన కప్రతిష్ఠ యనుకొని తనంత తానే యోగాభ్యాసమునుచేసి ముక్తినొందవలయునని ప్రయత్నించును; స్వస్తిక, గోముఖ, పద్మ, భద్ర, సింహాద్యాసనములను నాతఁడు గురుముఖమున నెఱుంగకుంటచే నాసననిర్మాణమునఁ జేతగానివాఁడగును. వంకరటింకరగాఁ గూరుచుండి మనస్సును నిలుపలేక మూర్ఖుఁడై చెడిపోవును. ఇట్టిది మూర్ఖకృత్యము కావున నోసుమతీ, గురువు నేర్పఱచికొని తద్ద్వారా ముక్తినొందఁ బ్రయత్నింపుమే కాని మూర్ఖుఁడవు అగుటకుఁ బ్రయత్నింపకుము.

ఆ. ఇట్టు ఘటములోనఁ బెట్టినజీవుని
గానలేక నరుఁడు కాశికేఁగి
వెదకివెదకి యతఁడు వెఱ్ఱియై పోవును, విశ్వ....

మూర్ఖుఁడు తనదేహమునందున్న జీవుఁడే పరమాత్ముఁడని

గ్రహింపఁజాలక దేవుఁ డెచటనో యున్నాఁడని యెంచి ఆదైవమును గాంచుటకై కాశికని గయకని తిరిగి తిరిగి యెల్లచోటులను వెదకి వెదకి చివర కితఁడు వెఱ్ఱివాఁడై చెడిపోవుచున్నాఁడు. మిటమిటజ్ఞానము గుటుకున నరుని మ్రింగివేయుననుట నిజము. లేకయున్న నామనుజుఁడు తనశరీరములోనున్న బ్రహ్మమును గానలేక యలతఁజెందునా? కావున మూర్ఖుఁడవు గాక పూర్ణజ్ఞానివై మెలఁగుము.

ఆ. ఇంటియాలి విడిచి యిలజారకాంతల
వెంట తిరుగువాఁడు వెఱ్ఱివాఁడు
పంటచేను విడిచి పరిగ యేఱినయట్లు, విశ్వ....

దేవుఁడు జగత్కుటుంబి. అతనిసృష్టిలో అగ్నిసాక్షిగఁ గైకొన్నభార్య యొక్కతె భోగయోగ్యురాలనియుఁ బరకాంతలు తల్లులనియు మూర్ఖుఁడు భావింపక యజ్ఞుఁడై తనయిల్లాలిని విడిచి పరకాంతలను బట్టుటకుఁ బ్రయత్నములను సేయుచుండును. నిజముఁ బరికించిన నింతకంటె వెఱ్ఱివాఁడు కలఁడా? లేఁడుగదా! వీఁడుచేయునది వెఱ్ఱిపని యెట్లని యందురా? చూడుఁడు. కాఁపువాఁడు తనచేను కనులపండువుగా పండియున్నప్పుడు తన పంటచేనిని విడచి కోసినచేలలో క్రిందరాలిన పరిగగింజలు ఏరినచో నతనిని మూర్ఖుఁడనరా? కావున మూర్ఖతను మొదలంటఁ బోఁగొట్టుకొనవలయును.

ఆ. ఇంద్రియములచేత నగ్గొందుచుండెడు
వెఱ్ఱిమనుజుఁడెల్ల వెదకుశివుని



ఇంద్రియముల రోసి యీశునిఁజూడరా, విశ్వ....

మూర్ఖుఁడు తెలివిలేమిచేత తనకపకారము చేయువారిదగ్గఱఁజేరి వారిని మంచివారినిగా తలంచుచుండునే కాని ద్రోహులను బాఱఁద్రోలఁడు. అట్లె మనుజుఁడు పాపకూపములలోఁ ద్రోయుచున్న యింద్రియములను లోఁబఱచుకొనలేక తుద కింద్రియములచేతనే నానావస్థల నొందుచుండును. ఆహా! ఎంతటిమూఢుఁడు? బుద్ధిమంతుఁడా! నీవట్టులుచేసి మూర్ఖుఁడవై పోక ఇంద్రియములను జయించి యీశ్వరుని గాంచఁ బ్రయత్నించుము. ఎప్పటికిని మూర్ఖకృత్యములను జేయకుము.

ఆ. ఇన్నిజాతులందు నేజాతిముఖ్యమన్
ఎఱుకగల్గువారె యెచ్చువారు
ఎఱుకలేనివార లేజాతినున్నను
హీనజాతియంచు నెఱుఁగు వేమ. 15

తనను ఎదిరిని ఎఱుఁగఁజాలని యజ్ఞులు "ఈ జాతికంటె నది హెచ్చు దానికంటెనిదిలొచ్చు" అనుచు సత్యమును నిర్ణయింపలేక పైఁగా తమతమజాతియే శ్రేష్ఠమైనదియని తగవులాడఁ బ్రయత్నించెదరు. ఇట్టివారె మూర్ఖులు. కావున నోయీ బుద్ధిమంతుఁడా! ఎఱుకగలవార లెట్టితక్కువజాతిలోనున్నను, జ్ఞానహీనులగు నుత్తమజాతివారికంటె నధికులని తెలిసికొని మూర్ఖతను బోనాడుము.

ఆ. ఇహమునందుఁబుట్టి యింగితమెఱుఁగని
జనులనెంచి చూడ స్థావరములు

జంగమాదులనుట జగతినిఁ బాపము, విశ్వ....

మానవలోకములోఁ బుట్టినతరువాత యింగితముగలిగి ప్రవర్తింపవలయును. కొందఱుజనులు ఇంగితమనుమాట మందుకైనను లేకుండ బ్రదుకుచుందురు. ఇట్టివారు నరులా? కారు. వీరిని ప్రాణముగలిగి, పొట్టనింపికొనెడి చెట్టుచేమలవలె స్థావరములలోఁ జేర్పవలయునేకాని జంగమపదార్థములోఁ జేర్చుట తగదు. అట్లు చేయుటవలన పాపముకూడ కలుగును. కావున మానవు లీ లోకములోఁ బుట్టినందునకు జ్ఞానమును సంపాదించికొని మెలఁగవలయును. జ్ఞానములేక మూర్ఖులై యుండరాదు.

ఆ. ఈతగింజవంటి దెఱిఁగియు దానికే
యాసపడును మూర్ఖుఁ డవనిలోనఁ
దోయజాక్షిఁ జూచి తొలఁగంగ వశమౌనె?, వి.

మూరుఁడు కామవికారముచేతఁ గన్నుగానక యాఁడువాండ్రనుజూచి యాసపడుట చెడుపని. స్త్రీలమర్మావయవము తుచ్ఛమగు నీతగింజతోఁ బోల్పఁదగినది. అట్టిదానికై యాసించి ధర్మచ్యుతులము కానేల యని యెఱింగియు మూర్ఖులు స్త్రీజనమునకు వశవర్తులై విషయలోలురై మెలఁగుచున్నారు. వీరికి స్త్రీనిఁజూచి తొలఁగిపోవుట యనువుపడునా? పడదు. కావున సుమతీ! నీవు మూర్ఖుఁడవై విషయములపై నాసపడకుము.

ఆ. ఉత్తతిత్తి దీనియుపయోగములు లేవు



తిత్తికొఱకుఁ జెడును దేవులాడి
కత్తిమీఁదిసాము కడతేరఁబోదయా, విశ్వ....

తెలివితక్కువచేత మనుష్యుఁడు స్త్రీనిచూచి మోహితుఁడగుచుండును. వలదనిచెప్పినను వినఁడు. నిజముఁ బరికించిన నిందేమి కలదు? ఉత్తతిత్తి. దీనితోడ కొంచెమైన నుపయోగములేదు. ఇట్టి వ్యర్థపుఁబనికై దేవులాడి చివఱకు ముప్పుఁ జెందును. స్త్రీలకు లోనై మోక్షము సాధింపలేమా! యని కొందఱనుకొందురు. మోక్షకాములకు స్త్రీసాంగత్యము కత్తిమీఁదిసామువంటిది. కావున, కత్తితోటి ఎకసక్కెముగా సాముఁ జేయువాఁడు కడతేరఁగలఁడా? లేఁడు గదా? అట్టే మూఢుఁడు.

ఆ. ఉన్నదానినిగను మూపిరిబిగఁబట్టి
కన్నుమూసి యేమి కానలేవు
విన్నదన్న దెఱుక విజ్ఞానమని నమ్ము, విశ్వ....19

బుద్ధిమంతుఁడా! మూర్ఖుఁడవై గురువుచెప్పినదానిని ఉన్నదానిని కనుము. అంతియకాని వ్యర్థప్రజ్ఞలకుఁ బోయి ఊపిరిబిగియఁబట్టి కన్నులను మూసికొనియుండకుము. అట్టులయినయెడల ఏమియును దెలిసికొనఁజాలవు. కావున మూర్ఖత్వమును వదలి నేను చెప్పెడిమాటను వినుము. నమ్ముము. జ్ఞానమే బ్రహ్మము. అజ్ఞానమేదియనఁగా: అవినాశియైయుండునది. పెద్దలుచెప్పినది. స్వయముగాఁ గనినది.

ఆ. ఋషులెఱుంగనట్టి విషయంబు భువిలేదు
వారుసెప్పినంత పరుసనగును

తెలియక నెదువారు దేబెలు నిజమయా, వి....

మూర్ఖులు తెలిసికొనలేక పెద్దలనే మూర్ఖులని నిందింపసాగెదరు. పూర్వము ఋషీశ్వరు లాగతానాగతవేదులై ముందే కాలమున నేవిషయ మెటులజరుగునో నిశ్చితముగఁ దెలిసిరి.వారు చెప్పినంత జరిగి తీరును. ఇది నిజము. ఈవిషయమును దెలియలేక వారిని నిందించెడివారు నిజముగా దేబెలే యనుటకు సందేహములేదు. కావున మూర్ఖుఁడవై పెద్దలను నిందింపవలదు.

ఆ. ఎక్కువయును తక్కు వెట్టివి వారికి
తనువు సతముగాదు తథ్య మరయ
నెఱిఁగి తిరుగలేరు వేమన మూర్ఖులు, విశ్వ... 21

జ్ఞానులయినవారలు ఎక్కువతక్కువల నెంచఁగూడదు. సర్వేశ్వరునిసృష్టిలో నెక్కువతక్కువలులేవు. అందఱికిని సమానత్వము నిచ్చియున్నాఁడు. మూర్ఖులు గొందఱు ఈయర్థమును తెలిసికొనఁజాలక తాము శాశ్వతముగా నుందు మనుకొని విఱ్ఱవీగుదురు. శరీరము స్థిరమా? మూఢులు తిరిగితిరిగి ఈ విషయమును గనలేక నిక్కుచుందురు. వారే చెడిపోయెదరు. కావున నోయీ మతిమంతుఁడా! మూర్ఖ్యమునువదలి సర్వసముఁడవై యుండుము.

ఆ. ఎద్దుఁ దెల్పవచ్చు నేఁడాదికైనను
మౌనిఁ దెల్పవచ్చు మాసముననె
మొప్పెఁ దెల్పరాదు ముప్పదేండ్లకునైన,విశ్వ...



బొత్తిగా ప్రపంచమన్న నేమో తెలియని ఎద్దెమనుష్యునికి ఒకసంవత్సరమైనను ప్రయత్నించి జ్ఞానమును గలిగింపవచ్చును. మౌనియై మౌనము వహించి యెదటివాఁడు చెప్పు నంశమునె విననివాని నెటులేని వినునటులఁ జేసి కడ కొక నెలలోనె తెలిసినవానినిగాఁ జేయవచ్చును; కాని చెప్పినంత సేపును విని చివరకు చేయనని పట్టుఁబట్టిన మొప్పెలను(మూర్ఖులను) ముప్పదిసంవత్సరములకైనను తెలిపి జ్ఞానులగాఁ జేయుట యశక్యము.

ఆ. ఎండనీడచంద మెఱుఁగనేరఁడ యోగి
యుండు నెల్లకాల ముర్విమీఁదఁ
దిండిపోతు నాఁగఁ దిరుగుచునుండురా,విశ్వ....

నిజమగుయోగి కష్టసుఖములు సమముగా భావించి యెండనీడలయందు సమబుద్ధితోఁ జరించుచు భూశయనముతోఁ గాలయాపనము గావించుచు దేశదేశములు తిండిపోతు తిరిగినటుల సంచరించుచుండును.మూర్ఖులట్టి నియమవ్రతశీలురగు యోగుల యోగ్యత గ్రహింపఁజాలక వారిని దమతోఁబాటువారిగ భావించుచుందురు. ఇది మిగుల నక్రమము.

ఆ. ఎంతచదువుఁ జదివి యెన్నియో విన్నను
హీనుఁ డవగుణంబు మానలేఁడు
బొగ్గు పాలఁగడుగఁ బోవునా నైల్యంబు,విశ్వ....

సుగుణములకుఁగాని దుర్గుణములకుఁగాని నీచత్వము కారణమే గాని చదువు కారణము కాదు. ఎన్నిచదువులు చదివి

నను నీచుఁడు తననైచ్యమును పోఁగొట్టుకొనలేఁడు. అట్లే మూర్ఖుఁడు కూడ ఎన్నిచదువులు చదివినను, చిలుకలాగున ఎన్ని ధర్మోపదేశములను విన్నను మూర్ఖత్వమును పోఁగొట్టికొనఁజాలఁడు. ఉదాహరణమును జూపుఁడు. బొగ్గును తెచ్చి ఇష్టము వచ్చి నన్నిమారులు పాలతోఁ గడిగిన నలుపు పోవునా? ఎట్లు పోదో, అట్లే మూర్ఖుఁడుగూడ తన చెడుగుణమును మానఁడు.

ఆ. ఎదటనున్నవాని నెప్పుడుగానక
కుదుటివానివెదుకఁ బపరుచుంద్రు
పదటకొండుకులకును భయమేలగల్గదు?, విశ్వ...

మూర్ఖుఁడు బట్టబయలై ప్రపంచమునందంతటను స్పష్టముగా వెలుగుచున్న దైవరూపమును కన్నులార గాంచి సేవింపజాలఁడు, కాని ఎక్కడెక్కడనో మూలలలో దాఁగి వ్యక్తముగాక యున్నదైవస్వరూపమును వెదకుటకుఁ బోవుచు ఒక్కింతయైనను భయంబునొందఁడు. ఇట్టి మూర్ఖులు స్వయముగాఁ దమకుఁ దెలియకున్నను, తెలిసినవారలు తమ్ముఁజూచి ఏమని యనుకొందు రనియైనను భయంపడరు గదా! ఎంతటి సాహసమునవలంబించిరి? ఇట్టివన్నియును మూర్ఖునికార్యములు.

ఆ. ఎలుకతోలు తెచ్చి యెందాకనుదికిన
నలుపు నలుపె కాని తెలుపుగాదు
కొయ్యబొమ్మఁదెచ్చి కొట్టిన గుణియౌనె,వి...26

మూర్ఖుని గుణవంతునిఁగాఁ జేసి వెలయింపవలయుననియెన్ని ప్రయత్నములుచేసి యెన్ని కష్టములను బడినప్పటికిని మూర్ఖుఁడే



చిపఱకు అగునుగాని గుణి కాఁజాలఁడు. ఉదాహరణముఁ జూపుఁడు—ఎలుకతోలు తెచ్చి ఏఁడాది యుతికినను నలుపే గాని తెలుపు రాదు. ఇట్టులే ప్రాణముగలవారిని బలుకరించినఁ బలుకునేగాని కొయ్యబొమ్మను ఎన్ని కొట్టినను బలుకునా? పలుకదుగదా! అట్టులే మూర్ఖుఁడు గూడ గుణికాఁడు.

ఆ. ఒకని జెఱుతు మంచు నుల్లమం దెంతురు
తమకుఁ గలుగుచేటుఁ దా మెఱుఁగక
తమ్ముఁ జెఱుచువాఁడు దైవంబు గాఁడొకో,వి...

తెలివిలేనివారు అంతప్రపంచము తమచేతులలోనే యున్నదనుకొని ఇతరులను "చూచెదు-ఎట్టులుచేసెదమో" అనియును, చెఱిపివేయుదుమనియును, బెదరించుచుందురే కాని తమకు దానివలనకలుగఁబోవుముప్పును గానఁబోరు. విచారించితిమేని మన మొదులను జెఱిచిన మనలను దైవంబు చెఱుపఁడా? కావున బుద్ధిమంతులై మూర్ఖులవలె నితరులను చెఱిపివేయుదుమని యూఁగక సాధుభావమునుఅవలంబించి మెలఁగవలయును.

ఆ. ఓగునోగు మెచ్చు నొనరంగ నజ్ఞాని
భావ మిచ్చి మెచ్చు పరమలుబ్ధు
పంది బురదమెచ్చు పన్నీరుమెచ్చునా?,విశ్వ...

మూర్ఖులు మూర్ఖులను మెచ్చెదరే కాని సర్వమును దెలిసి కాలానుగుణ్యముగా మెలఁగువారలను మెచ్చుకొనరు. లుబ్ధుఁడు తనవలె నున్నలుబ్ధుని జేరి ఆతనిగుణములనే ప్రశంసించుచు మెచ్చుకొనును. ఇట్లగుట తగునా? పరికించుఁడు. పంది వాసన

ద్రవ్యములలో నుత్తమమగు పన్నీరమును పైని చల్లిన మెచ్చుకొనదు; కాని బురదనుజూచి యధికమైనయానందమునుఁ జెంది మెచ్చుకొనును. అట్లే మూర్ఖుఁడును.

ఆ. ఓగుబాగెఱుఁగక యుత్తమూఢజనంబు
లిల సుధీజనముల నెంచఁ జూచు
కరిని గాంచి కుక్క మొఱిఁగినసామ్యమౌ,వి....

ఇది మంచిది. ఇయ్యది చెడ్డది అని ఓగుబాగులను దెలిసికొనలేక వ్యర్థులై మూర్ఖులు సజ్జనులనుజూచి వంకలుపెట్టుటకుఁ బూనుకొని యుందురు. మూర్ఖుల పనులిట్టివే. సందేహము వలదు. రాజవీథిని ఏనుఁగుపోవుచున్నచో, తానెక్కడ? రాజాధిరాజుల యాదరమును బొందినపట్టపేనుఁగు ఎక్కడ? అని యైనఁ జూడక దొంగను జూచినపట్ల కుక్క మొఱుఁగురీతిని మొఱిఁగి తమ తెలివితక్కువను వెల్లడింతురు.

ఆ. ఔనటంచు నొక్కఁ డాడినమాటకు
కా దటంచుఁ బలుక క్షణము పట్టు
దాని నిలువఁ దీయఁ దాతలు దిగవలె, విశ్వ....

మూరులు సాధారణముగాఁ దమకు సంబంధింపకపోయినను అందికొని అనినమాటకు, మంచిదైనను చెడ్డదైనను విపరీతముగాఁ గాదని చెప్పుట మాటమాత్రమున నెఱవేఱుపని; సులభసాధ్యము. ఇంతమాత్రమే వీరిపని. కాని, ఇద్దానిచేత ఫలము ఎట్లు కలిగినను సరే! కాని ఇతరులు చెప్పినమాటను గాదని చెప్పుట కెంతసేపు పట్టును? ఒకక్షణముగూడ పట్టదు; కాని



దానిని నిలుపతీయుటకు వానిచేతఁగాదు సరియేగదా వాని తాత దిగినప్పటికిని నిలువఁ బెట్ట వశముకాదు.

ఆ. ఔర యెంతవార లల్లరిమానవుల్
ప్రభువు నైన గేలిపఱతు రెన్నఁ
దాఁ దెగించువాఁడు దండియౌ భువిలోన,వి...

ఆహాహా! మూర్ఖులపనుల కంతమే లేదు. వారు తమకు నష్టమని కాని ఇతరులకు నష్టమగునని కాని కొంచెమైనను మనంబులో నెంచరు. తమయోగ్యతను ఎదుటియోగ్యతను గనలేక ప్రభువునంతటివాని నైనను పరిహాసముచేయుటకు ప్రారంభించెదరు. వీరు కేవల మల్లరిమనుష్యులు. లజ్జాభిమానములువదలి తెగువచేసి ముందునకువచ్చువాఁడే యీకలికాలమునందు దండివాఁడగుచున్నాఁడు. ఇట్టి యల్లరివాండ్రు తాత్కాలికముగ దండివారుగాఁ గానిపించినను వీరి దుర్నయము మాత్రము దాఁచినను దాఁగదు.

ఆ. కండకావరమునఁ గానఁడు మరణంబు
మదముచేతఁ దత్త్వమహిమఁ గనఁడు
భోగవాంఛచేతఁ బరహరు గానఁడు, విశ్వ...

మూఢుఁడై పెద్దలు "శరీరము లస్థిరములు. గర్వించి కానిపనులను జేయకుము. దేవుని జూడఁ బ్రయత్నింపుము" అని అనేకవిధములఁ జెప్పుచున్నను, మదముచేత రాఁబోవుమరణమును గుర్తింపఁజాలఁడు. తెలివితక్కువచేత తత్త్వముఁ దెలిసికొనఁజాలఁడు. ఎల్లప్పుడు విషయవాంఛలచేతఁ బ్రొద్దు

పుచ్చుచు పాపహరుఁ డగుహరుని సేవింపఁడు. చిరపాపకూపమునఁ గూలును. కావున మూర్ఖతను బోఁగొట్టుకొని ముక్తి నొంద ప్రయత్నింపవలయును.

ఆ. కన్నులందు మదము గప్పి కానరు గాని
నిరుడు ముందటేఁడు నిన్న మొన్న
దగ్ధులైనవారు తమకంటె తక్కువా?, విశ్వ....

కన్నులు పొగరుచేతఁ గన్పింపకపోఁగా భోగములే శాశ్వతము లనికొని అజ్ఞానులై మూర్ఖులు మెలఁగుచుందురే కాని "అయ్యో! నేనేమి గొప్పవాఁడనా? మృత్యువు నెట్లు జయింపఁగల్గుదును? గతసంవత్సరము నిన్న మొన్న చనిపోయిన వారలు నాకంటె ఎందులో తక్కువవారు? వారు చావును జయింపఁగలిగిరా? కావున భ్రమనొందితినే గాని నిజముగా" దని తలఁపరు; మఱియును విషయాసక్తులై యుందురు.

ఆ. కఫము మీఱి మఱియుఁ గనులు మూఁతలువడి
బుద్ధి తప్పి చాలఁ బుడమిమఱచు
వేళలందు నిన్ను వెదకుట సాధ్యమా, విశ్వ...

మూర్ఖుఁడు కన్ను కాలు చేయి చిత్తము స్వాధీనములో నున్నప్పు డెప్పుడును దైవమును సేవింపక వ్యర్థముగాఁ గాలమును గడపి, చివఱకు మరణ మాసన్నమై కనులుమూసికొని పోయి కుత్తుకవఱకు కఫ మెగఁదన్ని బుద్ధి తప్పిపోయి ప్రపంచమునే మఱచి పోవువేళలో భగవంతుని సేవింపఁగలుగునా? సేవింపఁజాలఁడు. దీపముండఁగాఁ బనులు దీర్చికొనవలయునే



కాని చీఁకటిపడినతరువాత నెట్లు చేయనగును? కాఁబట్టి బుద్ధిమంతుఁడై మెలఁగవలయును.

ఆ. కర్మగుణము లన్ని కడఁ బెట్టి నడవమిఁ
దత్త్వ మెట్లు తన్ను దగులుకొనును
నూనె లేక దివ్వె నూవుల వెల్గునా, విశ్వ...35

మనుజుఁడు అజ్ఞానియై చెప్పినను తెలిసికొనఁజాలక కర్మలు కర్మలని మూర్ఖుఁడై కష్టములపాలంబడును. కర్మగుణముల నన్నిఁటిని కడగా పాఱదోలనిది, ఇట్టివానికి తత్త్వమబ్బ గలదా? చాలదుకదా! ఎట్లని యనియెదరా? వినుఁడు. దీపము చక్కగా వెల్గి ప్రకాశముగలిగి వస్తువు లన్నియును గనఁబడ వలయుననుకొనినచమురునుబూర్తిగాఁబోసినయెడల వెలుఁగునే కాని చమురునకు బదులుగా నువ్వులుపోసిన మండునా? మండదుగదా? అట్లే తత్త్వమును చూడవలయు ననిన, కర్మములను బాఱఁద్రోలి ఘనమగు జ్ఞానమును దెలియవలయునే గాని కర్మములఁ జేయుటవలనఁ గూడను తెలిసికొనఁజాలఁడు.

ఆ. కల్లయైన జగము గనుటెల్ల నిజమని
నమ్మి భ్రమను జిక్కి నాతిఁ గూడి
యెల్లజనులు మఱతు రేకాంతుఁ డగుహరి,వి...

ప్రపంచములోని జనులెల్లరును మూర్ఖులవలెనే యగుపడుచున్నారు; కాని ఇందొక్కరుఁడును జ్ఞానము గలవాఁడు గన్పడుటలేదు. ఎట్లనియందురా? చూడుఁడు. ప్రపంచమంతయును అసత్య మని, అనఁగా నస్థిర మని, యందఱికి ప్రత్య

ష్టముగా తెలియును. అయినను జనులందఱు ఈకనఁబడు ప్రపంచమంతయును నిజమని భ్రమపడిరి. ఇంతే గాక నమ్మి పెండ్లి పేరంట మని వెంటఁ దగులుకొనిరి గాని ఒక్కఁడయి నను "దేవుఁడున్నాఁడు. అతనిని సేవింపవలయును. ఆయనను మఱువఁ గూడదు." అని తలంచెనా? లేదుగదా? కావున నందఱును మూర్ఖులే.

ఆ. కసవు దినును గాదె పసరంబు లెప్పుడు
చెప్పినట్టు వినుచుఁ జేయుఁ బనులు
వానిపాటియైన మానవుఁ డొప్పఁడా?,విశ్వ...

మూర్ఖు లందఱును ప్రపంచములో జన్మించుట, తినుట, తిరుగుటకే యని అనుకొనియెదరేగాని, దేవునిఆజ్ఞను శిరసా వహించి చేయవలయునని తలఁపరు. ఏమి వీరిమూర్ఖత్వము? ఇట్టులు మూర్ఖులగుజనులకును బశువునకును భేదమేమి? విచారించిన నిట్టిమనుష్యునికంటె పసరమే గుణముకలదిగాఁ గనుపించును. ఎట్లందురా? తిండి ఇద్దఱికి సమానమైనను బశువు కసవును మేయును. అయినను అది యజమానుని యాజ్ఞను తలఁ దాల్చి చెప్పినట్టు చేయునుగదా! ఇంగితము కలిగిన మనుష్యుఁ డాపాటియైనను జేయవలదా? లేదుకదా? ఇట్టి వాఁడే మూర్ఖుఁడు.

ఆ. కసువులు దినువాఁడు ఘనఫలములరుచి
గానలేఁడు గాదె వానియట్లు
చిన్నచదువులకును మిన్నజ్ఞానము రాదు,విశ్వ...



మూర్ఖుఁడు చిరకాలము తదేకనిష్ఠతో విద్యను సంపాదించువానిని జూచి "చచ్చినదాఁకా చదువేనా? దరిద్రపు చదువు. ఎంతచదివినను ఒకదమ్మిడిని సంపాదింపలేఁడు. నేను కొంచెముచదివినను గొప్పగాధనమును సంపాదించుచున్నా" నని నిందింప మొదలుపెట్టును. అగును. వాఁడు చదివినయల్ప విద్య కంతకంటె జ్ఞానము వచ్చునా?

ఆ కుక్కతోఁక దెచ్చి గొట్టంబుఁ జేర్చిన
క్రోవిచెంతనుండు కొంతతడవు
ఎంతఁజెప్పఁ జెడుగు పంతంబు మానునా,వి...39

మూర్ఖుని తీసికొనివచ్చి ఎన్నియోవిధములం జెప్పి నయమునను భయమునను వాని మూర్ఖత్వమును బోఁగొట్టునుద్దేశముతో నెంత ప్రయత్నించినను వాఁడుచెడుగుతనమును మానికొని నమ్రుఁడై వినునని తలఁపరాదు. ఎట్లనఁగా:-చూడుఁడు. కుక్కతోఁకను దీసికొనివచ్చి గొట్టములో బెట్టినయెడల కట్టినంతసేపే చక్కగా నుండును కాని తరువాతనుండునా? ఉండదు గదా. అట్లె మూర్ఖుఁడును చెప్పినంతసేపును గుణము కలిగియుండునేగాని ఆటుతరువాత నుండఁడు.

ఆ. కుండ చిల్లిపడిన గుడ్డ దోఁపఁగవచ్చు
పనికి వీలుపడును బాగుగాను
కూలఁబడిన నరుఁడు కుదురుట యరుదయా,వి.40

మూర్ఖుఁడు మిక్కిలిపెడసరము గలవాఁడు. పెళుసుగల వస్తువులలో నెల్ల నెక్కువది కుండకదా! అట్టికుండకు చిల్లిప

డినయడల నాచిల్లికి ఒక్కగుడ్డముక్కను దోపి పనిగడచునట్లు ఉపయోగించికొననగును కాని సత్పురుషులయుపదేశమునకును సద్భావమునకును విముఖుఁడై పడినమనుష్యుని అనఁగా మూర్ఖుని కుదుటఁబఱచి యొప్పించుట మాత్ర మలవిగానిపని.

ఆ. ఖరముపాలు తెచ్చి కాచి చక్కెరవేయ
భక్ష్యమగునె యెన్న భ్రష్టుఁడట్లె
యెంతఁ జెప్పి చివర నెసఁగింపఁ బోఁగునే,వి...

నూరు చెప్పినను వేయిచెప్పినను, చదివించినను, మానినను, మూర్ఖుని మంచిచెప్పి మించచేయవలయుననుట యెప్పటికైనను అసాధ్యమే యగును కాని సాధ్యము గాదు. చూడుఁడు. ఆవుపాలు తెచ్చి కాచి చక్కెరవేయ భక్ష్యపదార్థ మగును కాని గాడిదపాలను కొనివచ్చి ఎంతచక్కగా కాఁచినను చక్కెరను వేసినను, తినదగినవస్తువు అగునా? కాదుకదా! వివేకశూన్యుఁడగు హీనుఁడు గూడ నటులె యెంతఁజెప్పినను ఉపయోగమునకు రాఁజాలఁడు.

ఆ. గాడ్దెమేనినిండ గంధంబుఁ బూసిన
బూదిలోనఁ బడుచుఁ బొరలు మరల
మోటువారిసొగసుమోస్తరియ్యదిసుమీ,వి...

మూర్ఖునికి మంచిగౌరవమును చేసినను అసభ్యతయే కలుగుచుండును. అది వానికి స్వభావము. ఏది యెవనికి స్వభావమో దానితో నతనిని సంతోషపెట్టుచుండవలయును. సత్పురుషుల మేనుల నలందవలసినగంధమును గాడిదె యొడ



లికిఁ బూసిన నది సంతసించునా? సంతసించుటకు మారుగా బూడిదలోఁ బడి పొరలాడును. కావున మోటువానికి బోధించినను ఇటులె నిష్ఫలమై పోవునని తెలిసికొని గుణియై మెలఁగవలయును.

ఆ. గుడ్డు వచ్చి పిల్ల గోరడా లాడిన
విధముగా నెఱుఁగక వెఱ్ఱిజనులు
జ్ఞానులైనవారి గర్హింతు రూరక, విశ్వ... 43

తా. మూఢులు, తెలిసినవారిని తెలివితేటలుగలవారిని పోటుమాటలనాడి పరిహాసము లాడుచు నందఱికంటెను ఘనులమని విఱ్ఱవీగుదురు. వీరిజాడఁ జూడఁగా నెట్లున్నదనఁగా గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించి నట్లున్నది. విచారింపుఁడు. పిల్ల గ్రుడ్డుకంటె వయస్సున నైననుఅనుభవమున నైనను అధికము కదా. అట్టి గ్రుడ్డు పిల్లను వెక్కిరించునట్లు జ్ఞానులను అజ్ఞానులూరక నిందించుచు గర్వించెదరు. ఇట్లు చేయుటయే మూర్ఖకృత్యము.

ఆ. గురువునకును పుచ్చుకూరైన నీయరు
అరయ వేశ్య కిత్తు రర్థ మెల్ల
గురుఁడు వేశ్యకన్న గుణహీనుఁడేమొకో,వి...44

మూర్ఖులు తమకు విద్యాబుద్ధులను జెప్పినగురువును లక్ష్యము సేయరు. ఆతఁ డెద్దానినైనఁ గోరిన నీయరు సరికదా పుచ్చిపోయినపుచ్చుకూరైన నీయరు. వీరిభక్తి గురువులయెడ నీరీతిగా నెసఁగుచున్నది. ఇఁక వీరిధనమును భక్తియు నెట్లు సఫలము

లగుచున్నవో వినుఁడు. ఇట్లు గురువులకీయక ఆధనమును పచ్చె భోగముదానిపాలుచేయుదురు. ఆహా! ఎంత మూర్ఖులో చూడుఁడు. గురుఁడు భోగముదానికంటెఁ గుణహీనుఁడా! కాఁడు గదా! కావున నిట్టిమూర్ఖపుపనులను జేయఁగూడదు.

ఆ. గూబ చేర గృహము గునిసి పాడుగఁ బెట్టి
వెళ్ళిపోదు రెంత వెఱ్ఱివారొ
గూబగృహము లేమి కూర్చు నాకర్మంబు, వి...45

మూర్ఖులు తాము స్వయముగా తెలిసికొనలేరు, ఒకరు చెప్పినను వినరు. వారిమౌఢ్యమే మౌఢ్యము. శకునములని శుభములని యశుభములని పేరులను జెప్పికొనుచు ఇంటిలోనికి గూబ హఠాత్తుగాఁ జొరఁబడినదని ఇంటిని పాడుఁబెట్టి మనములో గొణుగుకొనుచు వెళ్ళిపోయెదరు. ఎంత వెఱ్ఱివారో! చూడుఁడు. గూబదిగినంతమాత్రాన నాగృహము ఏమికర్మములను దెచ్చును? వీరి మూర్ఖత్వమే గాని వేఱుగాదు.

ఆ. గ్రాస మింత లేక కడుఁ గష్టపడుచున్న
విద్య యేల నిలుచు వెడలుఁ గాక
పచ్చికుండ నీళ్లు పట్టిన నిలుచునా, విశ్వ... 46

బాల్యమున గురుకులవాసన మొనర్చి శ్రమపడి గడించినవిద్య యాపూట కూటికాదరవులేక తపించుచున్న పండితున కించుకేనియుఁ దక్కదు. స్థితిగతులు సరిగనుండి పొట్టకూటికిఁ బరుల నాశ్రయింపనివానికే జ్ఞాపకశక్తి,వాగ్ధాటి,విద్యావినియోగము తఱుచుగానుండును. ఎట్లనఁగా:ఆవములో కాఁచినకుండలో



నీళ్లుపోసిన నిలుచునుగాని పచ్చికుండలో నీళ్లుపోసిన విఱియక నిలుచునా? నిలువదు. అట్లె మూర్ఖునిపనులుకూడ నగును.

ఆ. చెఱకు తీపి లేమిఁ జెత్త నాఁ బడునట్లు
పరగు గుణము లేనిపండితుండు
దూఱుపడునుగాదె దోష మటుండఁగ,విశ్వ...

ప్రపంచములో పుట్టినందునకు గుణియై మెలఁగవలయును గదా. మూర్ఖులట్టుగాక తమయిచ్చవచ్చిన చొప్పునఁ బ్రయత్నించుచుందురు. కాని ఇందువలన వారు యశము నొందుదురా? యశమునకు బదులుగా దూఱు నొందెదరు. ఎట్లనఁగా- తీపిలేనిచెఱకు చెత్త యనఁబడదా? అట్టులే గుణము లేనిపండితుఁడు-ఇతరులను మోసపుచ్చినందుకు పొందఁదగినపాప మటుండఁగా పై పెచ్చు లోకాపవాదమునకుఁ బాల్పడును.

ఆ. చదివి చదివి కొంత చదువంగఁ జదువంగ
చదువు చదివి యింకఁ జదువు చదివి
చదువు మర్మములను జదువలేఁ డయ్యెను, వి...

చదువవలయును చదువవలయునని చదివిచదివి శక్తియున్నంతవఱకును పుస్తకములను కంఠపాఠముఁ జేసికొని అసలు కావలసినమర్మమును మాత్రము చదువక వదలివేయును. ఇట్టు చేయుట యజ్ఞానిలక్షణము. అయినది కానిది వల్లించి యవస్థపడుటకంటెఁ జదువునందలి రహస్యము గ్రహించుటే ఆవశ్యకము. కావున తెలివితేటలుగలవారలు ఏది ముఖ్యమో దానిని చదువవలయును గాని మూర్ఖులై చెడిపోఁగూడదు.

ఆ. చందమెఱిఁగి మాటఁ జక్కఁగాఁ జెప్పిన
నెవ్వఁడైన మాఱేఁకేల పలుకు
చందమెఱిఁగియుండుసందర్భమెఱుఁగుము, వి...

మూఢులు తమవలన తప్పులేనట్టులును, ఎదుటివాఁడే ఎక్కువ తక్కువగా మాటల నాడుచున్నాఁడనియు విరుద్ధముగా భాషించుననియు నిందల నెవరిపై నారోపించెదరు. ఇది నిజమా? కాదు. ఎట్లని యనియెదరా? చూడుఁడు. అందము చందమును సమయమును సందర్భమును చక్కఁగా నెఱిఁగి మాటలాడ నేర్చియుండినయెడల ఎంతగొప్పవాఁడైనను మేధావియైనను మాఱుబలుకునా? పలుకఁడు. కావున బుద్ధిమంతుఁడై మూర్ఖునిఁ బోలి లేనితప్పులను సజ్జనుల కారోపింపక, అభిప్రాయమును దెలిసికొని సందర్భమునకు తగినట్లు మాటలనాడుము.

ఆ. జననమరణములకు సరి స్వతంత్రుఁడు గాఁడు
మొదటఁ గర్తకాఁడు తుదను కాఁడు
నడుమఁ గర్తననుట నగుబాటు కాదొకో, వి...

మూఢజనుఁడు తనతోనే సకలమును జరుగుచున్నదనియును, తానె యన్నిఁటికిని కారణుఁడ ననియు తలంచుకొని విఱ్ఱవీఁగి లేనిపోనివానిని పైనివేసికొనుచుండును. ఎంతటి తెలివి తక్కువయో చూచితిరా? మనుజుఁడు మొదట పుట్టుటకు తాను కారణుఁడుకాఁడు. పోనీ మృతికి స్వతంత్రుఁడని యందమన్నను దానికిని కాఁడు. ఇటు మొదటను కర్తలేక చివఱను కర్తగాక నడుమ ఎచ్చటనుండియో వచ్చి కర్తనని చెప్పు



చుండుట విచారించిన నవ్వులచేటు కాదా? అగును. కావున మూర్ఖులు గాక జ్ఞానులై మెలఁగవలయును.

ఆ. తగదు తగ దటంచు తగువారు చెప్పిన
వినఁడు మొఱకు చెడును గొనకు నిజము
మునులు చెప్పుధర్మముల మీర నింతెరా! వి...

మొఱకు అగుమనుజుఁ డేదేని చెడ్డపనులను జేయ మొదలు పెట్టినయెడల సత్పురుషులు సాధుబుద్ధితో ''నాయనా! ఇట్లు చేయతగదు తగ''దని తగిన ట్లెల్లవిధములఁ జెప్పినను వినఁడు. వినకపోవుటమాత్రమే కాక తనయిచ్చవచ్చినచొప్పున చేసి చివఱకు చెడిపోవును. ఇది తగును. మహానుభావులైనమునులు లోకోపకారార్థము ధర్మములఁ జెప్పిన విననివారల గతి యింత కంటె నెక్కువ కాఁగలుగునా? కావున మూర్ఖులు గాఁజనదు.

ఆ. తనదు బాగు గోరి ధర్మంబుఁ జెప్పినఁ
దిట్టుచుండ్రు మొఱకు లెట్టయెదుట
గడ్డివేయ పోట్లగొడ్డు కొమ్మాడించు, వి... 52

మూర్ఖులు తాము స్వయముగాఁ దెలిసికొనుశక్తిలేక దుర్మార్గములఁ బడిపోవునప్పుడెవరైనను గరుణామయులై వారిబాగుఁ గోరి ధర్మమును జెప్పుదురేని కృతజ్ఞు లగుటకు బదులుగా కృతఘ్నులై వారియెదుటనే తిట్టుటకు మొదలు పెట్టెదరు. ఇట్లు చేయుచుండుట మూర్ఖులకు సహజమైయున్నది. ఎట్లనెదరా? చూడుఁడు, పొడిచెడి స్వభావముగల పశువునకుఁ గొట్టఁబోక మేఁతవేయఁ బోయినప్పటికిని తనకే మేలు చేయుచున్నాఁడని

సంతసించక కొమ్ముల సాడించి పొడవవచ్చునా? లేదా? అట్లే మూర్ఖుఁడుకూడ మంచి చెప్పినవారిని నిందించ మొదలు పెట్టును.

క. తనలో సర్వం బుండఁగఁ
దనలోపల వెదక లేక ధర వెదకెడి యీ
తనువుల మోసెడు నెద్దుల
మనములఁ దెల్పంగవశమె మహిలో వేమా! 53

మూర్ఖులపనులకు మేరయే లేదు. భగవంతుఁడు సర్వజగములయందు నిండియుండఁగా తనలోఁగూడ నుండఁగాఁ దెలిసికొనలేక గుళ్లలోనుండు నని గోపురములలోనుండునని యును దలఁచి తీర్థయాత్రల పేరును బెట్టికొని దిరుగుచుండుదురు. నిజమును విచారించితిమేని భారమును మోయునెద్దులకును వీరికిని భేదము లేదు. ఎట్లందురా? వీరు శరీరములను మోసికొని ఎద్దులవలె మొద్దులై యుందురు. ఇట్టి వీరికి తెల్పి వీరిచేత నాచరణముఁ జేయించుటకు బ్రహ్మదేవునికైనను వశమగునా? కాదనుట.

ఆ. తన్నుఁ జూచి యొరులు దగ మెచ్చవలెనని
సొమ్ము లెఱవుఁ బెట్టు నెమ్మిమీఱ
నొరులకొఱకు తాన యుబ్బుచు నుండును,వి...

తెలివితక్కువవారలై తమరినే యందఱును మెచ్చుకొనవలయు నని తలఁచికొని ఇల్లిల్లుఁ దిరిగి సొమ్ములను ఎఱవు దెచ్చి పెట్టుకొని కులుకుచుందురు. ఒరులు తమ్ము మెచ్చుకొనినను



మెచ్చుకొనకపోయినను ఎఱువుసొమ్ములతో నిండియున్న తమ యాకారమునకుఁ దామె మెచ్చుకొని యుబ్బొంగుచుందురు. గుణమున్నచో లోకులు తమంతనే మెచ్చుకొని తీరుదురు. పరులు మెచ్చుకొందురని వేషములు వేయుట పరిహాసపాత్రమగుటకే.

క. తలఁ దాఁకినపుడు తలఁతురు
తల క్రిందై పడినయపుడు తలవరు శివునిన్
పలుగాకు లిలను పాజము
కలనాఁ డెన్నరె యదేమి కర్మమొ వేమా. 55

ప్రపంచములో జనులు కాలవశమున నేదేనియాపదవచ్చి తలపైఁబడినపుడు వెఱచి వెల్లికిలఁబడి పరమభక్తులవలె భగవన్నామస్మరణలోఁ బ్రవేశింతురు. ఐశ్వర్యమదముచే నొడలు తెలియక తలక్రిందికిఁ దిరిగినపుడు మాత్రమా ఆపదుద్ధారకుఁ డగుపరశివుని మఱతురు. అట్టివారు కాకులవలె కుక్షింభరు లనుటకు సందియములేదుకదా! లేకున్న కలవాఁడు ఒకప్పుడు కాకపోయిన నొకప్పుడైనను భగవంతుని స్మరియింపవలదా? అదేమి పాపకర్మమో గాని ఆవిషయమునే తలపెట్టరు.

ఆ. తల్లి యున్నయపుడె తనదుగారాబము
లామె పోవఁ దన్ను నరయ రెవరు
మంచికాల మపుడె మర్యాద నార్జింపు,వి... 56

పసిపిల్లలగారాబము తల్లియున్నంతవఱకే సాగును. మాతృదేవి కుమారుని వాత్సల్యముతోఁ దిలకించుచుఁ బెక్కువిధముల

బుజ్జగించుచుండును. "తల్లిలేనిబిడ్డ దాదికి వెక్కసము"న్నట్లు తల్లిలేనిశిశువు నెవరుగూడ ప్రేమతోఁ దిలకింపరు. తల్లియున్నపుడెటుల బిడ్డలు గారాబము చూపవలయునో యటులే మంచికాలములోనే పేరునొంది మర్యాదను ఆర్జించుటకు ప్రయత్నింపవలయును గాని మూర్ఖులు కారాదు.

ఆ. తామసంపుఁబనులు తగవెందులకు నైన
తామసంబు నుడుగఁదగు సుజనుఁడు
తామసంబు నెంచు ధరలోన మూర్ఖుండు,వి...

ఆలస్యముగాఁ బనులు చేయఁదగదు. ఆలస్యముగాఁ జేయుటవలనఁ దప్పక కార్యహాని కలిగితీరును. సుజనుఁడగు వాఁడు ప్రతికార్యము త్వరగాఁ జేయుట కలవాటుపడి కార్యకరణములం దాలస్యము మానవలెను. ఆలస్యముచేసి కార్యమున విరామముఁ జూపువాఁడు తప్పకమూర్ఖుఁడుగా గణింపఁబడును.

ఆ. తుమ్మచెట్టుకు ముండ్లు తోడనేపుట్టును
విత్తులోని నుండి వెడలునట్లు
మూర్ఖునకును బుద్ధి ముందుగా పుట్టును,వి...58

దుర్మార్గులకు దుష్టములగు బుద్ధులు జన్మతోడనే పుట్టును. మూర్ఖులకు గూడను మొఱకుతనము పుట్టుకతోడనే పుట్టును. మధ్య దుర్గుణములలవడుననుట కల్ల. తుమ్మచెట్టు విత్తులోనుండి వెలువడునపుడె ముండ్లు వెంటఁగొనివచ్చును. మధ్యకాలమునఁ దెచ్చుకొనదు. విత్తునుండి మొలక మొలవఁగనే దానికి



ముండ్లుగూడ మొలక లెత్తును గదా. అట్లే మూర్ఖుఁడు గూడ పుట్టుకనుండియే తన మొఱకుతనమును జూపుచుండును.

ఆ. దాన మడసి చేయుదాత దగ్గఱఁజేరి
వక్రభాషణములు పలుకు మొఱకు
చందనతరువందు సర్ప మున్నట్లయా, వి... 59

మూర్ఖులు తమకుఁ దెలియకయు నొరులు చెప్పినవినకయు తాముస్వయముగా మంచిచెడ్డలనరసి దానమీయరు సరికదా పైనయోగ్యతను విచారించి దానమిచ్చుదాతదగ్గఱజేరి వంకర మాటలను బలుకనారంభింతురు. చూడుఁడు.ఎట్లందురో,మంచి వాసనయును చల్లదనమును గలిగినచందనపుచెట్టుపైని సర్పము న్నరీతిగా మూర్ఖులుకూడ నుందురు.

ఉ. తాతజనించెఁగన్యకకుఁ దండ్రులుతాముసుకుండ
గోళకుల్, మాత పరానుకూలినియె మక్కువ
ద్రౌపదిభర్తలేవురుఁ, నీతులు సెప్ప పాండవు
ల నీతులు నిట్టివటంచు నెన్నుచుఁ, భూతల
మందు నెంతయును బూమెలు చేసిరి వెఱ్ఱివేమనా.

భారతకథయంతయు విరుద్ధముగానున్నది. కౌరవ పాండవులకుఁ దాతయగు వ్యాసుఁడు కన్యయగు యోజనగంధికి పరాశరునివలన జన్మించెను. కౌరవులు (భర్తగతించినపిదప) విధవయగు గాంధారికిఁ బుట్టుటచే గోళకులు (గాంధారిజన్మనక్షత్రముంబట్టి విధవయగునని తెలిసి ముందొకగొఱ్ఱెకిచ్చి పెండ్లిచేసి దానిచావుజూచి ధృతరాష్ట్రునకిచ్చి పెండ్లిచేసిరి. ఇందుచే

గాంధారి విధవయని ఐతిహ్యముకలదు) పాండురాజు జీవించి యుండఁగ యమ, వాయు, ఇంద్రాదులవలనఁ గుంతిసంతాన మొందుటచేఁ బాండవులు కుండకులు. వీరికిఁ గూటస్థురాలగు అంబికయుఁ బరానుకూలినియె. ద్రౌపది కైదుగురు మగళ్లు. భారతవీరులగు పాండవులనీతు లిట్టివియై యుండ కవులు వీరికి లేనిపోని గౌరవము గల్గించిరని లోకులు తలంచుచున్నారు.

ఆ. ధర్మమన్న వినరు తనువు నమ్మిననరుల్
యమునివారు వచ్చి యడలఁ జేసి
చొచ్చికట్ట తమరు చొరఁబారఁ గలరొకో, వి...

జనులు సాధారణముగా నెంతటిమూర్ఖులగుదురో విచారించుఁడు. ధర్మమని చెప్పిన విననే వినరు. తమశరీరమే శాశ్వతముగా నుండునని తలఁచెదరే కాని ఇతరము నాలోచింపరు. యమధర్మరాజు భటులు వచ్చి చేసిన పాపమునకు ఫలము ననుభవింపఁ జేయుటకు తీసికొని పోవఁ బ్రయత్నించినసమయములోఁ దమరు తప్పించుకొని పోఁగలరా? చాలరు కదా! కావున మొఱకుతనము మంచిదికాదు.

ఆ. నీటిలోనివ్రాఁత నిలువక యున్నట్లు
పాటిజగతిఁ లేదు పరము లేదు
మాటమాట కెల్ల మారును మూర్ఖుఁడు, వి...62

బుద్ధిమంతుఁడగువాఁడు తానిచ్చినమాటను నెఱవేర్చుకొనుటకు వేయివచ్చినను వేయిపోయినను తప్పకొని తిరిగిపోవఁడు. మూర్ఖుఁడట్లు గాదు. మానావమానములను సరకుసేయక మాటి



మాటికిని మర్యాదను బాటింపక తిరిగిపోవుచుండునే కాని నిలువఁజాలఁడు. ఎట్లనియనియెదరా - అరయుఁడు నీటిపైనివ్రాసిన వ్రాఁత నిలువక చెదరిపోవునట్టులు. కావుననే మూర్ఖుఁడు మోక్షమునొందుటకుఁ దగనివాఁడనియు వానిమాట లెక్కించ రాదనియుఁ బెద్దలు చెప్పుచుందురు.

ఆ. నీళ్లువోసి కడిగి నిత్యము శోధించి
కూడువెట్టి మీఁదఁ గోక కట్టి
యేమిపాట్లొ పడుదు రీదేహమునకయి, వి...63

అజ్ఞానులు దేహము లశాశ్వతములని తెలిసికొనలేక యభిమానము నుంచికొని దినదినమును ఆదేహమునకు పరిచర్య చేసి పెంచుటకై పడరానిపాట్ల నెన్నింటినో పడియెదరు. ఆహా! ఎంత మౌర్ఖ్యము. ప్రపంచములో నింతకంటెను మొఱకుతన మేమికలదు?

ఆ. పరగఁ దానొసఁగఁడు పరులు చెప్పినదైన
నియ్యఁజాలక విధి నెసఁగువాఁడు
పొట్టు తినెడిలండి బువ్వలుపెట్టునా, విశ్వ...64

తనకు ఉపయోగించునది కాసిదైనను తనవస్తువు కాకపోయినను యజమానుఁ డీయుమని చెప్పినను మూర్ఖుఁడు ఈయుటకు ఒప్పికొనఁడు. తాను స్వయముగ నిచ్చెడిది గాదుకదా! యజమానుని వస్తువును ఆతనియాజ్ఞచేతనైనను ఇవ్వవచ్చును కదా! ఈయఁడు. మూర్ఖులస్వభావమే ఇట్టిది. పరీక్షింపుఁడు

పొట్టనుతినియెడిలోభి ప్రజలను బిలిచి యన్నము నొసంగునా? పెట్టఁడు. అట్టులే మూర్ఖుఁడుకూడఁ బెట్టడు.

ఆ. పర్వతవనవాసి పరిణామవర్తన
కూపవాసి కెట్లు గుఱుతుపడును
బ్రహ్మదేవువెంటఁ బ్రాకృతుఁ డరుగునా?,వి...65

మూర్ఖుఁడు పండితుని పరీక్షఁజేయుసామర్థ్యము తనకులేకున్నను పరీక్షించుటకు పూనుకొనును, కాని అంతమాత్రముచేత పండితునిప్రభావము బోధపడునా? పడదు. ఎట్లందురా? అడవులలోను కొండలమీఁదనుండి పక్వములగుఫలములను భక్షించి దినదినమును సుఖమొందుయోగి తత్త్వమును ఒక్కచోటు నొకేబావిలోఁ గూర్చున్నవాసి కెట్లు తెలియును? అట్లే బ్రహ్మదేవుఁ డుత్తమలోకములనున్నాఁడు. నేనును బ్రహ్మమునే. ఆ స్థానమును గనుగొందు నన వలనుపడునా? పడదు.

ఆ. పాముకన్న లేదు పాపిష్ఠి దగుజీవి
యట్టిపాము చెప్పినట్టు వినును
ఇలనుమూర్ఖుఁ దెల్ప నెవ్వరితరమయా,వి...66

క్రూర్యములలో నేమి, హింసాకార్యములలో నేమి, పాపపు తలంపులలో నేమి, పాముకంటె మించినపాపాత్మ మఱియొచ్చటను లేదు. అట్టిపామును గూడ శిక్షించి ఇది యుక్త మిది యయుక్త మిట్లు చేయవలయు నని తెల్పి చెప్పినట్లు చేయు రీతిగా చేయవచ్చును గాని అబ్బబ్బ! ఈభూలోకములో నెవ్వని



నైనను మూర్ఖుని సమాధానపఱచి వానిని మంచిత్రోవలోనికిఁ ద్రిప్పుటకు వలనుపడదు.

ఆ. పుట్టుఫలము లేని పురుషాధములు భువిఁ
బుట్టనేమి లేక గిట్టనేమి
పుట్టలోన చెదలు పుట్టదా? గిట్టదా? విశ్వ...67

ప్రపంచములోఁ దాముపుట్టిన దెందులకో ఎట్లు ప్రవర్తించిన తమపుట్టుకకు ఫలము గలుగునో కొంచె మైనను ఆలోచించక తమతమ యిష్టమువచ్చినయట్టులు ప్రవర్తించుచుండెదరు. ఈరీతిగా పుట్టినఫలము లేని యాచెట్టలు ఈలోకములోన పుట్టినను సరియే గిట్టినను (అనఁగా: చచ్చినను) సరియే. ఎందువలన ననియందురా? పుట్టుకకు సంఖ్యాపూరణము ప్రయోజన మైన యెడల దినదినమును పుట్టలో నెంత చెదలుపురుగులు పుట్టుట లేదు. ఎన్ని గిట్టుటలేదు?

ఆ. పొట్లకాయ రాయి పొడుగుత్రాటను గట్ట
లీలతోడ వంక లేక పెరుఁగుఁ
గుక్కతోఁకఁ గట్ట గుదురునాచక్కఁగా?వి...68

ఎన్ని కష్టములకోర్చి ప్రయత్నించినను అసాధ్యుఁ డగుమూర్ఖుఁడు మూర్ఖుఁడే యగునుకాని మఱియొకరీతి కాఁజాలఁడు. ఇట్టిప్రయత్నములు గుణియందు సఫలములగునే గాని ఇతరుల యందు కావు. ఎట్లనఁగాఁ బొట్లకాయను రాతిని వ్రేలాడఁ గట్టినయెడల నది నిడుపుగా వంకయొకింతయును లేక పెరుఁగునేగాని పుట్టుకతోడనే వంకఁబాఱిన కుక్కతోఁకకు వెదురు

శ్రద్ధలనువైచి యెంతకుదురుగాఁ గట్టినను చక్కఁగా నిలు వనేనిలువదు.

ఆ. బట్టిపెట్టి నాల్గు బానలచమురుతో
వండి శుద్ధిచేయ దండి యగునె
పుట్టువందుకలుగు పూర్వపుణ్యంబున్న, వి...69

గుణముగాని దోషముగాని రూపముగాని పాపముగాని ప్రతిమనుష్యునికిఁ బుట్టుకతోడనే పుట్టుచున్నది గాని దానిని మధ్యకాలమున నెంత ప్రయాసపడి మార్పఁదలఁచినను మాఱదు. అట్లే మూర్ఖునికిఁ గూడను చూడుఁడు. ఒకవస్తువు మలినముగా నున్నదని యనుకొనుఁడు. దానినిబట్టివేసి నాల్గుబానలచమురు లోఁ గాఁచి వండి శుభ్రము చేసినమాత్రానమంచిది యగునా? కాదు. పూర్వపుణ్యమేమాత్రముండినను అయ్యది పుట్టుకలోనే కలుగుచుండును.

ఆ. బండుబూతులాడు పరమనీచుండెన్న
దండివారిమేల్మి తా నెఱుఁగునె
చందనంబు ఘనత పంది యేమెఱుఁగును?వి...70

గొప్పగొప్పవారినిసయితము మూర్ఖుఁడు అనను విన నశక్యములగుబూతులనాడుట కారంభించును. కాని వారికుండెడి గౌరవము మంచి మొదలగువానిని గ్రహింపఁగలఁడా? లేఁడు. ఎట్లనియెదరేని పరికింపుఁడు. బురదలోనున్నపుణ్యము నెఱుఁగఁ గలదేగాని పంది చందనమునకుండినగొప్పను గ్రహింపఁగలదా?



లేదు. అట్టులనే మూర్ఖుఁడుగూడ తనకున్న నైచ్యమును దెలిసికొనలేక పెద్దలను దిరస్కరింపఁబూనుకొనును.

ఆ. బౌద్ధమతమువారు బుద్ధి దైవం బని
యెచ్చుతక్కు వాడి తుచ్ఛమతిని
గాడ్దెల గుమివలె గ్రక్కునఁబడుదురు,వి... 71

బౌద్ధులంతటిమూర్ఖులు ఇఁక నీప్రపంచములో మఱియెవ్వరును లేరు. వారు భ్రమసి మూర్ఖులై 'బుద్ధియే దైవము. బుద్ధి జనితములగుకోర్కులే దైవసంకల్పము' లని చెప్పుచు ఎక్కువ తక్కువమాటలను ఆడి బుద్ధిహీనులై గాడిదలవలె తలవంచుకొని ముందువెనుకలులేక యొకరివెంట నొకరు అతిశీఘ్రముగా బతనులగుదురే గాని పరమార్థమును గనలేరు. ఇట్టివారలే మూర్ఖులని యెఱుఁగునది.

ఆ. మఘవుఁడైన నేమి మర్యాద యెఱుఁగని
వారలేల తెలిసి గౌరవింత్రు
ఉరిమి మొఱుఁగుకుక్క యోగినెఱుఁగురా?వి.

మూర్ఖులెంతటిధనధాన్యసంపదలఁ దులతూఁగుచున్నను అతిథుల నార్యులను సత్కరింపనే సత్కరింపరు. ఆగతుఁడు దేవేంద్రునంతటివాఁడైనను వారు తెలిసికొని గౌరవమును జేయుదురా? చేయరు. ఏలయనఁగా వారియోగ్యత యంత వఱకే. ఎటందురా! చూడుఁడు. గ్రద్దురిమి మొఱుఁగుచు పైని బడఁబోవుకుక్క యెన్నఁటికైన అయ్యో!పారపడిలిని. నిష్కాముఁడు, భగవంతునితో సమానుఁడునగు మునీశ్వరుని కఱవఁ

బోవుచున్నానని భావించునా? అట్టులే మూర్ఖుఁడుగూడనని తెలిసికొనునది.

ఆ. మంచివారు లేరు మహిమీఁద వెదకినఁ
గష్టులెందఱైనఁ గలరు భువిని
పసిడిలేదు కాని పదడెంత లేదయా, వి... 73

ప్రపంచము నంతను పట్టుబట్టి వెదకినను అందఱును మూర్ఖులే యగపడుచుందురుగాని మంచివా రొక్కరైనను దొఱకరు. కాని కష్టాత్ములు వలయునేని ఎందరైనను దొరకఁగలరు. ఎట్లనఁగా నిదానించి చూడుఁడు. లోకములోన వెదుకఁబోయిన బంగారము లేదుగాని బంగారమునకు బదులుగా బూడిదకావలయునన్నచో ఎంతయైన నుండుటలేదా? అట్లే మూర్ఖులుగూడ.

ఆ. మంత్రమెల్ల మఱచి మధురాధరముఁ గోరి
ఎట్లు మొఱకుఁ డోడయు నెఱుఁగఁ గలఁడు
ఉవిదఁ జూచి పరమయోగంబు మఱచును, వి...

మూర్ఖులకు ఎన్నిమాఱులు ఎన్నిదివ్యమంత్రముల నుపదేశించి విషయసుఖములఁ గోరక తరించుమని చెప్పినను ఫలము లేదు. వాఁడు చెలువపలపెదవిఁ దిలకించినంతన కామాంధుఁడై మోహమునఁ దన్నుఁ దామఱచును. ఇట్టివాఁడు గురునిబోధనము గురునిశక్తి సామర్థ్యము లెటులగ్రహింపఁగలఁడు. ఈచేసిన బోధల నన్నిటిని యువతిని జూచునంతవఱకు స్మరించును.



చూచెనా ఇఁక యోగమునైనను వెంటనే మఱచిపోవును. ఇట్టి లక్షణములు మూర్ఖులవని తాత్పర్యము.

ఆ. మర్మ మెఱుఁగలేనిమనుజు లెల్లరు నిట్లు
మాలదాసరులకు మడుపు లిచ్చి
మహిని గాచునట్టిమనుకులం బెఱుఁగరు, వి...75

ప్రపంచములోఁ బుట్టి పరమార్థము నెఱుఁగనివందలు మాలదాసులపాదముల నాశ్రయించికొని మర్మమును దెలిసికొనలేక మడుపుల నిచ్చి చెడిపోయెదరే కాని తామెంతటియుత్తమక్షత్రియుఁడగు మనువంశమున జన్మించిరో తమ కెంతటినీచుఁడగుమాలవానిగురుత్వ మబ్బినదో యని యైన నాలోచింపరు. ఇట్టివారలే మూర్ఖులు.

ఆ. మాటలాడఁగలుగు మర్మము లెఱిఁగిన
పిన్నపెద్దతనము లెన్నవలదు
పిన్నచేతిదివ్వె పెద్దగా వెలుఁగదా? వి... 76

మూర్ఖులు పిన్నలు పెద్దలని ఎంచెదరే కాని తెలివితేటలను జూడనే చూడరు. ఆహా! ఎంత తెలివితక్కువ! కావున బుద్ధిమంతులగు నరులారా! ఎవ్వఁడు మర్మముల నెఱిఁగి మాటలాడ నేర్చునో వాఁడే మనకు పెద్ద యగును గాని చిన్నపెద్దతనములను ఎంచఁడు. ఏల యని యందురా? జ్ఞానము ప్రధానము గాని ఒడ్డుపొడుగు వయస్సు ముఖ్యము కాదు. చూడుఁడు. చిన్నవానిచేతిలో దీపము పెద్దదిగా వెలుఁగదా?

ఆ. ముక్కుఁ ద్రాళ్లఁ గ్రుచ్చి ముఱికి పోవఁగఁ దోమి
కచ్చనీరునించి కడిగికడిగి
డొక్కఁదోమినంతదొరకునా మోక్షంబు? వి....77

యోగులు కొందఱు మూర్ఖులై యోగాభ్యాసమని ముక్కులలోనికి గుడ్డల నెక్కించికొని ముఱికిపోవునట్లుగా తోముకొని గోచిని శుభ్రముగా నుదికియుదికి డొక్కనుకడుగుకొని నిక్కుచుందురే కాని తాము అజ్ఞానులై పోవుట నెఱుఁగరు. డొక్కతోమినంతమాత్రమున మోక్షముదొరకునా? దొరకదు.

క. ముంటఁబోటుల మాన్పను
మం దెందైనను గలుగును మహిలోపల నీ
నిందలఁబోటులు మాన్పను
మం దెచ్చటనైన గలదె మహిలో వేమా. 78

రణరంగమున నెదురుగనిల్చియుండి విరోధి యీటెతోఁ బొడిచిగాయపఱచెనేని మనమాప్రణమును మాన్పుకొనుటకు మందు కలదు గాని నిందలనుపోటు లుపయోగించు మూర్ఖుల యొక్క తెలివితక్కువను పట్టుదలను మాన్పుటకు మందు ఈ ప్రపంచములో నెచ్చటనైననున్నదా? విచారించిన లేదని స్పష్టమగుచున్నది. కావున మొఱకుతనమును బుద్ధిమంతుఁడై పోఁగొట్టుకొనవలయు.

ఆ. మ్రాను దిద్దవచ్చు మఱివంక లేకుండ
దిద్దవచ్చు రాయి తిన్నగాను
మనసు దిద్దరాదు మహిమీఁద నెవరికి, వి... 79



దినదినమును పెరుఁగుచు ననేకములగువంకలుగా తిరుగుచుండు మ్రానునైనను వంక లేకుండ దిద్దగా వచ్చును. అట్టులే అతికఠినమునైన రాతినిగూడ దిద్ది మనయిచ్ఛవచ్చినరూపము నేర్పఱుపవచ్చును. కాని ఈభూలోకములో ఎంతటినేర్పుగలవారికైనను పెడతిరిగినమనస్సును ద్రిప్పగారాదు.

ఆ. మృగముమృగ మనుచును మృగములఁ దూషింత్రు
మృగముకన్నఁ జెడుగు మూర్ఖుఁ డగును
మృగముకున్న గుణము మూర్ఖునకే లేదు, వి...

లోకములోని జనులు ఏవైనను దప్పులను జేయుచుండు వారిని జూచినప్పుడు కేవలము పశుప్రాయుఁ డనియును, మృగమనియును దూషించుచుందురు, కాని అట్టివారు మృగములు కారు. మృగములుకూడ జ్ఞానము కలవి కనుక నవి నిందింపఁ దగినయవి కావు. ఇఁక ఎవరు గుణహీనులందురా? విచారించితిమేని మృగముకంటెను గుణము మూరునకే లేదు. అనఁగా: పశువుకంటెఁ బశువు మూర్ఖుఁడు.

ఆ. యౌవనమునఁ జూడ నది యెఱుకే లేదు
యౌవనంబు నెంతు రధికముగను
యౌవనంబు తనకు నందకయే ముంచు, వి... 81

జనుఁడు స్వతంత్రుఁడగుటకు యౌవన మింకను రాలేదని చెప్పుచుందురు, కాని ఎంత తెలివితక్కువవారో చూడుఁడు. వారు అనుకొనినయట్టులు యౌవనము వచ్చినప్పుడు "తాను కర్మబంధములో నుండెననియు, దానినుండి విడిపించుకొనవల

యునవియు'' జ్ఞానము వానికి లేనేలేదు. కావున ఏయౌవనోదయమును స్వతంత్రతకై కోరునో అది తనకు తెలియకయే ముంచును.

ఆ. రాజుమా టనవలె రసికుఁ డాడఁగవలె
నెంతపనికి నుబికి యెగురరాదు
కదిసి యెగిరెనేని గ్రహసమానము గాదె
దొడ్డకొంచెమేల దొరకువేమ ? 82

ఆసాధ్యమగు కార్యము నిర్వహించెదనని పలుకుటకు, పలికినది సమర్థించుటకు రాజేతగినవాఁడు. సభయంతయు నానందించునటుల మాటలాడవలయునని మనోరంజకముగ మాటలాడ నేర్చిన రసికుఁడే మాటలాడవలయును. ఇతరులు రాజులవలెఁ గార్యముల నిర్వహింతుమని యెగిరినచో రసికులవలె భాషింపఁగలమని నిక్కినచో వారొకగ్రహముతో (అనఁగా: పిశాచముతో) సమానులు కారా? కావున బుద్ధిమంతులు మూర్ఖులవలె స్వాహంభావమును వహింపరాదు.

ఆ. ఱాయిరూపుఁ జేసి రాజుల మ్రొక్కింప
వన్నె కెక్కునటవె వైభవంబు
కర్త యెవ్వఁ డనుచుఁ గానరు మూర్ఖులు, వి....83

రాజు అనుమతించినది ధర్మమని కొందఱు మూర్ఖులగు నాస్తికులు ఱాతివిగ్రహమును జేసి రాజులచే దండములను బెట్టించి "రాజంతటివారే నమస్కరింపఁగా మీరేల నమస్కరింపరు?" అని జనుల నిర్బంధించెదరు. విచారించిన నింతకంటె మూర్ఖులు



లేరు. రాజు మ్రొక్కినంతనే వైభవము వచ్చునా? రాదు. ఎవఁడు కర్త? ఎవ్వఁడు భోక్త? యని కొంచెమైనను ఆలోచింపరు గదా మూర్ఖులు.

ఆ. లెక్కలేనియాశ లీలమై యుండఁగాఁ
దిక్కుయెత్తినరుఁడు తిరుగుఁగాక
కుక్కవంటిమనసు గూర్చుండనిచ్చునా? వి....84

మూర్ఖుఁడై ఇంద్రియములను జయింపలేక మనంబులోని యాశ పిశాచమువలె పేఁగి లాగుచున్నప్పుడు తిక్కపట్టినవానివలె తిరుగుటకే ప్రయత్నించును గాని యొదిగి కూర్చుండలేఁడు. ఛీ! ఎంతనీచత్వము? మనస్సు కుక్కవంటిది. అది కూర్చుండ నిచ్చునా? మూర్ఖులు దీనిని నిలుపలేక తిరిగెదరు. మందలింపఁ జాలరు.

ఆ. వనములోనఁ దిరుగువరమహాను లైనను
మనసు కుదురకున్న మమతచేత
చెడుదు రన్న మొఱకు చెడుటేమి లెక్కరా? వి.

మహామహామునులే అడవిలో దిరిగి ఆకు లలము తినువారలే ఒకచోట కూర్చుండి మనస్సును నిల్పలేక మమత్వముచేత చెడిపోవుచున్నారని చెప్పినపుడు జ్ఞానమే లేక శుద్ధమూర్ఖులైయున్న నరులు చెడిపోవుచున్నారని చెప్పుట యొకలెక్కయా?

ఆ. వాచవికిని మొగము వాచినయట్టులు
నదియు నదియుఁ దినఁగ మొదలువెట్ట
మరల దింక బుద్ధిమర్యాదపోయిన, వి.... 86

మూర్ఖుఁ డగునరుఁడు ఇంద్రియముల స్వభావమును గని పెట్టలేక నోటియసహ్యత పోవుకొఱకని దానిని దానిని తిన మొదలుపెట్టెనేని ఇఁక వానిజన్మములో నాబుద్ధి మరల వాని స్వాధీనము కాదు. ఇది నిశ్చయము. ఏలయని యనెదరా? ఒక మారు మర్యాదపోయిన నిఁక ఎన్నిమారులు రమ్మన్నను వచ్చునా? రాదుగదా.

ఆ. వాడవదినె కేల వావివర్తనములు
చాడిగాని కేల సత్త్వగుణము
మూఢమతుల కేల మడముతో జ్ఞానము, వి....87

అజ్ఞానులై తాము మునిఁగినదే గంగ యనుకొనువారలకు ఎన్నిచెప్పినను గుణము వచ్చునా? గుణముగా నుండుట యవసర మనియైనను తోఁచునా ? తోఁచదు. తోఁచినను నిష్ప్రయోజకములే యగును. ఎట్లందురా? చూడుఁడు. బోగముపడుచునకు వావివరుసలు ఎందులకు ? నిష్ప్రయోజనము. అట్లే చాడీలు చెప్పెడివానికి సాత్త్వికగుణ మెందులకువలయును ? ఈరీతిగానే మూర్ఖులకు జ్ఞానమెందులకు ?

ఆ. వాదబుద్ధిచేత వాదంబు లాడఁగాఁ
బూనియుందురయ్య పుడమిలోన
కర్మమార్గమునను గడతేరలేరయా, వి... 88

మూర్ఖులెంతదూరము చదివినను ఎంతగొప్ప ధనమునొందిన నేలోకమునకు సత్యముఁ జెప్పఁబూనుకొనక చేతనైనంతవఱకు వాదప్రతివాదములనే చేయ నిశ్చయించెదరు; గాని తనవలన



నైనంతమట్టుకు కాయికవాచికమానసికకర్మముల ద్వారా సంసారమును వదల్చుకొని కడతేరవలసియుండుటను తెలిసికొనఁ జాలరు. తెలిసికొనినను కడతేరఁజాలరు.

ఆ. విష్ణుభక్తులెల్ల వెలిబూదిపాలైరి
వాదమేల? మతవిభేదమేల ?
తెలియ లింగధరులు తిరుమణిపాలైరి, వి.... 89

మూర్ఖులగు జనులందఱును మాదివైష్ణవము, మేము విష్ణుభక్తులము. మాదిశైవము, మేము శివభక్తులము. మేమే గొప్పవారము. అని దెబ్బలాటలకు భేదములు సేయుటకు బయలుదేరెదరు. ఎంతవెఱ్ఱి! ఈవైష్ణవము గాని శైవము గాని చివరవఱకు నిల్చుమతములా? కావు. నడుమంత్రపువిచూడుఁడు. విష్ణుభక్తులు వెలిబూడిదెపాలును, లింగధారులు తిరుమణిపాలు నైరి. కావున మూర్ఖులు కాఁజనదు.

క. వెయ్యారునదులజలములు
తియ్యక మఱిమునుగఁ బోవఁ ద్రిప్పటకాదా
కొయ్యగులాముకు జ్ఞానము
వెయ్యైనను తెలుపలేము వినరా! వేమా! 90

మూఢులు ఎన్నియో తీర్థములని పేరులఁ బెట్టుకొని వేలకొలఁదినదులలో మునుఁగఁబోయెదరు. విచారించిన నిది కాళ్లత్రిప్పటయే గాని లాభము కాసంతగూడ లేదు. ఈవిషయముఁ జెప్పినను మూర్ఖులు వినరు. ఎందువలన నందురా? ఎన్ని

చెప్పినను వినక కొయ్యవలెఁ దగసీలుగుబానిసకు నూఱుచెప్పి కడకు వెయ్యిచెప్పి తెలివిని గలిగింపఁగలమా ? లేముగదా !

ఆ. వెఱ్ఱివేషములను వేసికోఁబోకుము
కఱ్ఱికుక్క తెలుపుగాదుసుమ్ము
పుట్టిలోనిగుణము వూడ్పింపఁజనవలె, వి...91

సుమతీ! బుద్ధిమంతుఁడవై యుండుటకుఁ బ్రయత్నమును జేయుమే కాని ఎప్పటికైనను వెఱ్ఱివెఱ్ఱివేషములను వేసికొని మూర్ఖుఁడవై పోకుము. నల్లకుక్క కెన్ని ఔషధములను వేసి తోమినను తెలుపురాని యట్టులే ప్రకృతితోఁ బుట్టినగుణము పూడ్చిపెట్టినయెడలనే పోవునుగాని ఘటమున్నంతవఱకుఁ బోఁజాలదు.

ఆ. శక్తిమహిమ సోఁకి చెడిరయా పురుషులు
ముక్తిమహి మెఱుఁగక మూఢులగుచు
ఆదిశక్తిగూడ నన్యాయమైపోయె, విశ్వ....92

జనులు శక్తిపూజ యనుపేరున బ్రమసి తుచ్ఛసౌఖ్యముల మరఁగి నిజమగుముక్తికున్నమాహాత్మ్యమును దెలిసికొనఁజాలక మూర్ఖులై చెడిపోయిరి. వీరాశ్రయించి మతముపేరట దురాచారము లారోపించుటచేఁ బ్రకృతిస్వరూపిణియు దేవదేవియునగు నాదిశక్తిసైత మపకీర్తి పాలైపోయినది. మూర్ఖత ఎంతటిహానిని గూర్చుచున్నదో చూడుఁడు.

ఆ. శివునిమంత్రమె యగు శ్రీహరిమంత్రము
తెలిసి తెలియలేరు తిక్కనరులు



దేవుని మఱచి తమదేహమే యందురు, వి... 93

మూఢులగు తమకు దెలియకయున్నను ఒకరు చెప్పినసైనను వినవచ్చునుగదా! ఆమాత్రమునుగూడ చేయరు. చూడుఁడు. మతాభినవగ్రహావిష్టులు కొందఱు శివమంత్రము వేఱు, విష్ణుమంత్రము వేఱు అని భేదము నారోపించుచు తెలిసి తెలియనివారగుచున్నారు. దేవుని మఱచిపోదురు. ఇట్టివారు చివరకు తమదేహమే దేవుఁడని చెప్పఁబూనెదరు. అహాహా ! ఎంతటితిక్కవారో పరికించితిరా !

ఆ. శ్రవణపుటములున్న సార్థక్య మేమిరా
వినఁగవలయుఁ బెద్ద లనెడివన్ని
వినఁగ వినఁగ నీకె విశదంబులౌ సుమ్ము, వి....94

బుద్ధిమంతుఁడవై విద్యావృద్ధులగుపెద్దలు చెప్పెడిసద్వార్తల నన్నిటిని వినవలయును సుమా ? అట్లు సేయకున్న నీకు చెవులుండినందునఁ గలుగుఫల మిసుమంతయును లేదు. ఈరీతిగా వినఁగా వినఁగా అన్నియును నీకే విశదములు కాఁగలవు. కావునత్వరపడి యజ్ఞానముచేత తెలిసినది కాదనియుఁ జెప్పలేకపోయిరనియు నిందింపఁబోకుము. అట్లు చేయుట మూర్ఖకృత్యమగును.

ఆ. సత్యము విడనాడి సాహసంబులుఁ జూపి
బంటుపంతమాడు బత్తి లేక
కర్మజీవి తాను గానంగలేఁడయా, విశ్వ.... 95

దిట్టయై మూర్ఖుఁడు తనయిష్టము వచ్చినచొప్పున తిరుగుచు యథార్థమును మాటలాడుటను మానివైచి సాహస కార్యముల నాచరించుచు తనకుఁ దెలియనివిషయములయం దైనను బంతములను బలుకుచు దేవునియందు భక్తి యిసుమంత యైనను లేక సంచరించును. కాని తాను కర్మలఁ జేయఁదగిన జీవుఁడుమాత్రమే గాని ఆకర్మములకు ఫలములనిచ్చువాఁడు గూడ తానే యగునా? కాఁజాలఁడు. కావున నాముష్మికముల నిట్టిమూర్ఖుఁడు దుఃఖములపాలగును.

ఆ. సాధుచరిత యైనసతిసత్ప్రవర్తన
జార యే మెఱుంగు సాధుజనుని
బ్రహ్మనిష్ఠ మొఱకు ప్రాకృతుఁ డెఱుఁగునా?వి....

మొఱకులు పండితశిరోమణుల నెల్లరను వారిని వీరిని అను లెక్కలేక నిందలు పల్కుటకు ప్రారంభింతురు. అయ్యది వాని యజ్ఞానమునే బోధించునుగాని దానివలన పండితున కొక్కింతయైనను లోపము లేదు. ఎట్లనఁగా:-పతివ్రత యగు స్త్రీనిం జూచిన రంకులాడి ఆమెసత్ప్రవర్తనను దెలిసికొనఁజాలునా? లేదు. బ్రహ్మనిష్ఠులగు ప్రాజ్ఞుల మాహాత్మ్యమును మూర్ఖుఁడు నెఱుంగఁజాలఁడు.

ఆ. హీనుఁ డెన్నివిద్య లిల నభ్యసించిన
ఘనుఁడు గాఁడు మొఱకుజనుఁడె గాని
పరిమళముల గర్దభము మోయ ఘనమౌనె?వి.97



నీచుఁ డగువాఁడు ఎన్నివిద్యల నెంతెంతగొప్పవానిని అభ్యసించినను వానినీచగుణము పోఁజాలదు. అట్టినీచుఁడు విద్యాభ్యాసమాత్రముచేతను మూర్ఖుఁడే యగునుగాని ఘనుడుకాఁజాలఁడు. ఎట్లనఁగా: మంచిమంచిపరిమళవంతములగువస్త్రములను మోయుచుండినమాత్రమున గాడిద గొప్పదియగునా? కాదు గదా!

# దాంభికపద్ధతి.

---

అవతారిక. దాంభికులు అనఁగా:—లోకులను అసత్యమతములయందు ప్రవేశపెట్టుటకై లేనిపోని వేషములను వేసికొని మోసముచేయుటకుఁ బూనుకొనెడివారు. అట్టివారు తాము చేయుపనులయందు తమకే శ్రద్ధాభక్తులును నమ్మకమును లేకపోయినను జనులను మోసపుచ్చుటే చరితార్థమని తలంచుచుందురు. అట్టివారిని బుద్ధిమంతులు నమ్మరాదు. పూర్వాపరములను విచారింపకవారు చెప్పినట్లు చేయరాదు. కావున నా దాంభికు లెట్టివారో వా రెట్లు మోసమును జేయుదురో ఈ పద్ధతిలోఁ దెల్పుచున్నాఁడు.—

ఆ. అచ్చువేసికొన్న నడియేని యన్నను
తమ్ముఁ దిన్న పంగదాసుఁడ నన
భాగ్యవశత గాని బ్రదుకులు లేవయా, విశ్వ....

తాత్పర్యము. మనుష్యునికి దేవుఁడెద్దానిని సంపదనుగాని ఆపదనుగాని నియమించెనో అదియే కలుగునుగాని స్వప్రయోజకత్వముచేత సాధించుటకు వీలుపడదు. కావున శంఖచక్రాదిముద్రలను బుజముపై నంటించికొనినను, వైష్ణవ ప్రపత్తినిజూపి "అడియేన్ దాసన్" అని దొంగదండములు పెట్టినను, ఆచార్యులప్రసాదమని యెంగిలితినినను ఏమియుఁ బ్రయోజనము లేదు. భాగ్యముకలుగవలె బ్రతుకవలెనేగాని పట్టిదంభము కూడదు.

ఆ. అందు నిందు వెదకి యనుభవ మందక
కొంపలయ్యె లెపుడు కొంగవలెను
మూర్ఖతపముఁ బూని మురియుట గానవా, వి.

"ఆపుణ్యక్షేత్రములో దేవుఁడు కనుపడును. ఈపుణ్యక్షేత్రములో కనుపడును" అని కొందఱు అజ్ఞానులు దేశములన్నియుఁ గాకివలెఁ దిరిగితిరిగి వేసారి కడకుఁ దమశ్రమకుఁ దగినఫలమెట్టిదియు నొందలేక కొంగలాగున నిలుచుండి తపస్సుఁ జేయుచు శుష్కించిపోవుచున్నారు. ఓయీ! నీవు చక్కఁగా పరికించి చూడుము. అందువలన కొంచెమైనను బ్రయోజనములేదు కావున మూర్ఖుఁడవు కాకుము.

ఆ. అధిక మైనయజ్ఞ మల్పుండు తాఁ జేసి
మొనసి శాస్త్రములని మురువు దక్క
దొబ్బ నేర్చుకుక్క దుత్తలు మోచునా? వి....



అల్పుఁడు తెలివితక్కువచేత యజ్ఞము నధికమని తలంచి దానినిచేసి శాస్త్రప్రకారము చేసితిమని సంతసము నొంది పశుహింస చేయును. ఈయజ్ఞమును జేయించువారు శాస్త్రములని చెప్పి చేయించెదరేకాని హింసాఫలము ననుభవింపరా? కుండనిండ దెచ్చినయన్నమును గుక్క దొబ్బి తినఁగలుగునే కాని మరల దానిని ఇంటికి తీసికొనిపోఁగలుగునా? చాలదు. అట్లే దిగుమని దింపువారేకాని ఫలము ననుభవించువారు లేరు.

ఆ. అన్నమదమువలన నతివలు మతిచెడి
యేపు రేఁగి మదనుఁ డేఁచె నందు
రన్న ముడుగు వెనుక నతఁ డెందుబోయెరా? వి.

వేదాంతులు "స్త్రీలకు అన్న మెక్కువగాఁ బెట్టినందువలన మదించి కామవిచారములు కల్గుచున్నవి. కావున ఈతప్పు అన్నముది" అని చెప్పెదరు. ఇది అసత్యము. పైన చెప్పినట్లు అన్నము వదలితి మనుకొందము. కామము కలుగుట లేదా? కావున దాంభికులు చెప్పినట్లుగాక దుర్గుణము ప్రకృతిచేతనే వచ్చుచున్నది.

ఆ. అన్నిజాతులందు నధికుల మనుచును
యజ్ఞపశువుఁ జంపి యగ్ని నిడుచు
మల్లయందుఁ బెట్టి మాంసంబు తిందురు, వి....

బ్రాహ్మణులు "మేము మాంసమును తినము. మే మన్నిజాతులవారికంటె ఉత్తములము. జీవహింస చేయము" అని చెప్పికొందురు. ఇది బూటకపుమాట. యజ్ఞమనుపేరును బెట్టికొని.

పశువునుజంపి నిప్పులోవైచి కాల్చి కుండలో నుడకఁ బెట్టికొని తిందురు. పైకిమాత్ర మెఱుఁగనివారివలె నుందురు. కావున వీరు దాంభికులు. వీరిమాటలు విశ్వసింపఁదగనివి.

ఆ. అరయ దోఁచికొనుచుఁ గురువని తన్నెంచి
తిరుగువాఁడు తన్ను నరయ లేఁడు
పనికి మాలినట్టి బానిసకొడుకురా, విశ్వ....

లోకములో వంచకులు అనేకరీతులుగా బయలుదేరి జనులను మోసముచేయుదురు. శైవులు మొదలగువారిలో గురువులని పేరు పెట్టికొని తిరుగుచుందురు. నిజమగుగురువులు వీరు కారు. తాను గురువుననుకొన్నవాఁడు తా నెవరో తెలిసికొనవలదా? కావున నిట్టివాఁడు ఎందునకు పనికిరానితొత్తుకొడుకే గాని గురువు కాఁడు. ఈగురువులుకూడ దాంభికులే.

ఆ. అలుత లింగముండ నది యెఱుంగఁగ లేక
పర్వతంబుఁ బోవుబానిసీఁడు
ముక్తిఁగాననగునె మూఢాత్ముఁడగుఁగాక, వి. 104

వంచకులు జనులను వంచించేకొఱకు మేము శ్రీశైలమునకుఁ బోయెదము. కొండనెక్కెదము. ధనసహాయము చేయుమని పీడించుచుందురు. ఈముండకొడుకులు శైవులయ్యు లింగమును బదిలముగాఁ గంఠమున నుత్రాడువలె బిగించి కట్టుకొనియు నింటనుండి యాలింగమును బూజించి సంతృప్తినొందలేక సులభముగాఁ బూజచేయలేక పర్వతమునకుఁ బోదురు. దేశములఁదిరిగి మూఢుఁడగును గాని ముక్తిగానలేఁడు.



ఆ. అల్లబోడితలలు తెల్లనిగొంగళ్లు
నొడలబూతి పూసి యుందు రెపుడు
ఇట్టివేషము లిల బొట్టకూటికె సుమా, వి...

కొందఱు సన్న్యాసులై తలలను గొఱిగించికొని కంబడిని కప్పుకొని బూడిదెనుపూసికొని తిరుగుచుందురు. వీరు సన్న్యాసులగుట పాశుపతమతము నుద్ధరించుటకని చెప్పెదరు; కాని మతోద్ధారణకు అట్టిపిచ్చివేషము లెందుకు? నిజమాలోచించితిమేని ఇట్టివేషములు బిచ్చమెత్తుకొని జనులను అల్లించి బెల్లించి పొట్టపోసికొనుటకే గాని వేరు గాదు.

ఆ. అక్షమాలఁ బూని యలసటఁ జెందక
కుక్షి నింపుకొనుట కొదువ గాదు
పక్షికొంగరీతి పైచూపు లేలొకో, వి... 106

మోసగాండ్రు కొందఱు జపములు తపములు చేయుదుమని రుద్రాక్షమాలలను జేతఁబట్టికొని దొంగవేషములనువేసి పొట్టనించుకొందురు. వా రట్లుచేసినంతమాత్రముచేత ఇతరులకు తక్కువయేమియును రాదు; కాని కొంగలాగున పైకిచూచి తపముఁ జేయుచుఁ బ్రపంచము నెఱుఁగనటుల వర్తించుట యెందులకు? అడిగిన కడుపునిండఁ బెట్టరా?

ఆ. అక్షరాలివెంట నడవులవెంటను
కొంగరాల గోడు గుడువ నేల
హృదయమందు శివుఁడటుండుట తెలియదా? వి.

మోసము చేయనెంచినవారలు లోకులకు భగవంతునిదర్శ

నము కలుగుటకని జపము చేయుమని అడవులలోఁ దపముఁ జేయుమని కొండలలో నుండుమని చెప్పుచుందురు. ఓజనులారా! మీరు ఆదాంభికులు చెప్పినట్లు చేసి గోడుగోడుమని కష్టముల చేత ఏల ఏడ్వవలెను? మీ మనస్సులలోనే దేవుఁడున్నాఁడని మీకు తెలియదా? కావున దాంభికులమాటలను విన వలదు.

ఆ. ఆఁకటికి తొలంగు నాచారవిధు లెల్ల
చీఁకటికి తొలఁగు చిత్తశుద్ధి
వేఁకటికి తొలంగు వెనుకటిబిగు వెల్ల, వి...

దాంభికులు కొందఱు ఆఁకలిలేనియప్పుడు ఆచార మాచార మని ఇతరులు ముట్టినపదార్థములను స్వీకరింపరు. ఆఁకలి కాఁగానే సిగ్గులేక మరల దానినే గ్రహింతురు. కావున ఆఁకలి సమయములోఁ దా మితరులకుఁ జెప్పినఆచారములను వదలి వేయుదురు. ఇతరులకు చెప్పినచిత్తశుద్ధి వానికి చీఁకటిపడిన తోడనే లేకపోవును. ఇట్లు గర్భిణిస్త్రీకి వెనుకటి మేని బిగువు లేకుండును గదా? దాంభికులు తప్పులు చేయుచుందురు కాన వారిని నమ్మవలదు.

ఆ. ఆకు లెల్ల దిన్న మేఁకపోతుల కేల
కాకపోయె నయ్య కాయసిద్ధి
లోకు లెల్ల వెఱ్ఱిపోకళ్లఁ బోదురు, విశ్వ...

కొందఱు కాయశుద్ధికిఁగాను నానావిధములగు వనమూలికలను దినుమని దాంభికులు లోకులను మోసగించెదరు. ఆకు



లను తిన్నంతమాత్రాన లోకులకు శరీరము సిద్ధియగునేని మేఁకపోతులు గుట్టగుట్టకు తిరిగిఅన్నివిధములగు ఆకులను తినెనుగదా? దానికేల కాయసిద్ధి కాలేదు. కావున లోకులు వెఱ్ఱివెఱ్ఱిపోకడలపోయెదరే కాని అవి నిజములు కావు.

ఆ. ఆచరాచరముల నంగాలలింగాలు
సరణి దెలియనట్టిశైవ మేల
అష్టతనుమయుండు హరుఁడౌట తెలియదు, వి.

ఆరాధ్యులను పేరుగలశైవులు మెడలలోను చేతులకును భక్తిపరవశత్వముచేత నని లింగములను గట్టికొనియెదరు. వానికిఁ జరలింగములని స్థిరలింగములని పేరుఁ బెడుచుందురుగాని తెలియని ఆశైవ మెందులకు? శివుఁడు శివుఁడనఁగా వేరేకలఁడా? నీరు, నిప్పు, గాలి, సూర్యుఁడు, చంద్రుఁడు, ఆకాశము, భూమి, సోమయాజి అను నెనిమిది శరీరములస్వరూపమే ఈశ్వరుఁ డనుమాట వారికి తెలియదుకదా? అట్టి దాంభికశైవ మెందులకు?

ఆ. ఆఁడుదానిఁ జూడ నర్థంబుఁ జూడఁగ
బ్రహ్మకైనఁ బుట్టు రిమ్మతెగులు
బ్రహ్మయాలిత్రాఁడు బండిరేవునఁ ద్రెంప, వి.

లోకములో నెంతటిబుద్ధిమంతులైనను ఎంత ఇంద్రియ నిగ్రహము గలవారలైనను బ్రహ్మదేవునంతటివారలైనను ఆఁడువారినిగాని, ధనమునుగాని చూచినవెంటనే ఆశజనించును. పూర్వము బ్రహ్మ సృష్టిచేయుచు తాను సృజించిన సరస్వతిని

కూఁతురుతో సమానమైనది యని యైనఁ గాని చూడక వరించెను. ఏమి బ్రహ్మగారైన నేమి! వాడియాలిత్రాఁడు బండ్లు దిగురేవులో త్రెంపను. వానికి గూడ నిదే బుద్ధికదా! ఇతరులకు చెప్పెడినీతి వారికి లేదు.

ఆ. ఆత్మశుద్ధి లేనియాచార మదియేల
భాండశుద్ధి లేనిపాక మేల
చిత్తశుద్ధి లేనిశివపూజ లేలరా? విశ్వ... 112

మూర్ఖులై లోకులను వంచనచేయుతలంపుతో, శివునిపూజించుచున్నట్లు పైకివేషమును వేయుదురే కాని లోపల చిత్తము పరిశుద్ధమై యుండదు. అట్లు చిత్తశుద్ధిలేక చేయునట్టి ఆశివపూజవలన కొంచెమైనను ఫలముగలదా? అట్లే. ఆత్మశుద్ధిలేని యాచారమువలనఁ గూడ నేమిప్రయోజనము? కుండలు తోమక అన్నమువండిన నేమిప్రయోజనమగును?

ఆ. ఆఱుమతములందు నధికమైనమతంబు
లింగమతముకన్న లేదు భువిని
లింగధార్లకన్న దొంగలు లేరయా? విశ్వ...

శైవమని, వైష్ణవమని, కాపాలికమని, జైనమని, శక్తిమతమని, చార్వాకమునని ఆఱుమతములున్నవి. ఈయాఱు మతములలోను నియమములు కలిగి సత్యప్రతిపాదకమగు నుత్తమమతమేదియని యాలోచించినచో ప్రపంచములో లింగధారిమతము(అనఁగా శైవము) కంటె మించినది మఱియేదియును లేదు. ఈమాట నిజమే కాని, లింగధార్లందఱు సత్యాన్వేషులేనా?



సజ్జనులేనా? అని విచారించినయెడల లింగధారులకంటె మించినదొంగలు ఈలోకములో నిఁక నెవ్వరును లేరు.

ఆ. ఆసనములు పన్ని యంగంబు బిగియించి
యొడలు విఱిచికొనెడియోగు లెల్ల
జెట్టిసాముకన్న చింతాకు తక్కువ, విశ్వ...

యోగులమని పేరుపెట్టుకొని ఒడలినిండ బూడిదను పూసికొని కూర్మాసనమని, కుక్కుటాసనమని యొడలువిఱిచికొనుచు కూర్చుండుయోగు లందఱును వ్యర్థులే కాని సఫలలు కారు. వీరికిని జెట్టీలమని పట్లుపట్టువారికిని విశేషము భేదములేదు. వీరువారికంటె చింతాకంత తక్కువయనే గాని అంతకంటె భేదము గనఁబడదు. ఇట్టివారందఱును దాంభికులు.

ఆ. ఇచ్చువచ్చునరుని కెచ్చువైష్ణవ మిచ్చి
ద్విజులకన్న దొడ్డతీ రటంచు
నెల్లవారు నల్లపిల్లాండు పాడరా? విశ్వ...115

వైష్ణవమతస్థులకు ఏజాతివాఁడైనను గాని దాసుఁడుగా నున్నయెడల నామతీర్థమున కర్హుఁడని నియమముకలదు. ఆజాతివారలు లోకులకు చేయుచున్నసంకర మింతంత యనరాదు. తమకిష్టమువచ్చినవానికి మాలగాని మాదిగగాని వైష్ణవ మిచ్చెదరు. వారిని బ్రాహ్మణులకంటె నధికులని చెప్పెదరు. తర్వాత మానాభిమానములు, ఉచ్చనీచలులేక ఆనీచులతోకలసి అల్లపిల్లాండమును బాడెదరు. (అల్లపిల్లాండమనునదియొక పాట.

"అల్లాండం పిల్లాండం" అని, దీనిని 'అందఱము నొక్కటే' యని సూచించుటకై పాడెదరట.)

ఆ. ఇల్లునాలి విడిచి యినుపకచ్చలఁ గట్టి
వంటకంబునీటివాంఛ లుడిగి
ఒంటినున్న యంత నొదవునా తత్త్వంబు? వి...

కొందఱు అమాయికులగు జనులను చేరఁదీసి "సంసారము సాగరము. దీనిని తరించుట కష్టము. అందునకొక్కటియే యుపాయము. ఇల్లు వాకిలి వదలిపెట్టికొని యన్నపానాదులను విడిచి ఒంటరిగానుండుము" అని చెప్పెదరు. జనులు విని మోస పోదురు. ఇల్లు, వాకిలి విడిచి ఇనుపగోచిపెట్టికొని అన్నము తినక కోర్కులను కోఱక ఒంటి కట్టుగా నున్నంతనే పరబ్రహ్మము కనుపించునా? కనుపింపదు.

ఆ. ఇహమునందు సుఖము లీడేరఁగా లేదు
పరమునందు నెట్లుపడయవచ్చు
మొదల లేనిచేత తుది నెట్లు వచ్చురా? వి...

కొందఱు "యజ్ఞము మున్నగుకర్మలచేత పరలోకములో సుఖములు గలుగును. ఆసుఖములు వీనికంటె నుత్తమములు. కావున నీలోకమునందలి తుచ్ఛసుఖములను వదలి పరములందలి యధికసుఖములనుబొందుటకు ప్రయత్నించవలయు" నందురు. ఇదిటక్కరిమాట. పరలోకమునకీలోకము మొదలువంటిది. మొదలనిక్కడే లేనిసుఖము చివర నక్కడ నెక్కడినుండివచ్చును? రాదు. కావున దీనిని పాటింపవలదు.



ఆ. ఉదయమందు శూద్రుఁ డుత్తమోత్తముఁ డెట్లు
సతికి శూద్రతనము సత్యమె కద!
తల్లి శూద్రయయ్యె తానెట్లు బాపఁడు? వి...

అన్నివర్ణములవారికంటె బ్రాహ్మణుఁ డధికుఁడందురు. మఱియును బ్రాహ్మణుఁడుకూడ పుట్టుకలో శూద్రుఁడే. ఉపనయనమైన తరువాత బ్రాహ్మణుఁడగును. స్త్రీకి ఉపనయనాధికారములేనందున యామెశూద్రస్త్రీయేయగునుకదా! అట్టిశూద్రస్త్రీకిఁబుట్టి తానెట్లు బ్రాహ్మణుఁడగును? పుట్టుకలో శూద్రుఁడైనవాఁ డుత్తముఁ డెట్లు కాఁగలఁడు? కావున నివి లోకమును మోసపుచ్చుటకొఱ కుద్దేశింపఁబడినవి.

ఆ. ఉపవసించుచుండి యోగి నీళ్ల మునిఁగియు
కూడువండి వేల్పుఁ గుడువు మనుచు
దాని నోరుకట్టి తామె తిందురు కదా? వి... 119

దేవుళ్లకు పొంగళ్లని దాంభికులుచేయు అల్లరికి మితమే లేదుకదా! భక్తిగలవారివలె ఉపవాసము లుందురు. పవిత్రతను కోరువారివలె గుంటగుంటనీళ్లను మునిఁగెదరు. చివరకు అన్నమును వండి నైవేద్యమని యెదురుగా వడ్డించి "ఆరగించు" మని చెప్పి ఆదేవతనోరుకట్టి తామే తిందురుకదా! అన్నా! ఎంత దంభముఁ జూపెదరు.

ఆ. ఉపవసించినంత నూఱబందిగఁబుట్టు
తపసియై దరిద్రతను వహించు
శిలకు మ్రొక్కనగునె జీవము గలబొమ్మ? వి...

వంచకులు లోకులను కొడుకులు పుట్టుటకును కోరికలు ఫలించుటకు నుపవాసములు చేయుమని తపములను చేయుమని దేవాలయములకేఁగి శిలావిగ్రహములకు నమస్కారములు చేయుమని చెప్పుచుందురు. కాని ఇట్లు చేయుటవలన ఫలము లేదు. ఉపవాసముచేసి యాత్మకు అన్నము పెట్టక శుష్కింపఁజేసినందున ఆత్మహత్యా దోషముకలుగును. అందువలన మఱుజన్మములో పందియైపుట్టును. ఇఁక నెల్లప్పుడును తపస్సు చేయుటచేత దరిద్రుఁడగును. కాఁబట్టి ఓయీ బుద్ధిమంతుఁడా! ప్రాణము గలబొమ్మ ప్రాణములేని రాతిబొమ్మకు దండములు పెట్టవచ్చునా? కూడదు. దాంభికులమాటలను నమ్మరాదు.

ఆ. ఊరఁబంది దెఱుంగ దుత్తమావాచులు
చెడ్డనరకి మెల్లఁ జెందుఁ గాక
సాధ్విమహిమ మెట్లు స్వైరిణి యెఱుఁగురా? వి.

మోసగాండ్రు ఉత్తములైనవారిని అజ్ఞులని అనాథలని నిష్ప్రయోజకులని నిందించుచుందురు. ఇంతమాత్రముచేత వారి తెలివితక్కువ బయలగునేకాని వేఱుగాదు. చూడు. ఊరిలోనుండుపంది, శ్రేష్ఠములగు నింపగు వస్తువులను దెలిసికొనఁగలుగునా? కాని అసహ్యకరములగు నరకకూపములను మాత్రము తెలిసికొనఁగలుగును. అట్లే పతివ్రతయందలి మాహాత్మ్యమును రంకుటాలు తెలియఁజాలదు కదా!

ఆ. ఊరినడిమిబావి యుదకంబుగొనితెచ్చి
పాదతీర్థ మనుచు బ్రమయఁజేతు



పాదతీర్థ మన్న ఫలమేమి కద్దురా? వి... 122

ప్రతారకులు పలువిధముల లోకులను మోసగించెదరు. నడియూరిలోని బావినీళ్లను దీసికొనివచ్చి దేవునిపాదతీర్థ మని త్రాగించి భ్రమింపఁజేయుచుందురు. లోకులు వానిని దెలిసికొనలేక త్రాగుచుందురు. అయ్యో! బావినీళ్లను ద్రాగి పాదతీర్థ మనికొనినందువలన ఫలమేమియున్నది చెపుమా ?

క. ఊరులు పల్లెలు మానుక
వారక యడవిం జరించువాఁ డరుదెంచు
న్వేరులుఁ గూరలు మెసవెడు
వీఱిడి కెట మోక్షపదవి వినఁగా వేమా. 123

వంచకులు లోకులకు "ఇలు వదలి పెట్టి ఊళ్లలోను పల్లెలలోను నుండక యడవికిఁబోయి తపముఁ జేయుచు ఆఁకలియగు నప్పుడచ్చటి ఆకులలములను తినుచుండిన మోక్షము వచ్చునని చెప్పి మోసము చేయుదురు. ఎంతవెఱ్ఱివారు! ఊరిని వదలిపెట్టి అడవులలో తిరుగాడుచు వేళ్లు కూరలుదినువారికి మోక్షమెట్లు కలుగును?

ఆ. ఎంగిలెంగి లనుచు నీనోటితోడనే
వేదములను జదువు వెఱ్ఱులార
యెంచిచూడ నదియు నెంగిలికాదొకో? వి...

వేదములను జదువుకొనుచుండెడి చాదస్తపుబ్రాహ్మణులు ఆచారమని చెప్పుచు చూచినదానినెల్లను ఎంగిలెంగిలని పలుకుచుందురు. ఓ వెఱ్ఱిబ్రాహ్మణులారా ! మీరు నోటిలోనుండివచ్చిన

కానినిగదా ఎంగిలని యందురు. ఆనోటితోనే, అనఁగా: ఆ యెంగిలిగలిగిననోటితోడనే వేదములను బవిత్రములైనవానిని జదువుచున్నారు. ఆలోచింపఁగా నదిమాత్రము ఎంగిలికాదా? కావున ఎంగిలియైన నపవిత్రము లనుకొందురేని వేదాదిశాస్త్రములను వదలివేయుఁడు. లేదా, డంబమునకు మాటమాటికిఁబలుకు ఎంగిలి యెంగిలి యనుమాట వదలిపెట్టుఁడు. దంభమును అవలంబింపకుఁడు!

ఆ. ఎంబెరుమత మని యెసఁగి మాంసముఁ దిని
మారుపేర్లు పెట్టి మధువు ద్రావి-
వావివరుస దప్పి వర్తించి చెడుదురు, వి...125

ఎంబెరుమత మనఁగా: నామధారులమతమఁట! లోకములోని మోసగాండ్రు "ఎంబెరుమత" మని పేరు పెట్టి ఇష్టము వచ్చినట్టులు మాంసమును దినెదరు. కల్లునకు అమృతము మొదలగు మారుపేరులనుబెట్టి త్రావెదరు. అక్కచెల్లెండ్రనియైన నాలోచింపక వావివరుసలు తప్పి యిచ్చవచ్చినట్టులు తిరిగి ప్రజలను మోసగించెదరు. ఇట్టివారె దాంభికులు. కావున వీరిని నమ్మవలదు.

తే. ఏమియైనది పరతత్త్వ మెఱుఁగలేక
సోమయాజులు పశువుల స్రుక్కడంచి
సామ మేర్పడఁ జదివినఁ జావవేల
బాధకములగుదుర్గుణపంక్తి వేమ. 126



యజ్ఞాదులను జేసి సామవేదమును బఠించిన గుణిరైయై ముక్తుఁడగునని చెప్పుచుందురు. యజ్ఞములు చేసినంతమాత్రాన దుర్గుణములు తొలఁగవు. పరబ్రహ్మస్వరూప మెట్టులుండునో తెలిసికొనఁజాలక సోమయాజులమని నోరులేనిపశువులను బట్టికొని చంపుచు వధచేయుకాలమున హింసపోవుకొఱకు సామవేదమును బఠించుచుందురు. అయ్యయో! సామమును ఎంతచక్కఁగాఁ జదివినను బరలోకమునకు బాధకము లగుదుర్గుణములు ఎందుకు నశింపవు చెపుమా? కావున నిదంతయును దంభము.

ఆ. ఐన దాని కింక కానిదానికి నైన
నాడువారిమాట లాడుమన్న
సాహసమున పెక్కు లూహాలు పనుతురు,వి...

దాంభికులు చెప్పుమాటలకు తఱుగే లేదు. జరిగినదానిని గుఱించిగాని జరుగుచున్నదానిని గుఱించిగాని కాఁబోవుదానినిగుఱించిగాని వారించుకేనియు నిర్ణయింపఁజాలరు. లోకములో సతులకులశీలమును విచారించి నిర్ణయింపుమనినచో నూహలపైనూహాలపన్ని స్త్రీజీవితమునంతయుఁ గళంకవంతమని నిశ్చయింపఁగలుగుదురు. వెనుకాడక యెట్టినిందలైన నారోపింతురు. ఇట్టి దాంభికు లెంతటిమోసమునకైన పాల్పడుదురు. కావున నట్టివారిని నమ్మవలదు.

ఆ. ఒడ్డల బూది పూసి జడలు ధరించిన
నొడయఁడగును ముక్తిఁ బడయలేఁడు
తడకబిఱ్ఱుపెట్టఁ దలుపుతో సరియౌనె? వి...

దంభకరులలోఁ గొందఱు ఒడలినిండ బూడిదను బూసికొని జడలను దాల్చికొని ముక్తికొఱకుఁ బ్రయత్నించుచున్నామని యనియెదరు. అంతమాత్రముచేతనే మనుష్యుఁడు ముక్తి నొందఁగలుగునా? పొందఁజాలఁడు. ఎట్లనియనియెదరేమొ? చూపుఁడు. ఇంటిలోనికి దొంగలుమున్నగువారు రాకయుండు నట్లు తలుపునుబెట్టుకొనవలయును గాని తడుకకు బిళ్లువెట్టినంతమాత్రమున తడుకతలుపగునా? కాదు. అట్లే విభూతిపెట్టుకొన్నంతను జడలుదాల్చినందునను ప్రపంచమును వంచింపఁదగిన గురువేషధారణము పూర్తియగును గాని వేఱులాభముండఁజాలదు.

ఆ. ఒడ్డుఁబొడుగుఁగలిగి గడ్డముం బొడవైన
దానగుణము లేక దాత యగునె
యెనుము గొప్పదైన నేనుఁగుఁబోలునా? వి...

కొందఱు సాపాటురామన్నలు లోకులను మోసముచేయుటకు దాతలవలె నటింపవలయునని యత్నించెదరు. అట్టివారు ఎంతవేషమును వేసికొన్నను, ఒడ్డుపొడవుగలిగి దొడ్డవారలై బారెడుగడ్డమును పెంచికొనినను (ప్రకృతి) పుట్టుకతో సాధారణముగా లేనిదానగుణమును దెచ్చికొని నటించుచున్నను దాతమాత్రము కాఁజాలరు. ఉదాహరణముగా నెనుమును తీసికొందము. ఎనుము ఎట్లు మిక్కిలియొడ్డుపొడుగు గలినను ఏనుఁగునుబోలదో అట్లు దాంభికుఁడును ఎన్నివేషములను వేసికొనినను దాతమాత్రము కాఁడు.



ఆ. కడుపు బోరగించి కన్నులు ముకుళించి
బిఱ్ఱబిగిసికొన్న బీదయోగి
యమునిబారిగొఱ్ఱె యతఁడేమిసేయురా? వి ..

కొందఱు యోగులమని పేరులఁ బెట్టికొని సర్వజ్ఞులవలె నటించుచుందురు, కాని తాము లోకులను వంచనచేసినందువలన గలుగఁబోవుఫలమును మాత్రము కానలేరు. కడుపును ఉబ్బఁజేసికొని కన్నులను మూసికొని బిఱ్ఱబిగిసికూరుచుండియున్న ఆయోగి పాపముదురదృష్టవంతుఁడు. అతనికేమి తెలియును? యమునిబారికిఁబోఁబోవు గొఱ్ఱెకావున నతఁడేమిచేయగలుగు నింతకంటెను? అనఁగా నిట్లు వంచించి చివరకు యమలోకమునకుఁ బోవునని భావము.

ఆ. కంబళములఁ గట్టి గంతల గజ్జల
బోడితలల సొంపు పొల్పు మీఱఁ
గడుపుకొఱకుఁ దిరుగ ఘనులౌదురా వారు? వి.

కొందఱు పరమభక్తులమని పేరులఁబెట్టికొని కంబళ్లు శాల్వలు మున్నగువానిని గప్పి గొప్పయాటోపముతో గజ్జలను గట్టికొని తలల నున్నగా గొరిగించుకొని సొగసులెగయునట్లు ఊరూరికిని తిరిగి లోకోపకారమును జేయుచున్నామని విఱ్ఱవీగుచుందురు. వారట్లు తిరుగుట కడుపునించుకొనుటకే గాని ఘనతను సంపాదించుకొనుటకుఁ గాదు. లేనిపోనిటక్కరివేషములను వేసికొని కడుపుకొఱకు తిరిగినంతమాత్రాన వారు గొప్పవారలెట్లు కాఁగలరు?

ఆ. కల్లటికెకు భూతి గట్టిగాఁ బెట్టిన
నందులోనికంపు లడఁగనట్టు
మెడను ద్రాడువేయ మెఱయుచు ద్విజుఁడౌనె?వి.

దాంభికులు కొందఱు యజ్ఞోపవీతమును మాత్రము ధరించిన చాలును బ్రాహ్మణత్వము సిద్ధించును. అని యేమేమో ప్రేలుచుందురు. జన్నిదమును వేసికొన్నంతనే బ్రాహ్మణుఁడుకాఁడు. లోపలను వెలుపలను బరిశుద్ధతనొందవలయును. అటుపిమ్మట జన్నిదమును ధరించిన ప్రయోజనము కలుగునేకాని మఱియొకరీతిగాఁ గలుగదు. కల్లటికెను తెచ్చి పైని విభూతిని బూసిన వాసనపోవునా? పోదు.అట్లే మెడలో ద్రాడు వేసికొన్న మాత్రాన బ్రాహ్మణుఁడగునా? కాఁడు.

ఆ. కావిపంచగట్టి కడుయోగివలె నుండి
వెలికిఁ గోర్కెలెల్ల విడిచిపెట్టి
తొరగి తిరుగువాఁడు దొంగసన్న్యాసిరా, వి...

సర్వసంగపరిత్యాగులమని చెప్పుచు కావివస్త్రములను గట్టికొని యోగిరీతిగా పైకిఁగనఁబడుచుఏవస్తువులయందును దమకు కోరికలేనట్టులు నటించుచు టక్కరులు కొందఱు తిరుగుచుందురు. అట్టివారు నిజమైన సన్యాసులు గారు. ఈరీతిగా తిరుగువారినందరిని దొంగసన్న్యాసులని తెలిసికొనవలయునేగాని నమ్మి వారిని జేరదీయరాదు.

ఆ. కుక్కుటమననంబు కొక్కెరధ్యానంబు
యతులనొసట నొనరునట్లు వ్రాసెఁ



దొల్లి చేసినట్టి దోషంబు తగిలెనో? విశ్వ...184

సన్యాసులు యోగాభ్యాసము అనుపేరుతో కనులు మూసికొని పొట్టనింపుటకై 'మననము ధ్యానము మున్నగువానిని జేయుదురే కాని నిజముగా పరమాత్మసాక్షాత్కారముకొఱకు వారు అట్లు చేయుచుండుటలేదు. ఇట్టివీరిమననము కుక్కుటమననముతో సమము. ధ్యానము కొక్కెరధ్యానసమము. అనఁగా వీ మననధ్యానములు దొంగలవలె వంచన చేయుటకొఱకు చేయుచున్నారు. వీరు ఇట్లు చేసి జీవనము గడపవలయునట్లు బ్రహ్మ వీరినొసట వ్రాసెను. బ్రహ్మ ఇట్లు వ్రాయుటకుఁ బూర్వజన్మమున చేసినపాపము కారణమై యుండును.

ఆ. కులము నీఱుచేసి గురువును వధియింపఁ
బొసఁగ నేనుఁగంతబొంకు బొంకె
పేరు ధర్మరాజు పెనువేపవిత్తయా, విశ్వ...135

వంచకులు ధర్మాత్ములము అని ఈరీతిగా పెద్దపేరులను బెట్టుకొని లోకమును వంచించుచు నసత్యమునకైన భయపడరు.ఇట్టివారేగదా ధార్మికులు. చూడుఁడు. ధర్మరాజు అన్నిధర్మములను తెలిసినవాఁడు. గొప్పవంశమున బుట్టినవాఁడు. అట్టివాఁడు తనప్రవర్తనమున నెట్లుండవలెను?ఉండెనా? ధర్మరాజటులేదు. పైన వంశమును నాశనముచేసి చదువుసందెలఁ జెప్పినగురువును జంపుటకే కొంచెము కొంచెము కాదు ఏనుఁగంత బొంకును బొంకెను. కావున పేరును జూచి నమ్మవలదు. పేరు ధర్మరాజే గాని విషపువిత్తనము.

తే॥ గుహలు పది వేలు సొచ్చిన గుణము పోదు
నియతగురుభక్తి కావలె నేర్పుమీఱ
మహితపరతత్త్వభావంబు మధురమగును
దాని సాధింపనే మఱి పూను వేమ. 136

దాంభికులు గుహలలో దూరి విషయాసంగము లేక నిశ్చలులై తపంబును జేసి తత్త్వమును జూచుచున్నామని లోకులకుఁ జెప్పినమ్మించి వారినిగూడ నట్టులే గృహములను దారలను కొమరులను విడచి గుహలలో దూఱుటకు పురికొల్పుచుందురు. ఇది అసత్యము అని తెలియక లోకులు భ్రమయుచుందురు. చూడుఁడు. స్వతస్సిద్ధముగా పుట్టినగుణము పదివేలగుహలలో దూరినను పోఁజాలదు. అజ్ఞానముపోయి జ్ఞానము కావలయునన్న నియమముగా గురువును సేవించి భక్తిగలిగి తెలివితేటలుగలిగివర్తించినయెడల పరబ్రహ్మస్వరూపము తేటతెల్లముఁగ గనుపించును. వేమనా! నీవు ఆసత్యపదార్థమునే సాధింపఁ బూనుకొనుము. ఎంతమాత్రమును వంచకులను నమ్మవలదు.

తే॥ గూబవలె గ్రుడ్లు ద్రిప్పిన గుణము రాదు
లోభమోహము లుడుగంగ లాభమగును
దేబెలై భిక్ష మెత్తుట తీర్ప దెపుడు
డాబు సేసిన లక్ష్యమడంగు వేమ. 137

మూర్ఖులై యోగమని పేరుపెట్టుకొని కన్నులు మూసికొని కనుగ్రుడ్లను తేలవైచి దొంగజపములను జేయుచు సమాధిలో నున్నట్లు వంచకులు నటించుచుందురు. అట్టివానిని నమ్మరాదు.



గ్రుడ్లగూబలాగున గ్రుడ్లద్రిప్పినంతనే మంచిగుణము వచ్చునా? రాదు. మఱి యెట్లు వచ్చునని యనినచోఁ జెప్పుచున్నాము. లోభమును, మోహమును అనఁగా: అజ్ఞానమును వదలిపెట్టిన యెడలనే లాభముకలుగును. ఇట్లే, తెలివితక్కువచేత బిచ్చము నెత్తుచున్నను లాభము లేదు. తమకు లాభము లేకపోయినను డాబు సేసెదమని తలంచినయెడల యథార్థమగుతత్త్వము కనుపించక నదృశ్యమగును. కావున నట్టులు చేయరాదు.

ఆ. ఘటము నింద్రియములఁ గట్టివేయఁగ లేక
చావువచ్చునపుడు సన్న్యసించు
నాత్మశుద్ధిలేక యందునా మోక్షంబు? విశ్వ...138

లోకములోని జనులమూర్ఖతను ఏమని చెప్పుదుము! ఎంత చిత్రము. ఇదిమూర్ఖతయా, లేక వంచకత్వమా? ఆలోచింపుఁడు. వంచకుండు తనశరీమును, కన్నులు మొదలగు నింద్రియములను గట్టివేయలేక ఇష్టమువచ్చినట్లుతిరిగి శక్తియున్నంతవఱకును లోకులను మోసముచేసి చివరకు చావుకాలము దాపరించినప్పుడు సన్న్యాసమును దీసికొనును. ఇట్లు సన్న్యాసమును దీసికొనినంతమాత్రాన మోక్షము వచ్చునా? రాదు. ఆత్మశుద్ధిగల్గి మోక్షమునొందఁ బ్రయత్నింపవలయునే కాని వేఱుగాదు. కావున నాత్మశుద్ధికై ప్రయత్నింపవలయునే కాని సన్న్యాసము మొదలగువానికై ప్రయత్నింపఁగూడదు.

ఆ. చిలుక నోరుగొట్టి చిత్తజుమెడఁ గట్టి
కచ్చడంబు బిగియఁ గట్టికొన్న

మనసువశముగాదె! మహి నేమి పాపము? వి...139

మనస్సు చంచలింపఁ జేసి వలపు గలిగించు మన్మథపరివారమును జయించినను మనస్సు లోఁబఱచుకొనుట కష్టము. చిలుకను బలుక నీయకుండ నోరుమూయించి, మన్మథునికుతికెకు త్రాడుగట్టి బంధించి కామవికారము జనింపకుండుటకై కచ్చ బాగుగా బిగించినను మనస్సు లోఁబడక ప్రపంచమునంతయుఁ జుట్టి వచ్చుచున్నదే, ఇది యేమి పాపమో గదా!

ఆ. చక్కనిసతి యైన సరసురాలైనను
మేను నోరులను గాన నీయకున్న
సందెఁ గ్రుంకినంత సయ్యాటలాడదా? విశ్వ...140

గోషా ననియును, సౌందర్యవతి ననియును, పరపురుషులను చూడనైన నొల్లననియును, పైకి లేనిపోనిడాంబులను వైచికొని కొందఱు దాంభికలగు స్త్రీలు లోకమును వంచన చేయఁ బ్రయత్నించుచుందురు. కాని పైకి ఎన్ని వేషములను వేసినను సహజమగు గుణమును మాత్రము మానరు. చూడుఁడు. ఎంత చక్కని చిన్నదియైనను, సరసముగా నున్నను, పరపురుషునికి శరీరమునైనను జూపకయున్నను బగలంతయును గడచిన పిమ్మట సందెచీకటి పడఁగానే సయ్యాటల నాడుటకు మొదలు పెట్టదా? కావున వారిమాటలను నమ్మరాదు.

ఆ. చదువు చదువనేల సన్న్యాసి కానేల
షణ్మతములఁ జిక్కి చావనేల
ఆత్మను భజనఁ జేసి యాత్మలోఁ దెలియుఁడీ; వి..141



కొందఱు మహానుభావులు శాస్త్రములనన్నింటిని తుదముట్టఁ జదువుకొని సన్న్యాసులై తత్త్వవిచారణమను పేరుతో శైవ, వైష్ణవాదులగు నాఱుమతములలోను అది హెచ్చు ఇది లొచ్చు అని వాదించుచుందురే కాని నిజమును తెలిసికొనఁ జాలరు. కావున నిట్టి దాంభికుల చదువంతయు వ్యర్థము. ఎట్లందురా? చదువు చదువని శాస్త్రముల నన్నింటిని ఏల చదువవలయును? తరువాత శాస్త్రములలోఁ జెప్పియున్నదని సన్న్యాసమును దీసికొనుట యెందులకు? సన్న్యాసులైనపో, షణ్మతము లను చిక్కులలో ఏల చిక్కుకొనవలయును? ఇంతకన్న సులభమగు మార్గము లేదా? కావున శరీరమే లేని యమేయరూపుని ఆత్మలో నున్నట్లు తెలిసికొనిన ముక్తివచ్చునని తెలిసికొనవలయును.

ఆ. చాలదయ్య యింక చార్వాకమతరీతి
శక్తి శైవ మనుచుఁ జాల నమ్మి
సరణి మిగిలి చెడును చండాలసేవచే, వి...142

మోక్షము నొసంగుటకుఁ జార్వాకమతము చాలినది కాదు. దానికున్న మతవిషయిక విస్తృతి సంకుచితమైనది. కావున నది వర్జనీయము. శైవమత మట్టిది కాదు. ముముక్షువులకు మోక్షము సులభముగా సమకూర్ప శక్తి కలది. అని కొంత సేపు శైవమును నమ్మి కడకన్నింటిని తొలంగి పొట్టకూటికై యేచండాలునో యాశ్రయించి మూర్ఖుఁడు జీవించుచున్నాఁడు. చార్వాకులు దేవుఁడు లేఁడని చెప్పెనని నిందలను సేయుచుందురు. నిజముగా ఇట్టి యసత్యమతములను నమ్మినవారిరీతిని విచారించి

తిమేని యితనికంటె చార్వాకరీతి మఱియొకటిఁ గానము. ఇట్టులు నాస్తికమతమును అవలంబించుట ఇఁకనైనను నిలుపుదల చేయఁగూడదా?

ఆ. జడలు గట్టనేల సన్న్యాసి కానేల
నొడలువిఱుచుకొనెడి యోగమేల
ముక్తికాంతఁ బట్టి ముద్దాడనే కదా? వి...143

జడలను దాల్చికొని సన్న్యాసులమనుకొని కొందఱును ఒళ్లు విఱిచికొని యోగులమని కొందఱును లోకులను మోసపుచ్చఁ దలఁచుచుందురు. ఇట్లు చేయుటవలన ప్రయోజనమేమి యన ముక్తియని చెప్పెదరు. ముక్తిబడయుటకు జడలు ఏలకట్టుకొన వలయును? ఒళ్లు నెందులకు విఱుచుకొనవలయును? ఇంతకంటెను సులభములగు మార్గములుండఁగా నిట్లు చేయుట దాంభికలక్షణమని యెఱిఁగి మోసమునొందక యుండవలయును.

ఆ. జాతులందు నిగుల జాతియే దెక్కువో
యెఱుక లేక తిరుగ నేమిఫలము
యెఱుకగలుగువాఁడె యెచ్చైనకులజుండు, వి....

ఎఱుకలేని జనుల దగ్గఱఁ జేరి అన్నిజాతులలోను మాజాతి యెక్కువది మాజాతి యెక్కువది యని దాంభికులు ద్రొబ్బులాటలనాడి తమతమమతములలోనికినిజాతులలోనికిని దీసికొనఁ బ్రయత్నములను జేయుచు నల్లరులను జేయుచుందురు. ఇట్లు చేయుటవలన సామాన్యులందఱును మోసపోయెదరు. నిజముగా లోకులకు జ్ఞానము నుపదేశించి వారిని ఉత్తమజాతులను చేయఁ



దలఁచినచో వారికి ఉత్తమమగుజ్ఞానమును గలిగించి ఆపిమ్మట విచారింపవలయునే గాని జ్ఞానమే లేక తిరిగిన ప్రయోజనమున్నదా? లేదు. కావున ఎవ్వనికి జ్ఞానము పవిత్రమైనది కలుగునో వాఁడుత్తమవంశముగలవాఁ డగునేగాని వివాదము వలన కాఁడు.

ఆ. టిప్పణములు నేసి చప్పనిమాటలఁ
జెప్పుచుందు రన్ని శ్రుతులు స్మృతులు
విప్పిచెప్పరేల వేదాంతసారంబు? వి... 145

లోకులు అజ్ఞానదశలో నున్నందున తాము లోకానుగ్రహార్థులై ఊరూరను సదాచారముల నుపదేశింపవచ్చితిమని దొంగ వేషములను వేసికొని నడుమనడుమ శ్రుతులను స్మృతులను ఉదాహరణముగా చెప్పుచు తమభావములకు సరిగా లేనిచోటుల టిప్పణములను సారము లేనిమాటలతోఁ జెప్పుచుందురు. నిజముగా వీరు దాంభికులుగాక లోకమునకు మేలు చేయ వచ్చినయెడల లోకులందఱు తరించునట్లుగా వేదాంతసారమును వివరించి ఏలచెప్పకయుందురు? కావున నిట్టివంచకులను నమ్మరాదు.

ఆ. తింగణాలు బలసి నింగికి నెగిరినఁ
జెట్టుచివరపండు చేతఁ బడునె
పుస్తకములుచదువఁబొందునా మోక్షముల్? వి.

ప్రజలను మోసపుచ్చుటకై జనులు కొందఱు మేమిన్ని గ్రంథములను చదివితిమి. ఆమార్గుఁ డొక్కఁ దానిని గూడ

చదువలేదు. వాఁడు చదువరాని మొద్దు. మేము చదువనేర్చిన పెద్దలము అని మోసము చేయుచుందురు. డాబు చేసినయెడల ఫలముగలుగదు. చూడుఁడు. పేరాశతోఁ బొట్టివాండ్రగుబాలురు పైకి ఎగురఁగఁగినంతమాత్రాన చెట్టుకొట్టకొనమీఁదనుండు పండు అందఁగలదా? అట్టులే కట్టకట్టలుపుస్తకములు చదివినంతమాత్రముచేత మోక్షములు వచ్చునా? రాఁజాలవు. కావున అట్టివారిని నమ్మరాదు.

ఆ. దగ్గఱకుము పాపదాంభికులను నీవు
మోసపుత్తురయ్య దోసమనక
క్రూరమృగములట్టివారురా నమ్మకు, వి... 147

నాయనా! ఇట్టిదాంభికులదగ్గఱకు చేరకుము. వారు మిక్కిలి పాపాత్ములు. వారికి తనవాఁడు నావాఁడు అను సాధుభావముగాని అయ్యో అని కరుణగాని లేదు. పాపమునుకూడ లెక్కచేయకదగ్గఱచేరివారిని మోసముచేయఁజూచుచుందురు. అట్టివారు మనుష్యరూపముతో తిరిగెడి అడవిలోనివసించు క్రూరమృగములతో సమానులు. అటువంటివారి నెన్నటికిని నమ్మకుము. వారివలలోఁ జిక్కకుము. అట్టివారివలె నెన్నఁడును నీవు ఉండుటకు ప్రయత్నింపకుము. ఇట్టి దాంభికులను తెలిసికొని నీవు ప్రవర్తింపవలయును.

ఆ. తంత్రమంత్రములను తారక మబ్బునా
యంత్రబలము గురునిమంత్ర మూని
చింతఁజేయునపుడె చిన్మయ మందురా, వి... 148



తారకయోగము తంత్రములనుమంత్రముల నాశ్రయించుకొని పేరాశతో వర్తించుకపటయోగి కెన్నటికిని లభింపఁజాలదు. కావునఁ దారకము నార్జింపఁదలంచిన సాధకుఁడు యంత్రబలమును దానికిఁదోడుగాగురునిమంత్రబలముసహాయముఁ జేసికొని ఏకాంతప్రదేశమున ఈశ్వరధ్యానముచేయవలయును. అటులచేసినయెడల సాధకుని ప్రయత్నానుసారముగా చిత్స్వరూపము ప్రత్యక్షమగును.

ఆ. తనువునందు నగ్ని దఱికొని కాలంగఁ
గాల్చుకొనుట యేమికర్మమునకొ
కాల్చుకొన్న యంతఘనుఁడు తానయ్యెనా? వి. 149

దాంభికులు లోకులు నపవిత్రులనియును వారిని పవిత్రులనుగాచేయుటకుఅగ్నితోనేపరిశుద్ధిచేయవలయుననియునందులకే ముద్రలనువేయుట యనియుఁ జెప్పి మోసముం జేయఁజూతురు. ఇది వైష్ణవమతసంప్రదాయము? కాని యిట్లుచేయుటకు కారణములు కానరావు. పవిత్రతకొఱకనియందురా? తమతమహృదయములలోనే యగ్ని వెలుగుచుండఁగా మరలకాల్చుకొనుట యేమికర్మము? పోనీ. కాల్చుకొననిండు. కాల్చుకొన్నంతమాత్రమున నాతఁడు ఘనుఁడయ్యెనా? కాలేదు. కావున దాంభికులమాటలు విని మోసపోవలదు.

ఆ. తనువు లస్థిర మని ధనము లస్థిర మని
తెలుపఁగలఁడు తాను తెలియలేఁడు
చెప్పవచ్చుఁ బనులు సేయుటకష్టమా, వి...150

దొంగలు వేదాంతులమను పేరులతో తిరుగుచు "శరీరములు శాశ్వతములు కావు; సంపదలు స్థిరములుగా నుండఁజాలవు; కావున మేనిలోనం బ్రాణములున్నంతలోనే దానాదులను చేయుఁ" డని చెప్పి మోసముచేయఁజూచుచుందురే కాని నిజముగా వేదాంతులు గారు. వారు నిజముగానే వేదాంతులగుదురేని తాను చెప్పెడి మాటలను తనపనులయం దెందులకు అవలంబించియుండఁగూడదు? కావున నితరులకు చెప్పవచ్చునే గాని వానిని తాను చేయఁగలుగుట కష్టము. అట్టి వంచకులగు వారిబారిలో జనులారా! మీరు ఎన్నటికిని చిక్కవలదు.

ఆ. తప్పువేషమూని ధరలోనఁ దిరిగెడు
నేఁత లెల్ల మిత్తిఁ జేరుటకునె
కడుపునిండ నింత కష్టంబు లేలరా? వి... 151

తప్పుడు వేషములను వేసికొని లోకములో నన్నిచోటులను దిరుగుచు తనకగపడిన ప్రతివారిని వంచనసేయుచు దాంభికుఁ డిట్లుచేసిచేసి చివరకు పొందెడిఫలము మృత్యుదేవతను దర్శింపఁబోవుటయే కాని మఱియొకటి కాఁజాలదు. అనఁగా: బ్రతికినన్నినాళ్లు పొట్టనింపుకొనుటకనుట. ఛీ! పాడుబొట్టను నిండించికొనుటకు చేయరాని ఇంతింతపనులను, పడరాని పాట్లను పొందవలయునా? పొంది చివరకు నొందుఫలమేమి? కావున దంభముచేత నిసుమంతయు నుపయోగములేదు.

ఆ. తిరుపతికిని బోవ దుఱక దాసరి గాఁడు
కాశి కేఁగఁ బంది గజము గాదు



కుక్క సింహ మగునె గోదావరికిఁబోవ? వి...152

పంచకులు సాధారణముగా "తీర్థయాత్రలఁ జేసితిమి. తిరుపతికిఁ బోయితిమి. తిరునాళ్లఁ జూచితిమి. పవిత్రుల మైతిమి. కావున నితరులగుజనులందఱును మమ్ము సేవించినను పూజించినను పవిత్రులగుదురు" అని మోసముచేయఁజూచెదరు. ఇట్టివాండ్రు పంచకులు. వీరు తిరుపతి మొదలగుతీర్థాదులకు వెళ్లినమాత్రానఁ బవిత్రులగుదురా? కారు. ఎట్లనఁగా: ప్రతిదినమును వేలకొలఁది జీవులఁ జంపు తురక తిరుపతికిఁ బోవఁగానే దాసుఁడు కాఁజాలునా? పంది మలమును భక్షించునదియై కాశికిఁ బోయినమాత్రాన ఏనుఁగు అగునా? గోదావరిలో మునిఁగినంతమాత్రముచేత కుక్క సింహము అగునా? కాదు. అట్లే పంచకులుకూడను. కావున వారిని నమ్మరాదు.

ఆ. తోలుకడుపులోన దొడ్డవాఁడుండఁగ
రాతిగుళ్ల నేల రాశిఁ బోయ
రాయి దేవుఁడైన రాసులు మ్రింగదా? విశ్వ...153

దేవుళ్లని పేరులను పెట్టి మూర్ఖులనందఱిని తనవశమును చేసికొని దాంభికులు ఆటలాడుచుండెదరు. జనులు వానినన్నిటిని తెలియక మోసమును పొందెదరు. ఇట్టిపనులన్నియు దంభకృత్యముగాని వేరుగాదు. దేవుఁడు రాయియగునా? కాఁడు. ఆదేవుఁడు మనకడుపులోనే యుండఁగా రాతిగుళ్లలో రాళ్లను అన్నరాశి ప్రోగుబోసి మ్రొక్కుదురు. ఎంత వెఱ్ఱివారు? వారు అనుకొనినయట్లు రాళ్లు దేవుళ్లైనచో రాసులు

రాసులు నైవేద్యమును మ్రింగవలదా? అట్లు లేదు. కావున దాంభికులవలన మోసము నొందవలదు.

ఆ. దేశదేశములను తిరుగంగ తిరుగంగ
నాత్మయందు ధ్యాన మంటుకొనునె?
కాసులకును తిరుగఁ గల్గునా మోక్షంబు? వి. 154

ఊరూరను మతాధిపతులమని గురువులమని యాత్రికులమని పేర్లను పెట్టికొని తిరుగుచు ధ్యాననిష్ఠు లైనట్టులు కనులను మూసికొని జనులను వంచనచేయుచుందురు. నిజముగా వీరికి ఆత్మధ్యానములేదు. ఉన్నదనియెదరా? అట్లుకాదు. దేశదేశములను తిరుగుచున్నంత మాత్రమున ఆత్మధ్యానము వచ్చునెట్టులు? కాసులకొఱకు తిరిగెడి వంచకులకు మోక్షమెట్టులు కల్గును? కలుగఁజాలదు.

ఆ. దొంగమంత్రములను దొరకునా మోక్షంబు
చేతఁగాని చేత చెల్ల దెపుడు
గురువటండ్రె వానిగుణహీనుఁడనవలె, వి...155

కొందఱు మహానుభావులు మంత్రములని ఉపాసనలని చెప్పుచు వశ్యముకొఱకని మంత్రములను జపముసేయుమని చెప్పి లోకులను ముప్పతిప్పలు పెట్టుచుందురు. అట్టివారికి దొంగమంత్రమువలన మోక్షము దొరకునా? దొరకదు. పైఁగా అట్టిచేతఁగాని పనినిచేయవలదు. దానివలన నొకప్పుడు ముప్పు కూడ కలుగును. అటువంటి గురువును గురువనఁ గూడదు.



వాఁడు దొంగ. అట్టివానిని గుణహీనుఁడని యనియెదరు. కావున నీలాటివంచకులను నమ్మవలదు.

ఆ. ద్వాదశతిరుమణులు దగునట్టు ధరియించి
ద్రవిడగ్రంథములను దనరఁ జదివి
అక్షయమగు పాత్ర నమరంగఁ దాల్తురు, వి. 156

వైష్ణవులలోఁ గొందఱు పైకి కేవల మమాయికులును పరిశుద్ధులు నగువారివలె కనఁబడుచు లోకులను మోసముఁ జేయుచుందురు. అట్టివారు తమ కీర్తియైహికమున నిష్టము లేనివారివలె నటించుచు పొట్టనింపుకొనుటకై ద్వాదశోర్ధ్వపుండ్రములను పెట్టికొని తిరువాయ్మొళియను ద్రావిడవేదమును చదివికొనుచు ఇంటింటికి అక్షయపాత్రనుచేతఁబూని తిరుగుచుందురు. కావున నిట్టివారిని నమ్మరాదు.

ఆ. నీళ్ల మునుఁగ నేల నిధులఁ బెట్టఁగ నేల
మొనసి వేల్పులకును మ్రొక్కనేల
కపటకల్మషములు కడుపులోనుండఁగా, వి...157

తీర్థస్నానములని నీళ్లలోమునిఁగి దానధర్మములని యచ్చటచ్చట నిధులనుంచి తాము చేసినపాపములు పోవుట కని దేవతల కందఱికిని పేరు పేరు చెప్పి మ్రొక్కుచుందురు. ఇట్లు చేసిన యెడల జనులకు పాపములు నశించి మోక్షము దొరకునని చెప్పుచుందురు. కాని పాపములు కడుపునిండయుండఁగా కపటము నటించి దేవతలకు మ్రొక్కినంతమాత్రమున పాపములుపోవునా? పోవు.

ఆ. పట్టుబట్టఁగట్టి పట్టెనామముఁ బెట్టి
వట్టిభ్రాంతిఁ జెంది వైష్ణవుఁడయి
లొట్టిదాగినతఁడులోకులఁజెఱుచురా,వి... 158

మఱియును గొందఱు వీరవైష్ణవమని జనులను మోసపుచ్చుటకు దంభమును చేయుచుందురు. ఈవీరవైష్ణవ మంతయును దంభమునకు పెట్టిన పేరు. వీరు పవిత్రతకొఱకని లోకులకుఁ జెప్పుచు పట్టుబట్టలనే గట్టికొని పట్టెనామములను మొగమునిండ దిట్టముగాఁ బెట్టికొని లేనిపోని భ్రమనుపొంది "వైష్ణవత్వమును స్వీకరించితిమి. ఇయ్యదియే యుత్తమమగుమతము. ఇంతకంటెఁ బవిత్రమైన మతము మఱియొక్కటిలే" దని చెప్పుచు రహస్యముగా కల్లుద్రాగి కులములనులోకులను జెరుతురు. కావున నిట్టిదాంభికులను బుద్ధిమంతులు నమ్మరాదు.

ఆ. పరఁగ ప్రతిమలకును ప్రాణప్రతిష్ఠలో!
ప్రాణ మొసఁగ ప్రతిమ పలుకవలదె
మొదటివానిసృష్టి మూర్తిమంతంబైన,వి...159

విగ్రహములను జేయించి వానిని గుడులలోఁ బెట్టి ప్రాణప్రతిష్ఠలను చేసెదమని ధనమును లోకులనుండి లాగుటకు కొందఱు ప్రయత్నములను చేయుచుందురు. ఇట్టివారు చేయుకార్యములే దాంభికకార్యములు. వీనిని లోకులను మోసము చేయుటకే చేయుచుందురు. లేకపోయిన రాతిబొమ్మలకు ప్రాణప్రతిష్ఠలేమిటి? పోనీ యన్నను ఆరీతిగా ప్రాణప్రతిష్ఠఁ జేసినయా ప్రతిమలు పలుకవలదా ! మొదట ప్రాణప్రతిష్ఠ చేసిన



వాని సృష్టిమూర్తిమంతముకాదు. కావున దాంభికులను నమ్మవలదు.

ఆ. పరమయోగుల మని పరముఁ జేరఁగ లేని
మాయజనుల కెట్లు మంచికలుగు
వేసములనువిడచివిహరింపముక్తియా,వి...160

యోగులలో నెల్లరకంటె నుత్తములమని చెప్పుచు పరమేదో తామే కనుఁగొనలేక తమకంతయును తెలిసియున్నట్లు నటించి లోకులను మోసపుచ్చువారికి మంచి యెట్లువచ్చును? రాదనుట. కావున దాంభికులందఱు ఈబూటకపుమాటలనుమాయ వేషములను విడిచి ప్రవర్తించిననే వారికి ముక్తికలుగును. లేకయున్న ముక్తి కలుగదు. ముక్తి కలుగకపోయిన శుభములు వచ్చునా? రావు.

ఆ. పరుల మోసపుచ్చి పరధన మార్జించి
కడుపు నించుకొనుట కానిపద్దు
ఋణము సేయ మనుజుఁడెక్కువ కెక్కునా?వి.161

"అన్నదానము జేయుదును. అది దేవతలకుఁ బెట్టుదును" అని ఇతరులకు మోసముచేసి సాధ్యమైనంతవఱకు అప్పు చేసి డబ్బులాగి చేతఁ జిక్కించికొని సమారాధనలు సంతర్పణముల నటువైపు కట్టిపెట్టి తనకడుపునించుకొనుచు మిగుల ప్రయోజకుఁడ నైతినని యనుకొనుచుందురు. విచారించితిమేని వారు చేసినపని చేతఁగానిపని యనవచ్చును. లేకున్న అప్పుసొప్పు

లను తీసినంతమాత్రాన మనుష్యుఁ డధికుఁడై యుండఁగలఁడా? కావున నిట్టికార్యము లన్నియు దాంభికకార్యములు.

ఆ. పిండములను జేసి పితరులఁ దలపోసి
కాకులకును బెట్టు ఖలుఁడు దినము
పెంటఁదినెడి కాకి పితరెట్టు లయ్యెనో! వి...162

కొందఱు కర్మిష్ఠులమని చెప్పుచు, పర్వకాలములయందును, మృతాహమునందును, పిండములను చేసి పితృదేవతలను ధ్యానించి వారికితృప్త్యర్థమై కాకులకుఁ బెట్టుదురు. పెట్టించెదరు. వీరెంతటియజ్ఞులో చూడుఁడు. వీరియభిప్రాయము తమపితృదేవతలే కాకులై యాపిండములను తినుచున్నవి యనిగదా! నిజముగా కాకియెక్కడ? పితరుఁ డెక్కడ? పెంటదిబ్బలమీఁది యెంగిళుల నేఱితినెడి కాకి పితృదేవత యగునా? కాదు. కావున నిట్టిదాంభికులను నమ్మరాదు.

ఆ. పేరుసోమయాజి పెనుసింహబలుఁ డాయె
మేఁకపోతుఁ బట్టి మెడనువిఱువఁ
గాక క్రతువువలనఁ గలుగునా మోక్షంబు? వి.

దాంభికులు పైకి "మేము అగ్నిహోత్రులము. మేము సోమయాజులము. మేము పాకయాజులము. మాకే మోక్ష మితరులకుభిక్షము" అని తమ్ముతాము పొగడుకొనుచుందురు. మోక్షమునకై ప్రయత్నించువారు సాత్వికులై యుండవలయును. పేరుమాత్రము సోమయాజి. మేఁకపోతు మెడలుపట్టి విఱిచివేయుటకు రెండవసింహబలుఁడు(కీచకుఁడు). ఇంతమాత్రమే వీరియోగ్యత



కలుగునే కాని క్రతువు చేసినంతమాత్రమున నీదాంభికులకు మోక్షమువచ్చునా? రాదు. కావున నిట్టివారిమాటలనువిని మోసపోకుఁడు.

ఆ. బందెత్రాళ్లఁ దెచ్చి బంధించి కట్టంగ
లింగఁ డేమి దొంగిలించినాఁడొ
ఆత్మలింగమునకు నర్చింపనేరరో, వి... 164

ఆరాధ్యులు లింగమును త్రాళ్ళతోఁగ్రుచ్చి విడిపోకుండ మెడలలోఁ గట్టుకొనియుందురు. ఏల యిట్లుచేయుచున్నారనినలింగమూర్తి సంగతుఁడై యుండుట కనియెదరు. నిజమును విచారించితిమేని దొంగలనుగదా ఇట్లు బంధింపవలయును. లింగమూర్తిని దొంగనుకట్టినట్లు బందెత్రాళ్ళతో కట్టివేయుట కాతఁడు చేసిన దొంగతిక మేది? లేదు. కావున నిట్లుచేయుట దంభకార్యము, కాదందురా? ఎల్లప్పుడు నెడఁబాయని ఆత్మలింగముండఁగా పూజింపనేరరా? కావున నిట్టివారినెప్పటికిని నమ్మరాదు.

ఆ. బ్రాహ్మణులమటంద్రు బ్రహ్మత్వ మదిలేని
బ్రాహ్మ్య మద్దియేల బ్రాహ్మణుఁడట
బొమ్మవలెను తాను దిమ్మపైఁ గూర్చుండ, వి...

"మేము బ్రాహ్మణులము. బ్రహ్మస్వరూపులము. మమ్మందఱును పూజింపవలయును. మాసేవఁ జేసి తక్కినవారలు కృతార్థులు కావలయునే గాని మఱియొకరీతిగాఁ గాఁజాలరు. మమ్ముఁ బూజించిన నందఱిదేవతలను బూజించినట్టులే" యని మెట్టుపైకెక్కి కూర్చుండి పలుకుచుందురు. ఆహా! ఎంతదాంభికులు

వీరు! వీరు జాతిచేత బ్రాహ్మణులైనను బ్రహ్మతేజస్సు వీరియందు కానరాదు. బ్రహ్మతేజస్సులేని బ్రాహ్మణత్వముకూడ నొక బ్రాహ్మణత్వమా! లోకు లేమనికొందురనియైనను లేక బొమ్మవలె దిమ్మె మీఁదఁ గూర్చుందురుకదా!

ఆ. భాగవతుల మనుచుఁ బరగంగ నెవ్వరు
వారి నెఱుఁగలేరు పరుపతోడ
ఆడిపాడువార లరయ భాగవతులా? విశ్వ...

తంబుర మద్దెల, వెంటఁ బదిమంది మూరులు కూడిరాఁగా "భాగవతులము. భగవంతునియవతారములనాడెదముపాడెదము హరికథలను కాలక్షేపము నేయుదుము. చూచి యానందింపుఁడు. చేయించి తరింపుఁడు" అని ఊరూరను తిరిగెడి దాంభికులను చూచి వారి నిజమగుసమాచారమును తెలిసికొనలేక ధనమును దోచి యిచ్చుచుందురు. విచారింతిమేని భాగవతులు ఇట్లుందురా? ఉండరు. దేవుని ధ్యానించుచు డంబములేనివారు భాగవతులుకాని ఆడిపాడువారలా భాగవతులు? కావున నిట్టిదాంభికులను నమ్మకుఁడు.

ఆ. భూతి దేహమందుఁ బూసిన నయ్యెనా
నిష్ఠ శివునియందు నిలుపవలయుఁ
గాక బూడ్దెయందు గాడిద పొరలదా? విశ్వ.

శైవులలో వీరశైవులమని చెప్పుచు భస్మమును శరీరమునందంతటను నువ్వుగింజసోకుటకైనను తావులేకుండ పూసికొని "శివోహం శివోహం" మని వెఱ్ఱికేకలువైచుచు ముక్తుఁడైతిననితలంచుచుందురుకాని ఇంతమాత్రముననే వీరిని కైవల్యమబ్బునా! అబ్బదు. కైవల్యము కావలయునన్న మనోవృత్తులనన్నిటిని శివునిపైననే నిలుపవలయును. అట్లుగాకయే సులువుగా మోక్షముభస్మధారణముచేతనే వచ్చునట్లయిన-గాడిదెకు కూడ రావలదా? ఏలయని యనియెదరేమొ? అదిమాత్రము బూడిదలో పొరలి భస్మోద్ధూళనముసర్వాంగములకుఁ జేసికొనుటలేదా? కావుననిట్టి వన్నియును దాంభికులుసేయు మోసపుపనులని తెలిసికొనవలయును.



ఆ. భూతిపూసి నీవు ప్రాతభూతంబుల
వెడలఁ గొట్టఁబోవ వెఱ్ఱివనుచు
నిన్నుఁ గాంచి భీతినిలువక పారరో, విశ్వ...168

కొందఱు దాంభికులు "భూతవైద్యులము. దయ్యములను వెడలఁగొట్టెదము" అనివిభూతిపిండికట్టులను బెట్టుకొని ఊరూరనుతిరిగి దంభములను చేయుచుందురు. ఎచ్చటనైననుభూతములు తొలఁగిపోయినయెడల మామాహాత్మ్యముచేతనే యని డాబులు కొట్టుచుందురు కాని వాస్తవ మిట్టులుగాదు. ఈవెఱ్ఱిశైవులు విభూతిపిండికట్లను పెట్టికొని భూతములను వెళ్లగొట్టఁబోయిన యీవెఱ్ఱిశైవులనుగాంచి వీరలే పెద్దభూతములని జనులు వెఱచి పాఱిపోవుచుందురు. వీరుచేయు భూతోచ్చాటన మీవిధముగ నుండును. కావున దాంభికులపనులనుచూచి జనులు మోసము నొందకూడదు.

ఆ. మతపువేషధార్లు మహిమీఁదఁ బదివేలు
మూఢజనులఁ గలప మూగుచుంద్రు

కొంగలు గుమిగూడి కొఱకవా బోదెలు? వి...

లోకములో నిట్టులు జనుల వంచనచేయుటకై టక్కరులు లేనిపోనిమతములను వేషములను వేసికొని వేలకొలఁది మూరులను మతమునుండియును మతినుండియును వెలుపలిచి భ్రష్టులనుగాచేయుటకై రాత్రింబవళ్లు ఏకదీక్షతోఁ బనిసేయఁ బ్రయత్నించుచుండెదరు. ఇట్లగుట ప్రపంచమునందు సామాన్యముగా జరుగుచుండును. పండిన పైరుచేలయందలి పంటల మ్రింగుటకై కొంగలు గుంపుగూడి వచ్చినటులె యీకపటవేషధారులు సైతము దాతల మ్రింగుటకు సిద్ధపడుచుందురు. అందుచే నీవంచకులు పంటవాములపాడుచేయు బోదెకొంగల వంటివారు.

ఆ. మనసున దయలేని మాలకొడుకునొద్దఁ
జేరియున్న ప్రజకు చేటు నిజము
పెద్దతనము లెంచఁ బెంకెల చందమా, విశ్వ...

దాంభికులు ప్రజలను అల్లెము జెల్లెముచేసి మోసపుచ్చి దగ్గఱకుచేర్చి తరువాత దయలేక ఆపదలను గూర్తురు. బుద్ధిమంతు లీవిషయములను గుర్తించుకొని అట్టివారియొద్ద చేరకూడదు. నిజముగా మనసులో దయలేని మాలముండకొడుకుదగ్గిర చేరిన యెడల చేటుతప్పదు. అట్టివారు పైకివేయు పెద్దమనుష్యులవేషములనుచూచి దగ్గఱ చేరితిమా? అవియన్నియును క్రమముగా పెంకె వేషములుగా మాఱిపోవును. కావున సాధ్యమైనంతవఱకును దాంభికులమాయకు చిక్కక మెలఁగవలయును.



ఆ. మాలమేలుగుణము మంచిదికలిగిన
మాలకూడఁగుడుచు మనుజుకంటె
గుణమె మేలుకాని కులమేమి మేలురా? వి...

వంచకులు కొందఱు తక్కువజాతిలోనివారగు మాలలను చూచినపుడు "మే మగ్రజాతివారము. మాకంటె వీరు లొచ్చు. వీరికంటె మేము హెచ్చు" అని పలుకుచు పరనింద అసత్యభాషణము ద్రోహము మున్నగు దుర్గుణముల నొంద నలవాటుపడి యుందురు. సత్యముగా కులముచేత మాలవాఁ డైనవాఁడు మాలఁడుకాఁడు. మేలుగుణములుకలిగిన మాలయే మేలు. నీచగుణములుగలిగిముఱికికూడుతినువాఁడే యధముఁడు. గుణము మేలే మేలుకానికులము మేలు మేలగునా? కాదు. కావున నిట్లనుట దంభకృత్యము. ఇట్టివారిని నమ్మకుంట మిక్కిలిమేలు.

తే. ముక్కు కన్నులు చెవు లంటి మూయనేల
తెలిపి తెరగంటిలోపలఁ దేటపఱచి
తిరుగనేర్చినవాఁడె పో దీక్షితుండు
ఊరకయు మూయ డంబంబు లోరి వేమ. 172

యోగుల మనుకొని ముక్కులను మూసికొని చెవులు పట్టుకొని కూర్చుండి డంబములు చేయుచుందురేకాని అందువలన నిసుమంతయును ప్రయోజనములేదు. అందువలన కాలయాపనయేగాని నిజము బోధపడదు. నిజమును తెలియఁదలఁచినవాఁడు కన్నులఱమోడ్చి ధ్యానమును చిత్తమునందుచేర్చి సంచరింప నభ్యాసమును చేసికొనవలయును. అట్టివాఁడె మనస్సును జయిం

చినవాఁడగును కాని యూఱక లేనిపోనిడంబములనుచేసినవాఁడు వ్యర్థుఁడే యగును. కావున డంబమును విడిచిపెట్టవలెను.

ఆ. ముద్రలన్న నేమొ మురిసెద రయ్యయో
భద్రముగను మనసు పరగకున్న
వెఱ్ఱిచేష్టలగును విసరింపముద్రలు, విశ్వ...173

వంచకులు బయలుదేరి షణ్ముద్రలని పంచముద్రలని శాంభవీముద్ర యని ఇట్లు వేలువేలు పేరులను చెప్పి యాముద్రలను సక్రమముగా ధారణచేయఁగలవాఁడు ముక్తుఁడగునని చెప్పి వంచనసేయుదురు. లోకులు పాపము అమాయికులే ఆమాటలనునమ్మి ఆముద్రలలో నేమో మాహాత్మ్య మున్నదని యనుకొని మురియుచుందురు. నిజ మిటుగాదు. మనస్సును జాగ్రత్తగా పదిలముచేసి సంచరించుటయే ముద్రయనఁబడును.. దీనిని తెలియకయిష్టమువచ్చినచొప్పునచేసినచో నవివెఱ్ఱివానిచేష్టలగును. కావున విచారింపక దాంభికకార్యములఁ జేయఁబోఁగూడదు.

ఆ. మొనసి యింద్రియముల మొదట నిల్పఁగ లేక
సమసిపోవువేళ సన్న్యసింత్రు
ఆత్మశుద్ధిలేక యంటునా మోక్షంబు, విశ్వ...

అవయవములలో బలమున్నంతకాలము దేవుఁడున్నాఁడని గాని కర్మలున్నవని గాని చెప్పిననమ్మక లోకములను మోసగించు తలంపుతో ఇంద్రియములను జయింపలేనివారలు దాంభికులమాటలను విని అవసానకాలమున సన్న్యాసమును సర్వపాపములు నశించి ఆత్మసాక్షాత్కారమగుటకొఱకు స్వీకరించుచుందురు.



ఇట్టివారికి ఇఁక నిటువంటిడాబుల నెన్నిఁటిని జేసినను ఆత్మశుద్ధిలేక మోక్షము దొరకనేదొరకదు. కావున దంభపుపనులను చేయుటకు తలపెట్టరాదు.

ఆ. మోసమునను దనకు మొదటిముఖ్యతపోని
మోసమునను తనదు మురువు దప్పు
మోసమునను తనదు మోక్షము తప్పురా, వి.

వంచకులు లోకులను మోసపుచ్చుటయే తమముఖ్యకార్యముగా భావించి అట్లుచేయఁ బ్రయత్నించుచుండెదరు. ఇట్లు చేయుటవలన ననేకములు ప్రమాదములు గలుగును. మోసమువలనతొలుత తనప్రాముఖ్యత(అనఁగా: గొప్పతనము)పోవును. మఱియును మోసముచేత సంతసము ప్రేమ తొలఁగిపోవును. మోసముఁ జేయుటచేతనే తనకు మోక్షము గూడ రాకపోవును. కావున దాంభికులై ప్రజలను మోసపుచ్చుటకు పూనుకొనరాదు.

ఆ. ముచ్చు గుడికి పోయి ముడివిప్పునే కాని
పోసఁగ స్వామిఁ జూడఁ బోఁడతండు
కుక్క యిల్లు సొచ్చి కుండలు వెతకదా, విశ్వ....

దాంభికు లొకవేళ నెప్పుడైనను సత్కార్యములను చేయఁబూనుకొన్నను అదియును లోకులను వంచించుటకే కాని వేఱొకందునకుఁ గాదు. ఎట్లనఁగా: దొంగ, ఎప్పుడైనను పొద్దుపోక గుడికిపోయినయెడల నాతఁడు స్వామిభక్తిచేఁ బోయెనా? కాదు. అచ్చటికి ఎవ్వరైనను ధనికులువచ్చినయెడల

వారికొంగుమూటలలోని ధనము దొంగిలుటకే పోవును. ఇల్లే కుక్కగూడ ఇంటిలోఁ జొరఁబడుట కాపాడుటకు కాదు. కాని ప్రతికుండను దొంగిలుటకుతొంగిచూడదా? కావున దాంభికులపట్టుల జాగ్రత్తగా మెలఁగవలయును.

ఆ. యజ్ఞయాగములని యన్ని చేసినఁ గాని
 ఆత్మయజ్ఞ మగునె యంటిచూడ
 క్రతువు చేయువారు కానంగ దొంగలు, విశ్వ.

వంచకులు లోకమును కప్పివేయుటకు యజ్ఞములు యాగములను పేర్లతో ఎన్నింటిని చేసినను అవియన్నియును ఆత్మబోధయను యజ్ఞముతో సరిరాఁగలవా? రాఁజాలవు. కావున యజ్ఞములను జేయువారందఱు లోకమును మోసముచేసి డబ్బు లాగికొని హింసచేయు పచ్చెపుదొంగలుగా పరీక్షించి చూచిన యెడల తెలియవచ్చును. ఇట్టిదాంభికులను ఎప్పటికిని నమ్ముట మంచిపని కాఁజాలదు.

ఆ. రాతిబొమ్మకేల రంగైనవలువలు
 గుళ్లుగోపురములుఁ గుంభములును
 కూడుగుడ్డ తాను గోరునా దేవుఁడు? విశ్వ...

మోసగాండ్రు 'రాతివిగ్రహములకు పట్టుబట్టలు పచ్చని బంగరుసొమ్ములను బెట్టి యలంకరించి, అవి దేవతామూర్తులని యును,వీనికి గుళ్లను గోపురములను గట్టించి మాన్యముల నిచ్చి ఉపచారములఁ జేయించిన దేవుఁడు సంతసించి ముక్తినిచ్చునని యును చెప్పి జనులను అజ్ఞానమున ముంచెదరు. దంభమే గాని



రాతిరంగు బొమ్మలకు గుడ్డలెందుకు? గుళ్లెందుకు? గోపురములెందునకు? ఉదకకుంభము లేమినిమిత్తము? వీరు పెట్టుకూడుగుడ్డలను దేవుఁడు కావలయునని కోరునా? కోరఁడు. కావున నివి యన్నియు దంభకృత్యములు. వీనివలన మోసపోకూడదు.

ఆ. గాయి యయ్యె దైవరాయఁడు భువిలోన
 భక్తి మ్రొక్కువారు బండలె కద
 దేవునంతవారు భావింప భక్తులా! విశ్వ...

రాతిబొమ్మలకు మ్రొక్కుడిడుమని చెప్పు దాంభికుల కృత్యములు చూచిన నవ్వువచ్చుచున్నయది. ఏమి వీరియాగడము. దేవాదిదేవతలకందఱికి నధిపతి యగు దేవరాజును రాతిని జేసిరి. ఆబండకు మ్రొక్కుటకందఱిని పురికొల్పెదరు. పరికించి నబండలకు మ్రొక్కువారందఱు బండలే కదా! దేవుఁడు నిజమగుబండ. ఆబండను సేవించుమనుజులందఱుబండలు. కావుననీ రెండుబండలుసమానము. బండయగు దేవుని సేవించు నజ్ఞానులగు మనుష్యులనుబండలు భక్తులెటులగుదురు? ఇదిదాంభికులుచేయు మోసము.

ఆ. రుద్రరూపుఁ దాల్చి రుద్రుని నిందించు
 భ్రష్టుత్రోవ నరుగు భ్రష్టజనుఁడు
 అంకునకును తిరుగురమణులవలెనుండ్రు, విశ్వ.

జనులందఱును శివస్వరూపులనియును శివమయమే సకల ప్రపంచమనియును వేదములు చెప్పుచున్నవి. కావున లోకులెల్లరును శివునిరూపములే యగుదురు. వంచకులు తాము స్వయ

ముగా శివరూపధరులై లోకులనువంచనచేయుటకై శివునినిందింపమొదలు పెట్టుచున్నారు. ఇట్టిపతితులత్రోవనే పలువురేగుచు శివరూపములధరించి శివదూషణము గావించుచున్నారు. లోకవంచకులగు నిట్టిదేవదూషకులసంచారములు, మిండనికై తిరుగు అంకటాండ్ర తిరుగుబోతుతనమును సర్వవిధములఁ బోలియున్నదిగదా!

ఆ. లోనఁ బదిలపఱచి లోవికారం బెల్లఁ
దరుగకున్నవాఁడు తపసికాఁడు
వెలివికారమెల్ల విధిపాలికోర్కు-లే? విశ్వ...

తపసులమనికొందఱు తుంటరులు, లోలోపలనేమేమో మనోవికారములనుంచికొని పైకివానినన్నిఁటిని తెలియరానీయక నణఁచివేయుచుందురు. అట్టివారు నిజముగా తపసులు కారు. తపసులపేరనున్న దుండగీఁడులు. వీరు పైకి ఇట్లున్నను నాలోపలి కోర్కు-లు దాగఁజాలవు. దంభమునను పైకి మంచిగుణములున్నట్లు నటించెదరు. ఇవిఫలించునా? ఫలింపవు. కావున దంభమునువదలిపెట్టి సత్యమునను బ్రయత్నమును సేయుచుండుము.

ఆ. పడుగు ద్విజుల కెల్లఁ గడుముఖ్య మందురు
పడుగుఁ జేసెద మని పదరుచుండ్రు
కడుగుఁ ద్రావి కాకి కట్టుక ట్టున్నట్లు, విశ్వ...

బ్రాహ్మణుల కందఱికిని పడుగు ముఖ్య మని చెప్పి చూచిన ప్రతివారిని మీవానికి పడుగుజేయుమని త్వరపెట్టి డబ్బుకర్చు చేయించి మోసపుచ్చుచుందురు (దాంభికులు). కాని నిజముగా పడుగన నేమో అదియెవ్వరికి యెప్పుడు ముఖ్యమో కొంచెమైనను వారు తెలిసికొనలేరు. ఇతరులను మాత్రము వెనుకముందులనరయక గోతిలోద్రింపుటకు తప్పక ప్రయత్నమును సేయుచుందురు. వీరు-అనఁగా నిట్టి దాంభికులగులోకులు కాకులతోసమానులు. కాకులుగూడ తమజాతితోఁజేరి మంచిచెడ్డ యనక గుడిలిని త్రాగి కూయుచుండును. కావున నిట్టివారిమాటలను పాటించి మోసపోఁగూడదు.



ఆ. పంతు లింగముగను పరుసబూడిదెఁ బూసె
అంతరంగ మెఱుఁగ సంత్యజాతి
సంతబసివికొడుకు జంగముదేవరా, విశ్వ...

దాంభికులు లోకులను మోసపుచ్చుటకై తాముఁగూడ సత్యమతముల నవలంబించువారి తెఱఁగున కపటముగా నటించుచుందురు. వానిఁజూచి జనులు మోసమును చెందకూడదు. చూడుఁడు. ఎవఁడోయొకఁడు నిజమగు శైవుఁడు భస్మధారణమును చేసికొనియెనని పంతుకు తానుకూడ బూడిదను బూసికొని తానును వారును సమానులమని తలంచుచుండునేకాని ఒకరికొకరికుండు తారతమ్యమును గుర్తెఱుంగఁజాలరు. ఎవరోయొక్క-రు మహానుభావుఁడు జంగమయ్యెనని సంతబసివికొడుకుకూడ జంగమువేషమును వేసికొనెను... ఇట్టివారే దాంభికులు. వీరినుండి జాగ్రత్తగా సంచరింపవలయును.

ఆ. విన్న సుద్ది కొంత వినని సుద్దులు కొన్ని

వింతసుద్దులెన్నొ వినఁగఁ జెప్పు
దాను గన్నయట్టె దాంభికుఁడెప్పుడు. విశ్వ...

వంచకులు లోకులను వంచనసేయుటకు ఉన్నవానిని లేని వానిని కలిపి తమసొంతపాండిత్యము నందుఁ జేర్చి వేదములలో నివని శాస్త్రములలోనివని పెద్దలు చెప్పిరని ఈరీతిగా వింత వింతలైన సంగతులను వినుట కింపుగాఁ జెప్పుచు మూర్ఖులను వశపఱచుకొనుచుందురు. అట్టిసమయములలో నెవ్వఁడైన నిది మీకెట్లు తెలిసె ననియడిగినఁ దాము ప్రత్యక్షముగాఁ జూచి నట్లు చెప్పెదరు. కావున నిట్టియసత్యవాదులగు వంచకులమాయ లను చిక్కక బుద్ధిమంతుఁడు జాగ్రత్తగా మెలఁగవలయును.

ఆ. విప్రవరుల మనుచు వేదంబు చదువక
ప్రాకృతులను జూచి పరిహసించు
ధరణిసురులకన్న దాసరిమత మెచ్చు, విశ్వ...

బ్రాహ్మణోత్తములమని వేదవేత్తలగు వారివంశమున జన్మిం చితిమని చెప్పుచు స్వకులాచారమగు వేదాధ్యయనమును సేయక తమకన్న తక్కువవారిని చూచి పరిహసింప మొదలు పెట్టెదరు. వీరికంటె దాంభికులు లోకములో లేరు. నిజముగా దంభము చేయుటచేతనే బ్రాహ్మణులు గొప్పవార లయ్యెదరేని బ్రాహ్మ ణోత్తములమతముకంటెను దాసరిమతము గొప్ప కావలదా? కావున సత్యప్రియులై దంభమును జేయక లోకులను మోస పుచ్చక తమకులాచారములను నెఱవేర్చుకొనవలయును.



ఆ. పొడుగుగల్లుజడలు పులితోలు భూతియు
కక్షపాలలు పదిలక్షలైన
మోఁతచేటె కాని మోక్షంబులేదయా, వి...

వీరశైవులును కపాలమతస్థులును తమతమమతాధిక్యతను సూచించుట కని పేరుపెట్టికొని జడలను దాల్చికొని పులిచర్మ మును పఱచికొని డంబముగాఁ గూరుచుండి కక్షపాలను ధా ల్చి ధ్యానించుచున్నారము దేవుని అని చెప్పుచు దంభమును జేయ మొదలు పెట్టెదరు. అట్టివారు దాంభికులే కాని నిజ మగుమతాభిమానము గలవారలు కారు. జడలను ధరించికొన్నను పదివేలకక్షపాలలను మోసినను మోతచేటే కాని మోక్షము కొంచెమైనను దానివలన దొరకుట యసంభవము కావున నట్టి దాంభికులవలలోఁ దగులుకొనరాదు.

ఆ. వెట్టిబట్టువాని వినయము లధికముల్
చెడ్డముండముసుఁగు చెలఁగుచుండు
చెడిపెకొడుకు మిగులఁ జేయునాచారంబు, వి.

నిజముగా నాచారములయం దాసక్తికలవార లవలంబించు నాచారములకంటెను దాంభికుని యాచారములు పదివేలరెట్లు అధికముగా నుండును. ఇట్లు చేయుచుండుట లోకవంచనచేయుపురుషునికి సహజకృత్యమయియున్నది. చూడుఁడు. వెట్టివె ట్టిగాకవిత్వము పసలేక చెప్పు బట్టురాజు లేనిపోనివిషయముల ననేకములను గనఁబఱచును. చెడిపోయినచెడిప్ప వీథిలోనెవరైన పొడగట్టకమునుపే శీలవతివలె మఱింత ముసుగును వేసికొనును.

ఇట్లే కులటాపుత్త్రుఁడు లోకమును వంచనసేయుటకు మఱింత యాచారకాండను పెంచి చేయ మొదలుపెట్టును.

ఆ. వేనవేలు చేరి వెఱ్ఱికుక్కలవలె
అర్థహీనవేద మఱచుచుంద్రు
కంఠశోషకంటె కలిగెడి ఫలమేమి? విశ్వ...

బ్రాహ్మణులు గతానుగతికులై వేలకొలఁది గుంపులుగూడి వేదపారాయణ మని పేరు పెట్టుకొని అర్థహీనముగా వేదముల నుచదువుచుందురు. అట్టిచదువువలన నిసుమంతయు నుపయోగ ముండదు. నిరర్థకముగా నటు వేదములను చదువువారికిని కుక్కలకును భేదమేమి? కంఠశోషమాత్రమే కాని ఆద్దానివలన నిసుమంతయును గౌరవములేదు. కావున జనులు దాంభికులై లోకమును వంచనసేయఁజూడక సర్వజ్ఞులై సత్యమును వెల్లడి చేయవలయును.

ఆ. వైశ్యుల మనియెడివార్తమాత్రమె కాని
దొంగ లింతకంటె దొరకఁబోరు
నేలమీఁద వీరి నేర్పుల నేమందు? విశ్వ...

కోమటులము మేము. కోటికి పడగయెత్తినవారలము. అని కబుర్లను జెప్పుకొనుటయే గాని నిజమును పరికించితిమేని ఇంత కంటెను మించిన దొంగలు ఈలోకములో నితరులు దొరకరు. వీరలే దొంగలు. వీరి నేర్పు లన్నియును నేలమీఁది సాములు. అనఁగా నుపద్రవకరములు గావనియర్థము. వీరు ఇట్లు ఇతరులను మోసపుచ్చుటతోడనే కాలమును గడపెదరు.



ఆ. శీలమనుచు నరుఁడు సిగ్గింతయును లేక
పరుల సొమ్ము లెల్ల పరిహరించి
వేషభాషవలన మోసంబుఁ జేయును, వి...190

శీలమంతులమని పేరును బెట్టుకొని దాంభికుఁడు కొంచెమైనను లజ్జనొందక పరుల ద్రవ్యములను కొల్లకొల్లలుగా దోచికొనుచు దినదినమొక వేషమును భాషను మార్చి ప్రజలను నమ్మించి సత్యమతమునుండి వేఱుపఱచి మోసముచేయుటకు ప్రయత్నించుచుండును. కావున జను లిట్టివానిని చక్కగా గుర్తెఱింగి వారివలలలోఁ జిక్కి మోసముల నొందక జాగ్రత్తగా సంచరింపవలయును.

ఆ. సకలతీర్థములను సకలయజ్ఞంబుల
తలలఁ గొఱుగకున్న ఫలము గలదె
మంత్రజలముకంటె మంగలిజలమెచ్చు, వి...

దాంభికులు, యాత్రలకు వచ్చినవారిని మోసమును జేసి డబ్బులాగుటకై ప్రతితీర్థములోను బ్రతియజ్ఞములలోను బ్రాయశ్చిత్త మనుమిషచేత పవిత్రత వచ్చునని చెప్పి తలలను నున్నగా గొరిగింపఁ జూతురు. పవిత్రము చేయునది మంత్రోదకమా? మంగలినీళ్లా? ఆలోచించుఁడు. కావున నిట్టివంచకులబారిం బడి యనుక్షణమును మోసపోక సత్యమునందు శ్రద్ధాళులై యుండుఁడు.

ఆ. సతులు జపతపముల సల్పఁగ సాఁగినఁ

బురుషు లేల నీకను బుడమిలోన
పాప మెంచవద్దు పట్టి శిక్షింపుఁడీ, విశ్వ...192

కొంద ఱాఁడువాండ్రు ఇంటిలోఁ బనులను పాటలను మానుకొని సోమరులై జపములని తపములని యోగములని పేరులను బెట్టికొని యోగ్యతకు మించిన వేషమును వైచికొని పురుషులను లక్ష్యముసేయక తిరుగసాగుదురు. వీరు గూడ నొకజాతిదంభము కలవారిలోఁ జేరినవారలే. కావున నిట్టివారిని పాపమనక పట్టికొని కట్టివైచి యొకమీఁద నిట్టిపనుల నెన్నఁటికిని జేయకుండునటు కొట్టి శిక్షింపవలయును.

ఆ. సంధ్య వార్చ నేమి జపము సేయఁగ నేమి
వేదశాస్త్రములను వెలయ నేమి
పరముఁ గననివాఁడు బాపఁడు గాఁడురా, వి.

బ్రాహ్మణులు కొందఱు 'సంధ్యవార్చిన నే ముక్తుఁడగును. జపము సేసిన నే పరలోకము కలుగును. వేదశాస్త్రముల నవశ్యముజదువవలయును. అటు లేనియెడల పతితుఁడగును. ముక్తుఁడు గాఁడు' అని చెప్పుచుందురు. ఇవి యన్నియును దంభపుమాటలే. సంధ్య వార్చిన నేమి, వార్వకున్న నేమి, వేదశాస్త్రములను జదివిన నేమి చదువకున్న నేమి? ఎవఁడు పరమును దెలిసినవాఁడో, వాఁడు బ్రాహ్మణుఁడు గాని తక్కినవాఁడు బ్రాహ్మణుఁడా? కాఁడు. అట్టివాఁడు కేవలము మోసగాఁడు.

ఆ. సోమయాజి ననుచు సొంపైన శాలువల్
మకరకుండలములు మనసు దీరఁ



దా ధరించు మనకుఁ దానేమి లాభించు? వి...

వంచకుఁడు ఇతరులను మోసముచేయుటకై తాను సోమయాజుల మని చెప్పుచు శాలువలు సొగసుగా తలకుఁ జుట్టికొని పట్టైన మకరకుండలములను ధరించి తిరుగును. తెలియనివారు వానిని జూచి భ్రమయుందురే కాని, ఆశాల్వలు, ఆకుండలములు ఆగొప్పవానికే ఉండెను. మనకేమి యని యనుకొనఁజాలక మోసపోయెదరు. కావున బుద్ధిమంతుఁ డిట్టి దాంభికులను దొలఁగి సుఖింపవలయు.

ఆ. హీనజాతివాని కెచ్చువైష్ణవ మిచ్చి
ద్విజుల కన్న దొడ్డ తీరటంద్రు
కల్లుకడవ గడిగి గంగ నించిన రీతి, విశ్వ...195

విశిష్టాద్వైతులు కులము తక్కువవాని నొక్కనిం దెచ్చి వానికి వైష్ణవమతమునిచ్చి "అతఁడు దాసుఁడై యందఱికంటెను త్తముఁ డయ్యె" ననియనుచుందురు. ఇది బూటకపుమాట. ఈమాత్రముచేత గౌరవము శుచిత్వము రాదు. గౌరవలఘుత్వములకీనడుమంత్రపువైష్ణవమెన్నటికి సాధనము గాదు. కల్లుకుండలో భాగీరథీపావనోదకముంచినచో జలమునకుఁగల పావనత పాడైపోవును. అటులే నీచునకు వైష్ణవతత్త్వముపదేశించనచో మతమునకే లోటు.

క. హృదయము పదిలంబైనను
గుదికొను సన్న్యాసమునకుఁ గొమ్ములు గలవా
యిదె యెఱుఁగరు చదువరు లట

మది ముక్తికి నాస్పదంబు మహిలో వేమా.196

లోకులను మోసముచేయుటకై వంచకులు సన్న్యాసమని విషయపరిత్యాగమని పలువిధములఁ జెప్పి లోకులను భ్రమింపఁ జేయఁ బ్రయత్నించుచుందురు. ఇన్నితిప్ప లీదాంభికులతో నేల పొందవలయును? మనస్సు మఱలించిన పరతత్త్వమును నేర్చుకొనవచ్చును. ఎంతసులభ మోచూడుఁడు. ఇదె ముక్తిదొరకుటకు పాత్రము. ఈమాత్రముసంగతి నెఱుఁగరు. మరల వీరొకచదువరులట! ఎంతవింత! మనవారు సన్న్యాసముసన్న్యాసమనికలవరింతురుగానిసన్న్యాసము మొగమునఁ గొమ్ములేమెని మొలచినవాఁ హృదయమేకాగ్రమొనరించినచో సన్న్యాసమేయక్కఱలేదు. కావున నిట్టిదాంభికులమాటలను విని మోసముఁ జెందక బుద్ధిమంతుఁడు జాగ్రత్తగా మెలఁగవలయును.



# 3. విద్వత్పద్ధతి.

---

అవతారిక:—విదధాతువునుండి నిష్పన్నమైనరూపము విద్వాంసుఁ డనునది. విద్వాంసుఁ డనఁగా జ్ఞానముగలవాఁడు. అనఁగా: పండితుఁడనుట. ఈవిద్వాంసు లెట్టివారలో, వీరిస్వభావమేమొ, ఈజ్ఞానమురీతి యెట్టిదో, వీరికుండెడిగౌరవ మెంతటిదో మున్నగువానిని ఈపద్ధతియందు చెప్పఁగలఁడు. కావున నిప్పుడీపద్ధతిని (అనఁగా విద్వత్పద్ధతిని) చెప్పుచున్నాఁడు.—

ఆ. అంది యందనట్టి యచలస్వరూపంబు
పొందుపడఁగఁ బూని పొదలువాఁడు
చెంది మిన్నకుండుఁ జిన్మయాకారుఁడు, వి...197

తాత్పర్యము:—జ్ఞానస్వరూపముఇట్టిదని కనుఁగొనుటమిగుల కష్టమైనకార్యము. కాని యది అందియునందనిది. అనఁగా: గమ్యమయ్యు నగమ్యమగురీతి భాసిలుచుండెడి స్థిరరూపము. ఇట్టిజ్ఞానమునుబొందునట్లు చరించువాఁడే విద్వాంసుఁడు. అట్టి విద్వాంసుఁడు ఉత్తమమైనజ్ఞానమును, లేక విద్యను పొంది నేను ఇంతపనిని చేసితినిగదాయని గర్వింపఁడు. ఎప్పుడు తనలో తాను చిత్స్వరూపముగని సంతుష్టిఁ జెందును. ఇట్టివాఁడెవిద్వాంసుఁడు.

ఆ. అన్నమునకు నంట దఱిన నాత్మకు నంటు
ఆత్మను బెనఁగొన్న యన్నమంటు
ఆత్మశుద్ధి యన్న మన్నశుద్ధియు నాత్మ, విశ్వ...

విద్వాంసులు ఆర్జించినజ్ఞానప్రభావ మింతయని చెప్ప వలనుపడదు. అయ్యది అన్నమునకు నంటికొని యెంగిలికాదు కాని ఆత్మకు అంటిపోవును. ఆయాత్మ నన్నము నంటుకొనుచుండును కావున నాత్మశుద్ధి యన్నమును అన్నశుద్ధి యాత్మయు నగుచున్నది. అనఁగా: జ్ఞానము అఖండరూపియై దేహాతిరిక్తమై మాయసాంగత్యములేక ప్రకాశించు ననియును అట్టిజ్ఞానము గలవాఁడె విద్వాంసుఁడనియును దెలియవలెను.

ఆ. అరయ మూలనందు నర్థంబునందును
నిర్మలాత్మునందు నియతునందు
బయలునందు శ్రుతులభావంబు నొక్కటి
వెలయ శివునిఁ జూచు వేడ్క వేమ. 199

జ్ఞానస్వరూపమే బ్రహ్మము. జ్ఞానవిరాజితులు బ్రహ్మోపాసకులు. ఈజ్ఞానము బ్రహ్మమువలెనే సర్వవ్యాపియై సర్వసమత్వముం జెందియున్నయది. చూడుఁడు. విచారించినయెడల నీజ్ఞానము మూలములయందును, వస్తువులయందును, పరమాత్మయందును, ప్రతినియగుదానియందును, నియతాత్మునియందును, ఆకాశమునందును, శ్రుతులయర్థముఁ జెప్పెడియుపనిషత్తులయందు నొక్కటిగా నున్నది. కావున బుద్ధిమంతుఁడు విద్వాంసుని చిన్నపెద్దతనమున నెంచవలదు.



ఆ. అష్టతనువులకును నాదిమ మైనట్టి
యాదిశక్తి గూడి యభవుఁడగును
భయము లేక యుండు బ్రహ్మజ్ఞుఁడగు యోగి, వి.

మూర్ఖు లీశ్వరస్వరూపము గుర్తింపలేక వ్యర్థవ్యాఖ్యానములు చేయుచుఁ గాలయాపన మొనరింతురు. పండితుఁ డింవలిసార మెఱింగి ముక్తిపథము సులభముగా నన్వేషించి శివస్వరూపము గుర్తింపగలఁడు. శివుఁడు పృథివ్యాది అష్టతనువులచే నష్టమూర్తిత్వముఁ బడయకముందె సృష్టికిమూలకారకురాలగు ప్రకృతితో (ఆదిశక్తితో)గూడి యభవుఁడు (జన్మరహితుఁడు) అగుచున్నాఁడు. ఈరహస్య మెఱిఁగినయోగితన బ్రహ్మజత్వముచేనిర్భయముగ మోక్షముసాధించుచున్నాఁడు. ఇదియెవిద్వత్పద్ధతిసుమా.

తే. ఆత్మ తనలోన గమకించి యనుదినంబు
నిర్గుణాత్మార్చనముఁ జేసి నిత్య మమర
ప్రత్యగాత్మను లోకించి ప్రబలుయోగి
సచ్చిదానందపద మందు సతము వేమ. 201

మూరుఁడు తనలో దేవుఁడున్నాఁడని తెయలేక దిమ్మతిరుగుచుండును. విద్వాంసుఁడో యట్టులుగాదు. ఆయన ఆత్మసుతనుఁగా దైవరూపమును ఆత్మలోనే పరికింపగలఁడు. అట్లు పరికించి ప్రతిదినమును తానుచేయుకార్యములను ఆత్మార్పణముచేయును. ప్రత్యగాత్మను మనంబులో పొదుకొల్పికొనును. ఇట్లు ప్రబలియోగియై చివర చిదానందమును బొందును. కావున విద్వాంసుఁడవగుటకుఁ బ్రయత్నింపుము.

ఆ. ఆత్మలోని సొమ్ము నంజనమునఁ జూచి
యంటితిరుగునట్టి యతఁడు యోగి
పుంజు గూటనుండి ప్రొద్దెఱింగియె కూయు, వి.

విద్వాంసుఁ డెట్టి నింద్యమగుస్థితిలో నున్నను అనఁగా: బీదయైనను తనధనమగుజ్ఞానమును మాత్రము మఱచిపోఁడు. ఎట్లనఁగా-కోడిపుంజు వేళ తెల్వారుటకు బయలుకువచ్చి ప్రొద్దును చూచియే కూయ నవసరములేదు. గూటిలో నుండినను సమయము నెఱింగియే కూయఁగలుగును. అట్టులేవిద్వాంసుఁడును బంధములలోఁచిక్కినను హృదయమునందిమిడియున్నపరమాత్ముఁ డనుసొమ్మును జ్ఞానమనెడి యంజనముతోఁ జూచి దేహధారియయ్యునరిషడ్వర్గమునకు లోనుగాక మోక్షమొందుచున్నాఁడు. అట్టివాఁడె నిక్కమగుయోగీశ్వరుఁడు.

ఆ. ఆర్యులైనఘనులు కార్యహీనులు గారు
శౌర్యధైర్యములను సంతరించి
పూర్ణభావ మమరఁ బొందుచుందురు, వి.

పూజ్యమతులయిన పండితు లెప్పుడును ఎట్టితక్కువస్థితిలోనున్నను వ్యర్థులు కానేకారు. ఇట్టివారు శౌర్యమును ధైర్యమును వలయునంతను సంపాదించికొనియెదరు. ఉత్సాహమును భంగముచేయువారిఁ జేరఁబోవరు. తమంతతాము ప్రయత్నించి జ్ఞానమునందు పూర్ణభావమును బొందుచునుందురు. ఇట్టివారే పండితులు.



ఆ ఇంటిలోని జ్యోతి యెంతయు వెలుఁగఁగాఁ
బొరుగువారి యగ్గి కరుగదెవుఁడు
తాను దైవమాయె దైవముఁ గొలుచునా, వి.

విద్వాంసుఁడు మూర్ఖునివలె కన్నవారినెల్ల గురువులనుగాను కాచిరక్షింపవలసినవారినిగాను వేఁడఁడు. కనఁడు. ఎందువలననఁగా తానె గొప్పజ్ఞానమునకునిధియైయున్నాఁడు. అట్టివాఁడు ఇతరుని వేఁడఁబోవునా? పోఁడు. ఎట్లందురా వినుఁడు. తనయింటిలో నిప్పున్నవాఁడు పొరుగింటిలోనిప్పునకు బిచ్చమునెత్తఁబోవునా? పోఁడు. అట్లే విద్వాంసుఁడు గూడ తానే జ్ఞానరూపియైన దేవుఁడై యితరుల దైవములసేవింపఁడనిభావము.

ఆ. ఇసుక బొగ్గు రాయి యినుమును స్వర్ణంబు
కసవుపోచవలెను గనుచునుండి
పరమపదము గాంచు పరిణామమందున, వి. 205

మూర్ఖుఁడు తెలివిలేక కంటికి కనఁబడిన ప్రతివస్తువునందు నాశలఁ బెట్టుకొని త్రిప్పటలు పడుచుండును. విద్వాంసుఁడట్లు అలసటచెందఁడు. ఆతనిదృష్టిలో నంతయును సమానముగా గనుపడును. ఎట్లందురా చూడుఁడు. ఇసుక, బొగ్గు, రాయి, యినుము, బంగారము వీనిని గడ్డితో సమానముగా నుపయుక్తానుపయుక్తములనుఱెంటిని జూచును. అవసానకాలమున పరమపదము నొందును.

ఆ. ఈఁది దాఁటఁగలఁడు నేసాగరంబైన
సాధువృత్తితోడ సమయమందు

పాదుకొనుచు మనసు పరిపూర్ణ మొందును, వి.

మూర్ఖుఁడు సంసారమును సాగరము అనుకొనుచు సంతరించలేక త్రిప్పటల నొందుచుండును. విద్వాంసుఁడో అటు కాదు. ఇట్టిసముద్రము లేక నేఁబదియైనను ఈఁదఁగలఁడు. దాఁటఁగలఁడు. నే నింతవాఁడనైతిని గదా యని పొంగఁడు. ఎప్పుడును సాధువృత్తితో నుండును. తగినసమయ మతటస్థించినపుడు పాదుకొని చలింపక పూర్ణస్వరూపుఁడై వెలుఁగును.

ఆ. ఈశ్వరునిఁ దలంప నేడుపాళ్లుగఁ జేసి
తనదుమూర్తి నెల్ల దారఁబోసి
నిత్యకర్మములను నిలుచురా నెఱయోగి, వి. 207

తెలివిగలవారలు పండితులు ఈశ్వరుని అష్టమూర్తిని కా భావించెదరు. ఆయీశ్వరుని నేడుభాగములను గాచేసి, అనఁగా: పదార్థవిభాగమును భాగించి, తనరూపమును గూడ నందుఁ జేర్చి శివుని అష్టమూర్తిగా భావించుటయేగాక శివోహంశివోహ మనుకొనుచుఁ దన్నుఁ దా శివస్వరూపముగ నెంచుచు గర్మల నాచరించుచు మెలఁగును. చివరను శివస్వరూపుఁడగును. మొఱకు గతిగానక చింతాస్వరూపుఁడగును.

ఆ. ఉత్తమ శివయోగి యూహించి సాధించి
సత్తమమునఁ బోరి సరకుగొనఁడు
పొత్తమునఱచియుండు పూర్ణభావంబున, విశ్వ. 208

అత్యుత్తముఁడగు విద్వాంసుఁడు దాంభికులు నాస్తికులు చెప్పెడి లోభవాక్యములను లక్ష్యము పెట్టఁడు. తాను స్వయము



గా విచారించి తెలిసికొని తమోరూపమునువిడచిపెట్టి నిస్సంగుఁడై పరిపూర్ణమగుబ్రహ్మపదార్థమై ప్రకాశించును. మూర్ఖుఁ డిట్టులుగాదు. కావున విద్వాంసుఁడవగుటకుఁ బ్రయత్నింపుము.

తే. ఉదరపోషణకొఱకు కన్న నుబ్బరాదు
మదిని లోగుట్టు విడకయే మర్మమూను
సదయహృదయుండు శివయోగి శాశ్వతుండు
ఉపమ సాధించి మించెడు నుర్వి వేమ. 209

విద్వాంసుఁడు మూర్ఖునిఁ బోలి పొట్టపోసికొనుటకే తన కాలమునంతయును వినియోగింపఁడు. తాను పప్పుదప్పళపు పేరు విని యుబ్బిపోవఁడు. తనమనములోనున్న గుట్టును వదలి వేయక మర్మము నవలంబించును. అట్టునిర్దయుఁడుకాఁబోఁడు. సదయహృదయుఁడై శాశ్వతమగు పరమేశ్వరుని కైవల్యము నొందుటకుఁ బ్రయత్నమును సేయుచుండును.

ఆ. ఉద్ధరింపఁ గలుగు నుత్తముండు కులంబు
మధ్యముండు దానిమాట గనఁడు
అధముఁడైనవాఁ డడంగించునొక్కట, విశ్వ. 210

విద్వాంసుఁడగువాఁ డుత్తముఁడగును. ఆతనికి స్వకీయులను స్వకులమును పోషించి పేరు నొందవలయుననిబుద్ధిపుట్టును. కావున నుత్తముండు కులంబు నుద్ధరింపఁబూనుకొని యుద్ధరించును. మధ్యముఁడు దానివిషయమునే తలపెట్టఁడు. ప్రతివిషయమున నతఁడు సామాన్యశక్తిమంతుఁడుగానికులము నుద్ధరింప లేఁడు నశింపఁజేయలేఁడు. ఉన్న దాని నున్నట్లులుంచును. ఇఁక

నీచుఁడో తానుద్ధరింపకపోఁగా నున్న వానినున్నటులుంచుటకు మాఱుగా వంశనాశనమునకు(కులనాశనమునకు)ఆరంభించును.

ఆ. ఉప్పుఁ గప్పురంబు నొక్కపోలిక నుండు
చూడఁజూడ రుచుల జాడవేఱు
పురుషులందుపుణ్యపురుషులు వేఱయా, విశ్వ 211

వేషమును వేసి కూర్చున్నయప్పుడు మూర్ఖుఁడును పండితుఁడును ఒక్కటిగానే యుందురు. ఇఁక వారి తారతమ్యమును విద్యాప్రసంగసమయములోనే తెలిసికొనఁగలుగుదుము. ఎట్లని యందురా! ఉప్పునుకప్పురమును నొకేరీతిగా తెలగానుండుట లేదా? రుచిచూచిన వేఱువేఱుగా గాన్పించుటలేదా? అట్టులే పురుషులలోకూడ పుణ్యాత్ములగుపండితులు వేఱుగాయుందురు.

ఆ. ఊగియూగి లాగి యున్నది గనఁగోరు
సాగలాగి పట్టు సాక్షిగాను
యోగమమర ముక్తినొందును ప్రాజ్ఞుఁడు, విశ్వ.

విద్వాంసుఁడు బ్రహ్మము నుపాసించునప్పుడు మూర్ఖునివలె లేనిపోని వేషములను పైనివేసికొని ప్రవర్తించి భ్రష్టుఁడుఁగాక ప్రాణాధారచక్రములు మిగుల నెక్కువగాఁబూరించును. నాదరూపుఁడైనయాత్మను సాక్షిగాఁ జేయుచు యోగము నభ్యసించి మోక్షమునొందును.

ఆ. ఊరు విడువకుండ నుత్తమశివయోగి
పోరి చూచు మదిని బూర్ణసుఖము
దారిలోని నక్క తలపెట్టఁ బోవునే, విశ్వ. 213



మూర్ఖుఁడు బ్రహ్మము నుపాసించుటకని యూళ్లను పలెలను విడిచి తెగతిరిగి వ్యర్థుఁడగును. ఇఁకపండితుఁడన్ననో వానివలెఁగాక తానున్నచోటనుండి కదలనైనను కదలకయే ఇంద్రియములతో ఘోరముగాపోట్లాడి వాటిని జయించి తనకు స్వాధీనములను గా చేసికొని పూర్ణముగా సుఖము నొందును. పండితపామరులకింతటి భేదముగలదు. పామరునివలె పండితుఁడెప్పుడును ప్రవర్తింపఁడు. ప్రవర్తించినను ఫలింపదు. ఎట్లనఁగా: దారులు తిరుగునక్క తత్త్వమును తలపెట్టునా? పెట్టదు.

ఆ. ఎండయనక తిరుగు నిర వెఱింగినయోగి
నీడ నున్న దానిజాడవలెనె
ఎండనీడలున్నె యెఱుకకుఁజూడుఁడు, విశ్వ 214

విద్యాసక్తిగల బుద్ధిమంతుఁడు తనమనసులో నున్నతత్త్వమును సాధించుటకొఱకై పాపము! నానావిధములగు శ్రమల కోర్చును. ఎండయనక వానయనక తిరిగితిరిగి యుక్తమగుస్థానమును కనిపెట్టఁగలఁడు. మూర్ఖుఁడు మాత్రము తిరుగునే కాని తగినస్థానము నరయఁజాలఁడు. జ్ఞానశాలికి ఎండయనిగాని నీడయనిగాని భేదము లేదుగదా.

ఆ. ఎందు నెఱుకవాని కిహపరములు లేవు
ప్రాణహాని లేదు ప్రళయమునను
బ్రళయకాలమైనఁ బరమాత్మఁ గలియును, వి. 215

విద్వాంసుఁడై యుత్తమమగుజ్ఞానము నార్జించినవానికి ఎచ్చటనున్నను ఇహలోకసంబంధములయినవిగాని పరలోక

సంబంధములయినవిగాని కష్టసుఖములుండవు. ప్రళయకాలము లోనైనను ప్రాణమున కిసుమంతయైన హానిలేదు. ప్రపంచ మంతయును లయమగు సమయము వచ్చినయప్పుడు తాను పర మాత్మలోఁ గలియును.

ఆ. ఏమహాత్మునందు నిజ్జగములు పుట్టు
నామహాత్మభజన యనువు మీఱ
నియమనిష్ఠ నెఱపి సమ్మది గనవలె, విశ్వ. 216

విద్వాంసుఁ డగువాఁడు పామరునివలె, తెలిసియును చెడి పోక జ్ఞానము గలిగినందులకు ఫలము ననుభవింపవలయును. అది యెట్లు చేయఁదగునందురేని చూడుఁడు. ఈచరాచరము లగు ప్రపంచములన్నియు నేమహానుభావునందుఁ బుట్టునో ఆ మహానుభావుని సేవను ప్రేమతోఁ గావించి నియమములు నిష్ఠలు గలవాఁడై శాంతిం బొందవలయును. అప్పుడే బ్రహ్మము నొందఁ గలఁడు.

ఆ. ఒదిగి యొదిగి గురువు నొప్పఁగా నొప్పించి
మదిని నిల్పి జాతిమత విడిచి
కదియుచుండు నతఁడు కలకాల మొకరీతి, వి. 217

భక్తియుక్తుఁడై పండితుఁ డగువాఁడు గురుశుశ్రూషలను చేసి ఆయనయాజ్ఞలకు నొదిగియుండి యుపదేశమునకు సమ్మ తింపఁజేసి విద్య నార్జించి మనంబులో నుంచికొని జాతిమత భేద ములను దేహాభిమానాదిమమత్వములను విడిచి కలకాలము నొ కేరీతిగా మెలఁగుచుండును.



తే. ఔచితిం గన్నవాఁ డెవ్వ డర్హుఁడైన
గౌరవమ్మును పదవిని గనుచునుండు
సర్వజనులును బూజింప సంతసమును
దండి దాకీర్తి నార్జించుచుండు వేమ. 218

పండితపామరులకుండు భేదము ఉచితానుచితముల నెఱిఁగి ప్రవర్తించుటయే. పండితుఁడు ఉచితరీతితో వర్తించును. పామరుఁ డట్టులు గాదు. ఉచితరీతిగా మెలఁగువాఁ డెవ్వఁడై ననుతనకుఁదగినమర్యాదనుబడయఁగలుగునే గలుగును. ఇంతమా త్రమేగాక లోకములోనివారందఱును బూజింపఁగా నెల్లప్పు డును గౌరవమును వెలనుకీర్తిని వలయునంతను పొందఁగలు గును. కావున విద్వాంసుఁడవగుటకు యత్నింపుము.

తే. కడఁగి సంకల్పములనెల్ల కట్టిపెట్టి
చిత్తమున నేమి తలఁపక చిత్రరూపు
కై పడిని నుండు నాతఁడు ఘనుఁడు దలఁప, వి.

అజ్ఞానియు జ్ఞానియు నిరువురును బ్రహ్మమును సేవిం చుటకే యోగము నవలంబించెదరు. అజ్ఞాని క్షణక్షణమునకు చలించెడిమనస్సులో పిచ్చిపిచ్చి కోరికలగోరి భ్రష్టుఁడగును. విద్వాంసుఁడు అనఁగాజ్ఞానిసంకల్పములను అనఁగాకోరికలను అడచివైచును. మనస్సునకు పనికల్పింపక స్తబ్ధముగాఁ జేయును. చిత్తరువులోనిబొమ్మవలెకదలక మెదలక సౌఖ్యమందుచుండును. ఇట్టివాఁడు ఘనుఁడు గాఁదా?

ఆ. కనఁగ సొమ్ము లెన్నొ! కనకం బదొక్కటె
పసులవన్నె లెన్నొ! పా లొకటియె
పుష్పజాతు లెన్నొ! పూజ యొక్కటెసుమీ, వి.

మూర్ఖులు పండితులలో ఎన్నో మతభేదములు గలవని దూషింతురు కాని విద్వాంసులు దూషింపఁదగిన వారలు గారు. ఎట్లనఁగా: బంగారముతో చేసిన సొమ్ములు భేదము గాని బంగార మొక్కటియే కదా! పశువులకు రంగు భేదమే గాని పా లొకటియే కదా! పూవులు రకముల భేదమే గాని పూజయొక్కటియే కదా! కావున విద్వాంసులు భిన్నులుగా నున్నను జ్ఞానము (విద్య) ఒకటియే.

ఆ. కప్పురంపు మనసు గాంక్షించు యోగికి
జ్ఞానదీపశిఖయుఁ దా నటించుఁ
గానవచ్చు నాత్మ క్రమమాణమైయుండు, విశ్వ.

విద్వాంసుఁడగువాఁడు మనంబును నిలిపి కర్పూరమువలె వాసనావాసితము కావలయునని కోరుచుండును. అట్టిమహానుభావుని మనంబు కర్పూరపురూపము నవలంబించినయప్పుడు స్వయముగా విజ్ఞానశిఖ బయలుదేరి దానినాక్రమించి వెలిగించుటకు సాయపడుచుండును. క్రమముగా నాతనికి ఆత్మస్వరూపముగా గోచరించును. ఇట్లగుట విద్వాంసునికి లక్షణమని భావము.

ఆ. కల్లగురుఁడు గట్టు కర్మచయంబులు
మధ్యగురుఁడు గట్టు మంత్రచయము



ఉత్తముండు గట్టు యోగసామ్రాజ్యంబు, వి.

ప్రపంచములో నున్నపండితపామరుల కందఱికిని బుద్ధులు, పనులు, ఫలములు మొదలగునవి వారివారియోగ్యతకు తగినయట్లు పుట్టుచుండును. అబద్ధాలగురువులు అనఁగా మూర్ఖుఁడగువాఁడు కర్మయోగమే నిన్నుగడతేర్చునని బోధించి కర్మసమూహము మెడకుఁగట్టును. రెండవతెగవాఁడగు మధ్యముఁడు మంత్రములె నిన్నుగడతేర్చునని మంత్రోపదేశము గావించును. ఉత్తముఁడగు గురుఁడు యోగోపదేశముఁ జేసి సులభముగాఁ దరించుమార్గముఁ జూపును.

ఆ. కలుషమానసులకు గాన్పింపఁగా రాదు
అడుసులోన భానుఁ డడఁగిసట్లు
తేటనీరు పుణ్యదేహ మట్లుండురా, విశ్వ. 223

విద్వాంసునియొక్క యమేయమగు జ్ఞానము కనులతో చూడవలయు ననినయెడలఁ గనుపట్టదు. ఎట్లనియందురా వినుఁడు. సూర్యుఁడు అసమాన తేజోనిధియైనను తనకాంతిపుంజముతో బురదలోనడగి చూచువారలకు ఎట్లుగన్పింపఁడో అట్టులే విజ్ఞానముకూడ పాపబుద్ధితో వెదకిన నగుపడదు. తేటనీటిలో కాంతిపుంజము ప్రతిఫలించినట్టులే విద్వాంసునివిజ్ఞానముగూడ వెలయుచుండును.

ఆ. కస్తూరి యటుచూడఁ గాంతి నల్లగనుండు
పరిమళించు దానిపరిమళంబు
గురువులైనవారిగుణము లీలాగురా, విశ్వ...

చదివినవాఁడును చదువనివాఁడును ఆకారమున నేమి పుష్టి నేమి లావణ్యమున నేమి యేకరూపులైయున్నను, అంతరంగపరీక్షచేసితిమేని వేఱువేఱుగ నగుపడుదురు. ఎట్లనఁగా: లోకము లోనఁ గస్తురియును నలగానుండును. కాని వానితారతమ్యము నాకారముచేత గుర్తింపవలనుపడునా? పడవు. ఇఁక నెట్లుసాధ్యమనినఁ బరిమళముచేతనే తెలియ సాధ్యమగును. కావున విద్వాంసులగు గురువులగుణము నట్లుండునని తెలిసికొనుము.

ఆ. కాకిగూటిలోన కోకిల మనినట్లు
భ్రమర మగుచుఁ బురువు బ్రతికినట్లు
గురువులాదరిలను గుణులట్లు వర్తింత్రు, వి...

విద్వాంసులసంపర్కమున మూర్ఖుఁడు గూడ గుణవంతుఁడగునని చెప్పినచో వేరుగా విద్వాంసునిగుణములను వర్ణింపవలయునా? విద్వాంసులసాంగత్యమున మొఱకుగుణియగునా? యనిసందియమువలదు. చూడుఁడు. కాకిగూటిలోఁచేరి కోకిల బ్రదుకలేదా? అట్టులే పురువు చచ్చి సత్సంపర్కమున భ్రమరము లగుటలేదా? అటులే మూర్ఖులైనను విద్వాంసులసాంగత్యమువలన గుణులై చివరకు యుక్తాయుక్తముల నెఱుఁగింపఁగలగురువులు గూడ నయ్యెదరు.

ఆ. కుండ కుంభ మన్న గొండ పర్వత మన్న
నుప్పు లవణ మన్న నొకటి గాదె
భాషలిట్లె వేరు పరతత్త్వ మొక్కటే, వి...



ప్రాకృతులగు జనులు పండితులమాటల నర్థములను చేసికొనక శాస్త్రగహనములలో దూరి మతభేదములఁ గల్పించెదరు. విద్వాంసు లట్టులుగాదు. వారికేమతముచే ప్రతిపాదితమైనను నిజమగువస్తు వొక్కటియను జ్ఞానముగలదు. అందువలన వారు సర్వాధికులు. వస్తువులన్నియును మతము లన్నియుం నొక్కటి యగుట యెట్టులనియెదరా? చూడుఁడు. కుండయనినను కుంభమనినను పేరుభేదమున్నను వస్తువొక్కటిగాదా? అట్లే ఉప్పు లవణమనిన నొకటియేగదా!

ఆ. గాలి లేనిదీపకళికచందంబున
నలలు సుళ్లు లేనిజలధిరీతి
నిశ్చలాత్మ యెన్న నిర్వికారంబున
నుండెనేని పండితుండు వేమ. 227

పండితుఁ డగువాఁడుదుర్జనులస్తోత్రములకుప్పొంగడు. నిందావచనములకు క్రుంగడు. అతఁ డొరులు తన్ను దూషించినను భూషించినను తొణకకమెణకకయుండును. గాలిలేనిసమయమునయున్నదీపము తగ్గకయు హెచ్చకయు నొకేరీతిగ ప్రకాశించురీతిగాను అలలచే క్రిందుమీఁదుగాక శాంతముగానున్న సముద్రమువలెను నిశ్చలుఁడై ఎవ్వఁడుండునో యట్టివాఁడె పండితుఁ డనఁదగునని భావము.

ఆ. చిత్తశుద్ధి గలిగి చేసినపుణ్యంబు
కొంచెమైన నదియుఁ గొదవ కాదు

విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత? విశ్వ...228

మనశ్శుద్ధికలిగి సంపాదించిన జ్ఞానము అనఁగా విద్యకొంచెమైనను అయ్యది సంపూర్ణమైనదేయగును గాని కొదవ అనఁగా లోపముకాదు. కావున బుద్ధిమంతులు పండితులను ఏదోకొంచెముగానే చదివిరనిపరిహసింపఁగూడదు. ఏలయనఁగా: ఇతరులు ఎక్కువఁగా పుస్తకములనన్నిఁటిని తలక్రిందులుగా చదివినదియును వారు ఈషన్మాత్రము తెలిసికొనినదియు నొక్కటియగును. వారి కా విసరంతజ్ఞానమే యపరిమితమగును. చూడుఁడు. మఱ్ఱివిత్తనము చాలచిన్నదయ్యును గొప్పవృక్ష మగుటలేదా? అట్లే కావున విద్వాంసులజ్ఞానమును నాక్షేపింపవలదు.

ఆ. చినుఁగు బట్టకాదు చీనాంబరము గాని
ముఱికి యొడలు కాదు ముక్తి గాని
పరమయోగిమహిమ పరికింపనిట్టులు, విశ్వ...229

యోగీశ్వరుఁడు మంచిమంచిబట్టలను వేసికొనలేదనిగాని ముఱికిగానున్నాఁడనిగాని మూర్ఖులై యాక్షేపింపరాదు. ఏలయనఁగా: ఇతరులకు పట్టుబట్టలు ఉన్నట్టులేవారికిగూడ గలవు. కాని విద్వాంసులకున్నవి మాత్రము శాశ్వతములు. వారు కట్టిన పుట్టము మనకు చూచుటకు చినుఁగుబట్టవలె నుండునే కాని అది వారికిచీనాంబరముతోసమానము. మనకువారుఁ ముఱికియొడలుతో నగుపడియెదరుకాని వారికదియేముక్తి. మనకుసొగసనితోఁచినవస్తువులు వారికి వగరగును. కావున చక్కఁగా పరికించిన



యుత్తమయోగుల మహిమలన్నియును లోకోత్తరములై వెలయును.

ఆ. చెఱకుతోఁటలోనఁ జెత్తకుప్పుండిన
గొంచెమైన దానిగుణము చెడదు
యెఱుకఁగలుగుచోట నెడ్డవాఁ డున్నట్లు, వి...

మఱికొందఱు మూర్ఖులు ఎంతపండితుఁడైనను సహవాస దోషమును చెందకపోవఁడని వాదించుచుందురు. కానిసహవాస మాత్రమున నామహానుభావులగుణముచెడునా? చెడదు. ఎట్లందురా! చూడుఁడు. చెఱకుతోఁటలోచెత్తకుప్పయున్నంతమాత్రమున చెఱకులతీపి కొఱతపడెనా? లేదు. పైఁగ ఆచెత్తయందుఁగల సారమును సైత మాచెఱకు గ్రహించి యింకను మధుర రసమును దనలో నించుకొనుచున్నది. ఇట్టులనే జ్ఞానులు అనఁగా: విద్వాంసులగుంపులో నొకయెడ్డవాఁ డున్నంతమాత్రాన నతనియవివేక మీవిద్వాంసునికి రాదు.

ఆ. చదువరిమతికన్న సాధకుమతి మేలు
వేదములను లేదు వాదములను
ఒడలు శుద్ధిఁజేసి యొడయుని జూచెదు, విశ్వ.

కొందఱు సరియగు విద్య నార్జింపలేక చదివిచదివి వెడదారి పోవుచుందురు. అట్లు చదివి చెడిపోవు వారికంటె నిత్యమును దేవుని ధ్యానించు సాధకుఁడే ఎంతోమేలుగా గనుపట్టుచున్నాఁడు. కావున నోవెఱ్ఱులారా! వేదములను చదివి సత్యమును గనలేక వాదముల నేలచేసెదరు? అందు పరమేశ్వరుఁడు

లేడు. ఇఁక నెచ్చటనున్నాఁడందురా! మీశరీరములనే కలఁడు. కావున దేహమును పవిత్రమునుచేసికొని దేవునికనుటకు ప్రయత్నించి విద్వాంసు లగుటకు బ్రయత్నింపుఁడు.

క. చూపుల చూపై తోఁచెడి
రూపములకు రూప మదియె రూపము గాకే
దాపై లోపల వెలుపలఁ
గాపగు పరిపూర్ణమూర్తి కనవలె సుమతీ. 232

విద్వాంసుఁ డగువాఁడు తాను చదివికొనినందుకు పరమేశ్వరునిరూపమును చూచిననే ఫలముగాని లేకున్న లేదు. కావున నాతనిరూప మెట్లుండు నని విచారింపవలయును. ఆమహాపురుషునిశరీరము చూపులకుఁ గూడ చూపై కనుపట్టును. అనఁగా జ్ఞానస్వరూపమనుట. అతనిరూపము రూపములకుఁగూడ రూపమగును. ఆతనిమూర్తి అంతటను నిండియుండును. జ్ఞానరూపి యైనభగవంతుఁడు కావున విద్వాంసుఁడిట్టిపరిపూర్ణజ్ఞానరూపిని చూడవలయును.

ఆ. జాతి నీతి వేఱు జన్మం బదొక్కటి
అరయ దిండ్లు వేఱె యౌనుగాక
దర్శనములు వేఱు దైవ మొకటి, విశ్వ...

భగవంతునిరూపమును అస్తిత్వమును నిర్ణయించుటలో శాస్త్రకారులు పలువురు పలువిధములుగా చెప్పిరి. ఆశాస్త్రములనే దర్శనము లనియందురు. విద్వాంసులు కానివార లీదర్శనములను చదివి ఒకదానికొకటి సంబంధించలేదనియందురు.



విద్వాంసులైతేనో వానిసారమును గ్రహించిఅంతయునొక్కటే యని తెలిసికొనుచుందురు. ఎట్లనియెదరా: పేరుమాత్రము భేదమే గాని వేఱుకాదు. ప్రతివస్తువునకును జాతి నీతి వేఱు కాని జన్మమొక్కటే కదా! అట్లై తిండితిప్పలును వేఱుగాని దర్శనములు అనఁగా వస్తువులు గన్పించుట ఒక్కటియే గదా! అట్టులే దర్శనములు వేఱుగాని జ్ఞానరూపి యగుదైవము నొక్కటే.

ఆ. జీవభేద మెఱిఁగి చెడిపోనివారలు
బ్రహ్మభావ మొంది పరగుచుంద్రు
నీరు ముత్యమైన నీరుగా మారునా, విశ్వ...234

భ్రష్టులు మెట్టవేదాంతులై చెడిపోయెదరు. శిష్టులు జీవాత్మలభేదమును గుర్తెఱుంగుదురు. బ్రహ్మభావము విచారణచేత పొందెదరు. భ్రష్టులు బ్రహ్మభావమును ముమ్మాటికి పొందఁజాలరు. నీటిబిందువు ఎట్లు ముత్యము అగునో, అట్లు ముత్యము నీరుగా మారదు. బ్రహ్మభావమొందినవాఁడు మరల జీవత్వము నొందలేఁడు.

ఆ. జీవియందు భ్రమలు చేరియుండుట కద్దు
జీవి భ్రమలయందె చిక్కఁ డెపుడు
జీవి జీవియైన జిన్మాత్రమగుబయల్, విశ్వ...235

విద్వాంసులయొక్క జ్ఞానము అనఁగా: వైదుష్యముమిగుల చిత్రమైనది. ఇట్లు చిత్రమయిన జ్ఞానముగలవారినే విద్వాంసులనియందురు. చూడుఁడు. జ్ఞానచిత్రమును జీవియందు భ్రమలు

చేరియుండును. కాని భ్రమలలోమాత్రము జీవి చిక్కఁడు. ఇఁక నిందుఁ గలచిత్రమేమని యనియెదరా! జీవి తనయజ్ఞానమును పోఁగొట్టుకొని తానొక జీవరూపధరుఁ డని తెలిసికొనిన యెడల జ్ఞానరూపమగు బ్రహ్మము బయలుపడునని భావము. ఈపద్యములో జ్ఞానస్వరూపము చెప్పఁబడినది.

ఆ. తత్త్వవాదు లుండ్రు ధర నెందరైనను
తత్త్వవేదిఁ జూడ ధరణి లేఁడు
గలిగెనేని వాఁడు కానంగఁ బడఁడయా, విశ్వ...

విద్వాంసులలోఁగూడ యథార్థవేత్త అనఁగా: అనుభవశాలి దొరకుట మిగులకష్టము. ఏలయందురా! చూడుఁడు. లోకములో నెందరు కావలయునన్న యంచఱు తత్త్వవాదులు అనఁగా: బ్రహ్మ మిట్టిదనిన నిట్టిదని వాదించువారలు దొఱకుదురు. గాని తత్త్వవేత్త దొఱకుట దుర్లభము. ఒకవేళ ఎచ్చటనైన నున్నను వారు గనుపించుట అంతకంటెను చాలకష్టము. కావున లోకములో విద్వాంసుని నిర్ణయించుట మిగులకష్టము.

ఆ. తనువులోన వెదకి దైవంబు మొనఁజేసి
ముందు కర్మములను మూలఁ ద్రోసి
మనసు నిజముఁ జేసి మమతలన్నియు రోయు, వి.

పండితునకును పామరునకు జాలభేదము కలిగియుండును. పండితుఁడు దైవరూపమును తనశరీరములోనే వెదకి కనుఁగొనును. ఆయన నాధారముగా చేసికొని తక్కినకర్మములతొలఁగఁ ద్రోసికొనును. తనకున్న మనోనిశ్చయముతో నభిమానమును



వదలి దైవరూపమును నొందుటకు యత్నించును. అంతియగాక తన్నావరించియున్న మమకారములు (ఇవియన్నియు నావి యనుభావములు) చేరనీయక సర్వసంగత్యాగియై వర్తించుచుండును. ఇఁక మూర్ఖుఁడో దైవరూపమును దేశదేశముల వెదకుటకు పోవును. దేవు నాధారముగా చేసికొనక తనకర్మలనుకొనును. మనోనిశ్చయ ముండదు. దేహాద్యభిమానమును అసలే వదలి వైవఁజాలఁడు. కావున పామరుఁడై యుండక పండితుఁడై కృతార్థతనొందుటకుఁ బ్రయత్నింపవలయును.

ఆ. తనువులోని యాత్మతత్త్వ మెఱుంగక
వేఱె కలఁ డటంచు వెదుకఁ డెపుడు
భానుఁ డుండ దివ్వె పట్టుచు వెదకునా? వి...

నిజముగా పండితుఁ డగువాఁడు పామరునివలె పొరపాట్లకు లోఁబడఁడు. తనశరీరములోనే యున్న యాత్మస్వరూపమును తెలిసికొనక పోఁజాలఁడు. పైగా మూర్ఖునివలె వేఱెయెక్కడనో నున్నాఁడని వెదకుటకు బ్రయత్నింపనే ప్రయత్నింపఁడు. ఏలయని యందురా? చూడుఁడు. ఎంత తెలివితక్కువవాఁడైనను ఫెళ్లుమని సూర్యుఁ డెండగాయుచున్నప్పుడు బట్టబయలులో దీపమును బట్టుకొని వెదకునా? వెదకఁడు గదా? అట్లే పండితుఁడుకూడను.

ఆ. తన్నెఱుఁగనివాఁడు తానె తా నైయుండుఁ
దన్నెఱిఁగినవాఁడుఁ దానె తాను
దనువు లేనివాఁడు తానె తానౌసుమ్మి, విశ్వ...

మనుష్యులు మూఁడు తెఱఁగులుగా భాగింపఁబడుదురు. పామరులు, పండితులు, పరమేశ్వరరూపులు. వీరికి ముప్పురకును ఆకారము పరిణామముగూడ నొక్కరీతియై యుండును. ఆహా! ఎంత చిత్రమో చూడుఁడు. తానెవ్వరో తెలిసికొనలేనివాఁడు (అనఁగా: మొఱకు) ఎప్పటికిని తానె (అనఁగా: మొఱకుగానే) అయియుండును. ఇఁక తానెవ్వరో తెలిసికొనినవాఁడు (అనఁగా: విద్వాంసుఁడు, లేక జ్ఞాని) తాను తానె. అనఁగా: జ్ఞానస్వరూపుఁడు. ఇఁక మూఁడవవాఁడగు తనువు లేనివాఁడు (అనఁగా: నీశ్వరరూపి) తానే యగును. (అనఁగా: బ్రహ్మరూపుఁడగును.)

ఆ. తప్పు నొప్పుఁ దెలసి దైవసంకీర్తనల్
సేయువారు హరికి సేవకాళి
నీతెఱుఁగక వారి నిందింపఁ బోవరు,విశ్వ...240

ఎవ్వఁడైననుగానీ ఏజాతివాఁడైననుగాని "ఇది తప్పు, ఇది యొప్పు, ఇది మంచి, ఇది చెడ్డ" అని తెలిసికొని దైవమును కొనియాడుచుండినయెడల నాజ్ఞాని ఎప్పుడును హరికి ఆప్తుఁడై యుండును. విద్వాంసుఁడీరహస్యమును తెలిసికొని అట్టివారిని నిందింపఁబోక జాగ్రత్తపహించియుండును. మూర్ఖుఁడైనచో విపరీతముగా నడచియుండును. కావున విద్వాంసుఁడవుకమ్ము.

ఆ. తరువఁ దరువఁ బుట్టు దరువునం దనలంబుఁ
దరువఁ దరువఁ బుట్టు దధిఘృతంబు
తెలియఁ దలపఁ బుట్టు తనువున దత్త్వంబు,వి.241



విచారణ సేయుకొలఁదిని వివేకము పుట్టుచుండును. వైదుష్యమునకు అనఁగా: పాండిత్యమునకు వివేకము మూలము. ఈ వివేకముచేత నిరంతరమును ధ్యానింపఁగా ధ్యానింపఁగా తత్త్వము అనఁగా: యథార్థ ముదయించును. ఎట్లనఁగా: చెట్టును తరిమెనపట్టఁగా పట్టఁగా నిప్పుపుట్టినట్లును, పెరుఁగును చిలుకఁగా చిలుకఁగా వెన్న పుట్టునట్లును, నిరంతరవిచారణవలన హృదయమున తత్త్వము కలుగును. ఇట్లు చేయుట పండితలక్షణము.

ఆ. తాను నే ననియెడు తత్త్వభేదంబును
మాని యలవివేకమహిమఁ దనరి
యూఱకుండు జ్ఞాని యుత్తమోత్తముఁడగు,వి.

మూర్ఖుఁడెంతచదువుకొన్నను చచ్చినదాఁక తాను నేను అని ఎదటివారు వేరుగా నేను అని తాను వేరుగా పలుకుచు భ్రమయుచునే యుండును. ఇఁక విద్వాంసుఁడో యజ్ఞానమును బోఁగొట్టుకొని భేదవాదమును మాని వివేకమహిమను పొంది తనకుతాను సాక్షియై యూరకయుండును. ఉత్తములలో నెల్ల నుత్తముఁడుగూడ నగును. కావున విద్వాంసుఁడగుటకుఁ బ్రయత్నింపవలయును.

ఆ. తిట్టికొట్టిరేని తిరిగి మాటాడక
యట్టునిట్టుఁ జూచి యదరిపడక
తన్నుఁ గానియట్లు తత్త్వజ్ఞుఁడుండును,వి...243

విద్వాంసుఁడగువాఁడు తనను మూర్ఖులు పెక్కులుగా

నిందించుచున్నను వానిని సహింపక వారితో ఢీకొన యత్నింపరాదు. అట్లుచేయుట విద్వల్లక్షణముగాదు. విద్వాంసునిలక్షణమేమనఁగా తనను ఇతరులు అనరాని తిట్లు ఎన్నితిట్టినను ఎన్నికొట్టినను ప్రతిచెప్పచూచియు చూడనివారివలెయుండి అదిరిపడక తనను గాదనుకొని మెలఁగవలయును. ఈరీతిగా నిజముగా తత్త్వజ్ఞుఁడే యైనయెడల నుండితీరును. అనఁగా: శమదమాదులుగలవాఁడు విద్వాంసుఁడు.

ఆ. వెఱ్ఱివాని మిగుల విసుగింపఁగా రాదు
వెఱ్ఱివానిమాట వినఁగరాదు
వెఱ్ఱికుక్కఁ బట్టి వేఁటాడగారాదు, విశ్వ... 244

పండితుఁడు విమర్శనయుత మగు బుద్ధితో యుక్తిగా మెలఁగవలయును. తనహోదాకుతగినట్లునడచుకొనవలయును. పిచ్చివానిని ఎక్కువగా విసిగింపకూడదు. అట్లయిన వాఁడు నెత్తెక్కును. వెఱ్ఱివానిమాట అసలే వినఁగూడదు. మఱి యిఁక పండితుఁడేమి చేయవలయుననిన పాండిత్యములో తనతో సమానులగువారితోనే మెలఁగవలయును గాని తనకంటె తక్కువవారితో చేరరాదు. ఎందువలన నని యందురా? బుద్ధిమంతుఁడుమంచికుక్కతో వేఁటాడవలయునేగాని వెఱ్ఱికుక్కతో వేఁటాడరాదుగదా! అట్లే.

ఆ. దేవపూజసేయు దివ్యభోగము గల్గు
తత్త్వమెఱుంగఁగలఁడు దైవసముఁడు
యేమిలేనినరునికేగతి లేదురా, విశ్వ... 245



విద్యసంపాదించిన విద్వాంసుఁడగును. విద్వాంసుఁడగువాఁడు ఈలోకమునందునుపరలోకమునందును సుఖము నొందును. దేవతలపూజలను చేయగల్గును. దివ్యములయినభోగముల ననుభవింపఁగలఁడు. తత్త్వస్వరూపమును తెలిసికొనగలఁడు. ఇన్నియెందులకు? అట్టిపండితుఁడు పరమేశ్వరునితో సమానుఁడు. ఇఁక పండితుఁడు కాక పామరుఁడైనవానికే ఏమియునులేదు. ఏదిక్కును లేదు. వ్యర్థుఁడగును. కావున విద్వాంసుఁ డగుటకు ప్రయత్నమును సేయుము.

ఆ. దేహగుణము లెల్లఁ దెలిసిన శివయోగి
మోహమందు దవిలి మోసపోఁడు
ఇంద్రజాలకుం డటెందును జిక్కఁడు, విశ్వ...

విషయములయాథార్థ్యమును తెలిసినయుత్తముఁడు దేహగుణములను చక్కఁగాఁ దెలిసికొనియుండును. పండితుఁడగును. అట్టివాఁడు మోహములలో జిక్కుకొననేకొనఁడుగదా! మోసముగూడ నొందఁడు. ఎట్లనఁగా: నింద్రజాలకుఁ డెట్లు మాయలలో బడఁడో అట్లే పండితుఁడు గూడ. కావున పాండిత్యముకొఱకు యత్నింపుము.

ఆ. ధ్యానివలెనె యుండు మౌనివలెనె యుండు
భోగివలెనె యుండు రోగివలెనె
సకలమును దెలిసిన సర్వజ్ఞుఁడై యుండు, వి...

విజ్ఞానియగు విబుధుఁడు స్థాణువు (అనఁగా మొద్దు) వలె ఒకేయాకారమున నొకేవిషయమున నుండఁడు. ఇతని స్థితులు

మారుచుండును. సర్వాంతర్యామియు గూడ నగును. ఒకొక్కప్పుడు ధ్యానముచేయువానివలె యుండును. ఇఁక నొకప్పుడు మౌనియై యుండును. మఱియొకప్పుడు భోగివలెను రోగివలెను సమస్తమును తెలిసినసర్వజ్ఞునివలెను నుండును. కావున విద్వాంసుని తెలిసికొనుట మిగులకష్టము.

ఆ. నందుఁ డగుచు జ్ఞాని యిందు నం దనకుండు
నన్నితావులందు హారునివలెనె
తెలియువారికెల్ల దేవుఁడై కాన్పించు, విశ్వ...

విజ్ఞుఁడగుజ్ఞాని మూర్ఖునిబోలి యెల్లప్పుడు దుఃఖించుచుండఁడు. ఎప్పుడును సంతుష్టుఁడైయుండును. ఈరీతిగా జ్ఞానికి ఈశ్వరునికివలె ఈచోటు ఆచోటు అని నివాసము నియతమైయుండదు. అనఁగా సర్వవ్యాపియై యుండునని భావము. ఈయన తనను గుర్తెఱిఁగినవారికి దేవునివలె సర్వదా సాహాయ్యము నాచరించుచు వర్తించును. ఇట్టి లక్షణములు గలవాఁడు విద్వాంసుఁడు.

ఆ. పగలు రేయి మఱచి భావంబు మఱచియు
తాను నే ననియెడి తలఁపు మఱచి
యుండువాని నెంచ యుత్తమయోగిరా, వి...

విద్వాంసుఁడు ఎప్పుడును తనయంతరంగమున నుదయించు జ్ఞానసుధాంశుని అమృతకిరణములలో మునిఁగియుండును. పగలును రాత్రియును మఱచిపోవును. తలంపులనే మఱచును. తాను నేను అనుభేదబుద్ధి వానికి కలుగనే కలుగదు. ఈరీతిగా



నిరంతరము జ్ఞానసుధాప్రవాహములో తేలియుండు విద్వాంసుఁడే యుత్తముఁడగు శివయోగిగాని తక్కినవారలు కారు.

ఆ. పట్టు పట్టఁబోఁడు పట్టినవిడఁబోఁడు
నెట్టిగుణవికారనిహతి నడఁచి
మిట్టిపడక లోన మిన్నందు విజ్ఞుఁడు, విశ్వ... 250

విద్వాంసుఁడు దేనినైనను సాధింపఁ బూనిన యెడల నావూనికను తుదివెళ్ల నిర్వహించునేగాని నడుమను మూర్ఖునివలె వదలిపెట్టఁడు. అతనిచరిత్ర మద్భుతము. మొదట పట్టే పట్టఁడు; ఒకవేళపట్టైనా అగునంతవఱకు వదలిపెట్టఁడు. తన ప్రయత్నమునకు అడ్డపడుచున్న రాజసతామసగుణములను పాఱఁదోలి ఇంత గొప్పవాఁడనైతిని గదా యని త్రుళ్లిపడక తుదిముట్టజేయును. ఇట్టివియే విద్వల్లక్షణములని భావము.

క. పరగినగాలి నభంబున
నెరయంగా భూమియందు నీరుండుగదా
దరిదాపుల వేఱొక్కటి
యిరవుకొనుం దేజ మిట్లె యెల్లెడ వేమా! 251

పండితపామరులలోని తేజఃపదార్థ మొక్కటియ యైనను ఆయాప్రకృతులస్థితులఁ బట్టి ఆపాండిత్యము ప్రకాశించుచుండును. ఎట్లనఁగా: గాలి యాకాశమునందును, నీరుభూమియందును ఎట్లు ప్రకాశించుచున్నదో అట్లేదూరముగానున్నను దగ్గఱగానున్నను పాత్రౌచితిగా జ్ఞానము ప్రకాశించుచున్నది.

ఆ. పరుస మినుమునోఁక బంగార మైనట్లు
కప్పురంబు జ్యోతిఁ గలసినట్లు
పుష్పమందు దావి పొసఁగినట్లగు ముక్తి, వి...

విద్వాంసులు జ్ఞానోపదేశము చేయుటచేత లోకములోని యధములందఱు నుత్తములై తరించి ముక్తి నొందుదురు. ఎట్లనఁగా: పరుసవేది ఇనుము సోఁకఁగా బంగారమైనయట్టులే, కర్పూరము జ్యోతిలో గలసిపోవునట్టులే, పూవులో పరిమళము ఇముడినట్టులే పండితుల విజ్ఞానఘన మగునుపదేశముచేత పామరుఁడు ముక్తినొందును.

ఆ. పాలలోనఁ బులుసు లీలతో గలిసిన
విఱిసి తునుకలగును విఱివిగాను
తెలియుమనములోన దివ్యతత్త్వము తేట, వి...

పండితులకుమూర్ఖులకుహృదయమొకరీతి దేయైననువారివారి తలంపులఁబట్టి వారివారిజీవితపరిణామముమాఱుచుండును.ఆటులె హృదయమును మాఱును. పరిశుద్ధమగుపాలలోఁ జింతపండుపులుసు చేర్తుమేని పాలువెంట నేవిఱిగితునకలైపోవును. మనుజులహృదయములలోనిదివ్యతత్త్వమునైతమునిటులె జ్ఞానసంపర్కముచే వికాసవంతమగును. దుస్సాంగత్యములచేఁ గళంకితమగును.

ఆ. పికము వనములోన వెల్లుగాఁ బలికిన
భరిగి ప్రాజ్ఞజనుల పలుకు లుండు
కాకి కూఁతఁబోలు కర్మబంధులకూఁత, విశ్వ...



విద్వాంసులకును వివేకములేనివారలకును పలుకులు మున్నగునవి సమానముగానే పుట్టుచున్నను అయ్యవి ఆయాస్థానములందు వివేకవంతులచే నాదరింపఁబడును. ఎట్లనఁగా: కోకిల అడవిలోనుండినను పలికినయెడల నందఱికి ఎట్లు ఆదరింపఁదగినది అయ్యెనో అట్లు విద్వాంసుని వాక్యములును కాకి యింటిముందఱ యున్నను శ్రుతికఠినముగా గూసి యెట్లునిరాదరణమునకు పాత్రమగునో అట్లు మూర్ఖులవాక్యము నుండును.

ఆ. పుడమిదిరిగి బడయు పుణ్యంబు లెల్లను
గలుగు సాధుజనులఁ గన్నయపుడె
వడిని నీరు నదిని గడుఁ దేటనైయె యుండు,వి...

విజ్ఞానముచే నుత్తములగువారిని చూచినప్పుడు భూప్రదక్షిణము చేసిన వచ్చు పుణ్యములన్నియును కలుగును. ఎట్లనఁగా: వర్షముగుఱిసినీటివెల్లువలల్లుకొనిపాఱునపుడవిముఱికిగాఁ గానుపించినను ఒకానొకజీవనదిలో నానీరంతయుఁ జేరఁగానే నిర్మలముగ స్వచ్ఛముగాఁ గానుపించును. అటులే క్షేత్రములన్నియు సంచరించి పడయరానిసంకల్పములు సాధు సందర్శనమాత్రముననే లబ్ధమై యుపభోగ్యార్హమైయుండును.

ఆ. పైరు నిడినవానిఫల మదే సఫలంబు
పైరు నిడనివాఁడు ఫలముఁ గనునె
పైరునిడినవాఁడుబహుసౌఖ్యవంతుఁడౌ, వి...

మనుష్యుఁడు ప్రయత్నించి చేత నైనంతవఱకు జ్ఞానమును సంపాదించుటకు యత్నింపవలయును. అట్లు చేసిననే వాఁడు

విద్వాంసుఁడై సుఖించును. అట్లు చేయనివాఁడు పండితుఁడు కాఁజాలఁడు. సుఖములనుగూడ నొందఁజాలఁడు. ఎట్లనఁగా: పైరును పెట్టుకొనినవానికే ఫలము గలుగును గాని లేనివానికి కలుగునా? కలుగదుగదా! పైరు పెట్టినవాఁడే సౌఖ్యవంతుఁ డగును. కాని ఇతరుఁడు కాఁజాలఁడు కదా! అట్లే విద్వాంసుఁడు కూడను.

ఆ. ప్రజ లెఱుంగ బ్రదుకఁ బట్టభద్రుఁడు గాఁడు
పైఁ గిరీటముండు బ్రహ్మ గాఁడు
నోగుఁ దెలిసి పలుకు యోగీశ్వరుఁడు వాఁడు,వి.

విద్వాంసుఁ డగువాఁడు మొగమోటములు లేక లోకులకు జ్ఞానము నుపదేశించి సన్మార్గమున నడపింపఁబూనును. ఆహా! ఏమియీతని యపూర్వము లగు ప్రభులక్షణములు! ఈవిద్వాంసుఁడు అందఱికిని తెలియునట్లు ఖండితముగాఁ బలుకును. ఇట్లు పల్కుటకురాజుగారా? కాదు. ఈతనితలపైనను జ్ఞానతేజమను గిరీటముండను. పోనీ సృష్టికర్త యగు బ్రహ్మయందమా? యితఁ డుగూడ కాదు. మఱియింక ఈతఁ డెవ్వరని యందురా? ఓగును దెలిసికొని దయామయుఁడై కృతార్థుని జేయ నుపదేశించు యోగియని యనుకొనుఁడు అని భావము.

ఆ. పృథివిమీఁదఁ బుట్టి ప్రిదులుగ హంసల
విహారణం బెఱింగి విడువక మదిఁ
దిరుగ నేర్పియుండు ధీమంతుఁ డెప్పుడు, వి...

భూమిమీఁద మనుష్యుఁడై పుట్టిన తరువాత నుత్తమమగు జ్ఞానమును సంపాదించుట నరునకు ముఖ్యమగు కార్యము. అందును చదివికొని విద్వాంసుఁ డైనప్పుడు తప్పక విద్యలలో నెల్ల నుత్తమదివ్యమగు నాత్మవిద్యను సాధింపవలయును. ఇట్టిపని చేయుట పామరునకశక్యము. విద్వాంసుఁడో, భూతములయు నాత్మలయును పంచీకరణమును చక్కఁగా దెలిసికొనిఏకప్పుడా విచారణమును వదలివేయకగుదస్థానము మొదలుక పాలమువఱకు న్నచక్రములు అందుగల హంసలను లెక్కించుచు ముక్తినొంద యత్నించును.

ఆ. బంటుపలెనె లేవఁ బండితంమన్యుఁడు
సాధుపండితుండు శాంతుఁ డగును
కుక్క గూయ నేమి గుఱ్ఱమునకు లెక్క? వి...

పండితుఁ డెద్దానినైనఁ గూర్చి మాటలాడఁ బోవునప్పుడు చెంతనున్న పామరుఁడు తాను వానికంటెను మిక్కిలిగా తెలిసినవానిఁబోలి లేచి వింతగా నార్భాటములను చేయును. కాని యట్టివాఁడు పండితుఁడా? కాదు. ఏలయనిన: నిజమగు పండితుఁడైన యసూయను విడనాడును. శాంతమును వహించును. సాధుభావమును చేకొనును. పామరుఁ డట్టిపండితుని నిందించి నందువలన నతనికి అవమానము కాదా? యందురేని వినుఁడు. కుక్క మొఱిగిన గుఱ్ఱమునకు అవమానమా? లేదు గదా! అట్లే.

ఆ. బహుళకావ్యములను బఠికింపఁగా వచ్చు
బహుళశబ్దచయము పలుకవచ్చు
సహన మొక్క టబ్బ చాలకష్టంబురా! వి...260

మూర్ఖుఁడగువాఁడు తానుగూడ పండితుఁడ నయ్యెదనని పట్టుబట్టి కావ్యముల ననేకములను చక్కఁగాఁ జదువవచ్చును. అట్లే అనేకములు ననంతములగు శబ్దముల నుచ్చరింప వచ్చును. కాని ఈమాత్రముచేత నిజమగు పండితునితో తుల్యుఁడగునా? కాఁజాలఁడు. ఏల యని యందురా? విచారించుఁడు. పండితుని పామరుని వేఱుపఱుపఁజాలినది పామరునికి లేనిది పండితునకు కలది. దుస్సాధమగునది యగు నొక్క ఓర్పు అబ్బుట చాల కష్టము. అట్టి ఓర్పుగల పండితుఁడే సర్వాధికుఁడు.

ఆ. బాపలన్న దొడ్డపరువునఁ జూడరు
కానిపనులు సేయ గడలుకొనరు
కులము లెక్కయేమి గుణమే ప్రధానంబు, వి...

వివేకియై విద్యాపక్షపాతి యగుపండితునకు ఎప్పటికిని ఎవ్వరియందును అభిమాన ముండదు. అట్టివారు నిరక్షరకుక్షులను బ్రాహ్మణులని యన్నంతమాత్రాన మర్యాదగాఁ జూడరు. తక్కువ వారలను విద్యగలిగినను తక్కువ కులము వారని వదలిపెట్టరు. ఇట్లు సమానభావముతో చూచుచుండుటయే విద్వల్లక్షణము. ఎట్లని యందురా? కులముతో ప్రయోజన మేమి? యోగ్యత జూపునది గుణము కదా!

ఆ. బ్రాహ్మణులకు సకలభాగ్యంబు లీవచ్చు
గౌరవింపవచ్చు కలయవచ్చు
జ్ఞాన మొసఁగి జనులఁ గడతేర్చునట్టియున, వి...

విద్వాంసుఁడై జనుల తరింపఁ జేయఁగలవాఁడు ఏకులము



నం దున్నను పూజనీయుఁడే యగును. అభిమానముచేత అట్టి వానిని ఈయన బ్రాహ్మణుఁడను నిందసేయరాదు. ఏమి? బ్రాహ్మణుఁడయినందున నష్టము. జ్ఞానము నిచ్చి జనులనుతరింపఁ జేయఁగల సజ్జనుఁడే యైనచో నట్టి బ్రాహ్మణులకు సమస్తభాగ్యములను ఈయవచ్చును. గౌరవము చేయవచ్చును. వారితో కలిసి మెలసి తిరుగవచ్చును.

క. భువి నరకులమునఁ బుట్టియు
భువినరకులములను బెరిగి భువినరకులమున్
నవిరళముగ ఛీఛీ యని
శివకులమున దిరుగునతఁడె సిద్ధుఁడు వేమా. 263

విద్వాంసుఁడు అగువాఁడు తా నీనరలోకములో పుట్టితి ననియు నందుచే నితరజీవరాసులకంటె నధికుఁడనైతిననియుఁ దనలోఁ దాను గర్వించఁడు. కర్మబంధములను సంకెలతో నున్న మనుష్యజాతి నాజ్ఞానియగుపండితుఁడు గౌరవింపక కేవల ప్రేమపారవశ్యమునఁ దన్ను బెంచిన బంధువర్గమును ప్రేమింపక తుచ్ఛములగు నిహలోకసంబంధములగు పరిచయములఁ దిరస్కరించుచు వర్తించును. అట్టిసుకృతియె నిజమైనశివభక్తుఁడు. వాఁడె సంకల్పసిద్ధుఁడగు సిద్ధుఁడు.

ఆ. మఠములోన నున్న మతము లన్నియుఁ గోసి
ఘటములోన నున్న ఘనుని దెలసి
ఘనత నిల్పుచుండు ఘనతత్త్వయోగి యా, వి.

విద్వాంసుఁడు మూర్ఖునివలె నిష్ప్రయోజకముగా వాద

ములను చేయఁబూనుకొనఁడు. తనహృదయములోనున్న వికల్పభావముల నన్నిటిని మొదలంట నశింపఁజేయును. అటుతరువాత నాహృదయమునందున్న పరమాత్ముని తెలిసికొనును. క్రమముగా నీశ్వరుని ధారణచేయును. నిమ్మట మహాయోగి యగును. కావున పండితలక్షణము లిట్లు తమతమజ్ఞానానుసారములై కార్యరూపమును ధరింపవలయు.

ఆ. మనసవృత్తిలోని మహిమ నెఱుంగుచు
మనసునందె పూజమహిమ గనుచు
మానకుండువాఁడె మర్మజ్ఞుఁ డగుయోగి, వి...

మఱియు నట్టిజ్ఞాని దేవుని నిరంతరము ధ్యానించినందువలన వచ్చు మహిమము నెఱుఁగఁగలఁడు. తనమనసంబులో తానె యతనిపూజల ప్రభావమును పరికింపఁ గలఁడు. అట్టిసాధకుఁడగు నాపండితుఁడు ఎప్పుడు నీపనిని మానక మర్మజ్ఞుఁడై మెలఁగును.

ఆ. మనసు గుప్తపఱచి మాన్యుఁడై విబుధుఁడు
తలఁచు పలుకకుంట ధర్మమండ్రు
తలఁచుమాటచేత దత్త్వంబుఁ జెడిపోవు, వి...

పండితుఁడగువాఁడు, సామాన్యముగా తనకు నితరులకు చెఱుపు కలుగకయుండుటయు నోటికివచ్చినరీతిని నఱకకుండుటయును కలిగియుండును. అట్టివిద్వాంసుఁడు తనమనంబును పదిలముచేయును. కపటియనిపించుకొనక పూజ్యుఁడగును. సాధారణముగా పలుకకయుండును. ఇట్లుండుట తత్త్వజ్ఞానికిముఖ్యము.



లేకయున్న తత్త్వము చెడిపోవును. కావున పండితుఁడు ఆత్మజ్ఞుఁడై మితభాషియై మెలఁగవలయును.

ఆ. మనసునిల్పినట్టి మాన్యులౌ విబుధులె
గరిమ మోక్షపథముఁ గన్నవారు
చెట్టుఁ బెట్టి ఫలముఁ జేకొనకుందురా? వి...

పేరునకు పండితుల మనుకొనినవారును, అనిపించికొనినవారును పూజ్యులు కాఁజాలరు. మనంబును జయించినవారే పూజ్యులగుపండితులు. అట్టివారె మోక్షమార్గము నెఱిఁగినవారలు. అట్టివారు పట్టినకార్యములను వీడక ఫలముగలుగువఱకు పాటుపడుచుందురు. ఎందున కనియందురా? విచారించుఁడు. చెట్టును మొలవఁబెట్టి పెంచి కాయించినవాఁడు దానిపండ్లను తీసికొనక వదలునా? వదలఁడుకదా! అట్టే విద్వాంసుఁడు నైతము.

ఆ. మరణకాలమందు మదినిల్పు సుజ్ఞాని
పరముఁ బ్రతిభచేతఁ బట్టువిడక
వెనుకఁ గోర్కెలకును విలపించునజ్ఞాని, విశ్వ...

పండితపామరులకు రూపమునను తెలివితేటలయందేగాక కార్యముల నెరవేర్చి ఫలమును బొందుటయందుగూడ నెక్కువ తారతమ్యముగలదు. చూడుఁడు. జ్ఞాని యగువాఁడు ఇతరసమయముల నెట్లు ప్రవర్తించినను తనయవసానకాలమునందు మనస్సును జంచలింపనీయక పరమాత్మపై సంకల్పమంతయు మంచిపట్టుదలతో వర్తించును. అప్పటిదేహబాధ లాతని

నిశ్చయము నించుకేని కదలింపలేవు. అజ్ఞానియగుమూర్ఖుఁడు మరణకాలమునఁ బనవిపనవియేడ్చుచుఁ గాంతాకనకాదులపై నింకఁ దనినితీఱలేదని విలపించును. చావనిన మూరులకింతభయ మేలనోకదా!

ఆ. మర్మవిదుఁడు గాని మర్మంబుఁ గనలేఁడు
కర్మజీవిగాని కానలేఁడు
నీరుచొరకలోఁతునిజములు తెలియునా?విశ్వ...

ఒక విద్వాంసునివిజ్ఞానము మున్నగు వానిని తెలిసికొన వలయునని కోరియుండుమేని విద్వాంసుఁడే అట్టిపనికి సమర్థుఁడగును గాని ఇతరుఁడు కాఁజాలఁడు. ఎట్లనియనెదరా? చూడుఁడు.మర్మము తెలిసినవాఁడుగాని మర్మముఁ దెల్పికొన లేడు. అట్టులే కర్మజీవిగాని కర్మజీవిని (కష్టజీవిని) కానఁగాఁజాలఁడు.ఏలయనఁగాః నీళ్లలోని లోఁతును తెలిసికొనవలయు ననిన నీళ్లలోదిగక తెలియ వలనుపడునా?పడదుగదా! అట్టులే, విద్వాంసుని జ్ఞానముకూడను.

ఆ. మాటలాడవచ్చు మనసు దెల్పఁగలేఁడు
తెలుపవచ్చుఁ దన్ను తెలియలేఁడు
సురియఁ బట్టవచ్చు శూరుఁడు గాలేఁడు, వి...

మూర్ఖులు కూడ పండితులఁ బోలి వేషములను వేసికొని తిరుగవచ్చునే గాని విజ్ఞానమును వెలయింపలేరు. ఎట్లనఁగాః తానొకరితో కావలయునన్ని మాటలాడవచ్చును. కాని తన



మనంబునకు తెల్పఁజాలఁడు. ఇతరులకు జెప్పవచ్చును. ఎన్నిటి కైనను కాని తాను ఆచరించుట కష్టము. పిఱికిపందగూడ శూరునివలె డాబుచేసి కత్తిఁ బట్టవచ్చునే గాని ఆరివీరులఁ దునిమి శూరుఁడుకాఁజాలునా? కాఁడుగదా!అట్టులేమూర్ఖులు గూడను.

ఆ. మాలకన్నియలకు మంచిరూపం బున్న
ముట్టెనే త్రిశంకుపట్టి నాఁడు
కానిపనులు సేయ ఘను లాసపడుదురా?విశ్వ...

మూర్ఖులు, రూపంబును చూచి తమకుగాని పాపపుపనులను చేయఁ బూనుచుందురు. విద్వాంసుఁడగువాఁడో అట్లుకాదు. చూడుఁడు. పండితశిరోమణియనఁదగు హరిశ్చంద్రుఁడు సత్యమునుపల్కి తానాడినమాటను త్రిప్పెనా! మాలకన్నియ నైనను సరియే యని ఒప్పికొని రూపమునకు ఆసఁజెందెనా? లేదుఁ జ్ఞానముచే గొప్పవార లగువారు తమకు కానిపనులను చేయఁ బూనెదరా? పూనరు. అట్లు చేయఁబూనుట పండితలక్షణము కాదు.

ఆ. ముక్తిఁ గానలేని మూర్ఖజనుల కెల్ల
బట్టబయలు చేసి పరమపదము
దారిఁజూపుబుధుఁడు దైవంబుగాఁడొకో,విశ్వ.

ఎవ్వఁడైనను, లోకులయజ్ఞానమును బోఁగొట్టి వానిని సంతరింపఁజేయుచున్న మహానుభావుని,"దైవస్వరూప"మని చెప్పిన మూర్ఖులు కాదని వాదముల నాడఁజొత్తురు. తగినజ్ఞానము లేక

పోవుట వలననే వీరిట్లు సెప్పెదరు. పరికించుఁడు. ముక్తి యన్న నేమో యెఱుఁగక మూర్ఖు లగువారికందఱికిని మోక్షవిద్యారహస్యములను మాయమఱుగు లేకుండ సూటిగఁ దేట తెనుఁగుమాటలతో నెఱింగించి మోక్షమార్గదర్శకుఁడైన పండితుఁడే దైవము దైవమనిన వేఱొకఁడు లేఁడనుమాట నిక్కువము.

ఆ. మున్ను నిన్ను గన్నముఖ్యు లెవ్వరొ వారి
సన్నుతించి పిదప సంతతమును
జ్ఞానదాతఁగొల్వు ఘనతచే విబుధుని, విశ్వ...

బుద్ధిమంతుఁ డగువాఁడు తెలివితేటలు గల్గి సదాచారమును విడక పండితులమార్గము ననుసరించి మెలఁగవలయును. కావున నోయీ! నీవు ప్రతిదినమునను దేవతలందఱిలో నుత్తములును, నిన్ను కన్నవారును అగు నీతలిదండ్రులను సేవించి తరువాత నీకు ఉభయలోకతారక మగుజ్ఞానము నిచ్చినవానిని గౌరవముగాఁ గొల్చి ముక్తుఁడ వగుము.

ఆ. మెలఁగి జ్ఞానమయుఁడు మితిమీఱుచుండఁడు
ఉనికి విడఁడు తాను నుపమునొందు
తనువు మఱచి మించి తత్త్వజ్ఞుఁ డుండును, వి...

విజ్ఞుఁ డైనవాఁడు అనఁగా తెలిసినధీమంతుఁడు మూర్ఖుల బోలి హద్దుమీఱి సంచరింపఁడు. తానున్న నివాసస్థానమును వీడి అందనిపండ్లకు అఱ్ఱుసాఁపఁ బరువు లెత్తఁడు. తనకు సాధ్యము కాని పనికి యుపాయముచేత సాధింపఁబూనుకొనును. జ్ఞానము పూర్ణముగా సంపాదించినతరువాత దేహముపై నభిమానమును వదలికొని విబుధుఁడై మెలఁగును.



క. మొదటను మతముల్ వదలక
తుద నెవ్వరిమతము నైన దూషింపక తాఁ
బదిలుఁడయి కోర్కెఁ గోరక
ముదమునజరియించుబుధుఁడెముఖ్యుఁడు వేమా!

మూర్ఖునిబోలి విద్వాంసుఁడు అనాలోచితముగా ఏమతమునం దన్ననామతములో ప్రవేశింపఁడు. అథవా ప్రవేశించెనేని ఎవ్వరిమతమునైనను ఇతరమును నిందింపఁడు. తనమట్టుకు తాను అజ్ఞానమున మునుంగక గొంతెమకోర్కెలను కోరి చెడిపోక నిత్యమును ఆనందమయుఁడై సంచరించుచునుండును. ఇట్టి లక్షణములు గలవాఁడె పండితుఁడు. వాఁడె యందఱిలోను నుత్తముఁడు.

తే. యాత్రలందలిఫల మొంది యాగములను
సూత్రసమముగఁ జేసియు సూక్ష్మమొంది
పరమహంసను గీలించి ప్రబలుచుండు
పరము గోరెడు ప్రాజ్ఞుఁ డిద్ధరను వేమ. 276

మూర్ఖులు యాత్రలని యజ్ఞములని ఆరుభోరుమని ఆర్భాటములను చేసి సత్యమును గనలేక చెడదిరిగి చెడుచుందురు. విద్వాంసు లన్ననో అట్లుగాక యాత్రలను సూక్ష్మముగాఁ జేసి యందలి ఫలమును బొందుదురు. యజ్ఞములను సూత్రప్రాయముగా నొనర్చి పరమహంసను పరికించి ప్రబలుచుందును. కావున పరమాత్మఁగోరు ప్రాజ్ఞుఁడగుపండితున కిట్టిలక్షణము లుండు.

ఆ. రాజవరుల కెప్పుడు రణరంగములచింత
పరమమునుల కెల్లఁ బరముచింత
అల్పనరుల కెల్ల నతివలపై చింత, విశ్వ... 277

లోకములో కోర్కులుగూడ వారి తెలివితేటల ననుసరించి యోగ్యత ననుసరించి పుట్టుచుండును. చూడుఁడు. ఉత్తమక్షత్రియుఁడై పుట్టినయెడల నట్టివానికి సహజముగా రణచింతకలుగును. జ్ఞానసంపన్నుఁ డగుమునియైనయెడల బరమాత్మధ్యానము చేయఁగోరును. అల్పుఁడైనచో నతివల గవయఁగోరును.ఇట్టులే విద్వాంసుని కైహికాముష్మికముల మేలు గూర్చుజ్ఞానముపై యాసక్తి కలుగునని భావము.

ఆ. లోను బదిలపఱచి లోనివికారముల్
తలఁచి మెట్టువారు తెలియువారు
ఆకసమున వేడ్క నరయంగ నుందురు,విశ్వ...

తానెవ్వరో ఇతరు లెవ్వరో ప్రపంచ మెవ్వనిరూపమో తెలిసికొని యుక్తముగా నడచెడివారే విద్వాంసులు. వారు మూర్ఖులవలె తిరుగరు. తమమనోవికారములను బయలుపుచ్చక లోననే యణఁచి వైచెదరు. ఇట్టివారలే లోకములో తెలిసిన వారలనఁబడుదురు. వీరు ఇతరులవలెఅజ్ఞానమున మునుంగక నాకాశమున నక్షత్రస్వరూపముతో శబ్దస్వరూపుఁ డగుబ్రహ్మమును గనుచు నానందముతో నుందురు.

ఆ. వలయు నన్న రాదు వద్దన్న బోదది
తాను జేసియున్నధర్మ మనుచు



ఉల్లమందు దలఁప డుత్తమవిబుధుఁడు,విశ్వ...

పామరుఁడు జ్ఞానాజ్ఞానములను గాని పాపపుణ్యములను గాని ధర్మాధర్మములను గాని కోరుచుండును. విద్వాంసుఁ డట్లుకోరఁడు. ఏలయనఁగా నయ్యది తాను కావలయు ననునంతమాత్రమున రాదు. వల దన్నంతన బోదు. తనపాపముగాని పుణ్యముగాని జ్ఞానముగాని అజ్ఞానముగాని ధర్మముగాని యధర్మముగాని తనతోడనే మెలఁగుచుండు నని నిశ్చయించి వాటినిగూర్చియేమనంబులోతలంపఁడు. ఇట్టివాఁడుపండితుఁడు.

ఆ. వాద మాడఁ డెపుడు పరుస నెవ్వరితోడ
జేరరాఁడు తాను జేటుఁ దేడు
జ్ఞానియగుచుబుధుఁడుఘనతనొందఁగఁజూచు,వి.

విద్వాంసుఁడు మొఱకును బోలి దుష్టము లగుకార్యములను గాని అకృత్యములను గాని చేయఁడు. ఈయన నిష్కారణముగా నెవ్వరితోడను తగవులాడఁడు. డంభముగా నెవ్వరితోనున్నవారితో కలియఁడు. తానుచేయుపనులవలన ముప్పుతీసికొనిరాఁడు. తానుజ్ఞానియై గౌరవమునొందుటకు ప్రయత్నించును. కావున నిట్టివానినిపండితలక్షణములుగా తెలియవలయును.

ఆ. వార్ధియందుఁ బుట్టి వశముగా రావచ్చు
పూర్ణదృష్టియందు బూనవచ్చు
పూని యెఱుకగలిగి బుధుఁడుగాగా లేఁడు,వి...

మూర్ఖులు మొదలగు వారెన్నితో వేషములను వేసికొని యితరులను అనుకరించెదరు. కానివిద్వాంసులవలె మెలంగఁజా

లరు. ఎట్లనియందురా? చూడుఁడు. సముద్రములోఁబుట్టి స్వాతీ నముగలిగి రావచ్చును. పరిపూర్ణప్రజ్ఞకలిగినవానివలె నావిషయ మున కనుపడవచ్చును. కాని సంపూర్ణముగ అగుజ్ఞానవంతుఁడై పండితుఁడుమాత్రము కాఁజాల డనిభావము.

ఆ. విద్య లేనివాఁడు విద్వాంసులకడ
నుండఁగానె పండితుండు గాఁడు
కొలని హంసలకడ కొక్కెర లున్నట్లు, విశ్వ....

పామరులు, "చదువవలెనా? పండితుఁ డగుటకు? విద్వాం సులదగ్గఱనుండినయన్ని విద్యలును అనాయాసముగా లభించును. పండితుఁడుగూడ కాఁగలఁడు" అని చెప్పెదరు. కాని యిట్టె న్నటికిని కాదు. విద్య లేనివాఁడు విద్వాంసునిమ్రోల నున్నంత మాత్రమున పండితుడు కానేకాఁడు. ఎటనియెదరా? కొలని హంసలయొద్ద కొక్కెరలున్నంతమాత్రమున నవి రాజహంస యగునా? కావున విద్వాంసుఁడగుటకు కష్టించి చదువవలయు.

ఆ. విద్య లేకయున్న విత్తము లేకున్న
మూఢుఁడైనఁ దుదకు మూఁగయైన
నిష్టబంధుఁడైన గష్టమే గలుగును, విశ్వ....283

మనుష్యజన్మమెత్తినపిదప ముఖ్యముగా నుండితీరవలసిన గుణములలో విద్య యొకటి. విద్యరానివాఁడు రెండుకాళ్ల మృగముగాఁబడు. ఇంతయేల? విద్యలేకున్నయెడలజీవయాత్రను చేయుట మిగులకష్టము. తా నెంతయుష్టులగుబంధువులచెంతను న్నను నెంతగొప్పవాఁడైనను, విద్యనైనను ధనమునైనను జేత



నున్నంతవఱకె మానవుఁడు గౌరవపాత్రుఁడగును. మూఁగయై నవాఁడు, జ్ఞానములేనివాఁడు స్వశక్తితో జీవింపజాలక ముఖ్యు లగుబంధుగులఁ జేరనేని వారు క్రమముగఁ జెక్కుచిక్కులకు లోనగుదురు. కాన పండితులు ధనము, విద్యయే గౌరవహేతు వులని గ్రహింపవలయును.

తే. వినతి సేయును సద్గురు వేడుచుండు
మును భ్రమరకీటకన్యాయమునను నుండు
వాని నెన్నంగదరమె యీవసుధలోన
సాధుసన్మార్గమదె యగు జగతి వేమ. 284

బుద్ధిమంతుఁ డగునరుఁడు భ్రమరకీటన్యాయానుసారముగా సజ్జనుఁడును పండితుఁడు నగుగురువునకు వినుతిసేయుచు ప్రార్థిం చుచు శుశ్రూషాదికము చేసి దేశికునియంతవాఁడై గురువుల య గ్రహమునకు బాత్రుఁడగును. ఆహా! అట్టివానిని వర్ణింపఁదరమా! సత్పథ మనినయెడల నట్టివారిదే యగును సుమా!

ఆ. విప్రవరులయందు విబుధులయందును
నీతి నుంచువాఁడె నిర్మలుండు
భక్తిగలుగువాఁడె పరమార్థపరుఁడయా, వి....

బ్రాహ్మణోత్తములయందును, పండితాగ్రేసరులయందును నీతిగలిగి వర్తించుచు కల్లకపటములు లేక నిర్మలుఁడై మెలఁగు వాఁడె యుత్తముఁడు. ఈరీతిగా మెలఁగుచు పెద్దలను చూచిన యప్పుడు భయభక్తులను సహజముగా గనంబఱచుచుండు

వాఁడె పరమార్థరతుఁడు; గాఁడనిభావము. కావున బుద్ధిమంతుఁ డిట్లుచేసి విద్వాంసుఁడై మెలఁగవలయును.

ఆ. విశ్వమనఁగ నేమొ వివరించి చూచును
విశ్వమైదువిధులు వెలయఁ గనును
విశ్వము మదిలోన వెదకును విబుధుఁడు, విశ్వ....

విద్వాంసునకును, అవిశేషజ్ఞుఁడు అనఁగా మూర్ఖుఁడనుట అట్టివానికినిచాలభేదముగలదు. మూర్ఖుఁడు కంటికగుపడినదానిని ప్రతివస్తువునమ్మిశోధింపక సంచితుఁడగును. ఇఁక పండితుఁడో అట్లులుగాక, ప్రపంచమనఁగా నేమొ వివరించి చూచును. ప్రపంచము పంచభూతస్వరూపమని తెలిసికొనిపంచీకరణమును జేయును. ఆప్రపంచస్వరూపియే దేవుఁడై తనహృదయములో వెదకి కనుఁగొనును. ఇట్టివి పండితలక్షణములు.

తే. విశ్వరూపము మదిలోన వెలయఁజూచి
హ్రస్వమమరఁగ బుద్ధిని నందిపట్టి
స్వస్వరూపము గనుచుండు సజ్జనుండు, విశ్వ....

విద్వాంసుఁడు ప్రపంచరూపము నీరీతిగా తనమనంబులోఁ కలయఁగనుఁగొనును. దానినిసంగ్రహముగామననముఁజేయును. అటుతర్వాత నద్దానిసాయమున తానెవ్వరో తనరూపమెయ్యదియో అను మున్నగుస్వరూపవిషయములను తెలిసికొని జీవన్ముక్తుఁ డగును. మూర్ఖుఁ డట్టులుగాదు.

ఆ. వీరుఁడైన రాదు విబుధులగుణములు
చదువులందరాదు పటలరాదు
జన్మపాకముననె సఫలమౌ నతులకు, విశ్వ...



విద్వాంసులసద్గుణములను పొందవలయు ననినచో తాము కూడ కష్టించి చదివి విద్వాంసులైననే వచ్చునుగాని ఇతరముల నెన్నింటినో చేసినను రాదు. ఇట్లే శూరుఁడైనను రాదు. చదివినను ఒకప్పుడు రాఁజాలవు. ఇఁక నెట్లువచ్చు ననినయెడల పూర్వజన్మమునందు తానుచేసిన పుణ్యపరిపాకముననే యట్టి గుణము లబ్బి జన్మము సఫలము కావలయునే గాని ఇతరము లగు నుపాయముల కోట్లచేత గూడ రాఁజాలవు.

ఆ. వెదకి కాన లేరు వేదాంతవేద్యుండు
నుత్తముండె కాంచు నుర్విమీఁద
కలిగెనే నతనిని గానంగ లేరయా, విశ్వ...

చక్కఁగా విచారణసేయువారిఁ బోలి గొందఱు దేవుని వెదకి కనుగొందుమని వెదకఁబూని తెలివి తక్కువను వెల్లడించి కొనియెదరే గాని వెదకికనుగొనలేరు. దేవుఁడుసామాన్యుఁడా? కాఁడు. అతఁడు ఉపనిషత్తులచేత ప్రతిపాదింపఁబడఁదగినవాఁడు. అట్టివానిని ఒకవేళ ప్రయత్నించినచో నుత్తముఁడు చూడఁగలఁడే గాని తక్కినవారలు చూడఁజాలరు. భగవంతునిదివ్యతేజమును స్థూలదేహముతో చర్మచక్షువులతో సందర్శింపఁజాలు మహాత్ములు భూలోకమున మిగుల నల్పము గానున్నారు. అట్టిమహాత్ములగనుగొనఁగల్గుటసామాన్యకార్యముకాదు. ఇట్టివారు విద్వాంసులు.

క. వేడుక మదిలోఁ జూడక
తోడగునా యెఱుకమీఁటి త్రొక్కుడుపడ కా

జాడను మఱచినవాఁడే
వేడుకఁ బరతత్త్వమందు వెలయును వేమా! 290

దైవస్వరూపము బోధయగుటలేదు. లేదని త్రొక్కుడు పడుచుందురు మూర్ఖులు. కాని త్రొక్కుడు పడినంతమాత్రమున తనకుతోడయి కనుపట్టునా? కనుపట్టడు. ఆతనిఁ గనిపెట్టవలయుననినంతటిత్వరను (అనఁగా: తొందరపాటును) పొందఁగూడదు. మనస్సును నిశ్చలమునుగా జేసి జాడను తెలిసికొనవలయును. ఇట్లు తెలిసికొనినవాఁడే విద్వాంసుఁడని భావము.

ఆ. వ్యాధి కలిగెనేని వైద్యునిచేతను
మందు దినక కాని మాన దెందుఁ
జెంత దీపమిడక చీకటివాయునా? విశ్వ....291

ఎంతటి స్వల్ప విషయమైనను ప్రతిక్రియచేయక కుదురని యట్టులే, ఎంతకొద్దిపాటి యజ్ఞానమైనను విద్వాంసుల సదుపదేశములేకనివారించిపోదు. ఎట్లని యనియెదరేమొ! చూడుడు. జబ్బుకలిగినయెడల వైద్యుని ద్వారా మందుపుచ్చుకొనకయున్నందున గుదురునా? కుదురదుగదా? అట్టులే చీకటి సమీపమున దీపము వెలిఁగింపక యడఁగునా? అడఁగిపోదని భావము.

ఆ. స్వానుభూతియందు శాస్త్రవాసనలందు
సంశయంబు లేనిసాధనమున
చెలఁగు దీప మట్టు చిత్స్వరూపము నంటు, వి...

విద్వాంసుఁడు మూర్ఖునివలె ఇతరులమాటలనే నమ్మియుండఁడు. తనచేతనైనంతవఱకు స్వానుభవమును ప్రమాణముగా



తీసికొని విషయమును విమర్శించికొనును. అందునను సంశయమునొందినయెడల శాస్త్రవాసనలవలన కలిగిన జ్ఞానము ద్వారానివర్తింపఁ జేసికొనును. చివఱకు దీపకళికలాగున నిశ్చలముగఁ బ్రకాశించు చిత్స్వరూపమును జేరఁ బ్రయత్నించును. ఇట్టిలక్షణములు గలవాఁడు పండితుఁడు కావున పండితునివలె చరించి సౌఖ్యముగని ప్రవర్తిల్లవలయును.

## అర్థపద్ధతి.

---

అవతారిక. అర్థమనఁగా ధనముయొక్కయావశ్యకత. దాని ప్రయోజనములు, దానివలన గలుగులాభములు, అట్టివారికి లోకములోగల గౌరవము మున్నగువానిఁగూర్చి తెలుపుటకిప్పు డర్థపద్ధతిని ప్రారంభించుచున్నాఁడు.—

ఆ. అధముఁడైనమనుజుఁ డర్థవంతుండైన
నతనిమాట నడచు నవనిలోన
గజపతింట నెన్న గవ్వలు చెల్లవా? వి...293

లోకములోని ప్రతివారికిని ధనము సంపాదింపవలసియుండుట ముఖ్యమగుపని. ఎక్కువతక్కువ లన్నియును ధనమువలననే నిర్ణయింపఁబడుచుండును. ఎంతటినీచుఁడైనను ధనముగలవాఁడైనచో నతనిమాటకే తక్కిన యందఱికంటె చెల్లుబడి అధికముగా నుండును. ఎట్లందురా? పరికించుడు. గవ్వయెంత

జేయునువేల ? ఆగప్పలు అనఁగా : పనికిరానివే గజపతిపరిపాలనములో రత్నములవలె చెల్లుటలేదా ? అట్లే.

ఆ. అధికభుక్తిచేత మొదటిసొమ్ముకు హాని
కుదుపసొమ్ముకన్నఁ గొంతహాని
మొదటిపక్షమునను మూలకర్తకు హాని, వి...

ధనమును సంపాదించినతరువాత వ్యర్థముగా ఖర్చుసేయఁ గూడదు. ఎట్లైనను సంపాదించినదానిని నిలిపికొనవలయును. కొందఱు సంపాదించినసొమ్మును అతివ్యయముచేసి తిన మొదలు పెట్టెదరు. అందుచేత మూలధనమున కెక్కువనష్టము గలుగును. ఇఁకఁగొందరు కుదువయుంచుకొనుట నాచరింతురు. ఇట్లు కొంత ఖర్చు చేయుదురు. బుద్ధిమంతు లగువా రిట్లు సేయఁజనదు. మొదటిపక్షమం దిట్లు సేయుటవలన సంపాదకునకే హానిగలుగును.

ఆ. అప్పులేనివాఁడె యధికసంపన్నుండు
తప్పులేనివారు ధరను లేరు
గొప్పలేనిబుద్ధి కొంచెమై పోవురా, వి..... 295

లోకములో భాగ్యశాలి యనఁగా సంపాదించువాఁడు భాగ్యశాలి గాఁజాలఁడు. ఎవ్వఁడు తాను సంపాదించిన దానిని వ్యర్థముగా ఖర్చుసేయఁడో, అధికముగా నప్పులను తీయఁడో వాఁడే సంపన్నుఁడగును. అప్పుసేయుట గొప్పతప్పు సామాన్యముగా తప్పుసేయనివారు కనబడరు. కాని యోగ్యతాయోగ్యత నడయుని బుద్ధిమంతులకు ఇట్లు చేయుటవలన చులకదనము



గలుగును. కావున బుద్ధిమంతుఁ డర్థమును జాగ్రత్తగా కాపాడుకొనవలయును.

ఆ. అరయఁ దలుచు కల్లలాడెడువారింట
వెడల కేల లక్ష్మి విశ్రమించు
నీర మోటికుండ నిలుపనిచందాన, వి... 296

గృహస్థుఁ డైనవాఁ డసత్యములను పలుకరాదు. ఆరీతిగా తలుచుగా నసత్యములు చెప్పెడివారిల్లు దరిద్రదేవతకు వాసస్థానము. అట్టివారియింటినుండి లక్ష్మి వెళ్లిపోకనిలుచునా ? నిలవదు. ఎట్లని యందురా ? చూడుడు. ఓటికుండలో నెన్ని నీళ్లుపోసినను నిలువగలవా ? చాలవుగదా ! అట్లే అసత్యవాదుల కైశ్వర్యములుండవు. కావున ధనికులు గాఁగోరువా రసత్యము నాడుటను మానుకొనవలయును.

ఆ. అర్థవంతుసొమ్ము నాసింతు రర్థులై
యర్థి కీయ సొమ్ము వ్యర్థ మగును
వ్యర్థ మైనసొమ్ము వ్యర్థులఁ జేరురా, వి... 297

లోకుల కొకదుస్స్వభావ మున్నది. ఎవ్వనికైన నొక్కనికి ద్రవ్యముచేకుఱిన వీరందరును కష్టము సేయుటను మాని వైచి ఆధనికునిచుట్టును యాచకులై మూఁగి వానిధనమున కాసపడెదరు. ఇట్టివారికి ధనము నీయఁగూడదు. ఇచ్చినయెడల నీసోమరులు కష్టములేక వచ్చినసొమ్మేగదా యని దుష్కార్యముల వినియోగించెదరు. కావున బుద్ధిమంతుఁడైన మనుజుఁడు వ్యర్థము

లగుఖర్చులను సేయక ధనమును జాగ్రత్తగా కాపాడుకొన వలయును.

ఆ. ఆఁడువారిగన్న నర్థంబుఁ బోడగన్న
సార మైన రుచులచవులఁ గన్న
అయ్యగారికైన నాశలు గలుగవా? వి.... 298

మేము గురువులము, మేము సన్యాసులము, మేము విరాగుల మని చెప్పుచు తిరిగెడి యయ్యవార్లకైనను ధనముమీఁది యాస పోనేరదు. ఆహా ధన మెంతవశీకరణౌషధము. ఇట్టి జనవశ్యము చేయునట్టి వీలోకమునఁ గొన్నిమాత్రమే కలవు. వానిలో నన్నిఁటికంటె ధనమధికము. ధనము పొడఁగాంచిన కోరనివారరుదు. ఎట్లందురా? చూడుఁడు. ఆఁడువారిని చూచినను, ధనమును చూచినను, రుచిగలపదార్థములఁ జూచినను ఎంతటివారికైన కాంక్షగలుగును. కావున ధనములను జాగ్రత్తగా కాపాడుకొనుము.

ఆ. ఆపదందుఁ జూడు మారయ బంధుల
భయము వేళఁ జూడు బంటుగుణము
పేదపడ్డ వెనుకఁ బెండ్లముమతిఁ జూడు, వి...

ముందువెనుకలఁ జూడక బంధువుల ముఖస్తుతుల కుబ్బిపోయిధనమును వ్యర్థముగా ఖర్చుసేయకుము. ఈబంధువులునీకాపద గలిగినప్పుడు నీవంక కన్నెత్తియైనఁ జూడరు. ఇట్టివారి నీకఁ గొందఱిని జూతుము. బుద్ధిమంతుఁడవగుము. బంధువులందరును నిజమగు ప్రేమగలవారని నమ్మెదవేని పరీక్షించుము. ఆపదలలో



బంధువులను, భయసమయములలో బంటులను, పేద రైనతరువాత పెండ్లముచేయు ఆదరమునుచూచి జాగ్రత్తగా మెలంగుము.

ఆ. ఆశచేత ధనము నార్జింపఁగా నేల
మట్టిక్రిందఁ బెట్టి మఱువ నేల
ధనము పోవువెనుక ధర్మం బదేలరా? వి...300

కొందఱు తెలివిలేక అత్యాశపడి సంపాదింపలేక సంపాదింపలేక ధనమును సంపాదించెదరు. ఆటుతరువాత దానిని తగునట్టు లనుభవింపక ముందెప్పుడో ధర్మము సేత మని ముటి యుఁచు మంటిలో పూడ్చెదరు. తరువాత పూడ్చినదానిని మఱచి పోయెదరు. ఆహా! ఎంత తెలివితక్కువ! తనధనమంతయును మట్టిపాలైపోయిన తాను చేయఁదగిన ధర్మమేమున్నది? అథవా ఉన్నదనినను ఆపాడు ధర్మమువలన ప్రయోజనమేమి? కావున ధనమును జాగ్రత్తగా కాపాడవలెను.

ఆ. ఇంటిలోనిధనము నిది నాది యనుచును
మంటిలోన దాఁచు మంకుజీవి
కొంచుబోఁడు వెంట గుల్లకాసును రాదు, వి...

ధనమును సంపాదింపవలసియుండుట ముఖ్యము. సంపాదించిన దానిని సద్వినియోగముచేయుట అంతకంటెను ముఖ్యము. బుద్ధిలేనివాఁడీసమాచారమును తెలిసికొనలేక మూర్ఖుడై ఇంటిలోనున్న ధనమును చూచి ఇది నాది ఇది నాడి యని మట్టిలో దాచును. కాని తానుచచ్చిపోవునప్పుడు తన వెంట నేమైనను తీసికొనిపోఁగలఁడా? లేక ఆధనము తనవెంట నేమైన గుల్లకాసైనను

రాఁగలఁడా? లేదనిభావము. కావున ధనమును సంపాదించి సద్వినియోగమును చేయవలయును.

ఆ. ఇరుగుపొరుగువారి కెనయుసంపదఁ జూచి
తమకు లేదటన్న ధర్మమేమి
ధర్మమన్నఁ దొల్లి తన్నుక చచ్చిరి, వి... 302

ధనముగలుగుట పుణ్యాత్మునికి కాని సంభవింపదు. దరిద్రులు దీనిని తెలిసికొలేక తమ యిరుగుపొరుగున నున్నధనికులనుచూచి మిక్కిలి దుఃఖపడుచుందురు. ఇట్లు దుఃఖించినందువలన ఫలమిసుమంతయును లేదు. ఏలయని యందురా? పూర్వజన్మమున ధర్మముసేయక నీజన్మములో నేదియు గలుగదు. ఈదరిద్రులు పూర్వజన్మములో ధర్మముపేరు సెప్పిన తన్నుకొని సచ్చునంత బాధనొంది ధర్మముసేయక పోయిరి గదా? ఇప్పుడు వీరి కెట్లు లభించును. పుణ్యాత్ములకు గాని ధనము లభింపదు.

ఆ. ఇహమునందు చాలయిడుములు పడినను
బడుగు పొందఁగలఁడె పరమపదవి
పేద కనుపుపడునె పృథివిపై భాగ్యంబు, వి....

పూర్వజన్మమునందు చేసినపుణ్యములవలనఁగాని ధనములు చేకూరవు. ఎట్లనఁగా: ఈజనలోకమునందుపుట్టి యెన్నెన్నిటినో పడరానిపాటులను బడియును నిర్భాగ్యుఁడు పరమపదమును అనఁగా: మోక్షమును పొందఁగలఁడా? లేడుగదా! అట్లులే పేదవాఁడై పుట్టినవానికిఁ గూడ పూర్వమునఁ దాను పుణ్యము చేయనికారణమున భాగ్యము కలుగదు.



ఆ. ఇహమున సుఖియింప హేమతారకవిద్య
పరమున సుఖియింప బ్రహ్మవిద్య
కడమవిద్య లెల్ల గల్ల మూఢులకురా, వి...304

ఇహలోకము పరలోకము నని రెండేరెండు లోకము లుత్తమములు. స్వర్ణవిద్య (అనఁగా బంగారుచేయుట) బ్రహ్మవిద్య యని రెండేరెండు విద్యలు సుఖకరములు. అందులో స్వర్ణవిద్య ఈలోకములో సుఖింపఁగలుగుట కుపయోగించును. బ్రహ్మవిద్య పరలోకమునసుఖములనొందుట కుపయోగించును. కావున నివియే అందరిచేతను గౌరవింపఁదగినవి. తక్కినవన్నియునువిద్యలే కావు. అసత్యములు. అట్టివి మూఢులకే గాని యుత్తములకు తగినవికావు. (వేమనస్వర్ణముచేయుటలో నేర్పరియనియాతనిగూర్చి వాడుకలుగలవు. ఇతరవస్తుసమ్మేళనముచే లోహమును బంగారుగాఁ జేయవచ్చునని వేమన తనపద్యములలోఁ బలుమాఱు ఘంటాపథముగఁ జెప్పియున్నాఁడు. హేమకారవిద్యనిప్పటినాగరకులు తిరస్కరించినను పూర్వమిదియాచరణములో నున్నటుల, రసవాదశైవాగమము, మంథానభైరవము, రసార్ణవము లోనగు గ్రంథములలోఁ గలదు. వేధలు నాలుగువిధములనియు స్పర్శవేధ, ధూమవేధ, శబ్దవేధ, కుంతవేధయను నాల్గుభేదములచే బంగారు సృజింపవచ్చునని రసరత్నాకరమునఁ గలదు. వేమనచెప్పుస్వర్ణకారవిద్య మఱియొకవిధమైనది.)

ఆ. ఇహమునందు సుఖము లింపార లేదట
పరమునందు సుఖముఁ బడయు టెట్లు

ధనము లేక సుఖము తన కెట్లుకలుగురా? వి...

ద్రవ్యవంతులకె యిహపరములుగాని ద్రవ్యహీనుల కవిలభ్యములుకాఁజాలవు. ఎటులన ఈలోకమున ద్రవ్యవంతుఁడై సుఖపడువాఁడె త్యాగముచేసి పరులకు ధర్మార్థము ధనము నొసంగి పరలోకమునందు మోక్షసుఖమును బడయఁగలుగును. ద్రవ్యహీనుఁడన్ననో, ఈలోకమున నెట్టిసుఖములఁ బడయలేఁడు. పైగ నీలోకమున దానముచేయకపోవుటచే వానికిఁ బరలోకసుఖము లేదు. కావున ధనవంతుఁడగువాఁడె యిహపరసౌఖ్యములఁ బడయనర్హుఁడనిభావము.

ఆ. ఈఁత కన్న లోఁతు నెంచఁగఁ బనిలేదు
చావు కన్న గీడు జగతి లేదు
గోచిపాఁతకంటె గొంచెం బికను లేదు, వి...306

సాహసముగలవానికి లోకములో దుష్కరమైనదేదియు లేదనుట నిక్కువము. ఈఁతగానికి లోఁతుభయములేదు. చావునకుఁ దెగించినవానికిఁ గీడువలని వెఱపుండదు. గోచిపాఁతరాయునికి దరిద్రభయముండదు. సాహసశాలి కెట్టిభయముగూడనుండనేరదు. ఎట్లనఁగాఁ ఈఁతకంటె లోఁతులేనియట్టులును, చావుకంటెను గీడులేనియట్టులును.

ఆ. ఉచితవంతుఁ డైన నుద్యోగపరుఁ డైన
సంప దమరియున్న సమయమున నె
పరులకుపకరించి పాలింప గల్గును, విశ్వ...307



ఎంత యుచితముగా నడచువానికైనను, ఎంతటిగొప్పయుద్యోగము గలవానికైనను ధనములేకయున్నను జరుగుట కష్టము. సంపద లున్నయెడల తానందఱికి నుపకరింపవచ్చును. పరోపకారమను పవిత్రకార్యమునకుఁ గూడ ధనావశ్యకత్వ మెక్కుడుగా నున్నది. ధనములేకయున్న నెట్లుపరుల కుపకరింపనేర్చును. ఎట్లు పాలింపగలుగును? కావున బుద్ధిమంతుఁడు ధనము నార్జింపవలయును. ధనవంతుఁడై పరోపకారములు చేయవలెను.

ఆ. ఉన్నయంత మనుజుఁ డుపకారి గాలేక
కన్ను కాన డంచు ఘనుఁడు పల్కు
దీనుఁ డైనతనకు దిక్కెవ్వరగుదురు? వి... 308

కొందఱు జనులు ధనికుఁ డగువానియొద్దఁ జేరి వాఁడు గూడ తమవలె నొకసోమరిగా నుండలేదని వానిని పరిపరివిధముల నిందింప మొదలువెట్టును. ఇట్టిఘనుఁడు ధనికులను ''ఉన్నంతటిలో కొంచెమోగొప్పో యుపకారము చేయుటకు ధనికునికి కృత్యము. కాని ఉన్నంతవఱకు ఉపకరింపక కన్నుగానక తిరుగుచుండు''నని నిందించునేగాని ఈధనికుఁడు దరిద్రుఁ డగునప్పుడీతనికి దిక్కెవ్వరగుదురో?యనియోచింపఁడు. కావున స్తోత్రప్రియులమాట విని ధనము నతిగా వెచ్చింపవలదు.

ఆ. ఉప్పులేనికూర యొప్పదో రుచులకు
పప్పులేనితిండి ఫలములేదు
అప్పులేనివాఁడె యధికసంపన్నుఁడు, వి... 309

జ్ఞానమున్నను లేకయున్నను ఇతరములగు నావశ్యకవస్తువు

లనేకము లున్నను,లేకయున్నను,అప్పుతీసిపప్పన్నముతినవలయు నని కొందఱు కోరెదరు. ఎంతవెఱ్ఱి! కూరలో నుప్పుచాల దను కొనుడు.అది రుచింపదా? ప్రతినిత్యమును పప్పులేక ముద్ద మ్రింగుడు బడదేమొ!ఇట్లు తెగతినుటగూడదు.బుద్ధిగలవాఁడు అప్పు దీయకయుండవలయును. అట్టివాఁడె సర్వసంపదలుగలవాఁడు.

ఆ. ఉర్వి వారి కెల్ల నొక్కకంచముఁ బెట్టి
పొత్తుఁ గుడిపి కులము పొలయఁ జేసి
తలను చేయిపెట్టి తగ నమ్మఁజెప్పరో! వి...310

ఎట్లయినను ఎన్నిపనులయందు కష్టములను పొందినయైనను మనుజు లందఱును కష్టపడి ధనార్జనచేయునటు బోధింపుము.ధనముయొక్క యావశ్యకత్వమును శ్రేష్ఠత్వమును తెలియఁజెప్పుము.ప్రపంచములోనివారి కందఱికి ఒకేకంచములో గుడువఁబెట్టి యైకమత్యమును గలుపుము. కులభేదమునురూపుమాపుము. నెత్తి చేయిపెట్టి ప్రమాణముచేసి యిదియేసుఖకరమని జెప్పఁబ్రయత్నించుము.

ఆ. ఋణ మొసంగునాతఁ డినుఁడగు దొలుదొల్త
నదియు మరల నడుగ యముడుగ నగు
అప్పుజేసి తీర్ప నలయనివారికి, వి... 311

ఎవ్వనికైనను సరియే. ఎంతటియాపదయైనను సరియే. ఒకనికి అప్పునీయకుము: నీవప్పుఁగొనకుము. ఎందులకనియందువా? వినుము: ఋణము (అప్పు)నిచ్చువాఁడు మొదట సాక్షాత్తు లోకబాంధవుఁడే యగును. కానిని దానిని తీర్పుమని మరల యడిగినయెడ ప్రాణములఁ బెఱికికొని పోవు యమతుల్యుఁడగును. అప్పుజేయుటకు ముందుగా నాయప్పు నెట్టులు తీర్పఁగలుగుదుమా యని యోజింపవలయును. తీర్చుటకు తెలియకున్న కష్టమగును. కావున అప్పునీయకుము. అప్పుగొనకుము.



ఆ. ఎంతభూమి దిరిగి యేపాటు పడుచున్న
నంటనీక ప్రాప్తి వెంటదిరుగు
భూమి క్రొత్తదైన భోక్తలు క్రొత్తలా? వి...312

ధనమును సంపాదించుట కను పేరుతో ఎన్నియెన్ని దేశములు తిరిగినను,ఎన్ని పడరానిపాట్లుపడినను పూర్వకృతములేనిది లభింపదు గనుక దారిద్ర్యము వెంటనంటుకొని కలసిరానీయక తిరుగుచునే యుండును. దీనిని తెలిసికొనలేక వెఱ్ఱులై క్రొత్తచోట్లకు తిరిగెదరు. ఇట్టివారు వెఱ్ఱు లెట్లని యందురా? చూడుఁడు. దేశములు క్రొత్తవియైన గీతలుక్రొత్తలా? కావున నదృష్టవంతులఁజూచి విచారము పొందవలదు.

ఆ. ఎద్దు మొద్దువాని కేలశాస్త్రంబులు
ముద్దునాతి కేల ముసలిమగఁడు
చద్దిమిగులనిల్లు సంసార మేలరా? వి... 313

సంసార మని చేయుచున్నప్పుడు అతిథి అభ్యాగతులపూజలను చేయుచుండవలయును. వీనిని చేయవలయు నని ధనార్జనమవశ్యము చేసితీరవలయును. పోసె ధనమే యక్కఱలేదు. అతిథిపూజలే యక్కఱలేదు అని యందురా? అట్లయిన నా సంసారమెందులకు? నిష్ప్రయోజన మగును అని యర్థము. ఎట్ల

సం॥గా: ఎద్దుమొద్దుస్వరూపికి వేదశాస్త్రము లెట్లు నిరర్థకము లో, వయసుగుబ్బెతకు పెద్దముదుసలిమొగఁ డెట్లు వ్యర్థమో, అట్లే చద్దిమిగులనియిల్లు వ్యర్థమగును. కావున ధనము నార్జింప వలయును.

క. ఎన్నాళ్లిలఁ దానుండును
ఎన్నాళ్లిలఁ దానునేర్చె నెన్నిఁట వెలయన్
గొన్నాళ్లకుఁ దాఁ జనినను
మన్నాగద విద్యలెల్ల మహిలో వేమ!. 314

జీవిత మస్థిరమైనది. మానవజీవితమునకుఁ బరిమితియే త క్కువ. ఎన్నివిధములఁగాపాడినను గొలఁదికాలములోమరణిం చితీఱును. ఈస్వల్పజీవితములో విద్యాభ్యాసముతో నవస్థపడు చున్న నొక శాస్త్రమైన సాంగోపాంగమగుట యసంభవము. చచ్చినపిమ్మట నీవిద్యలన్నియునిష్ఫలములగుచున్నవిగాన మోక్ష విద్య బాల్యమునుండి యార్జించుటయే కర్తవ్యము.

ఆ. పజమాలుమగువ ఓలిమాడలచేటు
పాటులేనిమగఁడు కూటిచేటు
పనికిమాలుదాసి బత్తెంబుచేటురా, వి... 315

కొందఱు డబ్బును దండుగచేసిదాసియనుపేరుతోకొందఱు సేవకురాండ్ర నుంచికొనియెదరు. వారివలన కలుగునుపయో గముమాట నటుంతము. కాని ప్రతిదినము బత్తెముమాత్రము పాడగుచుండును. ఎట్లనఁగా:బుద్ధిలేనిపడఁతిని బెండ్లాడి, పెండ్లి ఖర్చు దండుగయగునట్టులు. పాటుపడనిమగవానికి పెట్టెడి



యన్నము దండుగయైనట్టులు. పనికిఁ బ్రాలుమాలుబానిసదానిని బెట్టుకొంటిమేని దానికిచ్చు బత్తెపురొక్కమంతయువ్యర్థమాయ గును.మనుజుఁడు కూలివాండ్రపై నాధారపడి సోమరియైనచో నిలు గుల్లయైపోవును. కావున బుద్ధిమంతుఁడు ధనమును వ్యయ ముసేయుటయందు జాగ్రత్తగా నుండవలయును.

ఆ. కట్టెపేరు లోలిగట్టి చెప్పఁగరాదు
కానరాక యున్న కలిమితనము
జంగమైనవాని జాతి గన్పడదొకో, వి.... 316

కొందఱు తమ కెక్కుగా సంపదలున్నవని పురజనులకును ప్రేక్షకులకును తోపింపఁజేయుటకై వస్తువాహనముల నధికము గానలంకరించుచుందురు. ఇది వట్టిదేబెతనమని నాతలంపు. నిజ ముగాసంపద లున్నవారు అందఱికిని తెలిసియే యుందురు.వారి కలిమి ప్రయత్నము లక్కఱలేకయే ప్రకటితమగుచుండును. ఎట్లనియందురా?జంగముఅయిననుజాతిగనుపట్టుటలేదా!యట్టు లే. కావున లేనిపోనివేషములచేత డబ్బునశింపఁజేయఁదగదు.

ఆ. కడుపునిండ దవుడు గంపలోఁ బెట్టిన
జన్నుఁ బట్టనీక తన్ను గేదె
వారకాంత లెట్లు వలతురో యూఱక? వి...

కడుపునిండతవుడుబెట్టినను చన్ను ముట్టుకొననీయకగేదె త న్నుచునే యుండునుగదా! అట్లే వేశ్యకూడ తనివిదీఱ ధనము నొసంగుచున్నను తృప్తినొందక వలచినవానిని కలఁతనొందిం చుచు నవితెమ్ము ఇవితెమ్మని కసరి వెళ్లగొట్టుచుండును. దాని

వలనఁ గాముకుఁ డించుకేని సుఖమొందఁజాలఁడు. అట్టివేశ్యా సంపర్కమున కాశించి చేతులార రొక్కమును పాడుచేసికొన వలదని వేమన చెప్పుచున్నాఁడు.

ఆ. కనకపర్వతమునఁ గాపురం బుండిన
నమిమిషేశ్వరునకు నాసపోదు
కనకకుండలములు కర్ణుని నడుగఁడా? వి... 318

ధనము చెడ్డదియనియును ధనముపై నాశను విడువవలయు ననియు ననేకులు పెద్దలు చెప్పుచుందురే గాని తాము అచరించిన వా రొక్కరును లేరు. తెలిసినంతవఱకు దేవతలలో నైన నున్నారేమో? యని విచారించినయెడల లేరుసరికదా! దేవేం ద్రునంతటివానికిఁ గూడ నింకనుధనాశయే! అహా ఏమిధనము!! బంగరుకొండమీఁదకాఁపురముండినను ఇంద్రునికికూడధనాశయే! ఎట్లని యందురా? కర్ణునిజేరి కనకకుండలముల నడుగుటయే సాక్షి. కావున ధనమునందు విరక్తినొందవలదు.

ఆ. కనకమృగము భువిని కద్దులే దనలేక
తరుణి విడిచిపోడె దాశరథియు
దైవమైన ధనముఁ దలఁచుచుండెను గాదె,వి...

బంగారముపేరు చెప్పినతోడనే యెంతటి మహానుభావుల కైనను ఆశలు పుట్టును. ఆట్లు ఆశలేనివాఁడు లేడు చూడుడు. రామునంతటినిస్పృహుఁడు "బంగారుపులేడివచ్చెను" అనియ న్నంతనే "ఓసీ బంగారములేడి యుండునా?" యని యైన నాలోచింపక భార్యను విడిచి లేడివెంటఁ బరువెత్తిపోలేదా!



దేవుఁడైనను ధనమునే గోరుచుండును. కావున బుద్ధిమంతు లింతటియావశ్యకవిషయమును వ్యర్థము పుచ్చకూడదు.

ఆ. కనక మున్నవాఁడు కాముఁడు భీముఁడు
మిగులఁ దేజమంది మెలఁగుచుండు
విత్తహీనుఁడైన వెఱ్ఱులలోనేటు, వి... 320

ఈకలికాలమున ధనవంతునకుఁగలగౌరవము ఎంతటివానికిఁ గూడలేదు. ధనమాహాత్మ్యమే మోగాని లోకమునధనవంతుఁడె మన్మథునికంటెఁ జక్కనివాఁడు వాఁడె కలియుగ భీమావతా రుఁడు. వాని గొప్పతనమునకు సాటియేలేదు. సర్వశక్తిసంపన్నుఁ డగు బీదవాఁడు వెఱ్ఱివాండ్రలో మొదటివాఁడుగ గణింపఁ బడుచున్నాఁడు.

ఆ. ఉన్న ఘనతఁబట్టి మన్నింతురే గాని
పిన్న పెద్దతనము లెన్నఁబోరు
వాసుదేవు విడిచి వసుదేవు నెంతురా? వి...321

లోకులు మనుజులను వారివారికిఁగల వివేకాదులఁబట్టి గౌరవింతురుగాని వయస్సునుబట్టియెప్పటికి గౌరవింపరు. లోకులు పెద్దవాఁడును దండ్రియు నగువసుదేవునిఁదలంపక వాని కుమారుఁడగు శ్రీకృష్ణునే ధ్యానించుచున్నారు. కాన వయ స్సునుబట్టిగౌరవము రావలయుననుకొనుటవృథాయగుచున్నది.

ఆ. కనియుఁ గానకుండుఁ గదలింపఁ డానోరు
వినియు వినకయుండు విస్మయంబు
సంపద గలవాని సన్నిపాతకమిది, వి... 322

ధనముగూర్చుటయు సత్క్రియము చేయుటయు నిహపరదాయకమెగాని ధనగర్వమున నొడలుమఱచి లోకాపకారముగ వర్తించుట మిగులనక్రమము. కొందఱుధనవంతులు బీదవాని చూడఁగనే యేమి యడిగి పోవునోయని వేషభావలచే నిరుపేదయని నిశ్చయించికొని చూచియుఁ జూడనటుల వర్తింతురు. వాని మొఱవినియు విననటుల మెలఁగుదురు. ధనవంతుఁడిటుల సన్నిపాతరోగమును దెచ్చిపెట్టుకొనును. ఇదియెంత యక్రమమో యూహింపుము.

ఆ కన్నె మీఁది యాస కనకంబుపై నాస
లేనివాఁడు పుడమి లేనివాఁడు
కలిగెనే నతండు కానంగ రాదయా, వి... 323

సర్వమును తెలిసినవార మని లోకులు కొందఱు "కనకము నతిగాసంగ్రహము సేయరాదు. ఇదియ బుధులకు కర్తవ్య" మని ధర్మోపన్యాసములు గావించుదురు. విచారించితిమేని నిజముగా కన్యకలపైనగాని కనకముపైనగాని యాశలేనివాఁ డీభూలోకములో నెక్కడను లేనేలేడు. ఒకవేళ యుండునని యనుకొందమన్నను నాతఁడిట్టులు వీరివలె పెనురచ్చలపైనను పెంటకుప్పలమీఁదను కనఁబడనే పడడు. కాంతాకనకముల నాశించుటదోషము కాదు. మానవజాతికి సహజముగాన ధనము నార్జింపుము. దానిని ధర్మార్థముగా వినియోగముచేయుము.

ఆ. కమ్మరీనిదుడుకు కార్యవినాశంబు
వడ్లవానిదుడుకు వాలపిడుగు



కాసెవానిదుడుకు కాకుత్స్థుబాణంబు, వి....324

అధికారముకూడను ప్రపంచమునందలి వస్తువులన్నిఁటి కంటె ద్రవ్యమునకే యెక్కువగా గలదు. ఎట్లనియందురా? చూడుడు. కమ్మరపనిచేయువాఁడు కుపితుఁడై పనిసేయకున్న పని నిలిచి పోవును. వడ్లవాఁడు(అనఁగా కొయ్యలను చెక్కువాఁడు) సరిగా పనిచేయకపోయిన దినగండము వచ్చినట్టు లుండును. రాజునాశ్రయించియుండు కాసావానికిఁ గోపము వచ్చి సాధింపఁ బూనినచో రామబాణమువలె తత్క్షణమే తగిలి వచ్చును.

ఆ. కర్ణుఁ డొకఁడెగాని ఘను లెవ్వరును లేరు
దానశీలుఁ డంచు తలఁపఁబడెను
తలఁప ధనము కర్ణు దాతఁ జేసెను సుమీ, వి...

సూతకులములో పుట్టినవాఁడైనను ధనముగలిగినందువలననే కదా "లోకములోన దాతయన్నను ఘనుఁడన్నను ఇనసముఁడన్నను కర్ణుఁడొక్కఁడే గాని మఱియొక్కఁడు లేడు" అని కర్ణుఁడు తలఁపఁబడెను. ఆహా! ధనపుమాహాత్మ్యమెంతటిదో చూడుడు. కర్ణుని కింతటి యుత్కృష్టతను యశంబును ఇచ్చినది ధనమొక్కటేసుమీ! కావున బుద్ధిమంతుఁడైన నరుఁడు ధనము నార్జింపఁ బ్రయత్నంబు సేయవలయును.

ఆ. కలిగినమనుజుండు కాముఁడై సోముఁడై
మిగుల తేజమునను మెఱయుచుండు
విత్తహీనుఁడైన నుత్తసన్యాసిరా, వి... 326

ధనము కలిగినమనుష్యుఁడే సకలలోకములలో నుత్తముఁడగును. ఇట్టిమనుజుఁడే రూపము లేకున్నను కాంతిలేకున్నను మన్మథుఁడై చంద్రుఁడై తేజోవంతుఁడై వెలయుచుండును. ఇంక ధనము లేనివాఁడో విత్తహీనుఁడై వెఱ్ఱివాఁడై గోచియు మొలత్రాడును లేని సన్న్యాసియై పోవును. కావున ప్రతివారికిని ధన మార్జింపవలసియుండుట యత్యావశ్యక కార్యము.

ఆ. కలిగి ధర్మ మీయఁ గాననివారును
కలిగి తినక చాల గ్రాఁగువారు
కలిమి నెచటఁ జూడఁ గానక చెడుదురు, వి.

తమకు లేని యప్పుడు సరియే. ఉన్నయప్పుడైనను పట్టుమని బ్రాహ్మణునికి పదికాసులను ఈయ లేనివారును, ఒకరికీయకున్నను తామైన తినియెదరేమొ! యన నట్లును గానివారును ఇఁక పైనివచ్చు జన్మజన్మములకును సంపదను కనులతోఁ జూచెడి భాగ్యమును నోచుకొనక వ్యర్థులై చెడిపోవఁగలుగుదురు. కావున తాను ఆర్జించి వల్లనైనంతవఱకు ఒరులకిచ్చి గాని తా ననుభవించి గాని యుండుట ధనికునకు చేయఁదగిన కృత్యము.

ఆ. కలిమి యున్నవానిఁ గని పట్టి నిచ్చిన
మనుపుపొంగుపాలు మఱిగినట్లు
లోన నిగిరి కలిమి లొట్టపోయెడునొకో, వి...

లోకములో బుద్ధిమంతు లగునరు లుందురేని, సంబంధబాంధవ్యములను చక్కఁగా విచారించి సంపద గలిగినవాని కేతన కొమరిత నీయవలయును. అట్లు ఇచ్చినయెడల వారిబాంధవ్యము



(అనఁగా చుట్టిఱికము) పాలుమఱిగినట్లు మఱిగి సారవంతమై యొప్పునేగాని ఇగిరిపోయి కుండ కంటికొని పోవునట్టులు కానేరదు. కావునఁ బ్రతిజనుఁడుధనికుల నేయన్వేషింపవలయును.

ఆ. కలిమి కలిగియుండి కఠినభావముఁ జెంది
తెలియలేరు ప్రజలు తెలివిలేక
కలిమి వెన్నెలగతిఁ గానంగ లేదయా, వి...329

బుద్ధిమంతులు సంపదలు వచ్చినవని పొంగిపడరు. బుద్ధిహీను లన్ననో తమకు కలిమి గలిగినదని బిఱ్ఱబిగుసుకొని యెవ్వరితోఁగూడ మాటలనాడక, స్వయముగా తెలిసికొనఁజాలక చెడిపోయెదరే కాని, కలుములు వెన్నెలరాత్రులఁ బోలి శాశ్వతములు గావని తెలిసికొనఁగాఁ జాలరు. కావున తనకు సంపదగలిగెనని పొంగి యొక్కదినముననే కర్చుచేసి తరువాత విచారము నొందవలదు.

ఆ. కలిమి కలిగెనేని గాముఁగాఁ జూతురు
లేమిచేతఁ జిక్క లేమ లధిపు
మదనువంటివాని మాలఁగాఁ జూతురు, వి. 330

ప్రపంచములోని తక్కినవస్తువు లున్నను లేకున్నను సంపద లుండినయెడల స్త్రీలు వానిని మన్మథునిగా నెంతురు. ఇఁక నొకవేళ వానికే దారిద్ర్యము వచ్చెనా ఆ స్త్రీలు వానిని మన్మథునితో సమాన మగురూపరేఖావిలాసములు కలవానినైనను మాలవానినివలె దూరముగాఁ బాఱఁజూతురు. కావున ధనము సర్వశ్రేయములకును తావలము. దానినే యార్జింపవలయును.

ఆ. కలిమి గలుగ సకలకులముల కెక్కువ
కలిమి భోగభాగ్యములకు నెలవు
కలిమి లేనివానికుల మేమి కులమయా! వి...

సంపదయే యన్నిగుణములకును మూలకారణ మగుచున్నది. ఎట్లనియందురా? చూడుఁడు. సంపదయే సమస్తములగుకులములకంటె నెక్కువకులమును తెచ్చుచున్నది. సంపదయే తాను గోరినసమస్తభోగభాగ్యములకు పట్టుగొమ్మ. ఇట్టి సంపదలేనివాని జన్మము వ్యర్థము. అట్టివానిభాగ్య మేమిభాగ్యము? కుల మేమి కులము? అనఁగా: సంపదలు లేకున్న నంతయును వ్యర్థము.

ఆ. కలిమిఁ జూచి యీయఁ గాయ మిచ్చినయట్లు
సమున కీయ నదియు సరసతనము
పేదకిచ్చుమనువు పెనవేసినట్లురా, వి... 332

కొందఱు ఐశ్వర్యలాలసులు తమకుమార్తెలు దమకంటె గొప్పవారికిచ్చినచో బిడ్డసుఖపడుననియుఁ దమకు గౌరవమనియు మురియుచుందురు. నిజము విచారించినచో కలిమిగలవానికి బిడ్డనిచ్చుట తనయెడలు ఇతరునకుఁ గోసి యిచ్చుటవంటిది. సమానస్థితిగతి గలవానికిచ్చుట కొంతవఱకు సరసముగానుండును. పేదవానికిఁ బిల్లనొసంగుట పెనవేయుటవంటిదిగాన నిరుపేదలతోడి బాంధవ్యమే శ్రేయస్కరము.

ఆ. కలిమినాఁడు మగని గామించి చూచును
లేమిఁ జిక్కునాఁడు లేవకుండు
మనిసిమగనినైన మడియంగఁ జూచును, వి. 333



అర్థములేనివాఁడు వ్యర్థుఁడు. అట్టివానిని పిచ్చికుక్కలు కూడ నొల్లవు. ఇఁక పెండ్ల మిష్టపడ దని వేఱుచెప్పవలయునా? చూడుఁడు. అర్థములపట్ల భార్యస్వభావ మెట్టిదో? సంపద గలిగినయెడల మగనినత్యంతము ప్రేమతోఁ జూచును. లేనినాఁడు చూచినను చూడనట్టులు నటించి లేవనైనను లేవదు. పైపెచ్చు ఇట్టిమగనిచేత నేమిప్రయోజన మిట్టివాఁడు బ్రదికి యుండుటకంటె చచ్చిన బాగుండునని కోరును. కాఁబట్టి శ్రేయఃకాము లర్థముల నార్జింపవలయును.

ఆ. కాంచనంబుపైనఁ గాంతలపైనను
బమ్మకైనఁ బుట్టు రిమ్మతెగులు
తోయజాక్షివిడుచు దొరయెవ్వఁడును లేఁడు,వి.

బంగారముపైని ఆసలేనివాఁడు ముల్లోకములలో నెక్కడను లేఁడని గట్టిగా చెప్పఁగలము. ఇఁక వీరి వారి సమాచారములేల? లోకముల నన్నింటిని పుట్టించిన బ్రహ్మకైనను గానిండు. బంగారముగాని పడఁతిగాని కన్నుల కగుపడినవెంటనే వలయునని వాంఛ కలుగునే కాని వలదని కలుగదు. ఆఁడుదానిని విడుచుప్రభు వెచ్చటను లేనట్లే అర్థము నాశింపనివాఁడును లేఁడు. కావున జాగ్రత్త వహించి ధనమును కాపాడుకొనవలయును.

ఆ. కాంచనంబుమీఁది కాంక్ష మోహ మటంద్రు
విడువలేరు దాని విబుధులైన
కాంక్ష లేనివారు కానఁగా రారయా, వి...335

బంగరుపై నాసయుంచికొనుటకు యజ్ఞానమనియును, ఆయాసను బోఁద్రోలని యంతవఱకు జనుఁడు మోక్షమున కర్హుఁడు కాఁడనియును కావున నవశ్యము విసర్జించి వేయవల యునని విద్వాంసులు చెప్పుచుందురు. కాని ఎంతటి విద్వాం సులైనను బంగారముపైని కోర్కిలేనివారు ఎక్కడనైననుండిరే మో? యని వెదకిచూచినను కానరాకయున్నారు. కాఁబట్టి తెలివితక్కువచేత ధనముకొరక యపరిమితముగా వెచ్చించి చెడిపోవలదు.

ఆ. కావలయు ధనముఁ గొంత నెల్లప్పుడు
కావ లేనివాఁడు చావవలయు
కాపులేనిదాని కాపుర మడుగనా? వి. 336

పురుషుఁడైపుట్టినందుకు సంపాదించుఫలము పేరేపురుషార్థము. పురుషార్థము గోరు ప్రతిజనుఁడును విధిగా పడఁతిని భాగ్యమును జాగ్రత్తగా కాపాడవలయును. ఈరీతిగా కాపాడలేని వాఁడు వ్యర్థుఁడు. అట్టివాఁడు బ్రదికియుండుటకంటె చచ్చుట మేలు. కాపులేక యిల్లాలినివిడిచినవానికాపురము, ధనమును మితిలేక వెచ్చించినవానికాపురమును గూర్చి చెప్పవలసినదేలేదు.

ఆ. కుడువఁ గూడు లేక కూడఁబెట్టఁగ లేక
విడువ ముడువ లేక గడన లేక
నడువ సాగకున్న నడపీనుఁగందురు, వి... 337

ధనహీనుని బ్రతుకెంతనీచమైనదో! చూడుఁడు. తనకు తిను టకు అన్నము కావలయుననిన దొరకుట దుర్లభము. తానొక



నికి పెట్టవలయుననిన నంతకంటె నుండదు. పోనీ ఇట్టికాపు రమును వదలివైచు నేమో! యనుకొందమన్నను విడువఁజాలఁడు. కాపురము స్వాధీనముచేసికొని గడుపుటకు చిల్లిగవ్వయైన ఆర్జన ముండదు. ఇఁక నాపైని దినము గడచుటయే కష్టమగు చుండును. ఇట్టివానిని లోకులు చూచినప్పుడు నడపీనుఁగు అని నిందింప మొదలుపెట్టెదరు. కావున లోకనిందకు భయంపడి యైనను ధనము నార్జింపుము.

ఆ. కులము గలుగువారు గోత్రంబు గలవారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిఁడి గల్గువాని బానిసకొడుకులు, విశ్వ...338

“మాది సద్వంశము. మాది గొప్పగోత్రము. లోకములోని యందఱికంటె మేము హెచ్చువారము” అని కొందఱును, “అన్నివస్తువులను మించినది విద్య. విద్యతో సమాన మీలోకము లోలేదు. మేము విద్య నార్జించితిమి. మాతో సమానులు లేరు” అనికొందఱును గర్వముచే విఱ్ఱవీగుచుందురు. ఆహా! ఏమి వీరి తెలివితక్కువ. ఈకులముగొప్పవారలు గోత్రాలవారు, విద్యాధి కులు ధనములేమిని అందఱును భాగ్యవంతుని దాసీపుత్త్రులతో సమానులగుదురు. కావున ధనమార్జింపుము.

ఆ. కులములేనివాఁడు కలిమిచే వెలయును
కలిమిలేనివాని కులము దిగును
కులముకన్న నెన్నఁ గలిమి ప్రధానంబు, విశ్వ. 339

లోకములో నభిమానమును బుట్టించు వస్తువులు రెండు.

ఒకటి కులము రెండవది కలిమి. గుణవంతుఁడైనవాఁడు కులము కంటెను కలిమినే ముఖ్యముగా చూడవలయును. ఎట్లనఁగా:—కులము తక్కువయగువాఁ డుండినచో వాఁడు సంపదచే నుత్తమకులుఁడగును. ఇట్లే కలిమి తక్కువవాఁడు కులముచే హెచ్చగు ననవలదు. అట్లైన్నడు కాదు. కలిమి లేకపోయిన కులము తక్కువయగును. కాఁబట్టి కులము కలుములలో కలిమియే ప్రధానముకావున కలిమి నార్జింపుము.

ఆ. కులుకుగుబ్బఁ జూపి గొబ్బున వలపించి
చేతికాసులెల్లఁ జేరఁదీయు
నతనుచేతికత్తు లమరంగఁ గాంతలు, వి... 340

ధనముగలవాని నెక్కడ నెవ్వరైనను చేరఁదీసి ద్రవ్యము నపహరింపనే చూచుచుందురు. కావున జాగ్రత్తను వహించి యట్టిజారిణులమాయలంబడక కాపాడుకొనవలయును. ధనాశగలజారిణులకుసిగ్గుఎగ్గులుండవు. జనులనుతమవశము చేసికొనుటకు చన్నులసొగసుఁ జూపి వలపింతురు. చేతిలోనికాసులనన్నిటిని గ్రహింతురు. స్త్రీలు మన్మథునిచేతిపదనుకత్తులవంటివారుగాన వారిని జేరదీయుట అపాయకరము.

ఆ. కూరలేనితిండి కుక్కతిం డనిపించు
మాఱులేనితిండి మాలతిండి
ధారలేనితిండి దయ్యపుతిండిరా, విశ్వ... 341

డబ్బులేనివారికి సౌఖ్యము లెట్లువచ్చును? ఎట్లు జీవింపఁగలుగుదురు? ధనికులు కానివారలు బ్రదుకుటలేదా? యని య



నెదరేమొ? సరి. ఇదియా, తిండిత్రిప్పలు లేక మాడిచచ్చుట యాగొప్ప? అట్టివానితిండియు నొకతిండియా? కాదు. కూరలేని భోజనము కుక్కతిండితో సమానము. మాఱులేనితిండి మాలనితిండితో పాటి. ఆజ్యధారలేక యన్నముఁ దినుట దయ్యపుతిండి. కావున భోగముల కాసించువారు ముందుగా ధనమునుసంపాదింపవలయును.

ఆ. కూలినాలిఁ జేసి గుల్లాముపనిచేసి
తెచ్చిపెట్ట నాలు మెచ్చుచుండు
లేమిఁ జిక్కువిభుని వేమాఱు దిట్టును, విశ్వ...

గయ్యాళిభార్య మగనికి బెట్టునవస్థలకు మేరలేదు. మగఁడు దేహమువిక్రయించుకొని బానిసతనముతోనైన ధనము తెచ్చెనేని గయ్యాళిపెండ్లము నామగనివంటివాఁడు లేఁడని కొనియాడసాగును. దరిద్రావస్థలో మగఁడుండి సంపాదింపనిచో వానిని దిట్టి దిగబాఱఁబోయసాగును.

ఆ. కోమటి మదిఁ గోరు క్షామమే యెల్లెడ
వైద్యుఁ డొరుల కెపుడు వ్యాధిఁ గోరు
ఊరివాఁడు ధనికుఁ జేరఁగాఁ గోరును, వి...

ఊరిలోనివారందఱు ఎంతగొప్పవారైనను ధనికు నాశ్రయించికొనియే బ్రదుకఁజూతురు. ఇట్లగుట సహజము. ఎట్టులని యడిగెదరా? చూఁడుఁడు. కోమటి తనవర్తకము వృద్ధినొందు నను నాశచే కఱవునేకోరుచుండుట లేదా? వైద్యుఁడు తన వైద్యమే ప్రసిద్ధిఁ జెందవలయునని లోకులకందఱికిని రోగములు

రావలయు ననికోరుటలేదా ? అట్టులే వాడలోనివారు తాము ఇతరులధనము నపహరింపవలయునని యత్నించుదురు.

ఆ. చదువులందుఁ బాడి సౌఖ్యములందును
పెదవులందు రాజ్యపదవులందు
నాశ లుడిగినట్టి యయ్యలు గలరొకో, విశ్వ...

ధనాశలేనివారు తఱచుగా లేరనుటకంటెను లేనేలేరని చెప్పుట యుత్తమము. ఏలయనియందురా? చదువులు, సంపదలు, ఆభరణములు, పాలతుల పెదవులు, అధికారములు, ఎంతటివారికైనను మోహమును పుట్టించి కోర్కులను రేపునేకాని నిరసనమును పుట్టింపవు. ఇట్టివానియందు ఆశలేదని చెప్పుట యసత్యము. వీనియందు ఆశలనుడిగిన అయ్యలుకూడకలరా? లేరు.

ఆ. చమురు గల్గుదివ్వె సంతోషముగ వెల్గు
ధనము గలుగువాని తలఁపుఁ జెలఁగు
ధనము లేనివాని తలఁపులు తీరునా, విశ్వ...345

ధనముగలవాఁడే ఎట్టిధర్మకార్యమును గాని ఎంతటిపుణ్యకార్యమును గాని ఘనకార్యమునుగాని చేయఁగలఁడే కాని ఇతరులగు దరిద్రులవల్ల నగునా? కాదు. ఎట్లనఁగా: చమురు కలదీపముచక్కఁగా వెలిఁగినట్టులే ధనముగలవానికోర్కులును అతిశీఘ్రముగా కొనసాగును. చమురులేని దీపము వెలుఁగక ఆరిపోవునట్టులే దరిద్రునికోర్కెలు కొనసాగవు సరి గదా. చివ



రకు నశించికూడ పోవును. కావున ధనమార్జించుట యత్యావశ్యకము.

ఆ. చావు నేఁడొ రేపొ జతపడివచ్చును
పెక్కునాళ్లు కూడఁ బెట్టనేల
అనుచు నాశ లుడిగినంతటివారేరి? విశ్వ...346

ఏపనినైనను అందఱికిని చెప్పెడివారే గాని తాము చేసెడివారు లేనేలేరు. అట్టులే ధనము చిక్కినంతకు ఖర్చుచేయుమనిచెప్పెడివారే గాని తాము చేసి చూపెడువారు లేరు. ఎట్లనఁగా:—చావు నేఁడో రేపో రానేవచ్చును. కావున పెక్కునాళ్లు కూడఁబెట్టిన ప్రయోజనములేదు. ఇదిగో మమ్మును చూడుఁడు. మేము ఖర్చుజేయుచున్నామని ఆశలుడిగి ఖర్చుసేయునంతటి ఘనులెవ్వరును లేరు. కావున బుద్ధిమంతుఁడు తనధనము నితరులమాటప్రకారము ఖర్చు నెక్కువగా చేయకూడదు.

ఆ. జడలు దాల్చుటెల్ల జగము సీ యనుటెల్ల
నొడలు విఱుచునట్టియోగ మెల్ల
ముక్తికాంతఁబట్టి ముద్దాడుకొనుటరా, వి. 347

యోగులు దాల్చు వేషములన్నియు బ్రహ్మస్వరూపమును దర్శించుటకేగాని వేఱు పనికిఁగాదు. వారు జడలుదాల్చుట, లోకము నిస్సారముగా నెంచి తిరస్కరించుట, యోగాభ్యాసములతో నొడలువిఱుచుకొనుచు నవస్థలొందుట మొదలగు మహాకార్యములన్నియు ముక్తికాంతను గవయుటకేగాన వారిపై మిథ్యాదోషము లారోపింపరాదు.

ఆ. టంక మదుకకున్నఁ బొంకంబు గారాదు
స్వర్ణభూషణంబు జగమెఱుంగు
భటుఁడు వెంటలేక ప్రభుఁడు శోభించునా, విశ్వ.

ఐశ్వర్యవంతు లగువారు కొందఱు లుబ్ధభావముతో బంటులను బెట్టుకొనక కొద్దిపనికి గొప్పపనికి తామె లోఁబడుచుందురు. దీనవలన ధనవంతునిగౌరవమంతయు నశించుచున్నది. ఎటులన విలువలేనిదగుటంకముతో నతుకఁ బెట్టిననే బంగారు సొమ్ము ప్రకాశించెను. అటులేబంటువాఁడు ముందున్ననే ధనవంతుఁడగు ప్రభువు పన్నె కెక్కును. కాన ధనవంతుఁ డవసరవ్యయము చేయవలయును.

ఆ. డిందుపడినవాని నెందును లెక్కింప
రిందు నందుఁ గాన నెట్టు లయిన
మందమతివి గాక మహిమతో నుండుము, వి...

ఒకవేళ ధనమును సంపాదించి దాని నంతయును ఖర్చుచేసి కొంచెము లొంగిపోయినవానిని లోకులాదరింతురా? యని విచారించి చూచితిమేని నిర్ధనుని ఈలోకములోను లెక్క సేయరు. పరలోకములోను లెక్కసేయరు. కావున బుద్ధిహీనుఁడవైతిరుగాడక జాగ్రత్తగా ధనమును కాపాడికొని పేరుప్రతిష్ఠలనొంది సుఖింపుము.

ఆ. డొక్క లెండిపోవు డొక్కు తానయ్యును
మమత మానఁగలఁడె మానవుండు
కాన ధనముఁ గూర్పఁ గడఁగుము జ్ఞానివై, వి...



డొక్కలన్నియు తిండిలేక యెండిపోవునట్లు కృశించినప్పటికి నభిమానమును పోఁగొట్టుకొనఁగలఁడా? లేఁడుగదా! కావున బుద్ధిమంతుఁడైనవాఁడు వ్యర్థముగా కాయక్లేశమును గలిగించు తపోజపంబులతో తంటాలు పడుటకంటె నియతముగా ధనమునార్జించి జ్ఞానియై సౌఖ్యముల నొందుటయే యత్యుత్తమమగు కార్యము. కాన నీ పట్లుచేయుటకొఱకుఁ బ్రయత్నమును సేయుము.

ఆ. తమకు బంధు వనుచు తానె తోడుకవచ్చి
కలిమిఁ గలయఁ జూచి కాంక్షపడుచు
దక్షిణల నొసంగి తరుణి నీయఁగఁజూచు, వి...

సంపదగలవాని కీలోకములోఁ గలుగుమర్యాదలను సుఖములను పరికించుఁడు. బలహీనుఁడైనను గుణహీనుఁడైనను సంపద విస్తారముగా నున్నయెడల వానికిని తమకును ఇదివఱలో నెట్టి సంబంధము లేకున్నను, తనుబంధువనివానిని జెప్పుచు సంపదకు మురియుచు కోరి వరదక్షిణలనొసంగి చక్కని చుక్కయనఁదగుపిల్లనిచ్చి పెండ్లిసేయఁ జూతురు. కావున ధనమార్జించుట యవశ్యము చేయఁదగును.

ఆ. తఱుచు కల్లలాడు ధరణీశు లిండ్లలో
వేళవేళ లక్ష్మి వెడలిపోవు
నోటికుండలోన నుండునా నీరంబు? విశ్వ...352

మహారాజులైనను గాని చక్రవర్తియైనను గాని సంపదలను సత్యవర్తనముతో కాపాడుకొననిది నిలువదు. కొందఱు

రాజులు వేళయు లేక అప్పు డిప్పుడనక యెప్పుడును కల్లల నాడు చుందురు. ఇట్లసత్యములు పలుకుచు జగడములను వేయువారిం డ్లయందు లక్ష్మి నిలువనేనిలువదు. ఎట్లనియందురా? ఓటికుండ లో నీరు నిల్చునా? నిలువదుకదా! అట్టులనే కల్లలాడువారికి ధనమెటు నిలుచును? నిలువదు.

ఆ. తరుణి సుతులు ధనము ధాన్యముల్ సంపద
లెంతచుట్టుకొనిన నంతచేటు
పసిరికాయ పురుగుపద్ధతి గానరో, విశ్వ...353

మానవునకు భార్యలు చుట్టములు కొమరులు ధనము ధాన్యము ఎంతగాతననుచుట్టుకొనిన నంతచేటుకలుగును. ఎట్లనియందురా? పరికించుఁడు. పసిరికాయపురుగు తననోటినుండివచ్చు దారమును జాగ్రత్తగా చిక్కుగాఁ బడకుండ కండెగా చుట్టవలయునని పూనుకొని తనకాళ్లకు బంధములను వైచికొని మృతినొందును. ఆట్టులే ధనరక్షణమునఁగూడ నితరులు ప్రతిబంధకు లగుదురు.

ఆ. తలనుఁ బాగ పైని దగుపచ్చడము బొజ్జ
చెవులపోగు లరసి చేరు నర్థి
శుద్ధపశువు లనుచు బుద్ధిలో నరయక, విశ్వ...

లోకులు తలకుఁ బాగుగాఁ బాగఁజుట్టుకొని చెవులకు పోగులుదాల్చి పైన కాశ్మీరపుశాలువుదాల్చి విగ్రహపుష్టితోఁ గానరాఁగా వారిని దాతలుగా భావించి యాచకులు గంపె డాసతో వారల దేబిరింప నేతెంతురు. ధనవంతులగు దాతల



కిట్టిబాహ్యాడంబరము లుండవు. ఈయాడంబరవేషధారులు పశు ప్రాయులుగాన యాచకులు కనుగొని తొలఁగవలెను.

ఆ. తల్లిబిడ్డలకును దగవు పుట్టించెడు
ధనము సుఖముఁ గూర్ప దని వచింత్రు
కాని గడన లేక గడచుట యెట్లురా? వి...355

మూర్ఖులై కొందఱు జనులు ధనమును నిందించుచు "తల్లికిని బిడ్డకును తగవులను కలిగించును. ఛీఛీ! ధనమంత చెడువస్తువీలో కమున మఱొక్కటిలేదు. కావున బుద్ధిమంతుఁ డగువాఁడు ధనము నార్జింపకూడ" దని చెప్పుచుందురు. సరి, వీరుచెప్పిన ట్టులే నడచుకొనియెదము గాని ఒక్కపైస గూడ యార్జనచే యక లోకములోఁ గడచి బ్రదుకుట యెట్లో చెప్పుఁడు? కావున వీరిమాటలను విశ్వసింపకుఁడు.

ఆ. తళుకు బెళుకుఁ జూచి ధరలోనిజను లెల్ల
కద్దు లే దటంద్రు ఘనతగాను
ఇదిగొ యదిగొ యనుచు నీక నెక్కడందురు? వి.

మనుష్యుఁ డెంతవఱకు ధనికుఁడుగా నుండునో లేక ఎప్పటివఱకు ధనికవేషమును వైచికొనునో అంతవఱకు వాని నందఱును గౌరవింతురు. ఆధనికుని తళుకు బెళుకును చూచియే యందఱును అడిగినదానిని కద్దనిగాని లేదనిగాని గౌరవముగఁ బ్రత్యుత్తరముల నిచ్చుచుందురు. ఒకవేళ దరిద్రుఁడుగాఁ గను పడి దేనినైననడిగెనేని ఈయక ఇదిగో అదిగో యని త్రిప్పుచు

చివరకు లేదందురు. ధనికునకును, దరిద్రునకు నింతటివ్యత్యాసము గలదు. కావున ధనము అవశ్యము ఆర్జింపఁదగినది.

ఆ. తవిటి కరయఁ బోవఁ దండులంబుల గంప
శ్వాన మాశ్రయించు సామ్యముగను
వైశ్యవరునిసొమ్ము వసుధ నీచుల కబ్బు, వి...

ధనము నార్జింప తలఁపు గలుగఁగానే సరియా ? కాదు. ఆర్జించిన ధనమును కాపాడుకొనవలయును. అధికమునకుఁ బోవు నప్పుడున్న దానిని జాగ్రత్తచేయు నేర్పు కలిగియుండవలయును. అట్లు లేకయున్నచో నసలునకే మోసము సంభవించును. ఎట్లని యందురా? ఇంటిలోనున్న బియ్యమును జాగ్రత్తచేయక తలుపు తెఱచికొని పోఁగువాని తవిటికిఁ బోయిన కుక్కలుచొరఁబడి తనబియ్యముతిని పోవునట్టులుగా, ఆర్జించిన దానినరయ తెలివి లేనివైశ్యవరులసొమ్ము నీచులపాలగును.

ఆ. తాను గుడువలేఁడు తగవేది యాప్తులఁ
జేరనీయఁ డట్టి చెనఁటి పశువు
చేనిలోన బొమ్మఁజేసి కట్టినయట్లు, వి... 358

ఒక్కొక్కఁడు ధనము నార్జించును గాని దాని నెట్టు లుపయోగించవలయునో తెలిసికొనఁడు. తాను అనుభవింపనైనను అనుభవింపవలయును. లేదా తనయాప్తులఁ జేరనిచ్చి యనుభవింపనైనను చేయవలయును. ఈరెండుపనులును తనకు తోఁచక యెదుటివాఁడు చెప్పిన వినని చెవిటి పశువు చేనిపంట పాఱిపోకుండ గట్టఁబడియొక విధమైన దృష్టిబొమ్మతో సమానుఁ



డగునే కాని యితరము కాదు కావున నార్జితములగు ధనముల సద్వినియోగముఁ జేయవలయును.

ఆ. తాము దిరుగుభూమి ఘామడాంబరమైన
బరగు దేశమునకు జరుగవలయు
గొలనటెండిపోవ గొక్కెరలుండునా? వి...359

బుద్ధిమంతుఁడై ధనార్జనముసేయువాఁడు ఒక్కొక్కప్పుడు తానుండు దేశమునందు కఱవు మొదలగువానివలన నాదాయము లేకపోయిన యెడల నే నీదేశమును విడిచిపోవుదునా యని దురభిమానమును పొందక ధనార్జనమున కనువగు మఱియొక దేశమునకు పోవలయును. ఎట్లని యందురా? ఉదాహరణముఁ జూచుఁడు. కొలనిలో నీరున్నంతవఱకు గొక్కెరలుండునేగాని యానీరెండిన తరువాతను కొక్కెరలుండనియట్లే.

ఆ. తిరిపెగాఁడయినను దిరిపె మెత్తినయట్టి
తిరిపెమందె తాను దిరిపె మిడిన
తిరిపెము తిరిపెమున దిగఁబడిపోవురా, వి...

కొందఱు అనాలోచితముగా తాము సంపాదించిన ధనమును వెచ్చించుదురు. అట్టిసమయమున ఇదితగదని చెప్పిన నాకింతకంటెను దరిద్రము రాఁ బోవదనును. కాని అట్లనుట మాత్రము సరిగాదు. ఎందువలన ననఁగా: చూడుఁడు. తిరిపెమెత్తుకొనువాఁడైనను గాని, తనకు వచ్చునది కొద్దియైనను, ఆకొద్ది తాను తిరిపెము వేయుట మొదలుపెట్టిన క్రమముగా తఱిగి పోవునా? పోవదా? అట్లే ధనముకూడ.

ఆ. తీపికెల్లఁ దీపి తెలియఁగఁ బ్రాణంబు
ప్రాణవితతికన్నఁ బసిఁడి తీపి
పసిఁడికంటె మిగులఁ బడఁతిమాటలు తీపి, వి...

ప్రపంచములోని పదార్థము లన్నిటిలోనికిని మిక్కిలిప్రియమైన వస్తువు ప్రాణము. ప్రాణముకంటె తీపిగలపదార్థము సామాన్యముగా లేదుగదా! ఆప్రాణముకంటె కూడ బంగారము మిక్కిలితీపి (అనఁగా: ప్రాణాపాయమువచ్చినను బంగారమును వదలనని పట్టుఁబట్టి యుందురు.) ఇట్లు క్రమక్రమముగా వచ్చి చిట్టచివరకు బంగార మన్నిటికంటె ప్రీతియైన వస్తువయ్యెను. ఆపసిఁడికంటె తీపి లేదా యనియందురేమో? కాని దానికంటె దీపిగలది వలపులాడిమాట.

ఆ. తెలుపఁబడినవాఁడు దేవతాభక్తుండు
మాటలేనివాఁడు పోటుబంటు
కాసులేనివాఁడు కడుబ్రహ్మచారియౌ, వి...362

లోకములోని జనులొక్కొక్క విషయముచేఁ బ్రసిద్ధిని పొందుచుందురు. వివిధములయిన యోగ్యతలు లేకున్నను చెప్పినట్టులు విని నడచుకొనినఁ జూచి "వీఁడమాయికుఁడు. వీఁడు దైవభక్తుఁ"డనుచుందురు. ఇఁక తన్నేమాట యన్నను సహించి యూరక యున్నవానిని "పోటుబంటు" అనిపరిహాసము సేతురు. ఇట్టులే ఇతరగుణము లెన్నియున్నను వివాహితుఁడై యున్నను ధనము లేకపోయిన యెడల నట్టివాఁడు బ్రహ్మచారియగును. కావున ధనము నార్జింపుము.



ఆ. తోఁటకూరకైన దొగ్గలికైనను
తవిటికుడుముకైనఁ దవిటికైన
గావ్యములను జెప్పు ఘనులెల్ల ధనపరుల్, వి...

వంచకులగు మానవులు అన్ని తెగలవారిలో నున్నటుల కవులలోఁ గూడఁ జాలమంది గలరు. ద్రవ్యాశతోఁ గొందఱు కవులు తమగౌరవమునకుఁ దగినఫలమును బడయనెంచరు. కూరలలోనెల్లఁ బనికిమాలినవగు తోఁటకూరకు, దొగ్గలికూరకు, తవిటి రొట్టెకు, తవిటికి గూడఁ గావ్యములంకిత మితరులకు నిచ్చుచున్నారు. ఇట్టివారు బయటికి నిష్కాములవలెనుందురు గాని ద్రవ్యాశాపరాయణులన్న వీరే! వీరినిధనవంతులు కనిపెట్టి బ్రతుకనగును.

ఆ. దశగలారి నెల్ల తమబంధువు లటంద్రు
దశయు లేమి నెంత్రు తక్కువగను
దశయనంగను ధనదశ యొప్పు నొక్కటే, వి...

తనకు ఇతరునియాచింప నవసరములేక యదృష్టముండిమాటయుఁ బూటయును చెల్లుచుండినయెడల వారిని దశగలవారని తలఁచి వంచకులై తమబంధువులని వీరిని జెప్పుదురు. ఎవనికి దశ సరిలేదో? వానిని తమకంటె నీచునిగా తలంచుచుందురు. ఇటు ధనమును ప్రేమించియెల్లవారును చేయుచున్నారు. కావున దశయనఁగా నొక్కధనదశయే దశయని చెప్పఁదగినది. అయ్యది యే యుత్తమదశ.

ఆ. దశయనంగ మెండు ధనముంటయే యండ్రు
కూడు నిద్రలేక కుందుటె కద
రాగ నుండఁబోవ బాగుగా నేడ్పించు, వి...

కొందఱద్దానిని సమ్మతింపరు. అనఁగా: ధనము గల్గుటయే దశయనుట నిష్ప్రయోజనము అని వీరిఅభిప్రాయము. ఇట్టివారీ ధనదశయందలి లోపముల నిట్లనిచెప్పెదరు. "మూర్ఖులై ధనము ధనము, ధనమే దశయని చెప్పుదురు. ఆహా! ఏమిదశ? రాత్రిం బవళ్లు కూడు నిద్దురలేకపిశాచములాగునఁ గూర్చుండవలయును. ఈధనము రాకడయందును కష్టమే పోవుటయందును కష్టమే.

ఆ. దానములను జేయ ధర చేతులాడక
బహుధనంబుఁ గూర్చి పాతిపెట్టి
తుదను దండుగనిడి మొదలు చెడునరుఁడు, వి...

అత్యంతము కష్టములననుభవించి ధనముల సంపాదించెదరు. అట్లు సంపాదించిన ధనమునకు దానమో భోగమో యేదో యొక వ్యవస్థను చేయవచ్చునుగదా! అట్లుచేయరు. ఊరక సంపాదించి సంపాదించి పూడ్చియుంచెదరు. చివరకు దీనినేమి చేసెదరనఁగా—ఇట్లుచేసిచేసికట్టకడపట మొదలుచెడి నశించి పోవుదురు. కావున బుద్ధిమంతుఁడు ధనము నార్జింపలయును. ఆర్జించినదానిని వ్యయముకూడ చేయవలయును.

ఆ. దినము మూఁడుమార్లు తిని నిదురించుచు
సొగసుచనులవారి సొంపుతోడఁ
జేరుచుండి ధనముఁ జెడుపరు మెప్పుడు, వి...



కొందఱు మంచిసెబ్బరలను గుర్తింపక మూఁడు మార్లు తిని మొద్దురామన్నలై స్త్రీలవ్యామోహమునఁ బడిపోయి నీచకార్యములనుచేయుచు తగనివారలతోఁజేరి ధనమును బాడుసేయుచుందురు. నీవు యశస్సును గోరితివేని బుద్ధిమంతుఁడవేని ఎప్పటికిని ఆరీతిగా చేయక జాగ్రత్తగా ధనమును కాపాడుకొనవలయు.

తే. దేశదేశమ్ముఁ దిరుగుట తిండికొఱకె
పూని వేషమువేయుట పొట్టకొఱకె
మనసునందున గుఱిఁగాంచి మమతవిడరు, వి...

ఇతరుల కుపదేశించువారలేకాని తాము చేయలేరు. తాము చేయుపనులలో కొన్నియైనను సత్యము లున్నవేమొ? యని చూచ మనియనుకొన్న నొక్కటియుఁ గానరాదు. చూడుఁడు. ధనాశను వదిలి వేయుఁ మనిమనకంటటికిని బోధించుచు నీమనీషు లిట్లుదేశదేశములు తిరుగుట యెందుకొఱకనఁగా తిండికొఱకే. వేషములు వేయుట పొట్టకొఱకే. కాదందురా? అట్లైన ఈ మాటలను మనస్సులోనే గుఱిచేసికొని ఆమమత్వమును వదలి వేయవచ్చునుగదా! అట్లుచేసిరా? లేదు.

ఆ. దేశవేషములను తేటసేయఁగ దేవుఁ
డాత్మలోన నుండు నణఁగిపెనఁగి
వేసమరసి చూడ గ్రాసంబుకొఱకయా, వి.369

తాము ప్రతిదేశమును తిరుగుట భక్తులను తరింపఁజేయు

టకును, భగవంతుని సేవించుటకును నని చెప్పుచుందురు కాని ఈవేషములు దేవుని తెల్పఁజాలవు. దేవుఁ డాత్మలోనే యుండును కాని బయట బడఁడు. కావున నీరుచేయుపనులను, వేయువేషములను చక్కఁగాఁ బరికించితిమేని గ్రాసముకొఱకే యని తెలిసికొనవలయు.

ఆ. దోసకారియైన దూసరివాఁడైన
బగతుఁడైన వేదబాహ్యుఁడైన
ధనికు నెల్లవారు తనియింపుచుందురు, వి...370

ధనము గలవానిదగ్గఱకు నెట్టివారును చేరుచుందురు. ఇట్టి ధనికుఁడు దోషకాఁడైనను సరియే. దుష్టుఁడైననుసరియే. శత్రువుఁడైనను సరియే. మిత్రుఁడైనను సరియే. చివరకు వేదబాహ్యుఁడగు నపవిత్రచండాలుఁడైనను సరియే! వానిని దగ్గఱకుతీసి తృప్తిని పొందింపవలయు ననియే లోకమెల్లను కోరుచుండును. ఆహా! ధనప్రభావము వర్ణింప నలవికానిది కదా! కావున వ్యర్థుఁడవు గాక ధనము నార్జింప యత్నింపుము.

ఆ. ద్రోహబుద్ధినైన దొంగఱికమునైన
సటలనైన సాహసములనైన
సంపదధికువలన సాధింపఁ దగుటొప్పు, వి...371

లోకములో నరుఁడు బాగునొంది బ్రదుకవలయు నని కోరునెడల నట్టివాఁడెన్నికష్టములనైన నోర్చికొని ధనమునార్జింప యత్నింపవలయును. అట్టివాఁడు ద్రోహము మున్నగుదోషములను విచారింప కూడదు. వాఁడు పట్టుఁబట్టి తన యజమా



నినిగాని తనపై మంచివిశ్వాసమున్నవానినిగాని ద్రోహముచేసి యైనను ధనముఁ జేర్పవలయును. దొంగతనముచేతను గాని ఆయాసపడికాని తెగువగలపనులచేసియైనను తనకంటె నధికు నుండి సంపద నార్జించుట యొప్పును.

ఆ. ధనము లేకయున్న ధైర్యంబు చిక్కదు
ధైర్య మొదవదేని ధన మొదవదు
ధనము ధైర్య మరయఁ దగుభూమి నరులకు, వి.

ధనములేకపోయిన జరుగనిదేమియని కొందఱనఁ జూతురు. అట్టివారు ఈప్రత్యుత్తరమును వినవలయును. ఎట్లనఁగా:— ధనములేకయున్న ధైర్యమురాదు. పోనీ యనినచో ధైర్యములేకపోయినందుచేత ధనము చిక్కదు. కావున జనులందఱికిని ధనము ధైర్యము అనురెండుపదార్థములను గూర్పవలసి యుండును. అట్లు కూర్పనివాఁడు ఎందుకును కొఱగాని మొఱకు అయిపోవును కావున ధన మావశ్యకము.

ఆ. ధనములేమి గుణము తక్కువపడవచ్చు
ధనములేమి కీర్తి తలఁగిపోవు
ధనములేమి శుచిని తగఁ బుట్టనీయదు, వి...373

ధనము లేకపోవుటచేత కేవలమంతమాత్రమే లోపముగాక యింకను ఎన్నియో పెక్కులు లోపము లుండఁగలవు. ఏమియని యందురా? చూడుఁడు. ధనములేకపోయిన గుణముశోభిల్లక తక్కువయగును. ధనము లేకుండుటచేత నొక్కొక్కప్పుడు కీర్తి తొలఁగి పోవును. ధనము లేకపోవుటచేత నింకనొకప్పుడు

పరిశుభ్రత కలుగదు. కావున నన్నివిధములను ధన మావశ్యకము. ధనము నార్జింపుము.

ఆ. ధనము లేనివేళ తండ్రిగర్భంబున
భాగ్యపురుషుఁ డొకఁడు పరఁగఁబుట్టి
బహుళధనముఁగూర్చుభద్రంబులొనఁగూర్చు,వి.

తల్లిదండ్రు లెంతటి పుణ్యమునో పూర్వజన్మమునందు చేసి యుండినఁగాని యిట్టిపుత్త్రుఁడు పుట్టఁడు.ఎట్టివాఁడనఁగా:— ఎవ్వఁడు ధనమన్న పొలుసుపనే యెఱుఁగని యొకానొక బీద యగు తండ్రిగర్భమున జన్మించి లోకులందఱు భాగ్యపురుషుఁడని ప్రస్తుతులు సేయఁగా నపరిమితమగు ధనము నార్జించునో,అనేకములను శుభముల జతఁగూర్చునో! ఇట్టిపుత్త్రుఁడుకావున ధనికుఁడగుట తల్లిదండ్రుల యదృష్టముగూడ నైయున్నది.

ఆ. ధనము లేమి యనుట దావానలంబగు
తన్నుఁ జెఱుచు మీఱె దాపుఁ జెఱుచు
ధనము లేమి మదిని తలఁపఁగా పాపంబు, వి...?

డబ్బు (అనఁగా: సంపద) లేక పోవుట యనునది కొంచెమెచ్చుతగ్గు కార్చిచ్చుతో సమానమైయున్నది. కార్చిచ్చునకు దీనికిని చాలభేదముగలదు. అది సమీపించిన వారిని చెఱచి వేయును. ఇయ్యదియో (అనఁగా: ధనము లేక యుండుట) దాపరించిన వానిని తలఁచిన వానిని వాఁడు వీఁడని లేక కాల్ప మొదలుపెట్టును. కావున దారిద్ర్యము మహాపాతకము. బుద్ధిమంతుఁడవైకృతార్థుఁడవగుటకుయత్నింపుము.ధనమునార్జింపుము



ఆ. ధనము లేమి సుతులు తప్పుల నిడుదురు
ధనము లేమి పత్నిఁ దాఁకరాదు
ధనము లే మెవనికి తాళిక నీయదు, వి... 376

ధనము లేకపోవుటవలన నొకటి రెండుకష్టములు మాత్రమే కావు. ఆకష్టముల నిల్చి యిన్నియన్ని యని లెక్కసేయుటకు వీలుకలుగదు.ఎంచికొనుఁడు.ధనము లేకున్నందుచేత తానుకన్న బిడ్డలైనను తప్పులను పైని కట్టఁజూతురు. ధనహీనుని తాను పెండ్లియాడిన భార్య కూడ తాఁకుట కొప్పికొనదు. ఇంతయేల? యెంతటి విరాగికైనను ధనము పోయిన నోర్చుకొని తెప్పరిల్లుట కష్టము గావున ధనమును జాగ్రత్తగాఁ గాపాడుము.

క. ధనమే మూలము జగముకు
ధనమే మూలంబు సకలధర్మంబులకున్
గుణములు మూలము సిరులకు
ధనమే మూలంబు ముక్తిమహిమకు వేమా!

ప్రపంచములో ధనమును బోలిన ప్రధాన పదార్థము మఱియొక్కటి లేదు. ఇది సత్యము. ఎట్లనియందురా? ఈలోకములోని వస్తువు కావలయు ననినను ధనము కావలయును. కావున ధనమే జగములకు మూలము. ఈధనమే సకలము లగుధర్మములకును మూలము. ఇయ్యదియే యన్ని గుణములకును అన్నివిధములగు నైశ్వర్యములకు నాటపట్టు. ముక్తికి మన మెట్టునివాసస్థానమో, గుణములకు ధన మట్టులు గాన ధనము నార్జింపుము.

ఆ. నక్కవినయములను నయగారములఁ బల్కి

కడకు ధనముఁ గూర్పఁ గడఁగుచుండ్రు
కుక్కబోనువాతఁ గూడు చల్లినరీతి, వి... 378

ఎంతటివారైనను గానీయుము. శిష్టులైనను సరియే. కష్టులైనను సరియే. భ్రష్టులైనను సరియే. ఎంతటి గొప్పవారైనను లోభులు నక్కవినయములను చూపెదరు. నయగారపు పలుకులను పల్కెదరు. తా మనుభవింపక ధనముఁ గూర్చుటకు తంటాలు పడుచుందురు. చూడఁగా నీరీతి యెట్లున్నదనఁగా: కుక్కబోనులోఁ గూడు చల్లినట్లున్నది. అనఁగా: కుక్క కన్నము పెట్టకూడదని పల్కి బోనులోకే తీసికొని పోయి చల్లినట్టులున్నది.

ఆ. నారాయ ణనవచ్చు నమశివ యనవచ్చు
మేలువారిఁజూచి మెచ్చవచ్చు
కొంగుకాసు విడిచి గొబ్బున నీరాదు, వి...

ఇతరములగు కష్టముల నెన్నిటినైనను పొందవచ్చును గాని కష్టపడి సంపాదించిన సొమ్ము నీయఁగలుగుట చాలకష్టము. యోగులకేమి? దానముచేయుమని చెప్పవచ్చును. కన్నులు మూసికొని నారాయణ అనిగాని శివ యనిగాని యనవచ్చును. తనకంటె నధికులఁ గొనియాడవచ్చును కాని ఎంతటిమమత్వహీనునకైనను కొంగునందలి కాసును విప్పి త్వరగా నిచ్చివేయుటకు చేతులాడవు.

ఆ. పరగ లేమిచేత బంధువు లృగవారు
పరగ లేమిచేతఁ బరము తప్పు



పరగ లేమిచేతఁ బరపతియును దప్పు, వి...380

కొందఱు ధన ముండుటకంటె లేక యుండుటయే యుక్తమమని తలంచుచుండెదరు. విచారించిన అంతటి (అనఁగా: దారిద్ర్యముతో సమానమైన) నైచ్యము వేఱులేదు. ఎట్లనియందురా? సంపదలు లేకయున్న చుట్టములు ఎవ్వరును ఇంటికిఁ జేరరారు. అందఱును శత్రువు లగుదురు. ధనము లేమివలన పుణ్యకార్యములను చేయలేరు. అందువలన పరలోకసుఖము లుండవు. దరిద్రునకు చివరకు అప్పుకూడ పుట్టదు. కావున ధనికుఁడగుటకు యత్నము సేయుము.

ఆ. పాగ పచ్చడంబు పైకిఁ గూసంబును
పోగు లుంగరములు బొజ్జకడుపుఁ
గలిగినట్టివానిఁ గందురు చుట్టాలు, వి... 381

దరిద్రుని బంధువు లయినను చేరనీయరు. పిలువరు. తలఁపరు. పాగ దుప్పటి పైని వల్లెవాటు పోగులు ఉంగరములు బొజ్జ పొట్ట కడుపు మొదలగునవి చక్కగా నున్నవానినే చుట్టములు చూచెదరు! కాని యితరులను చూడరు. నలువురిలోని గొప్పవాఁ డనిపించుకొనవలయునని కోరుచుండెదవేని తప్పక ధనమును సంపాదింప మొదలుపెట్టుము. ధనముచే నందఱును వశులగుదురు.

ఆ. పాపపుణ్యములను పసిగా వెఱుంగునా
ధరను బరమయోగి యెఱుఁగుఁగాక
పసిఁడిపొందిక గని బాగుగాఁ గూర్పుము,వి...

పసులగాపరికి పాపము గాని పుణ్యము గాని తెలియునా? తెలియనే తెలియదు. ఇఁక నట్టిపాపపుణ్యముల నుత్తముఁడగు యోగి కనుఁగొనవలయునే కాని యితరులకు వలనుగాదు. ఇట్టులే ఆర్జించువాఁడ వగునీవు బంగరునందలి పొందికలు తెలియఁగలవుగాని యితరులకు తెలియవు. కావున పొందికను కనిపెట్టి బంగారమును వలయునంత కూర్చిపెట్టుకొనుమనుము.

ఆ. పాలసాగరమునఁ బవ్వళించినహరి
గొల్లపల్లెపాలు గోరనేల
నెదుటివారిద్రవ్య మెల్లవారికిఁ దీపి, వి... 383

జగముల నేలుసామికిఁ గూడ పరధనమన్న తగులాటకము కలుగును. ఎట్లనియందురా? చూడుఁడు. శ్రీమహావిష్ణువు పాల సముద్రములోఁ బరుండును గదా! అట్టివాని కేమి దరిద్రపు తనము వచ్చెనని రేపల్లెలోని గొల్లవారింటిలోని పాలను కోర వలయును? దీనిని బట్టిచూచిన ఏమితోఁచుచున్నదనినచో— వినుఁడు. ఎదుటివారిధన మెల్లవారికిని దీపిగానుండునని తెలియును. కావున జాగ్రత్తతో ధనమును రక్షింపుము.

ఆ. పుత్త్రడిగలవాని పుండుబాధయుఁ గూడ
వసుధలోనఁ జాలవార్తకెక్కు
పేదవానియింట పెండ్లైన నెఱుఁగరు, వి... 384

ప్రపంచములోని సమస్తసంగతులును ధనికుని ప్రసంగములతో నిండియుండుచున్నవి. చివరకు ధనికుఁడగువానికిఁ గలి



గిన యల్పప్రకార్యముగూడ ప్రతివారిచే మంత్రమువలె తలఁచుకొనఁబడుచుండును. ఆహా! ఈమహిమము ధనమునం దున్నది. ఎటులనెదరా? బంగారము గలవానికి పుండు పుట్టినను బాధ కలిగినను వెంటనే ప్రసిద్ధిఁజెందును. ఇఁక దరిద్రుని యింటిలో పెండ్లైన నెవ్వరికిని తెలియదు. కావున ధనార్జనమత్యావశ్యకము.

ఆ. పూర్వజన్మమందు పుణ్యంబుసేయని
పాపి తా ధనంబుఁ బడయలేఁడు
విత్తమఱచి కోయ వెదకినచందంబు, వి. 385

పూర్వజన్మమునందు పుణ్యమును చేయనివాఁడు పాపాత్ముఁ డగును. ఆపాపాత్ముఁడైనవాఁడు ధనములను పొందనేరఁడు. పొందచాలఁడు అని దృఢముగా చెప్పఁగలము. ఎట్లనియందురా? చూడుఁడు. విత్తనములను చల్లవలసినకాలములో పొలమును దున్ని విత్తక కాపువాఁడు కోఁతకాలమునందు కొడవలిని చేతఁబూని కోయుటకు వెదకిన పైరు కనుపించునా? కనుపింపదు గదా?

ఆ. పూసపోగుఁ బసిడిపుట్టంబు విద్యయుఁ
గాయపుష్టి చాలగలిగెనేని
కానికులజునైన ఘనుఁడని రమ్మంద్రు, వి. 386

ధనము కలుగువాని యదృష్టము నేమని వర్ణింపవచ్చును? వాఁడెంతనీచజాతిలోఁ బుట్టినను ధనవంతుఁడై అందఱికిని తెలియునట్లు పూసలు పోగులు జరీబట్టలు ఒడ్డు పొడవు చాలినంత

కలిగియుండెనా అట్టివాని కెదురేఁగి తీసికొని వచ్చి సింహాసనమునఁ గూర్చుండఁ బెట్టి ఘనుఁడ వని నుతించి పూజించెదరు. కావున తప్పక ధనమును ఆర్జించుటకు యత్నింపుము.

ఆ. పేదవానిబాధ పెనుభూత మైయుండు
జూడలేదు బాధఁ జూడ వశమె
కలుగువానిబాధ కనులఁ జూడఁగలేమి
కేమిచేయవచ్చు నింక వేమ! 387

పేదవాఁడును భాగ్యశాలియును కష్టముల నొందుట తుల్యమే యైనను లోకులకు వాని గణించిన యనుభవమును బట్టి చూచిన నెంతో తారతమ్యము బయలుపడును. చూడుఁడు. పేదవానికి వచ్చినబాధ పెద్దదయ్యమువలె గన్పించును. అనఁగా: జనులు విచారింప రనియనుట. ఇఁక గలిగినవానికి వచ్చెనా? ఆహాహా! ఏమిచెప్పను ఆచిత్రము! వానిబాధ కనులఁ జూడఁగాలేమని పలుకుచుందురు.

ఆ. ప్రాప్తిగల్గుచోట ఫల మిచ్చుదైవంబు
ప్రాప్తిలేనిచోట ఫలము లేదు
ప్రాప్తిలేక పసిఁడి పరమాత్ముఁ డిచ్చునా? వి...

ఇంతకును మనుష్యుఁ డెంతగా నెత్తిని బ్రద్దలు గొట్టుకొనినయప్పటికిని యెక్కడ ప్రాప్తియో యక్కడనే ధనము లభించునేగాని ప్రాప్తిలేనిచోట ఫలము కలుగనే కలుగదు. ఇట్టులు అగుట నిజమే. ఏలయనియెదరా? పరికించి చెప్పెదను?



ప్రాప్తిలేనివానికి పరమాత్ముఁడు పసిఁడి. అనఁగా: భాగ్యమును నిచ్చుచుండెనా? లేదుగదా! అట్టులే. ధనము కూడను.

ఆ. మగని కలిమిబలిమి మగువకును బలంబు
కలిమి లేనిమగఁడు కానుగాఁడు
పనికిరానిమగని పాటించి చూడరు, వి... 389

ఇంటియజమాని (అనఁగా : గృహాధికారి)కి సంపద యున్నచో గృహిణికిని ఆయ్యది బలమునిచ్చుచుండును. గడన సేయలేక ఒకకాసుగూడ దగ్గఱలేనివాఁడు ఒకగవ్వయైన ఖరీదుచేయఁడు. ఇట్లు పనికిరానిపంద యగుమగనిని సతులు కన్నులనైనను చూడ నొల్లరు. కావున మానవుఁడు ధనము నార్జించి తీఱవలయును.

ఆ. లేమిగల్గువాఁడికేమేమి చేసిన
కలిసిరాదు ఫలము కాసుగూడ
కలిమి గల్గుచోటఁ దులదూఁగుచుండెను, వి...

ధనికునకును దరిద్రునకును సాధారణముగా భేదమున్నట్టులే వారువారు చేయు కార్యఫలములలోగూడ చాల వ్యత్యాసము కలదు. ఎట్లనియందురా? చూడుఁడు. దరిద్రుఁ డేమేమిపనులను చేసినను కలసిరాదు. అందొకకాసుగూడ దొరకదు. ఇఁక కలిమిగల్గుచోటనో ఎవ్వరిప్రయత్నములు లేకయే సంపదలు తులఁదూగుచుండును. కావున ధనాఢ్యుఁడవై సౌఖ్యముల ననుభవించి పేరొంది కీర్తినొందుటకు యత్నింపుము.

## దుర్జనపద్ధతి.

అవతారిక:—సాధారణముగా జనులు రెండు తెఱఁగులుగా నుందురు. ఆరెండు తెఱఁగులును సజ్జనులు దుర్జనులు నని. మంచిపనులను చేయువారు సజ్జనులు. చెడ్డపనులను చేయువారు దుర్జనులు. లోకమునందుండు ప్రజలకందఱికి మేలును కలిగించి పుణ్యమును కూర్చునది సత్కార్యము. దీనికి విపరీతముగా దుష్కార్యము. ఇట్టి దుష్కార్యములను చేయువారే దుర్జనులు. దుర్జను లనఁగా నెట్టివారో? వారివలన ప్రపంచమున కలుగు కీడెయ్యదియో? వారియెడల నితరులెట్లు నడచుకొనవలయునో, వారితరులయెడల నెట్టులు నడచెదరో, దానివలనఁ గలుగుమంచిచెడ్డలేవియో మొదలగువానిని ఈ పద్ధతియందు చెప్పఁబోవుచున్నాఁడు.—

ఆ. అగ్ని చేతఁ బట్టి యాపరమేశుని
నిందచేసి నరులు నీఱుకారె
దక్షుక్రతువులోని తల్లడ మెఱుఁగరా? విశ్వ...

దుర్జనులు పనిలేకయే పరులను నిందింపఁబూనుకొని యుందురే కాని యరదువలనఁ దమకుఁ గలుగు నాపదను తెలిసికొనఁజాలరు. సత్పురుషులకు లోకోపకారము చేయుట యెట్లు స్వభావమో అట్లే దుర్జనులకు పరాపకారము చేయుట సహజము. కావున నిట్టివారు నశింపుటయును నిక్కము. ఎట్లందురా! చూడుఁడు. నిప్పును చేతితో తాకిన కాలి బూడిదెయగునట్లు



లు పరమేశ్వరుని నిందించిన నశించిపోదురు. ఇట్లగుట కుదాహరణముగా దక్షునియజ్ఞములోని యల్లరిని తీసికొనుఁడు.

ఆ. అంటు ముట్టు నెంచి యదలించి పడవైచి
దూరమందుఁ జేరి దూఱుచుండ్రు
పుట్టి చచ్చు ఖలులు పూర్ణంబు తెలియరు, వి. 392

దుర్జనులు మంచిచెడ్డలను మాన్యతామాన్యతలను లెక్కసేయరు. లేనిపోనియాచారములను పైని వైచికొని అంటని ముట్టని అదలించి దూరముగాఁ బడఁ ద్రోలెదరు కాని అంటననేమొ ముట్టననేమొ తెలియఁజాలరు. తామిట్లు అజ్ఞులయ్యును లోకులపైని మాత్రము నిష్కారణముగా ద్రోహశకటమును త్రోలుచు పుట్టుచు చచ్చుచుందురే కాని దుర్జనులు నిజముఁ బరికించి గుణవంతులు కారు.

ఆ. అంతరంగమందు నపరాధములు సేసి
మంచివానివలెనె మనుజుఁ డుండు
ఇతరు లెఱుఁగకున్న నీశ్వరుఁ డెఱుఁగఁడా? వి.

దుష్టుఁడు చేయునపరాధములకుమితిలేదు. కాని యొక్కొక్కప్పుడిట్టివారు లోలోననే యపకారములను ఆచరించి పైకి తామేమియు నెఱుఁగనివారివలె నడచుకొనుచు శిష్టులవలెనే మెలఁగుచున్నట్టులు నటించుచుందురు. ఇట్టిదుర్జనుఁడు చేసిన తప్పులను లోకు లొకవేళ తెలిసికొనలేకపోయినను సర్వాంతర్యామి యగు దేవుఁడు గ్రహింపకయుండునా? కావున దుర్జనత్వము మానునది.

ఆ. అంతరాత్మఁ గనక యల్పబుద్ధులతోడ
మెలఁగెడుద్విజులెల్ల మేదినందు
యమునినరకములకు నరుగంగ సాక్ష్యము, వి...

లోకమునందు హీనజాతులగు మానవు లటుండ నగ్రవర్ణులగు బ్రాహ్మణులే తోఁచినటులఁ బరుల కపకారములు గావించి దేశద్రోహు లగుచున్నారు. సకలవిద్యావిదులగు నీబ్రాహ్మణులు నీచులతో సహవాసము చేయుచు నంతరాత్మ (హృదయము) బోధించు సత్యాంశములను గ్రహింపక తుదకు యమలోకమున నరకయాతన లనుభవించుచున్నారు. వీరు చేయునది నీచకార్యమనుటకు వీరు నరకమున కేగుటయే సాక్ష్యము.

ఆ. అధికుఁ డైనరా జొకల్పునిచేఁ బట్టి
వానిమాటచెల్లు వసుధలోన
గణకులొప్పియున్న గవ్వలుచెల్లవా? వి... 395

దుష్టుఁడు గొప్పగొప్ప హోదాల నొందుటయును, గొప్పవారి యాశ్రయము నొందుటయును లోకములను బాధించుటయగును. ఎట్లనఁగాఁ జూడుఁడు. గొప్పవాఁడైనరాజు ఎవనినైన నొకని నీచుని తనకు ముఖ్యుఁ డగునుద్యోగినిగాఁ జేసికొన్నచో నట్టికొండెగాఁడగు నుద్యోగుఁ డాడినది యాటయును పాడినది పాటయునగుచుండును. స్వయముగాఁ గడ్డిపోఁచయైనను చేయలేని గవ్వలు ప్రభువు లాదరించి ధనమునకు బదులు గవ్వలు మారకముచేయవచ్చు నని చెప్పిన చెల్లుటలేదా? అట్లులే నీచుఁడుకూడ.



ఆ. అల్పబుద్ధివాని కధికార మిచ్చిన
దొడ్డవారినెల్లఁ దొలఁగఁగొట్టు
చెప్పుఁ దినెడుకుక్క చెఱకుతీపెఱుఁగునా? వి...

దుర్జను లగువారు ఏయాధారములు లేకయున్నను ప్రజలకు నిష్కారణముగా ద్రోహములను చేయుచుందురు. అటుపైని యిట్టి అల్పబుద్ధులకు రాజాశ్రయము కలిగించి యధికారము నిచ్చినయెడల వీండ్రు ముందుగా పెద్దలగువారి నందఱిని బాఱఁదోలుటకు ప్రయత్నింతురు. నీచులు నీచులను జేరదీసి వారికి మేలు చేయఁగలరుగాని మహాత్ములఁ జేరఁదీయలేరు. వారిగుణము గ్రహింపలేరు. దృష్టాంతమునకుఁ గుక్కను దీసికొందము. కుక్క తనవలె నీచపదార్థమగు చెప్పునుతిని యానందించుఁగాని చెఱకునందుఁ గలమాధుర్యము గ్రహింపలేదు కాన నొకనీచుఁ డధికారి యైనచోఁ బరిజనమంతయు నీచులగుదురు.

ఆ. అల్పుఁ డెపుడుఁ బల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను
కంచు మ్రోఁగునట్లు కనకంబు మ్రోఁగునా? వి...

దుష్టుఁ డెప్పుడును తాను కేవలము పరమేశ్వరుని యవతారమైనట్లు భావించికొని చాల ఆడంబరముగా పలుకుట కారంభించును. ఇఁకను సజ్జనుఁ డితరులమనసు నొవ్వనిరీతి చల్లగా పల్కును. సజ్జనునికిని దుర్జనునికిని ఇంతటి భేదము సహజముగానే యుండును. ఎట్లనియందురా! గమనించుఁడు.

కంచు మ్రోఁగినట్లుగా ఘన మగుబంగారము మ్రోఁగునా? మ్రోఁగదుగదా! అట్లే దుష్టుఁడు.

ఆ. ఆదికారణముల నల్పుఁ డెట్టు లెఱుంగు
చెప్పలేఁడు గాని తప్పుఁ బట్టు
త్రోయనేర్చుకుక్క దొంతులు చేర్చునా? వి....

దుర్జనుఁడు యోగ్యులు చేయుసత్కార్యములను చూచి ఇవి యప్రమాణములని యాక్షేపించ మొదలుపెట్టును కాని సత్కార్యముల కన్నిటికిని కొన్ని కారణములుండనే యుండును. ఆకారణములను నీచుఁ డెట్లు తెలిసికొనఁగలుగును? ఎవ్వఁడైన ను "పోనీ నీవు చెప్పుము చూత" మనిన తాను చెప్పలేఁడు గాని యితరులను తప్పులు బట్ట నేర్వఁగలఁడు. నిజమే యిది! దొంతులు దొర్లించుదొంగకుక్క మరల వానిని సరిగా చేర్పఁ గలదా? లేదు. అట్టులే దుష్టుఁడు కూడ.

ఆ. ఆల మెఱుఁగు యోధుఁ డల్పునిఁ జేరిన
మార్పుచేత బుద్ధి మఱిగి తిరుగు
మ్రానుమ్రాను దిరుగు మహిఁ గోఁతికైవడి, వి...

చక్కఁగా యుద్ధముఁ జేయనేర్చిన సత్పురుషుఁ డగు యుద్ధభటుఁడు అల్పునిదగ్గఱ కొలువునకు జేరెనేని వానిబోధల చేత నిజమగు శూరలక్షణములను కొంతకాలమునకు మఱచి స్వార్థపరుఁడై వంచకుఁడై తిరిగిపోవును. ఎట్లనఁగా చెట్టుచెట్టునకును తిరుగుచుండెడి కోఁతి ఏ ప్రకారముగా చెట్టెక్కినందు



లకు ఫలముఁగానక పరిభ్రమించునో, అట్టులనే అల్పునిచేరిన భటుఁడును భ్రష్టుఁడగును.

ఆ. ఇచ్చకంబులాడు నిందీవరాక్షులు
మచ్చరంబు మాని మాన్యుఁజేరి
తుచ్ఛగుణము విడక దూఱుచుసుందురు, వి.

ఐహికములను వదలఁజాలక విద్యావిదులగు మానవులు చెలువలతోఁ జెలిమిగావించి పురుషార్థమును బడయనెంతురుగాని యది ప్రమాదము. పురుషునివంచింప సృజింపఁబడినకామిని పురుషు నానందపఱుచుననుట కల్ల. నల్లకలువపూల వంటికనులుగల యీసుందరీమణులు ముఖప్రీతి మాటలాడుచుఁ బురుషుని జేరి యెట్టిమాత్సర్యము లేనటులఁ గలసి మెలసి మెలఁగుచుందురు. సమయము వచ్చినచోఁ బురుషులను నీచభావముతో దూషించుచునేయుందురు గాన నిట్టి స్త్రీజనమును జేరదీయుట దుర్జనత్వమే.

ఆ. ఇనుము విఱిగెనేని యిమ్మాఱు ముమ్మాఱు
కాఁచి యతుకనేర్చు కమ్మరీఁడు
మనసు విఱిగెనేని మఱి యంటనేర్చునా? వి.

దుర్జనులమాటలు సమ్మెటపోట్లకంటె నెక్కుడు బాధాకరములు. సమ్మెటపోటుచేత తుత్తునియలైనను ఇనుము మొదలగు వెళుసువస్తువులను రెండుమారులైనను కష్టపడి కాఁచి కమ్మరపనివాఁడు అతుకగలఁడు. కాని యీదుష్టులసూటిలమాటలవలన పేటెత్తినమనస్సును, ఎంతటిబుద్ధిమంతుఁ డగుపనివాఁడైనను

ఎంతగాకష్టించినను పూర్వమువలె యదుకఁజాలునా? అదుక లేఁడు. అనఁగా: దుర్జనులమాటలు నమ్మెటపోట్లకంటె బాధ గలిగించును.

ఆ. ఎంతసేవఁజేసి యేపాటుపడినను
రాచమూక నమ్మరాదు రన్న
పాముతోడిపొందు పదివేలకైనను, వి. 402

సాధారణముగా దుర్మార్గులకే ప్రతివిశ్వాసములుండవు. ఇఁకనందులోనికెల్ల నగ్రగణ్యులని పేరొందినరాజులను గూర్చి చెప్పవలయునా? సేవకుఁడైనవాఁడు ఎంతప్రయాసమునకోర్చి ఎంతయెక్కువగా సేవించుచున్నప్పటికిని రాజులు తనయందు ప్రీతిగలవారివలె నున్నప్పటికిని రాచమూకను మాత్రము నమ్మరాదు. ఎట్లనఁగా: నెంతగా చదువును కలిగియున్నను పామును నమ్మవచ్చునా? రాదుకదా. అట్టులే దుర్జనునిగూడ.

ఆ. ఎద్దుకన్న దున్న యేలాగు తక్కువ
వివర మెఱిఁగి చూడు వృత్తియందు
నేర్పులేనివాని నెఱియోధుఁ డందురా? వి. 403

గొప్పతనము కొంచెపాటితనము లోకులు బుద్ధివిశేషమును బట్టి నిర్ణయింతురుగాని బలాబలములను బట్టి యెప్పటికి నిశ్చయింపఁ జాలరు. బలము ప్రధాన్యమందుమేని యెద్దుకంటె నెనుబోతు బలముకలదిగదా! పనిపాటలలో నెద్దును మించినదేగదా! ప్రపంచములో నెల్లను దున్నను చులకనఁగాఁ జూచుటకు దానియజ్ఞానమేకదా కారణము. అటులే మానవుఁడు



సైతము దేహబలము నార్జించి జెట్టియైన లాభములేదు. నేర్పుండవలెను. లేకున్న ఉన్నశక్తిసామర్థ్యములన్నియు వ్యర్థములగును.

ఆ ఎఱుక మాలువాఁ డిఁకేమేమిచదివిన
చదివినంతసేపె సద్గుణియగుఁ
గదిసి తామరందు కప్ప కూర్చున్నట్లు, వి...

జ్ఞానహీనుఁ డెన్నినీతులను చదివినను ఎన్నిధర్మశాస్త్రములను జదివికొన్నను కొంచెమైనను ప్రయోజనము కనుపట్టదు. ఇట్టు తెలివి లేనివాఁడు ఎన్నిచదివినను చదివినంతసేపే సజ్జనుఁ డగును కాని అచ్చటనుండి లేచినవెంటనే దుర్మార్గముల సంచరింప మొదలుపెట్టును. ఎట్లనఁగా: చూడుఁడు. కప్ప తామరాకుపైనఁ గూరుచున్నంతసేపే గుణియగుఁ గాని అచ్చటినుండి దూఁకినవెంటనే.పురుగులఁ జంపుటకు బయలుదేరును.

తే. ఏమికానిది పరతత్త్వ మెఱుఁగలేక
సోమయాజులు పశువుల స్రుక్కడంత్రు
సామ మేర్పడఁ జదివినఁ జావవేల
బాధకము లగుదుర్గుణపంక్తి వేమ. 405

లోకములో నజ్ఞానులగు మానవులేగాదు సర్వశాస్త్రపారంగతులగువిద్వాంసులు సైతము జీవహింసయందు వెనుదీయుట లేదు. యోగాదిసాధనములచే వారు పరతత్త్వము పరమేశ్వరరూపము గ్రహింపలేక యజ్ఞములమూలముననైన మోక్షమార్జింతమని పశువులను హింసించి చంపుచున్నారు. ఈవిద్వాంసులు సామాది వేదములు శాస్త్రములు చదివినను హింసారూపమగు దుర్బుద్ధి

వీరిని వదలిపోనే పోవదుగదా! కాన మూర్ఖునకు విద్యవలన వివేకము వచ్చుననుట యసంభవము.

ఆ. ఒకరినోరుఁ గొట్టి యొకరు భక్షింతురు
వారినోరు మృత్యు వరుసఁ గొట్టు
చేపపిండుఁ బెద్దచేఁపలు చంపును
జనులు చేఁపపిండుఁ జంపు వేమ! 406

మనుష్యులు దుర్మార్గులై పాపము-పుణ్యము-దయ-దాక్షిణ్యము అని యైనను లేక ఇతరుల నోరుగొట్టి తమపొట్ట నింపికొనుటకు ప్రయత్నములు సేయుచుందురు గాని ఈదుర్మార్గులదౌష్ట్యమును పరికించుచు సమయము పడినప్పుడు వీరినోరుగొట్టి హరించుట కవతల మృత్యుదేవత యున్నది. దానివలన నందఱుదుర్మార్గులును పరిభవింపఁబడుదురు. ఎట్లనఁగా: చూడుఁడు. చిన్నచిన్న చేఁపలను బెద్దచేఁపలు పెద్దచేఁపలను మనుష్యులు భక్షించుటఁ జూచుటలేదా!

ఆ. ఒడ్డెవానికి గుఱుతోర్చి చెప్పినఁగాని
తెలియఁబడునె యాత్మ తెలివి లేక
చెడ్డకొడుకు తండ్రి చెప్పిన వినఁడుగా, వి... 407

బుద్ధిలేని మడ్డెజంతువునకు ఎంతకష్టముచేసి యెన్నియుక్తులను చెప్పి యెన్నెన్నిగుఱుతులను చెప్పినను తెలియనే తెలియదు. ఒకవేళ తెలిసినను వాఁడారీతిగా చేయనేచేయఁడు. ఇట్టివారలే ఖలులనఁగా నగుదురు. ఉదాహరణమునుచూడుఁడు. చెడ్డకొడుకు ఎన్నివిధములను చెప్పినను వాఁడుచేయుపనులు



మంచివికావని తెలిసికొనఁ జాలఁడు. తెలిసికొన్నను దుర్బుద్ధియై వినఁడు. అట్టులనే దుష్టుఁడు గూడ.

తే. ఓటు పరులకు గల్గించు నూహఁజెంది
కుచ్చితులతోడఁ బనిఁ బడఁగూడ దెప్డు
అప్పు డెట్లైన వారలయాప్తత దన
గౌరవంబును మాపును గాదె వేమ. 408

బుద్ధిమంతుఁడైన మనుష్యుఁడు తనకెవ్వరైన ద్రోహము చేసినచో వారలకు తాను ఓటమి గలిగింపవలె ననియెంచి దుర్మార్గులనుచేరి కుట్రలు చేయఁగూడదు. ఇట్లుచేసినయెడల నాదుష్టులమూలముగా-తనశత్రువులకు నష్టముకలుగుటకుమాఱుగా-తనకే వారిస్నేహముచేత గౌరవము లేకపోవుట, మైత్రి మొదలగునవి చెడిపోవుట కలుగును. కావున ఎప్పటికిని యుచితజ్ఞుఁడైననరుఁడు దుష్టులను జేరరాదు.

ఆ ఓపఁగల్గుదు నని యొక్కింత మిన్కిన
నున్నవానికూడ సున్నచుట్టి
మూలలంకు లాగి గేలిసేయుదు రయా! వి...

సజ్జనులు హృదయమునఁ గ్రోధముఁబెంచికొని పరులకెటులేని యపకారము చేయఁజింతింపరు. కొందఱు దుర్జనులుతమకు సమానులతో స్నేహముఁజేసి తమవిరోధుల వంచింపనెంచి యేదోకొంత మిడుకుచుందురు. దానివలనఁ గార్యసిద్ధి కాకపోఁగా దుర్జనసహవాసమువలనఁ బూర్వకీర్తిసైతము నశించును. అటుతరువాత ఎచ్చటనో మూలమూలలో దాగికొని

యున్నఱంకుతనము బయలు పెట్టి గేలిచేయఁబూనెదరు. కావున దుర్మార్గులఁ జేరఁజనదు.

ఆ. కండచక్కెరయును గలియఁ బాల్వోసిన
తఱిమి పాము తన్నుఁ దాఁకుఁగాదె
కపట మున్నవానిఁ గన్పట్టవలెనయా, వి... 410

దుష్టునకు ఎంతటియుపకారమును ఎట్టిదుస్తరమగు నాపత్సమయములో చేసినను కృతఘ్నతచే మఱచిపోవుచుండుట సహజమగుగుణము. ఎట్లనఁగా : పామును చూడుఁడు. కండచక్కెర పాలు కలియఁబోసి తీయఁగా పామునకుఁ బోసి పెంచిన నది కృతజ్ఞతను వహించుటకు బదులుగాఁ గృతఘ్నతను వహించి కఱవవచ్చును. కావున బుద్ధిమంతుఁడై కపటము గలవానిని కనిపెట్టి యట్టిదుష్టునకు దూరముగా తొలఁగి యుండవలయును.

క. కనియుండి కానలేరఁట
వినియుండియు వినఁగలేరు విస్మయ మహహా!
కను గ్రుడ్డియు విను చెవుడం
చనునది నిజమయ్యె జగమునందున వేమా! 411

దుర్జనులగుణగణములు స్వభావము లత్యాశ్చర్యకరములై యున్నవి. వీరును సామాన్యులగు మనుష్యులలో చేరినవారలే యైనను సజ్జనులకును వీరికిని చాల భేదముగలదు. ఎట్లనియెదరా? చూడుఁడు. కన్నులు కళ్లము వెడల్పునుండిన యప్పటికిని (గర్వముచేత) చూడఁజాలరఁట. వినుటకు చెవులున్నను (ఓర్వలేమి)



వినలేరఁట. ఆహా! ఎంతఆశ్చర్యము. ఇట్టివీరిస్వభావము చూడఁగా, కను గ్రుడ్డి వినుచెవిటి యనుసామెత సార్థకమైనట్లులు కనఁబడుచున్నది.

ఆ. కల్ల నిజముఁ జేసి కఠినభావముఁ జెంది
ప్రల్లదంబులాడు భక్తిలేక
మాయలాడు ఖలుఁడుమహితాత్మసాటియా, వి.

దుష్టునకును శిష్టునకును కొంద అజ్ఞానులు సామ్యమును చెప్పఁజూతురు, కాని దుష్టుదుష్టే! శిష్టుశిష్టే! ఎన్నటికిని ఎంత తలక్రిందుగాతపస్సుచేసినను దుష్టుఁడు శిష్టుని బోలఁడు. బుద్ధిమంతుఁడు ముందు వెనుకల నరయక "అసత్యమును సత్యమునుగాఁ జేసి దయ లేశమైనను లేక నోటికి వచ్చినట్లు మాట్లాడి భక్తిలేక మాయలు చేయు మాలవెధవ"యగుదుష్టునకును మహానుభావునికిని సాటిచేయఁ బూనెదరు. ఎంతఘోరము!

ఆ. కలియుగంబునందు ఘనతను నైచ్యంబు
ఘనత నైచ్యమునకుఁ గల్గుచుండు
శ్రద్ధ భక్తు లుడిగి జనులుండ్రుగావున, వి...413

ఆహా! ఏమి కాలముయొక్క వైపరీత్యము. కలియుగము ప్రభావముచేతఁగాఁబోలు గొప్పకు తక్కువయు తక్కువకు గొప్పతనమును తఱచుగా కలుగుచుండును. ఇట్లగుటకు కారణము నూరువిధముల పెద్దలయందును దైవమునందును శ్రద్ధాభక్తులు లేకపోవుటయే యనితలఁచెదము. ఎంతవైపరీత్యమిందు వలనఁ గలుగుచున్నదో చూడుఁడు. కావున దుష్టులైపోరాదు.

ఆ. కలువపూలవంటి కన్నులుండిన నేమి?
చిలుకపలుకులట్లు పలుక నేమి?
తెలివిబలిమికలిగి తేజరిల్లఁగ నేమి?
తులువగాని నలరు నెలఁత వేమ! 414

మంచితనము చెడుగుతనము ఆకారమును బట్టి నిర్ణయించుట దుస్తరము. ఇదియొకపురుషుల విషయముననె కాదు. స్త్రీలవిషయముననుగూడ. స్త్రీలను కేవలాకారసౌష్ఠవమునుజూచి కామింపఁగూడదు. కలువపూలవంటి వాలుగన్నులున్నంతమాత్రమునఁ జిలుకవలె నల్లారుముద్దుగా మాటలాడనేర్చినమాత్రమున-తెలివి తేటలతో సంసారము దిద్దినమాత్రమునఁ గొనియాడరాదు. స్త్రీలయందు సుగుణసంపద (పాతివ్రత్యము) ఉన్నపుడె యాకారము ఫలవంతమగును. కాన శీలమె సౌందర్యముకంటె స్త్రీలయెడఁ బ్రధానము.

ఆ. కల్లుకుండ కెన్ని ఘనభూషణము లిడ్డ
నందులోనికంపు చిందు లిడదె?
తులువ సదివికొన్నఁ దొలిగుణమే మగు? వి...

దుర్మార్గునకు ఎన్నిఘనకారణములున్నను గౌరవప్రదములగు వస్తువులున్నను వాని దుష్టగుణము తొలఁగిపోదు. ఇట్టితులువ ఎన్నిధర్మశాస్త్రములను తుదిముట్టఁజదివినను తొల్లింటిగుణమును మానుకొనఁజాలఁడు. ఎట్లంటిరేని విపరికింపుడు. కల్లుకుండకు ఎన్ని బంగారపుసొమ్ములను పెట్టినను లోపలనున్న దుర్గంధము పైకి



రాకయణఁగియుండునా? ఉండదుకదా. అట్లులే దుష్టునికిఁగూడ చదివికొన్నను దౌష్ట్యముపోదు.

ఆ. కల్లునీళ్లు త్రాగి కడుఁ బెద్దవారిలో
జేరె విడిచి తిరుగు చెడునరుండు
పనులు తీరువెనుకఁ బొతలుగట్టురా? వి. 416

దుర్జనుఁడు పిన్నపెద్దల యంతరమును వదలివైచి సిగ్గులేక గొప్పవారిదగ్గఱ కారులు ప్రేలుచు బట్టవిడచి సంచరించుచు కల్లుత్రాగుచు తనకంటె మించినవారిని పెద్దలనికాని యాలోచింపఁడు. మానాభిమానములు లేవు. ఈరీతిగా మత్తు తీఱునంతవఱకును తిరుగుచునుండి తరువాత, ఏచినిఁగినపాఁతయో గట్టును.

ఆ. కసినిగలిగి పాపకర్ముల పీడింతు
రల్లప్రభులు యముని యల్లభటులు
వృశ్చికంబుఁ గన్న విడుతురే చంపక, వి. 417

రాజులు నీతికోవిదు లగుదురేని దుర్మార్గులను చలముపట్టి సాధించుచుందురు. పాపాత్ములను వారివారి పాపములకుఁ దగినట్లు దండించెడువారలు రాజులును యమునిభటులును మాత్రమే. కొందఱజ్ఞానులు "వీరు దుష్టులైనను ఇంతటి దండనకు తగ"రని చెప్పెదరు కాని అది సరిగాదు. యోచించుఁడు-ఎంతటి బుద్ధిమంతుఁడైనను తేలును చూచిన నయ్యో! పాపమని వదలివైచెదరా?

ఆ. కానివానితోడఁ గలసి మెలంగిన

హానివచ్చు నెంతవానికైన
ఈఁగ కడుపుఁజొచ్చి యిట్టట్టు సేయదా? వి.

తనయోగ్యతకు తగనిమనుష్యునితో కలిసి మెలసి గుణహీనుఁడుండరాదు. ఒకవేళ నిట్లు కానివానితో కలసి మెలంగిన యెడల నట్టివాఁ డెంతటివాఁడైన నగును గాక. తప్పక ముప్పు ననుభవించియే తీరును. ఎట్లనఁగా: ఈఁగ కడుపులోనికి పోయి నయెడల స్వల్పమైనను-క్రిందు మీఁదులు నేసి వాంతులఁ బుట్టింపదా? అట్టులే ఖలుఁడు గూడ.

ఆ. కులములోన నొకఁడు గుణహీనుఁ డుండిన
కులము చెడును వానిగుణమువలన
ఎలమి చెఱకునందు నెన్ను పుట్టినరీతి, వి. 419

సద్వంశములో నొక్కఁ డెవఁడైన గుణహీనుఁడు (అనఁగా: దుర్జనుఁడు) ఉండినయెడల నావంశ మెంతటి ప్రతిష్ఠావహమైనను మొదలంట నశించి గుణము పేరునకైనను లేకపోవును. ఎట్లనియందురా? చూడుఁడు. చెఱకు తీపిగలదియైనను ఎక్కడనో యొక్కదానికి వెన్ను వెడలిన నాచెఱకునకు నిఁకనెచ్చటను తీపియనుమాట యైనను లేకుండునట్లు నాశము గలుగదా! అట్లే ఖలుఁడును.

ఆ. కులమువలనఁ గొంత బలమువలనఁ గొంత
కలిమివలనఁ గొంత గర్వమొదవ
అఱకుచదువు చదివి అఱకున చెడుదురు వి. 420

దుర్మార్గుని చెడిపివేయుటకు సామాన్యముగా మంచి వస్తువులే చెడ్డవియగును. దుష్టులకు గర్వ మతిశయించుటకు వారు జన్మించిన యున్నతకుల మొక కారణమగును. ఇటులె బలము, ఐశ్వర్యముగూడఁ గారణములగును. వీనివలన దుర్జనుఁడు యుక్తాయుక్తవిచక్షణమాని దుర్నీతికరములగు గ్రంథముల నాశ్రయించి విద్యావివేకము చెడుకాలక్షేపమునకుఁ గలిమి బలుములు అంకుటాంద్రకువినియోగించి తానును సర్వవిధముల భ్రష్టుఁడగుచున్నాఁడు. ఆహా! దుర్జనులయెడ మంచియెట్లువిష మించుచున్నదో చూచితిరా!

ఆ. కుళ్లుఁబోతునొద్దఁ గూడి మాటాడిన
గొప్పమర్మములను జెప్పరాదు
పేరు తీరుఁ దెల్ప నూరెల్ల ముట్టించు, వి. 421

బుద్ధిమంతు లగువారు సాధ్యమైనంతవఱకును, పరులగుణములను సహింపలేని ఖలులతో చేరరాదు. ఒకవేళ దైవవశమువలన నట్టులు కుళ్లుబోతులగు దుర్మార్గుల నొద్దమాటలాడుట తటస్థించినపక్షమున తనలోని మర్మములను విప్పి వారికి చెప్పకూడదు. అట్లుగాక పొరపాటున చెప్పివైచితిరా! సరి. ఇఁక వాఁడు వాని దుర్జనత్వమును ప్రకటించుటకోనో యేమో! కాని ఊరిలోనంతటను చాటివచ్చును.

క. కుమ్మరవానికి జ్ఞానము
నెమ్మదిగాఁ దెల్పవలదు నిరసించుఁ సుమీ!

బ్రహ్మను నే నని యప్పుడె
బ్రహ్మమూర్తియై చెడును గాని తిరుగఁడు వేమా! 422

దుర్జనుల దగ్గఱఁ జేరి వారిని నుతించుచు యథార్థమగు జ్ఞానమును తెలుపఁగూడదు. ఎట్లనఁగా: ఎవఁడైన సజ్జనుఁడు కుమ్మరిని జేరఁబోయి, వానికి బ్రహ్మము నెఱిఁగించి "దేవుఁడు నీవలెనే సృష్టిచేయుచుండును. నీవు చేయుకుండ లెట్లస్థిరములో యాతనిసృష్టియుఁగూడ నశ్వరము" అని చెప్పెననుకొందము. అంతమాత్రముచేత వాఁడు గుణియగుటకు మాఱుగా "నేనే బ్రహ్మ" నని గర్వించి తిరుగ మొదలుపెట్టును.

ఆ. కూళకూళ్లమేయు గుణమంత చెడనాఁడు
నెట్టివారు మెచ్చ రట్టివాని
కొయ్యదూలమునకుఁ గుదురునా జ్ఞానంబు? వి.

దుర్జనుఁడు నానావిధములగు దుష్టాన్నములను తినుటకైనను వెనుకఁ జూడఁడు. తినివేయుననిభావము. గుణమునంతయును దోషమునుగా స్వీకరించును. ఇట్టిదుర్జనుని ఎట్టివారైనను మెచ్చుకొననే కొనరు. వీనికి ఎన్నివిధములఁ జెప్పినను జ్ఞానము కలుగనే కలుగదు. ఎట్లందురా? చూడుఁడు. కొయ్యదూలములకు ఎన్నివిధముల చెప్పినను జ్ఞానము కుదురునా? కుదురదు. అట్టులే దుర్జనుఁడు కూడ.

ఆ. కైపుమీఱినవేళఁ గడను జేరఁగరాదు
అనువు దప్పి మాటలాడరాదు
సమయమెఱుఁగనతఁడు సరసుఁడుగాఁడయ్యా! వి.



బుద్ధిమంతుఁడు సమయాసమయములను గుణాగుణములను తెలిసికొని కాని యెవ్వరిదగ్గఱకుఁగాని బోఁగూడదు, అట్లు పోఁదలఁచినయెడలచక్కఁగాపరికింపవలయును. త్రాగుబోతునకు కైపుమీఱినప్పుడు దగ్గఱకు పోఁగూడదు. సమయము నతిక్రమించిన మాటలాడనుకూడఁ జనదు. ఈరీతిగా సమయమెఱుఁగక యున్నయెడల నాపురుషుండు సరసుండు కాఁజాలఁడు కావున, దుర్జనులనుండి జాగ్రత్తగా మెలఁగవలెను.

ఆ. కొండగుహలనున్నఁ గోవెలలందున్న
మెండుగాను బూది మెత్తియున్న
దుష్టబుద్ధులకును దుర్బుద్ధి మానునా? వి. 425

ఎంతటియుత్తమదశనొందినను దుష్టుఁడు తనదుష్టగుణమును మానుకొనఁడు. ఇట్టిదుర్మార్గుఁడు కొండగుహలోచేరి మునివృత్తినున్నను, కోవెలలో చేరి భక్తులతో కలసియున్నను, విరాగులవలె భస్మధారణమును చేసికొనియున్నను ప్రకృతిసిద్ధమగు దుర్గుణమును మానుకొనఁజాలఁడు. కావున జనులు వీరియందు విశ్వాసముంచికొని మెలఁగరాదు.

ఆ. కొండముచ్చుపెండ్లి కోఁతి పేరంటాలు
మొండివానిహితుఁడు బండవాఁడు
దుండగీడునకును గొండెఁడు దళవాయి, వి.

ఆహా! పరమేశ్వరుఁడు ప్రపంచము నెంతటిబుద్ధివైభవము కలిగి సృజించెనో కాని సజ్జనులకు సజ్జనులను దుర్జనులకు దుర్జనులను సహవాసులనుగాఁగూర్చి తనసామర్థ్యమును వెల్లడిచేసెను.

ఎట్లనఁగా: చూడుఁడు. కొండముచ్చు పెండ్లికి కోఁతియే పేరంటాలు అగును. మొండివానికి ప్రియమగు మిత్రము బండవాఁడేయగును. దుష్టునకు మంత్రి కొండెములను జెప్పు కష్టుఁడే యగును గాని యితరుఁడు గాఁడు.

ఆ. కోఁతిఁ బట్టి తెచ్చి క్రొత్తపుట్టము గట్టి
కొండముచ్చులెల్లఁ గొలిచినట్టు
నీతిహీనునొద్ద నిర్భాగ్యు లుందురు, వి. 427

దుర్జనులందఱు నట్టి దుర్జనునే సేవించియుందురు కాని సజ్జను నెంతమాత్రమును సేవింపరు. ఇట్లగుట న్యాయము. లోకములో సమానులకు సమానులపొందే కలుగుచున్నది. చూడుఁడు. కొండముచ్చులను నొకజాతికోఁతులు వెదకి వెదకి గుణవంతునిగా నిశ్చయించి కోఁతికిఁ బట్టముఁగట్టి కొల్చుచుండును. అట్టులే నీతిలేని దుర్జనుఁడగు రాజు నొద్ద నిర్భాగ్యులే కొలువుడుకాండ్రుందురే గాని గుణవంతు లుండరు.

ఆ. కొండెకాఁడు చావఁ గొంపవాకిటికిని
వచ్చిపోదు రింతె వగపులేదు
దూడవగచునె భువి తోడేలు సచ్చిన, వి...428

లోకులు సజ్జనుఁడైననే గౌరవింతురు కాని దుర్జనుని ఎంతమాత్రమును గౌరవింపరు. వీరు సజ్జనుని చావునకు వగతురు. దుర్జనుఁడు ఎంతటి ప్రభువైనను గాని నిరంకుశాధికారియైనను గాని చచ్చినయెడల విచారింపరు. కావున దుర్జనుఁడై యుండరాదు. కొండెములు చెప్పి గొంతులుగోయు నెట్టిదుర్మా



ర్గుఁడును చచ్చిన ఇంటిముందరికి వచ్చిపోయెదరే కాని విచారింపరు. ఎట్లనఁగా : చూడుఁడు. తోడేలు చచ్చిన ఆవుదూడ విచారమునొందునా? లేదుగదా. అట్టులే దుర్జనునివిషయమునను.

ఆ. గంగ పాఱుచుండు కదలనిగతితోడ
ముఱికి వాగుపాఱు మ్రోఁతతోడ
అధికుఁ డోర్చునట్టు లధముఁ డోర్వఁగ లేఁడు,వి.

స్వభావములోనే దుర్జనసజ్జనులకు అపరిమితమగు భేదము కలదు. అందులో ప్రవర్తనవిషయములలో నిఁక చెప్పవలసిన పనియే లేదు. దుర్జనుఁ డగువాఁడు అధముఁడు. సజ్జనుఁ డధికుఁడు. అధికుఁ డోర్చునట్టు లల్పుఁ డోర్వఁగలుగునా? లేఁడు. ఎట్లనఁగా: గంగయును ప్రవహించును. కాల్వయును ప్రవహించును కాని రెంటియందు విస్తారము భేదముగలదు. గంగ మహానదిగావున తొణఁకక కదలక ప్రవహించును. కాలువ తొణఁకుచు భోరునమ్రోఁగుచు ప్రవహించును. ఇట్లే దుర్జనుఁడు కూడ.

ఆ. గాడ్దె యేమెఱుంగు గంధంపువాసన
కుక్క యేమెఱుంగు గొప్ప కొద్ది
అల్పుఁ డేమెఱుంగు హరుని గొల్చువిరక్తి? వి...

దుర్జనుఁడు జ్ఞాన మొక్కింతయును లేక శివుని పూజించుచు విరక్తిని బొందియుండువారిని నిందింపఁ బూనుకొని యుండునేకాని వారియోగ్యతను కనిపెట్టఁజాలఁడు. ఎట్లనఁగా:

చూడుఁడు. అల్పజాతిలోఁ జేరిన గాడిద గంధపు పరిమళము నెట్లు తెలిసికొనఁగలుగును? కుక్క యెట్లు కొద్దిగొప్పలను గుర్తెఱుంగఁగలదు. ఇట్లే దుర్జనుఁడు గూడను.

ఆ. గుణికి విద్య భువిని గోరంత యబ్బినఁ
గొండ యగును వానిగుణముచేత
కొండయంతవిద్య గుణహీనుఁడెఱుఁగఁడు, వి.

సజ్జనుఁడు తనకు విద్య నలుసంత యబ్బినను దానికి తన గుణములచేత వన్నెఁబెట్టి కొండంతగా చూపెడి సామర్థ్యము కలిగియుండును. దుర్జనునికి గొప్పవిద్య కొండంత యబ్బియున్నను దానిని తన దుర్గుణపుంజములచేత మొదలంట నశింపఁజేయఁదలఁకొనును. చూచితిరా? సజ్జనదుర్జనుల కెంతటిభేదమున్నదో! కావున సజ్జనుఁడై మెలఁగవలయు.

ఆ. గుఱ్ఱమునకుఁ దగినగుర్తైన రౌతున్న
గుఱ్ఱము లిల నడుచు గుణముగాను
గుర్తు దుర్జనులకు గుణము లిట్లుండురా, వి...

దుర్జనుని స్వాధీనముచేసికొని శిక్షింపఁగలవాఁ డుండినచే వాఁడు నొకమనుష్యునివలె సంచరించునే కాని లేకున్న లేదు. ఏలయనఁగాఁ దుర్జనునిస్వభావ మిట్టిదియై యుండును. ఎట్లండురా? చూడుఁడు. గుఱ్ఱము ఎక్కి స్వారిచేయఁదగినదియే కాని సామాన్యులను లక్ష్యముసేయక క్రిందఁబడఁద్రోయును. కావున దానికిఁదగిన రౌతున్న గుణముకలిగి నడుచుకొనును. ఇట్లే దుష్టుఁడు గూడను.



ఆ. గోఁచి యూడె ననుచుఁ గోఁతియాటల నాడి
వెఱ్ఱియోగి నూరువెడలమంద్రు
ఎవరిగోఁచులూడ నీప్రొద్దుగ్రుంకిన? వి... 433

దుష్టునికి సజ్జనుని పరాభవించుటగాని పరిహసించుటగాని జన్మచరితార్థముగాఁగల కృత్యమై యున్నది. ఇట్టివాఁడు ఉత్తముఁడైన దిగంబరుఁడు నగు యోగిని చూచి గోఁచి యూడె నని గోఁతిచేష్టలను చేసి ఊరువెడలఁగొట్టి తనదుర్మార్గమునే వెలిపుచ్చునుగాని తమయందఱికినిగల "ప్రొద్దుగ్రుంకఁగానె గోఁచులూడుట" యనుయవగుణమును తెలిసికొనలేఁడు.

ఆ. చంద్రునంతవాఁడె శాపంబుచేతను
కళల హీనమందఁగలిగెఁ గదర
పుడమి జనులకెల్ల బుద్ధు లట్లుండురా, వి...

మహాత్ములను పరిహాసముచేసినను పరాభవము నొందించినను గొప్పగొప్పవారికే ముప్పుగలుగుచుండును అనిన నీదిప్పకాయల విషయమున నేమిచెప్పవలయును? చూడుఁడు. చంద్రుఁ డెంతటి వాఁడు? ఎంతలోకోపకారి? అంతటివాఁడే కర్మానుసారియై గణపతిని పరిహాసముచేసి శాపమును బొందెను. కావున దుర్జనులు దైవప్రేరితులై కన్నుగానక యకృత్యములను చేయుచుందురు. శివునిభూషణము లక్ష్మికిఁ దోఁబుట్టువునగుచంద్రుఁడే పరులఁబరిహసించినమాత్రమున శాపమొంద నీకాలపు వంచకులా! పరుల దూషించి బాగుపడువారలు.

ఆ. చెట్టుచేమఁ గొట్టి చుట్టుగోడలఁ బెట్టి
ఇట్టునట్టుఁ బెద్దయిల్లుఁ గట్టి
మిట్టిపడునునరుఁడు మీఁదిచేటెఱుఁగఁడు, వి...

దుష్టుఁడు తాను చేయుప్రతికార్యము నుత్తమోత్తమమనియును, నుభయలోకములయందును సుఖకరమనియును తలంచుచుండును. ఈయన ప్రాణిహింసనైనను తలంపక తనచుట్టుపట్టులనున్న చెట్టుచేమలను పుట్టలను కొట్టి చుట్టును గోడలఁ బెట్టి యిల్లుకట్టి "ఆహా! ఎంత తెలివికలవాఁడను. ఎంతమంచి పనిని చేసితిని. నాయంతటివాఁ డొరుఁడేడి?" యని మిట్టిపడునేకాని మీఁద రాఁబోవు చేటు నెఱుఁగఁజాలఁడు.

ఆ. చెఱకులోననైనఁ జెడ్డగుణంబున్న
తీసివేయకున్న తినఁగఁబోఁగ
దంతిపురపుద్రోహి యాతఁ డెట్లుండురా? విశ్వ.

కొందఱు నీచులు మేము గొప్పవారి నాశ్రయించియున్నారము. మాకెట్టియపాయము రాఁజాలదు. మాచెడుగు చేష్టలన్నియు మంచిగనె పరిణమించునని చెలరేఁగుచుందురు. అంత తోఁబోక రాజాంతఃపురములలోఁ జొరవ కల్పించుకొని యనేకవిధముల ద్రోహము చేయుచుందురు. మధురతరమైన చెఱకుగడ కెటనేని యించుక పుచ్చున్నమాత్రమున రుచి చెడదుగాని తినువా రాభాగమును దీసివేయక మానరు. అటులేయుంచుక యంతఃపురసంబంధమున్నమాత్రమునఁ బాపమనక రాణివాసమునకే జెఱుపుఁ జేసినచో రాజులు బ్రతుకనిత్తురా! అట్టి దుర్జనుల శిక్షించి తీఱెదరు.

ఆ. చదువులన్ని చదివి చాలవివేకియై
కలుషచిత్తుఁడైన ఖలునిగుణము
దాలిగుంటఁ గుక్క తలఁచిన చందమౌ, వి...

అన్నివిధములయిన చదువులను నీతులను నేర్చికొని వివేకియనిపించికొని పాపములచేయు దుర్జనునిగుణమును పరికించిన పక్కుమని నవ్వు వచ్చుచున్నది. చూడుఁడు. వీఁ డిన్నిగుణములను ఇన్నిచదువులను చదివికొన్నను తనయాచరణములో ఆ నీతులను పెట్టికొనక దాలిగుంటలో బరుండి, "రేపటినుండి దొంగతనముఁ జేయ"ననికొని లేచినవెంటనే దొంగిలించుట కిండ్లలోఁ దూఱిన కుక్కను బోలి యున్నవాఁడు.

ఆ. చంపఁగూడ దెట్టిజంతువునైనను
చంపవలయు లోకశత్రుగుణముఁ
దేలుకొండిగొట్టఁ దేలేమిచేయురా? వి... 438

బుద్ధిమంతుఁ డగువాఁడు దుర్జనునైనను యుక్తియుక్తముగా వంచఁ బ్రయత్నింపవలయునే గాని చంపఁబూనరాదు. ఎట్టిక్రూరజంతువునైనను చంపరాదు. లోకమునకు శత్రులగువానిని మాత్రము(గుణములను) చంపవలయును. (అనఁగా: గుణములు చేసినతప్పిదమునకు శరీరమును దండించుట తప్పనిభావము.) ఎట్లనియందురా! తేలు విషము ప్రయోగించునేగాని కొండి యేమిచేసినది. కావున తేలును కొట్టినట్లె దుష్టగుణములను నశింపఁజేయవలయును.

ఆ. చంపఁదలఁచురాజు చన వగ్గలం బిచ్చు
చెఱుప నున్నపగఱ చెలిమి సేయుఁ
గఱవ నున్నపాము నెఱిఁగాచుకొనియుండు,వి.

ద్రోహమును చేయఁ దలంపుగొన్న దుర్మార్గులు పైకి ఏమియు నెఱుఁగనివారివలె ప్రేమగలవానివలె మెలఁగి మోస పుచ్చుచుందురు. ఇట్లు చేయుచుండుట దుర్జనులకు సహజము. ఎట్లనియందురా? చూడుఁడు. చంపఁదలఁచుకొనినరాజు ఎక్కు వ చనువిచ్చును. చెఱుపఁదలఁచినశత్రువు చెలిమి నెక్కువ గా పాటించును. కఱవఁదలఁచుకొనినపాము కాచుకొనియుం డును. ఇట్లే దుష్టులుగూడను.

ఆ. ఛర్ది పుట్టినప్డు సాపడ నైఁపదు
నాతి గన్నయప్డు నీతి తగదు
చేటు మూడినపుడు మాటలు నోపవు,వి...440

విజ్ఞానశాలి యగుమానవుఁడు సమయోచితముగఁ దన నియమముల మార్చుకొననలయును. పురుషప్రయత్నము వికటించినపుడు వారుచేయఁనుపశమనప్రయత్నములన్నియు వికటించి యపాయకరములుగఁ బరిణమించును. అన్నము ప్రాణాధారమేగాని వాంతులగుసమయమున వర్జనీయము. కాముకులు వలపుచేఁ జిక్కొని పైఁబడవచ్చునపుడు నీతి పనికిరాదు. ఆపత్కాలము సమీపించినపుడు మనము ఒడ్డునబడుటకు బల్కు పల్కు లుపయుక్తములు కాఁజాలవు. మంచి చెడుగుగా మాఱినపు డిట్టివిపరీతపరిస్థితులు కలుగుట నైజము.



ఆ. జెట్టి సాముఁజేసి తీతిలోనఁ జేరెత్త
దుష్టతెలివిచేత దొలఁగు తెలివి
కష్టమొకటె గాని కడతేఱుటా లేదు, వి... 441

చాలకాలము కష్టపడి సంపాదించినయోగ్యతలు గూడ దుష్టకార్యములవలన చెడిపోవుచుండును. ఎట్లనఁగా: నొక జెట్టి గలఁడనుకొనుఁడు. వాఁడు ఒడలినంతయును విఱుచుకొని సాముఁ జేసి లోకములో పేరెన్నికను గన్నప్పటికి నట్టివానికి ద్రోహచింత యుండినయెడల నాదుష్టతెలివిచేత ఇదివఱ కున్న యోగ్యతగూడ నశించిపోవును. ఇన్నిదినములనుంచి ఇతనుపొందిన కష్టమొక్కటేగాని కడతేఱుటలేదు. ఇట్లే దుష్టుఁడుగూడఁ జెడిపోవును.

ఆ. జంకులేనిమదిని జగదీశునుంచిన
మంకుబుద్ధిమాని మట్టుపడును
పంకమందుఁ బురువు పడి పొర్లుచుండదా? వి...

మనస్సులో నితరుల కెవ్వరికిని ద్రోహమును చేయఁ జాలక ఈశ్వరుని సేవించుచున్నయెడల నెంతటియధమునకైనను తరించుట కుపాయముగలుగునేగాని ద్రోహబుద్ధిగలిగిన రాదు. ఎట్లనఁగా: (కంబళి) పురుగు బురదలో పడి పొర్లినను బురద అంటుకొనదు కాని కావలయునని ఇతరములు బురదలోపడిన బురదయంటుకొనదా! అట్లే దుష్టునికిఁ గూడ నని.

ఆ. జగడ మాడుచుండుఁ జాడీలకో రెప్డు
సాధుజనుల మీఱి బాధపెట్టు

యముఁడు తప్ప వెఱతు రందఱు వానికి, వి...

దుర్జనునిచూచిన భయపడనివాఁ డీలోకములు పదునాల్గింటిలోను నెవ్వఁడును లేఁడు. ఒక్కయముఁడు తప్ప దుష్టునికి తక్కినవారందఱును వెఱతురు. ఏలయని యందురా? వినుఁడు. ఎప్పుడును దేనిమీఁదనో యొకదానిమీఁద సాకును పన్నికొని తగవుల నాడుచుండును. అధికారులతో లేనిపోని చాడీలను చెప్పుచుండును. సత్పురుషుల నందఱిని పీడించును. కావున నిట్టిఖలునకు యముఁడు తప్ప శిక్షకుఁ డితరుఁడులేఁడు.

ఆ. టక్కరులను గూడి యెక్కసక్కెములాడ
నిక్కమైన ఘనుని నీతి చెడును
ఉల్లితోఁట బెరుగు మల్లెయొక్కకరణి,వి...444

ఎంతటిగొప్పవాఁడైనను విజ్ఞానశీలుఁడైనను విబుధుఁడైనను దుర్జనులతో స్నేహముఁ జేసి వారితో ననవసరముగా నెకసక్కెములను పలుకుచుండెనా తప్పక ఆఘనుఁడు ముప్పుఁ జెందును. సందియము వలదు. ఇయ్యది నిజము. ఎట్లనియందురా? పరికించుఁడు. గుమగుమమని సుగంధపుష్పముల నీనుమల్లెమొక్కనుల్లితోఁటలో నాటినగుణహీనతను జెందదా? అట్లులే సత్పురుషుఁడుగూడ దుష్టునిమైత్రిచేఁ జెడిపోవును.

ఆ. డెందమందుఁ దలఁచు దెప్పర మెప్పుడు
నోర్వలేనిహీనుఁ డొరునికట్టె
తనకు మూఁడుసుమ్మి తప్ప దెన్నటికైన,వి...445

ఒరులసిరులను చూచి సహింపలేని యసజ్జనుఁడు ''వారికెప్పుడును ఏవిధమైన ఆపదలు రావలయును. వారందఱును నశించిపోవలయును'' అని మనస్సులో దెప్పరమును తలంచుచుండును. ఇట్లు దుర్జనుఁడు నిష్కారణముగా నితరులకు ముప్పుగోరును గనుక వీనికిఁ గూడ నెన్నటికైనను తప్పక రాఁగలదు. కాఁబట్టి నిష్కారణముగా దుర్జనుఁడై ఇతరులఁ జెడఁగోరరాదు.



ఆ. తనకుఁ గలుగు పెక్కు తప్పు లటుండఁగా
పరుల నేరుచుండు నరుఁడు తెలియఁ
దొడ్డలెఱుంగఁడనుచు నొత్తిచెప్పఁగవచ్చు, వి.

దుర్జనుని స్వభావమే విలక్షణముగా నుండును. వాఁడు తనవలె యందఱు ననితలంపఁడు. తాను ప్రతిదినమునను ప్రతిక్షణమునను వేలకు వేలు తప్పులను చేయుచుండును కాని తాను చేయుతప్పులను తెలిసికొనఁజాలఁడు. పైగా తనతప్పుల నావలఁబెట్టి ఇతరులను తప్పు లెన్నవచ్చును. కావున నిట్టిదుర్జనునిచూచినప్పుడు ''ఒడలు తెలియక పడిపోవుచున్నాఁడు పాపాత్ముఁ''డని గట్టిగా చెప్పుటకు ఎట్టి యభ్యంతరములు లేవు.

ఆ. తనకు మేలుఁ జేయ దాఁ దెలియఁగనేర్చు
నెలమితోడ గుక్క యెఱుక భువిని
తనకుఁ జేయుమేలు తాఁ దెలియఁగలేని
మనుజుఁ డెంతఖలుఁడొ? మహిని వేమ. 447

ఎంతనీచకులమునందుఁ బుట్టినను ఇతరులకు నిసుమంతయైని వ్యర్థుఁడైనను తనకు మేలుచేసినవానికి తిరుగా మేలుచేయవల

యునని కోరుచుండును. ఎంగిలితినుకుక్కగూడ నీరీతిమెలఁగుచున్నది. కాని దుర్జనుఁడు కాళ్లచేతు లుండియు నన్ని జీవములకంటె నధికుఁడైనను తన కొరకు సేయునుపకారములను మఱచిపోవును. ఇతరులు జ్ఞాపకమునకుఁ దెచ్చినను తెలిసికొనఁగా లేకపోవును. ఆహా! ఇట్టివాఁ డెంతటి దుర్మార్గుఁ డనఁదగియున్నవాఁడు! అని.

ఆ. తనర నృపతితోడఁ దగ దుర్జనునితోడ
నగ్నితోడఁ బరునియాలితోడ
హాస్యమాడు టెల్ల నగును బ్రాణాంతమ్ము, వి...

బుద్ధిమంతుఁడు స్థలాస్థలములను యుక్తాయుక్తములను గుర్తెఱింగి మాటలనాఁడుచుండవలయునే కాని ఎవ్వరితో నన్న వారితో ఇచ్చవచ్చినట్లు హాస్యములు పలుకరాదు. అందునను తన్నుఁ బాలించు ప్రభువుతోడను, దుర్జనులతోడను, నిప్పులకుప్పతోను, బరునియిల్లాలితోను పరిహాసముల నాడరాదు. వినక ఎవ్వఁ డీరీతిగా సరసములు పల్కుటకు ప్రారంభించునో అట్టినరునకు ప్రాణహాని వచ్చును.

ఆ. తనయుఁ డొదవె ననుచుఁ దాఁ బొంగుచుండును
వాఁడు దుష్టుఁడైనఁ గోడుగూర్చుఁ
దులువవాండ్రఁగూడి మెలఁగనీరాదురా, వి...

లోకములోనఁ బాపము తల్లిదండ్రులు తమకు బిడ్డలులేరని వగచి చెట్టుచెట్టుకును గుట్టగుట్టకును మ్రొక్కి కొడుకు పుట్టఁగా ధన్యుండ నైతినని పొంగుచుండును. ఆహా! ఎంతటివెఱతనము.



కొడుకు పుట్టఁగానే సంబరముగాదు. వాఁడు సహజముగా దుష్టులనుకూడఁ గోరును. అట్టు కూడిన నాపదలు వాటిల్లును. కావున తనబాలుని దుష్టులతో కలియనీయక జాగ్రత్తగా కాపాడి గుణవంతునిగా చేసిననే సంతసింపవలయును. అనఁగా: దుష్టుఁడగు సుతుఁడు తల్లిదండ్రులకు దుఃఖకరుఁ డగునని.

ఆ. తేలునకు నిఁకెంత తెలియఁ గొండి విషంబు
ఫణికి నుండు విషము పండ్లయందు
తెలివిలేనివాండ్ర దేహ మెల్ల విషంబు, వి... 450

దుర్జనుల కప్రయత్నముగా శరీర మెల్లను విషపూరితమై యుండును. అట్టివారినిఁ జూచినను కలసినను కష్టములువచ్చును. దుర్జనులలో చిన్న పెద్ద లెంచవలదు. దుష్టజంతువు లన్నిటికంటె దుష్టుఁడే యెక్కువక్రూరుఁడై యుండును. చూడుఁడు. తేలునకు కొండియందుమాత్రమే విషముండును. పామునకు పండ్లయందును మాత్రమే యుండును. ఇఁక దుర్జనుల కొడలంతయును విషమే యుండును.

ఆ. తొత్తు తొత్తెగాని దొరసాని గాఁబోదు
అడచు టింతె దానికైన ఫలము
మిత్తికూళ్ల దొంగ మేలు నెఱుఁగురా? వి.

ధనవంతులగురాజులు నీచులను నీచస్థితియందు యోగ్యులను యోగ్యస్థితియందు నుంచవలయును. అంతియగాని యధములను పైకిఁదీసికొనిరాఁదగదు. కొందఱు బానిసయగు దొత్తు

ముండలకు లోఁబడి యుచిత మెఱుంగక వర్తింతురు గానియా తొత్తునకు దొరసానికిఁగల యున్నతగుణము లెన్నఁటికి రాఁజాలవు. దాని నెపుడణఁచవలయునే గాని నెత్తిపై కెక్కించుకొనఁదగదు. తన్నుంచుకొనినమిండఁ డెపుడుచచ్చునా! వాని యాస్తియెప్పుడు దొంగలింతుమాయని చావుకూటికిఁ జూచుదాసి యజమాని మేలుకోరదు. గాన యట్టినీచురాండ్రకుఁ జనువీయరాదు. వాండ్రు దుష్టురాండ్రు.

ఆ. దిక్కులేనివాని దీనతఁ బాపిన
పురుషుఁ డిహమునందె పూజ్యుఁడగును
పరమునందు వానిభాగ్య మేమనవచ్చు? వి...452

దుష్టులు దిక్కులేనివానిని చూచినప్పుడు అట్టివానిని రక్షించుటకు మాఱుగా నెత్తికెక్కి కూర్చుండి కష్టములఁ బెట్టుచుందురే కాని వాని రక్షించి గట్టెక్కింపఁ బూనుకొనరు. అట్లు వారాదీనుని రక్షించిన నీలోకముననే సర్వులకును పూజ్యులు కాఁగలరు: అట్టి సర్వలోకపూజ్యులగు వారియదృష్టము నేమని వర్ణింపఁగలుగుదుము. దీనులగాపాడి భూలోకముననే సర్వజనములచేఁ గొనియాడఁబడుచున్న నీదయాశాలురు పరలోకమున నెంత పవిత్రస్థానము నలంకరింతురో యెవరు నిర్ణయింపఁగలరు.

ఆ. దాసరయ్య తప్పు దండంబుతో సరి
మోసమేది తన్ను ముంచకున్న
నీచుఁడై చెడు నటు నీచులనమ్మిన, వి.... 453



విధేయు లగువారు దుష్టులయినను తాము చేసినతప్పు నొప్పికొని మన్నింపుఁ డని మ్రొక్కినయెడల వానిని మన్నింపవలయును గాని జాగ్రత్తను వహించి మరల తనను మోసము చేసి ముంచక యుండునట్టులు చూచుకొనవలయును. అట్లు జాగ్రత్తవహింపనివాఁడు నీచుల నమ్మియుండి తాను నీచుఁ డై చెడిపోవును. కావున దుష్టులఁ జేరి మోసము నొందఁ బోకుము.

ఆ. దుండగీడుకొడుకు కొండీఁడు చెలికాఁడు
బండరాజునకును బడుగుమంత్రి
కొండముచ్చునకును గోఁతియె సరియగు, వి...

రాజు దుష్టుఁడైన రాజ్యమెల్లయు దుష్టమగును. ఎట్లనఁగా: తాను తుంటరియైనయెడల తనకొమరుఁడుగూడ దుష్టుఁ డగును. తనకు తగినయట్లే కొండెములు చెప్పువాఁడు మిత్త్రుఁడగును. పనికిరానివాఁడు ప్రధానియగును. ఇది చూడఁగా చిత్రముగా నున్నది. కొండముచ్చునకు తగిన సేవకుఁడు కోఁతి యగునట్టులె దుష్టునికి తగిన సేవకులు దుష్టులే యైయుందురు. కావున నట్టివారి నెన్నటికిని చేరఁబోకుము.

ఆ. దుష్టజనులు మీఱి తుంటరిపనులను
శిష్టకార్యములుగఁ జేయుచుండ్రు
కూడ దనెడివారిఁ గూడ నిందింతురు, వి... 455

దుర్మార్గులు తామే లోకములో ఘనుల మనుకొనుచు హద్దు ఆజ్ఞయును లేక తమయిచ్చవచ్చినట్టులు పోకిరిపనులను చేయుచు వానినన్నిఁటిని శాస్త్రములే విధించుచున్నవనియును ఆపను

లఁ జేసెడివారలే శిష్టులనియును తక్కినవారు దుష్టులనియును జంకక చెప్పుచుందురు. అట్టివారిప్రస్తావనకు ప్రాజ్ఞుఁడు పోవుట అయుక్తము. వారికొకవేళ తెలియకపోయెనేమో యని పండితులగుసుజనులు తెలుపఁబోయిన వారినిగూడ పడతిట్టి వైచెదరు. కావున దుష్టులఁ జేరఁబోకుము.

ఆ. దూరదృష్టిఁ గనరు తూగినపనుకను
బొలుపట్టెఱుఁగరు పడినపనుక
దండసాధ్యులరయ ధర్మసాధ్యులుగారు, వి...

దుర్జనుల బుద్ధివైభవముల నేమనివర్ణింపఁగలుగుదుము. ఆపద యాసన్నమై తలపైనిఁ బడనంతవఱకును దూరదృష్టితో నాలోచనమును సేయరు. కార్యము పట్టుదప్పిపడిపోవువఱకును పట్టువిడుపులను గుర్తెఱుఁగరు. ఎల్లప్పుడును తమకు తోఁచినంతను చేయుచుందువారు. ఇట్టివారికి మెత్తనిమాటలతో చెప్పుట యుక్తము కాదు. విచారించిన వీరు దండసాధ్యులే యయ్యెదరు గాని ధర్మసాధ్యులు గారు.

ఆ. దొడ్డవాఁడ ననుచు దొరలదగ్గఱఁ జేరి
చాడి చెప్పు పాపజాతినరుఁడు
చాడిచెప్పువాఁడు సాయుజ్యమందునా? వి.

ఖలులు లోకమున కపకారమును చేయుటకై కాచికొనియుండెదరు. తాము చాలగొప్పవారమని ప్రభువులదగ్గఱఁ జేరి తమ గౌరవమును వెల్లడిచేసికొనుదురు. దగ్గఱనున్న సాధువులపైని చాడీలను చెప్పఁదలపడుదురు. ఆహా! ఎంతటిదౌర్భాగ్యుఁడో కదా! దీనివలన నీదుర్జనున కేమిఫలము గలుగును? చాడీలను చెప్పిన



వానికి సాయుజ్యము కలుగునా? కలుగదు. ఇట్లుచేయుట దుర్జనులకులక్షణమని తెలిసికొనవలయును.

ఆ. దొంగతనమువలన ద్రోహమెంతయుఁ జేసి
యెవ్వ రెఱుఁగకుండ నిముడుకొన్నఁ
దాముచేయుపనుల తగులుకోకుందురా? వి....

దుర్జనులై ఇతరుల కెవ్వరికిని తెలియకయుండునట్లు ఇతరులకు ద్రోహము చేసితిమని మురియుచుందు రెంతటి యజ్ఞులో కదా వీరలు. ఒకవేళ వీరు తాము అతిరహస్యముగా దొంగలవలె ద్రోహముచేసి ఇతరులకు తెలియకుండ నిమిడియుండిరనియనుకొందము. ఇట్లున్నను తాముచేయుదుష్టకార్యములలో ఇఁక ముందైనను తగులుకొనకయుందురా?

ఆ. ద్రోహియైనవాఁడు సాహసంబున నెట్టి
స్నేహితునికి నైనఁ జెఱుపు సేయు
నూహఁ గలిగియుండు నోగుబాగులు లేక, వి.

దుష్టుఁడు ఎప్పుడును ఇతరులకు నిష్కారణముగా ద్రోహము చేయఁబూనుకొనుచుండును. ఇట్టిద్రోహి తెగువఁ జేసి తన కెంతటి ప్రాణమిత్రుఁడైయున్నవానికైనను "కీడుచేయవలయును. తగినసమయ మెప్పుడు లభింపఁగలదో కదా!" యని యూహించును. మంచిచెడ్డల నరయక ద్రోహముచేయును. కావున దుష్టులను నమ్మరాదు.

ఆ. నేరనిజనులకును నేరముల్ నేర్పుచు
చక్కఁజేయ రిల నసాధు లెపుడు

ఒప్పుదుర్జనములు తప్పుగ నెంతురు, వి... 460

సజ్జనులకును దుర్జనులకును రూపమునందు భేదములేకున్నను వారు చేయుకార్యములయందు మాత్రము చాల భేదము గలిగి యున్నది. సజ్జనులెల్లప్పుడును దుష్టచిత్తములను త్రిప్పి మంచివానినిచేయఁగా జూతురు. తమకు ఎవ్వరైన కీడుచేసిన దానిని మేలుగా గైకొందురు. ఇఁక దుర్జనులో తప్పులు సేయ నేరని వారికి నేర్పెదరు. దుష్టమార్గములఁబడిపోవుచున్నను దిద్ది చక్కఁ నేయరు: తమకుఒప్పుచెప్పినను తప్పుగా నెంతురు. కావున దుర్జనులఁ గూడకుము.

క. నేరము లెంచెడిప్రభువును
చేరఁగరాదయ్యె నెపముఁ జెచ్చెర దెచ్చున్
వారాశి దాఁటినను శని
మారకుఁడై పట్టిచంపు నుహిలో వేమా! 461

తనను పోషించెడి రాజుగారైనను కానీ, సేవకులపై మాటి మాటికిని తప్పునకును ఒప్పునకును విధివిరామ మిసుమంతయైనను లేక యుండునట్లు నేరముల నెంచు ప్రభువును ఎంతటి విబుధుఁడైనను సజ్జనుఁడైనను ఓర్పుగలవాఁడైనను సేవించుటకు చేరరాదు. ఒకవేళ చేరినా వాఁడెప్పటికి బాగునొందఁజాలఁడు. ఏలయనఁగా: ఆదుష్టుఁడగు రాజు శనిగ్రహము సప్తసముద్రములు దాఁటినను పట్టికొని చంపెడిరీతిగా ఏదో నెపముం బన్ని చెఱుపం బ్రయత్నించును.



ఆ. నొసలు బత్తుఁడయ్యె నోరు తోడేలయ్యె
మనసు భూతమువలె మలయఁగాను
శివుని గాంతు ననును సిగ్గెట్లు గాదురా! వి...

దుర్జనుఁడగుమానవుఁడు తాను మోక్షమును సాధింపఁగలననిలోలోన మురియుచుండును గాని మోక్షమునుమాత్ర మెన్నఁటికినొందలేఁడు. వానినొసటమాత్రము విభూతిపూఁతలుగొప్ప బత్తుఁ (భక్తుఁ) డని సాటును. మొదటనుండి మాంసాహారియగుటచే వానినోరు తోడేలువంటిది. వానిహృదయము హింసాకార్యములలో నారి తేఱినదగుటచే భూతమువంటిది. ఇట్టి నీచాతినీచుఁడు తాను శివుని గాంచఁగలనని మోక్ష మొందఁగలనని చెప్పుకొనును. వీనికి లజ్జయైన నుండకూడదా యని నాతలంపు.

ఆ. పట్టనేర్చు పాము పడగ నోరగఁ జేయుఁ
జెఱుపఁజూచువాఁడు చెలిమిఁజేయు
చంపఁదలఁచు రాజు చనువిచ్చుచుండురా, వి...

కఱవఁదలఁచుకొన్న కోరత్రాచు పడగను వంకరగా నుంచికొన ప్రయత్నించును. అట్టులే చెఱిపివేయఁ బూనుకొన్నవాఁడెప్పటికంటె నధికముగా స్నేహముఁ జేయును. ఇట్టులనే చంపఁదలఁచుకొనిన ప్రభువరుఁడు విశేషముగా చనువిచ్చి దగ్గఱఁజేర్చుచుండును. ఇవియన్నియును చక్కఁగానాలోచించితిమేని దుర్జనత్వమునకు చిన్నెలు కావున బుద్ధిమంతుఁడు దుష్టునకు దూరముగానే తొలఁగి యుండవలయును.

ఆ. పరగ రాతిగుండు పగులఁగొట్టఁగవచ్చు

కొండలన్ని పిండిగొట్టవచ్చు
కఠినచిత్తుమనసు కరిగింపఁగాఁగాదు, వి.... 464

నల్లచట్టుకొండగుండ్లు అయినను ముక్కలుముక్కలుగా పగులఁ గొట్టుటకు సాధ్యమగును. మిగులకాఠిన్యమును వైశాల్యమును బాహుళ్యమును బొందినకొండల నన్నిటిని పిండిపిండిగా నూరవచ్చును కాని, ఎట్టిదుష్కరములగు కార్యములనైనను చేయవచ్చును గాని దయాహీనుఁడగు దుష్టుని మనస్సును కరగించి సత్పథమునకు ద్రిప్పఁగలుగుట మిగులకష్టము.

ఆ. పరులఁ దిట్టినంతఁ బాపకర్మం బబ్బు
విడువ దెన్నటికిని విశ్వమందు
పరుఁడుపరుఁడుగాఁడు పరమాత్మయౌనయా, వి.

దుర్జనుఁడు తన కెప్పుడైన నపకారముచేసియున్నను చేయకయున్నను, తనతో సంబంధించియుండినను సంబంధింపకయుండినను, చిట్టచివరకు తాను వానిమొగము నాజన్మమునం దెప్పుడును చూచియుండకపోయినను, నిష్కారణముగా తిట్టుటకుఁ బూనుకొనునే కాని ఆమాత్రమున వాఁడొందుఫల మిసుమంతయైనఁగలదా? లేదుగదా! ఇదియిట్లుండఁగా నితరులను నిష్కారణముగాఁ దిట్టినఁ బాపములు వచ్చును. ఇవి జన్మజన్మాంతరములకైనను విడిచిపోవు. ఇతరుఁడు పరుఁడు గాఁడు. అతఁడుగూడ దైవస్వరూపమే యగును. కావున దుష్టబుద్ధివై పరుల నిందింపఁ బూనుకొనకుము.

ఆ. పరులు చదువఁజూచి నిరసనబుద్ధితో



వట్టిమాటలాడు వదరుబోతు
అట్టిఖలుని జాడ లరయుట దోసము, వి...466

దుర్జనుల కిటుల దుష్టగుణము లొకటిరెండు తెఱఁగులుగాను ఒకటిరెండుగానే యుండవు. అనేకుల కనేకవిధములుగా నుండును. ఈదుర్జనులు తాము తెలివిలేక చదివికొనలేక పోవుటయట్లుండఁగా ఇతరులు చదివికొన్నను సహింపఁజాలరు. ఒక్కసహింపలేకపోవుటమాత్రమే గాక నిరసనబుద్ధితో నోటికి వచ్చినట్లు ఆసజ్జనులఁగూర్చి వదరుచుందురు. ఆహా! ఏమి దుర్జనత్వము. ఇట్టిపాపాత్ముల విధములను విచారించుటకూడ దోషమేయగును కావున దుర్జనుని తలపెట్టకుఁడు.

ఆ. పాల నీడిగింటఁ గ్రోలుచు నుండిన
మనుజులెల్లఁ జూచి మద్యమండ్రు
నిలువఁదగనిచోట నిలువ నిందలు వచ్చు, వి...

సత్పురుషుఁ డైనవాఁడు తనకు ఇష్టము లేకయున్ననుహఠాత్తుగా కాకతాళీయన్యాయముగా దుర్జనునిపొత్తున నిలిచెనేని తప్పక యపకీర్తిపాలగును. ఎట్లనఁగా: ఈడిగవాని పంచలో కూర్చుండి పాలను త్రాగుచున్నప్పటికి చూచినవారలుమాత్రము కల్లుత్రాగుచున్నాఁడని చెప్పెదరు. కావున బుద్ధిమంతుఁడైన వాఁడు నిలువగూడనిచోటుల నిలువరాదు. దుష్టులతో చేరరాదు.

ఆ. పాలు పంచదార పాపరపండ్లలో
చాలఁబోసి వండఁ జవికిరావు

కుటిలమానవులకు గుణ మేలగల్గురా? వి... 468

దుర్జనుని మంచివానినిగాఁ జేసి గుణములు కలుగఁజేయుటకు ఎంతయైనను ప్రయత్నించుచుండు. వాఁడు మాత్రము దుష్టుఁడే యగును. పాపరపండ్లను ఉదాహరణముగాఁ దీసికొనుఁడు. ఇవి మిక్కిలి విషపదార్థములు. ఇట్టివానిని పాలతోను పంచదారతోను చేర్చి చక్కఁగా పాకముఁ జేసినను చివరకు రుచి చూడనుగూడ నసహ్యములగును. అట్టులే కుత్సితులకుఁ గూడ సద్గుణములు కలుగవు.

ఆ. పురుషుఁ డెంతయున్న పుట్టువు మొదలుగా
పాపచింతఁ జేయుపాపి నరుఁడు
మహిని కుంటికుక్క మాంసము దిన్నట్లు, వి...

దుష్టుఁడు సిరికొఱకే నరులకు చేటుచేయఁ బూనుకొని యుండు నని తలంపవలదు. ఇట్టిపురుషునకు పుట్టినది మొదలుగా నెంతటిసిరియున్నను పాపపుచింతలనే చేయుచుండును కాని ద్రోహమును వీడియుండఁడు. ఎట్లనఁగాఁ బుట్టినది మొదలు మాంసమును తిని నలవాటుపడిన కుక్క కుంటిదై చచ్చుటకు సిద్ధముగానున్నను మాంసముఁ దినగోరునే గాని కోరకయుండదు గదా! అట్టులనే దుర్జనుఁడు గూడ నని యెఱుంగునది.

ఆ. బిడియ మింతలేక పెద్దను నే నంచుఁ
బొంకములను బల్కు సంకరునకు
ఎచ్చు కలుగ దిచటఁ జచ్చిన రాదట్లు, వి...



దుష్టుఁడు సిగ్గు బిడియ మొక్కించుకయైనను పాటింపఁడు. నలుగురిలోనికి వెళ్లి తన్ను పిలువకపోయినను అడుగకపోయినను తనంతటఁ దానే ప్రవేశముచేసికొని తానే గొప్పవాఁడనని బింకములను పల్కుటకు ఆరంభించును కాని వీని కింతమాత్రముచేత నిచ్చట ముందఱికంటె నెక్కుడుగౌరవము కలుగదు. పోనీ పరలోకములోనైనను కలుగనీ యన్నను అచ్చటను కలుగదు. కావున దుష్టము లగుతలంపులను నటనలను మొదలంట మానుకొని సుఖించుట యుక్తము.

ఆ. భాష లాడ నేర్చి పలుమోసములు సేసి
గ్రాసమునకు భువిని ఖలుఁడ వైతి
దోసకారి నీకు దొరకునా మోక్షము? వి... 471

ఖలుఁడు ఇంతటిదుష్కార్యములను చేయుచుండుట యేల యని విచారించితిమేని పొట్టనిండించుకొనుటకే యని తోఁచుచున్నది. లేకపోయిన నానావిధము లగుభాషలను నేర్చుకొని నానావిధము లగు మోసములను చేయుచు తిరుగుట యెందులకు? గ్రాసముకొఱకే ఖలుఁడయ్యెను. ఆహా! ఎంతటి దుష్టుఁడు! ఇట్టివానికి కిఁక మోక్షము దొరకుమనిన దొరకునా? ఎన్నటికిని దొరకఁజాలదు.

ఆ. మనసునఁ గృపలేని మాలలకొడుకుల
యొద్దఁ జేరినట్టి యోగు లెల్ల
పనసకొడుకు చెండుపడుచుల చందమా, వి...

మానవజన్మము నెత్తినతరువాత దయాదాక్షిణ్యములుగలిగి

ప్రవర్తింపవలయును. ఇట్టివారినే పండితు లాశ్రయింపవలయునే గాని మనసులో కృప యొకింతయు లేని చండాలతుల్యు లగుదుర్జనులయొద్దఁ జేరరాదు. ఒకవేళ తెలిసియో తెలియకయో ఇట్టివారియొద్దఁ జేరెనా యట్టివానిగతి పందముండకొడుకులను చేరిన చెంచుపడుచులవలె దుర్గతియే యగును.

ఆ. మాటలాడు టొకటి మనసులో నొక్కటి
యొడలిగుణ మదొకటి నడత యొకటి
యెట్లుకలుగు ముక్తి యిట్టులుండఁగ తాను? వి...

దుర్జనుల నిట్టివారని గాని ఇట్టిమాటలు గలవారని గాని ఇట్టిస్వభావము గలవారని గాని చెప్పుటకు వలనుపడదు. ఏల యనఁగా: ఇట్టిదుర్మార్గులకు పలికెడిపలుకులలో నొకవిధము, మనస్సులో వేఱొకవిధము, చేతలలో నింక నొకవిధము, నడతలో వేఱొకవిధము కనుపడుచుండును. ఇట్టివారికి సద్గతులెట్లు వచ్చును? రానేరదు. కావున బుద్ధిమంతు లిట్టులుండరాదు.

ఆ. ముష్టి వేపచెట్టు మొదలుగా ప్రజలకు
పరఁగ మూలికలకుఁ బనికివచ్చు
నిర్దయుండు ఖలుఁడు నీచుఁ డెందులకగు? వి... 474

లోకములో ననేకములగు విషపదార్థములున్నవి. వానిలోఁ జాలవఱకు సత్కార్యములు వినియోగము నొందుచున్నవి. ఇంత యేల? అన్ని విషములకంటె ముష్టిచెట్టు వేపచెట్టు విషము మిన్న. ఇటున్నను ఈముష్టిచెట్టు వేపచెట్టు మొదలుగాఁ గలవిషవస్తువు లనేకములు వైద్యులకు మరుములలో నుపయోగించుటకుఁ బనికి



వచ్చును. నిర్దయయును, వడలంతయును విషమును కలదుర్మార్గుఁడు మాత్ర మెందులకుఁగూడ పనికిరాఁడు.

ఆ. రామనామపఠనచే మహి వాల్మీకి
పాపి బోయఁ డయ్యెఁ బాపఁ డయ్యె
కులము ఘనము గాదు గుణమే ప్రధానము, వి.

ఎంతటిపాపములను చేసియుండినను దుష్టబుద్ధి నొక్కదానిని వదలిపెట్టినయెడల పుణ్యుఁడగును. ఎట్లనఁగా: చూడుఁడు. పిట్టలఁగొట్టుబోయవాఁడై పుట్టినను రామనామపారాయణము చేత పవిత్రుఁడై వాల్మీకి బ్రాహ్మణుఁడు కాలేదా? అట్టులే దుష్టబుద్ధినివదలిన నెంతటినీచుఁడును మంచివాఁడు అగును. కావున మంచిచెడ్డలను చెప్పుటకు కులమెన్నటికిని ప్రధానముకాఁజాలదు గాని గుణమే ప్రధానమగును.

ఆ. రేగుపుచ్చకాయ రేయెల్లఁ దన్నిన
ముఱుగ దంతకంత బెరుగుఁ గాక
ఒదులు ఛీ యన్నను నోగు సిగ్గెఱుఁగునా? వి...

దుర్జనుని చూచినవారెల్లరును చూచినట్టులు ఎన్నివిధముల నిందింప మొదలుపెట్టినను తనదుర్గుణమును మానుకొనఁడు. చివరకు ఇంతటియవమానమయ్యెను గదా! యని సిగ్గునైనను జెందఁడు. ఎట్లనఁగా: వెఱ్ఱిపుచ్చకాయను రాత్రింబవళ్లు తన్నుచున్నను అంతకంతకు బెరుగునే గాని మఱుగదుకదా!

ఆ. లేనికాలమునకు లేనిమనమునొందు
ఈనినపులిరీతి నెఱుఁగకుండు

కఠినబుద్ధి కిందు కలి మెటు కలుగును? వి... 477

దుష్టుని కెప్పటికిని సంకోచభావమే కలుగుచుండును గాని యొక్కనాటికైనను సంపూర్ణముగా సంతుష్టభావము కలుగదు. ఎట్లనఁగా: లేనికాలమునందుతనకులేకపోయెగదాయనిదుఃఖించును. దరిద్రతవలన జనించిన దుర్బలస్థితితోఁ బరులపై కొంటికాలితో దుముకసాగును. ఇతరులపైకి దుముకుటలో ఈనినపులివలెఁ జోరవఁ జేయును. కలిగినకాలములో యుక్తాయుక్తములను కనిపెట్టి మెలఁగఁజాలఁడు. ఇట్టి కఠినాత్మునికి కలిమి కలుగుట యెట్లు? అనఁగా:కలిమిమొదలగునవి దుష్టునిఁ జేరరావు.

ఆ. సంపుకట్టఁ గాంచి పంపు దీర్పఁగవచ్చు
కొండ లన్ని పిండిగొట్టవచ్చు
కలుషచిత్తుమనసు కరిగింప నగునొకో? వి...478

కలుషాత్ముఁడు ద్రోహచింతకలవాఁడు నగు దుర్జనుఁడు ఎన్నియుక్తులను మనస్సమాధానములను వినినను నయమొందఁడు. తాను చేయఁబూనిన ద్రోహమును వీడఁడు. ఆహా! వంచిన వంగని పెళుసుకట్టును కాంచి చక్కగా నైనను దిద్ద వచ్చును. కొండలనన్నిటిని వలసినయెడల పిండిగా దంప వచ్చును కాని కలుషాత్ముని మనస్సు కరిగింపను మాత్రము వల నుపడదు.

ఆ. వల్లకాళ్లు దున్ను వాగు లడ్డమురాఁగ
తుమ్మకంప దుచ్చి త్రోవఁ గట్టు



దండుగైనఁ బెట్టు ధర్మానకోర్వఁడు, వి... 479

లేమియందైనను గాని కలిమియందైనను గాని దుర్జనుని గుణము దుర్మార్గమునే తెలుపుచుండును.దుర్మార్గుఁడు శ్మశానము లన్నియు కాగువంత అడ్డమువచ్చువఱకు దున్ని తన భూమి లోఁ గలుపుకొనుటకు మొదలుపెట్టును. చేనుప్రక్కనుండి, చేనులోనుండి మనుజులు పోకుండుటకై తుమ్మకంపఁ గూడఁ గొట్టును. రాజు చూచి త్రోవ లాక్రమించి కంపఁగొట్టినందు లకు శ్మశానమాక్రమించుకొన్నందులకు దండుగవిధించెనేని జగ డములనాడి ధర్మస్థానముల కెక్కి దండుగలఁ బెట్టునేకాని ధర్మ ముసేయ నొల్లఁడు. ఇట్టివన్నియు దుర్జనలక్షణములు.

ఆ. వాక్కుశుద్ధిలేని వైపగుదండాలు
ప్రేమ కలిగినట్టి పెట్టనేల
నొసల భక్తిఁ జూపు నోరు తోడేలయా? వి.

దుర్జనులు అందఱివలెనే చూచుటకు వినయమును పైకి కను పఱచుచుందురు. అందఱును యుక్తముగా నొకనమస్కార మును పెట్టిన అట్టినీచులు చాటుమాటునదూషించుచు ముందునకు వచ్చినప్పుడు వంకరదండముల ననేకములను పెట్టి ద్రోహము చేయఁ బూనుకొందురు. ఈద్రోహులు ప్రేమ కలిగినట్టులిట్టి దండములను పెట్టుటెందుల కనియెదరా? ఇదియేదుర్జనలక్షణము. నొసలు భక్తినిచూపును. నోరు హింసను జూపును. గావున నిట్టివారిని నమ్మరాదు.

ఆ. వాడ కుటికి లిట్టు వలదన్న మొఱపెట్టు

ముందు మగనిఁ బెట్టి ముసుఁగుపెట్టి
గడుసురాలు మగని గంపతో నమ్మురా, వి. 481

దుర్మార్గులు ఆఁడువారనక మగవారనక పిల్లలనక పెద్దలనక యందఱిలోను నుండెదరు. దుర్మార్గురాలగు భార్యయున్నదనుకొనుఁడు. ఆమె ప్రతిగృహముతిరిగి వాడవాడవారినితిట్టివచ్చును. వలదని చెప్పినను వినక యేడ్వసాగును. ముందు మగనికూర్చుండఁబెట్టుకొని మూలుగుచు ముసుఁగు పెట్టుకొని పరుండును. ఎంతగడుసుది? ఇట్టివారు మగలను గంపలోపెట్టి యమ్మివేయఁగలరు. కావున దుష్టస్త్రీల నమ్మరాదు.

ఆ. వింతచదువుఁ జదువ వివరింపఁగాలేదు
హీనుఁడవగుణంబు మానలేఁడు
బొగ్గు పాలఁ గడుగఁ బోవునా మలినంబు? వి.

దుర్జనుఁడు ఎంతగా కష్టములను పొంది ఎంతెంతవింతలుగల విద్యలనుచదివికొన్నను మంచిచెడ్డలను పరీక్షించి స్వయముగా కనుఁగొనఁజాలఁడు. ఒకవేళ కనుఁగొనెనుపో ఆయవగుణమును మానుకొనఁజాలఁడు. ఎట్లనియందురా? పరికించుఁడు. బొగ్గును పాలతోఁ గడిగిన మాత్రాన దాని మాలిన్యముపోయి తెల్లఁబడగలుగునా? కలుగదుకదా! అట్లే దుష్టుఁడు గూడను.

ఆ. వేముఁ బాలుబోసి వేయేండ్లు పెంచినఁ
జేదు విడచి తీపిఁ జెందదెపుడు
ఓగుగుణము విడిచి యుచితజ్ఞుఁ డగునెట్లు? వి. 483



దుర్మార్గునిచేరఁదీసి యాదరించి మేలు లనేకములను వానికి చేసి వృద్ధినొందించి యున్నను దుష్టుఁడు తనకు సహజమగు చెడ్డగుణమును వదలిపెట్టి యుచితముల నెఱుఁగఁగలుగునా? లేఁడు. ఎట్లనఁగా: చూడుఁడు. వేపచెట్టు ఎంతటి విషవృక్షము? దానికి పాలను బోసి వేయిసంవత్సరములు పెంచినను చేదునువిడిచి తీపినొందఁగలుగునా? లేదుగదా! అట్లే దుర్జనుఁడుగూడను.

ఆ. వేఱుపురుగు చేరి వృక్షంబుఁ జెఱుచును
చీడపురుగు చేరి చెట్టుఁ జెఱుచు
కుచ్చితుండు చేరి గుణవంతుఁ జెఱచును, వి. 484

దుష్టుఁడు సజ్జనులఁజేరినచో చెఱుపుటకే ప్రయత్నించుచుండును. ఇట్లు చేయుట దుష్టులకు ప్రకృతిసిద్ధమగు గుణము. ఎట్లనఁగా: చూడుఁడు. వేఱుపురుగు మొదలు చేరి తానున్న స్థలమనియైన నెంచక చెట్టును కూల్చివైచును. చీడపురుగు చెట్టుపైకెక్కి యాకులన్నిటిని తిని చెట్టును చెఱిచివైచును. ఇట్లులే కుచ్చితుఁడు గూడ గుణవంతునికూడఁ జెఱిచివేయును.

ఆ. శుష్కబుద్ధిచేత శుశ్రూష లొల్లని
నిష్ఠఁబట్టి యేమి నిజమెఱింగె
కష్టమైనవిద్య ఖలునకు నబ్బునా? వి. 485

దుష్టుఁడు విద్యలను చదివికొనినను అందేమియును సారమే లేదని గ్రహించును. గురువులకు శుశ్రూషలను చేయనొల్లఁడు. ఇట్లు చేసి యాదురాత్ముఁ డేమాత్రము నిజము నెఱిఁగెను?

కావున కష్టసాధ్య మగువిద్య దుర్మార్గులకు ఉచితముగా నెన్నటికిని దొరకనేదొరకదు. ఒకవేళ చిక్కినను అయ్యది విపరీత ఫలమునే ఇచ్చుటకు సిద్ధమై యుండును.

ఆ. సజ్జనస్నేహముఁ జాలింపఁగారాదు
ప్రకృతి నెఱుఁగకున్న భక్తిలేదు
పలువ లెట్టిరీతి భక్తి నిల్పుదురయా? వి. 486

బుద్ధిమంతులైన సజ్జను లెప్పటికిని సత్పురుషుల స్నేహములను వదలివేయరాదు. ఎంతగొప్పజ్ఞానులైననుగాని ప్రకృతిని చక్కఁగా నెఱుంగకున్న నుపయోగము లేదు. కావున దుర్జనులవలె చెడిపోవుదురు. దుష్టులు భక్తికలిగియుండిరా? మేము నుభక్తిని వహింపము అనియందురా? అట్లనవలదు. దుర్మార్గులే యైన వారలు భక్తి నెట్టులు నిల్పఁగలుగుదురు?

ఆ. సారవిద్యలందు సరణిఁ దెలియలేక
దూరమందుఁ జేరు దుర్జనుండు
పరముఁ దెలియ నతఁడు భావజ్ఞుఁ డెట్లగు? వి.

సజ్జనదుర్జనులకు చక్కఁగా విచారించినయెడల చాలభేదము బయలుపడును. విద్యలలోని సారములయందు మార్గమును తెలిసికొనలేక దుష్టుఁడు దూరముగా నిలిచి దూషింప మొదలుపెట్టును. పరమేశ్వరుని భావింపలేఁడు. ఇట్టిమూర్ఖుఁడు భావజ్ఞుఁడై సజ్జనుఁడై యుండునా? యుండఁడు.

ఆ. హీననరులతోడ నింతులతోడను
పడుచువారలతోడఁ బ్రభువుతోడఁ



బ్రాజ్ఞజనులతోడఁ బలుకంగరాదయా, వి. 488

పెక్కుమాటనేల? పలుకఁదగనివారలతో నెప్పుడును బలుకకుము. అట్లుగాకవారితోనతిగాఁ బలికితివా? తప్పకచెడిపోయెదవు. అట్టివారలెవ్వరెవ్వరని యందువా? చెప్పెదను వినుము. తక్కువకులపుమనుజులతోను, స్త్రీలతోడను, పడుచుపిల్లలతోను, ప్రభువుగారితోను, విద్వాంసులతోను ఇచ్చవచ్చినట్లు మాటలాడకుము. కావున దుష్టునికి దూరముగా తొలఁగి యుండవలయు.

## సజ్జనపద్ధతి.

అవతారిక. పరోపకారబుద్ధిగలిగి నిత్యము లోకోపకార కార్యములు గావించుచుఁ దాము తరించుచుఁ బరులఁ దరింపఁ జేయువారు సజ్జనులు. అట్టి సజ్జనులవలననే లోకవ్యవహారములు క్రమముగా నడువ వీలుకలుగుచున్నది. దుర్మార్గులదురంతములకుఁ దాము గుఱియై లోకోపకారమునకై ప్రాణత్యాగమునేని చేయుటకు సంసిద్ధులగు సజ్జనుల జీవితము, వారిధర్మము, వారిత్యాగశీలము, నడవడి, ప్రశంసాపాత్రమనియు సర్వశ్రేయములకు సజ్జనత్వమే ప్రధానసాధన మని వేమనయోగీశ్వరుఁడు సజ్జనపద్ధతినిగూర్చి చెప్పుచున్నాఁడు.

ఆ. అచట నిచటఁ జూడఁ దమరఁగా గురుభక్తిఁ
బ్రచురముగను నాత్మ బయలు చేయు
రుచిరముగను సుజనుఁ డచలుఁడై కన్పడు వి.

సుజనుఁడగువాఁడు దుర్జనునివలె చిత్తచలనము కలిగి ఒక దానియందును విశ్వాసహీనుఁడై యటునిటుఁ జూడఁడు. గురువునేర్పఱచికొని యాతనియందు భక్తిగల్గి హృదయకుహరమున నడంగియున్న యాత్మస్వరూపమును బయలు సేయుచుండును. వేలకొలంది యిడుములు తనను జుట్టికొన్నను కొండవలె ఇసుమంతయును చలింపక ధైర్యయుక్తుఁడై యొప్పుచుండును.

ఆ. అంటి యంటకుండు నమలుని తెలుఁగున
మింటిమంటినడుమ మెలఁగుదాని
నొంటిస్తంభమందు నంటించి చూచును, వి. 490

యుక్తాయుక్తజ్ఞానమును మంచిసెబ్బరలను తెలిసినవాఁడగుటచేత పరమాత్మునిబోలి విషయములయం దంటియు నంటకయు నుండును. భూమ్యాకాశములనిండి నిబిడీకృతమై వర్షాకాలము మెఱుపువలెఁ దళతళ మెఱయుచుండు తత్త్వస్వరూపమును తనశరీరమునం దనుసంధానము చేసి సదా ధ్యానము సేయుచు ఏకాగ్రదృష్టియను స్తంభము నెక్కి కనుఁగొనసాగును. ఇట్టి తత్త్వవేత్తయే సజ్జనుఁడు.

ఆ. అండ దప్పిన నరుఁ డతిధార్మికునియిల్లు
చేరవలయు బ్రదుకఁ జేయు నతఁడు
ఆవిభీషణునకు నతిగౌరవం బీఁడె?
భూతలమున రామమూర్తి వేమ. 491

లోకములో నందఱికంటెను మిగుల ధర్మాత్ములు సజ్జనులు ఎవ్వరైనను తనకు దైవవశమున నేవేని యాపదలు వచ్చి



యండ తప్పి యల్లాడుచున్న డిట్టి ధర్మస్వరూపులదరిఁ జేరవలయును. ఇట్టిసజ్జనులు దుర్జనులఁ బోలి తమయందను చేరిన వారిని కష్టములపాలు కానీయక బ్రదుకఁజేయుదురు. ఎట్లని యందురా! చూడుఁడు. మున్ను విభీషణుఁడు రాముని శరణు సొచ్చి అతిగౌరవము నొందెను.

ఆ. అడుగడుగునఁ జిత్రమఖిలవస్తువులను
భోగభాగ్యములను బొలుపు మిగులఁ
దానె తిరుగుచుండుఁ దనతోడునీడయై, వి...

మానవజీవితమె మిగులవిచిత్రముగానుండును. అంతకంటె దైవచర్యలు మిగులఁ జిత్రతరములుగాఁ గానుపించును. ప్రత్యంశమున దైవలీలలు చిత్రములనుటకు దృష్టాంతములు పెక్కుగలవు. సృష్టిలోని సమస్తజీవరాసులుగూడ భగవంతుని తేజముచే నిబిడీభూతములైయుండును. భగవంతుఁడంతటితోఁ దృప్తినొందక యాయావస్తువులలోఁ దోడునీడవలెఁ దానును నివాసముచేయుచుండును. సర్వనియంతయగు దేవుఁడు సైతమిటుల మెలఁగుట చిత్రముగాదా!

ఆ. అంతరంగ మెఱుఁగ హరుఁ డౌను గురుఁడౌను
నంతరంగ మెఱుఁగ నార్యుఁ డగును
నంతరంగ మెఱిఁగినతఁడెపో శివయోగి, వి...

సత్పురుషుఁడగువాఁడు తనయంతరము నెదుటివానియంతరము నెఱుంగవలయును. అంతరంగము నెఱిఁగిన సాక్షాదీశ్వరుఁడు కాఁగలఁడు. అట్టివాఁడే సజ్జనుఁడగును. ఎవ్వఁడు అంత

రంగము నెఱుఁగఁజాలునో వాఁడే శివయోగి యగును గాని యితరుఁడు కాఁజాలఁడు.

తే. అంతరాత్మను గుర్తించి యాశ లుడిగి
చింతలను ద్రొక్కి మదియందు సిద్ధుఁ డగును
వింతలను జూచి బ్రమయఁడు వెఱ్ఱివలెను
సందుగొందులఁ బూర్ణత నందు వేమ. 494

మోక్షార్థియగుజనుఁడు కేవల మైహికపాశంబులలోఁ దగులుకొనక పరమార్థముకొఱకుఁ బాటుపడఁదగిన తెరువులుకడుం గడుఁగలవు. అందొకమార్గము అంతర్గతమై జ్ఞానదృష్టికిఁ గానవచ్చు ఆత్మను యోగాదిసాధనములచేఁ గనుఁగొని కుటుంబసంబంధములగు నాశల దిగఁద్రావి విచారమును వదలి సిద్ధసంకల్పుఁడు (సిద్ధుఁడు) అగుటకు జ్ఞాని ముందుఁ బ్రయత్నింపవలెను. వెఱ్ఱివానివలె నుండి ప్రపంచచిత్రములకు దూరముగనుండవలెను. ఇట్లువర్తించినచో కైవల్యమును (పూర్ణతను) సాధింపఁగలఁడు.

తే. అంతరాత్మానుభవ మంది యార్యమతిని
సంతతార్చన మది నిష్ఠ సలుపఁ గోరి
వంతు కెక్కినవాఁడె పో వరుఁ డనంగ
వాని కెవ్వఁడు సరి గాఁడు గాన వేమ. 495

మానవుఁడు చతుర్విధపురుషార్థములలోని మొదటిమూఁటి యందె దృష్టినుంచిన ఫలములేదు. నాలుగవదియగు స్వర్గేచ్ఛ యందె సంకల్పము పదిలపఱుపవలెను. అట్లుచేయఁగలవాఁడె



సజ్జనుఁడు. సజ్జనుఁడగువాఁడు అంతరాత్మానుభవము నొంది పూజ్యబుద్ధితో నెల్లప్పుడును పూజలను సలుపుచు మనంబులో నిష్ఠల నాచరించుచు వంతు కెక్కవలయును. అట్టివాఁడే శ్రేష్ఠుఁడు. అట్టివానితో నెవ్వరును సరిరారు.

తే. అతులవైరాగ్యబోధోపరతుల నెఱిఁగి
సతులవలపునఁ జిక్కక సత్య మెఱిఁగి
మతిని జెదరక పట్టుట మాన్యరీతి
యిద్ది కుదిరినసజ్జనుఁ డిలను వేమ. 496

సజ్జనుఁడు దుర్మార్గులవలె దంభమునకు గాక నిరుపమానమగు వైరాగ్యబోధలను చక్కఁగా తెలిసికొనును. స్త్రీలవలపులలోఁబడి మోసపోఁడు. యథార్థమును కనుఁగొనును. మనస్సును భ్రమింపఁజేయు విషయముల నేమఱఁడు. ఈరీతిగా మెలఁగుట పూజ్యులకు లక్షణము. ఇట్టిరీతి కుదిరిన వాఁడే సజ్జనుఁ డనఁబడును.

ఆ. అధిహిత మగునట్టు లాడినమాటకు
సంతసింతు రెల్ల సత్పురుషులు
అధికభాషణంబు లాయాసదంబులు, వి.... 497

ఎదుటివానికి సంతసము కలుగునని లేనిపోని కల్లమాటలకు ముఖస్తుతులకు సత్పురుషులు సంతసింపరు; కాని హితవుగా పథ్యముగా తనకు నెదుటివారికి మంచికొఱకుఁ బలికినపలుకులకు సత్పురుషు లెల్లరును సంతసింతురు. ఇదియె సజ్జనలక్షణము.

అధికప్రసంగసంభాషణములు మిక్కిలి ఆయాసమును కలిగించును. కాన సజ్జనుఁ డతిప్రసంగి కారాదు.

ఆ. అనల మించుకైనఁ గనలి మండును గాని
చనువుగాని యెఱుక మనికి విడదు
తనువు మఱచువాఁడె తత్త్వజ్ఞుఁ డగుసుమీ, వి.

తత్త్వవేత్తలు జనులలో మిగుల గౌరవపాత్రులు. వారె మోక్షమును సాధింపనర్హులు. అట్టి మోక్షవేత్తలు ప్రపంచము నంటియంటనటుల వర్తించుచుందురా! మేమందరమటుల వర్తించుట లేదాయందురేమో! అగ్నికణము తృణాదుల సంపర్కము నొందనేని రాఁజిరాఁజిమండును. పరమాత్మానుభవము లేనివాని జ్ఞానము ఏనాఁటికేని హృదయగతము గాని బహిర్గతము కాఁజాలదు. తనదేహమును దాను మఱచి భగవంతుని గుణాదికములో హృదయము లీనమొనరించినవాఁడు తత్త్వవేత్త. ఈపహాస్యమెఱింగినచో మూఢుఁడు తాను సజ్జనులతో సముఁడనని చెప్పకొనఁడు.

ఆ. అనువు గానిచోట నధికుల మనరాదు
కొంచె ముండుటల్లఁ గొదువ కాదు
కొండ యద్దమందుఁ గొంచెమై యుండదా? వి.

కొందఱు బుద్ధిహీనులై తమశక్తి ఎదుటిశక్తి తెలిసికొనక యుక్తాయుక్తముల నెఱుంగక మెలంగెదరు. సజ్జనులైన వారట్టులు చేయరాదు. అనువుగానిచోట నధికులమని బిగియఁగారాదు. తగ్గియున్నంతమాత్రమున నగౌరవమురాదు. ఎట్లనఁగా: కొండ యద్దములో కొంచెముగా నుండదా?



ఆ. అన్యులకును వచ్చు నాపదఁ దనదిగా
నెన్నువాఁడు భువిని నున్నవాఁడు
ఎన్ని దానిలోని యిహపరంబుల లెస్స
గన్నవాఁడు మిగుల ఘనుఁడు వేమ. 500

లోకములో జన్మించినవారిలో నెవ్వరికి సజ్జనరీతిలేదో వారు బ్రతికినను చచ్చినవారితో సమానము. ఇతరులకు వచ్చెడియాపదనుగూడ తనదానినిగా తలఁచుకొనెడివాఁ డొక్కఁడే భూలోకమున నున్నవాఁడనఁదగును. ఈరీతిగా నిత్యానిత్య విచారమును చేసి ఇహపరములను సజ్జనుఁ డగువాఁడు సాధింపవలయును.

ఆ. అమలమైన పలుకు లభిషేకవారిధి
తనువు దేవళంబు తాల్మి నొంది
యాత్మ శివునిఁ జేర్చు నాతఁడే శివయోగి, వి...

నిష్కపటములగు సంభాషణములు మున్నగునవి యలవడు సజ్జనులు తీర్థయాత్రకొఱకు వేఱుగా తిరుగ నక్కఱయే లేదు. లింగాభిషేకమునకు సముద్రాదులనుండి పవిత్రోదకముఁ దేఁబనిలేదు. దేవళములు గోపురములు గట్టి దేవప్రతిష్ఠచేయ నవసరములేదు. సజ్జనునిమాటలే యీశ్వరునకుఁ బుణ్యోదకాభిషేకమువంటివి. ఉత్తములమేనులే దేవునకు మందిరమువంటివి. హృదయము నేకాగ్ర మొనరించి శివుని దర్శించుటయే యోగ

ము. ఇట్టి యుత్తమయోగులే శివయోగులు. ఇట్టి సజ్జనులు ముక్తినొంద నర్హులు.

ఆ. అలలు లేనిజలధివలె నుండి మదిలోనఁ
దెలివిగూడి తన్ను దెలియునతఁడె
తలఁప సజ్జనుఁ డన ధరఁ జెప్పఁబడునయా, వి...

రూపము సజ్జనదుర్జనులకు సమానముగానే యుండినను ప్రవర్తనములో మిగుల భేదము గలుగుచుండును. సజ్జనుఁడగు వాఁడు ఇతరుని బోలి దంభకృత్యములను చేయక తరంగములు లేనిసముద్రమువలె నిశ్చలుఁడై తెలివిగలిగి యాత్మసాక్షాత్కారమును జేయుచుండును. విచారించితి మేని ఇట్టివాఁడే సజ్జనుఁడు అనఁబడును.

ఆ. అల్పుఁ డెన్ని పలుకు లలయక పల్కిన
నధికుఁ డూరకుండు నదిరిపడక
కంచుమ్రోఁగునట్లు కనకంబు మ్రోఁగునా? వి.

సత్పురుషులకు నసత్పురుషులకు ప్రవర్తనములో మిక్కిలి భేదముగలదు. నీచుఁడగువాఁడు తన్ను ఎన్నిమాటలను నిష్ఠురములుగాఁ బలుకుచున్నను సజ్జనుఁడు అధికుఁడు గావున ఉలికిపడక మాఱుమాటాడక అన్నిటిని శాంతభావముతో విని సహించును. ఇయ్యది యుక్తమే. ఎట్లనఁగాఁ కంచు మ్రోఁగునట్టులు కనకము మ్రోఁగదుగదా. ఇట్టే సజ్జనులుంగూడను.

ఆ. అనుపినాశమైన నానందసుఖకేళి
సత్యనిష్ఠపరుని సంతరించు



సత్యనిష్ఠఁ జూడ సజ్జనభావంబు, వి... 504

అసజ్జనుఁడు అసత్యములు పల్కియైనను శరీరపోషణమును గావించి సుఖింపఁబూనుకొనును. సజ్జనుఁడైననో ప్రాణములు నశించినను పిమ్మట పరమాత్మధర్మమువలనఁగలిగెడి సుఖక్రీడ నాశించి యసత్యములు పలుకఁడు. అసత్యనిష్ఠయే యతని దరింపఁజేయును. కావున 'సత్యమునే చెప్పవలయును.' అను నిశ్చలమైన ప్రతిజ్ఞయే యుండుట సజ్జనులకు గుర్తు అగును.

ఆ. ఆత్మ నున్నవాని ననుదినంబును జూచి
యతనిమహిమవలన నతనుఁ దెలియు
నతఁడు సజ్జనుండు నవనీతలంబున, విశ్వ... 505

సజ్జనుఁడని పేరుపెట్టుకొన్నంతమాత్రాన సజ్జనుఁ డెన్నఁటికిని గాఁజాలఁడు. బాహ్యములగు వేషములను వేసి దంభము చేయక తనయాత్మలోని దైవరూపమును ప్రతిదినమును ధ్యానించుచు ఆధ్యానమువలన శరీరాదులు లేని యమలుఁ డగునీశ్వరుని ఎవఁడు కనుఁగొనఁజాలునో వాఁడే సజ్జనుఁడు.

ఆ. ఆత్మశుద్ధి గలిగి యధికుల మనఁబోరు
ధీరవృత్తి గలిగి తిరుగఁబోరు
రూపు కుదురనుంచి రూఢి గావింతురు, వి...506

మఱియును సజ్జనదుర్జనుల కెంతో భేదము గలదు. సజ్జనులగువారు ఇతరులఁ బోలియుండరు. వీరు ఆత్మశుద్ధిగలవారలై యందఱికన్నఁ దామె యధికులమని చెప్పికొనరు. మేమేపండితోత్తములము, మాకంటె గొప్పవారు లేరని వెన్నువిఱిచి

గరువముతో ధైర్యముగ వీరు మెలఁగరు. మఱియును పరమేశ్వరుని విగ్రహమును మనములో నిల్పికొని తన్మయు లయ్యెదరు. కాననే వీరు సజ్జనులు.

ఆ. ఆదిశక్తి గూడి యనుభవ మొందును
వేదవిద్య మరగి విడువఁబోఁడు
సాధువృత్తి నిలను స్థైర్యము నొందును, వి...

దుర్జనులగువారు ఎవ్వని విశ్వసింపక స్వయముగా తమ కనుభవము లేక యుందురు. ఇఁక సజ్జనుఁడగువాఁడన్నో పరాశక్తి సాక్షాత్కారము నొందును. ఉపనిషత్స్వరూపమును గుర్తించి మఱవఁడు. ఎల్లప్పుడును సాధువృత్తితో చిత్తస్థైర్యము నొందియుండును.

ఆ. ఆర్యులైనవార లనుభవరూఢిని
దెలియఁ జెప్పుమంత్రు తేటపడఁగ
గుఱుతుఁగననివాఁడు గుఱి యెప్పఁ జెప్పునా? వి.

సజ్జనదుర్జనులను సులభముగా గ్రహింపవచ్చును. ఎట్లనఁగా సజ్జనులు చక్కగా బ్రహ్మపదార్థమును పరికించి అనుభవించి ఆయనుభవమువలన చక్కగా తెలిసిన ఇతరులకు చెప్పెదరు. ఇఁక దుర్జనులో అజ్ఞులు. వివేకశూన్యులగు మందమతులు నగు నజ్ఞులు తాము బ్రహ్మపదార్థము నెఱింగినవానివలె నుపన్యసింపఁబోదురు గాని స్వానుభవము లేకపోవుటచే వారుచెప్పునది యాకసనందదు పోకను బొందదు. గుఱుతు కనుంగొన్నవాఁడు గుఱిచెప్పఁగలఁడు గాని తదితరుఁడు చెప్పలేఁడు



గదా! కాన సజ్జులను విజ్ఞులను వారిబోధనమువలననే గ్రహించి విజ్ఞుల ననుసరింపవలెను.

ఆ. ఆడితప్పువార లభిమానహీనులు
గోడెఱుఁగనివారు కొద్దివారు
కూడి కీడుసేయఁ గ్రూరుండు దలపోయు, వి...

కంటికి కనిపించినవారిని తీయగా మాటలాడువారిని మొదలగునందఱని సజ్జనులని తలంపఁబోకుము. కొందఱు అభిమానమును బొత్తిగా వదలివైచి స్వార్థపరులై మిక్కిలి బొంకుచుందురు. మఱియు సత్యాసత్యములను యుక్తాయుక్తము నెఱుంగనివారునై యుందురు. అట్టివారలు క్రూరులని నిశ్చయింపుము. క్రూరుఁ డెప్పుడును కీడుసేయనే కోరుచుండును గాని సజ్జనుని బోలి మేలు సేయఁ గోరఁడు.

ఆ. ఇల్లు కొల్లఁజేయ రిహపరములఁ జూచి
దీనవృత్తిచేతఁ దిరుగుచుంద్రు
భక్తి కలిగియుండి ప్రాజ్ఞులౌ సజ్జనుల్, వి...510

సజ్జనుల నేర్పరించుట కనేకములగు మార్గములు గలవు. సజ్జనులగువారలు ఇహపరముల సమానవిశ్వాసము గలవారై గృహస్థాశ్రమమునుండి ధర్మాధికములు నెఱవేర్చుచు పరమునకుఁ గూడ గృహస్థాశ్రమమె సాధనమని తలంచుచుందురు. గాని పురాణవైరాగ్యములకు లోనై కొంపలు చూఱవిడువరు. మాకేమని యహంకారముతో మెలఁగక దీనులై సంచరింతురు. ఇట్టి

నడవడిగల యుత్తములే భక్తులును సజ్జనులు నగుదురు గాని యితరులు కారని గ్రహింపవలయును.

తే. ఉక్కుఁకత్తిని చేఁబూని యున్నవాఁడు
కుక్కనక్కలు బెదరింపఁ గొంకువడఁడు
దృక్కుదృశ్యంబులను మించఁ దెలియుచుండుఁ
జక్కఁగా నొప్పుమనమున జరుగు వేమ! 511

సత్పురుషుఁడు ఇతరులఁబోలె నైహికసుఖములనుమాత్రమే నమ్మియుండక ఆత్మానాత్మవిచారణము చేసి బ్రహ్మపదార్థమును గమనించి మించియుండును? వాడి యగు నుక్కుకత్తిని చేతఁబూని యుండువాఁడు కుక్కనక్కల బెదరింపులకు సందేహించునా? అటులే దృగ్దృశ్య వివేకముగలవాఁడు సంసారక్లేశములకు భయపడ సాగునా?

ఆ. ఋషులు గానిపింత్రు హీనులయట్టుల
వారిబోధ పెద్దమేరువంత
లోన నున్న యట్టి జ్ఞానంబు మహిమరా, వి....

ఋషులు ఆకారముచేత చూచుటకు నీచజాతివారిని పోలియున్నట్లు కనుపడుచుందురు, కాని వారుపదేశించుబోధ పెద్దమేరువుఁ బోలియుండును. ఇట్లు వీరుండుటకుఁ గారణము వారార్జించి పదిలము చేసికొనిన లోని జ్ఞానపుమహిమయే కాని వేఱుగాదు. ఇట్టులే సజ్జనుల మార్గముకూడ నుండును.

ఆ. ఎండచీఁకటులకు నిమ్మయియుండెడు
నిండుకుండలోన నిద్రమఱచి



దండిగాను బరమతత్త్వంబుఁ దెలియును, వి...

సత్పురుషుఁ డితరునియట్టులు సంపదాపదలకు సంతోషదుఃఖముల నొందఁడు. వానికి సుఖదుఃఖములు సమానములు. ఎండకును చీఁకటికిని సరిగా ఒకేరీతిగా నిమ్మయి యుండును. జ్ఞానపరిపూర్ణుఁడై కుండవలె నస్థిరమైన యీపాంచభౌతికమగు దేహము నాశ్రయించి అజ్ఞానమను నిద్రకు లోనుగాక మిగుల జాగరూకుఁడై వర్తించుచుండును. మఱియును అవిరతముగా ధ్యానము నొనర్చుచు వలయునట్టులు పరతత్త్వంబు నుపాసనముఁ జేసి తత్త్వము గాంచును.

ఆ. ఏకమైనవర్ణ మెఱిఁగినయోగికిఁ
బరము నెఱిఁగి చూడ భావ మొందు
నాకృతులను జేరి యన్నిఁటఁ దానౌను, వి...514

పరమాత్మ అన్నివస్తువులయందును ఒకేరూపుగా ప్రవర్తించుచున్నదనియుఁ, గులభేదమును బెట్టుకొనుటమాని మనుష్యజాతి యంతయు నొకటియే గాన సమబుద్ధితో మానవులయెడ వర్తింపవలెననియు తెలిసినయోగి పరము నెఱుఁగఁగలఁడు. దుఃఖాభావమునందు చొనుపఁగలఁడు. పిమ్మట సదాధ్యానము చేయుటచేత తానే ఆ బ్రహ్మపు ఆకృతిని దాల్చి సర్వమయుఁ డగును. అట్టియుత్తముల యాత్మదివ్యత్వమును గడించి మహాకాశము ఘటముల యందలి జలములోఁ బ్రతిబింబించినటులఁ బ్రతిబింబించుచు నన్నింటను దానై వర్తించి యంత్యమునఁ బరమాత్మతో నైక్యమొందును. ఇట్లగుట సజ్జనులయెడలను మాత్రమే.

ఆ. ఒకటిక్రింద నొక్క టొగి గుణకముఁ బెట్టి
సరగున గుణియింప వరుసఁ బెరుఁగు
నట్టిరీతి గుణులు నరయ సజ్జను లిల, వి... 515

సజ్జనదుర్జనులలో గలభేదమును చూచుఁడు. సజ్జనునకును దుర్జనునకును గుణములు సమానముగా నీయఁబడినను, సజ్జనుఁడగువాఁడు ప్రతిదినమునను అంకెల నెచ్చవేసి పెంచునట్లు తన సద్గుణముల నభివృద్ధి నేయఁబూనుకొనునే కాని దుష్టునిఁ బోలి తగ్గించుకొనఁ బ్రయత్నింపఁడు. ఇట్టివారలే విచారించిన సజ్జను లనఁబడుదురు.

ఆ. ఒక్కమనసుతోడ నున్నది సకలము
తిక్కఁబట్టి నరులు తిరుగుచుండు
రిక్క యెఱిఁగి నడవ నొక్కఁడె చాలఁడా? వి...

దుర్జనులు పరపీడఁ గావించుచు మోక్షరహస్యము గ్రహింప లేకుందురు. సజ్జను లట్లుగాక యెల్లపుడు పరమార్థచింతనము లతోఁ గాలము గడుపుదురు. జనులు భ్రాంతినొంది పెక్కు త్రోవలఁ బట్టి భ్రష్టులగుచుందురు గాని మనసును గుదురుపఱచినఁ జాలును. మోక్షము కరగతమగును. తీర్థక్షేత్రములలో నేమియు లేదు. సర్వము మనస్సునిలుకడ జేయుటలో నున్నది. త్రోవ నెఱిఁగినచో గమ్యస్థానము చేర నొకఁడు చాలఁడా! అట్లె మోక్షసాధనమునకు మనస్సునిలుకడ యొకటి చాలదా? ఇట్టిమనో నిశ్చలతగలవాఁడె సజ్జనుఁడు.

ఆ. ఓగుబుద్ధి విడిచి యోగి గావలెఁ జివిా



భోగ మమరు యుక్తిఁ బూనరాదు
సద్గుణంబు మొదలఁ జవి గాని చూడరా, వి...

మనుజుఁడై పుట్టినందులకు ఫలమేమి యనఁగా.—చెడ్డసంకల్పములను బోనాడి సజ్జనుఁడు కావలయునే కాని లోకుల మోసము చేయుటక్కరితనమును బూనక యుండుటయే. ఈని యతి గృహస్థులగు సజ్జనులకువలెనన్యాసులకు నాచరణీయము. యోగి...దగువాఁడు చెడుతలంపు మానవలయును. సాంసార సుఖములకు సంబంధించిన యుపాయముల నాలోచింపఁదగదు. మంచి గుణములు మొదటినుండి రావలయునుగాన సజ్జనుఁడీ యభ్యాసములు ముందే చేయవలెను.

తే. ఓర్పు లేనట్టివారల కోరులయశము
విన్నకొలఁదిని బెంపొందు వెఱ్ఱితెవులు
దానిపరిహారమునకు నై మానవుండు
తమఘనంబును జాటింత్రు ధరణి వేమ. 518

సజ్జను లగువారు లోకమున నుపకారము చేయుచుండు నటుల దుర్జనులు లోకమున కపకారము చేయుటకు కారణము లేకపోలేదు. వీరికి ఓర్పు చాలతక్కువ, ఇట్లుండుటవలన నితరుల కీర్తిని విని సహింపఁజాలక వెఱ్ఱియెత్తుదురు. ఇట్లు పట్టిన పిచ్చను మాన్పుటకై దుర్మార్గుఁడు తనఘనమును చాటుకొనుచు లోకుల కపకృతిని సలుపుచుండును.

ఆ. ఓర్పు లేనిభార్య యున్న ఫలంబేమి
బుద్ధి లేనిబిడ్డ పుట్టి యేమి

సద్గుణంబు లేనిచదు వది యేలరా? విశ్వ...519

ఇతరులకలిమిఁ జూచి యోర్చియుండుట సజ్జనులకున్నలక్షణములలో నొక్కటి. ఈయోర్పుండిననే జన్మసాఫల్యము గలదు, లేకున్న లేదు. ఎట్లనఁగా:లోకమున నెంతగుణవతియైనను నోర్పు లేకున్న నాభార్యచే నేమిప్రయోజనముకలదు? ఇట్లేపుత్రుఁడు పుట్టినబుద్ధిమంతుఁడైననే ఫలము, లేకున్న లేదు. ఇట్టులే చదు వెంతయున్నను సద్గుణంబు లేకున్న నిష్ఫలము.

ఆ. కంటిదృష్టిచేతఁ గను విశ్వ మెల్లను
దర్పణంబు గల్గఁ దన్ను గనును
నాత్మతత్త్వమార్గ మారీతిఁ గనవలె, వి. 520

దుర్జనుఁడు స్వోదరపోషణముతోఁ దృప్తినొంది కాలము గడుపుచుండును. సజ్జనుఁ డెప్పుడునటులఁ జేయఁడు. తనకనులతోఁ బ్రపంచమునంతయు సవిమర్శముగఁ జూచి మంచిచెడుగుల గ్రహింపఁగలఁడు. అద్దములోఁ దన్నుఁ దాఁ జూచుకొనుట యెంతసులభమో సజ్జనునకు విశ్వవిమర్శము అంత సులభము. అంతతో నూఱకుండక సజ్జనుఁడు ప్రతిబింబము నద్దములోఁ జూచుకొన్నటుల తత్త్వమార్గము (మోక్షపథమును) గూడఁ దెలిసికొనఁ బ్రయత్నింపవలయును. ఇదియే సజ్జనధర్మము.

ఆ. కంటిలోన మిన్ను కలయిక నగుముక్తి
నంటి తిరుగువాఁడె యమలుఁ డగును
వంటకంబుకొఱకు వాగ్ధాటిఁ జూపఁడు, వి...521

లేనిపోనిదంభములు దుర్జనులఁ బోలిచేసినవాఁడు ఎప్పటికిని



ముక్తుఁడు కాఁజాలఁడు. కంటిలో నెల్లప్పుడును మెలఁగు పరమాత్మరూపమును గుర్తించి విడువక ధ్యానించువాఁడె ముక్తుఁడగును. ఇట్లగుటయే సజ్జనలక్షణము. సజ్జనుఁడగువాఁ డిట్లుకాకయుండఁడు. ఎట్లనియందురా? సత్పురుషుఁడు భోజనముకొఱకై దంభము చేయఁడు.

ఆ. కంటిలోనివాని గఱకంఠు నెఱుఁగుము
కంటిలోనివాని మింటఁ జూడు
కన్ను మిన్ను హృదయకమలమం దెఱుఁగుము, వి.

బుద్ధిమంతుఁడా! సజ్జనుఁడవై త్రుళ్లిపడక ముక్తుఁడవగుటకు యత్నింపుము. కంటిలో నున్న పరమాత్మరూపమును ధ్యానింపుము. ఆపరమాత్మను భ్రూమధ్యమున నిల్పి హృదయకమలమున నాతనిగుర్తించి ముక్తుండవు కమ్ము.

ఆ. కడఁగి గాలిలేని గగనంబుభంగిని
బలుతఱగలు లేనిజలధిమాడ్కి
నిర్వికారమునను నిశ్చలుఁడై యుండు, వి....523

సమాధిగతుఁడగుసాధకుఁడు గాలిమేఘములులేక ఆకాశము నిర్మలముగా నున్నయట్లు అలలు లేనిసముద్రమును బోలి నిర్వికారులై నిశ్చలులై మెలఁగుచుందురు. ఇట్టివారు సాధకులు.

ఆ. కడుపుచిచ్చుచేత కామానలముచేత
క్రోధవహ్నిచేతఁ గుతిలపడక
యుక్తమనసుతోడ నుండును సుజనుఁడు, వి.524

సజ్జనుఁడగువాఁ డితరునిబోలి తుచ్ఛసుఖములకై నిర్మలము

లగు పరలోకపదవులను పోఁగొట్టుకొనఁడు. ఆఁకలిచేతను, కామముచేతను, కోపముచేతను కుటిలుఁడై ఎప్పుడు నుండక తగినట్లు మంచిమనస్సుతో నిర్మలుండై మెలంగును.

ఆ. ఏడుపు కేల మీరు కళవళపడెదరు
కడుపుచల్లనడఁగఁ గలదు భుక్తి
కడకు రాతిలోనికప్పకు లేదొకో! విశ్వ... 525

బుద్ధిమంతులారా! పొట్టకై మీరెప్పుడు దుర్మార్గపు పనుల చేయఁబూనుకొనకుఁడు. అయ్యో! తెలివితక్కువవారలారా! కడుపుకై ఏల యిట్లు కళవళము నొందవలెను? ఏమియును అధైర్యమునొందకుఁడు. కడుపు చల్లఁబడుటకు దేవుఁడే యాహారమును కూర్చియున్నాఁడు. ఇంతయేల? చివరకు రాతిలోనుండు కప్పకుఁ గూడ నాహార మిడలేదా?

ఆ. కనులు పోవువాఁడు కాళ్లు పోయినవాఁడు
ఉభయు లరయఁ గూడి యుండినట్లు
పేదపేదఁ గూడి పెనఁగొని యుండును, వి...

సజ్జనగుణములలో నైకమత్యము కూడ నొక్కటియై యున్నది. దుర్మార్గులగు ధనవంతులు మాత్రమే ఐకమత్యహీనులై యుందురు. ఇఁక సత్పురుషులో అట్లుకాదు:—ఏలయందురా? చూడుఁడు. కన్నులులేనివాఁడు కాళ్లులేనివాఁడు పరస్పరసహాయమున తరించినట్టులే పేదలగు సజ్జనులైకమత్యముతో పరస్పరసహాయులై తరించెదరు.



ఆ. కప్పనీడి మనసు కాంతింప దెద్దియు
జ్ఞానతపము నూని కదలకుండు
మెచ్చునాత్మక్రమము మిన్నంటి యుండును, వి.

మనస్సు "రాతుమెత్తనయిన గుఱ్ఱము మూఁడుకాళ్లనడుచు" నన్నట్లు వారివారియోగ్యత ననుసరించి ప్రవర్తించుచుండును. చూడుఁడు. సత్పురుషునిమనస్సు మాంద్యమునువదలి విషయముల నాసింపక జ్ఞానతపముఁ జేయుచు కదలకయుండును. అద్దానిచేత నాత్మవిద్యాభ్యాసము కలుగును.

ఆ. కామమోహములను గలిగియుండు నరుండు
ఇష్టదేవగురుల నెఱుఁగలేఁడు
ఇష్టు నెఱుఁగునతఁడె ఇలసజ్జనుం డగు, వి...

దుర్జనుఁ డగువాఁడు సజ్జనునిబోలి మెలఁగఁ జాలఁడు. కామమును మోహమును కలిగియుండును. ఈ యజ్ఞానముచేత హితులను గురువులను దేవులను గుర్తింపఁజాలఁడు. అందువలన నధఃపాతి యగును. కావున నెవ్వఁడు హితు నహితు నెఱింగి మెలఁగఁగలఁడో వాఁడే సజ్జనుఁడు.

క. కాలము తెలియక చాలఁగ
కాలము గల దంచు నున్నకాలమునందున్
కూళఁడు తనుఁ దాఁ దెలియఁడు
కూలెడు తొలిజామునందు గొబ్బున వేమా! 529

బుద్ధిహీనుఁడు తాను బ్రదికియున్నకాలమున సత్కార్యములను చేయక చాలకాలము ముందున్నది లెమ్మని తలంచుచు

కాలమునంతయు దుశ్చింతలతోడ వెళ్లఁబుచ్చి తన్ను తాను తెలిసికొనఁజాలక చివర నందఱికంటె ముందుగా నరకమునఁగూలును. కాన సజ్జనుఁడు ధర్మములఁ జేయుటలో నాలసింపఁదగదు.

ఆ. కాలునికిని జిక్కి కక్కసపడనేల
మేలుగాను గురుని మెప్పు వడసి
ప్రాలుమాలకుండ పరమార్థ మందుము, వి....

నరులారా! బ్రతికియున్నంతకాలమును దుష్టపనుల చేసి పాపములనొడిఁగట్టి చివర బుద్ధిపూర్వకముగా యమునివాతఁబడి ఏల కష్టము నొందెదరు? బ్రదికినంతలో నందఱికి హితకారులగుపనులఁ జేసి గురువుల యనుగ్రహమును సంపాదించివుని ప్రాలుమాలక పరమార్థము నొందుటకై యత్నించుఁడు.

ఆ. కూళ కూళ మెచ్చు గుణవంతు చెడనాడు
నట్టిహీను మెచ్చ రెట్టివారు
మ్రానిదూలమునకు జ్ఞానంబు దెలియునా? వి...

దుర్జనుఁడు దుర్జనునే మెచ్చుకొనును కాని గుణవంతుఁడగు సజ్జనుని మెచ్చుకొనఁడు. ఇట్టి నీచుని ప్రపంచములో నెవ్వరును మెచ్చుకొనరు. ఏల యని యందురా? మొద్దుదూలమునకు జ్ఞానము లేనట్లే యాదుర్జనునికి మంచిలేదు. కాన మెచ్చికొనరు. కావున సజ్జనుఁడవై యుండుము.

ఆ. కూళతొత్తుపొందు కుజనునకే కాక
సజ్జనునకుఁ గాదు సమ్మతంబు



వేడఁ దిన్న పురుగు బెల్ల మే మెఱుఁగును? వి...

దుర్మార్గునితో స్నేహము చేయఁదగి యుండుట దుర్మార్గునకే తగియుండును గాని సజ్జనునకు ఇష్టము కాదు. ఏల యని యందురా? ఒకవేళ దుర్జనుఁడు సజ్జనునితో చెలిమి చేసినను వానిమంచిగుణములను గుర్తింప లేఁడు. ఎట్లనియందురా? పేఁడ తిను పురుగునకు బెల్లపురుచి తెలియునా? తెలియదు గదా? అట్టులే.

ఆ. కూర యుడుకు వెనుకఁ గూడునా కసవేర
నెఱుకగల్గి మునుపె యేరవలయు
స్థలము తప్పు వెనుక ధర్మంబు పుట్టునా? వి...

ఎప్పుడో సత్పురుషుఁడ నయ్యెదనని బ్రదికియున్నకాలము వ్యర్థపుచ్చరాదు. ఏమందురా? సమయము దప్పినవెనుక సద్గుణములు పట్టుపడవు. ఎట్లనఁగా:—(సాధారణముగా ఆకుకూర నంటి గడ్డియుండును. దానిని కూరవండక ముందుదీయుటయే సులభ సాధ్యము.) కూర యుడికినతరువాత గడ్డనేఱుటకు వీలుపడునా? పడదు. కావున గడ్డి తీయవలయుననినచో ముందుగానే యేరవలయును. అట్టులే సద్గుణములు సత్కార్యములు కూడనని భావము.

ఆ. కోటిదాన మిచ్చి కోపంబు నొందుచోఁ
బాటిసేయ రతనిఁ బ్రజలు మెచ్చి
సాత్త్వికగుణముల సజ్జనుం డగు నయా, వి...

నీవు సజ్జనుఁడవు కాఁదలంచితివేని కోపమును నశింపఁజేయుము. కోపమంతటి చెడ్డవస్తువు వేఱొక్కటీలోకములో లేదు. కోటిరూపాయలను దానమిచ్చినను కోపము నొందెనేని అట్టివాని నెవ్వరును పాటింపరు. ఏలయనఁగా:—సత్పురుషుఁడు అగుట సాత్త్వికగుణములు సంభవించునుగాని ఇతరవిధములకాదు.

ఆ. కొంపలోన నున్న కోర్కుల ఛేదించి
పరఁగ హృదయ మట్టె పదిలపఱచి
గృహము నిల్పువాఁడు బహుతత్త్వవేదిరా, వి.

కొందఱు అజ్ఞులు యోగులను ధ్యాననిష్ఠులనుచూచి దుర్జనులని నిందింపఁజూతురు. ఎవ్వరు దుర్జనులో పరికింపుఁడు. మనస్సులోని కామములవలన నందఱును భ్రష్టులగుదురు కదా! అట్టిచో మనసులోని కోర్కుల నణంచి హృదయమును పదిలపఱచి పరమాత్మను ధ్యానించునాతఁడు తత్త్వవేదియనుటలో దోషమేమి?

ఆ. కోపమునను ఘనత కొంచెమై పోవును
కోపమునను గుణము కొఱతపడును
కోపమునను బ్రదుకు కొంచెమై పోవును, వి...

సజ్జనుఁడు ముఖ్యముగా కోపమును వదలిపెట్టవలయును. ఏలయనఁగా:—నింతటి చెడ్డవస్తువు వేఱొదియు నిలలో లేదు. ఇది యెట్లు చెడ్డదని యందురా? చూడుఁడు:—కోపముచేత గౌరవము తగ్గిపోవును. గుణములు నశించును. చివరకు బ్రదుకు



తెరువుగూడ నశించిపోవును. కావున సజ్జనుఁడా కోపమును వదలిపెట్టుము.

ఆ. ఖలులు తిట్టిరంచు కలవరపడనేల
వారితిట్ల నేమి వాసి చెడును
సజ్జనుండు తిట్ట శాపం బదౌనయా, వి. 537

లోకములో గొందఱు పిఱికివారలు దుర్జనులతిట్లకు భయపడి సత్పురుషుల నాదరింపకయుందురు. అయ్యది తెలివితక్కువ. మందమతులగు జనులారా! దుర్జనులు తిట్టిరని కలవరము నొందవలసినపని లేదు. ఏలయనఁగా: నీదుర్మార్గుల తిట్లవలన వన్నెయును చెడదు. వాసియును తఱుగదు. వీరు కేవలము వ్యర్థులు. ఇఁక సత్పురుషులన్ననో అట్లు గాదు. వీరు తిట్టిన శపించినట్లు తగిలివచ్చును. కావున సజ్జనుల సత్కరింపుము.

ఆ. గంగిగోవుపాలు గంటెఁడైనను జాలుఁ
గడవెఁడైన నేమి ఖరముపాలు
భక్తి గలుగుకూడు పట్టెఁడైనను జాలు, వి...

లోకములో నూర్గురు దుర్మార్గులకంటెను విచారించిన నొక సజ్జనుఁడు మేలు. ఎట్లనఁగా: పవిత్రములైన గంగిగోవుపాలు ఒకగంటెఁడు చిక్కినను ఉత్తమములై పావనము నొందించును. గాడిదెపాలు పంటెఁడు అయినను పనికివచ్చునా? లేదుగదా! భక్తితో పెట్టిన అన్నము పట్టెఁడైనను తృప్తి నొందించును. అట్టులే సజ్జనుఁడుకూడ నని భావము.

ఆ. క్రొవ్వుపొట్టపోరలుఁ గ్రూరకర్ములు పోరల్
నొవ్వఁ జేసినట్టిరవ్వపోరలు
ఎవరివైన నేమి యినజువాకిటఁగాక
యవ్వలికిని బోవునటర వేమ. 539

దుర్జనులు కొందఱు హింసకైనను భయపడక పాపమున కొడిగట్టి, కన్నుగానక తిరుగుచుందురు; ఈదుష్టుల పోరలు క్రొవ్వుకండలు ఎప్పుడో నొకప్పుడు యమధర్మరాజువాకిట నుండవలసినవియే గదా! కావున హింసకు రోసి సజ్జనుఁడ వగుము.

ఆ. గట్టిసాధువిద్య కాసంతె యనుకొని
గాఢవిద్య నేర్చి కనుము ఘనత
సాధుసజ్జనముల సాంగత్య మెఱుఁగుము, వి...

స్వచ్ఛమగు విద్య కొలఁదిగా లభించినను అదియే గొప్పదని తలంచుకొనుము. ఘనత నొందుటకు యత్నింపుము. బుద్ధిమంతుఁడై సాధువులయొక్కయు సజ్జనులయొక్కయు సాంగత్యమును సంపాదించికొని తెలివితో తత్ఫలము నొంద యత్నింపుము. దాన సజ్జనుఁడవు కాఁగలవు.

ఆ. గుణగణంబు లెల్లఁ గుచ్ఛితమును బొంచ
తగిలి భ్రమలఁ జిక్కి దండధరునిఁ
దోడి తెచ్చుఁగదర తొలఁగింపకున్నను, వి...

ఎంతటిబుద్ధిశాలికైనను దౌష్ట్యము, పరులమోసపుచ్చుట తగనిపనులు. ఇవి కుత్సితపుపనులు. ఇట్లుండిన గుణములన్ని



కుత్సితమును బొందినయెడల మేలునొందలేకుండుట యట్లుండఁగా చివరకు ఇవియే యమధర్మరాజును పిల్చుకొనివచ్చుటకు కారణము లగును. అనఁగా: పాపులను చేయును. కావున కుత్సితముల విడిచి సుజనుఁడ వగుము.

ఆ. గుణములు గలవాని కులమెంచఁగానేల
గుణము కలిగెనేని కోటి సేయు
గుణము లేకయున్న గ్రుడ్డిగవ్వయు లేదు, వి...

గుణము ప్రధానము గాని కులము ప్రధానము గాదు. గుణవంతుఁడు ఏకులపువాఁడైనను పూజింపఁదగినవాఁడే! అట్టివానికులమును ఎంచరాదు. గుణ మొక్కటి కలిగిన నెంతనీచకులజుఁడైనను కోటివరహాలను జేయును. గుణము లేకయున్న గ్రుడ్డిగవ్వకు కూడ కొఱగాఁడు. కావున గుణవంతుఁడ వగుటకు యత్నింపుము.

ఆ. గుణము కల్గియున్నఁ గులసతి నెవ్వారు
నిందఁ జేయలేరు నీతిఁ జూచి
గుణము లేకయున్నఁ గులహీనురాలయా, వి...

భార్య సద్గుణవతియై యున్నచో నెటువంటి నిష్ఠాపరులైనను నిందింపఁజాలరు. ఏల యనఁగా: ఆయమనీతియే యందులకుఁ గారణము. అట్టిభార్యయే గుణము లేకయుండినచో ఎంతటిగొప్పవంశములో పుట్టినను కులము తక్కువ గలదియనియే చెప్పఁబడును. కావున గుణముల నార్జింప యత్నింపవలయును.

ఆ. గుణయుతునకు మేలు గోరంతఁజేసినఁ
గొండయగును వానిగుణముచేత
కొండయంత మేలు గుణహీనుఁ డెఱుఁగునా? వి.

గుణవంతుఁడగువాఁడె సజ్జనుఁడు; సజ్జనదుర్జనులతారతమ్యమును కనిపెట్టుము. గుణవంతున కుపకారము గోరంతగా (అనఁగా: కొలఁదిగా) చేసినప్పటికిని ఆయ్యది వానిగుణముచేత కొండంతయగును. దుర్జనునిపట్ల ఇటు కాఁజాలదు. ఏల యనఁగా: వానికి కొండంత మేలుచేసినను గుణహీనుఁడు గనుక గుర్తింపఁజాలఁడు. కావున సుజనులకు మేలు సేయఁ బూనుము.

ఆ. గుణముతీరు లేక కులమెల్లఁ జెడిపోయె
స్త్రీలనడతవలన సిగ్గుపోయె
చవిటినేలవలన జలమెల్ల చెడిపోయె, వి...545

లోకములో నొక్కొక్క చెడుపదార్థమువల్లన ననేకవస్తుజాలములకు నాశనము కలుగుచున్నది. ఎట్లనఁగా: చూడుఁడు. గుణమొక్కటి తక్కువయున్నఁ గులమంతయును చెడిపోవుచున్నది. స్త్రీలు గుణవతులు గాకున్న మగవారలసిగ్గు పోవుచున్నది. చవిటినేలలో వర్షించినందువలన జలమంతయును నిష్ప్రయోజనమై యుప్పునీరగుచున్నది.

ఆ. గురువు వచ్చుచున్నఁ గూర్చుండి లేవని
తుంటరులకు నెట్లు దొరకు ముక్తి
మగని లెక్కగొననిమగువకు గతియున్నె? వి...

చిన్నపెద్ద తారతమ్యము సజ్జనలక్షణములలో నొక్కటి. అందులో గురువు అందఱికంటెను గొప్పవాఁడు. అట్టివాఁడు వచ్చినప్పటికిని కూర్చుండి లేవక గర్వించియున్న ఖలులకు ముక్తి వచ్చునా? రాదు. ఎట్లనఁగా: తన ప్రాణనాథుఁడైన భర్త యరుగుదెంచినప్పుడు లేచి వినయముఁ జూపనిసతికి గతియున్నదా? లేదు కదా.

ఆ. గువ్వకొఱకు మేనుఁ గోసి యాశిబిరాజు
వార్త విడువరాక కీర్తికెక్కె
నోగు నెంచఁ బోవ రుపకారి నెంతురు, వి...547

సజ్జనుఁ డగువాఁడు సర్వకాలములయందును సర్వావస్థలయందును పరోపకారము చేయుచుండును. అందువలన నాతనికి యశము గలుగును. ఎట్లనఁగా: పూర్వము గువ్వ కుపకారము చేయుటకై తన శరీరమునుండి మాంసమును గోసియిచ్చి రక్షించెను. ఆశిబి పోయెనుకాని ఆయనచరిత్ర మిప్పటికి నున్నది. కావున అపకారిని ఎవ్వరును అనుకొనరు. ఉపకారియగు సుజనుని అందఱు కొనియాడుదురు.

ఆ. చిత్తశుద్ధి యొకటి శ్రేష్ఠలాంఛన మగు
నిఖిలపుణ్యకార్యనిర్వహణము
సద్ది లేక చేయ ననువుగా దేరికి, విశ్వ... 548

మనస్సు పరిశుద్ధముగా నుండుట సజ్జనునకు శుభమును గొప్పదియునగు గుర్తు. ఇయ్యది సమస్తపుణ్యకార్యములను నిర్వహింపచేయును. ఈచిత్తశుద్ధి కలుగదేని ఎంతటి గొప్పమేధా

వియు నైశ్వర్యశాలియు నైనను ఏపనినైనను నరే చేయుటకు అనువుపడదు.

ఆ. చిన్నెలంతె కాని సృష్టి లౌకిక మగు
నందువల్ల నేమి యాశ కద్దు
ఒక్కఁడైనవాఁడె యుత్తమపురుషుండు, వి...

దుర్జనులు కొందఱు తమను దాము ఆత్మవిజ్ఞానఘనులని ప్రదర్శించుకొనుటకు అనేకరీతుల వేషభాషల మెలఁగెదరు. వాని వలన మోసపోవలదు. ఇవి యన్నియు బనికిమాలినవే కాని వేఱుకాదు. లౌకికసృష్టిలోని భేదములు పాటింపఁదగనివి. వానితో నేమియు లాభములేదు. లోకమునంతయు నేకబుద్ధితోఁ గాంచువాఁడే యుత్తముఁడు.

ఆ. చెడ్డవాని మిగులఁ జెఱుచును దైవంబు
అడ్డపడఁడు వాని కాపదైన
చెడ్డచేనుఁ జూచి రెడ్డి తా మెచ్చునా? వి.

సద్బుద్ధి కలిగియుండిననే దైవము కూడ నోర్చి యుపకరించును. అట్లుగాక చెడుపనులు చేయు దుర్మార్గుని దైవమే చెఱుపఁబూనుకొనును. అట్టిదుర్మార్గుని కాపద వచ్చినప్పుడైనను సాయము రాఁడు. ఎట్లని యందురా? తాను స్వంతయజమానుఁడైనను తనపొలమే యైనను చెడినచేనుఁ జూచి మెచ్చుకొనునా? మెచ్చుకొనఁడు గదా! అట్లే.

ఆ. చెడిన మానవులను జేపట్టి రక్షించి
కడకుఁ జేర్చునట్టి ఘనులు తలఁప



విబుధజనులు గాంత్రు విశ్వేశుసన్నిధి, వి...551

లోకములో మేము గొప్పవారమని చెప్పుకొనెడివా రెన్నఁటికిని ఘనులుకారు. అట్టివారి కెన్నఁటికిని ముక్తిరాదు. ఇఁకముక్తి నొందఁదగినవారెవరు? ఘను లెవ్వరందురా? చెడినవారిని దగ్గఱకుఁ జేరఁదీసి రక్షించి సాయముచేసి గట్టెక్కించువారే ఘనులు. ఇట్టి మహాత్ములు కైవల్యమును పొందుదురు.

క. చేకొని పరోపకారం
బేకొఱఁగా మహిమ లెల్ల నెఱిఁగెడువిధిమై
ధీకాదికులను జేయును
సాకారముగాఁగ నతఁడు సాధువు వేమా. 552

ఎవ్వఁడు తన బ్రదికియున్నంతకాలమును తనజన్మము నంతయును పరోపకారముకొఱకని యెఱిఁగి బుద్ధిపూర్వకముగా చేయుచున్నాఁడో అట్టి సత్పురుషుఁడే సమస్తయోగముల నభ్యసించినవాఁ డగుచున్నాఁడు. అతఁడే సగుణబ్రహ్మపదార్థము నెఱింగినసాధువుగూడ నగుచున్నాఁడు. కావున సజ్జనలక్షణ మిట్టిది.

ఆ. చేకొనుచును తమకు చేసాచి నంతలో
చెడినప్రజల రక్ష సేయకున్న
తనదు సాగు టేమి తనతనువది యేమి,వి...553

పలువురు దాము ధనికులని విఱ్ఱవీగుచు ప్రజల కొక్కింతయు సాయము చేయక గర్వింతురు కాని ఇదియును నొక ఘనకార్యమా? కాదు. ఎట్లనఁగా: తానుపరులవద్దనుండి ధనమును

నయభయములతో సంపాదింపవలయును. ఎవఁడేని యాచకుఁ డర్థినివచ్చి చేయిపట్టినప్పుడు తనకున్నంతలో చెడినవారిని చేఁదీసి రక్షసేయవలయునే కాని లేదని చెప్పరాదు. అట్లు చేయకున్నయెడల తనది యొక ప్రభుత్వము, సాగుదలయు నగునా? తనశరీరము మాత్రము నిత్యమా? కాదు! కావున సాధుభావము నొందవలయును.

ఆ. చచ్చువారిఁ జూచి చావని పుట్టని
తత్త్వ మెల్ల నాత్మఁ దలఁపుఁ జేసి
యరసి చూచినట్టియతఁడె పో సుజనుఁడు, వి...

లోకములో తమ్ము దాము సుజనులమనుకొనువా రెల్లరును సుజనులు కారు. ఇఁక నెవ్వరని యందురా? తాను ప్రతిదినము చచ్చిపోవువారిని చూచి శరీర మనిత్యమని తలఁచికొని తత్త్వోపదేశమును నొంది చక్కఁగా విచారించి పరమాత్మను చూడఁగల సమర్థుఁ డెవ్వఁడో వాఁడే సుజనుఁడగును.

ఆ. చదివినయ్యకన్న చాకలయ్యే మేలు
గృహమువేల్పుకన్న గేదె మేలు
బాపనయ్యకన్న బైనీఁడు మేలయా, వి... 555

చదివికొన్నవారమని చెప్పుచు పరలోకమువలన నొక్కింతయును భయము నొందక యిచ్చకు వచ్చినట్లు మెలఁగెడివారికంటె చదువురాక మైల బట్టల నుదికెడి చాకలియే యుత్తముఁడని చెప్పవచ్చును. కోరినవరమీని యింటిదేవరకంటె



నింటిలోనుండు గేదె మేలు. అట్లే సదాచారములేని బ్రాహ్మణునికన్న జమనికవాయించు బైనీఁడు మేలు.

ఆ. చదువులన్ని చదివి చాలవివేకియౌ
కపటి కెన్నఁడైనఁ గలదె ముక్తి
నిర్మలాత్మకునకె నిశ్చలంపుసమాధి, వి... 556

ఎన్నిచదువులను చదివికొన్నను మిగుల తెలివితేటలను ఆర్జించినను కపటమును విడలేకపోయిన వానికి ఎప్పటికైనను ముక్తి గలదా? లేదు. మఱియెవ్వరి కిఁక ముక్తి కలుగునని యడిగెదవా? వినుము. నిర్మలమగు (అనఁగా: ఇతరునకు ద్రోహచింతలేని) మనస్సు గల సుజనునకే ముక్తి కలుగును. అట్టివాఁడే సుజనుఁ డనఁదగును.

ఆ. చంపఁదగినయట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేని కీడు సేయరాదు
పొసఁగ మేలుచేసి పొమ్మనుటే చాలు, వి... 557

ద్రోహము చేయుటయును హింసించుటయును సజ్జనులైన వారికి ధర్మములు కావు. అపాయము చేయువారిని చంపవలదా? అని యడిగెదరా? అట్లుగాదు. కనఁబడినవెంటనే చంపివేయఁదగిన శత్రువు తన చేతిలో చిక్కినయెడల వానికెట్టి యపకారమును చేయరాదు. ఇఁక వానిని శిక్షించు టెట్లందురా? వానికి మేలుచేసి పొమ్మనుటే శిక్షయగును.

ఆ. చూరగొనుము దొరకు సుజ్ఞానమెల్లను
పారవేయు మెల్ల పాపగుణము

దారి తెలియ బుధుల దాపున మెలఁగుము, వి....

సజ్జనుఁడవు కాఁదలంచితివేని నేను చెప్పినట్లు చేయుము. ఏమనఁగా: నీకు సాధ్యమైనంతవఱకును దుష్టులసాంగత్యమును వదలిపెట్టుము. సజ్జనులదాపున తిరుగుచుండుము. వారివలన నీకు దొరకెడి జ్ఞానమునంతను బీరువోనీయక చేకొనుము. నీ యొద్దఁగల పాపగుణములను వదలివేయుము. ఇట్లయిన కొలఁది రోజులలో సజ్జనుఁడ వయ్యెదవు.

ఆ. చదలుభంగిఁ గంద్రు సాధువు మూఢులు
తాను వారినట్లె కాననగును
దీనికెంతదవ్వొ దానికి నదియంతె, వి... 559

తెలివిలేని దుర్జనులు సజ్జనులగు సత్పురుషులను గన్నుల గాంచినప్పుడు అసహ్యముగా చెదలుపురుగులను వలె నీచులనుగా చూచుచుందురు. ఇట్టివారిని వారును మన్నించక అట్లే చూడవలయును. ఏలయని యందురా వినుఁడు. ఈవస్తువున కది యెంతదూరమో దాని కిదిగూడ నంతయేకదా! కావున దుర్జనులు సజ్జనుల నెట్లుచూతురో సజ్జనులు దుర్జనుల నటులె చూడవలయును.

ఆ. ఛాయ నొసఁగు చెట్లు సాధువు బోధలు
అడిగి దరిని జేరఁ బడయవచ్చు
నట్టు నిట్టు దాఁట నదిపోవ దిదిరాదు, వి. ..560



సత్పురుషుల యుపదేశములు వినయవివేకములచేత నణఁగి మణఁగి యుండిననే పొందవచ్చును గాని అటు నిటు తప్పుడు త్రోవలఁ బోవ దొరకవు. ఎట్లనఁగా: నీడనిచ్చు చెట్లదగ్గఱఁ జేరి వంగి విధేయతమై నుండిననే నీడ దొరుకును గాని అటు నిటు కదలుచుండిన దొరుకునా?

ఆ. జఠరమందు జ్యోతి చాలదేదీప్యము
కానలేరు నరులు కలుషమతులు
కన్నువిచ్చిచూచు ఘనుఁడగుసుజనుఁడు, వి ...

పరమాత్ముని రూపము సదా సన్నిహితమై తమతమ పొట్టలలో పెద్దజ్యోతి యై ప్రకాశించుచున్నది. అయినను పాపాత్ములు దానిఁ గాంచలేరు. అట్టిజ్యోతిని కన్ను దెఱచి యెవ్వఁడు చూచునో(జ్ఞానదృష్టిచేఁదిలకించునో)వాఁడు సుజనుఁడగునే కాని పైకి నోటికి వచ్చినట్లు ప్రేలి ఇతరుల మోసము చేయువాఁ డగునా? కాఁడు.

ఆ. జనుఁడు తెలివినొంద చంచలింపదు మది
దయయు నీతిగలుగఁ దగులుబుద్ధి
తివురుభానుఁజూచి తిమిరంబునిల్చునా?వి. . .562

మనుజుని శక్తియుక్తులను కనుఁగొని మనసుకూడ నట్టులే ప్రవర్తింపఁ జూచును. మనుజుఁడు తెలివి గలిగియున్న మనస్సు చలింపదు. దయ ధర్మము నీతి కలుగునట్లు మంచిమార్గమునఁ బ్రవర్తించును. ఎట్లనఁగా: చీఁకట్లను బాఱఁద్రోలెడి సూర్యుని

యెదుట చీఁకటి నిలుచునా? నిలుపదు గదా! అట్లె ఇవియుఁ గూడను.

ఆ. జక్కి నెక్కి వీథిఁ జక్కఁగా వెలుఁగఁడఁ
గుక్క లిన్ని వెంట కూయఁదొడఁగు
ఘనున కోర్వలేని కాపురుషులు నిట్లె, వి...563

దుర్జనులస్వభావమేమో కాని సత్పురుషుని జూచి సహింపఁ జాలరు. మంచిగుఱ్ఱము నెక్కి రాజవీథిని పోవుచుండు వానిని జూచి కుక్కలు మొఱుఁగుచు చుట్టుకొనుట లేదా? అట్టులే దుర్జనుఁ డోర్వలేకపోవుట స్వభావసిద్ధమగు నీచగుణమే కాని వేఱుకాదు.

ఆ. డాఁగుపడిన వెనుక దాఁగ నశక్యము
అరసి చేయుమయ్య యన్నిపనులు
తెలియకున్న నడుగు తెలిసినవారిని, వి.... 564

బుద్ధిమంతుఁడా! నీవు ఏపనిని చేయవలసివచ్చినప్పటికిని సద్బుద్ధితో చక్కఁగా విచారించి చేయుచుండుము. ఏలయనఁగా:—ఏదైన నొకకళంక మొకసారివచ్చినయెడల నీఁక నది దాఁగుట అసాధ్యము, కావున విచారించి చేయుచుండుము. నీకు తెలియకున్న ఇతరుల నడిగి చేయుచుండుము. ఇయ్యదియే సజ్జనులకు లక్షణము.

ఆ. తట్టు నెక్కి తిరుగ నట్టె నేటయ్యెనా
యెపుడొ క్రిందఁబడిన నేదొ విఱుగు
చెల్లియుండి యోర్పుఁ జెందిన భూషింత్రు, వి.565



బుద్ధిహీనులగు దుర్జనులు సజ్జనులగౌరవమును చూచి తమకు నట్టిగౌరవము వలయునని వాహనముల నెక్కి తిరుగఁబూనె దరు. అందువలన నపాయము కలుగును. ఏమనఁగా:— చచ్చుగుఱ్ఱము నెక్కినంతమాత్రమున గొప్పవాఁడగునా? కాఁడు. ఎప్పుడో క్రిందఁ బడును. ఏదో విఱుగును. కావున చెల్లుచుండినను ఓర్పు గలిగియుండుట సజ్జనులకు భూషణమగును.

ఆ. తండ్రికన్న సుగుణి తనయుఁడై యొప్పెనా
పిన్న పెద్దతనము లెన్న రెవరు
వాసుదేవు విడిచి వసుదేవు నెంచిరా? వి...566

గుణమును ప్రధానముగా సజ్జను లెన్నుచుందురే కాని ఇతరుల రీతిగా వయస్సులోని చిన్న పెద్దఱికముల నెంచరు. ఏలయనఁగా: తండ్రికంటె గుణవంతుఁడైన కొడుకునే కొనియాడెదరు కాని పిన్నతనమును లెక్కింపరు. ఎట్లనఁగా:— వాసుదేవుని లెక్కపెట్టక ఎవ్వరైన వసుదేవుని లెక్కించిరా? లేదు గదా! ఇట్లే సజ్జనులఁగూడను.

ఆ. తనసతి నపథమునఁ దనుదానె చొనుపఁగా
సాటిపూరుషుండు సరగు దెలుప
నెఱుఁగలేనినరుఁడు నరమాత్రుఁడును గాఁడు, వి.

తనభార్యను తనంతట తానె యధర్మమునందుఁ బ్రవేశింపఁ జేసియు నంతటనైనను తెలివితెచ్చుకొని దుర్జనుఁ డూఱక యుండునా? యుండఁడు. తనతో సాటి యగువాఁడు తనకా

విధమును తెలియచెప్పినను తెలిసికొనఁజాలఁడు. ఇట్టివాఁడు కూడ మనుష్యమాత్రుఁడే యగునా? కాఁడు.

ఆ. తనను బోలె నవియు ధరఁ బుట్టినవి కావొ
పరఁగఁ దన్నుఁ బోలి బ్రదుకఁ గాదె
జ్ఞాని జ్ఞానిఁ జంపఁ గారణ మేమిరా? వి...568

దుర్జనులు సజ్జనస్వభావము నొందక ప్రాణిహింసఁ జేయఁ బూనుకొందురు. పాప మా ప్రాణులును తనవలెనే పుట్టినవి కావా? తనను బోలి బ్రదుకుచున్నవి గావా? తనకీడుమేళ్లెఱింగినవాఁడు తనకుఁ బోలియున్ననితరజీవముల నేలచంపవలయును? కావున నిట్లు చేయుటకు సజ్జను లంగీకరింపరు.

ఆ. తప్పు లెన్నువారు తండోపతండము
లుర్విజనులకెల్ల నుండుఁ దప్పు
తప్పులెన్నువారు తమతప్పు నెఱుఁగరు, వి...569

సజ్జనుఁ డొకరుఁడు ఇతరులకు సతతము మేలుచేయువాఁడు కలఁడు అని చెప్పినప్పుడు వానిని తప్పుపట్టుట కనేకులు బయలుదేరి వచ్చెదరు; కాని యిది సజ్జనులకు మర్యాద కాదు. ఏల యనఁగా:—తప్పులను లెక్కపెట్టు ననేకులు గలరు. ప్రపంచములో తప్పులేనివారే లేరు; కాని తప్పుల నెంచువారు తమతప్పును తెలిసికొనఁగలరా? లేరు.

ఆ. తమకుఁ గలుగు పెక్కుతప్పు లటుండఁగా
నొరుల నేర మెంచు టొప్పు గాదు
చక్కిలంబు విడచి జంతికె లేరుటా? వి.... 570



బుద్ధిమంతుఁడవై యితరులతప్పులఁ బట్టపోవక సాధుత్వము నొంది యుండుము. తమగొప్పతప్పులను దాచుకొని ఇతరుల కొలఁదితప్పులెన్నువాఁడు దుర్జనుఁ డగును. దుర్జనున కిట్లు చేయుట స్వభావము. ఏల యని యందువా? చూడుము. ఇది చక్కిలమును వదలిపెట్టి జంతికము లేరుటవంటిది? అట్లే వాటమైనవి గాన ఇతరులతప్పులను వెదకును. ఇది మంచిది కాదు.

ఆ. తల్లి కెదురుకొనుట తండ్రి కెదురుకొనుట
యన్న కెదురుటయును ననఁగ మూఁడు
పాతకముల నెఱిఁగి వర్తింపఁగావలె, వి... 571

సజ్జనుఁడగువాఁడు ఎల్లప్పుడును తల్లిదండ్రులయెడలను నన్నలయెడలను వినయము గలిగి ప్రవర్తింపవలయును. అట్లు కానిచో దుర్జనుఁడగును. సత్పురుషుఁ డెల్లయెడలను తండ్రికి తల్లికి అన్నలకు నెదురు సెప్పుట లను మూఁడిటిని మూఁడుపాతకములని భావించి ప్రవర్తించును. కాన సజ్జనపద్ధతి ననుసరింపుము.

ఆ. తివిరి లేమియింటి తెరువ రే మెఱుఁగును
మొఱ్ఱఁబెట్టి నెత్తి మొత్తుఁగాని
ప్రథితధర్మ మధమభట్టు లెఱుఁగుదురొకో? వి...

ఉత్తమములగు ధర్మములను తెలియవలయునన్న సజ్జనుఁడే యెఱుఁగఁగలఁడు; గాని ఇతరునివల్ల నెట్లు అగును? ఏలయని యందురా? బాటసారి యగునతిథి కానవచ్చినగృహమున కాహారార్థమై పోవునుగాని యింటివారిలేమిని బరికింపఁడు. ఇంట

వీలుకాదందురేని తనయాఁకలినిగూర్చి మొఱఁబెట్టును. అంత తోఁబోక దౌర్జన్యమునుసైతము గావించును. కాన నెదటివాని లేమి నూతనుఁడు గ్రహింపఁజాలఁడు. అటులే ప్రసిద్ధమగుధర్మ శాస్త్రరహస్యములను గలబొల్లిపాటలల్లుభట్టువాఁ డెఱుంగఁ జాలఁడు. సర్వశాస్త్రపారంగతుఁ డగు బ్రాహ్మణుఁడె యెఱుంగును.

ఆ. తేనెతెరలజాడ తేనెటీఁగ యెఱుంగు
సుమరసంబుజాడ భ్రమర మెఱుఁగు
పరమయోగిజాడ భక్తుఁ డెఱుంగును, వి... 573

తేనెతెట్టెలోని పొరల ముందువెనుకల తేనెటీఁగయే యెఱుంగును. పువ్వులలోని తేనెరుచిని తెలియవలయుననిన తుమ్మెదయే తెలిసికొనవలయును. ఉత్తముఁ డగుయోగిరీతి నెఱుంగఁగోరిన భక్తునకే స్వాధీన మగును. ఇట్లే సజ్జనరీతుల సజ్జనుఁడే యెఱుంగునది.

ఆ. దూలముల నెక్కి దొమ్మరిగడ నెక్కఁ
జాలుదు నన డెవ్వు సజ్జనుండు
వీలుమాలుపనుల వెట్టియె చేయునా? వి...

దుర్జనునివలె సజ్జనుఁ డెప్పుడైనను లేనిపోనిదంభభావములను కపటపుగౌరవములను తనపైని ప్రచురించుకొనఁడు. దూలముల నెక్కినంతనె దొమ్మరిగడ నెక్కుదునని సజ్జనుఁడు చెప్పునా? చెప్పఁడు. మఱియును బుద్ధిహీనునివలె తనకు వీలులేని



పనులను చేయుదునని వెట్టివానివలె చెప్పునా? చెప్పఁడు. కావున సత్యము పల్కుట సజ్జనలక్షణము.

తే. దేవతార్చన జపతపస్తీర్థయాత్ర
దానధర్మక్రతువులును దలఁచి చూడఁ
బుణ్యసాధనవృత్తులు పుడమిలోన
కల్మషము లేనిహృదయము కలుగ వేమ! 575

సజ్జనులు సర్వదా పుణ్యకార్యములను చేయుటయందే తమ జీవితములను గడుపుచుందురు. వారు నిష్కల్మషహృదయులు కావున వారికి దేవతలను పూజించుట, జపము చేయుట, తీర్థముల సేవించుట, దానముచేయుట, యజ్ఞాదికముల నొనర్చుట యివి నియతకృత్యములు. ఇట్టిపుణ్యాకరములగు వృత్తులలో వర్తించుచు సజను లిహలోకములోఁ గాలయాపనముఁ జేయుదురు.

ఆ. దోషరాశిఁ బుట్టి దోషంబుఁ దెలియక
దూషణములు సేయుదుష్టజనులు
నరకకూపమందు నాటియుండెదరయా, వి...

సజ్జనులు అయియుండనివారికి ఎన్నిజన్మములకైనను తరింపు గలదా? లేదు. ఏలయనఁగా: ఎల్లప్పుడును పుట్టుకసహితము దోషముల గుంపులోనే పుట్టి మంచియేదియో చెడ్డయేదియో తెలియక దూషించుచుందురు దుష్టులు. కావున వారు నరకకూపములలోఁ గూలియుండెదరే కాని ఉత్తీర్ణులు కాఁజాలరు.

ఆ. ధార్మికునకుఁ గాని ధర్మంబు గనరాదు
కష్టజీవి కెట్టు కానఁబడును

నీరు చొరమి లోతు నిజముగా తెలియదు, వి.

ఒక్కొక్క మానవున కొకవిధమగు సుగుణము నైజమైయుండును. సుగుణములు సామాన్యముగా నభ్యాససాధ్యములు కావు. ఎటులనఁ ధనవంతులు ధర్మాత్ములఁ జూచి మేముచేయలేమా ధర్మము, ఇది గొప్పకార్యమా యందురు. నిజమునకుఁ గష్టమునొంది ధనమునేకరించినవాఁడు ధర్మము చేయఁజాలఁడు. ఇవియన్నియు దూరముననుండి పలుకుపలుకులు. ఒడ్డున నున్నపుడు నీరు లోతు లేనటులె కనఁబడును. దిగిననేగదా లోతుకష్టముఁ సుఖము తెలియవచ్చుట. అటులె త్యాగాదులలోని సాహసముగూడ దూరస్థులకుఁ దెలియరాదు.

క. నది నుదకంబులు చనుక్రియ
మదిఁ బొడమెడుతత్త్వవిధులమహిమము లెల్లన్
దుదిపదవిఁ గలయ ఘనుఁడగు
నుదధిఁ బ్రవేశించు గంగ యొప్పున వేమా.

మానవుఁడు తనహృదయమున జనించు తత్త్వబోధములన్నింటిని గడముట్టించెనేని యాతఁడు పరబ్రహ్మస్వరూపమును బడసి ముక్తుఁడు కాఁగలఁడు. నదిలోఁ బ్రవహించు నీరంతయు నెడతెఱపిలేక కడముట్టఁబోయెనేని సముద్రమునఁ బడి పావనము నొందునుగదా!

ఆ. నీచగుణము లెల్ల నిర్మూలమై పోవు
కొదవ లేదు సుజనగోష్ఠివలన
గంద మలఁద మేనికం పడంగినయట్లు, వి. ... 579



సజ్జనసాంగత్యమువలన నేమిలాభమని కొందఱనెదరు. దీనఁగలుగు లాభ మితరమేదానివలనను లేదు. సజ్జనసాంగత్యమువలన నీచగుణము లన్నియు నశించిపోవును. ఏవిధమైన కొఱంతయును కలుగఁబోదు. ఎట్లనఁగా:—ఒడలికి గంధమును బూసినచో కంపు అడఁగినట్టులే.

ఆ. నేర నన్నవాఁడు నెఱజాణ మహిలోన
నేర్తు నన్నవాఁడు వార్తకాఁడు
ఊరకున్నవాఁడె యుత్తమోత్తముఁ డయా, వి.

అనవసరములగు పనులలోఁ బ్రవేశింపక తనకు తెలియదని సాధ్యమైనంతవఱకు సుజనుఁ డట్టిపనులనుండి తొలఁగి చనవలయును. తెలియనివాఁడను అని యనినవాఁడు నేర్పరి యనఁదగును. అన్నియును తెలిసినవాఁడ ననువాఁడు మాటలప్రోగు. ఏమియును తెలియనివానివలె ఊరకయున్నవాఁడు అందఱికంటె నుత్తముఁడగును. వాఁడె కార్యార్థి. ఇట్లుండుటయే సజ్జనలక్షణము.

ఆ. పరగ ఋషులు భువిని పరమపవిత్రులై
మించి లోకమునకు మేలుఁ జేయ
సంచితార్థములను సమసింపఁజేయరే, వి. ... 581

సజ్జనులు ఏకులమున నుదయించినను తమ తపశ్శక్తిచేత జ్ఞానులై పరమపవిత్రులై లోకమునకంతకును మేలుఁజేయఁ జూచి తాము తాము సంపాదించిన పాపములను నశింపఁజేయ దొరకొందురు. అట్టివారికి ముక్తి హస్తగతమైయుండును.

ఆ. పట్టరానిపట్టుఁ బట్టి యుండినవాఁడు
పుడమిలోన కీర్తిఁ బొంద లేఁడు
సుగుణలక్షణముల సుజ్ఞాని యానయా, వి...

పట్టకూడని మూర్ఖపుఁబట్టును పట్టినవాఁడు యశమును గాంచలేఁడు. ప్రతివిషయమునను యుక్తాయుక్తముల నెఱుఁగ వలయును. కావున జ్ఞానవంతుఁ డగు సాధనము సజ్జనలక్షణము లలవడునట్లు ప్రయత్నించుటె.

ఆ. పదిలపడఁగ మనసు పట్టనేరనివాఁడు
కదియఁబోఁడు పూర్ణకలితుఁడుగను
గుదురుకొనెడివాఁడు కోవిదుఁడగునయా, వి...

పదిలముగా మనస్సును పరుగులు వాఱనీయక పట్టి యుంచ వలయును. ఇట్లు మనస్సును పట్టనేరనివాఁడు బ్రహ్మపదార్థము నొందినవాఁడు గాఁజాలఁడు. కావున బ్రహ్మముఁ గోరువారెల్లరును మనోనిగ్రహమును అభ్యసింపవలయును. మనోనిగ్రహముగలవారె విద్వాంసులు. ఉత్తములు.

ఆ. పాలు పెరుఁగు నేయి పరగునన్నము తిని
స్త్రీలఁ గననివాఁడు శీలవంతుఁ
డొక్కఁడైనవాఁడె యుత్తమశివుఁడయా, వి...

పాలు, పెరుఁగు, నేయి, శాల్యన్నము మున్నగు నుత్తేజకములును మత్తుకలిగించుపదార్థములను భక్షించుచుండినను స్త్రీలనుచూచి యపేక్షించువాఁడొక్కరుఁడే శీలవంతుఁడు. అట్టివాఁడొక్కఁడైనను నుత్తముఁడగును. వాఁడె శివస్వరూప



మునగును. ఇంద్రియముల దర్పము నభివృద్ధినొందించు నిట్టిపదార్థములఁ దిని యింద్రియనిగ్రహము సాధించుట గొప్పతనముగాని యాహారాదులు వర్జించి శుష్కించి మోహమును బోనాడుట గొప్పతనము కాఁజాలదు.

ఆ. ఫక్కి దెలిసి పలుక నొక్కవాక్యమె చాలు
పెక్కులేల వట్టి ప్రేల్పుటేల
దిక్కు కలిగి మ్రొక్క నొక్కటి చాలదా? వి.

పలుమాటలను పలికినందుచేత నాకించుక యైనఁ బ్రయోజనము లేదు. ఫక్కి తెలిసికొని మాటాడినమాట యొక్కటైనను చాలును. వట్టి ప్రేలుడుమాట లనేకము లెందులకు? వ్యర్థములనుట. ఎట్లని యందురా? దేవునిదిక్కునకు మఱలి నిశ్చలబుద్ధితో మ్రొక్కిన మ్రొక్కొక్కటియే సమస్తకామితము లొసంగును.

ఆ. మఱతు నేమొ యనుచు మది సుజనుం డెప్డు
నెవరొనర్చు మే లదెంత దైన
మాఱుమేలుఁ జేసి మర్యాదగాంచును, వి...586

సజ్జనుఁడగువాని కుండెడులక్షణములలో నొక్కటి మిగుల నుత్తమమైనది కలదు. అయ్యది కృతజ్ఞత, అనఁగా: చేసిన మేలు మఱవక యుండుటయే. సజ్జనుఁ డెప్పుడును తన కితరులు చేయుమే లెంతపాటిదైనను "మఱచిపోవుదు నేమొ?" యని యనుకొనుచు సమయమును వేచి మాఱుమేలు చేసి మర్యాదను పొందును.



## దై వ ప ద్ధ తి.

---

అవతారిక. ఆత్మస్వరూపము ఈశ్వరస్వరూపము సంపూర్ణముగా నెఱుంగుటయే జ్ఞానమనియు జ్ఞానసాధనమునఁ గాని యీశ్వరస్వరూపము నెఱుంగ వీలుకాదనియు విద్వాంసులయభిప్రాయము. కావున జ్ఞానమునుపార్జించి అష్టాంగయోగము లభ్యసించి తపశ్చాంద్రాయణాదివ్రతసాహాయ్యమున నెటులో నీశ్వరరూపము సందర్శించుటకంటె హృదయస్థుఁడగు నీశ్వరుని సులభోపాయములతో సందర్శించుచు సంసారమును వదలియేని వదలకయేని తరింపవచ్చుననియుఁ సర్వప్రదేశములను నిండియున్న బ్రహ్మపదార్థమును సంపాదించుటకు ఇంద్రియవిజయము సద్వర్తనము ఆవశ్యమని విరళముగా వేమన మహాయోగి యీపద్ధతిలోఁ జెప్పుచున్నాఁడు.—

ఆ. అండమందు నుండు నఖిలమాజనులార
ఎందు లేకయుండు నెఱుఁగుఁ డతఁడె
యతనిపూజఫలము నందెనా శివయోగి, వి...

దైవస్వరూప మన్నిపదార్థములలోను నిండియుండును. చివరకు మిగుల కొద్దిపాటిది యగుగ్రుడ్డులోఁగూడ నిండియుండును. కావున సమస్తములగు జనులారా! అట్టి సమస్తవస్తుస్వరూపుఁడగు నీశ్వరుని పూజించి ఫలమునొందెనా యట్టివాఁడు శివయోగి యనఁబడును.



ఆ. అందు నిందు నుండు నఖిలుండు చూడఁగా
నెందు దానె నిండి యెఱుఁగుచుండు
నతనిపూజఫలము నందఁగవలె నయా? వి...

దైవ మఖిలవస్తురూపుఁడు. ఆతని కిఱవుగానిచోటు వేఱు లేదు. అచ్చట నిచ్చట నుండును. విచారించినఁ బ్రపంచములోని యేపదార్థమునం దైనను తానె నిండియుండెడి స్వభావము గలవాఁడు. మనుజుఁడై పుట్టినందులకు ఫలముగా నట్టి మహానుభావుని పూజల నొనర్చి ధనము నొందవలయును.

ఆ. అల్పుఁ డైన నేమి యధికుఁ డైనను నేమి
చెప్పవలయురీతిఁ జెప్పినాఁడ
హరుని యెఱుకలేక యాకు లల్లాడునా? వి...

కొద్దివాఁడైనను గాని గొప్పవాఁడైనను గానీ యందఱకును దైవబలమే బలము గాని ఇతరములుకావు. దీని చెప్పవలసినంతగా చెప్పినాఁడను. ఒకవేళ ఎవ్వఁడైనను తనప్రయత్నములచేత దైవము నొంపఁ బ్రయత్నించెనేని సఫలుఁడు కాఁజాలఁడు. ఏలయందురా? ఈశ్వరునియాజ్ఞ ఇసుమంతయైనను లేనిచో ఆకుగూడ కదలఁజాలదు.

ఆ. ఆకుమీఁదివ్రాఁత యందఱికిఁ దెలియుఁ
జేతిలోనివ్రాఁతఁ జెప్పవచ్చు
తోలుక్రిందివ్రాఁత దొడ్డవాఁ డెఱుఁగునా? వి.

తాటియాకులు మున్నగువానిపై వ్రాసినవ్రాఁత లందఱికిని తెలిసినవే. ఇట్టులే చేతిపైనివ్రాసినవ్రాతలఁ గూడ దెలిసికొని

చెప్పవచ్చును; కాని యెంతటి బుద్ధిమంతుఁడైనను ఎన్నిపాట్లు పడినను దైవనిర్ణిష్టమగు వ్రాతల నెఱుఁగఁజాలఁడు.

ఆ. ఆకులందుఁ జదివి యందఁగ రానిది
ఏక మమర యుక్తి నెఱుఁగవలయు
దాకి పూర్తిగాను తన్మయమొందుఁడీ, వి... 591

దైవ మధికబలము గలది. దేవునిభావ మీరీతి నుండునని గ్రంథములలో చదివికనుఁగొందమనిన వలనుగానిది. అట్లుగాక తెలియవలయునని పట్టుదల కలిగినయెడల నైక్యబోధక మగు యుక్తిని తెలిసికొని కలిసికొని తన్మయత్వము నొందుఁడు.

ఆ. ఇంటియింటిలోని యీశ్వరు నెఱుఁగక
అంటిచూడలేక యడవులందు
నుండఁ గోరుదైవ ముండనీయఁడు వాని, వి...

సర్వసాధారణముగా నీశ్వరుఁ గనుఁగొనవలయుననిన నైక్యభావములోను సర్వసమత్వబుద్ధిలోను మెలఁగవలయును. ఇట్లుయిన సమస్తజనహృదయనివాసి సర్వజగన్నివాసుఁడగు ఈశ్వరు నెఱుంగఁగలుగుదురు. కాని ఇంటిలో నున్న నీశ్వరుని కొంద అవివేకులు తెలిసికొనఁజాలక యడవులలోఁ బడి యెండఁ గోరుదురు. జనులు దేవుఁ డిట్టివారలకు కొంచెమైన జ్ఞానము నంటనీయఁడు.

ఆ. ఇయ్యనతనిచేత నిప్పించుతనప్రాప్తి
ఇచ్చువానిచేత నీయనీదు
ఇయ్యఁగ నైకొనంగ నీశ్వరుఁడే కర్త, వి... 593



మనుజుఁడు ప్రయత్నింపఁగలవాఁడు మాత్రమే. ఫలము దేవుఁ డీయవలసినదియే. ఈదైవమునే అదృష్టమనియు ప్రాప్తి యనియు నందురు. దీని ప్రభావ మతివేలము. ఎన్నడును దానముచేసైన నెఱుఁగనివానిచేత నిప్పింపచేయును. ధారాళముగా నిచ్చువానిచేత నిప్పింపదు. కావున ఇచ్చుటకును పుచ్చుకొనుటకును ఈశ్వరుఁడే కర్తగాని యితరముకాదు. ఆయీశ్వరుఁడే ప్రాప్తియనుకొనుము.

ఆ. ఇష్టలింగ మేది యిల శిల లింగంబె
నిష్ఠమీఱ మెడను నీల్గఁ గట్టి
కష్టపడుటెగాని కలుగదు దైవము, వి... 594

కొందఱు దైవము నిజరూపమును తెలిసికొనఁజాలక వెఱ్ఱివారలై ఇష్టలింగ మిష్టలింగ మని మెడలలో లింగములను గట్టికొని తిరిగెదరు. ఎంత వ్యర్థులో చూడుఁడు. ఏమందురా? ఏది యిష్టలింగము? శిల యందురా? శిల లింగమగునా? కాదు. లావు మెడలలో శిలల నీలగకట్టికొని కష్టమునొందుటే గాని దైవముఁ గనుఁగొనఁజాలఁడు.

ఆ. ఈనినట్టిపులిని బూని చంపఁగవచ్చు
మనసు మర్మ మరసి కనఁగవచ్చు
దైవమాయ తెలియ తన కసాధ్యం బగు, వి...

కొందఱు మేము దేవునిమాయ సామూలముగా గ్రహించితిమనియు సర్వవిషయములు మేము సమగ్రముగా నెఱుంగుదుమనియు వదరుచుందురు. ఇది సంభవము కాఁజాలదు. మాన

పుఁడు శ్రమచేసి యెటులో ఈనినపులినైనను పట్టుకొని చంపఁ గలఁడు. వివేకబలమువలన మనస్సులోని మర్మములను తెలిసికొనవచ్చును. కాని ఎంతటివారుఁడైనను ప్రాజ్ఞుఁడైనను పరమేశ్వరునిమాయ నెఱుఁగఁజాలఁడు.

ఆ. ఉదకమందు పాచి యున్నది చూడరా
మదిని నున్న మాయ మట్టునడక
సదనమందు బ్రహ్మ సాక్షిగా నెంచును, వి...

దైవరూపము మనకంటి కగపడు ప్రతివస్తువునందునుకలదు; కాని అయ్యది మనలఁబోలె మాయచేఁ గట్టువడదు. ఎట్లందురా? నీటిలోనుండి పాచి నీళ్ల కంటని యట్టులే. కావున మెలఁకువతో నీనిలయమునందె దైవముండెనని యెంచికొనుము.

ఆ. ఉన్నవార లెవరొ చన్నవా రెవ్వరో
కన్నవార లెవరొ కానరారు
ఉన్న చన్న కన్న నొక్కఁడే చూడరా, వి... 597

మనుజుఁడు ప్రాజ్ఞత లేక భేదబుద్ధిచేత నభిమానియై తిరుగాడుచుండును. అయ్యది యుక్తము కాదు. ప్రపంచములో స్థిరమెవ్వరో ఎవ్వరు లేరో పరికించుము. దైవమునకంటె నితరులొక్కరును గానరారు. ఉన్నను కన్నను చనినను ఒక్కదైవమని యెఱుఁగుము.

ఆ. ఊరు కాదు దిరిగి యున్నది గనలేక
పోరి గురులఁ గనక పొందుపడక
తారుమారుగాను తత్త్వపడ నేల? వి... 598



ఓరిమూర్ఖుఁడా! నీవు మోక్షరహస్య మెఱుంగవలయునని చిత్తచాంచల్యముతోఁ గన్నవానికాళ్లుపట్టుకొని సర్వవిధముల భ్రష్టుఁడవై పోవుచున్నాఁడవు. ఊరూరికి తిరిగి, నిజముగా లోకముల నిండియున్న దైవరూపము నజ్ఞానివై తెలియవైతివి. గురువులతో విరోధించి నిజరూపమును పొందఁజాలవైతివి. వెఱ్ఱివాఁడా! తారుమారై యేల తత్త్వపాటు నొందెదవు. ఇపుడైన మనస్సు నిలుపుకొనుము.

ఆ. ఎచటనుండి వచ్చు నెచటికిఁ బాఁ బోవు
నిద్రచంద మెఱుఁగ నేర్చెనేని
ఆత్మ రాకపోక లతఁడపో శివయోగి, వి... 599

ముక్తుఁడు ముక్తుఁడనఁగా నట్టివాఁ డొక్కరుఁడే ముక్తుఁడగును. ఎవ్వాఁడు ఈజీవ మెచ్చటనుండి వచ్చునో, ఎచ్చటఁ బోవునో నిద్రించుట యనఁగానేమి? యని ఈరీతిగా నాత్మ రాకపోకల నెఱుఁగునో, వాఁడె శివయోగి యగును.

ఆ. ఎంత వింత మదికి నేమేమి తోఁచినఁ
జింత సేయరాదు చిక్కుబెట్టు
వింతలోనిగుట్టు వివరింపఁ దానగు, వి... 600

పరమేశ్వరుని ధ్యానించునప్పుడు మాయాప్రభావమువలన మనస్సునకు ఎట్టివింతలు కనుపించుచున్నను వానిని లెక్కసేయరాదు. ఏమనఁ ఇవియే పరమేశ్వరుని విలాసము లని భ్రమసిన నిఁక రహస్యము తెలియు టెట్టులు? నిష్ఠాసమయమున నాంతరంగికదృష్టికి బాహ్యదృష్టికిఁ గానవచ్చు నీవింతలన్నియుఁ దన

యజ్ఞానమువలన జనించునవియనియు నజ్ఞానియగు తానె యట్టి భ్రాంతులకుఁ గారకుఁడ ననుకొనవలయునుగాని దైవలీలలు గా నెంచరాదు.

క. ఎన్నాళ్లు బ్రతికివచ్చిన
గన్నెఱుఁగని మర్త్యులకును గలఁగును బరమా
పున్నమచంద్రుని విమలపు
వెన్నెలలో బయలు సేరి వెలయుము వేమా!

కొందఱవివేకులు దేహము వ్యాధిమయము మృత్యువు వెంట నంటియుండును. స్వల్పజీవితమున మోక్షము నొందువిధ మెద్ది యందురు. ఇంతయేల? అవివేకి యెంతకాలము జీవించినను ముక్తి నొందఁజాలఁడు. మనుజుఁడు ముందు తాను స్థూలసూక్ష్మ కారణదేహములకంటె భిన్నుఁడై జాగ్రదాదులగు నవస్థలఁ గాంచుచు అన్నమయాదిపంచకోశముల నతిక్రమించిన సచ్చిదానందస్వరూపుఁడని యెఱిఁగినవాఁడె ముక్తుఁడు. అట్టివాఁడు శరత్కాలపువెన్నెలవలెఁ బ్రకాశించు జ్ఞానతేజమును దర్శించి మోక్షపదవి గడించి కృతార్థుఁ డగును. కాన ప్రతిమానవుఁడు తన్నుఁ దా నెఱుంగుట ముఖ్యము.

ఆ. ఎన్నిభూములఁ గని యేపాటు పడినను
నంటనీక శనియు వెంటఁ దిరుగు
భూమి క్రొత్తదైన భోక్తలు క్రొత్తలా? వి...

కొందఱవివేకులీచోటు కలసిరాలేదు. మఱియొకచోటున గలసివచ్చునేమో యని దేశమంతయుఁ గలయఁ దిరిగెదరు.



తా మెన్నిదేశములకేఁగినను ఎన్నెన్ని పాట్లుపడినను తనయదృష్టముకూడ వెనువెంటనే తిరుగుచుండును. (ఇదానినే యదృష్టమందుము). ఏలయందురా! మనము వెడలిపోయినభూములు క్రొత్తవైనను వాని ననుభవింపవచ్చిన మనముమాత్రము ప్రాఁతలమే. గనుక-

ఆ. ఎఱుక గలుగునాతఁ డేయూర నుండక
తిరుగ నేలఁ దనకు దివ్యమైన
పండు పండ వెనుక భక్షింపకుండునా? వి...

నిక్కమగుజ్ఞానము గలవాఁడు ప్రతిగ్రామము నెందులకు తిరుగవలయును? ఆతఁ డెక్కడనుండిన నచ్చటికి తనకోరిన వస్తువులు వచ్చును. ఇందుకు సందేహము వలదు. ఎట్లందురా? చూడుఁడు. ప్రయత్నించి కృషిచేసి ఫలింపచేసినవెనుక ఫలము లేకయుండునా? తాను ఆఫలమును భక్షింపఁడా ?

ఆ. ఎవ్వ రెఱుఁగకుండ నెప్పుడు పోవునో
పోవు జీవ మకట బొంది విడిచి
యంతమాత్రమునకె యపకీర్తి గనలేక
నిరుగఁబడును నరుఁడు వెఱ్ఱివేమ! 604

కొందఱు మందమతులు తనువు లశాశ్వతములనియుఁ బరమున యముఁడు యపకీర్తివంతులకుఁ బ్రతిఫలముగ నరకము చూపును. తాను గతించినను లోకములోఁ దనయపకీర్తి నిలిచి యుండునని కొంచెమేని తలంపఁడు. ఇది మిగుల ప్రమాదము. బుద్ధిమంతుఁ డగువాఁడు పరము నాసింపక ప్రాణములు స్థిరములనుకొని మెలఁగరాదు. అల్పప్రాణము ఎవ్వరికిని

తెలియకుండ ఎప్పుడు పోవునో తెలియదు. కావున నింతమాత్రపుదేహమునకై యపకీర్తి గొడిగట్టి పాపలోకమున గూలుటకు నరుఁడు యత్నించుట వెఱ్ఱితనము.

తే. ఏడ్వ మది నోవ ఫలమేమి యెవరు నిన్ను
దిట్టఁగా నేమి లేక నుతింపనేమి
కలుగుభువి లాభలోభము ల్గాలమహిమ
ననుచు సరిపెట్టికోరాదె యరయ వేమ! 605

లోకములో కొందఱవివేకు లగునరులు పరులు తనశ్రేయస్సునకు సహించుటలేదనియు వాండ్ర యేడ్పె తనకుఁగొట్టికలసివచ్చుటలేదని పలుకసాగును. ఇది వెఱ్ఱిమాట. ఇతరులు ఏడ్చినను, నొచ్చుకొన్నను, దిట్టినను, కొనియాడినను నీవు కొంచెమేని లక్ష్యపెట్టకుము. లాభము నష్టము మానవునకుఁ గాలమహిమవలననే కలుగునని మనసు కుదురుపఱచికొనుట యుక్తము. కాలమునకే మానవశక్తియు నడ్డుపడఁజాలదు.

ఆ. ఏది కులము నీకు ఏదిమతంబురా
పాదుకొనుము మదిని పక్వ మెఱిఁగి
యాదరించుదానియంతము దెలియుము, వి...

నేనున్నతకులమువాఁడ నను నభిమానముచేత నజ్ఞాని వగుచున్నావు. ఓయి పిచ్చివాఁడా నీవెవ్వరు? నీకు కులమున్నదా? లేదు. కావున మదిలో పరిపక్వము చేసికొని దైవరూపము నెలకొల్పుము. దీక్షఁబూని దానియంతము దెలియ బ్రయత్నింపుము.



క. ఏదేశముఁ దిరిగినఁ బని
లేదట తనమనసుకుదురు లేకుండినచో
నాధారం బిఁక నింతియ
తా దెలియుట మనసు శుద్ధి తత్త్వము వేమా!

మనసు కుదిరికఁ గన్నవాఁడు దేశదేశములను భ్రమ్మఁబనిలేదు. మనసు కుదురకున్నను దేశములను దిరిగినఁ బనిలేదు. కావున తనకు తానె యాధార మనుకొనుటయే శుద్ధమగు దైవరూపమునుగా తెలియుము. ఇదియే మానవధర్మము.

క. ఏనాఁడు సుభిక్షము తన
కేనాఁ డిరవయ్యె నచటి కేఁగుమృగంబుల్
తానున్నచోట విసికిన
మానవులని పలుకనేల మహిలో వేమా! 608

కొందఱు పూర్వనివాసమును వదలుటకుఁ బ్రాలుమాలి నానావస్థలనే పొందుచుఁ గాలయాపనము గావింతురు. వారు పరులను ఉదరపోషణలకై దేశముల భ్రమరుచున్నారందురు. అది పశుపక్ష్యాదులకును సమానమే. చూడుఁడు. ఏరోజు నెచ్చట సుభిక్షమో అచటికి మృగము లాహారార్థమేగుటయు ఏకాలమునం దెచట నాహారములభింపదో యటనుండి మృగములు మఱియొకచోటున కేగుటయు సాజము. మానవుఁడుగూడ నటులే మృగధర్మానుసారముగ నాహారార్థియై నెలవువదలుట యెన్నఁటికిఁ దప్పుకాదు.

ఆ. ఒకరి కీడు వేఱె కొక్కరి కీయఁడు
ఒకరిమేలు వేఱె యొకరికీడు
కీడు మేలు వారు పోఁడిమి దెలియరు,వి...609

భగవంతుఁడు సుకృతముచేసినవారికి మేలు దుష్కృతము చేసినవారికిఁ గీడు తప్పక కల్పించును. దుష్టునకుఁ గల్పించఁదగిన కీడు మంచివానికొసంగఁడు. సత్పురుషునకు సమకూర్పవలసిన మేలు దుష్టునకుఁ గూర్పఁడు. కర్మానుకూలఫలము లాతఁడొసంగుచునే యుండును. కీడనుభవించువారు మేలనుభవించువారు నీధర్మరహస్యముమాత్ర మెఱుఁగరనుటనిక్కము.

ఆ. కంకుభట్టనంగఁ గాషాయములు గట్టి
కొలిచె ధర్మరాజు కోరి విరటుఁ
గాలకర్మగతులు కనిపెట్టవలెనయా, వి... 610

తెలివిలేక యేల దేబిరించెదవు. దైవము నెంతవారైనను తప్పించుకొనలేరు. ధర్మరాజంతటివాఁడు దైవమును తప్పించుకొనలేక కాషాయము ధరించి కంకుభట్టు అనునామముతో సాటిరాజగు విరటుని కొల్చెను. కావున కాలగర్మగతులు కనిపెట్టి మెలఁగవలయును. మేము ఘనులమని గర్వింపఁదగదు.

ఆ. కట్టెపైననున్నఁ గట్టెకు ఘనమేమి
చెట్టుపైన ఘనముఁ జేరఁగలఁడె
కట్టె చెట్టు రెండు గలసె దైవంబులో,వి...

ఆశాపీడితులై మిద్దలుమేడలు ననియేడ్చుచుండెదరు. కట్టెపైననున్న నింకొక కట్టెకు ఏమి ఘనమువచ్చెను? మేడగాదు.



చెట్టుపైన (అనఁగా అంతయెత్తున) నున్నను ఘనతఁ గాంచఁగలఁడా? లేఁడు. చివరకీకట్టెయును ఆచెట్టును దైవములో కలియునట్టివై యుండును. కావున నజ్ఞానివై సుఖముల కాశింపకుము. అన్నియు నశించునవియే.

ఆ. కట్టెయందు నిప్పు గాననిచంద మీ
తనువునందు నాత్మఁ దగిలియుండు
మఱుగు దెలిసిపిదప మార్కొనవలెనయా,వి...

అజానులు తెలిసికొనఁజాలరు గాని దైవము మనశరీరములోనే ఇమిడి యుండును. ఎట్లనఁగా: కట్టెలో నిప్పు ప్రత్యేకముగా కనఁబడక యొకదానితో నొకదాని నొఱసినయెడల జనించును. అటులే శరీరములో చేరి యాత్మ యుండును. కావున ఆత్మయున్న రహస్యమును ముందెఱిఁగి ఆ పిదప స్వాధీనము చేసికొనవలయును.

ఆ. కడక నఖిలములకు నడినాళమందున్న
వేగుఁజుక్కవంటి వెలుగుదిక్కు
వెలుగుకన్న దిక్కు వేఱెవ్వరున్నారు?వి...613

సమస్తప్రపంచమునకు ఆధారమై బ్రహ్మనాళము నంటి యున్నాఁడు దేవుఁడు. ఆదేవుఁడు తెల్లవారుజామున మొలచు చుక్కలాగున వెలుగుచున్నాఁడు. ఆయనయే మనలకు దిక్కు. నిక్కముఁ బరికించిన నంతకన్న వేఱెవ్వరును లేరు.

ఆ. కడగి పట్టియాస కడతేఱనీయదు
ఇడుములందుఁ బెట్టి యీడ్చుఁగాని

పుడమిజనులభక్తి పోషవంగ నీయదు, వి...

ఎప్పుడును ఆశకుఁ జిక్కిపోవుము. అయ్యది నీకు మేలు చేయుదానిఁబోలి కావలయునని ప్రయత్నించి నన్ను గట్టెక్క నీయదు. నిన్ను ఎప్పుడును ఆపదలలో వైచి పడ నీడ్చుచుండును. నిన్నే కాదు. భూలోకమునందలి జనులకు భక్తినే కుదురనీయదు. కాన ఆశాత్యాగము ప్రధానకార్యము.

ఆ. కడుపు కేల మనస కళవళపడియెదు
కడుపు కేడ వృత్తి కలుగుచుండు
కరపరాతిలోనికప్పకుఁ గలుగదా? వి... 615

ఛీఛీ! పాడుమనస్సా! ఈపొట్టకై రాత్రింబవళ్లు ఇంతగా ఏల దుఃఖించెదవు? పట్టెడన్నము దొరకకపోదు. ఒకవేళ దొరకుచున్నను నీకు తృప్తియనుమాటయైనను లేదు. విచారించుము. నల్లరాయిలోని కప్పకు దేవుఁడాహారము నీయలేదా? కావున పొట్టకొఱకై దేవులాడకుము.

ఆ. కనకమృగము భువిని గలుగ దంచెఱుఁగఁడా
రాముఁ డెటుల గల్గురాజు గాఁడొ
చేటుకాలమునకు చెడుబుద్ధి పుట్టెడు, వి... 616

ఎంతటి బుద్ధిమంతుఁడైనను కానిమ్ము దైవమాయను దాఁటఁజాలఁడు. ఎట్లందురా? చూడుఁడు. రాముఁ డంతటిమేధావియయ్యును బంగరులేడి ఏలోకమునను లేదని యెఱుఁగఁడా? లేక ఎఱుకగలవాఁడు కాఁడా? కాకేమి? కావున చెడుకాలమునకు చేటుబుద్ధి పుట్టుచుండును ఇఁక సామాన్యమానవు లెంత?



ఆ. కలియుగమునఁ బుట్టి కడతేఱఁగా లేక
యొడలు జడలఁజేసి యుగ్రతపము
తమరు చేసి యేమి తత్త్వంబు గనలేరు, వి...

ఆలోచనలేనివారు కొందఱు నిశ్చలచిత్తముతో హృదయగతుఁడగు జీవుని గనుఁగొనఁజాలక పేరాసతోఁ దపముఁజేసి తరింపఁ బ్రయత్నింతురు. తపములు దానములు మున్నగువాని చేత దైవమును తలక్రింద చేయఁబూనుట వెఱ్ఱితనము. ఈకలియుగములో పుట్టినందుల కెట్టులో కడతేఱవలయును; గాని యుగ్రముగా తపంబుఁబూనుట తప్పిదము. చేసినమేలందురా? చేసినవారేమి సంపాదించిరి?

ఆ. కసువుఁ బసికిఁ జేసె గాలి ఫణికిఁ జేసె
మన్నెరలకుఁ జేసె మఱవ కెట్లొ
కుంభినీజనులకుఁ గూడట్లు చేసెరా, వి... 618

దైవసృష్టి విచిత్రము. ఆయన సృష్టిలో నేమియును లోపమును చేసియుండలేదు. పశువులను సృజించెను. వానికాహారముగ కసవును పుట్టించెను. సర్పమును పుట్టించెను. దానికి ఆహారముగా గాలిఁ జేసెను. మన్ను ఎఱ్ఱలకు ఆహారముగాఁ జేసెను. అట్లే భూమిలో ఎల్లవారికిని కూడునుగూడ సృజించెను. కాన ఆహారమునకై యాతననొందుట వెఱ్ఱితనము.

ఆ. కాఁగలపను లెల్ల కాకెట్లుపోవును
కానిపనులు కానె కావు భువిని
మహిమ వేఱ గలదు మనతోడ నున్నదా? వి.

కార్యసాధనమునకు దైవబలముకంటెఁ బురుషప్రయత్నమె ముఖ్యమని కొందఱందురు. కాని దైవబలమునకు మాఱెచ్చో టను లేనే లేదు. ఆతనియుద్దేశమే కొనసాగును. ఆతఁడు కావలయునని తలఁచినవి కానే యగును. కానివి కానే కావు. కావున కార్యసాఫల్యము మదిలో లేదని తెలియవలయును.

ఆ. కానలేఁడు నుదురు కర్ణముల్ వీఁపును
నెఱుఁగ గాన లేఁడు నెత్తిమీఁద
తన్నె కానలేఁడు దైవము నెఱుఁగునా? వి...

మనుజుఁడు అజ్ఞానియై దైవమును గనుగొందునను గాని తనసామర్థ్యమును తా నరయఁడు. తనచెవులను వీఁపును నెత్తి మీఁదనుండు వెండ్రుకలనుగూడ తానుగనఁజాలఁడు. చివరకు తన్నే తా నెఱుఁగఁడు. దైవము నిఁక నెట్లెఱుఁగఁగలఁడు?

ఆ. కానలేరు గాని కలియుగంబున నున్న
మనుజులందఱికిని మాన మొకటె
చార్థ్యమున్న యెడల దైవంబుఁ జూచును, వి...

మనుష్యులు అజ్ఞానవశులై "అందఱు నొక్కటే. అందఱి కును సమానముగానే సుఖదుఃఖములు కలుగును" అని తెలిసి కొనలేకపోవుట యొక్కటిమాత్రమే కాని మాన మందఱకును సమానమే. తమకు దైవభావములను చూడ శక్తిగలిగినయెడల దైవమును సమానముగా చూచును.

క. కాలగతిలయెంతవారికి
వాలాయము దులకదనము వచ్చుట్లుయరుదా



వ్రేల గిరినెత్తు కృష్ణుఁడు
తేలఁడె వటపత్రమందు తెలియుము వేమా!

ఎంతగొప్పవారికైనను కాలగతిని తప్పించుకొనుటకు శక్యముకాదు. సమస్తప్రపంచమునకు ఆధారభూతుఁడైన కృష్ణుఁడు ఒక్కవ్రేలితో పర్వతమును మోసెను గదా! అట్టివాఁడు సైతము కాలమునకు కట్టుపడి మఱ్ఱియాకుపైన తేలఁడా?

ఆ. కాలచక్ర మెఱుఁగఁగా లేక యెప్పుడు
సంధ్యజపము చేయుజాణలార
సంధ్యజపములోనిజాడ లెట్లుండును? వి...

"ఈసమయ మెట్టిది? ఇప్పు డేమిచేయవలయును? కాలము నారాధించుట యెటు?" అని కాలచక్రపుమాహాత్మ్యమును తెలిసికొనఁజాలక సంధ్య జపము చేయునట్టి జాణలారా! సంధ్యజపములో జాడ లెట్లుండునో చెప్పఁగలరా?

ఆ. కాలచక్ర మెల్లఁ గలవారిమన సెల్ల
సాగి తిరుగుచుండుఁ జంచలించి
చక్రగతిని విడువ స్తంభించు మన సట్లు, వి...

లోకులు తమంతటఁ దాము మనస్సును కుదిర్చికొని యున్న సాధనములతో కార్యమును సాధించికొనఁ దివురవలయునే కాని ఎప్పుడో సమయమువచ్చునని ఎదురుసూచుచుఁ గూర్చుండఁగారాదు. కాలమును కలవారిమనస్సును ఒకరీతిగా నుండెడివి కావు. ఎప్పుడును చంచలములై తిరుగుచుండును.

ఆ. కాల మధికమైనఁ గడచిపోవఁగ రాదు
ధర్మరాజుఁ గొల్చె తగనిచోటఁ
కంకుభట్టనంగఁ గటకటా యేమన? వి... 625

తన ప్రయత్నముకంటెను దైవబల మధికమైనచో నెంతటివాఁడైనను తప్పించుకొని పోరాదు. ధర్మరాజంతటివాఁడు దైవమునకు బద్ధుఁడై కంకుభట్టను పేర విరటుని సేవించెను. ఇఁకను తక్కినవారిగూర్చి యేమని చెప్పవచ్చును?

క. కాలము కాల మటనకను
మేలుగ తా నొక్కరీతి మితిమీఱఁగఁ దాఁ
గాలు నెదుర్కొను జ్ఞప్తిని
వాలాయము శివుని గూడి వర్ధిలు వేమా! 626

దైవము దైవ మని కొందఱు కాలము నెదురుచూచుచుందురు. బుద్ధిమంతులగువా రట్లు లెప్పుడో కాలము మంచిదగును. దైవ మనుగ్రహించు నని కూర్చొనక సాధ్యమైనంతవఱకు ప్రయత్నముచేసి మరణములేనిమార్గము నారసి ముక్తిచెందుట మంచిది.

ఆ. కాళ్లముంద తేరు కడ కీడఁగా లేక
ముగ్గురీతగాండ్రు మునిఁగినారు
నరుఁడె యీఁదు నన్న నగుబాటు గాదొకో? వి.

దైవకృతము నెట్టివారైనను తప్పించుకొనఁజాలరు. సర్వశక్తియుతులగు త్రిమూర్తులంతటివారలే సంసారమనునదిని దాఁటలేక, నిమగ్నులై పోవుచుండఁగా ఇఁక సామాన్యుఁడగు మనుజుఁడు ఈఁదుదునని చెప్పట నవ్వులచేటు గాదా!



ఆ. కీలకము లడంచి బై లెఱింగినవాఁడు
సింధుపుత్రిమాయఁ జిక్కె నతఁడు
శౌరియంతవాఁడె జనులకు శక్యమా? వి...

విష్ణుమూర్తియంతటివాఁడు పరమయోగియై సమస్తకీలకములను బోఁదోలి బ్రహ్మము నెఱింగినవాఁడయ్యును శౌరియయ్యును లచ్చిమాయలలోఁ జిక్కె ననఁగా: సాధారణజనులు మోహమును గెల్వలే రనుటలో నాశ్చర్య మేమి కలదు?

ఆ. కుక్క యే మెఱుంగు గురులింగజంగంబు
పిక్కఁ బట్టి యొడిసి పీకుఁ గాక
సంతపాకతొత్తు సన్నాసి నెఱుఁగునా? వి... 629

మూర్ఖులు ముముక్షుని చూచి పరిహసింతురేగాని యాతనికి గలిగిన మోదమును గుఱుతింపఁ జాలరు. ఎట్లనఁగా: నీచజంతువగుకుక్క గురువులే జంగములే యని సన్మానించునా? సన్మానింపదు. కండలు వెడలివచ్చునట్టులు పట్టుకొని పీకివెట్టును. సంతలోపాక వేసి లంజెతనముచే జీవించు దాసి సన్యాసులను (అనఁగా: స్వాములవారిని) తెలిసికొనఁ గలుగునా? తెలిసికొనఁజాలదు.

ఆ. కూటవాసి యగుచు గుణములఁ బచరించి
నీటనీడవలెను నిలిచియుండు
నుదకఘటములందు నుపరిసూర్యునిబోలె, వి...

దైవము ఇక్కడనక్కడయని లేక సమష్టిని సర్వవ్యాప్తియై గుణరహితుఁడయ్యు గుణములచే నొప్పుచు నుండును. నీటిలోని

నీడఁజొప్పున సాక్షిమాత్రుఁడై యొప్పియుండును. నీటికుండల లోని సూర్యుఁ డొక్కఁడైనను భిన్నులుగ నగుపడునట్టులు ఈశ్వరుఁ డుపాధిభేదమున వేర్వేరుగా గాన్పించుచుండును.

ఆ. కొండదండి మామ కొండకూఁతు రె యాలు
కొండమేటివిల్లు కొండయిల్లు
కొండవంటిదొరయు గుండయిపోయెరా, వి...

దైవబలముముందఱ నెవ్వరిబలము నేమాత్రము నుపయోగింపదు. ఈశ్వరుని ఉదాహరణముగా తీసికొనుఁడు. ఆయన దారిద్ర్యమును తప్పింపఁగలిగిరా? ఆయన మామగారు నిశ్చలుఁడగు హిమవంతుఁడు. కొండపట్టియగుపార్వతి పెండ్లాము. కొండయే విల్లు. ఉనికిపట్టుగూడ నొక కొండ. అయిన నంతవాఁడైనను దైవబలముముందఱ నెందుకును పనికిరాక శిలయై పోయెను.

ఆ. కొండరాళ్లఁ దెచ్చి కోరికఁ గట్టిన
గుళ్లలోన దిరిగి కుళ్ల నేల
పాయరాని శివుఁడు ప్రాణమై యుండఁగ, వి...

మానవులు విగ్రహారాధనపరాయణులై మనుష్యనిర్మితములగు దేవళములలోనే ముక్తియున్నదని భ్రాంతులై తారుమారగుచుందురు. అట్టివారలు వెఱ్ఱివాండ్రు, కాన మానవులారా! కొండరాళ్లతోఁ జేర్చినగుళ్లలోఁ పడి యేల కుళ్లి చచ్చిపోయెదరు? పాయఁజాలని శివుఁడు ప్రాణమై మిమ్ములను చుట్టికొనియే యుండినను మూర్ఖులై చెడిపోయెద రేల?



ఆ. కొడుకును బ్రతికించుకొనలేఁడు శంభుండు
కొడుకును బ్రతికించికొనఁడు శౌరి
దైవబలము లెల్ల దాననే గనుపించె, వి...633

సమస్తజగములను సృష్టింపఁగలిగిన నీశ్వరు నంతటివాఁడైనను దైవబలము నుల్లంఘింపఁగాఁజాలఁడు. శివునంతటివాఁడు కొమరుని బ్రదికించికొనెనా? విష్ణువునంతవాఁడు మన్మథుని బ్రదికించికొనలేకపోయెను. దీనివలన తక్కినబలము లన్నిటికంటెను దైవబలమే బలిష్ఠ మని తెలియుచున్నది.

ఆ. కోరి ద్రుపదుపుత్రి కొప్పుప ట్టీడ్చిన
సింహబలునిచావుఁ జెప్పఁదరమె
ముగియుకాలమునకు మొనగాఁడు నీల్గఁడా? వి.

కర్మములను చేయునప్పు డొడ లెఱుంగక యహంకరించి చేయును కాని ఫలకాలమున నెంతటిమొనగాఁడైనను దైవదత్తమగునాఫలము ననుభవింపక పోఁజాలఁడు. ఎట్లందురా? చూడుఁడు. కావలయునని పొగరుచేత ద్రౌపదిని కొప్పుబట్టి యీడ్చి కీచకుఁడు ఆఫలము ననుభవింపక తప్పించి కొనెనా? లేదు గదా!

ఆ. గతము చేసినట్టికర్మబంధము లెల్లఁ
బరిసిపోవు సత్యగురునివలనఁ
కుమ్మరి కొకయేడు గుదియకు నొకనాఁడు, వి.

ఎన్ని పాపములను చేసియున్నను ఎట్టికర్మబంధములు అడ్డుపెట్టుచున్నను అవి యన్నియును యథార్థముగా గురులక్షణ

ములు గలసత్యగురునికృపచేత పఱిసిపోవును. ఎట్లంటిరా? సంవత్సరమంతయును నగిషీ చెక్కి చేసిన కుంచెలన్నియును గుదియపాటునఁ బగులుచుండును.

ఆ. గతముఁ జూతమన్నఁ గలగన్న యర్థంబు
నడచుకాలమేని నమ్మరాదు
క్షణములోని బ్రదుకు సంసారవిభ్రాంతి, వి...

ఈప్రపంచమంతయును కేవలము బూటకముగా గనుపించుచున్నది. ఇందిసుమంతయైనను సత్యపదార్థముగన్పట్టదు. గతకాలమును పరికించినఁ గలలోనిధనమువలె నదృశ్య మగుచున్నది. రాఁబోవుదాని నెఱుంగనే యెఱుంగము కదా! పైని వర్తమానమునుకూడ నమ్ముటకు వలనుపడదు. క్షణకాల మీ బ్రదుకు సంసారమంతయును భ్రాంతికరము. కావున పరముఁ గనుము.

ఆ. చక్రధరుని వేఁడి జలధి దాఁటఁగవచ్చు
వికృతమైనబుద్ధి వెతలఁ బెట్టు
నక్రమెన్న గజము నయమార భక్షించు, వి...

బుద్ధిని లోఁబఱచుకొననేర్చినచో నెంతటి గొప్పకార్యమునేని సాధింపవచ్చును. బుద్ధి త్రిప్పుడులకు లోనుగాని మానవుఁడు భగవంతుని ధ్యానించి సంసారసముద్రమును దరింపవచ్చును. కాని పరధ్యానమను మొసలిమాత్రము స్థిరబుద్ధియనునేనుఁగును బట్టకుండ సాధకుఁడు జాగ్రత్తపడవలయును.



ఆ. చర్మమునకు స్పర్శ చక్కఁగా తెలియదు
కర్మముల్ పొసఁగుటఁ గానఁ గలఁడె
చర్మకర్మలుండు జగతిని నరులకు, వి... 638

మనుజుఁడు చర్మమువలన స్పర్శజ్ఞానముగలిగి వర్తించుచున్నాఁడు. కాని యాచర్మమే యొకపుడు స్పర్శము గ్రహింపలేకున్నది. అట్టిచోఁ బూర్వజన్మలబ్ధములనుకర్మములగుమానవుఁడెటుల గ్రహింపఁగలఁడు? మాకుఁ బూర్వకర్మజ్ఞానముగలదని విఱ్ఱవీఁగుట పొరబాటు.

ఆ. చిప్పలోనఁ బడ్డచినుకు ముత్యం బయ్యె
నీటఁబడ్డ చినుకు నీళ్ల గలసె
ప్రాప్తము గలచోట ఫలమేల తప్పురా? వి...

వస్తువులు ప్రాప్తిలేనివానియొద్దకు వచ్చినను ఫలమునీయవు. ప్రాప్తిగలచోట ఫలము నీయక తప్పించుకొనఁజాలవు. ఎట్లందురా? చూడుఁడు. వర్షము కురియుట అన్నియెడలను గలదు. ఆవర్షము నీటిలోఁ గురిసిన నీరై ఏమియును ఫలము కన్పింపక పోవును. ముత్యపుచిప్పలోఁ బడెనా ముత్తియ మగును.

ఆ. చిలుకగర్భమందు శ్రీశుకుఁ డుదయించి
మునివరేణ్యులందు ముఖ్యుఁ డయ్యెఁ
బ్రత్తికాయఁ జిత్రపటములు పుట్టవా?, వి... 640

మహానుభావులగువారెక్కడియుత్తమకులములనే గాక నీచకులములందును పుట్టుచుందురు. అందువలన వారిసామర్థ్యమున కేకొఱంతయునుండదు. చూడుఁడు. చిలుకగర్భమునందు

శ్రీశుకులవారు పుట్టిరి. సమస్తమునులకు ముఖ్యుఁ డయ్యెను. ఇట్టులనే ప్రత్తికాయ యెంతటిదో చూడుఁడు. దానివలన చిత్రవిచిత్రములగు బట్టలు పుట్టుట లేదా? అట్టులే.

ఆ. చీమ కుట్టెనేని జివ్వు కనుపించును
చీమ యెంత దాని సృష్టి యెంత
చీమవంటివాని సృష్టిలో నెఱుఁగుము, వి...

దేనినైనను చూచినమాత్రాన నలక్ష్యము సేయకుము. దైవబలము అన్నిఁటియందును గలదు. అయ్యది యలంఘ్యము. నొకచీమను ఉదాహరణముగా తీసికొనుము. అది మనశరీరముతోఁ బోల్చిచూచిన ఎంతపాటిది? అయిన నది కుట్టెనా చివుకు మనిపించును. కాన చీమవంటిసామర్థ్యములేని స్వల్పజీవములందు సైతమున్న ఈశ్వరు నెఱిఁగి మెలఁగుము.

ఆ. చేయఁదగినవేళఁ జేసెడికార్యంబు
వేగపడి యొనర్ప విషమ దౌను
బుడమకాయచేఁదు ముదిసిన తీపయ్యె, వి....642

ఏపని యెప్పుడు చేయవలయునో కనిపెట్టి చేయుచుండవలయును. చేయఁ దగినసమయములలో చేయుకార్యమును త్వరనొంది ముందుగా చేసిన విషమగును. ఎట్లనః బుడమదోసకాయ పండినపిమ్మట తీయగా భోజ్యార్హమైయుండును. పసిపిందెనుగోసితిందుమేని చేదుగఁ దినవీలుగాకుండును. ఇటులే నేకార్యముగాని త్వరపడి చేసిన విషమించును.



ఆ. చుట్టుగోడఁ బెట్టి చెట్టుఁ జేమయుఁ గొట్టి
యిట్టునట్టు పెద్దయిల్లుఁ గట్టి
మిట్టిపడును మీఁదిపట్టల యెఱుఁగఁడో, వి...

జనుఁ డజ్ఞానియై సర్వమును తనవశమునందే యుండుననియును తాన యీప్రపంచమున స్థిరుఁడగా నుందుననియుఁ దలఁచి చెట్టుచేమఁ గొట్టి పెక్కుకష్టముల ననుభవించి యింటి నొకదానిఁ గట్టి మిట్టిపడును; కాని రానున్నదాని నెఱుఁగఁజాలఁడు. ఇవియన్నియు నశాశ్వతములు. మోక్షమొకటియే స్థిరమని గ్రహింపఁడు.

ఆ. చూపు కొంచెమైనఁ జుక్కలు కాన్పించు
ప్రాపు వెలుగు లేదు పరువు గాదు
జ్ఞానదీపమువలెఁ గన్నులకును దోఁచు, వి...

సాధకుఁడు పద్మాసనముతో నేకాంతస్థలమునఁ గూర్చుండి చలింపక, చూపులను నాసికాగ్రమునఁ జేర్చి హంసమంత్రము జపించుచున్నచో హంసతత్త్వానుభవము కలుగును. పిమ్మట హృదయాకాశమువ బిందువు చలింపనీయకుండఁ జేసినచో ఎట్టి వెలుఁగుతోఁగూడఁ బనిలేక చుక్కలవంటి నాదబిందువులు గోచరించును. పిదప విజ్ఞానమునకు మూలాధారమగు జ్ఞానదీపము గోచరించి తీఱును.

ఆ. జ్ఞానవంతుఁ జూచు సరికర్మబుద్ధులు
వెఱ్ఱియంద్రు ప్రకృతి విడువలేక
వెఱ్ఱి కవని బ్రకృతి వెదకినఁ గల్గునా? వి...645

కర్మబద్ధు లగువారలు జ్ఞానప్రకాశునిఁ జూచి నిజము నెఱుఁగఁజాలక వెఱ్ఱివాఁడని యనుచుందురు; కాని వెఱ్ఱివానికి ప్రకృతి లోకమున నున్నదా?

ఆ. జ్ఞానుల మని యెంచి చపలాత్ము లగువారు
తెలివిలేమి తమ్ముఁ దెలియ లేక
కష్టగహనమందు గట్టిగాఁ జిక్కిరి, వి... 646

మూర్ఖులు లోకమునందు తామె జ్ఞానులమని యనుకొనుచు చపలులై తమ్ము తాము గుఱుతింపనేరక కష్టగహనములఁ బడి తిరుగుచుందురు. దైవస్వరూపము నెఱుఁగ నక్కఱలేదు. తమ్ముఁదా మెఱిఁగిన దైవము నెఱింగినటులె.

ఆ. తనకు లేనినాఁడు దైవము దూరును
తనకుఁ గలిగెనేని దైవ మేల
తనకు దైవమునకుఁ దగులాట మే శాంతి, వి.

మనుజుఁడు తనకు వీలగునంతవఱకును తానే యన్నిటికిని మూల మనుకొనును. తనప్రయోజకత్వము కొనసాగనినాఁడు దైవమును నిందింపఁబూనుకొనును. ఇయ్యది కేవలమూర్ఖ్యము. తనకును దైవమునకును గలసంబంధమే శమము. దానిఁ దెలియఁ జాలగు.

ఆ. తనకు ప్రాప్తిలేమి దాత లీయక యున్న
దోషబుద్ధిచేతఁ దూఱు టెల్ల
ముక్కు వంకఁజూచి ముకురంబు దూఱుటే, వి...



తనకు దొరకఁదగిన యదృష్టము లేనియప్పుడు తెలివిమాలినమనుజుఁడు దైవమును దాతలను దోషబుద్ధియై నిందింపఁబూనుకొనును. నిజముఁ బరికించిన నదియుచితముగాఁజాలదు. ఎట్లందురా? చూడుఁడు. అద్దములో ముక్కు వంకరగా గానుపించిన యద్దమును తిట్టవచ్చునా? కూడదు కదా! అట్టులే.

ఆ. తనదుమనసుచేతఁ దర్కించి జ్యౌతిష
మెంతఁ జేసె ననున దెంచిచూడ
తనయదృష్ట మెల్ల దైవంబ యెఱుఁగును, వి...

తనకు తానె ముహూర్తమునుఁ బెట్టుకొని కార్యసాఫల్యముఁ గాంచఁజాలక జ్యౌతిష మెంతటియాపదఁ దెచ్చి పెట్టెనని యనుచుందురు. కాని తనకు ఫలాఫలములు గలుగుటయును అదృష్ట మట్లగుటను దైవమే యెఱుంగును. కాని మూర్ఖుఁ డెఱుఁగఁజాలఁడు. కాననే జ్యోతిశ్శాస్త్రమును నిందించును.

ఆ. తనువు తను వటంచుఁ దపియింత్రు జనులార
తనువు లస్థిర మని తలఁపరాదె
తనువు కానఁబడమిఁ దలగునా మోక్షంబు, వి.

శరీరమె సకలధర్మసాధనమని కొందఱు చెప్పుచుందురు. ఇటులఁ జెప్పుటె కాక శరీరపోషణమునకె జీవితకాలమంతయు వ్యయము చేయుచుందురు. శరీరము శరీరము అని రాత్రింబవళ్లు పరితపించుచుందురు. మూర్ఖచిత్తులగు జనులారా! ఆశరీరము లస్థిరము లని తలంపరాదా? శరీరమేనాఁటికైన నశించునదె. శరీరము నశించినంతమాత్రమున మునిఁగిపోవునదిలేదు.

జీవుఁడు సాయుజ్యమునొందఁగలఁడు. గాన శరీరముమీఁద భ్రాంతియుంచుకొని మోక్షదూరుఁడవు కాకుము.

ఆ. తన్నుఁ దా నెఱుఁగఁడు తా నెవ్వరికి నేర్పు
ప్రాలుమాలి తిరుగుపశువుకొడుకు
కాసులకొఱకైన గర్మముల్ గట్టునా? వి...

ధనలుబ్ధులై ప్రపంచమున కుపదేశము నొసంగెద మని బయలు వెడలుదురు. ఎంతటి మూర్ఖులో చూడుఁడు. తన్నుతా నెఱుఁగఁజాలఁడు. కాని తాను నేర్పఁజూచును. ఎవ్వ రతని యుపదేశములవినెదరు? ఇంతమాత్రముఁ దెలియఁజాలక తొత్తుకొడుకు తిరుఁగుచుండును. ఇవి యన్నియును ధనలోభమువల ననే కలుగును కదా!

ఆ. తలఁప వశము గాదు దైవంబు బ్రహ్మంబు
తెలియరాదు బ్రహ్మదేవుకైన
నిసుకబావి త్రవ్వ నెవ్వరివశమయా, వి... 652

దైవరూపమగు బ్రహ్మమును కన్నులతో గాంచుటకు అశక్యము సరి కదా! మనస్సుతో నాలోచించుటకును అశక్యమై యుండును. బ్రహ్మదేవునంతటివానికైనను వశము కాదు. ఎట్లనఁగా ఇసుకలో బావి త్రవ్వుటకు ఎవరు శక్తులగుదురు?

ఆ. తల్లితండ్రిపూజ దారిఁ గనక కొంత
పాపకూపమందుఁ బడుట యేల
దానధర్మములకు దైవంబుతానయ్యె, వి...



దానములకు గాని ధర్మములకు గాని దైవము కారణము. అట్టిదైవము తల్లిదండ్రులస్వరూపమున నున్నాఁడు. మనుజులు మూర్ఖులై ప్రత్యక్షదైవతము లగుతల్లిదండ్రుల పూజింపక యేలకో పాపకూపములఁ బడిపోయెదరు?

ఆ. తాము నిలుచుచోట దైవము లేఁడని
పామరజనులు తిరుపతుల కరుగ
జోగిఁ జేయు చేతిసొమ్మెల్ల బోఁజేయు,వి...654

మనుజుఁ డెన్నిచోటుల కేఁగినను దైవము సమానముగనే ప్రతిఫల మిచ్చుచుండును. ఎట్లందురా? చూడుఁడు. మూర్ఖులై కొందరు పామరులు తాము నిలుచుచోటుల దైవము లేఁడని తిరుపతులకు దేవస్థానములకు పోవుచుందురు. అట్టివారు ముక్తి లేక జోగియగుట యటుండగా చేతిలో నెట్టిని యేగాని నైనను లేకుండునట్లు కర్చుచేసికొని బిచ్చగాం డ్రయ్యెదరు.

ఆ. దశరథుండు రామధరణీశుపట్టంబుఁ
గట్టఁజేయఁదలఁపఁ గట్టె జడలు
తలఁపు మనదిగాని దైవిక మది వేఱె, వి...655

మనుజుఁ డెన్నివిధములఁ బ్రయత్నించినను దైవబలమే నెగ్గుచుండును. చూడుఁడు. దశరథుఁడు గొప్పచక్రవర్తి. అంతటివాఁడు రామునిపట్టముగట్టుటకు ప్రయత్నముచేసెను. కాని దైవము జడలు గట్టచేసెను. కావున కోరిక మనస్వాధీనమైనది గాని కొనసాగుట దైవునివశమేయని యెఱుఁగునది.

ఆ. దాఁచినధనమునకుఁ దాసును కొడుకులు
వాంఛపడుట కానె పట్టిభ్రమలు
భాగ్యహీనునకును ఫలము లభించునా! వి....

మనుజులు తెలివిలేమిచేత దాచిపెట్టినధనమునకు తామును తమకొమరులును వారసులని భ్రమింతురేగాని ఫలముమాత్రము లభింపదు. ఏలయని యందురా? భాగ్యము దైవాయత్తముకాని మనుజుని స్వాధీనముకాదు. కావున భాగ్యహీనునకు ఫలము లభింపదు. కాన తనవారికని దాఁచిన ధనము వారికె చెందు నని తలంచుట ప్రమాదము.

ఆ. దానధర్మములకుఁ దగు తేపు తేపని
కాలవ్యయము సేయుకష్టజనుఁడు
తాను నేమి యౌనొ! తనబ్రదు కేమౌనొ? వి...

మనుజుఁడు తానే స్థిరుఁడ ననుకొని బ్రతికియున్నంతలో దానధర్మములను చేయక తేపు తే పని కాలమును జంపి కష్ట పడుచుండునే కాని తా నేమి యగునో, తనబ్రదు కేమియగు నో యని విచారింపఁడు. ధర్మ మనుకొన్నపుడే చేయవలెను.

ఆ. దైవమతుల నరులు తమవంటివా రని
యరసి గూఢతత్త్వ మెఱుఁగలేరు
ఇల్లు మూయఁబడిన నెట్లు మర్మ మెఱుంగు? వి.

దైవబుద్ధి గలపెద్దలనుచూచి మూర్ఖులు వారిని గూడ తమ వంటివారినిగనే తలఁచి పరిహసించుచుందురే గాని చక్కఁగా విచారించి యెఱదలి రహస్యము నెఱుంగఁజాలరు. ఇల్లు మూ-



యఁబడిన పిమ్మట ఇంటిలోని నిజస్థితి తెలియఁజాలరు కదా? అట్లే వీరును అజ్ఞానాంధులై మహాత్ములయందున్న జ్ఞానతేజము దర్శింపలేరు.

ఆ. ధనమదంబుచేత దైవంబు నెఱుఁగరు
కుటిలభావ మొంది క్రూరజనులు
మదము మించినంత మన్నన లేదయా, వి... 659

మూర్ఖులు మేము ద్రవ్యము కలవారము కదా! యని మదించి దైవమును వక్రబుద్ధులై గుర్తెఱుఁగక క్రూరులై మెలఁగు చుందురు. అట్టివారికి గతి లేనేలేదు. ఏల ననఁగా: మదము మించినమాత్రాన వారికి మన్ననయే లేదు.

ఆ. ధరగ్రహములు రాశి చరియించు చుండిన
మంచిచెడుగు గానుపించుచున్నఁ
బురుషయత్నమనుచు బొంగుదు రేలరా? వి. 660

గ్రహములు ఆయారాసులఁ దిరుగుచు ప్రత్యక్షముగా మంచిచెడ్డలు వేరువేరుగా కలిగించునప్పటికిని మూర్ఖజనులు అంతయును పురుషప్రయత్నమని బోరగిలఁ బడుచుందు రెందు లకో తెలియదు.

ఆ. దైవకంటకుండు ధనముచే గర్వించి
సకలసంపదలను చాలఁ దనిసి
కడకు తాను మేలు గానక చెడిపోవు, వి....

దైవమును నిందించువాఁ డెప్పటికిని బాగుపడఁజాలఁడు. అట్టివాఁడు కేవలమును ధనకారణమువలన గర్వించి సమస్తసం-

వదలను తృప్తుఁడై చివరకు తనంత తానే మేలును పొందక చెడిపోవఁ గలఁడు. కాన మానవుఁడు దైవనిందనము జేయ రాదు. ఇది పాపహేతువు.

ఆ. ధర్మబుద్ధిచేత దైవంబు తెలిసినఁ
గాలుఁ డేమిసేయఁగలఁడు ప్రజల
ధర్మమంటి వెంట దైవంబుగా నుండు, వి...662

ధర్మాధర్మములఁ బరికించి ధర్మవర్తియై దైవ మిట్టిది యని తెలిసికొనినవానిని యమధర్మరాజయినను ఏమియును కదల్పఁ జాలఁడు. దైవ మెల్లప్పుడును ధర్మము ననుసరించియే మెలఁగు చుండును. ధర్మస్వరూపుఁడగు దేవునికాదని యముఁడు జీవులఁ దేరియైనఁ జూడలేఁడు.

ఆ. నక్క నోటికండ నదిలోనిమీనుకై
తిక్కపట్టి విడిచి మొక్కు చెడఁగ
మక్కువపడి గ్రద్ధ మాంస మెత్తుకపోవు, వి...

దైవగతుల నెఱుఁగ నెవ్వరికిని శక్యము కాదు. నక్క యొకటి నోటితో మాంసపుకండను కఱచుకొని దైవముచే పంచి తమై యేటిలోనిచేఁపను పట్టుకొనుబుద్ధిని నోరుతెఱచెను. అంత నది పడిపోయెను. ఆసమయమున గ్రద్ద యీమాంసమును తన్ను కొని పోయెను. ఎవనిసొమ్మెవనికి ప్రాప్తమో చూడుఁడు.

ఆ. నీళ్లమీఁద నోడ నిలచి తిన్నఁగ సాగు
బైటమూరెఁడైనఁ బ్రాఁక లేదు
నెలవుఁ దప్పుచోట నేర్పరి కొరగాఁడు, వి...



సమయము ననుసరించి మనుజుల ప్రయత్నములు ఫలించు చుండునే గాని యితరమువలనఁ గాదు. ఎట్లందురా? చూడుఁడు. నీటిలో పోఁగలయోడ గట్టెక్కిన మూరెఁడైనను పోవఁజాలదు. అట్టులే మనుజుఁడును నెలవుదప్పినపిమ్మట నేర్పరి కాఁజాలఁడు.

ఆ. నీళ్లలోన మొసలి నిగిడి యేనుఁగుఁ బట్టు
బయలకుక్కచేత భంగపడును
స్థానబలిమి కాని తనబల్మి కాదయా, వి...665

మనుజుఁడు స్థానమును కాలమును దైవము ననుసరించి మెలఁగవలయును. అట్లయిననే ఫలలబ్ధి గలుగును. నీళ్లలో నుండి యేనుఁగునుపట్టుకొనునంతటిబలము గలమొసలియునునీటినివదలి బయటఁ బడెనేని కుక్కలచేతఁ జిక్కి చావఁ గలదు. కావున స్థానబలము ప్రధానము గాని తమతమబలములు ప్రధానములు కావు. ఈస్థానబలముకూడ నొకవిధమగు దైవబలమే.

ఆ. నొసట వ్రాయువాని నొసలు కొంచెము సేయు
నొసటికంటె వాని నొసలు వ్రాఁత
నొసటిమీఁది వ్రాఁత నులిమినఁ బోవునా? వి...

ముఖముమీఁద వ్రాయును ఈశ్వరుఁడు కాని ఆనొసలు అత్యల్పమే. నొసటికంటెగూడ నద్దానిపైని వ్రాసినవ్రాఁతయే యెక్కుడుది. అయ్యది తుడిచినను పోక ఫలము నిచ్చునట్టిది. కావున బలవత్తమము.

ఆ. పరభృతమ్ము కాకపాలితమ్మైనట్లు
దారిఁ జూపపలయుఁ దదజ్ఞుఁ డొకఁడు

తొంటిజన్మఫలము తుద కెట్టు లొప్పిన, వి...

పూర్వజన్మమున కగుఫలము ఎట్టులున్నను సజ్జనుఁడగువాఁ డెవ్వఁడైనను దారిచూపునంతవఱకును లోకులు దైవరూపమును గాని ఆత్మతత్త్వమును గాని యెఱుఁగఁజాలరు. ఎట్లనఁగా: కోకిల కాకముచేత మనుకుఁ బడునంతవఱకును పెరుగఁజాలని యట్టులు. పెరిగినపిమ్మట తన్నుఁ దాఁ బోషించుకొనుటలేదా!

ఆ. ప్రళయకాలమందుఁ బ్రమథులచేతను
నష్టమేరిగాదె నాటిజనులు
తెలియనేరరైరి దేవుని ద్విజు లెల్ల, వి. 668

ఆయాయ్యకాలమును కర్మము ననుసరించి దైవము భిన్నభిన్నములగు రూపముల నావిర్భవించి ప్రపంచమున కుత్పత్తిస్థితిలయములు కలిగించుచుండును కాని యట్టివానిని సామాన్యులు గుర్తింపలేరు. ఎట్లనఁగా: మున్ను ప్రళయకాలమునందు ప్రమథులచేత నాటిజనులు నష్టమైరి కదా! వారిని అప్పటివారు దైవరూపులనుగా నెఱుఁగకపోయిరి.

ఆ. బల్లిపలుకులు విని ప్రజ లెల్ల తమపనుల్
సఫలము లగు ననుచు సంతసించి
కానిపనులకు తమకర్మ మటందురు, వి... 669

లోకులు మిక్కిలి మూర్ఖులు. కలసివచ్చునంతవఱకు తమ బలము. కలసిరాకున్న కర్మబలము అని యందురు. శకునములను బుద్ధిని బల్లిపలుకులు మున్నగువానిని విని సంతుష్టులై కార్యములను నెఱవేర్పక యుండి శకునవిశ్వాసముచేఁ దమకుఁ దా



నెఱవేఱునని తలంచుచుందురు. ప్రయత్నలోపముచే కార్యము నష్టమైనటుల స్పష్టముగా నెఱింగియు జను లాలోపమును దమపై నుంచుకొనక కర్మము నెత్తిని వేయుదురు. ఇది యజ్ఞానము కాదా!

ఆ. మరణమన్న వెఱచి మది కలఁగఁగ నేల
నిరుఁడు ముందటేఁడు నిన్న మొన్న
తనువువిడిచినతఁడు తనకన్న తక్కువా? వి...

పండితులును పామరులు నగువారెల్లరును మరణ మనిన భయము నొందుచుందు రేలకో తెలియరాక యున్నది. మరణము ప్రపంచమునకంతకును స్వభావమైనదియే కదా! గడచిన దినము గతవత్సరము ఆక్రిందియేడు తమవంటివారందఱు మృతి నొంది యుండలేదు. వారు తమకంటెఁ దక్కువవారు.

ఆ. మఱియు దధిని ఘృతము ప్రసూనులం దనలము
సౌమ్యసుమములందు సౌరభంబు
తిలలతైల మట్లు తేజరిల్లు చిదాత్మ, వి... 671

దైవము చిదాత్మరూపుఁడై మనము ప్రతిదినమును చూచుచుండుపదార్థముల నెల్లయెడలను వ్యాపించి వేర్పడి కనుపించుచుండును. ఎట్లనఁగా: పెరుఁగులో నేయికలసియుండి వేర్పడునట్టులే ప్రసూనులలో నగ్ని యంతర్భూతమై యుండి తఱచిన బయలుపడినట్లే పువ్వులనుండి పరిమళముపుట్టునట్టులే తిలలతైలము నేర్పడునట్లే ఈశ్వరుఁడును జగదంతర్భూతుఁ డయ్యును వేఱుగా వెలుఁగుచుండును.

ఆ. మన్ను మెత్తి కడిగి మఱిరూపు గావించి
గుంటనిండఁ బూడ్చి గుఱుతు నిల్పి
మనుజు లెల్లఁ గూడి మఱి దేవుఁడందురు, వి...

ఈశ్వరుని ఆరాధకులగు భక్తులు ఏఱినరూపమే కాని స్వతస్సిద్ధమైనట్టిరూప మితర మేదియును లేదు. ఆయనవిరూపుఁడు. అయినను అతని ధ్యానించువార లాతనికి రూపవిభేదముల నొనర్చి స్థితిస్థాపకగుణముల గలిగించుచుందురు. అట్టిగుఱ్ఱు నే దైవ మందురు కాని వేఱుకాదు.

ఆ. మాయ జగ మటంచు మనుజుఁ డెఱుఁగ లేక
మాయలోనఁ దాను మగ్నుఁ డయ్యె
మాయఁ దెలియునరుని మర్మజ్ఞుఁ డందురు, వి...

మనుజుఁడు మోహితుఁడై ఈప్రపంచమంతయును మాయావిలసనమే యని తెలిసికొనఁజాలక తానుకూడ మాయయందు మగ్నుఁ డయ్యెను. అనఁగా ముగ్ధుఁడయ్యెనని భావము. ఆమనుజుఁ డెంతకాల మట్టు లున్నను వివేకి యనఁ దగఁడు. మాయ దెలిసికొనునట్టిమనుజు నేమర్మమెఱిఁగినవాఁడని యనెదరు.

ఆ. ముద్ర చేతఁ బట్టి మొదటఁ దెలియ లేక
విశ్వకర్మఁ బట్టి విడువ లేక
విశ్వకర్మ దిట్టు వెఱ్ఱులువడుదురు, వి... 674

యోగము నవలంబించి మూలాధారవికసనగా నవలయును. ఈరీతిగా యోగము నవలంబింపలేక మూలాధారుని నిర్మింపను



లేక కేవలము దైవము పక్షపాతము నొనర్చెనని ప్రపంచనిర్మాతయగు దేవుని మూర్ఖులు దిట్టుచుందురు. అట్టివారు నశింతురు.

ఆ. మునిఁగి మునిఁగి మునిఁగి ముద్దయై ముద్దయై
పనరి పనరి పనరి వక్కి వక్కి
తిరిగి తిరిగి తిరిగి దిమ్మరై యుందురా, వి... 675

జ్ఞానశూన్యులగు మనుజులుకొందఱు ధనవ్యయముతో ముక్తి వచ్చునని భ్రాంతినొంది పుణ్యనదులలో మునిఁగి చలిచే ముద్దలై పణఁకుచుందురు. మఱికొంద ఱుపవాసాదులచేఁ గృశించుచు దేశమంతయుఁ గాకులవలెఁ దిరుగుచుందురు. వీరు సాధించునది జ్ఞానము మోక్షము కాదు. దేశద్రిమ్మరితనము మాత్రమే.

తే. మెక్కఁ జేసెడువాఁడును మేను మఱవ
నిద్రఁ బోఁ జేయువాఁడును నిఖిలగతులఁ
జూపి యిల బద్ధులను చేయు సూక్ష్మరూపుఁ
డా మహాదేవుఁడే కదా యవని వేమ! 676

మనల నీజగములందు పుట్టించి బ్రదుకుటకు జీవనమును గల్పించి సుఖ మొనఁగూర్చి భుజింపఁజేసి హాయిగా నిదురింపఁజేసి సమస్తవిధములచేతను నడపించి కర్మబద్ధులను జేయు సూక్ష్మరూపుఁడే ఆమహాదేవుఁ డని యెఱుఁగవలయును.

ఆ. మెలఁత నడవి నుంచి మృగము వెంటనె పోయె
రామచంద్రు కన్న రసికుఁ డేఁడి
చేటుకాలమునకుఁ జెడుబుద్ధి పుట్టును, వి... 677

ఎన్నియుక్తులెఱిఁగినను ఎంతటి విజ్ఞులయినను చెడుకాలము దాపరించినప్పుడు దైవముచేత వంచితులై చెడిపోవుచుందురు. ఎట్లందురా? చూడుఁడు. శ్రీరామునంతటి రసికుఁడుకూడ చెడుకాలమునకు బద్ధుఁడై ఆఁడుదాని నడవిలో నుంచి లేడివెంబడిపోయెను గదా! అట్టులే యందఱును.

ఆ. ప్రాఁసు తగిన దైన మహితమౌ వస్తువు
గా నొనర్తు రట్లుగాక యున్న
కాల్తు రగ్గిఁ గాదె కర్ములనను పాట్లు, వి...678

సత్కర్మలు గావించినవారికి సత్ఫలము, దుష్కర్మములు గావించినవారికి దుష్ఫలము లభించుట సాజము. వృక్షమువంటి జడముగూడఁ గర్మవశమున జంపుగా సాపుగాఁ బెరిగెనేని దానిని బనిముట్లుగా నుపయోగించుకొందురు. అట్లుగాక విచ్చలవిడిగా వంకలతో ముడులతోఁ బెఱిఁగెనేని వంటకట్టెలుగాఁ గాల్తురు.

ఆ. మృగములకు నరులకు మేలుఁగాఁ బశువులు
తినగ దున్నఁ బాలుకొనఁగఁ బుట్టి
కష్టపడును వానికర్మ మీడేరదే, వి... 679

మనుజులుగాక పశువులు సైతము కర్మానుభవము పూర్తిఁజేసికొనుటకై భూలోకమునజన్మించుచున్నవి. జంతువులకుఁబూర్వకర్మములవలని పీడయే లేనిచోఁ గ్రూరమృగములకు సామాన్యమృగములేల యాహారము కావలయును. మనుష్యులకు మృగములేల కృష్యాదులలో దాస్యముచేయవలయును? ఇటు లవస్థపడినను జంతువులకర్మముత్వరగా నీడేరకుంటపరితాపకరము. దీనిచే మానవకర్మముకంటె జంతుకర్మమె బలీయమని తోఁచుచున్నది.



ఆ. రాళ్లఁ బూజచేసి రాజ్యముల్ తిరిగియు
కానలేరు ముక్తికాంత నెపుడు
తానయుండుచోట దైవంబు నుండఁడా? వి...

దైవము నెఱుఁగఁదలఁచినవాఁడు తనలో దాను బరికించి యాత్మనిజరూపము నెఱిఁగి ముక్తినొంద యత్నింపవలయునే కాని ఎన్నివిగ్రహములఁ బూజించినను ఎన్నెన్నిదేశములను తిరిగినను ముక్తికాంత నెఱుఁగఁజాలరు.

ఆ. లంకపోవునాఁడు లంకాధిపతి రాజ్య
మంత కీశసేన లాక్రమించె
చేటుకాల మైన జెఱుప నల్పుఁడె చాలు, వి...

కాలము విపరీతమై వచ్చునప్పుడు అల్పవస్తువుకూడ నధికమగునుపద్రవమును చేయఁజాలును. ఎట్లందురా ? లంక పోవలసినకాలము దాపించినప్పుడు అంతటిరావణునికూడ లక్ష్యము సేయక క్రోఁతిమూకలు ఆక్రమించి కొల్లపెట్టలేదా! అట్టులే.

ఆ. వద్దనంగఁ బోదు వలె నననఁగా రాదు
తాను జేసినట్టి దానఫలము
ఉల్లమందు వగవకుండుటే యోగంబు, వి....682

తాను మనస్ఫూర్తిగానైనను అయిష్టముగానైనను చేసియున్నదానిఫలము వలదని వారించినను పోఁజాలదు. లేని

యపుడు కావలయునన్నను రాదు. కావున ఫలలుబ్ధుఁడై పగవ కుండుట బుద్ధిమంతునికి తగును.

ఆ. విత్త మొకరి కిచ్చి వితరణగుణమునఁ
జిత్త మొకరి కిచ్చి చెఱిచినాఁడు
బ్రహ్మచేత లన్ని పాడైనచేతలు, వి... 683

దైవనిర్మాణము లన్నియు నగమ్యమహిమములు అయియుండును. సాధ్యసాధనములను ఒకచోట గూర్చకుండుట కాతఁడు యత్నించుచుండును. ఎట్లందురా? చూడుఁడు. ధన మొకరి కిచ్చును. దానగుణ మితరునికిచ్చును. చిత్తము నొకరికిచ్చును. వికాసము నొకని కిచ్చును.

క. విధికృత మందు రె యన్నియు
విధికిని విధి లెస్స యయ్యె విష్ణు నుతింపన్
విధి యెప్పుఁ డందు రావల
విధి బ్రహ్మము తలఁపఁదలఁప వెలయుర వేమా!

ఏమాత్రము అవశ్యమగుకార్యము కలిగినను జనులు విధికృతము అని యందురు కదా! విచారించితిమేని ఆవిధికినిగూడ విధి విధికృతముగలదు. ఆతఁడే విష్ణువు. ఈరీతిగా విధికి విధికిని నుత్తరోత్తరముగా పరికించిన అన్నివిధులకును బ్రహ్మ మొక్కటియే మూలకంద మగునని తెలియఁ గలము.

ఆ. విప్రవరుముహూర్తవిభవము నమ్ముచు
పెద్దల నొగి గూర్చి పెండ్లి చేయు
నువిద ముండయౌ ముహూర్తము నిజమెట్లు? వి.



మానవునియూహాపోహ లెప్పటికిని సత్యములు కాఁజాలవు. ఏమందురా? మనుజుఁడుతనచేత నేమో యున్నట్టు లూహించి బ్రాహ్మణులఁ గూర్చి ముహూర్తము పెట్టించి పెండ్లిసేయుదురు. అయినను కొందఱు విధవలగుచున్నారు. ఇఁక ముహూర్తము నిక్కమని యెట్లనఁగలము? ఆయూహాపోహ లెట్లు సత్యము లగును?

ఆ. వెళ్లివచ్చునాఁడు వెళ్లిపోయెడి నాఁడు
తేను లేఁడు కొంచుఁ బోను లేఁడు
తా నదేడఁబోనో ధన మేడఁబోవునో, వి...

మానవునకుఁగల ధనాశ కడుచిత్రమైనది. తాను బుట్టునపుడు ధనము వెంటఁ గొనివచ్చినది లేదు. చనిపోవునపుడు వెంటఁగొనిపోవునదిలేదు. తనద్రోవ తనది ధనముత్రోవ ధనముది. ఇట్టి ధనముకొఱకు మానవులేల పెనుఁగులాడెదరో తెలియకున్నది.

ఆ. వీరుఁడైన లేదు విద్య నేర్చిన లేదు
సత్కులమున లేదు సటల లేదు
జన్మఫలమె కాని జపియించినను రాదు, వి...

మనుజునకు భోగభాగ్యము లన్నియును జన్మఫలమునానే కలుగవలయును గాని వీరుఁడైనను విద్యల నన్నిఁటిని నేర్చికొనినను సత్కులమున జన్మించినను సర్వవిధములఁ జడలఁదాల్చి కష్టముల పాల్పడినను జపించినను రాఁజాలవు. కాన ప్రాప్తిలేని దానికై ప్రయత్నముచేయ నవసరముండదు.

ఆ. వెండికొండ పసిడికొండయుఁ దన కుండ
దేవుఁ డేలఁ బోయి తిరిపె మెత్తె
దైవబలము కాని తనబల్మి కాదయా, వి... 688

కలిమిలేములకు దైవము కారణమగును కాని తాను కాదు. అని కొందఱు వాకొందురు గాని యది సంభవముగాదు. దేవునకుఁ గూడఁ గలిమిలేములు కలుగుచుండ మానవులకుఁ గలుగుట లెక్కయా! ఎట్లనియందురా? వెండికొండయును మహామేరువును తనకు కరతలామలకములవలె సన్నిహితములై యుండఁగా నీశ్వరుఁ డంతటివాఁడుకూడ తిరిపెము ఎత్తికొనవలసి వచ్చెనుకదా! కావున దైవబలముగూడ నొకయెడఁ గలిమిలేములకు లోఁబడును.

ఆ. వేలకోలఁది భువిని వేషము ల్దాల్తురు
ప్రాలుమాలి బువ్వఫలముకొఱకు
మేలు కాదు మదిని మిన్నందియుండుము, వి...

ప్రపంచములో ననేకులు అజ్ఞులై వేలకోలఁది వేషములను వేసికొనుచుందురు. అవి యన్నియును పొట్ట నింపుకొనుటకే కాని పుణ్యముకొఱకు గాదు. అట్లు చేయుట మంచిది కాదు. కావున నీ వట్లుగాక మనస్సునఁ దృప్తుఁడవై యుండి యచ్చభావమున మెలఁగుము.

ఆ. వ్యాధిపీడితంబు వ్యసనసంతాపంబు
దుఃఖసంభవమునఁ దొడరు భయము
లేనివార లుండ రేనాటికైనను, వి... 690



ఎట్టివారికైనను దుఃఖములు కలుగక నేకలుగుచుండును. బుద్ధిమంతుఁడగువాఁడు వాని నన్నిటిని సహజములుగా తలంచి విచారము నొందక మెలఁగవలయును. నిజమును పరికించితిమేని యీప్రపంచమునందు రోగము విచారము భయము మున్నగునవి లేనివార లొకరైన నుండనే యుండరు.

ఆ. శాంతమానసమునఁ జల్లనై శీతల
ఖ్యాతి నున్నవాఁడు పరమయోగి
అట్టివాఁడు ముక్తి నతివేగఁ గైకొను, వి...691

ఇతరులదూషణభూషణాదులకు వికారము నొందక కేవలము శోకమోహవర్జిత మగుబుద్ధిగలవాఁడై శాంతుఁడై చల్లగానున్నవాఁడే యోగులలోనుత్తముఁడనిపించుకొనును. ఇట్టివాఁడు మోక్షము నతివేగముగా పొందఁగలఁడు.

ఆ. శిలలు దేవతలని స్థిరముగా రూపించి
మంటిపాలై రెరి మనుజు లెల్ల
మంటిలోనిరాళ్ల మదిలోన తెలియరు, వి...692

మూర్ఖులై రాళ్లనే దైవరూపములని లోకులకు నిరూపించి చిట్టచివరకు అశాశ్వతులై మంటిలో కలసిపోయిరికదా! ఇప్పటికైనను తత్త్వము ప్రత్యక్షముగా నున్నప్పటికిని రాళ్లను మనవలె మృద్వికారములే యని తెలియరు.

ఆ. శివునియనుభవంబు సృష్టిలోపల లేక
సంశయం బుడుగదు సాధకులకు
చెలఁగు దివ్వె లేక చీకటి వాయదు, వి...693

ఎంతటిసాధకులయినను ఎన్నివిధములగు నుపకరణములను కలిగియున్నను శివానుభవము లేక సందేహము నశింపదు. తత్త్వము బోధపడదు. ఏలయని యందురా? చూడుఁడు. దీపములేక చీకటి పోవునా? పోదు గదా! అట్టులే!

ఆ. శుద్ధదృష్టి లేక శుక్రసంతతివాఁడు
పట్టు లేక మనసు పారవిడిచి
కన్నుఁబోవఁ బిదప గాకిచందం బయ్యె, వి...

వక్రబుద్ధి యెట్టివారికైన నుండరాదు. దానివలన తప్పక ముప్పు నొందును. శుక్రసంతతి యాగతానాగతవేదియుకూడ శుద్ధమనస్కుఁడు కానికారణమున మనస్సును జయింపలేక బుద్ధిఁ జొనిపి యందులకు ఫలముగా కన్ను పోఁగొట్టుకొని కాకివలెయుండలేదా? కావునపరిశుద్ధబుద్ధియై మెలఁగవలయును.

ఆ. శూలి నెంచి మదిని శుద్ధాంతరంగుఁడై
కాలకర్మములను గాలఁ ద్రొక్కి
మేలుపూర్ణపదని మెచ్చునుశివయోగి,వి....695

ఉత్తముఁడగుయోగి మొదలమొదల నీశుని భజించి యంతఃకరణమును నిర్మలముగా నొనర్చికొని కాలకర్మములను అడఁచివైచి యుత్తమోత్తమమగు పరమేశునిపూర్ణస్వరూపమును గని వదలక సర్వదా తదేకచిత్తుఁడై యానందించుచుండును.

ఆ. సకలతనువు లెత్తి సంచరించుచు జీవి
కలిమిఁ బలిమిఁ దగిలి కలవరించు
నాత్మతేజమూని యెచ్చుగాఁ జూడరా, వి...



ఈజీవుఁడు సమస్తజన్మముల నుత్తమముల నధమములగు వాని నన్నిఁటిని ఎత్తి తిరుగుచు కలిమిబలమున కష్టముల నొందుచు జనన మరణములఁ బడి కొట్టుకొనుచుండును. కావున నీవు మరలమరల జన్మము నొందనక్కఱలేకుండ జేయఁగల యాత్మతేజమును పరికించి తృప్తుఁడవై మెలఁగుము.

ఆ. సకలవస్తువులను సంతతతనువుల
వుసురి కేడ పంచభూతములను
దానిదానిచేతఁ దగుభూషణము చేయు,వి...

ఏవస్తువును పరికించినను ఎన్నియో శరీరములం దుపభావము లగుచుండును. ఇట్టు లుండినచో నీఁక యును రననేటివి. పంచభూతములను పంచభూతములచేత నలంకరించుట కిక యవసర మేమియును లేదనిభావము.

ఆ. సగరుఁ డుర్వి రాజచక్రవర్తియు నయ్యె
పరులు తన్నుఁ బొగడ బ్రదుకుచుండె
నిట్టిఘనత వీరి కెందున కయ్యెరా? వి... 698

సగరుఁడు అందఱివలెనే రాజై యుండియును చక్రవర్తిత్వము నొందియుండినను ఇతరులుచేయు స్తుతిపాఠముల కలరుచు బ్రదుకుచుండెను. ఈరీతిగానగు గౌరవములు వీరికెందువలన నయ్యెనో తెలియదు. అంతయును దైవనిర్దిష్టమని భావము.

క. సర్వము తానని తెలిసిన
నిర్వాణికి గాక ముక్తి నిలువఁగ వశమా?

యుర్వెల్లఁ దాను దిరిగినఁ
బర్వతబిలజలధులందు బడినను వేమా! 699

మనుజుఁ డెన్నిదినములు ఏయేవిధమున ప్రపంచమునంతయును చెడఁదిరిగినను గుహలలో సంచరించినను బిలములలో సముద్రములలో మునిఁగినను సమస్తప్రపంచమును నేనేయని బుద్ధిపొడమనంతవఱకు ముక్తినొందఁగాఁ జాలఁడు.

ఆ. సర్వ మొకటి చూడు సమకూరును ధ్రువంబు
చెప్ప వేయఁబోకు రేయిఁ బవలు
పగలులోనిపగలు పరమాత్మభావము, వి...700

ముక్తి వలయు నేని నాచెప్పినచొప్పు నవలంబింపుము. సమస్తమును ఒకబుద్ధితో చూడుము. అందువలన స్థిరత యలవడును. ఆపిమ్మట జాగ్రత్తను వహించి యేమఱక రాత్రింబవళ్లను ధ్యానించి యీశ్వరుని గనుము. తేజస్సునంతను తేజరిలఁ జేయునదియే పరమాత్మనిరూప మనినమ్ముము.

ఆ. సాటివారు నిన్ను సాధింపఁగా లేరు
దైవ మెపుడు నీకు తప్పకున్న
భారతంబులోనిపరమార్థ మిదె కదా! వి...

భారతములోని సారాంశమును ఒకమాటలోఁ జెప్ప వచ్చును. దైవము సహాయకారిగానున్నచో నిన్ను సాటివా రెన్నఁటికి జయింపఁజాలరు. శ్రీకృష్ణసహాయముచే బాండవులు జయ మొందినట్లు, దైవసహాయములేనిచో నీ వెన్నఁటికి జయింప లేవు; కర్ణుఁడు దైవబలములేక కడ తేఱినట్లు.



ఆ. సౌఖ్య మరయునట్టి సౌఖ్యంబు కలుగును
హరునికృపను సౌఖ్య మమరియుండు
సుఖ మసుఖములకు శూలి కారణుఁ డగు, వి...

సౌఖ్యమునకై వెదుక నవసరములేదు. దైవ మనుకూలముగా నుండినచో వెదకి తెచ్చినట్టులు సౌఖ్యమే కలుగుచుండును. ఇవ్విధముగా సౌఖ్యము కలుగుటకు ఈశునికృప నార్జింపవలయును. కావున సుఖాసుఖములకు ఈశుఁడే కారణుఁడని మెలఁగవలయును.

ఆ. సూదినంటురాయి సూత్రముగా నాత్మ
సాధనంబుమీఱి సంతరించి
సాదుకొల్పునరులు పరమాత్మరూపులు, వి...

సూదంటురాయి సంయోగమున ఇనుము ఆకర్షించునట్టులే ముముక్షువు అనితరసాధారణములగు సాధనముల నవలంబించి ఈశ్వరుని సందర్శించి తాను తఱించి యితరులహృదయములను ఈశ్వరుని నిలిపి తరింపఁజేయుదురు. వారే పరమాత్మస్వరూపులుగా నెన్నఁ గొనఁబడుచుందురు.

ఆ. స్వాతిమెఱుపుఁ జూచి సంతోషపడుదురు
స్వాతిమెఱుపులేమి సఫల మన్న!
మెఱుపునుఱుము లేక మేఘంబుగురియునా? వి...

జనులు స్వాతికార్తెలో మెఱయుటను జూచి ముందు వర్షము కురియునని సంతసించుచుందురు. నిజమును విచారించిన స్వాతిలో మెఱసినంతమాత్రాన నేమైన ఫల మున్నదా?

లేదు. మెఱుపు నుఱుమును లేక ఎప్పుడును వర్షము కురియదు గదా.

ఆ. హరికి దొరకె నందురా సిరి యప్పుడే
దొరకెఁ గాదె విషము హరున కరయ
నెవని కెట్టు లగునో యెవ్వఁ డెఱుంగును? వి...

ప్రయత్నముచేయువానికి సంపద లభించును. ప్రయత్న హీనునకు లభింపదని కొందఱు చెప్పుదురు గాని యది సత్యము గాదు. సముద్రము తఱచునపుడచట శివుఁడు కలఁడు. విష్ణువు కలఁడు. విష్ణువునకు భువనపావనయగు లక్ష్మిలభించెను. శివునకు విషమయమగు కాలకూటము లభించెను. కాన పురుషప్రయత్నములో నేమియును లేదు. ఎవని కెట్టిఫలముసిద్ధించునో యెవరుఁ జెప్పఁజాలరు.

క. హరివిధి సురమును లాదిని
మెఱసియు జన్మించి పిదప మేలుల కెడగా
జరయందు మరణమందును
వరుస న్వర్తిలిరి దైవవశమున వేమా! 706

మానవులు కొందఱు తమకు దైవమనుకూలుఁడు గాఁడని పరితపింతురు. తమకర్మయే తమకు ఫలముల నొసంగుచున్నదనియు దైవమునకు సహితము కర్మఫలము తప్పదనియు యవివేకు లెఱుంగరు. ఇంతయేల? మనము ఎవనిని దైవముగా భావించుచున్నారమో యట్టి దైవమునకుఁగూడ దైవబలములేదు. బ్రహ్మ విష్ణ్వాది దేవతలును మునులును మున్నగు నుత్తమోత్తములందఱును



దైవబలమునకు కట్టుపడియే జననమరణాదులను ప్రవర్తిలిరి. కావున దైవబల మధికము నజయ్యము నగును.

క. హరివిధులు కనుట వినవా?
హరుఁడు నిమిత్తంబులందు నాడుట వినవా?
గురిగల చదువులు వినవా?
తలచివచ్చినదైవ మనుచు తలఁపుము వేమా! 707

దైవబలమునకుఁ ద్రిమూర్తులు గూడ బద్ధులై యుండిరని తెలియుచుండఁగ కర్మబద్ధులగుమానవులగతియేపాటిది. బ్రహ్మయు విష్ణువుగూడ నసురులధాటికాఁగలేక యవస్థలొందుట యెఱుఁగవా? ఈశ్వరుఁడు సహిత ముచితసమయములలోఁ దనయశక్తి వెల్లడించినవిషయ మెఱుంగరా? వేదములు వీరినిట్లని జెప్పఁగా చూడలేదా? కావున అన్నిఁటికిని దైవ మొకటియే కారణ మగు ననుకొనుము. శివకేశవబ్రహ్మలు నిమిత్తమాత్రులని గ్రహింపుము.

ఆ. తీఱితి వెలఁదికిఁ దగు శృంగారములు నున్న
విభునికరుణ లేక వెలయనట్లు
దైవకృపలు లేక తలఁపులు చెల్లవు, వి... 708

స్త్రీకి ఉత్తమోత్తమములగు నాభరణము లెన్నియున్నను భర్తయనుగ్రహములేక ప్రకాశింపనియట్లులే దైవకృప కలుగనిది ఎట్టికోర్కెలును చెల్లఁజాలవు. కావున మానవుఁడు తపశ్చర్యాదిసత్కర్మము లాచరించి దైవానుగ్రహము పడయుటకు యత్నింపనలయును. దైవానుగ్రహములేనివానితలంపులు నెఱవేఱుట యసంభవము.



# కర్మపద్ధతి.

అవతారిక. "కర్మణాబధ్యతే జంతుః విద్యయాతు ప్రముచ్యతే" యను భారతవాక్యమును బట్టిచూడ జంతువు కర్మచే బంధింపఁబడి జ్ఞానముచే విముక్తి నొందుచున్నవి. కావునఁ గర్మానుభవమున వ్యథనొందు మానవులు జ్ఞానసాధనముననగాని విముక్తినొందఁజాలరనియుఁ గర్మానుభవము తీఱకున్నచో జన్మాంతరములొందక తప్పదనియు జన్మాంతరాయాసము జ్ఞానసాధనమున గాని తీఱదనియుఁ గర్మప్రవాహమునకె సంసారము ప్రకృతిమాయ, దృశ్యసృష్టిలోనగునవియెల్ల పర్యాయపదములనియు వేఁచఁబడిన గింజలు మొలువనటుల జ్ఞానమున్నగాని కర్మలయధికార మంతరింపదనియు వేమనమహాయోగి నిశ్చయించి ప్రపంచమునకు కర్మపద్ధతి నీక్రిందివిధముగాఁ దెలుపుచున్నాఁడు.—

ఆ. అడవి దిరుగఁ జిక్క దాకసమున లేదు
అవని తీర్థయాత్రలందు లేదు
ఒడలుశుద్ధిచేసి యొడయనిఁజూడరా, వి... 709

పరబ్రహ్మమును సందర్శింపవలయునని నానావస్థలొందిన మాత్రమున లాభము లేదు. పరబ్రహ్మము అడవులలోఁదిరిగిన లభింపదు. తీర్థయాత్రలొనరించినను లభింపదు. శరీరశోధనము గావించుకొని సమాధిమగ్నుఁడవై నీలో నీవే చూచుచుందువేని సాక్షాత్కారము కాఁగలదు.



ఆ. అండపిండములఁ గన నన్నియు నటుపిండ
మండమెట్లొ బహ్మయండ మట్లె
కర్మబంధమునను గానరు బూసరుల్, వి ...710

అండాండపిండములయుత్పత్తి యగునట్టులుగనే బ్రహ్మాండమును కలుగుచున్నది. ఇయ్యది సులభముగా గోచరించుచున్నను మనుజులు కర్మబద్ధులయి యుండి తెలిసికొనఁజాలక క్లేశముల ననుభవించుచుందురు.

ఆ. అతిథి రాకఁ జూచి యదలించి పడవైచి
కఠినచిత్తు లగుచు కానలేరు
కర్మబద్ధు లగుచు ధర్మంబు సేయరు, వి .... 711

ఎవరైన నింటికి నతిథియై చనుదెంచిన వెళ్లునఁ దిట్టుచు మూర్ఖులు కఠినచిత్తు లయ్యెదరు. వారు కర్మబద్ధులై తత్ఫలంబుల ననుభవించుతలంపున నేధర్మంబుల నాచరింపక చెడుచుందురు. ఈజన్మమున నతిథులకుఁ బెట్టకపోవుటవలననే ముందు జన్మమున మానవులు కూటిపేదలై కృశించుచున్నారు. ఉన్నంతలో ధర్మముచేసి ముందు జన్మమునకు గతి కల్పించుకొనుట మంచిది.

ఆ. అపుడు నాదుమాట ననుసరింపఁగలేక
ఇపుడు నమ్మటన్న నేమికలదు
మదము నిల్చునటకు మనసులు నిల్చునా? వి...

మూర్ఖులు అగుజనులు వయోబలిరేకమున మదించి పెద్దల మాటలను వినకయుందురు. అట్టివారు సమయములయందు

ఆ. ఆదితుదల నరయ కల్పుఁడై దినమెల్ల
మార్పుచేత బుద్ధి మరఁగి తిరుగు
మ్రానుమ్రాను దిరుగు మహిఁ గోఁతికైవడి, వి.

మనుజుఁడు మూఢుఁడై తా నేకర్మములచేతవలన నట్టు లుండెనో ఇఁక నెద్దానివలన నెట్టులు కాఁగలనోయని ఆద్యంతములను విచారింపక మతిస్థిరత లేనివాఁడైయూఱక పిచ్చిబట్టినవానివలె చెట్టుచెట్టునకును తిరిగియాడెడి క్రోఁతిరీతిగను తిరుగుచుండునేగాని కర్మఫలముఁ గనఁజాలఁడు.

ఆ. ఆలుమగనిమాట కడ్డంబు వచ్చెనే
నాలుగాదు నుదుటిమ్రాలు గాని
యట్టియాలి విడిచి యడవినుండుట మేలు, వి...

భార్య భర్త కనుకూలవతియై మెలఁగవలయును గాని యెదిర్చియుండరాదు. అట్లుగాక మగనిమాటల కాలు అడ్డువడుచుండెనేని అయ్యది ఆలుకాదు. ఆపురుషుని ముఖమ్రాలే యగును. బుద్ధిమంతుఁడై అట్టియాలిని విడిచి యడవిఁ బడుటయే మేలగును.

ఆ. ఆలు సుతులు ధనము లరయంగ మీరని
మొనసి కర్మమునను మోసపోయి
కాలుఁ గన్నయపుడు కడ తేరఁజాలఁడు, వి...720

మనుజుఁడు కర్మబద్ధుఁడై సంబంధము లేనిసతీసుతులను ధనమును కని మీరలే దిక్కని మోసపోయి తిరుగాడుచుండును. కాని మృత్యువాసన్నమై యమునిదర్శనము కలిగినప్పుడు ఆధనములవలన ఆయాలుబిడ్డలవలన కడతేరఁజాలఁడు.



ఆ. ఇంచుకంతబోన మీశ్వరార్పణ మన్న
పుణ్యలోకములకుఁ బోవునతఁడు
కర్మసూక్ష్మములను గనవలె ఘనులెల్ల, వి...721

కర్మములోనే ప్రపంచమంతయుఁ నిమిడియున్నది. అందులోనే దుర్జ్ఞేయములగు సూక్ష్మములు పెక్కులుగలవు. కొంచెమన్నమును ఈశ్వరున కర్పణముఁ జేసినచో జనుఁడు పుణ్యలోకములకుఁ బోవును. కావున కర్మసూక్ష్మముల నరసి మెలఁగవలయును.

ఆ. ఇంచుకంత సుఖమె యీరేడుజగములు
కంచమునకు బిల్లి కాచినట్లు
పంచబాణుబారి బడలుచు నాసింత్రు, వి...722

పదునాల్గులోకములను చక్కఁగా పరికించినను ఎందైనను గాని సుఖ మొక లేశమాత్రమే కాని వేఱుకాదు. ఇట్లయినను జనులు ముగ్ధులై మన్మథవశంవదులై విషయముల నాసించి ఎంగిలికంచమునకు బిల్లికాచుకొని సుఖింపలేనట్టు లుందురు. కావున కర్మములను జాగ్రత్తగా నరయవలయును.

ఆ. ఇంటిమగనిఁ జూచి యిల్లాలు దుఃఖించి
వెంట విటుని దగిలి వెతలఁబడును
తుంటరైనదానిఁ దొలఁగింప మేలురా, వి...723

బుద్ధులు అపరిజ్ఞేయములు. స్త్రీ లెంతటి విదుషులయ్యును దుర్గుణపూరితలై యుందురు. చేసికొనినమగని వదలి విటపురు

పెద్దలమాటలను త్రోసిపుచ్చి పిమ్మట వగచినఁ బ్రయోజనమేమి? వీరి మదము నిలచునంతవఱకు మనసు నిలుచునా? నిలువదు గదా!

ఆ. అరయ కర్మమునను నాహరిశ్చంద్రుండు
ఆలిబిడ్డ నమ్మి యతఁడు కూడ
మాలవాని కెపుడు మఱి లోకువై యుండె, వి.

మంచికిగాని చెడుకుగాని తమతమకర్మములు ప్రధానములగు కారణములు. విచారించితిమేని హరిశ్చంద్రునియంతటి మహానుభావుఁడు కూడ కర్మబద్ధుఁడై పెండ్లమును బిడ్డలను అమ్మి మాలవానికి దాసుఁడై యుండలేదా! ఇఁక సామాన్యమానవులు కర్మము జవదాఁటలేరనుట ధ్రువము.

ఆ. అరయ నాస్తి యనక యడ్డుమాటాడక
తట్టుపడక మదిని తన్నుకొనక
తనది గాదనుకొని తాఁ బెట్టునది పెట్టు, వి...

అతిథి వచ్చి యార్తుఁడై తన్నర్థమును యాచించెనేని నాస్తి యనక అడ్డుమాటలను పలుకక తట్టుపడక మనస్సులో నెట్టులివ్వగలనాయని తన్నులాడకతనచేత నున్నదానినితనదికాదనుకొని అర్థి సంతసించునట్లొసఁగవలయును. అట్టిదియే దానమనఁబడును. ఈయలేక యిచ్చునది దానముగాదు. అట్టిదానమువలనఁ బ్రయోజనములేదు.

ఆ. అలను బుడగ పుట్టినప్పుడే క్షయమౌను
కలను గాంచులక్ష్మిఁ గనుటలేదు



ఇలను భోగభాగ్య మీతీఱె కానరు, వి...715

మనుజులు మూర్ఖులై యాగతానాగతములఁ దెలియఁజాలరు. ప్రపంచమంతయు నస్థిరమే. బుడగ పుట్టినప్పుడే నశించును. కలలో కనుపడినసంపద నొందుటలేదు. ఇట్లులే ప్రపంచములో భోగభాగ్యాదులగు ప్రతివస్తువును అశాశ్వతమై యొప్పుచుండును.

ఆ. అష్టకష్టి బ్రదుక నగ్నిపాలై పోవు
నిర్దయాత్ము బ్రదుకు నీటఁ గలియుఁ
గ్రూరకర్ము బ్రదుకు చోరులపాలౌను, వి...716

ఎన్నివిధముల తప్పించుకొనఁజూచినను కర్మఫలముల ననుభవింపక తప్పదు. అష్టకష్టములఁ బడి యార్జించిన ధనము అగ్నిపాలై పోవును. నిర్దయుఁడైన వానిధనము నీటిలో కలసి పోవును. ఇట్లులే క్రూరతఁ దెల్పుపనులఁ జేయువారిసిరులు దొంగలపాలఁ బడును.

ఆ. ఆఁకలిగొని వచ్చె నని పరదేశికి
పట్టెఁడన్నమైనఁ బెట్టలేఁడు
లంజెదానికొడుకు లంజెల కిచ్చును, వి... 717

మనుజుల లోభత్వము నేమని నిందింపవచ్చును? ఎంతటి సిరిగలవాఁడైనను ఉన్నదానిలో గొంతనైనను ధర్మము సేయఁజాలఁడు. ఆఁకలిగొని యార్తుఁడైవచ్చిన యతిథికి పట్టెఁడన్నమునైనను పెట్టలేఁడు కాని ముండలకుమాత్రము ఆలంజెకొడుకు ధనమీయ సందేహింపఁడు.

ఆ. ఆదితుదల నరయ కల్పుఁడై దినమెల్ల
మార్పుచేత బుద్ధి మఱఁగి తిరుగు
ప్రాసుప్రాసు దిరుగు మహిఁ గోఁతికైవడి, వి.

మనుజుఁడు మూఢుఁడై తానేకర్మములసేతవలన నట్టు లుండెనో ఇఁక నెద్దానివలన నెట్టులు కాఁగలనోయని ఆద్యంతములను విచారింపక మతిస్థిరత లేనివాఁడైయూఱక పిచ్చిబట్టినవానివలె చెట్టుచెట్టునకును తిరిగియాడెడి క్రోఁతిరీతిగను తిరుగుచుండునేగాని కర్మఫలముఁ గనఁజాలఁడు.

ఆ. ఆలుమగనిమాట కడ్డంబు వచ్చెనే
నాలుగాదు నుదుటివ్రాలు గాని
యట్టియాలి విడిచి యడవినుండుట మేలు, వి...

భార్య భర్త కనుకూలవతియై మెలఁగవలయును గాని ఎదిర్చియుండరాదు. అటుగాక మగనిమాటల కాలు అడ్డువడుచుండెనేని అయ్యది ఆలుకాదు. ఆపురుషుని ముఖవ్రాతే యగును. బుద్ధిమంతుఁడై అట్టియాలిని విడిచి యడవిఁ బడుటయే మేలగును.

ఆ. ఆలు సుతులు ధనము లరయంగ మీఱని
మొనసి కర్మమునను మోసపోయి
కాలుఁ గన్నయపుడు కడ తేరఁజాలఁడు, వి...720

మనుజుఁడు కర్మబద్ధుఁడై సంబంధము లేనిసతీసుతులను ధనమును కని మీరలే దిక్కని మోసపోయి తిరుగాడుచుండును కాని మృత్యు వాసన్నమై యమునిదర్శనము కలిగినప్పుడు ఆధనమువలన ఆయాలుబిడ్డలవలన కడతేరఁజాలఁడు.



ఆ. ఇంచుకంతబోన మీశ్వరార్పణ మన్న
పుణ్యలోకములకుఁ బోవునతఁడు
కర్మసూక్ష్మములను గనవలె ఘనులెల్ల, వి...721

కర్మములోనే ప్రపంచమంతయుఁ నిమిడియున్నది. అందులోనే దుర్జ్ఞేయములగు సూక్ష్మములు పెక్కులుగలవు. కొంచె మన్నమును ఈశ్వరున కర్పణముఁ జేసినచో జనుఁడు పుణ్యలోకములకుఁ బోవును. కావున కర్మసూక్ష్మముల నరసి మెలఁగవలయును.

ఆ. ఇంచుకంత సుఖమె యీరేడుజగములు
కంచమునకు బిల్లి కాచినట్లు
పంచబాణుబారి బడలుచు నాసింత్రు, వి...722

పదునాల్గులోకములను చక్కఁగా పరికించినను ఎంతైనను గాని సుఖ మొక లేశమాత్రమే కాని వేఱుకాదు. ఇట్లయినను జనులు ముగ్ధులై మన్మథవశంవదులై విషయముల నాసించి ఎంగిలికంచమునకు బిల్లికాచుకొని సుఖింపలేనట్టు లుందురు. కావున కర్మములను జాగ్రత్తగా నరయవలయును.

ఆ. ఇంటిమగనిఁ జూచి యిల్లాలు దుఃఖించి
వెంట విటుని దగిలి వెతలఁబడును
తుంటరైనదానిఁ దొలఁగింప మేలురా, వి...723

బుద్ధులు అపరిజ్ఞేయములు. స్త్రీ లెంతటి విదుషులయ్యును దుర్గుణపూరితలై యుందురు. చేసికొనినమగని వదలి విటపురు

షులతో తిరుగఁ గోరుదురు. అట్టియిల్లాలిని తొలఁగించుటయే మేలగును.

ఆ. ఇమ్ముదప్పువేళ నెమ్మె లన్నియుఁ దప్పు
గాల మొక్కరీతి గడపవలయు
విజయుఁ డనువు దప్పి విరటుని గొల్వఁడా? వి.

కాలకర్మలసంయోగమువలన సుఖదుఃఖములు కలుగుచుండును. సమయ మనుకూలమై యుండునంతవఱకు దాను చేయుపనులన్నియును నెగ్గును కాని ప్రతికూలమైన చెడిపోవును. కావున కాలము నొక్కతీరుగా గడుపుకొనవలయును. అర్జునుఁడంతటివాఁడు కాలకర్మబద్ధుఁడై విరటుని గొల్వలేదా?

ఆ. ఇడుమువచ్చువేళ నీశ్వరుఁ దలఁతురు
గరుణఁ గనునె వట్టిగాసిగాక
సుఖము వచ్చువేళ చూడంగ నొల్లరు,వి...725

మనుజులు తమకు సుఖములు కలిగినప్పుడు ఈశ్వరుని తలంపక కొంచె మాపద కలుగునప్పుడు ఈశ్వరుని తలంపఁ బూనుదురు గాని ఆమాత్రమున భగవంతుఁడు దయగలవాఁడు కాఁడు. కనుక వ్యర్థముగా గాసిల్లక కర్మఫల మనుభవింపవలయును. సుఖకాలమున గూడ భగవంతుని ధ్యానింపవలయును.

ఆ. ఇరుగుపొరుగులందు నిమిడికతో నుండి
తనకుఁ దానె మెలఁగి తలఁపుఁ జూపి
ధర్మమన్న యెఱుక తన్నుఁ దాఁ బొడసూపు
కర్మఫలమువలనఁ గలిగి వేమ! 726



కర్మయే ధర్మస్వరూపము. అయ్యది ముమ్ముందు తనపుట్టు ప్రక్కల నివసించి తనంత దానె పొడసూపి పిదప మెల్లమెల్లగా ఇచ్ఛానుసారియై వర్ధిలి ఫలము ననుభవింపఁజేయును.

ఆ. ఇసుకబొగ్గురాయి యినుముఁ జర్మంబును
కసవు పొల్లుగట్టి కట్టెపెట్టి
పల్లుఁ దోమినంతఁ బరిశుద్ధులగుదురా? వి....727

లోకమునందు సాధారణముగా బాహ్యమున నేదో యొకరీతిగా పరిశుద్ధతగలవారలే గాని కర్మములఁ బరిత్యజించి బాహ్యాంతరంగముల పరిశుద్ధులగువార లరుదు. ఇసుక బొగ్గు మున్నగువానితో దంతశ్శుద్ధుఁడగువాఁ డొక్కఁడును లేఁడు. దంతశుద్ధియైన నేమిఫలము? అంతశ్శుద్ధి కావదా?

ఆ. ఉచ్చ వచ్చుచుండు నిచ్చకు సరిగాను
మచ్చికైన మనసు మర్మమెఱిఁగి
హెచ్చుకర్మములయు ముచ్చట లిట్లురా,వి...

కర్మల ననుసరించియే బుద్ధులు కలుగుచుండును. ఇచ్ఛననుసరించియేగదా యుచ్చదశ (గొప్పతనము) చేకూరుచుండును. హృదయమునఁ దలఁచినటుల గొప్పతనము సమకూరుచుండ హెచ్చుకర్మములు గావించిచో రాఁబోవు జన్మమున నుత్తమగతి గలుగుననుట కెంతమాత్రము సందియములేదు. కావున మానవుఁడు సత్కర్మము లవశ్య మాచరింపవలయును.

క. ఉచ్చసరి తూగి పుట్టెడు
నెచ్చట నేమనుజుఁ డైన నేర్పడ భువిలో

నిచ్చట కులజుం డెవ్వాఁడు?
విచ్చలవిడి కర్మ మగును వినరా వేమా! 729

ఎంతటి గొప్పవాఁడు పుట్టినను ఉచ్చతోనిండిన గర్భకోశమునందు మలమూత్రములలో మునిఁగి తేలి కడకు పుట్టుచుండును. కావున నిట్టి మూత్రగర్తజనితులలో కులజుఁ డెవ్వఁడు? కులహీనుఁ డెవ్వఁడు? హెచ్చుతగ్గులు విద్యావివేకాదులవలనఁ జేకూరును గాని జననమాత్రమున రాఁజాలవు. ఇట్టివాని కన్నిటికి నొక్క స్వకీయకర్మముమాత్రమే కారణ మగును.

ఆ. ఉండఁడే సుశీలి యుండును గొన్నాళ్లు
ఉండి యుండి యుండి యుండలేక
ఉండు వెఱవుఁ దెలిసి గండిదొంగనుబట్టి
చెండి చెండి తావుఁ జేరు వేమ! 730

మంచిబుద్ధులుగల యుత్తమునకు జీవితము కొలఁదికాలములో ముగియును. ఒకవేళ నట్టియుత్తముఁడు చిరంజీవి యయ్యెనేని పాపభూయిష్ఠమగు భూలోకమున నిలువలేక కడ కెటులో నిలువ నీడయేర్పఱచుకొని యజ్ఞానమనుదొంగను జంపి కడకు మోక్షపదవికిఁ జేరును.

ఆ. ఉన్నతావు వదలి యూరూరుఁ దిరిగినఁ
గన్న దేమి నరుఁడు గ్రాసమునకు
దన్ను లోనఁ జూడఁ దమ మెల్లఁ వీడును, వి...

మనుజుఁడు కర్మబద్ధుఁడై యీయూరుకన్న నాయూర నెక్కుడనుకొని యున్నతావును వదలిపెట్టి యూరూరును తిరు



గుచుండునేకాని ఋష్యకంటె మించి సంపాదించినది కన్పింపదు. కావున నిజరూపము నరసియుండిన మేలు.

ఆ. ఋతువు ననుసరించి స్థితికాలమున నొప్పు
గతిని బట్టి మనుజు మతియు నొప్పు
స్వేచ్ఛఁ బట్టి యువిద చెల్లాటమును నొప్పు, వి.

ప్రపంచములో నందఱును వారివారికర్మల ననుసరించియే ఫలముల ననుభవించుచున్నారు. ఋతువుల ననుసరించి కాలస్థితి మాఱునట్టులే స్వేచ్ఛకొలఁది స్త్రీలు చెలరేగునట్టులే మనుజునిగతి (కర్మము)ని పట్టి మతియును కలుగును.

ఆ. ఎదటికలిమిఁ జూచి యేడ్చెడువారికి
భాగ్య మెటులఁ గూర్చుఁ బరమగురుఁడు
తనదుపూర్వకర్మ దైవ మెఱుంగఁడా? వి...

తా నెంతటి తక్కువస్థితి నున్నప్పటికిని ఎదటివానిస్థితిని గూర్చి వగవరాదు. ఎదటివానికలిమికి వగచెడువారికి ఈశ్వరుఁడు ఫలము నెట్లీయఁగలఁడు? తాను చేసినకర్మమును నతఁడు మఱచినను దైవముమాత్రము మఱువక ఫలమొసఁగును.

ఆ. ఎద్దుకన్న తెలియ నెనుబోతు తక్కువ
వివర మెఱిఁగి చూడు వృత్తియందు
నేర్పులేనివాని నెరయోధుఁ డందురా, వి...

ప్రతివానికిని బుద్ధి ప్రధానము గాని యొడ్డుపొడవులు కావు. ఎట్లందురా? చూడుఁడు. ఎద్దుకంటెను దున్నపోతు ఎందులో తక్కువ? వృత్తి మున్నగువానిలో సమము లేకదా?

ఆయినను నేర్పు లేనందువలన తక్కువ యయ్యెను. కావున బుద్ధిమంతుఁడై యుండవలయును.

క. ఎన్నఁగ కర్మము కారణ
మన్నిటికిని జూడ జూడ నాత్ముఁడు తానై
యున్నంతకాల మిలలో
నన్నా యిదె తెలియవలయు నవనిని వేమా! 735

కొందఱు మానవులు జ్ఞానశూన్యులై తప్పుచేసి పరులతో దేవుఁడటులఁ జేయించుచున్నాఁడని ప్రేలుచుందురు. ఈశ్వరుఁ డెపుడు దుష్కార్యములు సేయుమని మానవులఁ బ్రేరేపఁడు. సమస్తకర్మలను ఈశ్వరుఁడు సాక్షిమాత్రుఁడై యుండును. కారణము మాత్రము మనుజులకు తామొనర్చెడి కర్మమే యగును. ఈరహస్యముచే బుద్ధిమంతుఁడై మెలఁగవలయును.

ఆ. ఎన్ని తపము లేర్చి యెన్ని నోములు నోచి
యెంతకష్టపడిన నేమిఫలము
కర్మఫలము గాని కలుగ దెందును ముక్తి, వి.

మనుజుఁడు కర్మఫలమునకు విరుద్ధముగా నుండవలయునని ఎన్ని తపముల నేర్చి ఎన్నివిధములగునోములను నోచి యెంతటికష్టముల ననుభవించినను ప్రయోజన మిసుమంతయును కలుగదు. కర్మఫలముతప్ప ముక్తి యెద్దానను లేదు.

తే. ఎన్ని దేవతలైనను నీరహస్య
చిహ్నలను బట్టి కనలేరు చిన్మయంబు



తన్ను తనలోనఁ గనుటయే తన్మయంబు
చెన్ను మీఱంగ నిదె మేటితెన్ను వేమా! 737

ఎందరు దేవతలయినను ఈకర్మరహస్యమును అనఁగా: కర్మములోని మర్మములను గుఱితించి చిన్మాత్రము నెఱుఁగనేలేరు. తనరూపమును తనలోనే గనుటయే తన్మయత్వ మనఁబడును. ఇయ్యది ముక్తికిఁదగుమార్గము.

ఆ. ఎన్ని ఫలము లున్న నీఫలం బెక్కుడు
అన్ని సుఖములందు నధిక మగుచు
కన్నది కననిదయి కనుపించు కర్మము, వి...738

ఎన్నిఫలము లున్నను కర్మఫలమే యెక్కుడుది. కర్మఫలమువలన కలుగుసుఖమే యన్నిటికంటె నెక్కుడుది యగును. కర్మస్వరూపమును పరీక్షించుట కెవరైన సమర్థులుగారు. కర్మము కన్నది కననిది కూడఁ గనుపింపఁగలదు. ఎటులనః మానవుఁడు రాఁగలజన్మము నాలోచింపక కొన్ని మంచిపనులఁ జేయును. కొన్ని చెడుకార్యములఁ జేయును. తరువాత దానిఫలితము లనుభవమునకు వచ్చినపుడే తనకర్మము తనకు గోచరించును. అందువలననే కర్మము, దృశ్యము అదృశ్యము నందురు.

ఆ. ఎఱుకకన్న సుఖ మేలోకమున లేదు
ఎఱుక నెఱుఁగ నెవని కెఱుక లేదు
ఎఱుకసాటి దెఱుకె యెఱుకయే తత్త్వము, వి.

జ్ఞానమునకంటె మించిన సుఖము ఏలోకములో కూడ లేదు. ఇట్టిజ్ఞానస్వరూపము నెఱుఁగుట కెవ్వనికిని జ్ఞానములేదు.

విచారించిన జ్ఞానముతో సమాన మగునట్టి యొకతత్త్వమే కాని వేఱు కాదు. దానినికర్మబద్ధుఁడగుమానవుఁడు సాధింపయత్నింప వలెను.

ఆ. ఎల్లలోకమందు నేవస్తు వున్నదో
తల్లిపిల్లసందు తగులు నదియె
నిస్తరంగవార్ధి నియతిని జూడుము, వి... 740

సమస్తలోకములందు వ్యాపించియుఁన్న వస్తువే తల్లి పిల్లల మధ్యమునజన్యజనకభావముచే మెలఁగుచుండును. అదియేప్రేమ. కావున చంచలతను వహింపక నియమము నవలంబించి పరమేశ్వరుని నిజరూపమును చూడుము. నిర్గుణుఁడగు నాపరమేశ్వరుఁడు ప్రేమరూపుఁడై నీకగుపడును.

ఆ. ఎసఁగువేత్త యనుచు నెఱుఁగరే యీనరుల్
వేయిమార్గములను వేలు పజుఁడు
అవని సృష్టికర్త యంతను గురుఁడౌను, వి...

సమస్తప్రపంచమునకు సృష్టికర్తయగు వేలుపే దేవుఁడనియును, నాతఁడే వేత్త యనియును నాతఁడే సమస్తచరాచరసంవృత్తమైన విశ్వమును సృజించిన బ్రహ్మయని లోకులు ఎఱుఁగనే యెఱుఁగరు. నిజమును పరికించిన అజుఁడే సర్వమునకు గురుఁడగును; కావున నతని సేవింపుము.

ఆ. ఏమి గొంచువచ్చె నేమి తాఁ గొనిపోవు
బుట్టువేళ నరుఁడు గిట్టువేళ
ధనము లెచటి కేఁగుఁ దా నేఁగు నెచటికి? వి...



మనుజుఁడు కేవలము లుబ్ధత నొందునే కాని నిజము బరికింపఁడుగదా! తాను పుట్టునపు డీలోకమున కేమిగొనివచ్చెను? పోవునప్పు డేమికొనిపోవును? తాను సంపాదించినదైనను తనకుఁ దనధనమునకు సంబంధము లేనేలేదు. తాను పరలోకమున కేగును. తనద్రవ్యము పరులపాలగును. కావున లోభిగాక మెలఁగవలయును.

ఆ. ఒక్కతోలుదెచ్చి యొనర బొమ్మను చేసి
ఆడునట్లు చేసి యట్టె వైచె
దన్నుఁ ద్రిప్పువానిఁ దా నేల గానఁడో? వి...

సర్వవిధముల మానవజీవితమునకు భగవంతుఁడు కారకుండైనను అజ్ఞానియగుమానవుఁ డీవిషయమును గ్రహింపఁజాలకున్నాఁడు. భగవంతుఁడు తోలుతో బొమ్మలఁ జేసి యాబొమ్మల నాఁడునటులఁ జేసి తాను వినోదముఁ జూచుచున్నాఁడు. తెలివితేటలున్నను ఈబొమ్మలు మాయచేఁ గప్పఁబడిన వగుటచేత బొమ్మలాటవాని బొమ్మలవలెఁ దన్నాడించుచున్న యాసర్వనియంతను బరమాత్ముని గనుఁగొనలేకున్నవి.

ఆ. ఒల్లనన్నఁ బోదిఁ గొల్లెదననరాదు
తొల్లి చేయుకర్మధూర్తఫలము
ఉల్లమందు నగవకుండుటే యోగ్యంబు, వి...

పూర్వజన్మమునం దాచరించినకర్మములకు ఫలము అవశ్యము వచ్చియే తీఱును. ఆఫలము ఒప్పకొనకున్నను పోవునది

కాదు. పిల్చిన వచ్చునట్టిదికాదు. కావున వచ్చినఫలమును నిర్వి చారుఁడై యనుభవించుటయే యుత్తమము.

ఆ. కంటికింటి ననుచుఁ గర్మాధికారంబు
వెంట గొనుచుఁ జెడును వెఱ్ఱిజనుఁడు
బట్టబయల ముక్తిఁ బాటించి చూడఁడు, వి...

అన్నియును తెలిసినవి. విజ్ఞుఁడ నైతిని ఇఁక నేమి యని తనకు లేనిపోనికర్మాధికారమును మీఁద వైచికొని మనుజుఁడు వెఱ్ఱియై చెడిపోవుచుండును. కావున ముక్తికై ప్రయత్నించి ఫలము నొందుము.

ఆ. కంటిమంటచేతఁ గాముని దహియించి
కామమునను కడకు గౌరిఁ గూడె
నట్టి శివునినైన నంటును కర్మము, వి... 746

కర్మఫలము సామాన్యమానవులనే కాదు. దేవు నంతటి వానినిగూడ నవస్థపెట్టక మానదు. ఇఁక మానవు లెంత? కారణాంతరములచే బ్రహ్మచర్యమును పాలించుచున్న శివుఁడు అమితమగు సామర్థ్యము కలవాఁడై తేజోబలమున కన్నులు నిప్పులుకాలఁ జూచి మన్మథుని నశింపఁజేసెను. కాని చివరకు కర్మవశమున కామవశంవదుఁడై గౌరిని పెండ్లాడెను. కావున కర్మము శివునకుగూడ నలంఘ్యము.

ఆ. కర్మమయుఁడు గాక కర్మంబు దెలియఁడు
కర్మజీవి మేలు గానలేఁడు
నీటిసారక లోఁతునికరము తెలియదు, వి...



ఎంతటివాఁడైనను కర్మముల గాలుపెట్టనిది కర్మమునకుగల నిజరూపము నెఱుఁగఁజాలఁడు. కర్మజీవి కెప్పటికిని మోక్షము లభింపదు. మానవుఁడు నిరంతరము సత్కర్మములు దుష్కర్మముల నాచరించుచు సంసారలోలుఁడై సంచరించెనేని పరమార్థవిచారమున కవకాశమే లభింపదు. కొందఱు కర్మలాచరించుచు మోక్షవిచారము చేయలేమాయందురు. ఇది యనుభవము లేని మాట. నీరు దిగనియెడ లోఁతుదెలియనటుల ననుభవము లేనివానికిఁ గర్మములవలనఁ జేకూరు కారాములు గోచరింపవు.

క. కర్మము జ్ఞానికి దవ్వగుఁ
గర్మమునకు జ్ఞాని దవ్వు కలనిజ మిదె యా
కర్మజ్ఞానము లుడిగిన
నిర్మలునకుఁ గలుగు ముక్తి నిజముగ వేమా!

కర్మమునకు జ్ఞాని దూరుఁడై యుండును. ఆకర్మమును జ్ఞానికి దూరముగా నుండును. ఇట్టి పరస్పరవిరుద్ధములగు కర్మజ్ఞానములు నుడిగినట్టివానికే ముక్తి కలుగును కాని యితరునకు కలుగదు.

ఆ. కర్మఫలము లన్ని కపటంబుగాఁ జూచి
ధర్మఫలము లన్ని తగిలియుండి
ధర్మమర్మములను దాఁటుటే ముక్తిరా, వి...

కర్మఫలముల కాసింపక వానిని మృషాప్రాయములనుగా తలంపవలయును. ధర్మఫలములను స్వీకరింపవలయునను ఈరీతిగా ధర్మకర్మములలోని మర్మములను దాఁటుటయే ముక్తి

యనఁబడును. కాన మానవుఁడు కర్మఫలాపేక్ష వదలవల
యును.

ఆ. కర్మమునను బుట్టి కర్మంబులోఁ జేరి
కర్మ మెరుపడుటఁ గాన లేరు
కర్మబంధమునను కడ తేఱ లేరయా, వి... 750

జనులు పుట్టునది కర్మములోఁ జేరునదియును కర్మముననే యైయున్నది. కర్మమువలనఁ బుట్టినను గర్మములోఁ దాఁ జేరుచున్నను మోక్షదూరమగు నాకర్మమును దొలంగించుకొను మార్గములు లేకపోలేదు. వానిని జనులు గ్రహింపలేక కర్మమే తమ్ము కడతేర్చుననుకొందురు. అట్టివారు చివరకు కర్మబంధముననే కడతేఱలేక యలయుచుందురు.

తే. కర్మవశమున సంసారకష్టములను
జెంది మోహాతిశయమునఁ జెడును నరుఁడు
కర్మరహితత సుజ్ఞానకలితతయును
జెంద మోహాదు లేటికిఁ జేరు వేమ! 751

జనుఁడు కర్మవశమువలన సంసారకష్టములనుపొంది మోహాధిక్యముచేత చెడుచుండును. కర్మలు లేకపోవుటచేతను ఉత్తమజ్ఞానము నొందుటచేతను మోహాదులు జనుని పొందఁజాలవు. కావున కర్మమునుత్తమజ్ఞానముచేత తొలఁగించికొన్నచో మోహము తనంత వదలిపోవును.

క. కర్మాకర్మలకొఱకును
నర్మిల్లి నొకఁ డుండును లోన నాత్మయుఁ గర్తై



ధర్మాధర్మములకు నది
నిర్మలమతి యైనవాఁడు నిలుచును వేమా! 752

కర్మమునకుఁ గాని కర్మాభావమునకుఁ గాని కర్తయగు వాఁడు హృదయమున తనకంటె వేఱొక్కరుఁ డుండును. ఆతఁడె ధర్మమునకు నధర్మమునకు సాక్షీభూతుఁడు. జనుఁడు నిష్కలుషచిత్తుఁడైనచో ఆకర్త స్థిరుఁడై తోఁచును. ఆసాక్షాత్కారమె మోక్షము.

క. కర్మాకర్మము తెలియఁగని
మర్మంబులు నింద్రజాలమహిమలు విద్యల్
కర్మలమర్మము ప్రాణులు
నిర్మలమతిఁ దెలియవలయు నిజముగ వేమా!

ఇది కర్మ మిది కాదు అని రహస్యము తెలుపలేనివిద్యలన్నియు నింద్రజాలము లనియె చెప్ప నొప్పగును. నిశ్చలహృదయులై ప్రాణులు గురుకృపవలన కర్మలలోని మర్మముల నెఱుఁగవలయును. ఇంద్రజాలములవంటి చదువుల వలన గ్రంథములవలన కర్మ అకర్మ గ్రహింప నశక్యము.

క. కర్మనివృత్తైనప్పుడు
నిర్మలుఁ డగుభవ్యుఁడు వాని నిక్కమెఱుంగున్
కర్మము తీఱెడు వేళను
ధర్మమె తనదేవుఁ డనుచుఁ దలఁతురు వేమా!

పూర్వసంచితమగుకర్మము ననుభవించిన పిమ్మట నిష్కల్మషుఁడై పరేశుని నిజరూపమును ఎఱుఁగఁగలుగును. కర్మము తీఱ

పోయెడివేళలలో ధర్మమే తనకు దైవమగు నని తలంచు చుందురు. అనఁగాః కర్మస్వరూపమే ధర్మము.

ఆ. కాడు సేరి యున్న గతిలోన యున్నను
వీటినడుమ నున్న విధము లోకట
జాడ విడనిమదిని జర్చించి చూడరా, వి....755

అడవిలో నున్నను మార్గమధ్యమున నున్నను భవనరాజములలో నివసించుచున్నను మనుజునకు కర్మఫలము ఏకరూపముగా ననుభవమునకు వచ్చుచుండును. పరిపూర్ణమగు మనస్సుతో చర్చచేసి తెలిసికొందుము.

ఆ. కూడ దేమి చేసెఁ గులమేమి చేసెను
భూమి యేమి చేసె బొందికట్టె
నరుఁడు పడెడుపాట్లు నగుబాట్లు చూడఁగా, వి.

కొంద ఱుపవాసాదుల కర్మములు నశించు నందురు కాని అదియుత్తయును కల్ల. ఏలనఁగాః అన్న మేమిచేసినది? కులము స్థలము మున్నగునవి వీని కేమి యపకృతిఁ జేసినవి? దేహమొక కట్టెవంటిది. ఆకట్టె నెండఁ బెట్టినను మండఁ బెట్టినను లాభము లేదు. కావున నుపవాసక్లేశాదులచే దేహమును కృశింపఁ జేయుట మోక్షసాధన మెన్నటికిఁ గాఁజాలదు. కావున మనుజుఁడు పొందెడుపాట్లు నగుబాట్లగుచున్నవి.

ఆ. కొడుకును వరియింపఁ గోరి వచ్చినదానిఁ
దండ్రి పెండ్లియాడ ధర్మమగునె?



తప్పని తెలిసియుఁ దాఁ జేయుకర్మంబు
తప్ప దెవుడు భువిని దగులు వేమ! 757

ఎంతవాఁడైనను గర్మమును దప్పుకొనఁ జాలఁడు. కొమరుని పెండ్లి చేసికొనఁగోరి వచ్చినపడుచును తండ్రి పెండ్లియాడుట తప్పు. అయినను రాజనరేంద్రుఁడు కర్మవివశుఁడై తెలిసియుఁ ధర్మముఁ దప్పి నడిచెను. కావున కర్మ మవిలంఘ్యమై యుండును. మానవుని కర్మ వంచించి తీఱును.

ఆ. శ్రోత్రసుద్ధులైనఁ గురుబోధచే విన్న
గర్మయుక్తియోగకాండతతులు
ప్రాతసుద్ధులైన పాయునా కర్మముల్, వి...758

ఎట్టి ప్రతిక్రియలచేత నైనను గర్మానుభవము అనుభవింపక తప్పదు. కర్మమును దప్పించుకొనవలయు నని మానవులెన్నియో పాటులఁ బడుచున్నారు. శ్రోత్రశ్రోత్ర యుపదేశములయినను గురువు లనుగ్రహముచే నుపదేశించిననైనను యుక్తియుక్తముగా సాధించిననైనను కర్మఫలములు అనుభవింపనిది తొలఁగి పోవఁజాలవు.

ఆ. చిఱుతనాఁడు నీవు చేసినకర్మంబు
మఱతువేమొ మదిని మల్లడించి
తఱిమిముట్టుఁ జావు తలపడినప్పుడు, వి.... 759

నీవు బాల్యమున కర్మల నాచరించితిననుబుద్ధిని మఱచితివో యెదవేమొ కదా! అట్లయినచో నవి వెంటనంటి మరణకాలమునందుఁగూడ వెంటనంటి వచ్చుచుండును. అనుభవించునంత

పటుకు నవి నశింపవు. కర్మములొఱకై పునర్జన్మము సైతము చేకూరును.

ఆ. చేటు వచ్చెనేని చెడనాడు దైవంబు
మేలువచ్చెనేని మెచ్చుకొనును
గరిమ మేలుకీళ్లు కావడికుండలు, వి... 760

మనుజుఁ డజ్ఞానియై చేటు వచ్చిన దైవమును తిట్టును. మేలువచ్చిన తనను దాను మెచ్చుకొనును. కాని నిజముఁ బరికించినఁ గీడుమేలులు సహజములు. అయ్యవి కర్మవశములై యొకదాని వెనుక నొకటివచ్చుచునే యుండును. కాన దైవదూషణము, ఆత్మశ్లాఘనము అకార్యములు.

ఆ. చదివిచదివి కర్మసారముఁ గనలేక
తిరిగి తిరిగి తిరిగి దిమ్మరాయె
మరిగితిరిగి మొఱిగి మత్తిల్లి చచ్చెరా, వి....

జనుఁడు వేదములని వేదాంగములని చదివి చదివి కర్మలఁ జేసిచేసి యెరదలిసారమే మో తెలిసికొనలేక దేశమంతయును తిరిగి మత్తుఁడై చచ్చునే కాని కర్మఫలమును తప్పించుకొనలేక పోయెను. సామాన్యుఁ డెటులఁ గర్మఫలములఁ దొలఁగించుకొనఁగలఁడు.

ఆ. చాకి కోక లుదికి చీకాకుపడవేసి
మైలదీసి తెల్పు మడిచినట్లు
బుద్ధిచెప్పువాఁడు గుద్దిన మేలయా, వి...



చాకలవాఁడు మైలబట్టలను ఉదికి మైలదీసి శుభ్రముచేయునట్టులే యుపదేశకుఁడు అజ్ఞానపరిహారార్థమై కొన్ని దుస్సాధ్యములగు కార్యములను కర్మలను చేయించినను ఒక్కింతయైన దోసఁగులేదు. ఏల ననఁగా: బుద్ధిచెప్పెడివాఁడు గుద్దినను మేలే యగును.

ఆ. తనకుఁ బ్రాప్తిలేక దానము చిక్కదు
దైవనింద వెఱ్ఱితనము గాదె!
కర్మజీవు లేలఁ గర్మంబుఁ దెలియరు? వి .... 763

తమకు దానము దొరకలేదని మూర్ఖులు దైవమును నిందింతురే కాని ప్రాప్తిలేనందువలన దొరకలేదనియును దైవమును నిందించుట వెఱ్ఱితనమనియును కర్మజీవులు తెలిసికొనిమెలఁగరు.

ఆ. తనకుఁ బ్రాప్తి లేదు దాత యీలే దంచు
నొరుల దూఱు టెల్ల నోగుబుద్ధి
కలిమి లేమికతనఁ గష్టమై తోఁచురా, వి...764

కొందఱు తనకుఁ బ్రాప్తిలే దని అనుకొనక ధనవంతుఁడు లోభియై ఈయలేదని దూషించుటయంతయును బుద్ధిహీనతయే కాని వేఱుగాదు. ఎంతటిజ్ఞానియైన నీరీతిగా నిందింపఁబూనుకొనును. ఇట్లగుటకు దారిద్ర్యమే కారణముగాఁగనుపట్టును.

క. తనప్రాప్తి తనకు నుండఁగఁ
దనదుఃఖము తనకె కాక తగులునె యొరులన్
దనచేయుమంచి తనకే
యనుకూలించెడిని జేర దన్యుల వేమా! 765

ప్రతిమనుజుఁడును ఈర్ష్యాపరులై యితరులఁ జెఱుతునని పోవును. ఎవ్వారి ప్రాప్తి వారికి ఎవరిదుఃఖము వారికి ఎవరిచేఁత వారికి నభిముఖమైయుండి ఇతరులఁ జెందనే చెందదు. కావున నట్లుచేయుట మంచిది గాదు.

ఆ. తనకుఁ బ్రౌఢువానితరుణం బదైనచో
వినక దీర దధికవిద్యలైన
గరిత వినదె ప్రియునికొఱకుఁ గాకధ్వని, వి ....

వేదాంతవిద్యలను గ్రహించుట చాలకష్టము. వినువారి కాయంశ మభిరుచిగ లేకపోయినను వినుచున్నపుడు ప్రౌఢుపో నటులనున్నను శ్రమచేసి యెటులేని విషయము నాకలింపుచేసికొని సారము గ్రహింపవలయును. కాకిగూసిన చుట్టమువచ్చునను నమ్మకముతో భర్తరాకగోరుచున్న చిన్నది కర్ణకఠోరముగ నున్నను గాకికూఁత నాలకించుటలేదా! అటులె యుత్తమ విద్యల నభ్యసింపనగును.

ఆ. తనదుకర్మచేతఁ దాను లోకములోనఁ
దనదుతల్లి గర్భమునను బుట్టెఁ
దనదుకర్మ మఱచి తగనివి చేయునా? వి...

పూర్వజన్మకృతమగు దుష్కర్మమునకు మానవుఁడు ఫలమ ననుభవించుచు పూర్వస్మృతిలేక మఱల దుష్కర్మల నాచరించును. చూడుఁడు లోకములోని మనుజుఁడు తాను చేసినకర్మమునకు ఫలముగనే తానులోకములో మాతృగర్భమునఁబుట్టె



ననుటను మఱచి అజ్ఞానియై తగనిపనులను నెత్తిన వైచికొని ప్రవర్తించుచుండును.

ఆ. తనదునీడ శిశువు తాఁ జూచుచుండును
దనదునీడఁ జూచి తన్ను మఱచి
పను లొనర్చుచుండు భ్రాంతుల నేమందు? వి.

పిల్లవాండ్రు తమనీడను దాము చూచుకొని యానందించునటులఁ బెద్దవారుఁ గూడ నాత్మచ్ఛాయయగు తమజీవితచర్యను దలంచుకొని యొడలు మఱచి కర్మబద్ధులై ప్రవర్తించుచుందురు. ఇట్టి భ్రాంతిమయులగు మానవుల నేమియనినను ప్రయోజనము లేదు.

ఆ. తనదుభ్రాత లెల్ల దానంబు సేయంగఁ
తనకు ఫల మటంచు మిఱుకరాదు
తనదు కాలుఁ గోయ తనతమ్ముఁ డేడ్చునా? వి.

ఎవరికర్మఫలము వారిదే గాని యొకరి దొకరికి రాదు. తనయన్నదమ్ము లందఱును దానములొనర్చిన తనకుఁ గలుగునని కొందఱు మిట్టిపడుదురు. కాని ఫలముమాత్ర మభావమే; ఎట్లనఁగా: తనకాలినికోసినఁ దనకే నొప్పికలుగును కాని తమ్మునకు కలుగదు కదా! కాన నెవరిఫలము వారిదె.

ఆ. తెలివి నొందలేక తిరమును బడయక
తిరుగు నస్థిరుఁడయి దేహి జగతిఁ
దిరుగ నేల? కర్మఁ దెలియఁ డయ్యజ్ఞాని, వి...

దేహి యుత్తమజ్ఞానశూన్యుఁడై స్థిరత్వమును పొందలేక

ప్రపంచమున నెప్పుడును తిరుగుచుండును గదా! ఏల యిట్లు తిరుగవలయు! కర్మ నెందుల కెఱుఁగఁడు?

ఆ. ధర్మమార్గములను దప్పుఁగాఁ జూచును
   గర్మజీవి మేలుఁ గానలేఁడు
   నిర్మలహృదయుండు నిరూపమున నుండు, వి.

కర్మబద్ధుఁ డగువాఁడు పైత్యరోగి ప్రపంచమును పచ్చగా చూచినట్టులే ధర్మపుమార్గముల నన్నిటిని తప్పులనుగా గాంచుచుండును. ఇఁక నిర్మలహృదయుఁ డగువాఁడు ముగ్ధుఁడు కాక యాత్మరూపమున వెలుఁగొందుచుండును.

క. ధర్మార్థకామమోక్షము
   లర్మిలి మదిఁ దెలిసినంత నామోదం బా
   నిర్మలగతిఁ దాఁ గనవలెఁ
   గర్మలకును లేదు ముక్తి గదరా వేమా! 772

ధర్మము, అర్థము, కామము, మోక్షము, ననుచతుర్వర్గ మిట్టిది యని తెలిసినమాత్రాననె సంతసము కలుగునా? కలుగనే కలుగదు. తెలిసికొని దానిని ప్రత్యక్షముగా చూడవలయును. అందేవి యెంతవఱకు గ్రాహ్యములో యంతవఱకె పరిగ్రహింపవలయును. ఈరహస్యము నెఱుంగఁజాలక కేవలకర్మపరతంత్రులై యుండు సామాన్యమానవుల కెన్నఁటికిని మోక్షము చేకూరఁజాలదు.

క. నరజన్మముఁ దా నెత్తియుఁ
   బరమాత్మ నెఱుంగలేక పాపాత్ముండై



   కొఱగాని పను లొనర్చినఁ
   దిరిగి యధోగతికి నేఁగుఁ దిరముగ వేమా! 773

ఎన్నిజన్మములనో యెత్తినఁ గాని దొరకని నరజన్మమును పొందియును అజ్ఞానియై కొఱగానిపనుల నొనర్చునేని తిఱిగి యధోగతులఁ బడియుండునేకాని యుత్తీర్ణుఁడు కాఁజాలఁడు. కాన నరుఁడు సత్కర్మలచేయఁడేని మఱల నీచజన్మముతప్పదు.

ఆ. నరుఁడయినను లేక నారాయణుం డైనఁ
   దత్త్వబద్ధుఁడైన ధరణి నరయ
   గర్మభావములను ఘనత నొప్పఁగవలె, వి...774

సాక్షాత్తు శ్రీమన్నారాయణుఁ డంతటివాఁడైనను సరియే బ్రహ్మసాక్షాత్కారము నొనర్చికొని సర్వదా బ్రహ్మానందమున నోలలాడువాఁడైనను సరియే కర్మఫలములను ఒప్పుకొని అనుభవించి తీఱవలయును. ఏలయన సూర్యచంద్రాదులు కర్మబద్ధులై తిరుగుటలేదా! వాయువుకర్మబద్ధుఁడై వీచుట లేదా! కావున కర్మచేష్టలు మిగుల బలీయము లనిగ్రహింపవలయును.

ఆ. నింగి నెగయువాఁడు నెఱిలోకమున లేఁడు
   బంగిఁ ద్రాగువాఁడు బలియఁబోఁడు
   కొంగయోగములను గోర్కు లడంగునా? వి...

యోగులమని చెప్పుచు నాకాశగమనసిద్ధి మాకుఁ గలదని ప్రజలను వంచన సేయఁ గొందఱు యత్నింతురు. వారిచేఁత లన్నియును వ్యర్థములు. ఏలోకమునందును ఆకాశగమనము

గలమనుజుఁడు లేఁడు. బంగిఁ ద్రాగినంత మాత్రాన భలిసిన వాఁడును లేఁడు. యోగవిద్యచే నిష్కామత్వ మేర్పడునని కొందఱు కొంగయోగములలోఁ గూర్చుందురు. ఎన్నఁటికియోగము వలన కోర్కు లడంగఁజాలవు.

ఆ. పది యసంగతములు పదిసార్లు చేసినఁ
దప్పుదారిఁ ద్రొక్కు దార్ఢ్య మొదవు
కూడదేల యట్టి కుదిరిక మంచికి? వి... 776

మనుజుఁడు పది తప్పుపనులు పదిమారులు చేసియుండెనా యటుపై నాతనికి ఎల్లప్పుడును తప్పుత్రోవలను బోవుటకు దార్ఢ్యము కలుగుచుండును కదా! అట్టులే మంచికి కూడ దార్ఢ్యముకలుగునేమొ చూత మనిన కలుగనే కలుగదు. ఇట్లగుటకర్మఫలము ననుభవించుటకే యగును.

ఆ. పరగ నింతపట్టుఁ బడినపా టెఱుఁగరు
ఘనత నొప్పుమనుజుఁ డనఁగఁ బుట్టి
కీడు మే లెఱుఁగక క్రిందాయెఁ జూడరా, వి...

మనుజజన్మము నెత్తియును ఇంతపట్టు ఎన్నెన్నిపాట్లు పడి యిట్టులైనదియును స్మరింపనే స్మరింపరు. కర్మమునఁ గల విశేషము నరయరు. చివఱకు అజ్ఞానగౌరవమున కీడుమేలులను గుర్తింపలేక క్రిందు లగుచుందురు.

ఆ. పరగ నిలను ముందు బ్రదుకురీ తెఱుఁగక
సకలసంపదలును సతము లనుచుఁ
గర్మమర్మములను గనలేరు మూర్ఖులు, వి...



మూర్ఖులు సంపదలే శాశ్వతము లని నమ్మికొని కర్మములయందలి మర్మములను గానలేక ఇంతపట్టు కెవ్వానివలన నిట్లున్నదియును ముం దేతీరుగా నుండు నదియును తెలిసికొనలేక కర్మబద్ధులై యల్లాడుచుందురు.

ఆ. పాప మనఁగ వేఱె పరదేశమున లేదు
తాను జేయుపనులఁ దగిలియుండుఁ
కర్మ జనుఁడు గాక కనుగలిగినయెడఁ
బాపభయము లేదు పరగ వేమ! 779

పాపమనునది యెటనో గలదని తలంపఁజనదు. తానుజేయు ప్రతికార్యమునందును బాప మిమిడియే యున్నది. కర్మ మెపుడు మానునో యప్పుడే పాపమువలని భయముమానవున కుండదు. ఫలము నపేక్షింపక కార్యమొనరించుటయే కర్మ మానుట యని గ్రహింపుము.

ఆ. పుట్టువుం దెలియనిపురుషాధములు భూమిఁ
బుట్ట నేమి లేక గిట్ట నేమి?
పుట్టలోనఁ జెదలు పుట్టదా గిట్టదా, వి ...780

జనన మన నేమొ యది యెందువలనఁ గలుగుచున్నదో దాని నెఱుగఁజాలని నీచులు ప్రపంచమునందు పుట్టినను లేక చచ్చినను సమమే యగును. ఇట్టివారు పుట్టలోనిచెదలువలె పుట్టుటయును గిట్టుటయును నిష్ప్రయోజనములే యగును.

ఆ. పుట్టుముద్ధ తిరిగిపోయెడు నీముద్ధ
తేరముద్ధ తన్ను తెలియలేడు

ఉన్న నాఁటికైన నుపకారిగా లేఁడు, వి... 781

పుట్టునప్పుడును జీవుఁ డజ్ఞానియే యగును. పోవునప్పుడు నజ్ఞానియేయై యుండును. అజ్ఞానమయుఁడై తన్ను తా నుద్ధరించి కొనలేఁడుకదా! ఉన్నంతవఱకైన నుపకారియై మనఁజాలఁడు. కాన నీముగ్ధుని జీవితము వ్యర్థము.

ఆ. పుట్టుటకు ముదంబు గిట్టుటకును వెత
యంద ఱెఱిఁగినట్టి యల్పవిద్య
చచ్చుఁ గానఁ బుట్టఁ జప్పున నేడ్వరే!, వి... 782

పుట్టినప్పుడు సంతసించుచుండుటయును చచ్చినప్పుడేడ్చుచుండుటయును అందఱికిని తెలిసిన విద్యయే. కావున నుత్తమమగుజ్ఞానము కలవాఁడు పుట్టినవాఁడు తప్పకఁ చచ్చిపోయెడివాఁడే గనుక, పుట్టినప్పుడే యేడ్వఁదగును.

ఆ. పుడమిఁ గర్మవశతఁ బురుకుత్సుఁ డనుమేటి
ధర్మమనుసరించి ధాత్రి నేలి
తనకుఁ గానివేళఁ దాఁ బడెఁ గష్టముల్, వి...

పురుకుత్సుఁడను చక్రవర్తి ధర్మానుసారియై సమస్తభూమండలము నేకచ్ఛత్రాధిపత్యముగా నేలి చివఱకు తనకు కానివేళ కష్టములనన్నిటిని కర్మ వశముననే యనుభవించెను. కాన కర్మఫలము నెంతవాఁడైన ననుభవింపకతప్పదు.

ఆ. పురుషు లరసి కొన్ని పుణ్యభూము లటంద్రు
బుద్ధిలేదొ యిదియు భూమిగాదొ
పుణ్య మనఁగ నేమి పురుషునికర్మమే, వి... 784



కొందఱు పురుషులు విచారించి కొన్ని క్షేత్రములను పుణ్యమయములని పలుకుచుందురు. అట్టివారికి యుక్తాయుక్తముల నరయుబుద్ధి లేకయుండి యుండవచ్చును. లేకున్న, తక్కినవి క్షేత్రములు కావా? ఇంతకును పుణ్యమనఁగా నేమియో వారికి తెలియనే తెలియదు. పుణ్యమనఁగా, పురుషుని సత్కర్మమే గాని వేఱుగాదు.

ఆ. పూఁతగడ్డి కేల పుట్టించె వాసన
కనకము తన కేమి కల్లఁ జేసె
బ్రహ్మచేఁత లెల్లఁ బాడైన చేఁతలు, వి... 785

బ్రహ్మ లోకములోనివస్తువు లన్నిటికిని వానివాని కర్మముల ననుసరించి ఫలమును గుణమును పుట్టించునని యందురుకదా! చూడుఁడు. ఆదేవుని చేఁతలెంత తెలివితక్కువవియో! పూఁతగడ్డికి వాసన యేలపుట్టించెను? బంగరున కేల కలిగింపఁడాయెను. బ్రహ్మచేష్టలన్నియు వ్యర్థమైన వనుట కిదియె తార్కాణ.

ఆ. పెక్కుజనులఁ గొట్టి పేదల వధియించి
డొక్కకొఱకు నూళ్ల దొంగిలించి
యెక్కడి కరిగిన నెఱిఁగి యముఁడుచంపు,వి...

ఆనేకులగు బీదలను బాధించి చంపి కుక్షిపోషణమునకై యూళ్ళనుదోచి తిరుగుచుందురు. వా రేలోకమున కేఁగినను యముఁడు వెంటనంటియే వచ్చును గాని వదలఁడు. కావున

మానవుఁడు యముఁడు గలఁడని తెలిసి జాగరూకుఁడై మెలంగవలయును.

ఆ. కర్మజాల మనుచు ఘను లెల్లఁ బల్కెరు
కర్మ మేమి? దానిఘనత యేమి?
తెలుపొ నలుపొ యెఱుపొ తెలిసినఁ బల్కుఁడు, వి.

ప్రతియాపదలకును మనుజులు తమతమకర్మములు కారణములని పలుకుచుందురు గదా! విచారించిన నిటు పలుకువారికి కర్మమనఁగ నేమొ యంతటి గొప్ప యేట్టిదో నలుపో తెలుపో తెలియనే తెలియదు. నిక్కముగా తెలిసె నందుమా యిట్టులు పలుకనే పలుకరు గదా!

ఆ. ప్రాణ మాత్మ యెన్నఁ బ్రాణిజీవిత మగు
జీవి ప్రాణ మాత్మ చేరి యొకటె
కర్మబంధమునను గట్టువ డుండును, వి... 788

ప్రాణము ఆత్మ ప్రాణిజీవితము ననువీటిని అజ్ఞులు వేర్వేరుగా తలంచుచుందురు. కాని నిజముఁ బరికించితి మేని జీవియును ప్రాణమును ఆత్మయును నొక్కరూపే యగును గాని వేఱుకాదు. అట్లయిన వేఱుగాఁ దోఁచుట యెందులకనఁగా కర్మవశముననే. ఆత్మకుఁ బ్రాణికి సంబంధము కర్మబంధమున్నంతవఱకె.

ఆ. మంచిగంధముఁ గన మనసు రంజిల్లును
ఎంతొ వాస ననుచు నెన్నుచుంద్రు
తా మెఱుంగ లేరు తమపూర్వవాసన, వి...



మూర్ఖులగు జనులు తా మెవ్వరో ఎట్టిజన్మము నెత్తిరో ఏవాసనలు గలవారో యెఱుఁగఁ జాలరు; కాని యితరములను లెక్కింపఁబోయెదరు కదా! ఎట్లందురా? చూడుఁడు. మంచిగంధమును చూచినమాత్రాన మంచివాసన యని పల్కెదరు కాని తమపూర్వజన్మ వాసనను మాత్రము నెఱుఁగలేరు.

ఆ. మంచినీరు పోయ మల్లె పూచును గాని
ఫలిత మొనరు నెట్లు పనిఁ జొరమిని
పంట చేయ కెట్లు పంటక మబ్బును, వి... 790

మంచినీళ్లు పోసినందువలన మల్లె పూచును గాని ప్రయత్నింపకయే కాయఁజాలదు. అట్టులే మనుజుఁడును ప్రయత్నించి కర్మముల నాచరింపక ఫలము నొందలేఁడు. ఎట్లనఁగా పంటచేయక పంటకము కలుగునా? కాననే నిష్కర్ములకు ఫలము లభింపదు.

ఆ. మంచిరుచులఁ గోరు మంచిస్త్రీలను గోరు
మనుజుఁ డెంత చెడ్డమనసొ చూడుఁ
డించుకంత యైన నే లని విడువఁడు, వి... 791

మనుజుఁ డెంతటివిషయాసక్తుఁడో పరికించుఁడు. మంచిమంచి పదార్థము లన్నియును తనకు కావలయునని కోరుచుండును. స్త్రీల నుత్తమురాండ్ర నెల్లరను తనకు వలయు ననునే కాని విడచిపెట్టఁడు. జిహ్వాచాపల్యమున రుచిగల వస్తువులన్నింటిని దిన నెంచుచుండును ఇట్టి చంచలుఁడా మోక్షమొందువాఁడు.

ఆ. మంచిశకునము లని యెంచి పెండిలి సేయు
వార లొకరు లేరు వసుధలోన
జనులకర్మములను శకునముల్ నిల్పునా? వి.

అన్నిశకునములను మంచివిగానే చూచి పెండ్లి చేయఁగల వార లీలోకములో నెవ్వరును లేనేలేరు. ఒకవేళ చూచి యట్టుచేసినను అయ్యవి మనుజులు చేసినకర్మములను పోఁగొట్టఁజాలవు. శకునములు మంచివయ్యు నెన్నివివాహములు చెడిపోవుటలేదు. కాన శకునపరీక్ష పనికిరానిది.

ఆ. మంటిలోనఁ బుట్టి మంటిలోనఁ బెరిఁగి
మన్నుఁ జూచి నరులు మగ్నులైరి
మన్ను మన్నుఁ జేర మది నిల్పలేరయా? వి...

మనుజులు మృద్వికారములగు దేహములవలనఁ బుట్టి యామృత్తునకే మగ్నులై పరమును కానలేక ప్రయాసపడి చిట్టచివరకు మన్నును మన్నుతోఁ జేర్చునంతపఱకును మనస్సును నిగ్రహింపలేక పోయిరి. జీవులు ఎంతటియజ్ఞానులో కదా!

ఆ. మతపుభేదము గలమాయసంసారులై
దారిఁ దెలియలేదు తమక మొంది
దారి తెలియునతఁడు ధన్యుఁడు గాఁడొకో!, వి.

ఎంత చక్కఁగా చదివికొనిన మనుష్యుఁడయ్యును మతభేదమను తమస్సుచే నావరింపఁబడి దారి దిక్కు తోఁచక పరిభ్రమించి పడుచు లేచు చుండునే గాని యుత్తీర్ణుఁ డగుట దుర్లభము. కావున నట్టులు గాక దారి తెలియు వాఁడు ధన్యుఁ



డగును. అనఁగా సర్వసమత్వమును బూని మతభేదముల వదలవలయును.

ఆ. మతము లెన్నియైన సతములు కావవి
సతము కర్మ మగును జగతియందు
నన్నిమతములందు నరయ నొక్కటి లేదు, వి.

మతము లెన్నియైనను స్థిరములు గానేరవు. లోకములో నెప్పుడు స్థిరముగా నుండునది కేవల మొక్కకర్మమే. ఏ మతములను ఎంతవిమర్శముతోఁ బరికించినను కొంచెమైనను స్థిర పదార్థము లేదు. మతము లన్నింటికి కట్టుబాటొకటియేని కానరాదు.

ఆ. మద్యమాంసరుచిని మాదిగదైవాల
యెంగిలిఁ దినఁగానె నింగి కలదె?
భక్తిని హరుఁ గొల్చి భవ్యులు గండయా, వి.

మాంసమును దినుటకును కల్లును త్రాగుటకును మరగి యనాచారపుదైవముల యెంగిలిని మెక్కి నిక్కినంత మాత్రాననే స్వర్గము కలుగునా? కలుగనేరదు. కావున ఈశ్వరుని సేవించి పవిత్రులు కండు. ఈదైవములు ఈమద్యమాంసములు మోక్షము నీయలేవు.

ఆ. మధురసంబు గోరి మక్షికంబులు చేరి
చొచ్చి వెడలలేక చొక్కినట్లు
మునిఁగి విడువలేఁడు మూఢుండు కర్మల, వి....

మూర్ఖుఁడు విషయములం జొరఁబడి తీవివాసనఁ బట్టిలేక

టేఁగలు తేనెలోఁబడి బయలు వెడలలేక పోయినయట్లు లేవిషయములను వదలి ముక్తుఁడు కాఁజాలఁడు.

ఆ. మనసులోనిముక్తి మఱియొక్కచోటను
వెదుకఁబోవువాఁడు వెఱ్ఱివాఁడు
గొఱ్ఱెఁ జంకఁ బెట్టి గొల్ల వెదకినరీతి, వి...

మనసులోనే సర్వదా సన్నిహితమై ముక్తి యుండఁగా ఎచ్చటనో కలదని వెదుకఁ బోయెడివాఁడు చంకలో గొఱ్ఱెను బెట్టుకొని గొఱ్ఱెను వెదకఁబోవు గొల్లవానివలె వెఱ్ఱివాఁడే యగును.

ఆ. బ్రదుకు లన్ని మాయ భవబంధములు మాయ
తెలివి మాయ తన్నుఁ దెలియ మాయ
తనదుకర్మ మొకటె తనరును స్థిర మయి, వి...

బ్రదుకులన్నియు మాయలే, సంసారబంధములును మాయలే, తెలివియును మాయయే, ఈమాయ యంతయును జ్ఞానమువలన నశించిపోవును. కాని కర్మముమాత్ర మొక్కటి నశింపక స్థిరముగా నుండును.

ఆ. మర్మ మెఱుఁగలేక మతములు గల్పించి
యుర్విజనులు దుఃఖ మొందుచుండ్రు
గాజుటింటికుక్క కళవళపడురీతి, వి... 800

పరబ్రహ్మస్వరూపమునందుఁగల రహస్యము నెఱుంగలేక ఆడంబరపత్తనులు పెక్కండ్రు పెక్కుమతములు గల్పించిరి. జనసామాన్యమా మతములలోని మంచిచెడుగులు విమర్శింపలేక



అద్దములయింటిలోనున్న కుక్క తనప్రతిబింబమును వేఱొక కుక్కయని తలఁచునట్లు మోసపోవుచున్నారు. ఇది సంతాపకరము.

ఆ. మాట చెఱుపుమాట మర్మమే కర్మము
ఆశలు కడగండు లప్పుముప్పు
పాపకారణములు పలుకులు ములుకులు
లేమలకును దెలియలేరు వేమ! 801

సంసారబంధమునకుఁ బాశములవంటివారల స్త్రీలను బెక్కండ్రు మోహాంధులు పృథాగఁ గొనియాడుచుందురు. వారలు గొనియాడఁదగినవారు కారు. వారిమాటలు చెఱుపులకు మూటలు వారిచేఁతలు కనుమఱుఁగులు, వారియాసలపాయకరములు, వారికి ఋణపడుట ఆపదను గొనితెచ్చుకొనుట, వారి పాపపుఁ బలుకులు ములుకులవంటివి. ఇట్టి స్త్రీల యథార్థస్వరూపము కాముకుఁ డెఱుంగలేఁడు.

ఆ. మాట నిలుపలేనిమహితుండు చండాలుఁ
డాజ్ఞ లేనినాథుఁ డాఁడుముండ
మహిమ లేనివేల్పు మంటఁ జేసినపులి, వి...

ఆడినమాటఁ దప్పక నెఱవేర్చుకొనవలయును. పలికినమాటలను నిలుపుకొనలేనివాఁడే చండాలుఁడు. దొరయైయాజ్ఞను చెల్లించుకొనలేనివాఁడు ఆఁడుదానితో తుల్యుఁడు. సామర్థ్యము లేనిదేవతయును మట్టిపెద్దపులియే యగును. కావున సమర్థుఁడై మెలఁగవలయును.

ఆ. మాటలోనివానిమహిమ తాఁ దెలియక
మాట తెలియలేక మమతఁ జిక్కె
మాట తెలిసెనేని మహితుఁడు యోగియౌ, వి.

గురువు ఉపదేశించిన వాక్యములలో సంతృప్తుఁడుగా నున్నవానిమహిమను నెఱుఁగలేక మంచిచెడ్డలను తెలిసికొనఁ జాలక మనుజుఁడు మమతను చిక్కుకొనుచుండును. అట్లుగాక ఆవాక్యముల మంచిచెడ్డలను తెలిసికొనునేని అట్టివాఁడే యోగి యగును.

ఆ. మానసమున మంచి మల్లెపూవుల చవికె
బావితోఁటఁ జేసి బాలఁ గూడి
భోగి నయ్యెద నని బోయెఁ బో కాలంబు, వి.

బ్రదికినన్నిరోజులును గొంతెమకోర్కులను కోరుచు ఫలసిద్ధికై యత్నింపకయే గాలిలో మేడల గట్టుద ననుకొనుచుండినవాఁ డెన్నటికిని తరింపలేఁడు. అట్టివానికి ఆయుష్యమంతయు నాయాలోచనలతోనే గడచిపోవును. ఇట్టివృథాలాపి బావులు త్రవ్వి దాని నీరు మల్లెపూవుపందిరులకుఁ బెట్టి తనప్రియురాలితో నాపందిరికడఁ బరుండి తనభోగేచ్ఛఁ దీర్చుకొందు నని యనుకొనుచుండఁగఁ గాలము సమీపించనే సమీపించును.

ఆ. మాయజగ మటంచు మనుజులు సెప్పేరు
మాయ గాదు కర్మమయము గాని
మాయమైన జగము మఱి యేడ నున్నదో? వి.



మనుజులు గుర్తింపనేఱక ప్రపంచమునంతయును మాయ యని చెప్పుచుందురు కాని పరికించిన నిది మాయగా తోఁచుట లేదు. అంతయును కర్మమయముగా నున్నది. వా రనుకొను నట్టులు మాయయే యనుకొంద మన్నను మఱి జగములెక్కడివి?

ఆ. మాయజగములోని మమకారవృత్తిచే
మాయఁ దగిలి మనసు మంకు విడక
మదపుఁజేఁతచేత మహితు లెట్లౌదురు? వి...

ఈమాయావిశిష్టమగు ప్రపంచమునందు జనులు మోహితులై మమకారములఁ బడి మనోమాలిన్యమును వదలివేయఁ జాలక మత్తులై దుష్కర్మముల నాచరించుచుందురు. కాని యట్టివారు మహానుభావు లెట్లు కాగలరు?

ఆ. మాయను చెఱసాల మన సను గొలుసును
భేద మనెడి బొండ బెరసియుండు
నీట్టికర్మబద్ధుఁ డెన్నఁడు ముక్తుఁడౌ? వి... 807

కర్మబద్ధుఁడు చెఱఁబెట్టఁబడినవానితో సమానుఁడు. ఇట్టివానికి విమోచనము దుర్లభము అగును. ఎట్లనఁగా: వీనికి మాయయే యొక చెఱసాల, మనస్సే కాలుసేతులకు గొలుసులు. భేదబుద్ధియే బొండకొయ్య. కావునకర్మబంధము దుర్విమోచనము.

తే. మాయ మమకారమును ద్రుంచి మరగినంతఁ
గర్మదగండ్లు చెప్పును కాలుఁ డెఱుఁగు
దీనిఁ గని మెలఁగెడివాఁడు ధీజితుండు
నాయతుల్ లేనిచో గతుల్ మాయు వేమ!

మాయను మమతను పోఁగొట్టుకొని యెల్లప్పుడును జ్ఞానమును మఱగియుండినయెడలను కర్మలలోనికష్టములును తొలఁగును. దీనిని యముఁడు గ్రహించి నరకయాతన తొలంగించును. ఈయుక్తినెఱిఁగి మెలఁగెడివాఁడే మనస్సును జయించినవాఁడు. ఉత్తరకాలమునందలి ఫలాపేక్షలేనివానికి సంసారప్రవృత్తియును నష్టమగును.

ఆ. మాలయంటనుచును మఱి నీళ్లమునిఁగిరి
మాలకర్మచేత మాలఁడాయె
నేల తెలియలేరొ! యీనరపశువులు, వి...809

మాలవానినిఁ జూచి యంటుపడితి మని పలుకుచు స్నానములను చేయుచుందురు. ఆమాలవాఁడును కర్మవశముననే మాలఁడయ్యెను. గాని జన్మచేతఁగాలేదు. ఈమాత్రము విషయమును మనుజులు ఎందువలన తెలియలేరో గదా!.

ఆ. మాలదానియంటు మంచినీళ్లను బోవుఁ
దుఱకవానియంటు త్రుళ్లిపోవు
మ్రుచ్చువానియంటు చచ్చిన పోవునా? వి...

మాలఁడు తాకిన గలుగునంటుదోషము స్నానమునఁ బాసిపోవును. తురకయంటు నిట్టులే. కాని పైకి మంచివానివలె నుండుదొంగను స్పృశించినయంటు చచ్చినను పోఁజాలదు.

ఆ. ముక్కుపట్టి యీడ్చుముండను జేపట్టి
తిక్కయెత్తినరుఁడు తిరుగుచుండు
నెక్కడితలిదండ్రు లేమియుఁ దనకేల? వి...



కర్మమును జయింపలేనినరుఁడు చేయునక్రమములకు మేరలేదు. అట్టిజనుఁడు తలిదండ్రులపై ప్రేమభక్తి దిగఁద్రావి వారలను వదలివేయును. మోహమునఁ గన్నుమిన్ను గానక లంజెకులోనై యాపె చేయునవమానములను దలయొగ్గి పిచ్చియెత్తినవానివలె వాండ్రపంచలవెంట నెల్లపుడు తిరుగుచుండును.

ఆ. మీఁదియాఁకఁ దీసి మిగులఁ బెద్దల మని
కానరాక తిరుగుఁ గర్మజనులు
బయలుకోరినట్లు భావంబుఁ గోరరు, వి... 812

తల బోడిచేసికొని యోగులము సన్న్యాసులము అని కర్మబద్ధులై తిరుగుచుందురు. ఇట్లగుటయంతయు నజ్ఞానవిలసితమే కాని వేఱుగాదు. బయలు రీతిగా భావమును కలదా! యని మాత్రము పరికింపరు.

ఆ. ముక్తి యెవరిసొమ్ము ముక్కుమీఁదుగఁ జూడ
భక్తి యెవరిసొమ్ము భజన సేయ
శక్తి యెవరిసొమ్ము యుక్తిచే సాధింప, వి...

శక్తిభక్తియుక్తులు కాని ముక్తికాని పరమేశ్వరానుగ్రహము కలవారికి మాత్రమే యబ్బును. ఇతరులు ఎన్నివిధములగు ప్రయాసముల ననుభవించినను ఈషణ్మాత్రమైనను వారికి ఫలలబ్ధి కలుగదు. నాసికపైఁజూపు నిల్పినంత ముక్తిరాదు. భజనఁజేసినంత మాత్రమున భక్తియలవడదు. యుక్తిగావాదించినంత మాత్రమున శక్తిసామర్థ్యములు లభింపవు గాన నిట్టియాడంబరములను వదలిపెట్టవలయును.

తే. ముక్తులకు నేలఁ బెట్టెఁడు మూఢజనుఁడు
దూదిమూటనఁ జాలినఁ దొడ్డకడుపు
నించుచుండును సతమని నిత్యముగను
గడుపు తన్నుద్ధరించునే కడకు వేమ! 814

లుబ్ధుఁడు స్వోదరపరాయణుఁడు నగుజాల్ముఁడు ముక్తికై యాసించువిరాగులగు సన్న్యాసులకుఁ బిడికెఁడు బియ్యమైనఁ బెట్టఁడు. దూదిమూఁటవంటితన గాఁడెపొట్టలో పట్టినంత పఱకుఁ బెట్టుకొనుచుండును. ఈపొట్ట పరలోకమునఁ దన్నుద్ధరింప దనియు నీదేహము శాశ్వతము గాదనియు సాతఁ డెఱుఁగఁడు.

ఆ. ముండఁ జూచినంత మొగమోటమిని గంద్రు
ముండకూడు దినక ముక్తి లేదు
ముండ కూటికెల్ల మూలంబె కాదయా? వి...

అజ్ఞానావిష్టులై మనుజులు కామాసక్తిచేత స్త్రీని పొడఁగని నయప్పుడు వ్యక్తివదలి లోఁబడెదరు. ఆఱంకుటాలియిల్లే మోక్షస్థానమని తలంచి దానింట భుజింపకున్న ముక్తి లేదనిము ప్పొద్దు లచటనే భుజింతురు. పడుపుఁబోఁతులయింటి భోజనము సమస్తపాపములకు మూలమని యామందమతు లించుకేని గమనింపరు గదా!

ఆ. ముండలదగు గోష్ఠి మునుఁగుచుఁ దేలుచు
విడువలేరు సుమ్మి వెఱ్ఱినరులు
అండఁ బాయు వెనుక నన్నియుం బోవురా, వి.



స్త్రీలపైఁ గలవ్యామోహమున మూర్ఖులై జనులు పడుచు లేచుచు వెఱ్ఱివారై తిరుగుచుందురు. కాని శరీరము నశించి కర్మక్షయమైనచో నీవ్యామోహాదులును నశించును.

ఆ. ముదిత నడవి నుంచి మును లేడి వెన్నంటె
రామచంద్రుకంటె రసికుఁ డేఁడి?
పోలుపు తొలఁగువేళ బుద్ధు లట్లుండురా, వి.

కాలమును కర్మమును చక్కఁగా లేనిచో మనుజులబుద్ధులు చెడుమార్గమున నడుచుచుండును. శ్రీరామచంద్రునంతటివిజ్ఞుఁడు లేఁడు. అట్టిసర్వవిషయవేత్తయే బంగరులేడికై సతిని భయంకరాటవిలో విడిచిపెట్టి దానివెంట నంటెను. ఆపదలు రానున్నపుడు మానవుల బుద్ధు లన్నియు నీరీతినే మందగింప సాగును.

ఆ. ముందుజ్ఞాన మెల్ల మోసమై శిశువులు
కర్మబంధమునను గానలేక
జననమరణములకు సాదృశ్యమై వచ్చి
యిహమునందుఁ బుట్టు టెఱుఁగు వేమ! 818

మాతృగర్భములోనున్న కాలమున శిశువు జ్ఞానవంతుఁడై పూర్వస్మృతి గలవాఁడైయుండును. జన్మించినవెంటనే వానిని మాయ యావరించును. దానిచేఁ బూర్వజ్ఞానము నశించును. పిమ్మట కర్మబంధములలోఁ దగులుకొని యుక్తాయుక్తములుమఱచి భూలోకమునఁ దాను విషయాదిసౌఖ్యము లనుభవించుటకే జనించితి నని మురియసాగును. ఇదియెంత యవివేకము!

ఆ. మునిజనములు కలఁగ మునిఁగి వెళ్లినబావి
బ్రహ్మకుఁ దల లెత్తరానిబావి
మొలలబంటిగాను ముంచు నెవ్వరినైన, వి...

ఈసంసారము మిక్కిలియును ప్రాచీనమైనది. ఇయ్యది అగాధమగుకూపముతో సమానమైనది. ఈకూపమునందే మునిజనులు బ్రహ్మాదులును పడికొట్టుకొనుచుందురు. దీనిసామర్థ్య మెంతటిదో కాని ఎంతవారినిగూడ మొలబంటిగ నుండియు ముంచివైచును.

ఆ. మును తెలిసినవారు మొగి నష్టమై రిల
తిరిగి చెప్పి తనుచుఁ దిట్టవలదు
తెలియఁ జెప్పువాఁడఁ దెలియుము కర్మంబు, వి.

ఈయుపదేశములు క్రొత్తవిగావు. మున్నున్నవియే. ఇటులఁ జెప్పినవారందఱుగూడ నశించిరి. నీవందఱకంటె ఘనుఁడవా? యని యనెదరేమో! కాని యట్లు గాదు. తెలిసిన వారందఱు నశించిరి. కావున తెలియఁ జెప్పుచున్నాను. సావధానముగా వినుండు. సర్వబంధములకు మూలము కర్మమే యగును. ఆకర్మ విముక్తియే మోక్షము.

ఆ. ముఱికికొంపలోన నిఱికించి జీవుని
గర్మపాశములను గట్టివేసె
నిట్టికర్మజీవి కెట్లొకో! మోక్షంబు, వి.... 821

ఈదేహ మొక ముఱికికుహవంటిది. ఇందులో జీవుని చిక్కించి కర్మపాశముచేతగట్టిగాఁ గట్టివేసియున్నారు. ఇట్లు



సర్వదా బంధనస్థితుఁడగుజీవికి ఎట్లు విముక్తికలుగునో యూహింపుము. కాన కర్మధ్వంసము గావింపవలెను.

ఆ. ముఱికితోలుకంత మూలంబె మదిచింత
నరక మబ్బుఁ జెంతనలుగు డెంత
పరము గోరినంత బయలగు నీవింత, వి... 822

ఈశరీరము మలమూత్రాదుల కాటపట్టగు తోలుతిత్తి, ఈదేహము నాశ్రయించినవారికి చింతదప్ప మఱియొకటిలభింపదు. జీవితకాలమంతయు నవస్థలె. తుదకో నరకమేగతి! ఈయవస్థలనుండి బయటఁబడ నెంచితిమేని పరమాత్ముని ధ్యానించి మోక్షము కొఱకుయత్నింపవలెను. దానిచే నీశ్రమలన్నియుఁ దొలఁగిపోవును.

ఆ. ముఱికిలోనఁ బుట్టి ముఱికిలోనఁ బెరిఁగి
ముఱికితనువు కింత మురిపె మేల?
ముఱి కెఱుంగునతఁడు ముఱికిలోఁ బుట్టునా? వి.

మూర్ఖులు జ్ఞానుల మని చెప్పుచు ముఱికి కూపముతోతుల్యమయిన సంసారమను ముఱికిగుంటలో జన్మించి యందె పెరిఁగి పాపకర్మములఁ జేయుచుఁ దామే మో ఘనులమని మురియుచుందురు. కాని తాముముఱికిలో మునిఁగి తేలుచున్నసంగతి నెఱుఁగరు. అట్లు గ్రహింపఁగలిగినవాఁ డెన్నఁటికి మఱల నీముఱికి గుంటలో జన్మింపఁడనుట నిక్కువము.

ఆ. మూఁటి నీషణముల మొదలంటఁ జెఱుపక
చిత్తమేల నిలుచు స్థిరముగాను

చిత్తశుద్ధి లేక శివుఁడు కాన్పించునా! వి...

ఈషణత్రయమును సమూలముగా నశింపఁజేయనిది చిత్తస్థైర్యము కలుగదు. చిత్తము నిలుపనిది శివసాయుజ్యము కలుగదు. కావున మోక్షార్థి ద్రవ్యముపైఁ గలయాస (ధనేషణము) భార్యపైఁ గలమమకారము (దారేషణము) బిడ్డలపై ప్రేమ (పుత్రేషణము)వదలి విరాగి యగుటవలననే ముక్తిసాధింపఁగలుగును.

ఆ. మూఁడుగుణము లొకట మొదలనెయుండఁగాఁ
గలిపి మూలఁ బెట్టి తెలివిలేక
భ్రమలఁ జిక్కు కర్మి బలువెఱ్ఱివాఁడురా, వి...

గుణత్రయము ఆరంభమునుండియే యుండినను వానిని కలిపినిలుపుకొను తెలివి లేక భ్రమలలోఁ జిక్కుకొని కర్మబద్ధుఁడై తిరుఁగువాఁడు నొకవెఱ్ఱివానితో సమానుఁడే యగును. (సత్వరజస్తమోగుణము లనుమూఁడింటిలో నొకదానికంటె వేఱొకటి చెడ్డది. ఉత్తమగుణములోఁ జెడ్డగుణమును మిళితముఁ జేసి వానివలని యవాంతరములఁ దొలంగించుకొనవలయును.)

ఆ. మూఢభక్తిచేత ముక్కంటిఁ బూజింప
మొన్న బోయనరుఁడు ముక్తుఁడాయెఁ
బూజకేమి తనదుబుద్ధి ప్రధానంబు, వి... 826

పూజకంటెను బుద్ధియే ప్రధానమైనది. బుద్ధి మంచిది గలవానికిఁ దక్కినసాధనసంపద యేదియు నక్కఱలేదు. మూఢుఁడు



మూఢభక్తిగలవాఁడు చిరకాలమునుంచి ఈశ్వరు నారాధించువార లట్టే యుండఁగా, తనమనోరూఢి నాతని బూజించి కన్నప్ప త్వరగా సిద్ధుఁ డయ్యెను. (చూడుము. కాళహస్తిలోని కన్నప్ప కథ.)

ఆ. మూల మెవ్వరనుచు ముగ్గురిలోఁ గల
మూల మెఱుఁగలేరు మూఢజనులు
మూలమంతటికిని ముఖ్యము కర్మము, విశ్వ...

త్రిమూర్తులలోపల నెవ్వరు ముఖ్యులని జనులు తగవులాడదరే కాని సారము నెఱుఁగలేరు. నిజమును విచారించితిమా ఆత్రిమూర్తులకును ప్రపంచమున కంతకును కర్మమే ముఖ్యము అగునని తేలును. కర్మము నాత్రిమూర్తులు గూడ జవదాటలేక యవస్థ పడుచున్నారు.

ఆ. మూలవిద్యయందు ముఖ్య తేజములోన
మెలఁగుచిత్పరుండు మిహిరుపగిదిఁ
గాలకర్మములకుఁ గాలుండె సాక్షిరా, విశ్వ...

మానవజీవితమునకు తారకమైనది వేదాంతవిద్య. దానిప్రకారముగఁ జూచితిమేని మూలాధారచక్రము మొదలుకొని బ్రహ్మరంధ్రమువఱకు శుద్ధస్ఫటికకాంతితో నొకకాంతి గానవచ్చును. అదియె బ్రహ్మస్వరూపము. దానియందె జ్ఞానాతీతుఁడగు పరమాత్ముఁడు సూర్యునివలెఁ బ్రకాశించుచుండును. వానిని దలంతువేని బంధవిముక్తుఁడవు కాఁగలవు. కాలకర్మములకప్పుడు

యముఁడు సాక్షిమాత్రుఁడైయుండుఁగాని పీడాకరుఁడైయుండఁజాలఁడు.

ఆ. మాట లుడుగకున్న మంత్రంబు దొరకదు
మంత్ర ముడుగకున్న మది కుదురదు
మనసు నిలుపకున్న మఱి ముక్తి లేదయా, వి

మౌనము వహింపనియంతవఱకును మంత్రసిద్ధి కాఁజాలదు. మంత్రసిద్ధియైనఁగాని మనస్సు నిలుపదు. మనస్సు నిలిచినఁగాని ముక్తిలేదు.

ఆ. మైథునమునఁ బుట్టి మానవు లందఱు
తిరుగుచుందు రెపుడు తెరువులేక
యెందులోనఁ బుట్టు కందులోనే గతి, వి...

జీవున కెందుజన్మకారణము కలదో యందే నశించును. జీవుఁడు స్త్రీపురుషసంయోగమువలన శుక్లశోణితములచే జన్మించుచున్నాఁడు. మఱల నవివేకముతో స్త్రీసంయోగమునకై దేవిరించుచుండును. ఇది యక్రమము. ఇంతయేల స్త్రీపురుషసంయోగమువలన జీవుఁడు జనించును. కర్మోపేతుఁడుగాన నిట్టి సంగమమువలననే మరణించుచున్నాఁడు.

ఆ. మొదటితరువునందు మూఁడుకొమ్మలు పుట్టె
ననలు కొనలు తీఁగ లాకు లమరెఁ
బువ్వుపిందెపండ్లు భువనము ల్నిండెరా, వి. 831

బ్రహ్మాండమను భూలోకమునందు మూలప్రకృతి యనుమహావృక్షము జనించెను. దానిఁ సత్త్వరజస్తమోగుణములను



మూఁడు కొమ్మ లుదయించెను. క్రమముగా నామహావృక్షము భూలోకమంతయు నావరించెను. పిమ్మట పంచబుద్ధీంద్రియములను పువ్వులు పంచకర్మేంద్రియములను ఫలములు జనించెను. కాన విశ్వసృష్టి విధమిట్టిది.

ఆ. ముచ్చు యాత్ర కేఁగ ముల్లె విడుచుఁగాని
మ్రొక్కఁ బ్రొద్దు లేదు మొనసి యెపుడు
కుక్క యిల్లు చొచ్చి కుండలు మోయునా? వి.

దొంగవాఁడు తక్కినవారివలెనే భక్తినటించుచుఁ దీర్థయాత్రలకు బయలుదేరుచుండును. వాఁడు క్షేత్రములలో నెవరిమూటవిప్పుదునాయని చూచుచుండును గాని దేవునికి మ్రొక్కదగినంత తీఱికకలుగఁ జేసికొనఁడు. దొంగకుక్క యింటిలోనివస్తువులఁ దినవలయునని వచ్చునుగాని కుండలు మోయుటకెన్నఁడేని రాదుగదా!

ఆ. యోనిబంధుఁ డగుచు నొనర జన్మము నొంది
హానివృద్ధిచేత నలసుఁ డగును
కానిదానిమహిమఁ గడమొదల్ దెలియదు, వి.

జననము నొంది హానివృద్ధులవలన మందుఁడై కర్మియొప్పుచుండునే గాని ఆకర్మపునిజరూపు నెఱింగి విముక్తుఁ డగుటకై యత్నింపఁడు.

ఆ. యౌవనమున నీశు ధ్యానమ్మునను మది
నిలుపనపుడు ముందు నెగ్గఁ గర్మ
చేయనియతనికి క్షితి సౌఖ్య మేదయా? విశ్వ...

యౌవనదశయం దీశ్వరుని ధ్యానించుచు తద్రూపమునుమనస్సులో నిలుపక యున్నచంచలహృదయునకు మంచిపనులు గావించనివానికిని ఎన్ని జన్మములెత్తినను కర్మములు పక్వమునకు రాఁజాలవు. రానిచో సుఖమును కలుగదు.

ఆ. రాయినైన యహల్య రాముపాదము సోఁకి
యాఁడుదయ్యె నందు రవనిజనులు
చేయుసుకృతము లిల శిలలైనఁ దప్పవు, విశ్వ.

అహల్య శిలారూపమై రామునిపాదధూళిసంయోగమువలన స్త్రీరూపమును ధరించెనని పురాణములఁ బల్కుచుందురు. సుకృతముఁ గావించినవారు శిలలైయున్నను ఏవిధముగానో సుకృతమునకు ఫలమనుభవింపకపోరు. ఇందులకు శిలారూపయగు నహల్యయేతార్కాణ.

క. లోకము తను ఛీ యన నా
యాకీడులొనర్చుచుండు నధముఁడు ధర్మం
బేకొలఁదియొ తా నెఱుఁగునె?
కాకులు మడివస్త్ర మెఱుఁగఁగలవా వేమా! 836

నీచుఁడు తనను లోకులందఱును ఛీ ఛీ యని పలుకుచున్నను పెడచెవిని పెట్టి లోకముల కపకృతియే చేయుచుండును. అయ్యది వాని స్వభావము. ఎట్లనఁగా: పెంటలో తినెడికాకి మడివస్త్రము నెఱుఁగఁ గలుగునా? లేదుకదా! అట్టులే.



క. వచ్చునది పోవునది మఱి
చచ్చెడిదియుఁ గానలేరు సహజము లనుచున్
విచ్చలవిడిగాఁ దిరుగుట
చిచ్చునఁ బడునట్టిమిడుతచెలువము వేమా! 838

కర్ములు జరుగుచున్నట్టిదానిని జరుగఁబోవుదానిని జరిగినదానిని గుర్తింపలేక యజ్ఞులై దీపముపైఁబడు మిడుతచందమున చచ్చిపోయెదరు. ఎల్లపుడు కాలము తనకనుకూలముగానుండునని విచ్చలవిడిగాఁ దిరుగసాగుదురు.

ఆ. వలపుఁ జూప మదిని వర్ణించి కొనక
వెతలఁ జిక్కుచుండు వెఱ్ఱివాఁడు
కులముఁ గోరువాఁడు గుణహీనుఁ డగువాఁడు, వి.

పరకాంతాసక్తులచేష్టలు మిగులనసహ్యకరములు. ఎవతెయేని వలపును వెల్లడించినంతనే యామెను కొనియాడుచుకన్నఁగానక పెక్కుతిప్పలపాలై వెఱ్ఱివాఁడై జారుఁడు సంచరించును. అట్టి నీచకార్యములు చేయుచుఁ దా నుత్తమకులుఁడనని గర్వించును. ఇట్టివాని కులాధముఁడనినను తప్పుగలుగఁజాలదు.

ఆ. వలలు పన్ని దుష్టవన్యమృగంబులఁ
బట్టవచ్చుఁ గాని పాడుకర్మ
గురునిబోధ లేక కుదుట నొందదు సుమీ, వి.

అడవిలోని దుష్టమృగములనుఁ గూడ వలలొడ్డి పట్టుకొనవచ్చును గాని ఈదుస్సాధ్యములగు కర్మములను గురుబోధయక్కఱ లేకుండఁగనే సాధించుట కష్టమగును.

ఆ. వాక్కుచేతఁ దప్పు వావులు వరుసలు
వాక్కుచేతఁ దప్పు వనితగుణము
వాక్కుచేతఁ గలుగు వరకర్మములు భువి, వి.

మాటయే లోకమున కంతకును మూలము, వావిని వరుసను దప్పించునది మాటయే. స్త్రీల స్వభావమును మార్చునదియును సత్కర్మములను గట్టునదియును మాటయే యనఁదగును. కాన మాటలనేర్చినవానికె సర్వసౌఖ్యములు.

ఆ. వాఁగు లడ్డగట్టి వల్లకాడులు దున్ని
మున్ను నడచుత్రోవ ముండ్లు గొట్టి
పైరుఁ బెట్టునట్టిపాపులు గలరొకో! వి... 842

కొందఱ అవివేకులు వాఁగులు వంకలు బిగించి శ్మశానవాటికలను చెడఁదున్ని జనులేగు త్రోవలనిండ ముండ్లకంచెలను వైచి పైరు వేసికొని పేదలనోళ్ళనుగొట్టి పైరులఁబండించి ఫలములనుభవించి యుత్తములము తామెయని గర్వించెదరు. ఇట్టివారు పాపులు. వీరు చేయునవి పాపకర్మములని ముమ్మాటికిఁజెప్పవచ్చును.

ఆ. వాడ కులము లేక వర్తిల్లు మనుజుండు
కర్మబద్ధుఁ డగుచు ఘనత లేక
లేనివానిఁ బోలి దీనవాక్యము లాడు, వి...843

మనుజుఁ డెంతగొప్పవాఁడైనవాఁడు పూర్వజన్మమున దుష్కర్మ లాచరించెనేని విపరీతఫల మనుభవింపక తప్పదు. అట్టివాఁడు ఊరుపేరులేక కులహీనునివలె నీచమనుభవించును. నలు



గురిముందు దరిద్రునివలె దీనాతిదీనుఁడై మాటలాడవలసివచ్చును. ఇట్టి యవస్థలన్నియు దుష్కర్మల ఫలములేసుమా!

క. వాదమున నడచు నరుఁ డగుఁ
గాదనఁగా భూమి దిరుగు గడుసరి యైనన్
ఏదైన హాని వచ్చిన
సాధనవాదంబు నడవఁ జరుగదు వేమా! 844

ఎప్పుడును ఏదారి యనిన కోదారి యనుమనుజుఁడు ఎప్పటికిని బాగుపడనేరఁడు. వాఁడు అయినది కాదని కానిదగునని పలికినపుడు గడుసువాడువానితో మనకేమనుకొనక యెంతహాని వచ్చినను వానిని వంచింపవలసినదె. అట్టివానితో సాధువాదమునకుఁ గడఁగినను నిష్ప్రయోజమే యగును.

ఆ. వానరాకడ మఱి ప్రాణంబు పోకడ
కానఁబడదు కాలకర్మవశతఁ
గానఁబడినమీఁదఁ గలి యిట్లు నడచునా? వి.

కాలకర్మలవశమువలన వర్షపురాకడయును ప్రాణపుపోకడయును కనుపట్టవు. అట్లుగాక ముందు రాఁబోవువిషయములు తెలిసియే యుండునేని కలి యిట్లు గడ్డలగునా?

క. విడువని మాయాకర్మము
గడువఁగ లేరైరి జనులు కడుఁ జిత్రముగా
సుడివడి పుట్టుచుఁ జచ్చుచుఁ
గడతేరుట గాంచు రెట్లు ఖలులకు వేమా! 846

సుజనులు అవిరతముగా మాయావృతులై మాయను కర్మమును దాటనేరక సుడిలోఁ బడి తిరుగునట్లు ఆమాయలోఁ బడిచచ్చుచు పుట్టుచుందురు. ఇట్టివారె యేవిధముగానైనను కడతేఱఁజాలకుండ జ్ఞానశూన్యులగు ఖలులేవిధముగాఁ గడతేఱఁ గలుగుదురో తెలియదు.

ఆ. వితరణుండు తానె విజ్ఞానతప మూని
మతికి గతి యటంచు మాన్యబుద్ధి
సతత మాత్మఁ గర్మసందేహములు రోయు, వి.

త్యాగియగువాఁడు తనంత తానే విజ్ఞానము నార్జించికొని పూజ్యభావముతో మెలఁగి దురాశాజనకమగు మనస్సును వంచించుటకు నుదారభావములే తగినవని నిశ్చయించుకొనును. కర్మరూపములగు సందేహములను వదలివైచి ఆత్మసాక్షాత్కారము నొనర్చుకొనును.

ఆ. విత్తనంబు గురువు విశ్వంబునకు నెల్లఁ
బ్రణవమంత్ర మరయఁ బరమగురువు
కర్మగురువు సుమ్ము గాయత్రిమంత్రంబు, వి...

సమస్తప్రపంచమునకు మూలకారణము గురువులే యగుదురు. అట్టిగురువుల కందఱికి గురువు ఓంకారము. ఆయోంకారము గాయత్రీరూపమున కర్మలనుండి కడతేర్చుటకు గురురూపగును.

క. విత్తును సుమకయుఁ దమలోఁ
బొత్తున పుట్టగను బొట్టుపోయినభంగిఁ



వేత్తగు నాతనికర్మం
బత్తైఱఁగునఁ గడచి చనును ననువుగ వేమా!

సహజముగ విత్తువెంటఁ బొట్టుగూడ నుండును. మొలవేసినంతనే యందలి పప్పు మొక్కగా మాఱును. పొట్టు వదలిపోవును. అటులే మానవునిఁగూడఁ గర్మయంటియుండును. సద్గురూపదేశమువలన నట్టికర్మబంధము వదలించుకొనినఁగాని మోక్షము చేకూరఁజాలదు.

ఆ. వ్రాఁత వెంటఁ గాని వర మీఁడు దైవంబు
చేఁతకొలఁదిఁ గాని వ్రాఁత కాదు
వ్రాఁత కజుఁడు కర్త చేఁతకుఁ దాఁ గర్త, వి.

దైవము వ్రాఁతననుసరించి శుభాశుభములిచ్చును. వ్రాఁతచేతికర్మము ననుసరించి యగుచుండును. కావున నొసలివ్రాఁతకు ఈశ్వరుఁడును చేఁతకు తానును కర్తలగుదురు.

ఆ. శనియె చాల దనుచు ననిరట కొందఱు
శనికిఁ జాలని దది కనఁగ లేరు
కర్మఫలమె మిగులఁ గష్టముల్ గుడుపురా, వి...

లోకు లనేకులు శనిచాలకపోవుటవలన తమకు కష్టములు వచ్చిన వని యందురు. కాని ఆశనికి ఏమి చాలకున్న నిటు యిల్లిల్లు అల్లాడవలసివచ్చినది? కావున నందఱికిని కర్మమే మూలమగును. ఆకర్మమే నష్టములఁ గుడుపుచున్నది.

ఆ. సతిని జూచి చూచి సౌఖ్యంబు తాఁ గోరు
గతిని కానలేఁడు కర్మజీవి

గతులు సతులవలనఁ గానంగ లేరురా, వి... 852

స్త్రీని చూచి తాను సుఖింపవలయునని యజ్ఞుఁడై కోరుచుండునేకాని చివఱకుఁ గలుగఁబోవుగతి నెఱుఁగలేఁడు. గతులెప్పటికిని సతులవలన కలుగఁజాలవు. ఈసంగతి కర్మజీవు లెఱుంగరు.

ఆ. సతులఁ జూడఁ జూడ సంసారి కాఁగోరు
సుతులు పుట్టఁబుట్ట వెతలఁబడును
గతులు చెడఁగ చెడఁగఁ గర్మమంచేద్చును, వి.

విరాగి స్త్రీలను చూచుకొలఁదిని సంసారి కావలయునని కోరుచుండును. కొడుకులు పుట్టినపిమ్మట దుఃఖములపాల్పడును. ఇటుల సంసారపు జంజాటములలోఁ బడి మునిఁగి తేలుచుండ సద్గతులన్నియు దూరమగును. గతులన్నియు నిటుల తెల్లవాఱిన పిమ్మటఁ గర్మ మను యజ్ఞతచేత నేద్వసాగును.

ఆ. సుతులచేతఁ బుణ్యసుఖము నొందుదు నని
మనుజుఁ డుండుఁ గర్మమతముఁ దగిలి
యేనుఁగు పడియున్న నెత్తునా మశకంబు, వి...

కొడుకులు పుట్టిన వారిమూలమున నుత్తమలోకసౌఖ్యములను పొందఁగలనని మనుష్యుఁడు కర్మబద్ధుఁడై మెలఁగుచుండును. ఇది భ్రమ. ఎట్లందురా? చూడుఁడు. ఏనుఁగు ఎత్తు పడినఁ దోమలు ఎత్తఁగలవా? అట్టులే కొడుకులుగూడ.

ఆ. నేతిపందు మనుఁగ నీటిలఁ గాకి తెలుపౌనె?
కాశి కేఁగ గ్రద్ద గరుడుఁ డగునె?



బదరి కరుగ వృద్ధు బాలుండు గాఁడయా, వి...

మనుజులు తమతమపురాతనకర్మములవలన పుణ్యులయ్యెదరుగాని కాశీబదరికాశ్రమాదులకుపోయినఁ గాఁజాలరు. నేతులో మునిఁగినకాకి హంస కానియట్టులే కాశికిపోయిన గ్రద్ద గరుడుఁడు కానియట్టులనే బదరీనారాయణమున కేగినంతన వృద్ధుఁడు బాలుఁడు కానటులే.

ఆ. స్థిరులు గాక క్షుద్రజీవులలోఁ జేరి
యెచ్చుతగ్గులందు హీనమతులు
గాడ్దెపిల్ల లగుచుఁ గ్రక్కునఁ జెడుదురు, వి...

స్థిరభావము గనలేక చంచలులై నీచులలోఁ జేరి నీచులుగా మాఱియుచ్చనీచము లొందుచున్నవాండ్రందఱు ముందుముందు గాడిదెపిల్లకోమలముగా సుఖమునొందువారివలెఁ గాన్పించినను ముందుముందు వారుసర్వవిధములభ్రష్టులగుదురు.

క. హరి విధి సురముని లాదిని
మెఱసియు జన్మించి పిదప మేలుల కెడఁగా
జరయందు మరణమందును
పరుసక వర్తిలిరి కర్మవాసన వేమా! 857

బ్రహ్మ విష్ణు సురమునీశ్వరాదులంతటివారు కూడ కర్మవశమున జననమరణములను ముదుసలితనమునొందుచును కర్మవాసనలను తప్పించుకొనలేక నానావస్థలొందిరి. కర్మవాసన నెడబాయుటకు మనుజమాత్రు లెంతటివారలు!

ఆ. హంస మానసోద మంటక తిరిగిన
యట్లు కర్మచయము నంటకుండు

యోగి తిరుగు సకలభోగముతోడను, వి. 858

హంస మానసోదకములలో దిరుగుచు నందలిపంకముచేత స్పృశింపఁబడనియట్టులే జ్ఞానికర్మలయందు సంచరించుచున్నను నిరుపమానమగు పరమహంస సాక్షాత్కారముతోఁ గర్మబంధములఁ దొలంగి ముక్తుఁ డగును. వానిని కర్మలంటవు.

ఆ. హేమనగము చేత నెప్పుడు గలవాఁడు
వెండికొండపైని వెలయువాఁడు
ఎత్తవలసె బిచ్చ మేమన వచ్చురా? వి... 859

మేరువుచేతులో విల్లుగాఁ గలిగి రజతాద్రియందే కాపుర ముండు నీశ్వరునంతటివాఁడును కర్మవశమున భిక్ష మెత్తుకొని జీవింపవలసి వచ్చె ననఁగా నిఁక సామాన్యులను గుఱించి చెప్పవలసిన దేమియున్నది. కాన కర్మమనుభవింపక తప్పదు.



# ధైర్యపద్ధతి.

అవతారిక. సర్వకార్యములు నిర్వర్తించుటకు మానవజీవితమున ముందుఁ గావలసినది ధైర్యము. ధైర్యమున్నఁగాని సర్వకార్య నిర్వహణమునందుఁ బట్టుదలయలవడఁజాలదు. ఆపత్కాలమునందు, కష్టసమయమునందు, నిరాశాసందర్భములందు ధైర్యములేనివారు సర్వకార్యభ్రష్టులై సహజమగు మానవత్వమునుగూడఁ గోలుపోవుచున్నారు. మోక్షార్థికి, కార్యార్థికి, విద్యార్థికి ధైర్యములేకున్నయెడల నాతని భవిష్యజ్జీవనము కష్టభాజన మగుననియుఁ దన్మూలమున నావ్యక్తి యెందులకుఁ బనికి రాఁడనియుఁ జెప్పఁదలంచి ధైర్యలక్ష్మినిగూర్చి వేమనయోగి యీక్రింది విధముగాఁ బ్రశంసఁ జేయఁబోవుచున్నాఁడు.—

ఆ. అచ్చుపడఁగ మనసు మచ్చికఁ జేఁబట్టి
ముచ్చటించి శివునిమూర్తిఁ జూచి
కుచ్చితంబు మాని చొచ్చుటే యోగంబు, వి.

కుదిరికగా మనస్సును మచ్చికఁ జేసికొని నిరంతరధ్యానము నొనర్చుచు ఈశ్వరునిరూపును గుఱితించి కుత్సితగుణములను మాని ధైర్యమునఁ బరేశుని జొచ్చుటయే యోగమనఁబడును. పరిజ్ఞానమునకు సాధనమగు యోగము సాత్వికులచే అభ్యాసరూపమని జ్ఞానరూపమని రెండుతెగలుగా విభజింపఁబడినది. ఈరెంటిలో అభ్యాసయోగము ప్రాణాయామప్రధానమైనది. ఇది చిత్తశుద్ధిచేఁ గాని సాధ్యముగాదు. వేమన తఱచుగా అభ్యాసయోగమును గుఱించియే చెప్పుచున్నాఁడు.

ఆ. అరసి ధైర్య మూని యతిశయకాముఁడై
నిన్ను నమ్మి నిష్ఠ నెగడుచుండి
నిన్నుఁ గొల్వ ముక్తి నిశ్చయముగఁ గల్గు, వి....

పరమేశుని నిజరూపును విచారించి ధైర్యమును వహించి మోక్షాధిక్యమును గోరుచు దేవుని నమ్మి మిక్కిలి నియమముతో ప్రవర్తించుచు సేవించునేని ముక్తి నిశ్చయముగాఁ గలుగును.

ఆ. అంతరంగమందు నభవు నుద్దేశించి
తలఁపఁ దలఁప ముక్తి తనకుఁ గలుగు
బాహ్యరంగమందు భయమొంద ఫలమేమి? వి.

మనస్సులో నితరవిచారములను దలఁపక జన్మమరణాది శూన్యుఁడగు నీశ్వరుని నిరంతరము ధ్యానించిన ముక్తి కలిగితీరును. కావున బాహ్యవిషయములకై భయము నొందకుము.

ఆ. అదరిపడక మనసు నానందమును గోరి
మదిని మెలఁగువాఁడు మాన్యుఁ డరయ
సదమలత్వమునను శాశ్వతేశ్వరుఁ డగు, వి...

ధ్యానకాలమున నేవి యైనను విఘ్నములు పొసఁగ నేని యధైర్యము నొందక యానందకాముఁడై మనస్సున నీశుని ధ్యానించువాఁ డుత్తముఁ డనఁదగును. అట్టివాఁడు నిర్మలత్వమున నీశ్వరభావము నొందఁగలఁడు.

ఆ. అందరానిపండ దడవివెన్నెల్లబైట
నుండుఁ జూడఁ బెద్దపండుగాను
బండుపడినఁ జెట్టుఁబట్టంగ లేదయా, వి... 864



మోక్షమనునది మహాఫలము. ఈఫలమును సామాన్యముగా నందుకొన వీలులేదు. ఆఫలము గోయుటకు యత్నింతుమేని మాయయనునరణ్యములోనుండి జ్ఞానమను వెలుఁగులో ముందుగా ఫలమును దర్శింపవలెను. ఫలముతోనున్న యామహావృక్షమును గుర్తుబట్టుకొనుట సామాన్యకార్యము కాదు. అది యశక్యము.

ఆ. అరుణునుదయసంఖ్య యస్తమానపుసంఖ్య
జననమరణసంఖ్య జాతిసంఖ్య
దీని నెఱిఁగి యోగి ధీరుఁడై యుండును, వి...

యోగియగువాఁడు స్థిరసంకల్పముగలవాఁడైయుండవలెను. లేకున్న యోగము సిద్ధింపనేరదు. సూర్యోదయసూర్యాస్తమానముల సంఖ్య మనుష్యజాతిసంఖ్య యగణనీయములు. మనము బాగుగాఁ జూచు నీయంశములనే నిశ్చయించలేనపుడు విశ్వముయొక్క సృష్టిస్థితిలయములు పరమాత్మస్వరూపము గుర్తింపఁగలమా యని నిరుత్సాహపడరాదు. జ్ఞానయోగముచే నాయా సంఖ్యలు గుర్తింపవచ్చును. దానికి నిశ్చలహృదయమె ముఖ్యసాధనము.

క. అష్టాంగయోగసాధన
కష్టంబుల కోర్వలేఁడు కనలేఁడు గదా
చేష్టలు విడువనిజీవికిఁ
గష్టంబగు పుట్టఁ జావ గతి యగు వేమా! 866

సోమరియై సామాన్యుఁడగుజనుఁడు అష్టాంగయోగములయందలి సాధనములకును కష్టములకును సహింపఁజాలక సంసార

సంబంధములగు మోహాదిచేష్టల విడువక యుండును. అట్టివాని కెన్నఁటికిని యోగము సిద్ధింపఁజాలదు. యోగభ్రష్టుఁడు జనన మరణములకులోనై సంసారచక్రమునఁ బరిభ్రమింపక తప్పదు. (అష్టాంగయోగములన నేవో తెలిసికొనుట ఆవశ్యకము. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామముఈనాలుగు పూర్వాంగములు. ప్రత్యాహారము, ధ్యానము, ధారణ,సమాధి ఉత్తరాంగము. ఈయెనిమిదియు అష్టాంగములు)

ఆ. ఆత్మలోనిజ్యోతి యమరుట లింగంబు
తెలివిచేతఁ గాని తేటపడదు
అది యధైర్యపరుని కంటదు మదిలోన. వి...

హృదయములోనున్న ప్రత్యగాత్మజ్యోతియే లింగరూపము. అయ్యది పరిశీలనానిహిత మగుబుద్ధి సాహాయ్య మున్నఁగాని తేటతెల్లము గాదు. అయ్యది ధైర్యము కలవానికే కాని అధైర్యము కలవానికి అంటనేరదు.

ఆ. ఆది నెవరు పుట్టి రది తెలియంగోర
సోది యగును పిదప సుఖము లేదు
ఆదిశక్తి యన్న నది బయలని నమ్ము, వి... 868

ప్రపంచమున కంతకును ఆది యెవ్వరని మూలకారణమును వెదుకఁబోవ సోదెవలె నెప్పటికిని తెగక చిక్కు కలుగును. ఒకవేళ తెగినను దానివలన నిసుమంతయును ప్రయోజనము లేదు. కావున నొక్కమాటతోఁ జెప్పెదను ఆదియందు విశ్వ



మున కతీతమై యొకశక్తికలదు. అదియే యాదిశక్తి. ఆదిశక్తి యనఁగా నది యాకాశరూపమని నమ్మి సేవింపుము.

ఆ. ఇంతివగప దేల? ఏకాంతబుద్ధితో
హరిహరాదులందు నాశ లుడిగి
శాంతబుద్ధి నుండ సమకూడును సుఖంబు, వి.

పరేశునిధ్యానమునకు దారపుత్రాదు లడ్డని యేల చింతిచెదవు. ఏకాంతబుద్ధి గలవాఁడవై శివవిష్ణ్వాదులయం దగు ప్రత్యభిజ్ఞను వదలి కేవలము శాంతబుద్ధితో ఉండుటకు యత్నింపుము. దానిచే మోక్ష సుఖములు సమకూరును.

ఆ. ఇలను జ్ఞాన మనెడి యీఁత నేర్చినవాఁడు
జడధి యనెడితమము జడియక విడి
విలయ మనెడిగట్టు వెలువక దాఁటును, వి...

ఎట్టిసంసారసముద్రమును దాఁటెదమాయని యనేకు లధైర్యము జెందుదురు. కాని నీవు భయపడకుము. జ్ఞాన మనునది యీఁతవంటిది. ఇట్టియీఁత నేర్చినవాఁడుఅజ్ఞానయుక్తమగుసంసారమనుసముద్రమును ఈది ప్రళయమనుగట్టును తప్పక దాటగలఁడు.

తే. ఉచితమిత్రులు సతి సుతు లూరు పేరు
ధనము ధాన్యంబు పాడియు ఘనమతములు
నాశ మొందును ధీరుఁడై నమ్మఁబోకు
నీవె స్థిరుఁడ వెఱుంగవో నిన్ను వేమ! 871

మిత్రులు భార్యబిడ్డలు ఊరు పేరు ధనధాన్యము ఐశ్వర్యాదు

లు సంసారభ్రాంతునకు ఉత్తమమైనవే. కానియివిశాశ్వతపదార్థ
ములు మాత్రముకావు. ఇవియన్నియును నశించునట్టివే గనుక
ధైర్యము వహించి వీనిని నమ్మకనీలోనియాత్మరూపమును గాం
చి తరింపుము.

ఆ. ఉడుముతోఁకఁ బట్టి యురిదిగా లాగిన
నడుగువిడక పూని యూని యుండు
ముఱికి పైనఁ జేర ముద మొందవలెనట్లు, వి.

మానవుఁడు జ్ఞానము నార్జించి మనస్సు నిలుకడగానుండు
టకుఁ బాటుపడవలయును. ఉడుము కోటగోడలపై వేసితోఁక
బట్టి యెంతలాగినను గదలక యటులెయుండును. అటులెమాన
వుఁడుగూడఁ దన దేహమును ముఱికి యంటుకొనినను విషయా
దులవలని కళంకమావరింపనున్నను జలింపకయుండ వలయును.
లేకున్న కార్యసిద్ధికాదు.

ఆ. ఊఁతకఱ్ఱఁ బట్టి యురిదిగాఁ బోవుచుఁ
గోఁతి కొమ్మలందుఁ గుదిరినట్లు
జ్యోతియందుఁ బొంచిసోహంబు గనుమయా, వి.

సాధకుఁడగువాఁడు అస్థిరములగు నీశరీరాదుల తన కార్య
సిద్ధి యగునంతవఱకు వదలిపెట్టక ఊఁతకఱ్ఱను చేఁతబట్టుకొని
నెమ్మదిగాఁ దిరుగుచు కోఁతిచెట్టుకొమ్మలపైన లాఘవముగా
సంచరించినట్టులు సంచరించుచు నంతర్జ్యోతినిఁ గని కైవల్యము
నొందవలయును.



ఆ. ఊఁపఁబోయి కొంత యూఁగించి విడిచిన
నూఁగు గాని గమ్య మొంద లేదు
పట్టుపూన్కి కొలఁది పని సేయులక్ష్యంబు, వి....

మానవుఁడు మనస్సును స్వాధీనము చేసికొనుటకై యత్నించి
కొంతవఱకు నియమించి సాంతముగా ఫలసిద్ధి యగునంతవఱకు
చిక్కఁబట్టక విడిచిన విడిచిపోవునే కాని ఫలము నొందలేఁడు.
చెట్టును గట్టిగాఁ ఊఁపియూఁకి విడతుమేని కొంచెము సేపూఁ
గి పిమ్మట నూఁగమానును. అటులే ప్రతికార్యము గూడఁ జేయు
వాని పూనికను బట్టి ఫలము నొసంగుచుండును.

ఆ. ఎండనీడవన్నె యేక మౌనట్టుగ
నిండుకుండలందు నిలువఁజేసి
దండితత్త్వ మెల్లఁ దలపోసి చూడరా, వి...875

సుఖదుఃఖములను ఎండనీడలను ఏకరూపముగా తిలకించి
నిశ్చలుఁడై దైవరూపమును తలపోయుచు తత్త్వముయొక్క
పూర్ణరూపమును ప్రత్యక్షముఁ జేసికొనవలయును.

ఆ. ఎదుటి తనబలంబు లెంచుకొనేఱక
దీకొని చలమునను దీర్చనేని
యెలుఁగు దివిటిసేవ కేర్పడుచందము, వి...876

తనబలము నెదుటిబలమును చక్కఁగా యోజించుకొని డీ
కొనవలయును. అట్టులుగాక కపటముగా పోరుటకు తలపడె
నేని వ్యర్థమే యగును. బలహీనుఁడగువాఁడు బలశాలితోఁ
బోరాడుటకుఁ దలపడుట యెలుగుబంటు దివిటిసేవకువచ్చు

టతో సమానము. దీపము వెలుగునకే పాఱిపోవు వెలుగు బంటు కాగడాముందు నిలువఁగలదా!

ఆ. ఎఱిఁగిన శివపూజ యెన్నఁడు చెడిపోదు
మొదలఁ బట్టుపట్టి వదలరాదు
మొదలు విడిచి గోడ తుదిఁ బెట్టఁగల్గునా? వి...

తనకు తెలిసినంతవఱకు నెన్నియేండ్లు భక్తిసంపాదించినను జ్ఞానము మాసిపోదు. ఏపనికైనను పట్టుఁబట్టి నెగ్గింపనిదే వదలవేయరాదు: పని మొదలునుండియే చేయ సాధ్యముగాని తుదినుండి కాదు. గోడ మొదలునుండి వదలి తుదినుండి పెట్టగలుగునా? కలుగదు.

ఆ. ఎఱిఁగి మనసుఁ బట్టి యేకాంతమునఁ జేర్చి
పరుగులిడక భావపదమునందుఁ
దరముగానిబయలు దాఁకుట పరమగు, వి...878

యుక్తాయుక్తములను నిజానిజములను గమనించి యేకాంతముగా నుండి త్వరపడక తనకు గలిగెడియనుభవజ్ఞానము నంతయును హృదయమునం దిముడ్చుకొని సర్వశూన్యముగానున్న మహాకాశమును (పరబ్రహ్మస్వరూపమును) యోగాదిసాధనలచేతఁ దాఁకుటయే మోక్షము.

ఆ. ఏకరూప మమర నెందాఁకఁ జూచినఁ
బోక యెఱుకవలనఁ బొందుపడదు
తాఁకి మదిని నిల్పు తత్త్వ మందకు, వి... 879

ప్రపంచము నంతయును ఐక్యభావమునఁ బఱికింపవలయు



నని యెన్నివిధములఁ బ్రయత్నించినను జ్ఞానము లేనిది సాధ్యపడదు. కావున జ్ఞానమును పూర్తిగా సార్జించి ఈశ్వరుని సేవింపుము. అధైర్యమును పొందకుము.

ఆ. కట్టువార లేరి కట్టనివా రేరి
కట్టికట్టనట్టి కర్త లేరి
గట్టిపఱచి లెస్స కనుగల్గి చూడుము, వి...880

మనస్సును అరికట్టలేకపోయితిమి కదా యని విచారము నొందకుము. నిజమును బరికించితిమా ఈప్రపంచములో కట్టుసామర్థ్యము గలవారు గాని కట్టలేనివారు గాని కట్టియునుకట్టలేనివారుగాని లేరు. కావున నారూఢజ్ఞానుఁడవై ధైర్యమువహించి మనస్సునుగట్టిపఱచికొని మెలఁకువతో భగవంతునిదర్శింపుము.

తే. గుణవికారంబులను ద్రొక్కి గుట్టు తెలిసి
ధణధణాన్విత ప్రణవంబు దాఁటఁ గాని
తృణము సర్వం బటంచును దృష్టి గలిగి
గణుతిఁ జేయును మిన్నక ఘనుఁడు వేమ!. 881

సత్త్వరజస్తమో వికారములను మొదలంట ద్రొక్కి వానిగుట్టునంతయును నెఱిఁగి ఓంకారనాదము చక్కగా నెఱిఁగినఁగాని భూలోకసంబంధములగు సమస్తభోగములు తృణసమానములనియు సమస్తము నా బ్రహ్మమే యనుజ్ఞానము గాని యానందముగాని కలుగదు. అయ్యది కలుగునంతకు సంతృప్తుఁడు గాక గొప్పవారు ధీరులై యత్నించుచుందురు.

ఆ. గుఱుతు గూడు చేసి గుణము వత్తిగఁ జేసి
సరవిఁ గర్మసమితిఁ జమురు నేసి
మూల నొక్క జ్యోతి ముట్టించి చూడరా? వి.

బ్రహ్మమును కాంచలేను గాఁబోలునని యధైర్యము నొందకుము. అందుల కొకసాధనమును తెల్పెదను. అట్లు చేయుము. బ్రహ్మము మాయ యను చీకటికొనలోఁ నిమిడియున్న యది. దానిని గనుటకు దీపము కావలయును గాన లక్ష్యమును గూడుగా చేసి గుణమును వత్తిగా చేసి కర్మను చమురుగా చేసి జ్యోతిని వెల్గించి కనుము.

ఆ. చీఁకటింటఁ జేరి చింతింపఁ బనిలేదు
రాకపోక లెఱిఁగి రంగుమీఱ
నేకతేజమునను నిలఁ ద్రొక్కి చూడరా, వి...

అజ్ఞానాంధకారమునఁ బడి యధైర్యమునఁ జింతింపవలసినఁ బని లేదు. మఱి యుపాయ మేమియనెదవా? జ్ఞానము రాకపోకలను గుర్తించి తద్ద్వారా తేజోరూపునిఁ గనివెలయుము.

ఆ. చుట్టుపరిజనంబు సుఖలీల చెలువంబు
నడుమ నాయకతయు నర్తనంబు
బ్రహ్మపదము మీఱు బ్రదుకుఁడీ జనులార, వి.

బ్రహ్మానందము రాజభోగముకంటె మిన్నయైనది. మోక్షాసక్తులందఱు పరిజనులై సేవించుచుందురు. పరలోకసౌఖ్యమే సంతోషముగనుండును. నీవు నాయకుఁడవై పరమాత్మను లీలావిలాసములఁ దర్శించి తాదాత్మ్యమునొంది నృత్యముగావింపఁ



గలుగుదువు. కావున మానవుఁడా బ్రహ్మపదమునొంది సుఖముగా జీవితము గడుపుకొనుము.

ఆ. ఛేద్యమైనదానిఁ జేపట్టినాఁ డని
మూలవస్తు వెట్టు కేలఁ బట్టు
దాని నూనఁ గలుగు దార్ఢ్యంబు లేకున్న, వి...

మాయ ఛేదింపఁదగినది. మాయావృతుఁడు మోక్షము సాధింపలేఁడు. ఛేదింపఁదగిన మాయకులోఁబడినవాఁడు పరబ్రహ్మమును దర్శింపలేఁడు. మాయను సమస్తవిధముల నిర్జింపనేర్చినవాఁడె మోక్షమునకుఁ దగిన వాఁడగుచున్నాఁడు.

ఆ. జాతివేఱు లేక జన్మక్రమంబున
నెమ్మదిని నభవుని నిల్పె నేని
నఖిలజనులలోన నతఁడు ఘనుండయా, వి...

జాతిగుణక్రియాదిభేదములను నశింపఁజేసి కేవలమును జన్మకాలము మొదలుకొని ఈశ్వరుని హృదయపీఠిని ధ్యానింపవలయును. ఇట్టివాఁడే సమస్తజనులలోనికి ఘనుఁ డనఁదగును.

ఆ. తనువనఁదగునింటఁ దగుశత్రుమిత్రులఁ
దెలియలేని వాని తెలివదేల?
తెలిసి చక్కఁబఱప దివ్యామృత మ్మదే, వి...

శరీరము ఒకయింటివంటిది. ఈయింటిలో మిత్రులు శత్రువులు గలరు. ఈశత్రువులను మిత్రులను గుర్తింపలేకున్న తఱువాత వాని తెలివి తేట లెందుకు? శత్రువులను వధించి వారివలన నట్టి యపాయము లేకుండఁ జేసికొనుచు మిత్రుల

వలన సుపకృతి నొందుచు నున్నయెడల సామానవునకు అజరామరరూపమగు దివ్యామృతము చేకూరును.

ఆ. తాము వెలయునూర తామంబు వాటిల్ల
నట్టియూరు విడిచి యటులఁ బోరె?
కాలఁకు లెండినంతఁ గొక్కెర లుండునా! వి. 888

ఉన్నయూరఁ గఱవు వచ్చిన దానిని వదలి మఱియొకచోటికిఁ బోవుచుందురు. అట్లు అయిననే బుద్ధిమత్త్వమునకు లక్షణము అగును. ప్రపంచధర్మము నిట్టిదే. మడుగు లెండిన నింకొకచోటికి కొంగలు పోవుట లేదా!

ఆ. తారకంబుఁ జూచుదారి వేలుగఁ గద్దు
సమముగాను జూడఁ జక్కఁబడును
వెఱ్ఱిగాను జూడ వెలుఁ గెల్లఁ బాలురా, వి...

తారక యోగముచే పరబ్రహ్మమును దర్శించురీతి వేఱువిధమైనది. సమదృష్టితోఁ జూచినగాని బ్రహ్మసాక్షాత్కారము కలుగఁజాలదు. చంచల దృష్టితోఁ దిలకింతుమేని చూపుగుఱికి ముందుగానవచ్చు వెలుఁగే యదృశ్యమగును. వెలుఁ గదృశ్యమయ్యెనేని పరబ్రహ్మసందర్శన మెన్నఁటికి సాధ్యము కానేరదు.

ఆ. దేవుఁ డనఁగ వేఱుదేశమం దున్నాఁడె?
దేవుఁ డనఁగఁ దనదుదేహమందు
వాహనంబు నెక్కి వడిఁ గదలును జూడుమీ, వి...



దేవుఁడనఁగా; వేఱేదేశములో లేడు. దేవుఁడు నీదేహమును వాహనముగాఁ జేసికొని సంచరించుచున్నాఁడు. నిన్నధిష్ఠించియున్న దేవుని నీవుగనుగొనలేక భ్రాంతినొందుచున్నాఁడవు. ఇది చిత్రము.

ఆ. ధైర్యయుతున కితరధన మైన నదు రేమి?
దాన మిచ్చినపుడె తనకుఁ దక్కె
నెలమి మించుపనికి నెవ రేమి సేతురు, వి...

ధైర్యము గలవానికి తనది యితరులది యనుభయము లేనే లేదు. ధనము తనకుఁ జిక్కినంతనె తాను దానము చేయుచున్నాఁడు. అందుచేఁదత్ఫలమంతయుఁ దనకే దక్కుచున్నది. పని ముగిసిన పిమ్మట నెవ్వారును నేమియుఁ జేయఁజాలరు.

ఆ. నియమితాసనమున నిలచినచిత్తంబు
తామసంపునిద్రఁ దలఁగఁ ద్రోయు
నిద్ర దొలఁగినంత నిర్భీతి యుదయించు, వి...

నియమమను పీఠముపై హృదయమును నిల్పుదువేని తామసమను నిద్రని న్నావరింపఁజాలదు. తమోగుణ మెపు డావరింపదో యపుడు హృదయమునకు భీతి తొలంగి యీశ్వరసాక్షాత్కారము కలిగి తీఱును.

ఆ. పట్టుఁ బట్టినతఱిఁ బరవాదము లవేల?
నెట్టుకొన్న తలఁపె నిలుపవలయు?
నట్టిపలుకుల విడ నవనిలో నగుదురు, వి... 893

ఈశ్వర సాక్షాత్కారమునొందవలయు నని పట్టుఁ బట్టిన

వాదోపవాదములతో నేమి ప్రయోజనము గలదు? కావున నితరులు విని నవ్వఁదగిన వ్యర్థప్రలాపములతో కాలమును బుచ్చక ప్రయత్నించి హృదయము నేకాగ్రముగ నిలుపుట కభ్యాసపడవలయును. నేను హృదయమును నిలుకడగా నొనర్పఁగలనని ప్రగల్భములాడి నలుగురిలో నవ్వులపాలుగాక జ్ఞానియై మెలఁగుట యుక్తము.

ఆ. పంద నధిపుఁ జేసి బవరంబునకుఁ బంపఁ
బాఱిపోవుఁ గార్యభంగ మగును
బాఱునట్టిబంటు పనికిరాఁ డెందును, వి ...894

పనికిమాలినవానిని వీరునిజేసి యుద్ధమునకు పంపెద రేని యాతఁడు పిఱికియై పాఱిపోవును. అందువలనఁ గార్యము చెడును. ఇట్టిబంటు ఎచ్చట నైనను పనికిరాఁడు. కావున పిఱికితనము నొందక బంటు ధైర్యమవలంబింపవలెను.

ఆ. పొంకములకు మనసుఁ బోనీక సర్వేశు
వంక నిల్పువాఁడు వంశపరుఁడు
వంక నిల్పకున్న వచ్చునా పదవులు? వి.... 895

విషయములపైకి మనస్సును బోనీయక లాగిపట్టి ఈశ్వరుని వైపునకు మరల్చి యుంచువాఁ డుత్తముఁ డనఁదగును. మనస్సు నిలుపలేనివానికి మోక్షపదవి చేకూరఁజాలదు. కావున ధైర్యము వహించి మనోనిగ్రహముఁ జేయవలయును.

ఆ. ప్రజ లెఱుంగ బ్రదుకు బట్టభద్రుఁడు గాఁడు
[illegible] గిరీటముండఁ బ్రభుఁడు కాఁడు



నోగుఁ దెలిసి పలుకు యోగీశ్వరుఁడుగాఁడు,వి.

ధైర్యము గలవాతికి సమస్తైశ్వర్యములు గల వనవచ్చును. ధైర్యవంతుఁడు పట్టాభిషిక్తుఁడు కాకపోయినను ప్రజలందఱకు విదితుఁడై యుండును. కిరీటధారియగు రాజుగాకపోయినను ప్రజానాయకుఁడై రాజనిపించుకొనును. అతఁడు అగతానాగతము లెఱిఁగిన యోగికాకపోయినను రాఁబోవుచెడుగు నూహింపగలుగును. అట్టివానిని బుద్ధిశాలి ముఖ్యముగా గుఱితింపవలయును.

ఆ. బంటుతనము గాదు బలముతోఁ గట్టఁగా
వెంట నుండి మనసు వెతలఁ బఱచు
నింట గెల్చి రచ్చ నిల గెల్వవలెనయా, వి...

మనస్సును జయించి బంధించుట మాటలని యనుకొనకుము. అయ్యది మిక్కిలియును దుస్సాధ్య మగుకార్యము. ఏలయనఁగా మనస్సు వెంటనుండి నట్లుండియే చిక్కులఁ బెట్టును. కావున ముందుగా నింట గెల్చి పిదప రచ్చఁ గెల్చినట్లు మనస్సును నిగ్రహింపవలయును.

ఆ. బోనులోని యెలుక పోఁజూచునట్టుల
జ్ఞానమొంద యెఱుక చనును మీఁదఁ
గాన మేను మఱచి ఘనతత్త్వ మొందరా,వి....898

బోనులోఁజిక్కిన యెలుక పాఱిపోఁజూచినట్టులే జ్ఞానమును బొంద మనస్సు పరిపరివిధములఁ బరుగెత్తుచుండును. జ్ఞానమున స్వతంత్రము నొసంగినీ దేహము నీవు మఱచితివేని పరబ్రహ్మము సాక్షాత్కార మగును.

ఆ. మంటిమింటిసంధి నున్నవా రెందఱో
యెన్నగాను దరమె యేరికైన?
నున్నవారు చావ నున్నవారే సుమీ, వి...899

భూమ్యాకాశములకు మధ్యభాగమందుఁ గలజీవరాసులను లెక్కించుట యెంతవానికి సాధ్యము గాదు. ఈజీవరాసులన్నియుం నేనాఁటికైనఁ జావనున్నవియే గావున బ్రతుకుపై నాసవదలి ధర్మాభిముఖుఁడవు కమ్ము.

ఆ. మట్టు వెట్టి కోర్కె మది నిల్పి చూచిన
గుట్టు మిగుల దానిగుణము దొరకు
నట్టు నిట్టు చెదర నమరదు తత్త్వంబు, వి...

మనస్సును కట్టిపెట్టి కోర్కెల నడంచి మనస్సు నిలిపి పరికించిన బ్రహ్మమనఁగా నేమో దానిస్వరూప మెట్టిదో చక్కఁగా బోధపడును. అట్లు బోధపడునంతవఱకును మనస్సును నిలుపఁజాలనివాని తత్త్వము చేకూరఁజాలదు.

ఆ. మత్సరంబు మదము మమకార మనియెడి
వ్యసనములను దగిలి మసలఁ బోక
పరుల కుపకరించి పరముఁడ వగు పొమ్ము, వి...

అజ్ఞానివై పరమునకు శత్రుభూతములగు మదమాత్సర్యాది వ్యసనములచేఁ దగుల్కొని బాధనొందక సర్వసమత్వమును ఐక్యమును అవలంబించి పరోపకార బుద్ధితో సంచరించుచున్నచో మానవుఁడు పరబ్రహ్మస్వరూపుఁడై లోకాభినంద్యుఁ డగును.



ఆ. మత్తచిత్తులు కలమర్మంబుఁ దెలియక
చిత్తచలన మంది చెడిరి భువిని
చిత్త మచట లేక చిక్కునా పరమాత్మ? వి...

మదించినచిత్తము గలవారు మర్మము తెలియఁజాలక చిత్తసంచలనము నొంది చెడిపోయెదరు. అట్టివారికి ఫలసిద్ధిలేదు. ఏలయనఁగా చిత్త మొకచో లేనిది పరమాత్మ చిక్కఁడు కదా!

ఆ. మదిని గానవచ్చు మఱి బ్రహ్మమూర్తిని
మదిని గన్న యతఁడె మహితుఁ డగును
వెదకి తనువులోన వేడ్కతో నరసిన
నతఁడె యోగివరుఁ డటంద్రు వేమ, వి... 903

బ్రహ్మమును దర్శించుట కెక్కడికో పోవ నక్కఱలేదు. ఆ బ్రహ్మమును మనస్సులోనే ధ్యానించి కనవచ్చును. అట్లు కనుగొనె నేని యాతఁ డుత్తముఁ డగును. కావున ధీరుఁడవై వెదకి నీశరీరములోఁగల యీశ్వరు నెఱుఁగుము.

ఆ. మననవృత్తిఁ బూని మౌనసమాధిలోఁ
దనదుజ్ఞప్తి మఱచి తాల్మితోడఁ
బెంపుఁ జెందువాఁడె ప్రియభక్తుఁ డగునయ్యా, వి.

మననమును వహించి సమాధినిష్ఠుఁడవై ప్రాపంచికజ్ఞానము లేక యుండునట్టులు తన్మయత్వమును వహించి ధైర్యమునొంది తన్నుఁదాను మఱచి మనస్సు నిలుపువాఁడే నిజమగు భక్తుఁడు. అట్టివానికే మోక్షము లభ్యమగును.

ఆ. మనసునంటి నిలిచి మనసున సుఖియింపఁ
గడకు మోక్షపదవిఁ గనక పోఁడు
చెట్టుఁ బెట్ట ఫలము చేకూరకుండునా, వి... 905

ఈశ్వరుని మనసులోనే పాదుకొల్పి నిర్వికారమగు నానందము నొందుచు సుఖించుచుండెనేని ముక్తి నొందకపోఁడు. ఎట్టు లనఁగా: చెట్టు మొలవవేసిన నెప్పటికైనను ఫలింపకయుండదు గదా! అట్టులే.

ఆ. మనసులోన నున్న మర్మ మంత నెఱింగి
స్థిరముఁ జేసి యాత్మ తేటపఱచి
ఘటము నిల్పవలయు ఘనత లింకేటికి?, వి... 906

మర్మముల నన్నిటి దెలిసికొని మనస్సును స్థిరముగా నిలిపికొని యాత్మను పరిశుద్ధతతో కనునట్టివానికి ఇతరవిధములగు గుణగౌరవములతో నిసుమంతయును ప్రయోజనము లేదు.

ఆ. మర్మ మంతఁ గనక మన నైక్య మందక
పరమగూఢ మింత బయలుపడదు
పడినమాత్ర మెన్న బయలుపడినయంతె, వి...

సారమును పూర్తిగా తెలిసికొనకుండునంతవఱకును మనసైక్యమునొందనంతవఱకును ముక్తి రహస్యము బయలుపడదు. ఒకవేళ నేమాత్రము బయలపడినను బ్రహ్మపదార్థము మఱుఁగుగనే యుండును.

ఆ. మాయ పోవువిధము మనుజుండు తలఁచిన
మంచిమార్గ మబ్బు మానవులకు



మాయ దాఁటలేని మనుజుండు వ్యర్థుండు, వి.

మాయ యెట్లు నివర్తించునది యనువిషయము నెఱింగినా మనుజుఁడు ఇఁక నటుపైని సన్మార్గము నొందఁగలఁడు. అట్లైననే ముక్తుఁ డగును. మాయను నిగ్రహింపలేనివాఁడు వ్యర్థుఁడే యగును.

తే. మాయ మమకారములఁ ద్రుంచి మరగినంత
కర్మకడగండ్లఁ జెప్పను గాలుఁ డెఱుఁగు
దీనిఁ గని మెలఁగెడివాఁడె ధీరు డరయ
మాయఁ గనకున్న గతు లెల్ల మాయు వేమ. 909

మాయామమకారములను నశింపఁ జేసినపిమ్మట కర్మములు తమంతట తామే నశించును. అటుపైని జీవన్ముక్తుఁడగును. ఈ విషయము నెఱుఁగ మాయకులోఁబడినచో నట్టివానికి సుగతులు కలుగ నేరవు.

క. మాయలసంసారముకై
మాయలనే తిరుగుచుండు మనుజుఁడు లోనై
మాయలఁ దెలిసినయంతట
మాయలనే ముక్తి గలుగు మహిలో వేమా!.

మనుజుఁడు అజ్ఞానియై ఈమాయారూపము లగు సంసారాదులఁబడి కొట్టుకొనును; ఇది మాయయని యెఱిగెనేని యట్టివానికి మాయయందే ముక్తి కలుగును.

ఆ. మాయభయము లేని మనుజుఁడే మనుజుఁడు
మాయలో మునుంగ మనుజుఁ డగునె?

కాయ మడఁగునపుడె మాయయు నడఁగును, వి.

మనుజుఁ డనఁగా మాయవలనిభయము లేనివాఁడే యగును గాని కలవాఁడగునా? కాఁడు. శరీరముతోఁటి మాయయును తొలఁగును. కావున ధైర్యము వహింపుము.

ఆ. మింట నంటియున్న మినుకుఁ జూడఁగఁ బూని
యంటలేక కొంత యవిధిపడిరి
కంటి నంటుజ్యోతిఁ గానంగలేరయా, వి... 912

ఆకాశప్రదేశమునఁ గలజ్యోతిని వీక్షింపఁ బ్రయత్నించి కాంచలేక యనేకులు పెక్కుకష్టముల పాలయిరి. ఇట్టివా రజ్ఞులై కంటికి కనఁబడు వెల్గును సయితము కనఁజాలరు.

క. ముక్కోణశిఖరమున గుఱి
దక్కఁగఁ బరిపూర్తిఁ జెంది ధైర్యము విడకే
సొక్కియు సోలకయుండిన
నిక్కపుఁగైవల్య మది యె నిజముగ వేమా!.913

నాసాగ్రమున దృష్టిని నిలిపి ధైర్యమును వహించి పరిపూర్ణమగు ధైర్యముతో పరమాత్మతత్త్వమును తిలకించుచు మాయకు వశుఁడుగాక యుండుటయే కైవల్యము నాఁబడును.

ఆ. ముదిత వలపుఁ జూడ మోహింత్రు వారల
చెంతఁ జేరఁగానె చెడును మనసు
వింత భ్రమగుణంబు కాంతఁ జూచినఁ జాలు, వి.

స్త్రీలు ప్రకటించువలపునకు లొంగిపోయి పెక్కండ్రు పురుషులు మోహమునొంది యాజపరాండ్రు చెంతఁజేరఁగనే చంచలు రగుచున్నారు. ఈచంచలగుణము స్త్రీసందర్శనముననే గలుగుచున్నది. కాన స్త్రీసహవాస మపాయకరము.



ఆ. మరగి తిరిగి నరుఁడు మరులుకొన్నను గాక
యందువలన నేమి యాశ గలుగు?
నంతరాత్మ నిలుపు నతఁడె పో త్రా నగు, వి...915

మనుజుఁడు విషయాసక్తుఁడై మరులుకొని చెలుల వెంటఁ పవిత్ర తిరుగుచుండునేని వానికిఁ బరలోకము లభించుననుటకల్ల. తనమనస్సును నిలుపలేనివాఁడు తనలోని యీశ్వరుని దర్శింపఁ గలఁడా? కావున అంతరాత్మ నిలుపువాఁడె ముక్తుఁ డగును.

ఆ. మూఁడుగుణములందు ముఖ్యగుణంబును
దెలియలేనివాఁడు వెలయు నెట్లు?
భ్రమలఁ బడినవాఁడు బలువెఱ్ఱియగు ధర, వి.

సత్త్వరజస్తమోగుణములను మూఁడిటియందును ముఖ్యమగు సత్త్వగుణము నెఱుఁగనివాఁ డెట్లు ముక్తుఁడు కాఁ గలఁడు? అటు లెఱుఁగకయుండిన వెఱ్ఱి యగును. కావున సత్త్వగుణమును దెలిసికొనుము.

ఆ మూఁడుగుణము లంటి మూలంబు గనవలె
నీలుగాను ద్రిపుటి వెలయ నొక్కి
త్రాడుద్రొక్కఁ బాముఁదలఁచినచందమౌ, వి...

సత్త్వరజస్తమోగుణములకు మూలమును గనిపెట్టి దృక్కు దృశ్యము ద్రష్టయను త్రిపుటిని రహిత పఱుచుకొని బ్రహ్మతే

జము నారాధింపవలయును. అట్లు ఆరాధించినచో త్రాడు ద్రొక్కినపామువలె నా బ్రహ్మతేజము బయలుపడి తీఱును.

క. మూఢాత్ములైనమనుజులు
గూఢంబును దెలియ లేక గుఱి గనలేరా?
గాఢాంధకారదూరుని
రూఢిగఁ జేరంగఁ గలుగు రూఢము వేమా! 918

మూర్ఖులగువారు రహస్యముగా నున్న పరేశునిరూపమును గుర్తింపలేరు. నిర్వికల్పరూపుఁడును విమలతేజస్కుఁడు నగు నాతని గురుతించుటయే ముక్తి యనఁబడును.

ఆ. మూఁడులోకములను మొనసి యొక్కటిఁ జేసి
యారుతావరముల నంటఁ గూర్చి
స్థిరముగానె యుండుశివమూర్తిగురుఁడయా, వి.

మూఁడులోకములను ఏకాకారతఁ జేసి మంత్రాధ్వము. పదాధ్వము. వర్ణాధ్వము తత్త్వాధ్వము. భువనాధ్వము. కళాధ్వమన నధ్వముల వివరము గ్రహించి చిత్తము చలింపనీయని వాఁడె శివయోగి. ఆతఁడె లోకగురుఁడు.

ఆ. మూఁడువేళలందు ముదముతో శివు నాత్మఁ
బూజసేయువాఁడు పుణ్యమూర్తి
పూజలేక మోక్షభోగంబు దొరకునా? వి...

త్రికాలములయందును నత్యధికమగు సంతసముతో నీశ్వరునిరూపును హృదయమందు పూజసేయువాఁడే పుణ్యమూర్తి యగును. ఎట్టివారికైనను బూజ లేక మోక్షభోగము దొరకదు.



ఆ. మొదట నతఁడు జ్ఞానముద్రాంకితుఁడు గాక
యావిధమును దెలియ నజ్ఞుఁ డగును
నడుమ జ్ఞాన మొదవ నగుబాటు గాదయా?, వి.

మొట్టమొదటనే మనుజుఁడు జ్ఞానియై యుండవలయును. అంతియగాని యజ్ఞానియై చిరకాలముగడిపి నడుమజ్ఞాన మార్జింపవలయునని యత్నించినచో విషయాదులలోలగ్నమైనమనస్సు కుదుటఁ బడఁజాలదు. కాన నవ్వుబాటు కావలసివచ్చును.

తే. మౌని నిజకేళిలోపల మనసుఁ ద్రొక్కి-
పూనినంతటఁ బరిపూర్తిఁపొందుఁ గలుగు
వానిభక్తికి సాటిది వసుధఁ గలదె?
డాంబికము లైన నడుమ నడంగు వేమ. వి. 922

మునియగువాఁడు పరబ్రహ్మసందర్శనమను సంతోషములో మునిఁగియున్నచో మోక్షము కరగతమగును. అట్టివాఁడె నిజమగు భక్తుఁడని చెప్పఁదగినవాఁడు. కొందఱు డాంబికముగ భక్తిప్రకటింతురుగాని యాయార్భాటములన్నియునడుమనశించునవే—

ఆ. యాత్ర పోయినాతఁ డెన్నాళ్లు దిరిగియుఁ
బాదమైన ముక్తిపదవిఁ గనఁడు
మనసు నిల్పునతఁడు మహనీయమూర్తిరా, వి.

తీర్థయాత్రలకని దేశదేశముల నెన్నిరోజులు తిరిగినను కాలు

త్రిప్పటయే గాని కాలువాసియైనను ముక్తిని గనఁజాలఁడు. మనస్సు నిల్పువాఁడే మహనీయుఁడగును.

తే. యుక్తమైనది బయ లని యూహఁ జేసి
రక్తితన్మయ మనియెడి ముక్తి నెఱిఁగి
భుక్తిశక్తులు మఱచుట పూర్ణపదవి
సక్తి పరమాత్మయం దుంచ జగతి వేమ 924

విశాలమగు మహాకాశమునందు దృష్టినిలిపి సంతోషముతోఁ దన్మయమునొందుటయే ముక్తిసాధనము. ముక్తిసాధనములం దేమఱక మానసికశక్తులు జిహ్వాచాపల్యము మఱచి పరమాత్మను సందర్శింపఁగలుగుటయే కైవల్యప్రాప్తికి సాధనము. భక్తుఁడిటుల వర్తించుట యుక్తము.

ఆ. రక్తిలేనిపనులు రమ్యమై యుండునా
రక్తి గలిగెనేని రాజు మెచ్చు
రాజురక్తిసందు రమణులు మెత్తురు, వి... 925

ఏపని చేసినను అనురాగముతో చేయుచుండవలయును. అనురాగములేనిపను లేవియైనను రమ్యముముగ నుండనేరవు. అనురాగముగలిగి చేసినపనులకు రాజును రమణులును మెచ్చుకొనుచుందురు.

ఆ. రాముఁ డొకఁడు పుట్టి రవికులం బీడేర్చెఁ
గురుపతియును బుట్టి కులముఁ జెఱిచె
నిల నధర్మధర్మములరీతు లిట్టివి, వి... 926



ధర్మాధర్మముల నిజస్థితులు మిక్కిలియును సూక్ష్మము లయినని. ఎట్లందురా ? రాముఁడును దుర్యోధనుఁడును గొప్ప కులమునఁ బుట్టినవారలేయైనను ధర్మాసక్తిచే రాముఁడు కుల ముద్ధరించెను. అధర్మానురక్తిచేతఁ గురుపతి యగుదుర్యోధనుఁడు చెఱిచెను.

ఆ. ఱాయి ఱాయిఁ గూర్చ రాయఁగా రాయఁగా
నున్ననైనయట్టు లన్నిపనులు
పాటుచేసినంతఁ బరిపాటి యగునయా, వి...927

నిర్జీవములగు పదార్థములుసయితము ఒకటిగాఁ జేరిన ఘనకార్యము లనేకములు కలుగును. ఱాయిని ఱాతితో జతచేసి రాయుదుమేనికొంతసేపటికాఱాళ్లు నును పెక్కును. కావున పరిశ్రమచేసినయెడలను ఐకమత్యము గలిగియుండుటచేతను ఎట్టి కార్యములును సఫలము లగును.

ఆ. రూపు నడకఁ జూడఁ దాపంబు పుట్టిన
భ్రాంతు లంకురించు నంతలోనె
బుద్ధి మఱలకున్న రద్దికి నెక్కుఁగా, వి... 928

మోహజనకములగుపదార్థము లన్నిటిలో యువతులధికలు. వారిరూపమును నడకను చూచిన మనస్సులో ఆవేగమంకురించి భ్రాంతిగలిగి బుద్ధి యవ్విషయములపై లగ్నమగును. పిమ్మట నెట్లయినను ధైర్యముఁబూని దానిని మఱల్చుకొనిన మంచిది. అట్లుగానిచో నప్రతిష్ఠకలుగును.

తే. లగ్నచిత్తము లోనైన లఘువుఁ దెలిసి
విలయమగు నిచ్చలోపలివిధము నూని
యున్నవాఁ డగు ముక్తుఁ డీయుర్విలోనఁ
బాటుపడ లేమి నెట్లబ్బు ఫలము వేమ? 929

మనస్సును యోగమునందు గూర్చి, చాంచల్యము నడంచి లోపలవిధముల నెఱింగి తన్మయుఁడైయుండెడివాఁ డొక్కరుఁడే యీప్రపంచమునందు ముక్తుఁడనఁబడును. కావున పాటుపడి ముక్తుఁడవు అగుటకై యత్నింపుము. పాటుపడనిది ఫలమురాదు గదా!

ఆ. లింగ మంగమునను లీలఁ దెలియువెన్క
మనసు లింగమందు మఱలుకొనును
మనసు నిల్ప నందె మఱిలింగ ముండురా, వి...

లింగాంగములస్థితిగతులును సంబంధాదులును తెలిసినపిదప మనస్సు లింగమునందు మఱలుకొనును. మనస్సునునిల్పినచో నచ్చటనే పరమేశ్వరునిరూపుగూడ ప్రత్యక్షగోచరము కాఁగలదు.

ఆ. వార్తలోని వార్త వైభవ మరయక
మిట్టిపడుదు రిలను మిడుతరీతి
గట్టిచేసి నిలుపు ఘనుఁడెపో శివయోగి, వి...

ఉపదేశములోనియాథార్థ్యము నెఱుఁగలేక జనులు మూర్ఖులై తమ్ము తామె నుతించికొనుచు మిట్టిపడుచుందురు. అట్లగుట



ఫలసిద్ధికి భంగకరము. అట్లుగాక మనస్సు గట్టిగా నిలిపి శివుని రూపును తెలిసికొనువాఁడే ముక్తుఁడగును.

ఆ. వితరణంపుఁజూడ్కి విశ్వరూపముఁ జూచి
మతిని గడకుఁ ద్రొక్కి మౌన మూని
సతత మెన్నువాఁడు సరసుఁ డీయిలలోన. వి. 932

ధారాళ మగుదృష్టితో ప్రపంచమును పరీక్షించి సారాసారముల గమనించి మనస్సును లోంగద్రొక్కి మౌనమును వహించి ఎల్లప్పుడును పరమేశ్వరుని నిజరూపునుధ్యానించువాఁడు సరసుఁడని యనఁదగును.

క. విదితం బగు ఘట మవిసిన
నుదితం బగునాకసంబు నుప్పర మొకటౌ
నదెవిధము విదేహం బను
సదమలకైవల్యసరణిసంపద వేమా!. 933

ఘటము (కుండ) లో నాకాశము ప్రతిబింబించియుండి అయ్యది పగిలినపిదప నాకసములో కలసిపోవునట్టులనే బ్రహ్మము దేహముచే నావృతమై యుండి ఆదేహము నశించినవెనుక తన పూర్వవిదేహమను కైవల్యమును చెందును. అయ్యదియే ముక్తి.

క. వినుమా నిటలముఁ జేరఁగ
ఘనమగు నాకశక్తి కలదు కడుఁ జిత్రముగాఁ
గనుఁగొన దానికి నవ్వలఁ
గనకం బనుజ్యోతి గలదు కనుమా వేమా! 934

మాయాదూరుఁడై సమాధియందు వికల్పము లేక యున్నచో నట్టివానికిఆపోజ్యోతి యను పేరుగల హిరణ్మయమండలము నొసలియందుఁ గానచ్చును; ఆహిరణ్మయ మండలమును స్థిర దృష్టితో సందర్శించుచో సూర్యుని చంద్రుని కరఁగించిన బంగారమునుమించిన యొక గొప్పజ్యోతి గానవచ్చును. దానిని జ్ఞాననేత్రముచేఁదప్ప వీక్షింప వీలుకలుగఁజాలదు.

ఆ. వీరశైవధర్మవిధము లెఱింగియు
బ్రహ్మవిద్యమీఁదఁ బరగె నేని
జెలఁగి పులికి బంటు సింగపుఁబిల్లయౌ, వి. 935

వీరశైవధర్మవిధముల నెఱిఁగినపిమ్మట బ్రహ్మవిద్యపై నాసక్తి గలిగెనేని సులువుగా సిద్ధి నొంద వీలుచిక్కును. వీరశైవము పులివంటిది. బ్రహ్మవిద్య సింగపుఁ బిల్లవంటిది. వీరశైవ మతాభిమాని బ్రహ్మవిద్య నభ్యసింపనెంచుట పులికి సింగపుఁగొదమను బంటుగాఁ జేయుటయే.

ఆ. వేఁడుచున్నయట్టె వినయంబుఁ జూపుచు
గోఁత దింపు సుమ్ము కొండెగాఁడు
చేర్పరాదు వానిఁ జెలుచును దుది నెట్లొ, వి.

కొండెగాని ఎప్పటికిని దగ్గఱఁ జేర్పకుము. అతఁడుమిక్కిలి వినయమును జూపుచు దగ్గఱఁ జేర్చినతరువాత మోసముచేసి ఎట్టులో గోయిలో దింపఁజూచును. తుదకు వాఁడు చెఱచి తీఱును.



తే. వేయుఁగ్రతువులు పనిలేదు వేడ్కమీఱఁ
జేయుక్రియలెల్ల గురుభక్తి చిత్తమందుఁ
బాయకుండుట ముక్తికి బాట యగును
న్యాయమగుమార్గ మిద్దియౌ నవని వేమ! 937

వేలకొలఁది యజ్ఞాదిక్రతువుల నొనర్చుచుండినను అవి గురుభక్తితోఁ దుల్యములు కాఁజాలవు. గురుభక్తి చిత్తములో బాయక యుండుటయే ముక్తిదొరకుటకు మార్గము. కావున ముక్తికిదియె న్యాయవిధము.

ఆ. వేముచెక్కఁ దిన్న విషరోగములు పాయు
దేహకాంతి కలుగు దృఢము కలుగుఁ
దినఁగఁదినఁగ నదియె తీయగా నుండును, వి...

ఎంత యనిష్టమగుపదార్థమైనను సర్వదా సేవించుచున్న హితము కలుగును. అట్లే దుస్సాధ్యమగు బ్రహ్మోపాసనమును సుసాధ్య మగును. ఉదాహరణమునకై—చూడుఁడు. వేము మిక్కిలి చేఁదుపదార్థము.అయినను సంతతము భక్షించిన విషములు పోవును. దేహమునకు కాంతికలుగును. తినఁగాతినఁగా తీయఁగాఁ గూడ నుండును.

ఆ. వ్యాధివచ్చినపుడు వైద్యునిచే మందు
దీసి తినక కాని తీఱ దెందు
మందువంటి మనసు మనుజుండు కనవలె, వి...

రోగము వచ్చినప్పుడు అయ్యది యుపశమించుటకై వైద్యుని వలన మందు పుచ్చుకొనక తప్పదు. అట్టులే సంసారమును

రోగము కలిగినప్పుడును మనస్సు కుదుటపడుటకై మనుజుండు ప్రయత్నింపవలయును.

ఆ. శ్వాస లాగి విడిచి సాధింప నేర్చిన
మోసపోక ముక్తి మూటఁ గట్టు
దోసకారిగుణము గానిఁ జెందకపోదు, వి...940

రేచకపూరకకుంభకాదులచే శ్వాసమును పట్టనేరిచి ధ్యానధారణాదులచే నిరంతరమును బ్రహ్మము నుపాసించుచు మాయకు లొంగిపోక జాగ్రత్తగా నుండవలయును. దోసకారిగుణమువలన గానికలుగును.

ఆ. షోడశాక్షరముల శోధించి మది నెంచి
గూఢభావ మూని కుదియఁ బట్టి
వేడు కలర ముక్తి విన్నందిచూడరా, వి...941

షోడశాక్షరములను చక్కఁగాఁ బరికించి, మనస్సులో ధ్యానించి, తత్త్వమును వదలక ఇంద్రియములను నియమించి, లోఁగాని ముక్తినొందుటకు యత్నింపవలయును.

ఆ. సకలజీవములను సమముగా నుండెడి
యతనిక్రమముఁ దెలియునతఁడె యోగి
యతఁడ వీవెయనుట నన్యుండు గాఁడయా, వి.

సమస్తజీవములను సమానభావముతో చూచుచుండెడివాని రీతిని పరికించిన నాతఁడే యుత్తముఁ డగుయోగి యనఁ దగును. ఆయోగిరూపమే బ్రహ్మస్వరూపమనియు ఆపరబ్రహ్మస్వరూపమవు నీవేయనియు నీలో నెఱుంగుము.



ఆ. సకలవిద్యలఁ గని సంతోషపడవచ్చుఁ
జేయి సాఁచి కాసు నీయలేఁడు
చెలఁగి యొరుల కైనఁ జెప్పవచ్చును గాని
తాను జేయలేఁడు ధరను వేమ! 943

ఇతరులయొద్దఁ గలవిద్యలనన్నిఁటిని కని సంతోషమునొందును గాని సంతోషపడి ప్రతిఫలముగా నొక్కకాసైనను చేయి సాఁచి లోభి ఈయఁజాలఁడు. ఇతరుల కెట్లయినను చెప్పవచ్చును గాని తామాచరించుట యసాధ్యము.

ఆ. సకలవిద్యలందు సంపన్నులై యున్న
నట్టివారు పరిచయమునఁ జౌక
పెరటిచెట్టుమందు పరికింప మెచ్చరు, వి...944

పదిమారులు పరిచయముగా బోవుటవలన నెన్నివిద్యలు చదివినవారికైనను జులుకఁదనము తప్పక ఘటిల్లును. ఎట్లందురా? పెరటిలో నున్నందుచే నోషధియందు లఘుబుద్ధి కలుగుచుండునట్టులనే.

ఆ. సక్తిగలుగుపనులు చక్కఁగా నెఱవేఱు
భక్తిగలుగుపూజ ఫలము నిచ్చు
యుక్తికలుగుమాట యొప్పునురా భువి, వి. 945

కార్యసిద్ధికి నుచితములగు సాధనములు భగవంతుఁడొసంగియున్నాఁడు. కార్యసాధనమున కాసక్తి నుపయోగింపవలయును. పూజకు భక్తి మిగుల నావశ్యకము. మాట నేర్పరితనము

నకు యుక్తిముఖ్యము. ఆయాసమయములలో నీవిధముగ వర్తించినఁ బనులు నెఱవేఱితీరును.

ఆ. సంతలోనిసరకు సరసముగాఁ గొనవచ్చు
వింతలంది పొంద వివర మేది?
చింత దీర్చి చూడఁ జిన్మయజ్యోతిరా, వి...946

సంతలో నున్నసరకు సరసముగ కొనివచ్చినట్టుల నేగురునను గ్రహమున చిత్రచిత్రముగా నగుపడు తత్స్వరూపమును చింత దక్కి చూచి కైవల్యము నొందుము.

క. సంతతసమాధిఁ బ్రజ్ఞను
వింతలు తలపోయకుండ వివరించినచో
నంతరమునఁ బరమాత్ముఁడు
మంతవ్యుఁడు వెలుఁగుచుండు మదిలో వేమా!

సంతతమును సమాధిస్థితుఁడై మనస్సునొకవస్తువునందు లగ్నముఁ జేసి యావస్తువును రూపసహితముగ నైన రూపరహితముగ నైనను ధ్యానించుట సమాధిగాన నట్టి సమాధిలోనుండి దృక్పథమునందు గానవచ్చు మాయావృతములగు వింతలు లెక్కపెట్టకున్నచో హృదయమున బరమాత్ముఁడు జ్యోతిస్స్వరూపముతోఁ బ్రకాశించి కామితములిచ్చును.

తే. సచ్చిదానందమగు జ్ఞప్తి సరవిఁ జేరి
మెచ్చి చిన్మాత్రమా శక్తి మేను మఱచి
నిశ్చలత నున్నవాఁడెపో నిత్యయోగి
నిశ్చలాత్ముని శివుఁడనవచ్చు వేమ! 948



సచ్చిదానందరూపమును మఱచిపోక జ్ఞప్తియం దుంచికొని చిచ్ఛక్తివలన (జ్ఞానశక్తి) శరీరమును మఱచి గాఢమగు సమాధిని పూర్ణవిజ్ఞానరూపునిసన్నిధిని మునిఁగియుండెడివాఁ డెవ్వఁడో యట్టివానిని నిశ్చలాత్ముఁడని శివస్వరూపుఁడని యనవచ్చును.

ఆ. సరవితోడఁ గూడు స్వాధిష్ఠచక్రంబు
ప్రాణపవనములను బందు చేసి
వెడలకుండువాఁడె వేదాంతవేత్తయా, వి...

ప్రయత్నముతో స్వాధిష్ఠానచక్రమునందు పంచప్రాణములను నిలిపి యెల్లప్పుడును వదలక తన్మయుఁడైయుండెడివాఁడే యుపనిషణ్మతప్రతిపాద్యుఁ డగునీశుని పొందఁగలుగును. (స్వాధిష్ఠానచక్రము లింగస్థానమున బభమయరలవర్ణములతో షడ్దళసమన్వితంబై రక్తవర్ణంబుతో జలభూతమున కాశ్రయమై జిహ్వేంద్రియమునకుఁ గారణమైయుండును.)

ఆ. సవతితల్లిఁ జూడ సాకుల నెఱపును
స్వంతతల్లివలెను సైఁప దెపుడు
వింత లడచి లోని విజ్ఞాన మందరా, వి.... 950

నిజమగు విజ్ఞానమునకును మాయకును విస్తారమగు భేదము కలదు. చవతితల్లి యెప్పుడును తప్పులుపట్టునుగాని స్వంతతల్లి వలె క్షమింపదు. అటులే మాయ నిన్నువంచించును. విజ్ఞానము కాపాడును. కాన వింతనడవడిగల మాయనడఁచి జ్ఞానము సాధించుట కర్తవ్యము.

తే. సాధుసాంగత్య మమరిన శాంత మమరు
శాంత మమరినఁ జిత్తంబు శక్యపడును
శక్యపడిన మనంబె యొసంగుఁ బరము
పరము గాంచిన శివుఁ డనఁ బరఁగు వేమ. 951

మానవుఁడు సాధుస్నేహమున శాంతమును దాన చిత్తశుద్ధియును అద్దాన పరునిసాన్నిధ్యమును అందుమూలమున కైవల్యమును పొంది పరశివత్వము నొందును.

ఆ. సాముఁ జేసి జెట్టి సాహసియై యుండు
సాముఁ జేయకున్న సరణిఁ గనఁడు
సాముఁ జేయువాఁడు చావక యుండునా? వి...

విజ్ఞానశాలినైన మొక్కొక్కతఱి అజ్ఞానావృతుఁ డగుచున్నాఁడుగాన విజ్ఞానముతోఁ బనియేమని తలంపఁజనదు. విజ్ఞానము మోక్షసాధకమే! సాముచేసినవాఁడైనను రణరంగమున మరణించుచున్నాఁడు. అట్టిచో సామువలన నుపయోగమేమన దురమునఁ దెగువఁజూపుటే!

ఆ. సాహసమున నైన సత్యముచే నైన
మోహబుద్ధి విడిచి ముక్తి నెఱిఁగి
చేర్చి మదిని గురుని జెలరేఁగి యుండరా? వి.

సాహసముచేతఁ గాని సత్యముచేతఁ గాని మోహబుద్ధిని వదలి ముక్తిరూపమును గుఱుతించి మనస్సులో గురునియుపదేశమును మఱువక బ్రహ్మము నొందుము.



ఆ. సుఖము లెల్లఁ దెలిసి చూడంగ దుఃఖముల్
పుణ్యములును బాపపూర్వకములె
కొఱత వేయ దొంగ కోరినచందమౌ, వి...954

సుఖములు సుఖములని మురియుచుందుముగాని సుఖములన్నియుదుఃఖావృతములె. పుణ్యములని సంతసించుచున్నారముగాని పుణ్యములన్నియుఁ బాపావృతములె. కానఁ బుణ్యములు గావలెనని సుఖములు గావలయునని కోరుకొనుట దొంగ కొఱతఁ గోరుటవంటిదే.

ఆ. సేవఁ జేసి గురుని స్థిరభావ మందెడు
త్రోవ నంటి జ్ఞప్తిఁ దొలఁగనీక
భావమందె పరముఁ బరికించి చూడరా, వి...

గురుసేవఁ జేసి స్థిరభావము నొందవలసినత్రోవ నంటిజ్ఞాపకమును తొలఁగఁద్రోయక భావములోనే పరమును పరికించి చూడుము. ఇదియె ముక్తిసాధనము.

తే. స్వాత్మతన్మయ మననంబు సంగ్రహించి
నిర్గుణబ్రహ్మపదవికి నెఱయ బుద్ధి
నొక్కి నిర్భయ మందుటే నుడువుటండ్రు
వేదవేదాంతసారార్థవిదులు వేమ! 956

ఉపదేశము అనఁగా స్వాత్మను తన్మయమునొందించి సర్వదా మననము చేయుచు నిర్గుణబ్రహ్మమార్గమునకు బుద్ధిని మరల్చి నియమముగా భయములేక యుండుటయే బ్రహ్మభావము నొందుటయని యుపనిషన్మతము నెఱిఁగినపెద్ద లండ్రు.

ఆ. స్త్రీలమాయచేతఁ జిక్కుఁ దాఁ గొన్నాళ్లు
తగులుగోరు నట్లు తగిలిపోవుఁ
దనిసిపొనిసి తుదను దైవంబుచేఁ జెడు, వి...957

మనుజుఁడు మూర్ఖుఁడై స్త్రీలవలలోఁ జిక్కి కొన్నిదినములును తగులుపాటులను పొంది కొన్నిదినములును నవసి చివరకి కర్మ కంతకును ఫలముగా దైవమువలనఁ జెడిపోవును. కాన మానవుఁడు చెడుటకుఁ గొంతవఱకు దైవమును గారణమగుచున్నాఁడు.

క. హాయ మదిరి పరువు లిడుగతి
రయమునఁ బాఱెడిని మనసు ప్రతికూలముగా
నయమో భయమో చూపుచుఁ
బయనము సాగింపనీక పట్టర వేమా! 958

గుఱ్ఱమువంటిది మనస్సు. గుఱ్ఱము బెదరి పరువు లెత్తును. అప్పుడు నయముననో భయముననో అంకెకు దార్చుకొనునట్టులనే ఆత్మజ్ఞానమును గోరు నీవును మనస్సును నయముచేతనో భయముచేతనో జయింపుము.

ఆ. హరుఁడు గురువు గాదె? యఖిలంబు తాఁగాదె?
యనుభవింపరాదె? హరునిఁ గూర్చి
యతికినంతలోన నంధకారం బేల? వి.... 959

సంసారమున కంటియు నంటనటులనున్న శంకరుఁడే మోక్షార్థులకు గురువు. కైవల్యమనుభవింపవలయునన్నచో హరుని గూర్చి జపతపములు గావింపవలయును. హృదయమును శివుని



యెడ నతికించినచో నజ్ఞానాంధకార మెన్నఁటి కావరింపఁజాలదు.

ఆ. స్థూల మగును గ్రుడ్డు సూక్ష్మమౌఁ గన్పాప
పాపలోనిజ్యోతి పరమపదము
మాపు రేపు నాక మది నంటి చూడరా, వి...

కన్ను స్థూలవస్తువు. అంతకంటెఁ జిన్నది కంటిపాప. ఆపాపయందలి కనీనికయం దొక జ్యోతిగలదు. అదియే మోక్షసాధకము గాన నాజ్యోతిసహాయముతో నెల్లపుడు నిశ్చలచిత్తముతోఁ జూతువేని బ్రహ్మమును దర్శింపఁ గలుగుదువు.

ఆ. హరిహరాదులందు నాశను దిగనాడి
శాంతబుద్ధి గూడి సగుణమందుఁ
జింత మాని పిదపఁ జిన్మయ మందరా, వి.... 961

బ్రహ్మవిష్ణ్వాదులందు గల ప్రత్యభిజ్ఞను విసర్జించి శమాదిషట్కసంపత్తి గలవాఁడై సగుణోపాసనఁ జేయుచు చిద్రూపమును వీక్షింపవలయును.

ఆ. హానిచేతఁ గలుగు నధికదుఃఖంబులు
హానిచేతఁ దప్పు నరయ సుఖము
హానిచేతఁ గొంత యలమట గలుగురా, వి...

హాని యనునొక్కవస్తువును సమూలముగా నెఱిఁగినఁ జాలును. ఈహానియే దుఃఖములను సుఖములను నాశనముచేయుచున్నది. హానివలన మానవునకుఁ దొలుతఁ గొంత శ్రమగలుగును.

అంతమాత్రము నిరుత్సాహము నొందకున్నఁ జివరకిదియే ముక్తి సాధనముగాఁ బరిణమించును.

ఆ. హేమకారవిద్య నెఱిఁగినవా రెల్ల
వెతలఁ బడనియట్లు విద్యచేత
దత్త్వ మెఱుఁగువెనుకఁ దనకుఁ జింతేలరా? వి.

స్వర్ణము చేయువిధము నెఱిఁగినవారలు కొంచెమైనను కష్టముల నొందక యభీష్టము నొందఁగలిగినయట్టుల నేతత్త్వము నెఱిఁగినపిమ్మట తాపత్రయాదికష్టములు కలుగవు.

ఆ. హేమనగము చేత నెప్పుడుఁ గలవాఁడు
వెండికొండమీఁద వెలయువాఁడు
ఎత్తవలసె బిచ్చ మేమనవచ్చురా? వి... 964

బంగరుకొండపైని సర్వదా నివసించువాఁడును రజతాద్రి చేతఁగలవాఁడునగు నీశ్వరునంతటివాఁడును బిచ్చమెత్తవలసి వచ్చెను. కావున నాపదలు గల్గువేళ మన మధైర్యము నొందరాదు.

ఆ. హృదయమందు శివుని జెదరక నిల్పిన
పదిలుఁ డగును భవుఁడు ప్రాపుగాను
గదిసి నొక్కి మదిని గ్రక్కునఁ జూడరా, వి...

హృదయమునందు శివస్వరూపమును నిల్పెదరేని ఈశ్వరుఁడు భద్రుఁడై యుండి ప్రాపు నొసంగును. ఆయనను సమీపించి మనంబును నియమించి యెఱుఁగుము.



ఆ. క్షమగలట్టియతఁడు సాధువై శోభించు
నోర్పుఁబోలునట్టి దుర్విఁ గలదె?
వన్నెవచ్చు మేలు లెన్నియైనను గూడు, వి...

క్షమగలవాఁ డెచ్చట నున్నను సజ్జనుఁడై శోభిల్లును. కావున నోర్పు నార్జింపుము. ఓర్పుతో సమానమగు మంచివస్తు వీప్రపంచములో నేదియును లేదు. మనుజునకు వన్నెనిచ్చును. శుభముల ననేకముల నొసంగును. కావున నోర్పు మంచిది.

ఆ. క్షుత్తు దప్పి నిద్ర క్షుభితములై యుండు
రిత్తలోకమాయ రీతి గాదె
సత్తు పూర్ణసుప్తి సాధింపవలెనయా, వి...967

ఆఁకలి దప్పి నిద్ర యెల్లప్పుడును చుట్టుకొనియేయుండును. ఇవన్నియును కేవలము మాయానుభావవిలసితములు. సత్తును పూర్ణసుప్తితో సాధించిచూచి ముక్తుఁడై కైవల్యము నొందుటకు ధీరుఁడవై యత్నింపుము.

# మోహపద్ధతి.



అవతారిక. అరిషడ్వర్గములో నొకటియగు మోహము మానవ జీవితమును గలుషితము జేయుటలో నిరుపమాన ప్రజ్ఞ కలది. తపస్సిద్ధులగు మహాత్ము లనేకులు మోహదాసులై పతితులైరి. మోహముపదలినఁగాని ఇంద్రియముల విజృంభణము తగ్గదనియు ఇంద్రియములను జయించినఁగాని చిత్తశుద్ధి యలవడదనియుఁ జిత్తశుద్ధి యలవడినఁగాని యోగముల నభ్యసింప వీలులేదనియుఁ దెలుప నిశ్చయించి తొలుత విసర్జనీయమగు నీ మోహమును గూర్చియు దానివలనఁగలుగు చెడుగులఁగూర్చియుఁ దద్వర్జనమునందుఁ గల యావశ్యకమును గూర్చియు వేమనయోగి మోహపద్ధతిలో నీక్రిందివిధముగాఁ జెప్పఁబోవుచున్నాఁడు.—

ఆ. అంగ మెల్ల వదలి యటు దంతములు నూడి
తనువు ముదిమిచేతఁ దఱచు వడఁక
ముప్పుత్రిప్పులఁబడి మోహంబు విడువఁడు, వి.

మనుజుఁడు అవయవముల బింకముతొలఁగినను దంతములు కదులుచున్నను మేను వడఁకుచున్నను ముదిమిచే నానావస్థలు పడుచున్నను స్త్రీలపై గల మోహభారమును వదలఁజాలకున్నాఁడు.

ఆ. అగ్నిచక్ర మనఁగ నాకర్ణలింగంబు
అగ్నిగుండమందు నంటఁ గూర్చి



భవునిధ్యాన మీఁకను బాటింప ముక్తిరా, వి. 969

అగ్నిచక్రమునే ఆకర్ణలింగమని చెప్పుదురు. ఇది నేత్రేంద్రియమునకుఁ గారణమును నాభియందుండునదియు నగు మణిపూరకచక్రము. ఇది అగ్నిభూతమునకు నివాసము గాన అగ్నిచక్రమనఁబడును. ఈయగ్నిచక్రమందు హృదయమునెలకొల్పి చలింపని భక్తితో శంకరుని ధ్యానింతుమేని తప్పక ముక్తి గలుగును.

ఆ. అగ్నిఁ గుండమందు నమరంగ ఘటియించి
యవని నీరు బియ్య మందునుంచి
అది పచనము గాఁగ హరుని కర్పించుము, వి....

మనస్సును ఈశునివైపునకు మరల్చి సర్వదాతదేకచిత్తుఁడవై మెలఁగుచు ప్రొయ్యిలో నగ్నిరాజేసి బియ్యము నీరుకలపి వెసరుబెట్టి వంటఁజేసి యాపక్వపదార్థము నీశ్వరునకు నివేదనము గావించుచుండుము. ఈశ్వరుని ప్రీతుని గావింపఁగలుగుదువేని నీవును దరింపఁగలవు.

ఆ. అగ్నిశిఖలయందు నమరంగ మమకార
మభవుమీఁద ధ్యాన మమర నునిచి
యాహుతి యగు వెనుక హరుని కర్పించుము, వి.

మనమును ఈశ్వరునిపై నిల్పి మమత్వమును వైరాగ్యాగ్నిచే దహింపఁజేసి మొదలంట మమకారము గాలిపోయిన పిమ్మట శివధ్యానమునకు సిద్ధపడినచో మోక్షపదవి లభించును. మమకారమును జంపవలెను.

క. అజ్ఞాన మనెడియడవిని
సుజ్ఞానపుఖడ్గమునను జూచి నఱకరా
యజ్ఞాన మాత్మఁ దెలుపుట
సుజ్ఞానపుదివ్యపదము చూడర వేమా! 972

సుజ్ఞానమను దేవలోకమును జూడ నెంచితివేని నీదృక్పథమున కడ్డముగానున్న అజ్ఞానాటవినిజ్ఞానమనుఖడ్గముతో మొదలంట నఱుకవలయును. అపుడాత్మజ్ఞానముగలవాఁడవై తరింపఁ గలుగుదువు.

క. అంతయు బ్రహ్మమయం బని
మంతనములు మాని మనసుమర్మము గనినఁ
వింతలు బయటను సున్నగుఁ
జింతలు విడినట్టివాఁడె సిద్ధుఁడు వేమా! 973

మనస్సునకుఁగల మఱుఁగు నెఱింగి దానిని జలింపనీయక ప్రపంచమంతయు బ్రహ్మమయంబని తలంచినచో బహిరంగదృష్టికిఁ గానవచ్చు వికృతదృశ్యములన్నియు నశించును. ఇతరచింతలన్నియు వెంటనే నశించును. చింతనశించినంతనె సిద్ధుఁడవై మోక్షమందఁగలవు.

ఆ. అంతరంగమందు ననువుగా శోధించి
తలఁపఁ దలఁప ముక్తి తనకుఁ గలుగు
బాహ్యరంగమందు భావింపఁ దెలియునా? వి...

మనుజుఁ డీశ్వరుని మనస్సులో నిల్పి నిరంతరమును ధ్యానించుచుండిన ముక్తి కలుగుచుండునే కాని వెలుపల కెన్ని విధముల



నార్భాటముఁ జేసినను వ్యర్థము. ఈశ్వరస్వరూపము వాచాటునకు గోచరింపదు.

ఆ. అంతరంగమందు నభవు నుద్దేశించి
నిల్పి చూడఁ జాడ నిల్చుఁగాక
బాహ్యమందు శివుని భావింప నిలుచునా? వి...

మనమునందు పరమేశ్వరు నిల్పినచో నీశ్వరసిద్ధి యగునే కాని బాహ్యమున నెన్నివిధములఁ బ్రయత్నించినను మనుజుఁడు సిద్ధిఁ బడయనేఱఁడు. అట్లుగావించిన మనస్సుగూడ నిలువదు.

ఆ. ఆది యొకటి దెలిసి యాదిని మది నిల్పి
యాది పాయకున్న నభవుఁ డగును
ఆది పాయువాఁడి కంధునిరీతిరా? వి... 976

మోక్షసాధనమున కాద్యమగు బ్రహ్మస్వరూపమును దెలిసికొని మనస్సునం దాస్వరూపమును నిలిపికొని దృక్పథమునుండి యాస్వరూపమును దొలఁగనీక మనస్సులో లయము గావించుకొన్నయెడల సాధకుఁడు శివుఁడగును. ఆద్యమగు బ్రహ్మస్వరూపమునే గుర్తింపఁజాలమేని గ్రుడ్డివానితో సామ్యము కావలసివచ్చును.

ఆ. అధరసుధను జూచి యన్నియు మఱచును
దరుణిరూపుఁ జూచి తన్ను మఱచు
నుక్తు లాలకించి యోగంబు మఱచురా, వి...

స్త్రీసాంగత్యమువలన సర్వరీతుల యోగి చెడిపోవును. సాంగత్యమే యవసరములేదు. చెలువల మోవి తేనియలను జూచి

యాత్మజ్ఞానమును, పొలఁతులపొలుపుఁజూచి శివస్వరూపుఁడగు తనను మగువలమాటల విని యోగములను మఱచి భ్రష్టుఁడగుచున్నాఁడు. కాన స్త్రీసందర్శనమె యోగులకుఁ దగదు.

ఆ. అరసి సూక్ష్మమైన యానంద మెఱుఁగక
మతియు లేక చదివి మందుఁ డయ్యె
నలరహస్య మెల్ల నాతఁ డె ట్లెఱుఁగును? వి...

మిగుల సూక్ష్మమైనదియు జ్ఞానానుభవసాధ్యమైనదియు నగు మోక్షానందమును అజ్ఞాని గుర్తింపలేక గ్రంథపఠనముగావించి గావించి మందుఁడై పోవుచున్నాఁడు. కేవల పఠనముతో మునిఁగి తేలుమందమతికి మోక్షానంద మెన్నఁటికి ననుభావ్యము కానేరదు.

ఆ. అన్నరసమువలన నలబిందురస మయ్యె
బిందురసమువలన బీజ మయ్యె
బిందుబీజములను భేదించి చూడరా, వి...979

అన్నమువలన రేతస్సును దానివలన జీవాణువులు పుట్టుచున్నవి. కావున ఆరెండింటిని వేర్వేఱ విభజించి పరికించి బిందువుల బిందువులుగ జీవాణువులను జీవాణువులుగఁ దెలిసికొన యత్నింపుము.

ఆ. అభవుననుభవమును నార్గు రరులు నీల్గ
సంశయంబు లేదు సాధకులకుఁ
జెంత దీప మిడక చీఁకటిపోవునా? వి... 980

ఈశ్వరసిద్ధియైనచో సాధకునకు నరిషడ్వర్గము నశించును.



ఇందుకు సంశయములేదు. కావున దీపము లేనిది చీఁకటులు నశింపనియట్టులు అంతశ్శత్రుజయము ఈశ్వరానుగ్రహములేనిది కలుగదు.

క. అమలాత్ముని మానసమున
విమలాంతర్గతుని గాఁగ విపరింపవలెం
గ్రమమైన చాయలందున
మమకారము నెట్టవలెను మహిలో వేమా! 981

బుద్ధిమంతుఁ డగువాఁడు నిర్మలుఁ డగునీశ్వరుని సర్వదా మనస్సులోనిలిపి ధ్యానించుచు క్రమక్రమమున మమత్వమును వీడి ముక్తుఁడు కావలయును.

ఆ. అమృతసాధనమున నందఱు బలిసెద
రమృత మెంచి చూడ నంద లేరు
అమృతము విషమాయె నది యేమిచిత్రమో? వి.

అమృతమును త్రాగిన పుష్టి నొందెదరు కాని యలదానిని మాత్రము పొందలేరు. దురదృష్టవంతుల కట్టియమృతము వికటించుటగూడ గలదు. రాహుకేతువులు అమృతమును దేవతలతోఁబాటు పానమును జేసిరి గదా! ఆహా! అమృతమే విషమయ్యె నెంతచిత్రమో చూడుఁడు.

ఆ. అరయఁ గంటిదృష్టి గుఱిగను ముక్కుపై
రెప్పపడక గుడ్లు త్రిప్పిపట్టి
వివర మెఱుఁగ శాంభవీముద్రయదియండ్రు, వి.

కనుదృష్టిని నాసాగ్రమున నిల్పి కనులను మూసికొనక చూపునిలిపి ఈశ్వరుని ధ్యానింపవలెను. దీనినే శాంభవీముద్ర యని యందురు. (శాంభవిముద్ర యోగశాస్త్రములో నిట్లు చెప్పఁబడినది. దృష్టిని అంతర్లక్ష్యమునందును బహిర్లక్ష్యము నందును నుంచుచు మనస్సును నిల్పి ప్రాణాయామాభ్యాసము వలన వాయువును బంధించి నాదబిందుకళలను అనుభవింపవల యును.)

ఆ. అలవిగాని బయలు నందిన మదిఁ జూడఁ
గూడి మెలఁగుచుండఁ గోచరించుఁ
జూడఁ జూడ నెఱుక చోద్యమై తోఁచురా, వి.

అసాధ్యమగు నాకాశరూపమున మనస్సును చేర్చి నిరంతరము నాచిద్విలాసములను బరికించినచో చిత్రముగా బ్రహ్మము సాక్షాత్కరింపఁగలదు.

ఆ. అష్టకష్టములకు నాలయమై యుండి
గతులు దుర్గతులను గన్న దేదియొ
కానకుండఁబోయె గగనస్వరూపమై, వి... 985

సమస్తసుఖదుఃఖములకు నునికిపట్టై యుండి మంచిచెడ్డలను పొందిన శరీరము చివఱకు అదృశ్యమై యాకాశమునఁ గలసి పోవుచున్నది.

ఆ. అక్షయాత్మకంబు నర్థింప గుఱిగని
నిశ్చయంబుగాను నిలిపి మనసు
రక్షగట్టినట్లు రట్టడి మాన్పరా, వి... 986



అవ్యయమగు బ్రహ్మమును గుఱుతుగానుంచుకొని హృదయమును జలింపనీయక బంధించి రక్షగట్టినటుల మనోవికారములఁ బోకార్పఁగలవేని సిద్ధినొందఁగలవు.

ఆ. అస్థిరమగు మేని కదరుపాటులఁ బొంది
పెక్కువిధములందుఁ బెంచి పెంచి
యగ్ని కిచ్చు లేక యడవినక్కల కిచ్చు, వి...987

మనుజులు అజ్ఞానులై శరీరమును అభిమానించెదరు; కాని వ్యర్థమగును. చచ్చినప్పుడు దీనిని నక్కలకైనను, నగ్నికైనను సమర్పించుచున్నారు. కావున దేహముపై మమత్వమును వదలి యుండుము.

ఆ. ఆకు కానవచ్చు హరిహరాదులకైనఁ
గొమ్మ కానరాదు కోరిచూడఁ
గొమ్మ కానరాక కొనియాడకుందురా? వి...988

బ్రహ్మాండమను వృక్షముగలదు. దానిశాఖయే పరబ్రహ్మ స్వరూపము. దానిచిగురాకె మాయ. బ్రహ్మకైన శివునకైన బాహ్యదృష్టికా చిగురాకె గోచరించును గాని శాఖ గోచరింపదు. బ్రహ్మస్వరూపమనఁదగుశాఖను దర్శింపఁగలుగుటయే కైవల్యము నొందుట యని గ్రహింపవలయును.

ఆ. ఆఁడు దనఁగ రోఁత యది చూడఁగా రోఁత
తలఁచిచూడఁ దనకుఁ దానె రోఁత
ఎంతవారికైన నింతియే బలఘాత, వి.... 989

అజ్ఞానులు ఆఁడుదానిఁ గని మోహించెదరు. ఆఁడుది

మిక్కిలి రోఁతవస్తువు. దానియాకారవిశేషములు మిక్కిలి రోఁతైనవి. ఇంతయేల బాగుగాఁ బరిశీలింతుమేని యెవనిదేహము వానికె రోఁతయైనదిగాఁ దోఁచును. అట్టిచో స్త్రీనిరోఁతగ నెంచుటలో నన్యాయములేదు. ఇంతియగాక స్త్రీవ్యక్తి యెంతవారికైన నపాయకరమనుమాట సత్యము.

ఆ. ఆత్మబుద్ధివలన నఖిలంబు తా నయ్యె
జీవబుద్ధివలన జీవుఁ డయ్యె
మోహబుద్ధివలన ముదితల దర్శించె, వి... 990

అహమాత్మా శివోహం అనుభావనలచే మానవుఁడు పరబ్రహ్మస్వరూపుఁడగుచున్నాఁడు. వాఁడె మరల జీవభ్రాంతికి లోనైకడకు జీవుఁడగుచున్నాఁడు. మోహమునకు వశుఁడై సతులవెంబడించి పూర్వజ్ఞానము కోలుపోవుచున్నాఁడు. ఎంతయన్యాయము.

ఆ. ఆత్మలోనిజ్యోతి యమరుట లింగంబు
తెలిసి చూడకున్న తేటపడదు
అదియు గురువులేక యబ్బునా తెలియంగ? వి.

హృదయమును సమాధిచే లోఁబఱచుకొని జ్యోతిర్మండలము సందర్శించుటయే ఈశ్వరసాక్షాత్కారము. అనుభవజ్ఞానముచే నెఱుంగకున్నచో నీశ్వరసాక్షాత్కార మెన్నఁటికిఁ గాదు. ఇందులకు నుపదేశకునితోడ్పాటు చాల ముఖ్యము. అదిలేకున్న ప్రయత్నము సాగనేరదు.



ఆ ఆదిమూల మేది యాధార మెయ్యది
సోది జెప్పఁదరమె సుద్దులరసి
తోడు లేక లోనితుల్యముఁ గనుమయా, వి...

ముగ్ధుఁడవు గాక ప్రపంచమునకంతకు నెయ్యది యాధారము; ఎయ్యది మూలము అని విచారించి నీహృదయమునఁ గల యీశుని సందర్శింపుము. అంతియగాని తెలిసికొనక తెలిసికొన్నవానివలె సోదచెప్పకుము.

ఆ ఆపగాళివెంట నడవులవెంటను
కొండరాలవెంట గొడవ యేల?
నుల్లమందు శివుఁడటుండుట తెలియవే? వి...

నదులవెంటను అడవులవెంటను కొండరాళ్లవెంట నేల తిరిగిబడలెదవు? నీహృదయమునఁ గలయీశు నెఱింగి ముక్తుఁడవగుము.

ఆ. ఆఱువేషములను నరయంగఁ గడువింత
యాత్మయందు ధ్యాన మమర దెందు
భీకరంబు గాని బిరుదు లేదు విరక్తి, వి.... 994

ఆఱింద్రియములయార్భాటములఁ బరికించుకొలఁదిని మిగుల వింతగానుండును. ఈయాఱింటిని జయింపఁగలిగినఁగాని ధ్యాన మమరఁజాలదు. ఇంద్రియముల నాఱింటిని జయించుటకు ధ్యానయోగమునఁ గృతార్థుఁడవగుటకు ముఖ్యముగాఁ గావలసినది వైరాగ్యమేగాని వేఱొండుగాదు. విరాగివికమ్ము.

ఆ. ఆలి నమ్మి భువిని నాచారహీనుఁడై
ప్రాలుమాలె నొక్క ప్రతిన కొఱకు
ఆడి తప్పకుండ కాడు కాఁచినవాఁడు
వాఁడె పరమగురుఁడు వసుధ వేమ! 995

హరిశ్చంద్రుని యంతటి గొప్పరాజరాజు సత్యప్రతిజ్ఞ కాపాడుకొనఁగోరి ఆలినమ్మికొని కులాచారమును విడనాడి నానావస్థలకు లోనయ్యెను. ఈకలియుగమునఁగూడ నెవఁడేని ఆడి తప్పకుంటకై కడకుఁ గాటికాపరిగా నుంట కంగీకరించెనేని వానిని గురూత్తమునిగా భావింపవచ్చును.

ఆ. ఆలు బిడ్డ లనుచు నతిమోహమున నున్న
ధనముమీఁద వాంఛ తగిలియున్న
నట్టినరుల కెల్ల నవని ముక్తియె లేదు, వి....996

పెండ్లము బిడ్డలపై వలపుగలవానికిని ధనముపైఁ దీరనికోరిక గలవానికిని ముక్తియెన్నఁటికిని లభింపఁజాలదు. నిష్కాముఁడగు వాఁడె యెన్నఁటికైన మోక్షపదవి నందఁగలుగును.

ఆ. ఆలుబిడ్డలు ధన మరయఁ దల్లియుఁ దండ్రి
కలమనుజుఁడు మిగుల గష్టపడును
తనకు నెవరు లేరు తాను బ్రహ్మముగన్న, వి...

ఆలుబిడ్డలు మున్నగునీప్రపంచవిషయములు బ్రహ్మభావమును చెందునంతవఱకే జనుల నంటుకొనునుగాని తర్వాత నొందనేరవు. మనుజులకీ సంసారపుజంజాటము బ్రహ్మసందర్శనమువఱకే యుండును.



ఆ. ఆలుసుతులు మాయ యన్నదమ్ములు మాయ
తల్లిదండ్రిమాయ తాను మాయ
తెలియనీదుమాయ దీనిల్లు పాడాయె, వి...

బాగుగాఁ బరికించితిమేని ఆలుబిడ్డలు అన్నదమ్ములు తల్లిదండ్రులు సమస్తము మాయయే. ఈమాయావరణము భేదించుట కష్టము. దీని యిల్లుపాడుగాను ఈమాయాస్వరూపము గనుగొనుట సామాన్యముగాదుగదా!

ఆ. ఆవుచన్నుఁ బితికి ఆపాలు గాఁచినఁ
బేరి పెరుగు చల్ల పేర్లుగలుగు
తవిలి లోనఁ గలదు నవనీత మిట్లురా, వి...

ఆవుపాలను పితికి గాఁచిన పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి మున్నగునవి వేఱగునట్టులే శరీరమును విభజించి గుర్తెఱింగిన యాత్మరూపము తోఁచును.

ఆ. ఆవుపాలు శివుని కభిషేకమున కౌను
ఆవుపాలఁ జూడ నౌషధంబు
నావుపాల నున్న యతిశయ మెఱుఁగుఁడీ? వి.

చూచుట కాకార మొక్కటిగా నున్నను యోగ్యత వేఱుగా నుండును. ఆవుపాలు అన్నిపాలవలెనే యున్నను నీశు నభిషేకించుపుణ్యకార్యమున నుపయోగింపఁబడుచున్నవి. ఇంకను నావుపాలు ఔషధములకుఁగూడ నుపయోగింపఁబడుచున్నవి. ఆవుపాలయందుఁ గలగొప్పతనము గమనింపఁదగినది.

ఆ. ఆశలనెడిత్రాళ్ల నఖిలజంతువులెల్లఁ
గట్టుపడును గాన నిట్టులమున
జ్ఞానమనెడిచురియఁబూనికోయఁగరాదె, వి...

ఆశలను త్రాళ్లచే సమస్తజీవములు గట్టఁబడుచున్నవి. జీవములను గట్టివేయు నాశాపాశములను దెగగోయుటకు సాధారణ ఖడ్గము లుపయోగింపవుగావున జ్ఞానమనుఖడ్గముతోఁ గోసి కృతార్థుఁడవుకమ్ము.

ఆ. ఆశలనెడిత్రాళ్ల నమరఁ గోయఁగఁజేసి
పారవైవఁగాని పనిములేదు
కొన్కుతిండియాసఁ జిక్కి చచ్చినయట్లు, వి...

ఆసయను త్రాళ్లను గోసినగాని జీవునకు మోక్షము కలుగదు. ఆసయెన్నిముప్పులకో కారణమగుచున్నది. ఆసకులోనై తిండి తినఁగోరిగదా పందికొక్క బోనులోఁబడి ప్రాణములను గోలుపోవుచున్నది. కాన నాశ అందఱి కపాయకరము.

ఆ. ఇచ్చువానికంటె నింద్రియనిగ్రహుం
డఱియ నతనికంటె నధిపుఁడగును
వాఁడు వానికంటె వీడును పాపముల్, వి...

అడిగినంతన లేదనకయిచ్చుదాతకంటె నింద్రియములను జయించినవాఁడె ధన్యుఁడు. దాతకంటె నింద్రియనిగ్రహగుణము గలధన్యుఁడే పాపవిముక్తుఁడు కాఁగలఁడు.

ఆ. ఇట్టికనులబ్రహ్మ మెట్లు చూడఁగవచ్చుఁ
జూచుకనులు వేఱు చూపు వేఱు



చూపు లోన నుంచి చూడంగ వలవదా? వి.

బ్రహ్మ ముండినచోఁ గనుపడదేమి యని యందురు గాని ఈనేత్రములకు బ్రహ్మ మగుపడదు. బ్రహ్మమును జూడఁదగిన కనులును ఆచూపులు వేఱుగానున్నవి. ముందుకనుల గామాది వికారకరములగు వస్తువులపైకిఁ బోవనీక హృదయమునఁ జూపును జొరనిచ్చి ముద్రాభ్యాసపాటవమునఁ జిత్కళలదర్శింపుము. వెంటనే యందు బ్రహ్మతేజస్సు గోచరించి తీఱును.

ఆ. ఇట్టితనువు గలిగి యీలోకమందునఁ
బుట్టి చచ్చు భ్రమను గట్టిగాను
తెట్టతెరువుఁజేరి తెలివంటి చూడరా, వి....1005

మానవుఁడు యోగసాధనమునకుఁగర్మయోగమునకుననుకూలమగు జ్ఞానము సాధనములు గలవాఁడయ్యుఁ జావుబ్రతుకులకు లోనై భ్రాంతినొందునేగాని మోక్షమార్గము నెఱుంగఁజాలకున్నాఁడు. మోక్షమొందనెంచినచో నాత్మజ్ఞానమును గడించినఁగాని ఫలముండదు.

ఆ. ఇంటిలోనికోఁతి యిరవు గానఁగ లేక
తిరుగఁ బోవువారు తీఱకుంద్రు
కోఁతి నొకటి నిల్పి కుదురుండలేరయా, వి...

మనస్సు కోఁతివలె చంచలమైనది. జనులు తమమనస్సును తాము, అరికట్టివేయలేక భ్రమించుచుందురే కాని యాయత్నము వ్యర్థము కావున మనోనిగ్రహముఁ జేయుము.

ఆ. ఇంటివెనుక తీఁగ యింగ్లీక ముండంగ
పారదంబు గలుగ బసిఁడియేల?
సత్తు బొత్తుఁజేసి సాధింపవచ్చురా? వి... 1007

మనయింటివెనుక నొకానొక మూలికగలదు. అంగటిలో నింగిలీకము పాదరసము సమృద్ధిగాఁగలదు. ఇన్నియుండ నింక బంగారమునకు నేల శ్రమ నొందవలెను. ఆపదార్థములతో సత్తును జతపఱిచి బంగారుచేయుటకు యత్నింపుము.

ఆ. ఇంతకాలముండి యెఱుకమాలినజీవి
చచ్చి పుట్టుచుండు సహజమనుచు
నెఱుకమఱచుచోట నెఱుఁగునా బ్రహ్మంబు? వి.

ఎంతకాలమునుండియో జ్ఞానములేకుండ వర్తించినజీవి జననమరణము లొందుచు శ్రమలపడుచునేయుండును. జ్ఞానశూన్యుఁడగువాని కెన్నఁటికి బ్రహ్మస్వరూపము దర్శించుభాగ్యము కలుగఁజాలదు.

ఆ. ఇంతిగన్నఁ జన్ను లింతింతలని చూచి
మోహమొందు బుద్ధి మోసపోయి
గరితలేనివాని గానలేదాయెరా, వి... 1009

స్త్రీలను చూచి స్తనాదులను వర్ణించుచు పెద్దలుకూడ తెలివిలేక మొద్దు లయ్యెదరు. ఏమి యీ మోహపుసామర్థ్యము! ప్రపంచమున స్త్రీచింతలేనివాఁ డెచ్చటను లేఁడుగదా!

ఆ. ఇంతిఁ జూచెనేని యింతింత యనరాదు
కాలవహ్ని లక్క గరఁగినట్లు



వట్టిమోహ మిట్లు రట్టులఁ జేయురా, వి....1010

స్త్రీని చూచినవెంటనే చెప్పనలవిగాని మోహమును పొంది జనులు చెడిపోవుచుందురు. వారిమనస్సు నిప్పుముందుంచిన లక్కవలెఁ గరఁగిపోవును. మోహమిటుల నెంతవారికైన నవస్థలపాలు గావించుచుండును.

తే. ఇంతి యాకృతిపై నాస కెదురుచూచి
చింతలోఁ బడి ప్రాణముల్ చిక్కఁబట్టి
యంతు గనలేక చచ్చెద రవనిలోన
కాముకులగతి యీరీతి గాదె వేమ! 1011

కాముకులగుమనుజులుఇంతులచక్కఁదనముఁజూచియాసపడి వారికై యెదురుచూచి యెటులవశ్యురాండ్రగుదురని చింతించుచుఁ గలయికకై యెటులోఁ బ్రాణములు బిగపట్టుకొని వలపునకుఁ గల యంతు గ్రహింపలేక మరణించుచుందురు.

ఆ. ఇంతులఁ గనఁగానె యింతింత యనరాదు
నగ్గి లక్కఁ గరఁగ నైనరీతి
వెలయుమోహ మిట్టి వింతలు చేయురా, వి...

స్త్రీలను చూచినంతమాత్రమున నెంతటివారైనను లక్కవలె కరఁగిపోయెదరనుటలో వింత లేదు. ఏలయన: ఇదియంతయును మోహపుచమత్కారమే కదా!

ఆ. ఇంద్రలోక మనఁగ నింద్రజాల మనఁగ
నింద్రపదవి యనఁగ నిన్ని యొకటె
కలియుగమున నరులు కానరు భ్రమచేత, వి....

ఇంద్రలోకము ఇంద్రపదవి సిద్ధింపవలయునని మానవులు యజ్ఞయాగాదుల చేయుచుందురు. ఇవియన్నియు నింద్రజాలములెగాని నిజముగాదు. కలికాలమునఁ గలనరు లివికల్లయని భ్రమచే నెఱుఁగలేరు.

ఆ. ఇంద్రియములచేష్ట లెన్నక భువిలోనఁ
దన్నుఁ దెలిసి మదిని తమక ముడిగి
మింటిమంటినడుమ మిత్తినిఁ ద్రొక్కరా, వి...

ఇంద్రియములను సరకుగొనక యాత్మరూపమును పరికించి భ్రూమధ్యమున బరమాత్మఁగని మాయను దిగమ్రింగి మనుము. తికమకపడిమాత్రము చెడిపోకుము.

ఆ. ఇంద్రియముల భ్రాంతి నీరేడుజగములు
మందు బెట్టినట్లు మరులు గొనుచుఁ
బొందు సుఖముచేత పుత్త్రులఁ గాంచిరి
సకలజనులు నిట్లు జగతి వేమ! 1015

ఇంద్రియములవలన నగుభ్రాంతిచేతనే యీపదునాల్గులోకములవారును ప్రేమపాశానుబద్ధులై మందుఁ దినినవానివలె మరులుకొని తారుమారగుచున్నారు. సంభోగసౌఖ్యములవలన సంతానమొంది సంసారయాత్రలు జరుపుచున్నారు. కాని మోక్షమార్గ మరయుట లేదు.

ఆ. ఇంద్రియముల విడిచి యేకతతో నిల్చి
ఎఱిఁగి పిదప తన్ను నెఱుఁగకున్న
యతఁడె మౌని జ్ఞాని యగునని యందురు, వి.



ఇంద్రియముల జయించి ఏకాకియై యాత్మరూపముఁ బరికించువాఁడె మునియును జ్ఞానియు నగునని పెద్దలు పలుకుచుందురు.

ఆ. ఇంద్రుఁ డాయె కామి హీనుఁడై పోయెను
మారుఁ డాయె కామి మడిసి పోయె
బ్రహ్మ మయ్యె కామి బయిసిపోనాడెను, వి...

దేవేంద్రుఁడు కామియై మిగుల గౌరవమునొందెను. మన్మథుఁడు కామియై మరణముసైత మొందెను. బ్రహ్మకామియైసిగ్గుబోనాడి వావితప్పెను. కామమెంత చెడుగునకైనఁదగినదిగదా!

ఆ. ఇంద్రుఁడైనఁగాని చంద్రుఁడైనను గాని
నంద దుర్గ మెక్కి నాతితోడ
పొందుఁ బడక ముక్తి పోరాడవలెనయా, వి...

ఇంద్రుఁడైనను సరియే చంద్రుఁడైనను సరియే మోక్షము వలయునని కోరెదరేని సంతోషమను దుర్గవీథిలోఁ జరించుచు భార్యాసహితుఁడయ్యుఁ గామవికారక్రియలకు లోనుగాక ముక్తికొఱకుఁ బోరాడవలెను.

ఆ. ఇన్నినాళ్లనుండి యెనసినమోహంబు
చెలిమిఁ జుట్టఱికము చెల్లె లక్క
తల్లి దండ్రి బిడ్డ దాయాదు లనునిట్టి
భ్రాంతిచేతఁ జిక్కఁబడుర వేమ! 1019

చిరకాలమునుండి వచ్చుచున్న యీమోహము తల్లిదండ్రిస్నేహము బాంధవ్యము అక్కచెల్లెండ్రు తనవారు దాయాదు

లను భ్రమలను గలిగించుచు మానవుని మోక్షచింతకుఁ బోనీక చిక్కులపఱచి పాడుచేయును.

క. ఇల్లసుమీ సంసారమె
యిల్లసుమీ యాయుధంబు నిఁక చాలంగా
వల్లసుమీ పంచాక్షరి
కల్లసుమీ సతులవలపు గనుఁగొన వేమా! 1020

సంసారము పరాక్రమము మొదలగునవి యన్నియును అసత్యములు; కేవలమొకపంచాక్షరిమాత్రము సత్యము. చెలువలవలపు కేవలము కల్ల. ఇవియన్నియు నెఱింగి బ్రతుకుట శ్రేయము.

ఆ. ఇష్టసిద్ధికొఱకె యీరారుబీజముల్
కష్టమునను జపెవి కానలేరు
నిష్ఠలోన నిష్ఠ నిజమని కనవలె, వి... 1021

హృదయస్థానమున ద్వాదశదళోపేతమై ద్వాదశ బీజాక్షరములతోఁ గూడియున్న అనాహతచక్రముగలదు. చదివినవారు గూడ దీని నెఱుంగఁజాలకున్నారు. నిజముతప్పక నిలుకడగానున్నచో నీచక్రము సందర్శింపవచ్చును.

ఆ. ఇహమునందు సుఖము లీడేరఁగాలేదు
పరము నమ్మనేని బ్రదుక నగునె
మొదటలేనిసుఖము తుదినెట్లు కల్గును? వి...

ఈజన్మమున సుఖ మనుభవింపలేదు గాని పరజన్మమునందు మాత్రము కలదని ఎట్లు నమ్మవచ్చును? ఏమనియెదరా? మొదట లేనిసుఖము తర్వాత రానేరదు గదా!



ఆ. ఈఁతరానివాఁడి కెగరోజి యెగరోజి
యేరు దాఁటఁగలఁడె యీఁదఁబోయి
పరుఁడు గానివాఁడు పరలోక మందునా? వి.

సాధనచతుష్టయ పరిచితుఁడు, మోక్షరహస్యము నెఱింగిన వాఁడగు విజ్ఞుఁడు మోక్షము నొందగలఁడుగాని తదన్యుఁ డెన్నఁటికి మోక్షమునొందలేఁడు. ఈఁతరానివాఁడు నదిదాఁటనెంచి యెగరోజి దిగరోజి నానావస్థలొందునుగాని గమ్యస్థానము నెన్నఁటికైనఁ జేరఁగలఁడా?

క. ఈమాయ జగము జూడఁగఁ
బ్రేమాస్పదదృష్టిలోనఁ బెంపగుచుండున్
కామాంధకారమునఁ బడి
దీమసమునఁ దెలియలేరు దేవుని వేమా! 1024

లోకమంతయు మాయచే నావరింపఁబడియున్నది. లోకులన్యోన్యసంబంధముగలవారై పెంపొందుటకు ప్రేమ మిగులసహకారముగనున్నది. ప్రజలుకామాంధకారమున మునిఁగి వృథాగఁ బ్రేమపాశబద్ధులై కుటుంబజంజాటములలో మునిఁగి కాముకులై దేవుని గనుఁగొనలేక నశించుచున్నారు.

క. ఈలోకచిహ్నలన్నియు
మేలుగ గురుశక్తి గూడి మిన్నందినచోఁ
గాలుఁడెదుర్కొనఁ జాలఁడు
చాలును జన్మంబు లనుచుఁ జాటర వేమా! 1025

ఇహలోకపుకష్టము లన్నియును గురుమహిమమువలనమాయ

ములు కాఁగలవు. గురుశక్తివలన మోక్షపదని నొందఁజేర్చినవారికెన్నఁటికి యమునివలన భయముండఁజాలదు. అట్టియోగ్యులకుఁ బునర్జన్మములుగూడ నుండఁజాలవు.

ఆ. ఈశున కియ్యది యిసుమంత యగుసొడ్డు
బ్రహ్మలే నొసఁగితి పాడుసొడ్డు
విష్ణుదేవున కిది విపరీతముగ సొడ్డు, వి... 1026

మోహమనునది త్రిమూర్తులకును గలదు. ఇది వారిముగ్వురకును దోషమగుచున్నది. త్రిమూర్తులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులే మోహమునకు వశులైయుండ నింక సామాన్యమానవుల సంగతినిగూర్చి చెప్పవలసినదేమున్నది?

ఆ. ఈశుమీఁద భక్తి యిసుమంతయును లేక
పాశమందుఁ జిక్కి ఫలముఁ గనక
కాశియాత్రఁ బోవఁ గాలుఁ డెఱుంగఁడా? వి...

ఈశ్వరునిపై భక్తి లేక కర్మబద్ధులై సంసారపాశమునఁదగులుకొని మనుష్యజన్మమువలని ఫలమనుభవింపఁజాలక తీర్థయాత్రలవలననైన గడతేరవచ్చునని కాశికిరామేశ్వరమునకుఁ బోయిన ఫలముండదు. యముఁడు తీర్థయాత్రల సేవించినంతమాత్రమున పాపఫలముల గుడుపకమానఁడు.

ఆ. ఈషణత్రయంబు నెడపంగ నేరక
మోహవారాశిలోన మునిఁగియుండు
జనుల కెట్లు మోక్షసౌఖ్యంబు కల్గును? వి...

పెండ్లము బిడ్డలమీఁదను ద్రవ్యముమీఁదను గోరిక విడుప



లేక మోహమున వర్తించు జనులకెన్నటికి ముక్తి లభింపఁ జాలదు. మోక్షార్థి యీషణత్రయమును వదలవలయును.

ఆ. ఉచ్చచెలమ గోరి యున్నది జగ మెల్లఁ
బిచ్చిపట్టి తిరిగి పెనఁగుచుండ్రు
తుచ్ఛసుఖము దీని ద్రుంపఁగలేరయా, వి...

ప్రపంచమంతయు విషయసౌఖ్యములకు లోఁబడియున్నది. వలపుచే స్త్రీపురుషులు పిచ్చియెత్తినవారివలెఁ దిరుగుచున్నారు. సంసారసంబంధములగు నీవిషయసుఖములు తుచ్ఛములు అనుపభోగ్యములని జనులేల గ్రహింపకున్నారోగదా!

క. ఉచ్చను బుట్టిన తనువట
హెచ్చని యోఁగొంచెమేమొ యేర్పడఁ దెలియన్
మచ్చరము మాని సత్యం
బచ్చున నిల్పినను బ్రహ్మ మతఁడే వేమా! 1030

మలమూత్రములవలనఁ బుట్టినయీశరీరములలో ఉత్తమాధమము లేవి యని విచారించి సత్యమును మనస్సును నిల్పినవాఁడు బ్రహ్మముఁ గాంచును.

ఆ. ఉచ్చలోనె పుట్టి యుచ్చలోనె పెరిఁగి
యుచ్చ కాసపడుట యుచిత మగునె
యుచ్చరోయువాఁడె యుత్తమయోగిరా, వి...

మూత్రములో పుట్టి యందుననే పెరిఁగి మఱల యందులకే యాశపడుట మంచిదికాదు. కావున విషయముల వదలువాఁడుత్తముఁ డగును. వాఁడె నిజమగుయోగి.

ఆ. ఉయ్యేలందుఁ జేర్చి యూహించి నిద్రింప
నెయ్య మమర మదిని నిలిపినపుడె
చెయ్యమంత బ్రహ్మ తన్మయమందును, వి...

హృదయమును ఇంద్రియనిగ్రహమొనర్చి లోఁబరుచుకొని సమాధిలోనుండి ఆత్మోపాసన నభ్యసించి నెఱవేర్పఁ గలిగిన యెడల బ్రహ్మస్వరూపము గోచరించితీఱును.

ఆ. ఉఱుము మెఱుమురీతి నొప్పెడి మదియందు
మరులు సేరి దాని మహిమ నెరుప
నరులు మరులఁ దగిలి నరక మందెదరయా, వి.

సమాధిలో నున్నపుడు సాధకునిహృదయమున దశవిధప్రణవ నాదము లుఱుములవలె ధ్వనిచేయుచుండును. చిత్కళలు మెఱుపులవలె మెఱయుచుండును. చిత్తనిశ్చలముతోనుండి వాని యంతునెఱుంగ లేక మానవుఁడు మోహావస్థకులోనై కాంతలకు లోఁబడి తుదకు నరకమునఁ బడుచున్నాఁడు.

ఆ. ఊరు కొండవీడు మునికి పశ్చిమవీధి
మూగచింత లెల్ల మొదటియిల్లు
ఎడ్డెరెడ్డికుల మదేమని తెల్పుదు, వి... 1034

(వేమన తన విషయము నిటుచెప్పికొన్నాఁడు) నానివాసస్థలము కొండవీఁడు. గృహము పశ్చిమవీథిని గలదు. మొదట నివాసస్థలము. మూగచింతపల్లి. కులము రెడ్డికులము. నన్నుగూర్చి యింతకెక్కుడు తెలుపఁజాలను.



ఆ. ఊసరల్లి పిచ్చి యుపమున రసమును
జేర్చి నూరి సతులు చెలువముగను
వశ్య మనుచు మగని వరియించి పెట్టంగ
రోగ మమరి నీల్గు రూఢి వేమ! 1035

కొందఱు స్త్రీలు మరులుగొనితమప్రియులలోఁ బడియుండుటకై పిచ్చికుసుమరసముతో ఊసరవెల్లిని నూరిపెట్టుచుందురు దానివలన మగలుపశులగుట యటుండరోగములు పుట్టిగతించుచున్నారు. ఇదినిక్కమగుసంగతి.

ఆ. ఋషు లటడవి నుండి రుచులఁ గోరుట రోఁత
నరులు కలిగి తినమి యరయ రోఁత
భార్య లనుచు వారి భరియింపమియు రోఁత, వి.

మునులై యడవిలో వసించుచు జిహ్వాచాపల్యములకులోనగుటయు, కలిగినసంపద ననుభవింపక దాఁచుటయు, పెండ్లాడిన భార్యల భరియింపక వదలుటయు మిక్కిలిరోఁతపనులు.

ఆ. ఋత మనృత మెఱుంగ నెవ్వారితర మగు
స్థితియు గతియుఁ దెలియఁ దేటపడును
విన్నమాత్రమునను వివరింపఁగా రాదు, వి...

విన్నంత నే నిజము కల్లగ్రహించుటచాల కష్టము. స్థితిగతులు విషయము సమగ్రముగా విచారించినగాని యన్నసంగతి తెలియదు. విన్నంతమాత్రముననిదికల్ల యిదినిజ మనినిశ్చయించుట కెంతవానికి సాధ్యముగాదు.

ఆ. ఎంగి లెంతపట్టు హితవుగా నెంచక
యెగ్గియుందు రంత నుర్విజనులు
కన్న యెంగి లెంత కనునెంగి లధికమౌ, వి...

ఎంగిలి హితవుగాకపోయినను వలపుచే మైమఱచి పురుషులు స్త్రీల యెంగిలికి లోఁబడుచుందురు. క్రమముగా శిశువుదయించెనేని వలపులాడి యెంగిలికంటేఁ బుత్త్రియెంగిలినే గౌరవముగాఁ జూచుచుందురు.

ఆ. ఎగ్గుసిగ్గులేని దేకమై తోఁపఁగా
మొగ్గి చూచుటెల్ల మూలవిద్య
తగ్గి యొగ్గ కెపుడు తాఁకుట పరమురా, వి...

లజ్జాదిగుణములఁ బరిత్యజించి సాహసించి బ్రహ్మము ధ్యానించుటయే విద్య యగును. అట్టివిద్యయందు సర్వదా లీనుఁడగుటయే పరమగును. పరము సాధింపనెంచువాఁడు మానావమానములు లెక్కింపరాదు.

ఆ. ఎచ్చుకులమునొంది యెన్నాళ్లు బ్రదికినఁ
జచ్చి పుట్టు జన్మశతము లగును
మెచ్చునట్టి పూజ మెప్పుగాఁ బూనరా, వి...

ఎంతటియుత్తమవంశమున జన్మించినను జననమరణములు తప్పవు. కావున నిశ్చలచిత్తుఁడవై మోహమును వీడి ఈశ్వరుని సేవింపుము.

ఆ. ఎట్టియోగికైన నిలఁవమన్నస్థావస్థ
తెలియవచ్చునేని నిలేటఁగాను



యోగ మెల్ల నుండి జోగియై పొడగు, వి...

పరబ్రహ్మస్వరూపమును దర్శించినయోగియైనను విషయసౌఖ్యములను బ్రత్యక్షము గావించుకొని కాంతాలోలుఁడైనచో యోగమంతయు నశించిపోవును. కడకు వాఁడెందులకుఁ గాకుండ జోగియై పాడైపోవును.

ఆ. ఎట్టివాఁడొ తాన దెఱుఁగఁడు తొలిపుట్టు
నీచజీవనమున నీమమేల
యెఱుఁగుఁడయ్య లోక మీశ్వరమయ మని, వి.

తాను పూర్వజన్మమున నెట్టివాఁడో తెలియలేక ఇప్పుడు మాత్రము నియమములను పెట్టికొని నీల్గును. తాను నీచజీవనము నానావస్థల నొందుచున్నపుడు నియమములెందులకు నీలుగుటలెందులకు? కావున ప్రపంచమునంతయు నీశ్వరరూపముగా నెఱిఁగి వర్తింపుము.

ఆ. ఎంతకష్టముండు నంత పాపపుఁజింత
చింతచేత మిగులఁ జివుకు మనసు
చింత లేకయున్నఁ జెడనిసంపదఁ గాంచు, వి...

మానవునకుఁ గష్టమెక్కువయగుకొలఁది దాని నివారించుకొనుటకుఁ బాపచింత యెంతయో యెక్కువగాఁ గలుగును. చింతవలన మనస్సు చెడిపోవును. చింతలేక నిర్విచారముగా నున్నవాఁడు శాశ్వతానందపదమగు మోక్షము నొందగలఁడనుట సత్యము.

ఆ. ఎంతకాలమున్న నెఱుక లేకయె జీవి
చచ్చి పుట్టుచుండు సహజముగను
ఎఱుక మఱపు గలుగ నెఱుఁగునా బ్రహ్మము, వి.

జీవి పూర్వవాసన లేనివాఁడగుటచే జీవుఁడు చిరకాలము చచ్చుచుఁ బుట్టుచునుండును. జ్ఞానశూన్యుఁడు పూర్వవాసనాశూన్యుఁడునగు నీమానవుఁడెన్నటికిఁ బరబ్రహ్మస్వరూపమును సందర్శింపఁజాలఁడు.

ఆ. ఎంతనాఁటినుండి యెనసిన మోహమో
చెలిమిచేతఁ దల్లి చెల్లెలక్క
యన్నదమ్ము లనెడి యాభ్రాంతినే పడు, వి....

ఎంతకాలమునుండి యీమోహము పాదుకొనినదోగాని చావు దాపించినను సంసారమునందే కొట్టుకొనును. చెల్లెలని అక్కయని అన్నలని తమ్ములని యెంత కాలము భ్రాంతినొందునో యీభ్రాంతి యెప్పటికిఁ దీఱునో తోఁచకున్నది.

ఆ. ఎంతనేర్పుతోడ నేమేమి చదివినఁ
జింతలేనివిద్య చిక్కఁబోదు
పంతగించి మదిని బరికించి చూడరా, వి...

ఎంతకష్టపడి మేధ నొంది చదివినను దుఃఖమును బోగొట్టు పరమార్థజ్ఞానము వృథాపాఠకునకు లభింపఁజాలదు. ఇట్టివ్యర్థవిద్యలమాని మానవుఁడు పట్టుదలతో హృదయస్థుఁడగు పరమేశ్వరుని దర్శించి కృతార్థుఁడు కాఁ బ్రయత్నింపవలయును.



ఆ. ఎన్ని వేషములకు నెఱుకయే మూలంబు
యముని గెలువవలెను సమయ మెఱిఁగి
దొంగ వసతి గాక దొరకునా సౌఖ్యము, వి...

ఎన్ని మాయవేషములు వేసినను జ్ఞానము లేనివానికి మోక్షము లభింపఁజాలదు. జ్ఞానశూన్యుఁడు కాలానుసారముగ వర్తించి పాపకృత్యము లాచరింపక యమలోకమునఁ బడకుండుటకు యత్నింపవలయును. మోక్షము దొంగప్రేటునఁ దక్కఁ లభింపఁజాలదు.

ఆ. ఎఱిఁగి మఱిగి తిరిగి యేకాంతమును గోరి
పరుగులిడక యోగపథము పట్టి
పరము గోరి మించఁ బరిపూర్తి నెందురా, వి.

బ్రహ్మమును ధ్యానించుకాలమున మాయాధర్మములకు మోసపోక ఏకాంతస్థలమున సమాధిలోనుండి పేరాసకులోనుగాక యోగము నాశ్రయించినచో పరబ్రహ్మసాక్షాత్కారమై మోక్షము లభించును.

ఆ. ఏకచక్రధరుఁడె యెల్లలోకంబులఁ
బాక మెఱిఁగి యేలు ప్రభుఁడు గాఁడు
రాకపోక లడఁచి రాజిల్లు మదిలోన, వి...1049

సాధకుఁడా ! నీవు విష్ణుమూర్తి యొకఁడే సర్వనియంతయని భ్రమపడి విఫలుఁడవు కాకుము. మాయావృతుఁడవై వెతలొందక జ్ఞానము నార్జింపయత్నింపుము.

ఆ. ఏకసమమునందు నెఱుక గల్గినయోగి
పరుల నెఱిఁగి చూడ భావమందు
నాశలేక మించి యన్నిటఁ దానగు, వి.... 1050

యోగాభ్యాసవశమున జ్ఞాన మార్జించినయోగి తనయందు వలెనే పరులయందుఁగూడఁ బరబ్రహ్మస్వరూపమును దర్శింపఁ గలఁడు. ఇంతియేగాక పరులయందుఁ దనజ్ఞానతేజము ప్రసరింపఁజేసి యందఱియందును దాను వెలుఁగొంద సమర్థుఁడగును.

ఆ. ఏడు నైదునాలు నెనిమిది తొమ్మిది
యేమి కట్టునుండి యెట్లు తిరుగు
వాడి వాడి నంత వాడద దేమొకో, వి...1051

మాయావృతమై యీచంచల భావముపంచకోశములయందు షట్చమాధులయందు సప్తాజ్ఞాన భూమికలందు అష్టపాశములందు, తాపత్రయము అరిషడ్వర్గమును నవవైరివర్గమునందుఁ దిరిగి తిరిగియలసియున్నను చాంచల్యము మాని కృశింపకున్నదే! ఎంతచిత్రము.

తే. ఏదికోరిన నీకోర్కి యెఱుకయగును
ఏది కోరిక నిండెనో యిరవు నగును
సాధువిద్యకు ధరలోన సమము లేదు
కోవిదుల కిది దెలిసిన గుఱుతు వేమ! 105

నీమనస్సునకు సంతుష్టి నిచ్చునదియును కోర్కెలపూరించునదియు శాంతరూప మగుజ్ఞానమే సాధువిద్యయగు తపస్సునకు



మించిన విద్యలేదు. ఈవిషయము జ్ఞానవంతులందఱు నెఱింగినదేసుమా!

ఆ. ఒడలిమెఱుఁగుఁ జూచి నడసొబగును జూచి
వంకకొప్పుఁ జూచి వనితఁ జూచి
విటులు కడుపులోన వెత నొందకుందురా, వి.

చెలువల మేని నిగనిగలు నడలబెడఁగు ఓరకొప్పుఁజూచి విటులు మోహాంధులై వర్తించుచున్నారు! కాముకులు స్త్రీరూపమును జూచినచో మోహమును జంపుకొనఁజాలరనుట నిక్కపము.

ఆ. కడుపులోన నున్న ఘనమైనపిండంబు
ముందు కష్టమెల్ల మొదలరోసె
నింక నైనబుద్ధి యేర్పడఁ బుట్టదా,వి... 1054

మాతృగర్భమున జీవుఁడు పిండాకారముగ నున్నపుడునానావస్థ లొంది జననమరణరూపమగు నీయాతన లేలయని విరక్తి నొందును. జనించినపిమ్మట మాయావృతుఁడై పూర్వవిషయముల మఱచి విఱ్ఱవీఁగసాగును. ఈజీవునకు సద్బుద్ధియెటులఁగలుగునోగదా!

ఆ. కల్మషంబు సోఁకఁ గనుపింప దెందును
రూప మెవ్వరికిని రూఢితోడ
దామసం బుడిగినఁ దగఁ గల్గు జ్ఞానంబు, వి...

మానవుఁడు తానుదుష్కృత్యములఁ జేసి పాపము నార్జించితినని కనుగొనుటకుఁదగిన బాహ్యరూపము లేవియులేవు. కాన

తమోగుణము మాని శాంతముగా నున్నచో పాపమంట నేరదు. పిమ్మట జ్ఞానము కలుగును.

ఆ. కాంత కుంక యైనఁ గానికులం బైన
పాయలేక విటుఁడు భ్రమసియుండు
మరిగి గ్రుడ్డికుక్క మాంసంబు గొన్నట్లు, వి...

విటుఁడు పరకాంతను గులశీలములు విచారింపక వలచి వదలక వెంటనంటి తిరుగుచుండును. దానివలన రానున్న ముప్పు నూహింపఁడు. ఇది తేఱఁగఁ జిక్కినదని గ్రుడ్డికుక్క మాంసమున కలవాటుపడి చిక్కులొందుటతో సమానము.

ఆ. కాంతసిందురంబు కడుఁ బిత్తరోగికి
నొసఁగ మధువుతోడ నొసఁగినంతఁ
దనరు దేహబలిమి ధన్యుఁడై గట్టెక్కు, వి...

పైత్యరోగి అయస్కాంతసిందూరముతోఁ దేనెగలిపియిచ్చినయెడల పైత్యవ్యాధి తొలంగుటయే కాక దేహబల మభివృద్ధి నొందును. వాఁడు రోగనిర్ముక్తుఁడై సౌఖ్యముగాఁ జీవింపఁ గలుగును.

ఆ. కామచింతఁ జిక్కి కనుగాన నేరవు
నీమనిష్ఠఁ దగిలి నియతి మీఱి
తామసంబు నడఁచి తన్మయ మందరా, వి...

కామముపై కోర్కెతో కన్నుగానక తిరుగకుము. లోని యజ్ఞానమును పోఁగొట్టికొని నియమముతో మెలఁగుచు నిష్ఠా



గరిష్ఠుఁడై వర్తింపుము. పరమార్థవిరోధియగు తామసమును విడనాడి మోక్షము నొందుటకై యత్నింపుము.

ఆ. కాయమును గనకయుఁ గనియు నావల నున్న
కాయమును విడచినఁ గాఁడు యోగి
కాయమందు ముక్తిగతి కేఁగవలయురా, వి...

పాంచభౌతికమగు నీదేహమును జూచియుచూడనటులఁ దిరస్కరించి పునర్జన్మము రాకుంటకై ప్రయత్నించువాఁడె నిజమగుయోగి. దేహమున్నపుడె ముక్తి సాధింపవలయును గాన మానవుఁ డిందులకుఁ గృషిసల్పనగును.

ఆ. కాయ మున్నయప్డె కామాదులను గోసి
జ్ఞానమార్గమునకుఁ గడఁగవలయు
జాగు చేయఁ గాయ మేఁగిన నేమగు? వి...

దేహము ఆరోగ్యవంతమై నీస్వాధీనమునందున్నపుడె కామాదివికారములను వర్జించి జ్ఞానము సంపాదించుటకుఁ బ్రయత్నమెక్కువగాఁ జేయవలయును. ఎపుడో జ్ఞానమార్జింప నగునను కొందువేని యంతలోఁ జావు తటస్థింపవచ్చును. అపుడేమి చేయఁ గలవు?

ఆ. కాలు చేయి వంచి గాలి నిండఁగఁ జేర్చి
నేల వ్రాలి కొన్ని నిలిచి కొన్ని
యాసనముఖవిద్య లభ్యాసవిద్యలు, వి... 1061

కరచరణాదులను జిత్రచిత్రముగా వంచి వాయువుఁ గుంభించి నేల పైవ్రాలి గాలిలోనిలచి చేయు ఆసనవిద్యలు యోగములన్ని

యు మోక్షసాధనములు కాఁజాలవు. ఇవియన్నియుఁ గేవలాభ్యాసపాటవమువలన లభ్యములైనవి.

ఆ. కావుకావు మనుచుఁ గాళ్లుండి పలికెడి
కాకికరణిఁ బల్కి కానరారు
బాపలైనవారు బ్రహ్మము నెఱుఁగరు, వి... 1062

కాకికాళ్లు గలిగియుఁ గావు కావుమని (రక్షింపుము రక్షింపుమని) పలుకుచుండును. అటులె బ్రాహ్మణులును అర్థము నెఱుంగక వేదమును బఠించుచుందురు. అట్టివృథాపఠనజడులు బ్రహ్మస్వరూపముఁ గాంచఁజాలరు.

ఆ. కులము హెచ్చుతగ్గు గొడవలు పనిలేదు
సానుజాత మయ్యె సకలకులము
హెచ్చుతగ్గుమాట లెట్లెఱుంగఁగ వచ్చు, వి...

జాతియొక్క హెచ్చుతగ్గుల నెంచ నవసరమేమి? సమస్తమును ఒక్కటియే యైనప్పుడు అట్లెంచినను హెచ్చుతగ్గుల నెట్లు తెలిసికొనవచ్చును. జాతులన్నియు నొకదానివెంట నొకటి జనించినవి కావున భేదవిచార మనవసరము.

ఆ. కూడు గుడిచి లెస్సఁ గూర్చున్నవాఁడైన
నాఁడుదానిఁ గన్న నట్టె తగులు
నన్నసార మొదలి కతిమదం బిడునురా, వి...

కడుపునిండఁ దృప్తిగా నాహారము దినికూర్చున్నవానికి ఆఁడుదానినిఁ జూచినంతనే యెక్కుడలేని కామవికారము కలుగును. ఇదియంతయు భోజనమువలనఁ గలుగువికారమే. అన్న



రసము దేహమున కింతయనరాని మదము కలుగఁజేయును గావున ఆహారవర్జనముఁ జేసినగాని కామమును జయింపవీలుండదు.

ఆ. కూడుఁ బెట్టకున్నఁ గుక్షిలో జఠరాగ్ని
భక్షణంబు సేయు కుక్షిమలము
కూడు విడిచి మలము గుడుచురా యుపవాసి! వి.

ఆహారము లేకున్నచో జఠరాగ్ని మలభక్షణముఁ జేయుచుండును. కావున నుపవాసము లొనర్పకుము. ఉపవాసవ్రతమును నిర్వహింతువేని జఠరాగ్ని కన్నమునకు మాఱుగ నశుద్ధముఁ బెట్టినవాఁడవగుదువు. అందుచే నుపవాసవ్రతఫలము దక్కకపోఁగాఁ బాపము కలుగును.

ఆ. కొమ్మ ద్రిమ్మరైనఁ ద్రిమ్మరుల వలచు
సరస విటుల నేల సమ్మతించుఁ
బేడఁ దిన్న పురుగు బెల్లమే మెఱుఁగును? వి...

పేడయే యాహారముగాఁ దిను పేడపురుగు బెల్లమురుచి గ్రహింపఁ జాలనియట్లు త్రిమ్మరియైన పడఁతి విటులకొఱకు వెదకుచునుండునేని పాతివ్రత్యమువలనఁ లభించు మోక్షఫలమునైనను భర్తృసుఖమునైనను గమనింపఁజాలదు.

ఆ. కొండెగాఁడు చావఁ గొంతదనుకఁ బోవు
వంతు కింతెగాని పగపు లేదు
కొంకినక్క చావ గొఱ్ఱెయేమిటికేడ్చు, వి...

కొండెగాఁడగు దుష్టుఁడు మరణించిన [illegible]

పరు. వానితో నేఁగఁ బ్రయత్నింపరు. ఎట్టులనఁగా: నక్కచచ్చినచో గొఱ్ఱెలు దుఃఖము నొందవుగదా!

ఆ. ఖచరవరులు భూమిఁ గనఁబడ కుందురు
కానవచ్చినంత గౌరవింత్రొ?
తల్లిదండ్రిగురులు తత్సముల్ గారొకో! వి...

దేవతలు భూలోకవాసులకుఁ గానరారు కానరా రనియాందోళింతురుగాని మానవులు దేవతలఁజూచిన గౌరవింతురా? అటుల గౌరవింపనెంచినచో దేవతలతో సమానులగు తల్లి దండ్రులు లేరా! వారిని గౌరవించిన దేవతలను గౌరవించినటు లగును గదా!

ఆ. ఖనులఁ బుట్టు లోహగణమునం దెల్లెడఁ
బనికివచ్చు నొక్కయినుమె చాలు
నైనఁ జులుకపఱతు రది యెచ్చుగా నుంట, వి...

గనులలోఁ బుట్టుసమస్తలోహములలో మిగులనుపయుక్తమైనది యినుము. అన్నింటికి యినుము నేయుపయోగింపవచ్చునుగాని విశేషముగానుండుటచే దీనినిజులకనగాఁదలంచి ఫలము గ్రహింపలేకున్నారు.

ఆ. గట్టుమీఁది మన్ను చట్టుపైఁ దగురాయి
పుట్టలోనివాని బుడుగుతొడుగు
గట్టిగాను మాటఁ గనకంబు పుట్టును, వి... 1070

గట్టులమీఁదిమన్ను గుట్టలలోనిఱాలు పాముకుబుసము



వీనినుండి బంగారమును దప్పక సాధింపవచ్చును. ఈస్వర్ణయోగము తెలిసికొన్న దరిద్రముండదు.

ఆ. గద్దె గణము నిద్ర కలలు కోరికలును
ముద మొసంగు శకునములును జెలఁగు
ప్రశ్నలు పదివేలు పరికించి చూడఁగా
నౌను గాక పోను నౌను వేమ!

గద్దెతో సోదెసెప్పుట గణాచారులున్నవి లేనివి చెప్పుట, శకునములు, ప్రశ్నలు చెప్పుట, కలలు, కోరుకొనుటలు అనునివి ఒకప్పుడు నిజముగ జరుగును. మఱియొకప్పుడు జరుగక పోవును గావున వీనిపై విశ్వాసముంచుట నిరుపయోగము.

ఆ. గాసిఁ జెందనేల గతికామమును మించి
వాసిగాను భక్తి వరుసఁ దెలిసి
మోసపోక యెఱుక ముగియుట కానరో! వి...

వృథాశ్రమపడుటయేల? కామమును వర్జించి భక్తియోగమును గుర్తెఱింగి మోసములకు లోనుగాక జ్ఞానివై కడతేఱుటకుఁ బ్రయత్నించుము.

ఆ. గుఱికి రావు జగతిఁ గోమటినిష్ఠలు
లోభితనముచేత లోని కడఁగుఁ
బులియు దాసరి కిడుపాలుపగు చందమౌ, వి...

కేవలలోభమును బాటించి కోమటినిష్ఠలతో నుండువేని ఫలమిసుమంతయును లభింపనేరదు. పెద్దపులి దాసరికి నర్చన చేయనెంచి వానిని దినినటుల లోభత్వముతోఁగూడిన నిష్ఠలు నిన్ను తుదముట్టింపవని గ్రహింపుము.

ఆ. గొప్పపిఱుఁదు గన్నఁ గుచకుంభములు గన్నఁ
జెప్పరానిచోటి చెలువు గన్న
ముప్పురిగొనునయ్య మొనసిన మోహము, వి...

స్త్రీలయాకార విశేషమెంత వారికైన వలపు గలిగించును. చెలువల ప్రేగు పిఱుందులు వలుదచనులు మరునింటి సోయగము లోనగునవి చూడఁగనే పాపుమోహ మెచ్చట నుండునో గాని వచ్చి చుట్టుకొనును.

ఆ. గోఁచిపాతఁ బెట్టి కోరి తా ముని నంచు
మనసులోనియాశ మానలేఁడు
ఆకృతెన్న వేఱఁ కాశ యెన్నఁగ వేఱు, వి...

కొందఱు చంచలహృదయులు గోఁచిదాల్చి మేము మునులమని విఱ్ఱవీగుచుందురు గాని లోనియాశల మొదలంటఁ గోయలేరు. ఆకృతియో మునిస్వరూపము. ఆశలో సంసారులకుఁ దగినవి. వీర లుభయభ్రష్టులనుట నిక్కువము.

ఆ. గోఁచి విడుచుయోగిఁ గోఁతిగా నాడించి
వెఱ్ఱివానిఁ జేసి వెతలఁ జిక్కఁ
జేయునయ్య లేమి చేసెదరో రేల? వి... 1076

అజ్ఞులు సర్వసంగపరిత్యాగులై దిగంబరియగునతనిని మహాయోగిగా భావింపఁజాలక పిచ్చివానిగాఁ దలంచి కోఁతినాడించి నటు లాడింతురు. వీరు రాత్రులందుఁ జేయు దుశ్చర్యలుతప్పక గమనింపఁ దగినవి.



ఆ. గృహము దేహ మొండె కేవలగుణ మొండె
దాని నిలిపికొనియు దీని దీర్పఁ
గానరాదె నీకు నానందసుఖమది, వి... 1077

దేహము గృహము వంటిది. ఈదేహగృహవాసునకు సాధనములుగఁ ద్రిగుణములు (సత్వరజస్తమస్సులు) గలవు. దేహధారణముగావించి గుణవికారములను గూలఁద్రోయఁ గలుగుదువేని యానందస్వరూపమగు స్వర్గము లభించును.

ఆ. ఘటము గానుగఁ జేసి ఘనగుణ మెద్దుగా
దవిలి కర్మములను నువులఁ జేసి
తెలిసిగానుగాఁడు దిలకారకాత్మము, వి... 1078

సాధకుఁడా! నీశరీరమును గానుగుగాఁ జేసి దుర్గుణములను నెద్దుగా నొనరించి కర్మము లనునువ్వులను గానుగాడుము. అపుడు నీవు తిలకారకుఁడవై మోక్షమను తైలము నార్జించి కృతార్థుఁడవయ్యెదవు.

ఆ. చిత్తము గలయోగి శివునివలెనె యుండు
మిథ్యయోగి యుండు మిడుతవలెను
నిత్యుఁడైనయోగి నీవలె నుండును, వి... 1079

జ్ఞానియగు యోగి యైహికములకంటక శివునివలె సర్వజనవందనీయుఁడై వర్తించును. మాయయోగి మిడుతవలె నెగిరిపడుచుండును. నిశ్చలుఁడగు యోగి హృదయమందలి బ్రహ్మస్వరూపమువలె నిలుకడగా నుండును.

ఆ. చింతఁ జెంతనుండు చేమంతిపూబంతిఁ
గాంతఁ జూడఁ దలఁచు గౌఁగిలింప
నంతమంతనమున నానందకేళికా, వి... 1080

చింతలకాస్పదమై బయటికిఁ జేమంతి పూబంతివలెనున్న కాంతనుజూచి విటుఁడు కౌఁగిలించుటకు ఏకాంతమునఁ గాముకేళిదేలుటకుఁ బ్రయత్నించుచు నుండునుగాని జ్ఞాన మార్గింపఁడు.

ఆ. చీఁకటింటఁ జేరఁ జేదివ్వె లేకయే
రాక గానరాదు రూఢిగాను
రాకపోక లడఁచి రవములో విని పొక్కు, వి...

చీఁకటింటిలో దీపము లేనిది వస్తువు కనఁబడనట్టులు గురూపదేశము లేక పరమాత్మ కన్పింపదు. అజ్ఞానభూమికల రాకపోకలడఁగించి ప్రణవనాదమునువిని యానందించినచో ముక్తి చేకూరును.

ఆ. చెలిమి మీఱ మదిని జింతలు విడనాడఁ
జిన్నపెద్దలకును వెఱఁగిపచ్చు
మంటిమింటినడుమ మదినిల్పి చూడుము, వి...

ఇతరులతోఁగల కర్మసంబంధమును దిగఁద్రావి చింతల విడువలయును. పిమ్మట భూమ్యాకాశముల మధ్యనున్న జ్యోతిస్స్వరూపముపై హృదయమునిల్పి తదేకబుద్ధితో వర్తించెదవేని క్రమముగా నీశ్వర సాక్షాత్కారము నొందఁగలుగుదువు.



ఆ. చచ్చెఁ జచ్చె ననుచుఁ జా వెంచి వగచెడు
దీన నరుల వెఱ్ఱి దెలుపరాదు
ప్రాణమునకు మృత్యుబంధము లుండునా? వి...

అజ్ఞులు తమవారెవరైన గతించినయెడల నూరక యేడ్చుచుందురు. ఇంతకంటె వేఱు వెఱ్ఱిగలదా? ప్రాణమునకుఁ జావులేదు. గతించినది దేహమేయని వారు వివేకశూన్యులై తలంపలేరు.

ఆ. చమురు రాచికొన్నఁ జర్మంబు మెఱుఁగెక్కు
సాము చేయ మేను సత్తువెక్కు
జ్ఞానమార్గ మెఱుఁగ కడ తేరు జన్మంబు, వి...

చమురు రాసికొన్న మేను మెఱుఁగెక్కినట్లు గరిడి చేసిన కొలంది మేనికి సత్తువ వచ్చినటులు జ్ఞానమార్గము నెఱింగిన యెడల జీవునకు జన్మము కడతేఱును.

ఆ. చాడికానిమాట చావిడిలో నిక్కు
వేఁట బో శునకము వెలయ నిక్కు
వెలఁదిఁ జూచునపుడు విటకాఁడు నిక్కురా, వి.

కొండెకానిమాట రాచకొలువులోనే పనికి వచ్చును. వేఁట సమయముననే కుక్క తెగ నీలుగును. విటుఁడు పరకాంతను గాంచినపుడె కామోద్రేకముచే నిక్కినీలుగుచుండును.

ఆ. చాలు చాలు నిలను జననమరణములు
మేలుగావు మాయ మెలకు వెఱఁగి
ప్రాలుమాల కిలను భక్తిచేఁ బూనుము, వి...

అవస్థారూపములగు నీజననమరణములు జీవుని కష్టపెట్టునవె గాని వేఱుగాదు. ఇవియన్నియు మాయవలననే జనించుచున్నవి. కావున భక్తియోగము నవలంబింతువేని మాయావరణము దాఁటి సుఖము నొందఁగలవు.

ఆ. ఛిద్ర మెన్నువాఁడు శిష్యుఁడు తా నౌనె?
ఛిద్ర మెఱుఁగువాఁడు శిష్యుఁ డగును
ఛిద్ర మెఱిఁగి విడువ భద్రంబు చేకుఱు, వి...

ఒరుల తప్పుపట్టువాఁడు శిష్యుఁడు కాఁడు గాని తనతప్పు నెఱుఁగువాఁడే నిజమగు శిష్యుఁడగును. మోక్షమనునది తన తప్పుఁ దానెఱింగి సవరించుకొనువానికి లభించును.

ఆ. ఛేద్యమైనదానిఁ జేపట్టినాఁ డని
మూలవస్తు వెట్టు కేలఁ బట్టు
దాని నూనఁ గలుగు దార్ఢ్యము లేకున్న, వి...

సర్వవిధముల ఛేదింపఁదగిన దగు నవిద్యను జేపట్టినవానికెన్నఁటికిని మూలవస్తువగు జ్ఞానము లభింపఁజాలదు. జ్ఞానము నార్జింపవలయునన్నచో తగుచిత్తనిశ్చలము ముఖ్యముగాఁ గావలయును.

క. జగ మతయు నింద్రజాలము
జగ మనఁగా మాయ సుమ్ము జన్మాదులకున్
భగవంతుఁ డగును బ్రహ్మము
నిగమాగమనిర్వికారనిపుణుఁడు వేమా! 1089



ఈలోకమంతయు గారడివలె నింద్రజాలమువలె మాయావృతమైనది. జన్మజన్మలకును ఈమాయావరణ మిటులె యుండును. నిగమవేద్యుఁడగు భగవంతుఁ డొకఁడే భుక్తిముక్తి ప్రదాతయగు బ్రహ్మస్వరూపుఁడని యెఱుంగ నగును.

ఆ. జంతురాసులందు జనియించి జనియించి
దిమ్మపట్టినట్టు తిరిగి తిరిగి
తనువు నిత్య మంచుఁ దలఁపంగ నవ్వరో, వి...

జంతురాశియందు దూఱక జన్మ మెత్తియెత్తి దిమ్మతిరిగి యున్న యీమానవుఁడు తనువు నిత్యము తాను నిత్యమని ప్రేలినచో నది నవ్వులబాటు గాకపోవునా?

ఆ. జనన మెట్టు కలిగె జాతి యెయ్యది యయ్యె
జననమరణములకు జాడ లెఱుఁగ
వినఁగ వినఁగ దీని వివరించికానరో, వి...1091

జీవునకు జనన మెటులఁ గలిగెనో ఎన్నిజాతు లిదివఱ కెత్తి యుండెనో జనన మరణములకుఁ గారణము లెవ్వియో అజ్ఞానులగు మానవులు వివరముగాఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నము చేయుటేలేదు.

ఆ. జాతిభేద మెంచి జన్మము ద్దెలియక
ముక్తి గానలేరు మూర్ఖజనులు
జాతు లెంచనేల జన్మంబు తెలియుము, వి...1092

అవివేకులగు నరులు కేవల జాతిభేదములు పాటించి మానవ జన్మమునకుఁగల సమత్వము గ్రహింపఁజాలక మోక్షమును బడ

యేఁజాలకున్నారు. జాతులను విచారింపక వివేకి మానవజాతిని జన్మమును బట్టి సమభావముతోఁ జూడవలయును.

ఆ. జాతసూతకములు సత్యమైయుండంగ
నంటినంత నెట్లు లంటుకలుగు ?
వితము గానలేరు వెలయంగ జీవులు, వి...1093

జననమరణములు నిత్యము లగుటచేత జీవుఁడు నిత్యము పురుడుతో (సూతకముతో)నే యుండును. ఈసంగతి గ్రహింపలేక యవివేకులు తాఁకినచో మైలపడుదుమని పలుకుచుందురు. ఇంతకంటె అవివేకముగలదా?

ఆ. జీవ ముండుచోటు స్థిరముగాఁ దెలియక
తిరుగు నస్థిరమగుదేహమందుఁ
దిరుగనేల యనుచు దెలియలేఁ డజ్ఞాని, వి....

పాంచభౌతికమగు నీదేహములో బ్రహ్మస్వరూపుఁడగు జీవుఁ డెచటనున్నాఁడో తెలియక మూర్ఖుఁడూఱక పరిభ్రమించుచున్నాఁడు. ఈపరిభ్రమణము వృథాయని యజ్ఞానియెంతకు నెఱుంగలేకున్నాఁడు.

క. జీవంబగు జీవేశుఁడు
జీవుని కొకయిల్లు చూపఁ జింతల దొంతై
కావరమున గర్వించుచు
భావములో శివుని మఱచి భ్రమగొను వేమా!

జీవేశ్వరుఁడు తననాశ్రయించియున్న జీవునకు ఒకానొక యిల్లు (దేహమును) నివసించుటకుఁ జూపఁగా నాజీవుఁడా



యింటిని జూచి మురిసి చింత లొందుచు గర్వించుచు మనస్సులోఁ బరమేశ్వరుని మఱచి సంసారములో మునిఁగి తేలుచుఁ బూర్వజ్ఞానమును గోలుపోవును.

ఆ. జీవ మేడనుండు భావ మెక్కడనుండు
కాపురంబు లేదఁ గదిసియుండుఁ
దనరుచున్న రెంటిస్థల మేల తెలియరు? వి...

జీవమును భావమును ఈభౌతికదేహమునం దిమిడియున్నది. ఈరెండు మానవశరీరమున నేయేస్థానములతో సంబంధించియున్నది సామాన్యమానవు లేటికో తెలిసికొనఁ జాలకయున్నారు గదా!

క. జీవాత్మఁ డెప్పు డుండెడి
తావును దాఁ దెలియలేక తగ నస్థిరముల్
భావమున నమ్మి తిరిగెడి
జీవికి ధర ముక్తి గలుగఁ జెల్లునె వేమా! 1097

జీవాత్మఁ డున్నస్థలమును తెలిసికొనఁజాలక అస్థిరపదార్థములను దైవస్వరూపముగా భావించి తిరుగుచుండు జీవులకు మోక్షమెన్నఁటికిని గలుగఁజాలదు.

ఆ. జీవి జీవి జంప శివుని జంపుటె యగు
జీవుఁ డరసి తెలియ శివుఁడె కాదె
భావమందు వేగ పరికించిచూడుము, వి...

ఒకజీవి వేఱొకజీవిని జంపినచో దేవుని చంపినట్లేయగును.

ఏలయనఁగా : దేవుఁడు సర్వాంతర్యామియై యుండును గదా! అందువలన నెదటి జీవునిజంపుట దేవుని జంపుటతో సమము.

ఆ. జీవుఁ డిలను నిండి సృష్టిలో నుండంగ
శివుని వెదకఁబోవు జీవుఁ డహహా!
జీవుఁడు శివుఁడను చిహ్నంబుఁ దెలియక, వి...

జీవుఁడే శివుఁడు శివుఁడే జీవుఁడు. జీవస్వరూపుఁడగు శివుఁడు సృష్టియందంతటను నిండియుండ మందమతి శివుఁడెచట నున్నాఁడా యని వెదకుచున్నాఁడు. జీవుఁడే శివుఁడను గుర్తెఱుఁగక జనులిటుల మోసపోవుచున్నారు.

ఆ. జల్లిమాట లనుచు జగమునఁ దిరిగెడు
కల్లగురుఁడు కట్టు నెల్లకర్మ
పల్లు పురుగు సేరి పలవింపఁ జేయదా? వి...

నోటికివచ్చినటుల నజ్ఞానముగాభాషించు నవివేకులగు గురువులు దేశద్రిమ్మరులై శిష్యులకుఁ గర్మల నంటగట్టుచుందురు. పల్లుపురు గేడిపించినటుల శిష్యుల నీగురువులు నానావస్థలపాలు గావించుచున్నారు.

ఆ. జాణలైనయట్టి చపలాయతాక్షుల
వలపు లరసి చూచి భ్రమయ నేల?
బయలిరూపు లెల్ల పరికింపఁగా నేల? వి... 1101

నేర్పరులగు నెలఁత లెదటిపురుషుని మరులుకొలుపుటకుఁ జేయుదుండగములను జూచియు వాండ్ర దేహ సౌందర్యము గాంచియుఁ గామవికారములకు లోనుగాకుము.



ఆ. జ్ఞానభావపరముఁ గనుఁగొనకున్నను
మానరాదు మనసు మమతఁ దగిలి
పూని జన్మములను బొందు తా పుడమిని, వి...

మనుజుఁడు జ్ఞానమార్గమును కనుఁగొని దాని నవలంబింపనంతవఱకును ఆశాపీడితుఁడై కోర్కె నాపుకొనలేక చూచిన దానినెలఁ గోరుచు నాయాఫలముల కొఱకుఁ బెక్కుజన్మము లెత్తుచుండును.

ఆ. తనదు నాత్మయందు దైవంబు గలుగఁగ
తీర్థయాత్రల కిల తిరుగునరుఁడు
గంధపుఁదునకల గాడ్దె మోసినయట్లు, వి...

తనయాత్మలోనే దైవ ముండఁగా తీర్థయాత్రకుఁ దిరుగుటకు యత్నించునరుఁడు గంధపుఁ గట్టెలను మోయుగాడిదవలె విఫల ప్రయత్నుఁడగును గాని కృతార్థుఁడు కానేరఁడు.

ఆ. తనదులోని జీవతత్త్వము తెలియక
వేఱటంచుఁ దలఁచి వెదకు టెల్ల
భాను నరయ దివ్వె పట్టినరీతిరా, వి... 1104

తనలోని తత్త్వమును గమనింపనేఱక ప్రపంచములో నెటనో బ్రహ్మము కలదని వెదకుట సూర్యుని వెదకుటకు దివిటీపట్టుటవంటిది.

ఆ. తనువు నడవిఁ జేసి తనలోనె కూర్చుండి
తపము చేయలేని తపసులెల్ల
నడవియందుఁ జేరి యలజడి పడెదరు, వి... 1105

తపస్సు చేయుట కెచ్చటికిఁ బోక శరీరమునే యడవిని జేసి తపముఁ జేసిన దైవ మగువాఁడును. అడవులకేగి తపస్సు చేసికొను టలు కేవలము శ్రమాస్పదములె గాని వేఱుగాదు.

ఆ. తన్ను దెలియకున్నఁ దగ వేదములు వెఱ్ఱి
సర్వసంపదల ముసాబు వెఱ్ఱి
ఆరుశాస్త్రములు నికాపురాణములును
జబ్బు లనుచు జగతిఁ జాటు వేమ! 1106

ఆత్మజ్ఞానములేనివాఁడు పఠించిన వేదము, వానియైశ్వర్యము, వానిపురాణ శాస్త్రవిజ్ఞానము నిష్ఫలములు, ఉపయోగ రహిత ములని, వేమనమహాయోగి చాటి చెప్పుచున్నాఁడు.

ఆ. తన్నుఁ దెలియునట్టి దైవజ్ఞు లెన్నంగ
నిన్ను దెలియరేని నిలువ రైరి
మాయఁ దెలియకున్న మంటిపాలైరయా, వి.

దైవజ్ఞులమని చెప్పుకొను నీజోస్యులందఱు తన్నుతా గ్రహింపఁ జాలనియాత్మజ్ఞానశూన్యులు. ఈశ్వరకల్పితముగ నున్న మాయాస్వరూపమును గమనింపనేరక కడకువీరు నశించుచున్నా రనుట ధ్రువము.

ఆ. తమకు సాటియంధ్రు దైవజ్ఞులగునరుల్
పరగ గూఢభావ మెఱుఁగ లేక
ఇట్లు మాయఁబడిన నెటు తెలియును మాయ? వి.

కర్మానుభవమువలనఁ గలుగుకష్టసుఖములను గుర్తింపలేక దైవజ్ఞులు తమకు ఆగతానాగతవిషయములు సమగ్రముగాఁ



తెలియునని రిత్తగాఁ బలుకుచుందురు. మాయాస్వరూపమెన్నఁటికి గోచరింపదుగదా!

క. తమమునఁ జచ్చిన మనుజుఁడు
మమతను దాఁ బుట్టుచుండు మరణముకొఱకే
శ్రమ దీర్చు గురుని వేఁడిన
"భ్రమమూల మిదంజగత్తు" బయలగు వేమా!

మానవుఁ డజ్ఞానియై చిరకాలము యుక్తాయుక్త జ్ఞానశూన్యుఁ డైవర్తించి కామాదులను విడువక మరలమరలఁ బుట్టుచుఁ జచ్చుచు సంసారమునఁ బడి కొట్టుకొను చుండును. జ్ఞానశాలియగు గురు నాశ్రయించినచో ప్రపంచమంతయు భ్రాంతిమూలకమని దెలిసి యజ్ఞానమును నశింపఁ జేయును.

ఆ. తరుణి సొగసుకాని తనయునిఁ గన్నను
మరునికళల మించి మనసు పాఱుఁ
బాపజాతిమనముఁ బట్టంగ రాదయా, వి...

ఆఁడుదానికి తనకుమారుడైనను చక్కనివానిఁ బొడఁగని నచో మోహము పుట్టును. వావివరుసలనేని పాటింపనీని పాపపుమనస్సును బంధించుట సామాన్యకార్యము కాదుగదా!

ఆ. తలను వ్రేలవేసి తాలి మించుక లేక
యోగి తెలుచుఁ గన్ను మూఁగ యగుచు
జ్ఞాన మది యెటౌను గష్టపు దేహమా, వి...

మనస్సు నిలుకడలేని యోగులు బాహ్యాడంబరముకొఱకుఁ దలవ్రాల్చి మూఁగవానివలె బలుకకుండఁ గనులతో నెటులోఁ

జూచుచుండును. జ్ఞానమెటులఁ బోయినను దేహముతో నానావస్థల నొందుచున్నాఁడు.

ఆ. తలఁపుచేతఁ గల్గు తారకబ్రహ్మంబు
తలఁచి చూడఁ దానె తత్త్వమగును
తలఁపులోనితలఁపు తానె తన్నెఱిఁగిన, వి...

తలంపుఁ జలింపనీయకుండ నిలిపి తారకయోగమును అనుష్ఠించినచో తానే (జీవుఁడె) తత్త్వస్వరూపుఁడని బోధపడును. తానే యీశ్వరుఁడని తెలిసికొనినఁ జాలును. సంకల్పము ఫలించును.

ఆ. తలఁపుఁ దలఁపఁ గూలి తగ సేయ కీయఁడు
వలపు దీఱ నీయగలుగురూక
ముక్తినీనిగురుఁడు ముచ్చులకొడుకయా, వి.

చాకిరిచేయనిది యజమాని కూలియీయఁడు. వలపుఁ దీర్పనిది విటుఁడు జారకాంతకు రూకనొసంగఁడు. మననముఁ జేయనిచో గురు వనుగ్రహింపఁడు. మననముఁ జేసినను ముక్తిఁ దెలుపని గురుఁడు దొంగయే యగును.

ఆ. తలఁపునందు శివునిఁ దలపోయఁగా లేక
తలఁప దెల్ల బయటి తలఁపుఁ జేసి
తలఁపు తానయైనఁ దత్త్వజ్ఞుఁ డగుసుమీ, వి.

తలంపును నిలిపి యీశ్వరుని ధ్యానము చేయఁజాలక వాంఛలన్నియు బహిరంగ ప్రపంచమునందుఁ బర్యాప్తముఁ గావించు చంచలున కెన్నఁటికి ముక్తి లభింపఁజాలదు. భావమునం దాత్మ



స్వరూపుఁడగు పరమాత్మని దర్శించువాఁడె తత్త్వజ్ఞాని యనఁబడును.

ఆ. తలఁపులోనితలఁపుఁ దలపోసి తెలియరా
తలఁపు లెల్ల విడిచి తగినభంగి
తలఁపులోనితలఁపె తత్త్వంబు నాత్మరా, వి.

తలంపులోనితలంపును నిరంతరధ్యానముచేఁ దెలిసికొనినచో నయ్యదియె యాత్మతత్త్వమగును. కాన నితరతలంపులు విడచి యందులకు యత్నింపుము.

ఆ. తల్లిగర్భమందుఁ దాఁ బుట్టినప్పుడు
మొదలఁ బట్టలేదు తుదకు లేదు
నడుమఁ బట్ట గట్ట నగుబాటుగాదొకో? వి. 1116

జీవుఁడు మాతృగర్భమునుండి వెలుపలకు వచ్చునపుడు వస్త్రధారియైవచ్చుటలేదు. గతించినపిమ్మట శవమునకుఁగూడ వస్త్రము లుంచుటలేదు. నడుమకాలమున బ్రతికిన నాల్గునాళ్లుబట్ట గట్టుకొనుట లజ్జాకరముగావున యోగులగువారు వస్త్రధారణము మానదగును.

ఆ. తల్లిదండ్రి గలరు తగజన్మజన్మలఁ
దనకుఁ దెల్పువానిఁ గనఁగలేరు
నాదమే పరమని నమ్మినవానికి
నిహమునందుఁ బరము నెసఁగు వేమ! 1117

జన్మజన్మలయందు నీకుఁ దలిదండ్రులు గలరు. వారిని సేవించుట ముక్తికారణమనియును నాదస్వరూపము బ్రహ్మము నొక

తెయనియు నెఱింగినవాని కీలోకమునఁ గామితసిద్ధియుఁ బర
లోకమున ముక్తిఁ జేకూరును.

ఆ. తల్లిదండ్రిచావఁ దా నాలితోఁ గూడి
యిల్లుఁ గట్టుకొన్న యింపులెల్లఁ
గొఱుతమీఱి దొంగ కూ డడిగినయట్టు, వి.

తనను కనినవారు చచ్చుచుండఁగా తాను కన్నులారఁజూచి యును మరలఁ దాను నట్టే సంసారమునఁ బ్రవేశించుటయే గాక యిల్లని వాకిలియని లేనిపోని వలపులుబెట్టుకొని వర్తించు నవివేకి కొఱ్ఱులో దిగవేసినను సిగ్గునొందక కూడునీళ్లకొఱకు దేబిరించుదొంగతో సమానుఁడు.

ఆ. తల్లిగర్భమందు దాఁ జనియించియుఁ
దనదుభోగసతికి దానె పుట్టఁ
దల్లు రిద్దరయ్యె తను నొక్కఁ డయ్యెరా? వి.

మనుజుఁడు తల్లిగర్భమున తొలుత పుట్టి మరల భార్యగర్భమునఁ బుత్రరూపమునఁ జన్మించును; కావున నతని కిరువురు తల్లులు నొక్కశరీర మనఁదగును.

ఆ. తల్లిదండ్రిఁ బాసి తనయాలితోఁ గూడి
యిల్లుపట్టియున్న యింపదెల్లఁ
గొఱ్ఱెకాడి దొంగ కోరినచందంబు, వి. 1120

తల్లిదండ్రులవలన సౌఖ్యములు కలుగవని వారిని విసర్జించి వేఱుగ నిల్లుగట్టుకొని యుండు నవివేకుని మఱి పెమరతయు



కొఱ్ఱులోఁ దిగవేయఁబడినదొంగవాఁడు సుఖార్థము శిక్షాంతరము గావలయునని కోరుటతో సమానము.

ఆ. తల్లిదండ్రు లనెడితత్త్వంబు నెఱుఁగరు
యోనిలింగముల న టుద్భవించి
విష్ణు వరయ తల్లి వెలయ రుద్రుఁడు తండ్రి, వి.

మర్మస్థానములయందలి యవయవముల జనించియున్న యీనీచమానవులు తల్లియన నెవతెయో తండ్రియన నెవరో వారెంతపూజ్యులో దెలిసికొనఁజాలకున్నారు. తల్లివిష్ణుస్వరూపమనియుఁ దండ్రి శివస్వరూపుఁడనియు భావింపవలయునని శాస్త్రములు చెప్పుచున్నది.

ఆ. తల్లిదండ్రు లెవరొ తనకు జన్మము లెన్నొ
తిరుగ నెఱుఁగనట్టి దిక్కు లెన్నొ
స్థిరము నస్థిరమును తెలియలేఁ డజ్ఞాని, వి. 1122

తొల్లింటినుండి తానెన్నిజన్మముల నెత్తెనో యింక నెన్నిజన్మములనెత్తవలసియున్నాఁడో యిన్నిజన్మములకుఁ దలిదండ్రులెవరో యీమానవజీవితమున నేది స్థిరమో యేది యస్థిరమో వివేకహీనుఁ డెఱుంగఁజాలకున్నాఁడు.

ఆ. తల్లి యేడ్వ వినక తనయాలు వగచిన
జాలిపడెడివాఁడు జడుఁడు సుమ్మి
తారతమ్య మెఱుఁగ నేరనిపశువగు, వి. 1123

కన్నతల్లి తనయవినీతికి విచారపడుచున్నదని యనుకొనక, భార్యయేడ్చునే మోహయని యామె యడుగులకు మడుగులొత్తు

నవివేకి హెచ్చుతగ్గులు గ్రహింపఁజాలని పశువని చెప్పుటలో సాహసము లేదు.

ఆ. తా ననంగ నెవఁడో తనవార లెవ్వరో
తెలిసి తెలియలేఁడు తిక్కనరుఁడు
అరఁటి పిసినికాయపురుగుపద్ధతి లాగు, వి. 1124

అవివేకియగునరుఁడు దా నెవఁడో తనవా రెవరోయను సంశముగ్రహింపలేక పిసినికాయలోని పురుగువలెఁ బుట్టినచోటనే యూరుపేరులేక మరణించుచున్నాఁడు.

ఆ. తాను తానె యనెడితత్త్వంబులోఁ గల
యన్వయంబుఁ దెలియఁ డబ్బతోడు
తానుతానె యైన తల్లడం బేలరా? వి. 1125

అవివేకియగు యోగి తానుతానె యను తత్త్వమునందుఁగల మూలార్థమును గమనింపఁజాలక యవస్థపడుచుండును. తానె ఈశ్వరస్వరూపుఁడను రహస్యము నెఱింగినవానికి మంచిచెడ్డలకుఁ దల్లడపడవలసినయవసరము లేదు.

ఆ. తాను తనువటంచు ద్వయమును బలికిన
మోహవార్ధిలోన మునుఁగునరుఁడు
కానలేఁడు మోక్షగతి యెట్లు సిద్ధించు? వి. 1126

తాను తనశరీర మొకటేయని తలంచునజ్ఞాని మోహములో మునిఁగి కాంతాదులకు లోనై వర్తించుచుండును. తాను వేఱు తనదేహము వేఱనుసంశయము గుర్తింపలేనివానికి భక్తిజ్ఞానలభ్యమగు మోక్ష మెటుల లభింపనేర్చునో తోఁచదు.



ఆ. తాను వెలయుభూమి తనరంగఁ దిరిగెడు
జనుల గాంచి పొంచి పరగఁ గఱచు
కుక్కబుద్ధి యెంట గుణ మేల మానును?

కుక్క తాను గాచియుండునింటికిఁ బలుమాఱురాకపోకలు సేయువానిని పొంచికఱచుచుండును. కుక్క యెన్నటికిఁ దనకు నైజమగు నీచస్వభావమును విడఁజాలదుగదా.

ఆ. తానె తత్త్వమనుచు దలఁపోయఁగా లేక
మాయఁ దత్త్వమనుచు మఱుగుచుండు
కర్మఫలము లేక కలుగునా తత్త్వంబు? వి. 1128

జీవుండు తానే బ్రహ్మమునని యెఱుంగలేక మాయావరణమునే బ్రహ్మమని తలంచుచుండును. ఇంతయేల పూర్వజన్మమున సత్కర్మములు చేయనివానికి మోక్షము కలుగదు.

క. తామరపాకున నీళ్లుగ
వేమన చరియించుచుండు వెదకుచు శివుని
న్నీమాయ నమ్మరాదని
ధీమహిమఁ దెలియలేరు దేవ్రని వేమా! 1129

తామరాకులోనినీటివలె వేమనయోగి ప్రపంచమునంటియు నంటనటులఁజరించుచున్నాఁడు. వేమన యోగిమహిమ నెఱుంగలేనియజ్ఞులిది మాయయని కలయని నిజమునెఱుంగఁ జాలకున్నారుగదా!

ఆ. తాము కన్నవారుఁ దము గన్నవారును
జచ్చువెల్ల తమకు సాక్ష్యమేకద!

బ్రదుకు లెల్లఁ దెలియ బ్రహ్మకల్పంబులా? వి.

తల్లిదండ్రులు, సుతులు మున్నగువారు చచ్చుట మనము కనులారఁ జూచుచున్నారము. మానవజీవితము బ్రహ్మకల్పము కాదని ధర్మము నొనరింపనగును.

ఆ. తిట్టెనేని కొట్టు కొట్టినఁ గొట్టును
కొట్టెనేని యముఁడు కొద్దిపఱచుఁ
గోపమెంచఁ జేర్చుఁ బాపునరహత్య, వి. 1131

అకారణముగ మనము పరులను గొట్టినను దిట్టినను యముఁడు పరలోకమున మిగుల నీచముగాఁ జూచి యవమానించును. కోపము బ్రహ్మహత్యాపాపము నంటఁగట్టునుగాన మానవుఁడు దానిని విడువనగును.

ఆ. తిరుగవలయు మనసు తిరిగినవఱకును
దిరుగునట్టి మనసు విఱుగవలయుఁ
దిరిగి విఱిగెనేని దేవుఁడు తానగు, వి. 1132

మనోరథము ఈడేరునంతవఱకును కామముల ననుభవించి మనసు తిరిగినవెంటనే విరక్తి నొందవలయును. ఇట్లుచేసి మనసును విషయాదులనుండి మఱల్చుకొన్నవాఁడు సాక్షాత్పరమేశ్వరస్వరూపుఁడగుననుట సత్యము.

ఆ. తీర్థయాత్ర కనుచుఁ దిరుగఁబోయినవాఁడు
పామరుండు గాక భక్తుఁ డగునె?
తీర్థయాత్రచేత దివ్యుఁడు గాఁడయా, వి. 1133

తీర్థయాత్రలు గావింపనెంచి దేశదేశములు తిరుగువాఁడు



అజ్ఞానియగును గాని జ్ఞానికాఁడు. తీర్థయాత్రలమూలమున మానవుఁడు దేవుఁడు కాఁజాలఁడు.

ఆ. తుంటవింటివాని తూపుల ఘాతకు
మింటి మంటి నడుమ మిడుకఁ దరమె?
యింటియాలి విడిచి యెట్లుండవచ్చురా? వి.

మన్మథుని బాణముల తాఁకిడికి భూమ్యాకాశముల మధ్యనున్నవాఁ డెవఁడును నిలుపఁజాలఁడు. కులకాంతను విడచియుండుట యెంతయోకష్టముకదా!

ఆ. తులసి కారములును దూముపై నీరము
పఱచి దాన దుష్టపాలువోసి
కఱగి రాగిపైని గ్రమముగా నుంచరా, వి.

తులసిక్షారము తూమునుండి ప్రవహించునీరు జతపఱచి దుష్టపుఁబాలు దానిలోఁబోసి కఱఁగినరాగిపై దానినుంచినయెడల బంగారమగును. ఇది యొకస్వర్ణయోగము.

ఆ. తెఱలమఱుగునఁ గల తేజమంతయుఁ జూచి
మఱియు బ్రహ్మమందు మనసు నిలిపి
గరిమ నున్నయట్టిఘను లెందుఁ గలరయా? వి.

మాయావృతమగు బ్రహ్మస్వరూపమును గుర్తించి దృష్టినంతయు బ్రహ్మస్వరూపముపై నిలిపి ఈశ్వర సాక్షాత్కారమును నొందినయుత్తములు చాలస్వల్పసంఖ్యాకులుగా నున్నారు!

ఆ. తెలియ భాగవతులె తెలివి గలారింక
నందఱెట్టు లగుదు రకట భువిని

నయినవారిని గను నతఁడె పో శివయోగి, వి.

భగవద్భక్తిగలవారె మేధావంతులు అనవచ్చును. ఇతరులం దఱు నట్టిబుద్ధిశాలురని చెప్ప వీలులేదు. ఆట్టిభగవద్భక్తులను గుర్తింపఁగలవాఁడె శివయోగి యనఁదగువాఁడు.

ఆ. తెలియఁ దనదుభార్య తెగబారు సంకెల
చిన్న శిశువులెల్లఁ జీల లరయ
నరసి చూడఁ దనువె యల చెఱసాలరా, వి.

భార్య పురుషునకు సంకెలలవంటిది. చిన్నచిన్న శిశువు లందఱు నాసంకెలలకు బిగించుమేకులవంటివారు. దేహమే చెఱసాల గావున దీనినుండి బయటపడుటకు మానవుఁడు యత్నింపవలెను.

ఆ. తెలివి నిలిపి చూడు దీపించు నాకళల్
కళ లుడుగక చూడు కలుగుబయలు
బయలు నంటి చూడ బ్రహ్మంబు గాంచెదు, వి.

మనస్సును నిలుకడగా నిలుపుకొననేర్చి చూచినచో నాద బిందుకళ లుదయించును. కళలుదయింపఁగనే స్థిరదృష్టితోఁ జూచుచున్నచో మహదాకాశము గానఁబడును. పిమ్మట బ్రహ్మ సాక్షాత్కారమగును.

ఆ. తెలుపుమా యటంచు దేవర యందును
వెంటఁ బడెడివాండ్రు వెతలు దీర్ప
నెవ్వఁడైన జెప్ప నేదైన నొక్కటి, వి. 1140

మోహవశులై ఎవనిని బట్టినను వానిని చెప్పుఁడు చెప్పుఁడనిన నేదో చెప్పనే చెప్పును. అయ్యర్థి సఫలము కానేరదు.



ఆ. తొడలమెఱుపు మోవి తోరంపుగుచములు
నోరకొప్పు గలుగు సువిదఁ జూచి
విటుఁడు నిలుపఁగలఁడె విరహాగ్ని జొరకయే? వి.

తొడలయందము చన్నులచక్కదనము ఓరగానున్న కొప్పు గల సుందరిని గాంచినంతనే విటుఁడెన్నంటికి వలపునకు లోఁబడక నిలువఁజాలఁడనుట సత్యము.

ఆ. తొత్తుతోడిపొందు దోషంబు దోషంబు
లంజతోడ పొందు లజ్జచెడును
జాండ్రతోడ పొందు చావునకే యగు, వి.

దాసీసంగమము నింద్యము. మిగుల బాపము. భోగముదానితోఁ బోయిన సిగ్గుపోవును. ఇఁక జాండ్రదానితో సంగమము చావునకే. గాన పరకాంతాశ వదలుకొనవలయును.

ఆ. తోలుఘటములోనఁ దోలఁగక యున్నప్పు
డాలుమగలు ప్రీతి నలరుచుంద్రు
జీవి ఘటము విడువ చిక్కాడిపోవురా, వి.

తోలు ఘటములో జీవుఁడున్నంతవఱకు ఆలుమగలు కామ క్రీడాపరంతత్రులై వర్తించుచుందురు. ఈవలపుముడి విడిపోవ వలయునన్నచో జీవుఁడుశరీరమును వీడిపోయినఁగాని సాధ్యము గాదు.

తే. దశమి యేకాదశి యని వ్రతములఁ బూని
మెదుకు దినకున్న దుర్గుణ మది యడఁగునె?

పుట్టపైఁ గొట్ట నురగంబు గిట్టబోదు
తీరెఱుంగనిమౌఢ్య మిాతెఱఁగె వేమ! 1144

దశమి ఏకాదశి దినములలో నుపవాసమును చేయుచు న న్నంత మాత్రమున నింద్రియోస్వాద మడఁగనేరదు. పుట్టపైఁ గొట్టినయెడల లోనిపాము చావనటుల ఉపవాసమాత్రమున సద్గుణము లబ్బనేరవు. ఉపవాసవ్రతము వివరమెఱుంగనిమూర్ఖ కార్యము.

ఆ. దృశ్యమైనదానిఁ దెలసి నమ్మెద రట్లు
కాని దాని నమ్మఁ బూనుకొనరు
కాని దృశ్యమగుట కానరే యదియేల? వి. 1145

కంటికి కనుపించిననే నమ్ముదురు. లేనిచో నమ్మరు. కాని లక్ష్యభూత మగుపరమాత్మ నేల నమ్మరు?

ఆ. దేవళములలోను తీర్థంబులందును
మూల మెఱుఁగకున్న ముక్తిలేదు
ఆత్మమూల మెఱుఁగఁ డది యెట్లు తెలియును? వి.

దేవాలయములు మున్నగువాని కెందులకు పోవలయునో యామూలమును గనలేనివాఁడు ముక్తినెన్నఁటికిఁ బొందఁజాలఁ డు. ఆత్మమూల మెఱుంగనివానికి ధర్మమూలము లెన్నటికైనఁ దెలియునా?

క. దేహాభిమాన ముండఁగ
మోహాదులు విడుచు టెట్లు మునులకునైన



స్సాహసమున నది విడువఁగ
సోహ మ్మని యెఱుఁగవచ్చు సుమ్మీ వేమా! 1147

దేహాభిమాన మున్నంతవఱకుఁ గామక్రోధ లోభమోహా దులు మునులకైన వీడిపోవఁజాలవు. సాహసించి వానినివిడువఁ గలిగినచో శివస్వరూపుఁడు తానెయని గ్రహించుటకు వీలు చిక్కును.

ఆ. నమ్మినట్టి యొండి నౌకభూత మనంగఁ
జాపఁ బొరల వేసి చక్కబోవు
నీఁతగాఁ డయిన నటుల పోనిచ్చును? వి. 1148

పడవప్రయాణికులకు సాధనమువలెఁ గానవచ్చి నమ్మించి యొకానొకతఱి చాపఁబొరలవేసి మునిఁగిపోవుచుండును. పడ వనడుపువాఁ డీఁతగాఁడయిన నటులఁ బోకుండఁ జేయఁ గలఁడు.

ఆ. నరుఁడఁట పరమాత్మగురుని జేరినయప్డు
హస్తమందు మోక్ష మపుడె చూపు
విఱివిసంపదలను విఱ్ఱవీగిన జీవి
పరమెఱుఁగఁడు యమునిపాలె వేమ! 1149

మానవుఁ డుత్తముఁడగు గురుని నాశ్రయించినయెడల నాగురుఁడు అఱచేత మోక్షముచూపికడతేర్చును. సంపదలతో విఱ్ఱవీఁగుచు గురునిమఱచిపోయినచో నట్టివాఁడు మోక్షము నకు మాఱు యమలోకమునకుఁ జేరుట సత్యము.

ఆ. నాది నీ దటంచు ననువుగాఁ బల్కిన
కాదు కా దటంచుఁ గాల ద్రొక్కి
పాదుకొనెడియుక్తిఁ బడయనివారికి
చేఁదు పుట్టి ముక్తి చెడును వేమ! 1150

ఎవరేని యేవస్తువు నాది నీది యని పలికిరేని యట్లుకాదు. సర్వము నీశ్వరునివే యనిపలికి స్వాభిమానము నడఁగఁద్రొక్కఁజాలనివానికి మోక్షము లభింపఁజాలదు. అట్టివారికి మోక్షమనిన నసహ్యముసైతము పుట్టును.

ఆ. నిద్రలోనినిద్ర నిర్భేద్య మనఁదగు
తామసంపునిద్ర తలఁగఁద్రోచి
సతత మదియె పూన సర్వదా యోగియౌ, వి.

యోగము నవలంబించి కనులమూసికొని యుంట యితరులు మెలకువకలిగింపరాని నిద్ర. అట్టినిద్రాసుఖము ననుభవించువానికి అజ్ఞాన మంటుకొనదు. అటులె యోగము బూనిన యోగియగును.

ఆ. నిబిడమైనతమము నిక్కి దాఁటఁగలేక
గుబురు బట్టబయలు కూడునట్లు
ప్రబలుచున్న మదిని పాలించుచుండును, వి.

దట్టముగాఁ బెనఁగొనియున్న యజ్ఞానమును బోకార్చనంతవఱకు విశ్వజ్యోతియనఁదగు నీశ్వరరూపతేజము కానరాదు. అది హృదయరాజ్యము నేలుచున్నను అజ్ఞానదృష్టికి గోచరింపదు.



తే. నిర్మలజ్ఞానపరిపూర్ణనిష్ఠయందుఁ
గర్మసన్యాసయోగియై కసిమసంగి
మర్మ మెఱుఁగుచు నుండుటే మౌనమయ్యె
ధర్మ మింతయె బోధించు ధరణి వేమ! 1153

నిర్మలమగు జ్ఞానము నొంది కర్మలఁ ద్యజించి ప్రపంచములోనిమర్మము నెఱుంగుచు నిష్ఠాగరిష్ఠుఁడై యుండి మోక్షమర్మములను గ్రహింపఁగలుగుటయే యోగమనిచెప్పఁబడును. ధర్మశాస్త్రములు సైత మీయంశమునే తెలుపుచున్నవి.

క. నీమము పెట్టుక ద్రవ్యము
కామంబున కగుచు భువిని కల్లరికూఁతల్
సేమముగఁ బలుకుచుండిన
కోమటు లోకకొంద ఱుంద్రు కుంభిని వేమా!

ద్రవ్యము నార్జించుటయే నియమముఁ జేసికొని, కామములకు లోనగుచు, ననృతములాడుచు, నితరులను జెఱచి తాము క్షేమముగా నుండు కోమటులు భూలోకమునఁ దఱచుగా నున్నారు.

ఆ. నీరు నన్నములును నిదురయుఁ దా మాని
ముక్తికొఱకుఁ దిరుగు మూఢజనుఁడు
వెఱ్ఱికుక్కయట్లె వేసరి తిరుగురా, వి. 1155

నీరు అన్నము నిద్దురమానుకొని యవివేకియగు జనుఁడు మోక్షముకొఱకుఁ బిచ్చికుక్కవలెఁ దిరుగుచుండును. దానివలన నించుకేని ఫలితముండదు.

ఆ. నీళ్లమీఁద బుగ్గ నిలిచినయప్పుడు
తళ్లు వేగ వచ్చి తాఁకుఁగాదె
విడెడుకుండ కింత విభ్రాంతి యేలరా? వి. 1156

నీళ్లమీఁద బుడుగ తేలినచో అల రాఁగానే నశించునట్లే నశించెడి యీశరీరమునకై యింత భ్రాంతి యెందులకు?

ఆ. నీళ్ల మునుఁగువాఁడు నిర్మలాత్ముఁడు గాఁడు
పూర్ణమైనముక్తిఁ బొందలేఁడు
నీరుకోడి యెపుడు నీళ్లను మునఁగదా? వి. 1157

ఎల్లపుడు పుణ్యనదీనదములలో మునుఁగుచున్నంత మాత్రమున మానవుఁడు నిర్మలుఁడు కానేరఁడు. మోక్షము నొందనేరఁడు. నీరుకోడి యెప్పుడు నీటమునుఁగుటలేదా? దానికేమి ముక్తివచ్చినది.

ఆ. పడఁతిఁ జూచునపుడె పాలిండ్లపై యాస
నుడుగలేక మనుజుఁ డుపచరించి
యిడుములొంది పొంది యిలబట్టి చచ్చును, వి.

చెలువల గబ్బిగుబ్బలబింకమును గాంచినంతనే మనుజుఁడు ఆసపడి వలపు నాపుకొనఁజాలక వలపులాఁడుల కుపచారములు చేయుచు నెటులేని గవయఁ బ్రయత్నించి కడకు విఫలమనోరథుఁడై మరణము నొందుచున్నాఁడు.

ఆ. పక్షిజాతిఁ బట్టి పరగ హింసలఁ బెట్టి
కుక్షినిండ కూడు కూరుటకును
వండితినెడివాఁడు వసుధఁ జండాలుఁడు, వి. 1159



అజ్ఞానమునఁ బక్షులఁ బట్టి వండికొని తినిన దోషములేదని కొందఱనుకొనియెదరు కాని వారికంటెను చండాలురు వేఱులేరు.

ఆ. పిండ మగుచుఁ దల్లి పెనుగర్భమునసుండి
పూర్వకర్మ మొంచి పొరలియేడ్చి
ధరణిఁ బుట్టి యద్ది మఱచి వర్తించురా, వి. 1160

పిండమైతల్లిగర్భమునందుఁ బుట్టి పూర్వజన్మవాసనచేతచేసిన పాపములకు దుఃఖించుచు జన్మింపఁగనే మఱచి మోహియై మనుజుఁడు మెలఁగుచుండును.

ఆ. పటువుగాను బుద్ధి పరికించి నొక్కుచు
కుటిలగుణము లన్ని కూలఁ ద్రొక్కి
పటుతరంపుమోహపటలంబు వీడరా, వి. 1161

బుద్ధియందు చక్కఁగా పరికించుచు కుటిలములగు గుణముల నన్నిటిని కూలఁద్రొక్కి మోహపటలమును వీడినవాఁడు ముక్తుఁడగును.

# యోగిపద్ధతి.

అవతారిక. యోగికేతక్క తదన్యులకు ఈశ్వరసందర్శనభాగ్యము కలుగఁజాలదు. యోగి యేకాంతప్రదేశముననిల్చి ఆత్మకంటె నితరమునందుఁ దలంపులేనివాఁడై ఆత్మసందర్శనమునకు యత్నింపవలయును. శరీరము శిరస్సు మెడ నిశ్చలముగానుంచి నాసికాగ్రమునుజూచుచు బ్రహ్మచర్యవ్రతముతో సావధానుఁడై యుండువాఁడె యోగి. యోగిజన పరిగ్రహణీయమగు రాజయోగము మూఁడువిధములుగ సాంఖ్యతారకామనస్కనామములతోనుండుననియు యోగానుభవము లేనివానికి బ్రహ్మస్వరూపసందర్శనభాగ్యము లభింపదనియు నిర్ణయించి చెప్పఁదలఁచి వేమనయోగి యోగిపద్ధతి నీక్రిందివిధముగా వివరింపఁబోవుచున్నాఁడు.—

ఆ. అంజనంబుఁ బెట్టి యాత్మలో ద్రవ్యంబు
కనఁగ లేని ఘనత కడగి యెఱఁగి
ఆశ దప్పినప్పు డతఁడె పో ఘనయోగి, వి. 1162

అంజనమువలన నిక్షేపమును గనుఁగొనునటుల జ్ఞానమువలన బ్రహ్మస్వరూపమును గుర్తించి యాశాపాశమును దెగఁగోసికొనినవాఁడె నిజమైన యోగి యనఁబడును.

ఆ. అంతరంగహృదయ మందఁగా సాధించి
చింత లూడఁబెఱికి చిక్కుపడక
వింతఁ జూచి మెలఁగ విజ్ఞాన మందురా? వి...



హృదయమును దుర్వ్యాపారములమీఁదికిఁబోకుండ సాధించి లోఁబఱచుకొని చింతలన్నింటిని దొలఁగించి జ్ఞానమునార్జించినచో మోక్షము లభ్యమగును.

ఆ. అంతరిక్షమందు నమరినలింగంబు
చింతఁ బూనవలెను జెనకి యాత్మ
వింతలోనివింత వెన్నంటి చూడరా, వి...1164

చిదాకాశస్థితమగు నీశ్వరబింబమును ధ్యానించుచు నిష్కాముఁడై మెలఁగి కైవల్యము నొందవలయును.

ఆ. అయిదుచక్రములను నాదినిబడవైచి
యైదుచక్రములకు నవలఁ దెలియ
నైదుచక్రములను నడఁగి బయల్ తోఁచు, వి.

శరీరమునందు నెలకొనియున్న అన్నమయాది పంచకోశములను బాటింపక స్వాధిష్ఠానాది పంచచక్రములను దెలిసికొని పంచభూతములయందును యాశరీరాంశలు గలుపఁజాలినచో జ్ఞానమయమగు చిదాకాశము సాధకునకు గోచరించును.

ఆ. అరసి గట్టివేసి యాధారచక్రంబు
ప్రాణవాయు వందె పదిలపఱచి
యెడతెగకయముండు నిలయోగ్యుఁడగు యోగి
విశ్వ... 1166

హృదయకుహరమందీశ్వరమూర్తిని నెలకొల్పి ఆధారచక్రమును గుర్తించి దానఁ బ్రాణవాయువును నిలిపి యెడతెగక యోగము నవలంబించు సాధకుఁడే నిజమగు యోగిగాఁ బరిగణింపఁబడును.

ఆ. అవనిలో నొకబిడ్డ యరయఁ బుట్టినతండ్రి
నట్టి యేలె జగము లగణితముగ
తల్లి లేక పుట్టె ధాత్రి యెట్లలెరా? వి...1167

మాయ యనుపుత్రిక లోకేశునివలన జనించి తండ్రిని లోకములను నావరించికొనెను. అది ప్రకృతిసంబంధము (మాతృసంబంధము) లేక యెటులఁ బుట్టెనో లోకముల నెటులఁ బరిపాలించెనో యను సంశయము విచారింపఁదగినది.

ఆ. అష్టదళములందు నాత్మను సేవించి
నిష్ఠఁ బూని మిగుల నేర్పుతోడ
దృష్టియందె దృష్టి తెమలకచూడరా, వి...1168

హృదయకమలమును అష్టదళపద్మమందురు. అందున్నబ్రహ్మస్వరూపమును సేవించుచు నియమనిష్ఠలతో నచంచలదృష్టితోఁ జూచినచో పరమాత్మను సందర్శించి కృతార్థుఁడుగావచ్చును.

తే. అసిపదాంతమునను బుద్ధి నమర నొక్కి
కూటపరచిన్మయంబునఁ గొలువు దీరి
ఆటపాటల నణఁగింప నందె ముక్తి
విశ్రుతంబగువిధమిది వినర వేమ! 1169

తత్త్వమసియను సూత్రముచొప్పున భగవత్స్వరూపమును నెఱింగి జ్ఞానదాయకములగు నన్యదీయస్వరూపములను విసర్జించి ఇంద్రియచాంచల్యమును బోనాడినచో ముక్తిలభ్యమగును. ముక్తి కిదియే యనువగుమార్గము సుమా!



క. అక్షరపుటడవిఁ జొరఁబడి
యక్షరములు వేలు లక్ష లరయఁగ నేలా
ఈక్షితి శివ యనియెడి రెం
డక్షరములె పరిధవిల్లు నరయుము వేమా! 1170

అక్షరము లనుమహారణ్యములోఁ బడి దారి తెన్నుఁ గనుఁగొనఁజాలక, వేలు లక్ష లక్షరముల నూఱక కంఠశోషగా చదువుట కంటెను శివయని రెండక్షరములఁ బల్కుట మంచిది.

ఆ. అక్షరాత్మకంబు నమృతపానమునకు
నక్షకత్వమునకు రాజహంస
దీక్షలోనిదీక్ష తెలివంటిచూడరా, వి... 1171

అక్షరస్వరూపుఁడు అమృత(మోక్ష)దాయకుఁడు నగుపరమాత్మునిపై దృష్టినుంచిన నీకు తప్పక మోక్షము సిద్ధించును.

ఆ. ఆకుచాటునఁ దగు నన్నిలోకంబులు
కొమ్మ గానరాదు బ్రహ్మకైన
కొమ్మ గానఁబడినఁ గొనియాడవచ్చురా, వి...

ఈశ్వరసందర్శనము సామాన్యకార్యము కాదు. బ్రహ్మస్వరూపము నీమహావృక్షశాఖలు అజ్ఞానులకు గోచరింపవు. చతుర్దశభువనములు అజ్ఞానచేతసులకు మాయావరణమువలనఁ గొంచెమేని గోచరింపకున్నవి. బ్రహ్మాండవృక్షశాఖలు సామాన్యులకుఁ గోచరింపఁ జాలవనుట సత్యము.

ఆ. ఆకసంబుమీఁద నాడుదొమ్మరిపాప
చూపు లొకటి గాని సుఖము లేదు
ఆకస మనువీథి హంసను జూడరా, వి... 1173

ఆకసముపైనాడు దొమ్మరి పాపచూపులు నిలుపునుగాని యవి యోగసాధకములు గాకపోవుటచే నిరుపయోగములు. సాధకుఁడా దొమ్మరిపాపవలెఁ జూపులునిలిపి సహస్రారమునఁగుండలినీశక్తిని జేర్చినచో మోక్షమును బడయఁగలుగును.

క. ఆకారణవిధ మెఱుఁగుచుఁ
జేకొని యామూలధనముఁ జెందుచు నున్న
న్నాకల్పాంతమును సదా
యేకాలము పిన్నవయసు నిహమున వేమా! 1174

సమస్తమునకును కారణమగుమూలప్రకృతి యేది యని విచారించి యోగదృష్టిచేఁ బరబ్రహ్మస్వరూపమును దర్శించుచో సాధకుఁడు యోగానుభవపాటవమున కల్పాంతమువఱకు వయస్సు వానివలెనే గనుపించుచుండును.

ఆ. ఆగడంబు చేత నందెందు బొందెదు
సాగ దోలి మనసు సైఁప నేర్చి
మ్రోగు ప్రణవరవము మూలంబు గానరో, వి.

కేవలము ఆర్భాటమును జేయుచున్నచో నేమియు లాభముండదు గాన మనస్సును నిలుప నేర్చి హృదయమున దశవిధనాదములతో మ్రోగు నోంకారనాదమును గుర్తించినచో మూలతత్త్వమగు బ్రహ్మస్వరూపము గోచరించి తీఱును.



తే. ఆత్మతేజము గమకించి యభినుతించి
కీలకబ్రహ్మతన్మయకేళి మరగి
నిత్యపరిపూర్ణమందుట నిరతిశయము
సత్త్వసంపన్నులకు నిది సాగు వేమ! 1176

బ్రహ్మస్వరూపమును గుర్తించి దానిని స్తోత్రము గావించుచు బ్రహ్మానందసౌఖ్యమున నోలలాడుచు పరిపూర్ణసుఖానుభవముచే వర్తించుటయే ముక్తియనఁబడును. ఇంద్రియాతీతులగు సత్త్వసంపన్నులకె యిది సాధ్యము.

ఆ. ఆత్మదేహమందు నతిసూక్ష్మముగఁ జూచి
దేహ మాత్మయందు తేటపఱచి
ఆత్మయందె చూచు నతఁడె పో ఘనయోగి, వి.

యోగదృష్టిచే మిగుల సూక్ష్మముగనున్న దేహస్థమగు నాత్మస్వరూపమును సందర్శించి యాత్మజ్ఞానము నార్జించిన మహానుహుఁడె నిజముగు శివయోగి యనఁదగినవాఁడు.

ఆ. ఆత్మలోనినాద మాలించి యాలించి
యాసలందు చిక్కఁడాది యోగి
యాత్మలోనికళల నంటునా తత్త్వము? వి. 1178

హృదయమున మ్రోఁగుదశవిధములగు నోంకారసంబంధముల నాలించుచుఁ బేరాసలకులోనై మఱిచంచలుఁడు గాకయుండువాఁడె నిజమగుయోగి. తత్త్వముగూడ నాదబిందుకళలకతీతమై యున్నదనుట గమనింపఁదగునంశము.

ఆత్మసూక్ష్మమైన యానంద మెఱుఁగక

మది తొలంగి చదివి మగ్నుఁడయ్యె
అతిరహస్య మెల్ల నా యోగి యెఱుఁగును, వి.

సూక్ష్మాతిసూక్ష్మమగు నాత్మవలన గలుగు సంతోషమును గ్రహింపఁజాలక జనులు వృథాపఠనములతో మందులై పోవుచున్నారు. మోక్షరహస్యములను యోగులేగాని వృథాపాఠకులెఱుంగఁ జాలరుగదా?

ఆ. ఆది తుదయు లేని దనుభవగమ్యమై
వేదతుల్యముగను వెలయుచుండు
వాదభేద ముడిగి వరియించు శివయోగి, వి...

బ్రహ్మము ఆద్యంతములు లేక కేవలానుభవవేద్యమై వేదములలె ప్రామాణ్యమై యొప్పాఱుచున్నది. ఈనిశ్చితార్థమును గూర్చి వాదోపవాదములను మానుకొని వర్తించువాఁడె శివయోగి యనఁదగువాఁడు.

క. ఆధారంబు లటాఱును
మోదముగా నలరుచుండు ముఖ్యముగాఁగన్
లేదన నేటికిఁ దెలియక
సాధకమునఁ జూడవయ్య చయ్యన వేమా! 1181

మోక్షకామికి షడాధారముల నెఱింగి వాని యావశ్యకము గుర్తించుట కర్తవ్యము. సాధకముగా యత్నించి చూచినవారిది కాదని పలుకఁజాలరు.

ఆ. ఆఱుగురిని జేర నత్యంతదుఃఖంబు
ఏడుగురిని గూడ నేడుపయ్యె



వడిగ వీరిపొందు విడచుటె యోగము, వి...

కామాది అరిషడ్వర్గము సప్తవ్యసనములు మానవుని మిగుల వెతలఁ బెట్టునవిగాన వీనిని వదలి పరబ్రహ్మస్వరూపమును సందర్శింపఁ గృతయత్నుఁడగుటయే యోగమని చెప్పఁబడుచున్నది.

ఆ. ఆఱుగురినిజంపి హరిమీఁద ధ్యానంబు
నిలిపి నిశ్చయముగ నెగడి యాత్మ
గతి నెఱుంగుచుండ్రు ఘనులగు యోగులు, వి.

షడ్వర్గమును జయించి దేవదేవుని ధ్యానించుచు యోగులు పరమాత్మతత్త్వము నెఱుఁగఁ బూనుదురు.

ఆ. ఆఱు మూఁడు గట్టి యలమటఁ జెందక
పోరి గుణము లడఁచి పూని మిగుల
తేరుశిఖర మెక్కి తెలివంటఁ జూడరా, వి. 1184

అరిషడ్వర్గమును త్రికరణములను లోఁబఱచుకొని ఇతరాయాసములకు లోనుగాక సత్వరజస్తమో వికృతుల దిగద్రావి సహస్రారకమలమునఁ గుండలినీశక్తిని జేరనిచ్చుట యోగసాధనము.

క. ఆర్గురుదొంగల బట్టుక
మార్గముననె కొట్టి యొకని మన్నింపఁదగుం
దుర్గమ మిది తెలియంగా
నిర్గుణరూపంబు తెలియు నిజముగ వేమా!

కామక్రోధాదిశత్రువుల నార్గురను పట్టి నశింపఁ జేసి అం

ద్రాక్షకామమునుమాత్రము ఈశ్వరపరముగా చేసిన బ్రహ్మము సిద్ధించును. ఇది చాల విషమ విషయముగాన నందఱకుఁ దెలియదు.

ఆ. ఆలుబిడ్డ గల్గి యధికసంపద గల్గి
భజన సేయ రీశు భక్తి లేక
భజనసేయ నతఁడు భక్తుండు కాఁడయా, వి....

సాధారణముగా మానవులు ఆలుబిడ్డలతో సంపదలతోఁ దులతూఁగుచుండియు దైవభజన మనిన విముఖులగుచుందురు. భజనము గావింపనివాఁ డెన్నఁటికి భక్తుఁడని భావింపఁదగఁడు సుమా!

ఆ ఆసపాపజాతి యైహికములలోన
ఆసచేత నెవరు మోసపోరు
చూచి విడుచువారు శుద్ధాత్ము లగుదురు,వి...

ఆశ మిక్కిలి పాపపుఁగులములోఁ బుట్టినది. మహాత్ములు సైత మాసవలననే మోసపోయి పారమార్థికములను గోలుపోవుచున్నారు. ప్రతివస్తువును జూచి యాశను జంపుకొనువారు పరిశుద్ధాంతఃకరణులని చెప్పఁబడుదురు.

క. ఇడపింగళనాడులకు
న్నడుమ సుషుమ్నము వెలుంగు నడయాడంగాఁ
గడుదుస్తర మది గన నా
నడుమనె యినచంద్రహారులనగరము వేమా!

ఇడపింగళనాడులమధ్య సుషుమ్నానాడి ప్రకాశించుచుండును. అట ముప్పదియెనిమిది చిత్కళలతో నిండియున్న సూర్యచంద్రాగ్ని మండలములు వెలుగొందుచుండును. ఇది తెలిసికొనుట సామాన్యముకాదు.



ఆ. ఇంతికనులు వింత వింతలౌ చన్నులం
చింతఁ గవయువాని నెఱిఁగి తొలఁగి
సరస కరుగ నతఁడె సర్వదా యోగియౌ, వి.

చెలువకన్ను లింతయున్నవి చన్ను లింతలేసియున్నవని మురియుఁ బరకాంతలఁ గవయు విటులను దెలిసికొని వారి సంసర్గము మాని దూరముగా నుండువాఁడె యెల్లకాలము యోగిగా గణింపఁ దగినవాఁడు.

ఆ. ఇంద్రజాలమట్టు లీజగద్భ్రాంతులు
చంద్రకళలు దాఁటి సఖ్యపడెడు
రంధ్రమందుఁ జేరి రహిమీఱఁ గాంచుదే
వేంద్రపూర్ణపదవి విడక వేమ! 1190

ప్రపంచముపై గల మమకారమంతయు గారడివంటిది. నాదబిందుకళలను దాఁటినగాని జ్ఞానదృష్టికి నిశ్చలమగు బ్రహ్మస్వరూపము గోచరింపదు. అటుల గోచరించినగాని సాధకునకు మోక్షము చేకూరదు.

ఆ. ఇంద్రలోక మైన జంద్రలోక మ్మైన
నందిచూడవచ్చు పొందుగాను
నందిమీఁద నెక్కి నయముగఁ జూడరా, వి...

సహస్రారకమలమును జేరుటకు బుద్ధియనునంది నెక్కి పయ

శము గావించితినేని ఇంద్రలోకముగాని చంద్రలోకముగాని కనుఁగొనవచ్చును.

తే. ఇరవు గనుఁగొని పరమార్థ మెన్నఁ గోరి
పరమనిర్గుణవుబయిలఁ బ్రాఁకి నిలిచి
తన్మయంబున మది నిల్పి తనరు యోగి
శాశ్వతసుఖంబు నొందును సతము వేమ! 1192

యోగాభ్యాసములలో సాటితేరి మోక్షరహస్యము తెలియుంగుటకు నిర్గుణస్వరూపమగు మహదాకాశమున దృష్టి నిలిపి తన్మయము నొందుచున్నచో శాశ్వత సుఖస్వరూపమగు మోక్షము లభించును.

ఆ. ఇల్లు విడిచినట్లె యిల్లాలి మది రోసి
తల్లడంబు మాని తలఁపు నిలిపి
యొడలు మఱచి యోగ మొల్లసిల్లెడునట్టి
వాఁడె పరమగురుఁడు వసుధ వేమ! 1193

ఇల్లువాకిలిని ఆలుబిడ్డలను రోసి శరీరముపై నభిమానమును త్యజించిన బుద్ధిని నిలుకడగా నుంచనేర్చి తన్నుఁ దా మఱచి బ్రహ్మానందము ననుభవించువాఁడె నిజమగు గురువర్యుఁడు.

ఆ. ఇష్టసిద్ధిఁ గోరి కష్ట మొందఁగ లేరు
నిష్ఠ నెఱిఁగినంత నిష్ఠలోన
అష్టసిద్ధులందు నమరుటఁ గానరు, వి... 1194

మనోరథసిద్ధి నొందఁగోరి శ్రమలకోర్చి నియమనిష్ఠల నవలంబించినచో పంచభూతములు సూర్యచంద్రులు పురు



షుఁడు అనునష్టమూర్తులతోఁ గూడియున్న శివస్వరూపమగు నష్టసిద్ధులను బడయ సాధకులకు వీలుకలుగును.

క. ఇహపరసౌఖ్యము లొల్లక
దహరమునను గుఱిని డించి దత్తముగాగం
గుహరములో వెలిబయలున
మహదాకాశంబుఁ జేరు మహిలో వేమా!

ఇహపరసౌఖ్యములఁ ద్యజించి దహరాకాశమునందు మనముఁ జేర్చినచో హృదయకుహరమునందును బహిరంగప్రదేశమునందును మహదాకాశమును సందర్శింప వీలుచిక్కును.

ఆ. ఈఁకె లనుచుఁ గొన్ని తోఁక లనుచుఁ గొన్ని
కోఁక లనుచుఁ గొన్ని గోఁచు లనుచు
కొన్ని యమర్చె నున్న గుఱుతును మాయఁగా, వి.

జీవుల మర్మావయవములను మాటుపఱచుటకుఁ గొన్నింటికీఁకలు మఱికొన్నింటికి తోఁకలు మానవతులకు కోకలు యోగులకు గోఁచులు యేర్పడినవి. ఇవి లజ్జాప్రదేశాచ్ఛాదనములేగాని వేఱుగాదు.

క. ఈఁతెఱిఁగినవా రైనను
లోఁతైనటువంటి నూతిలోఁ బడి పోరా?
యీఁతలు నేర్చినయోగము
చే తిరుగకయున్న నేమి చేయుదు చెపుమా?

ఈఁతవచ్చినను లోఁతుగలిగి వైశాల్యములేకున్న బావిలో మనుజుఁడుపడెనేని బ్రదుకరు. వారికివచ్చిన యీఁత పనికిరాలి

నడగును. అటులే యోగము నెఱిఁగియున్నవారు మనస్సును నిలుపఁ జాలకయున్నచో నెందులకుఁ బనికిరాక పోవుదురనుట సత్యము.

క. ఈదేహ మెన్ని భంగుల
బ్రోది యొనర్చినను నేఁ బోవును కాదే
మీఁదెఱిఁగి మురికిఁ గడుగుచు
ఖేదంబులు మాన ముక్తి బెరయును వేమా!

ఈదేహము నెన్నివిధములఁ బోషించినను గడకు మంటిపాలై పోవును గదా! తత్త్వము నెఱింగి దేహమునంటినమలినమును దొలఁగించుకొనుచు నభేదభావముతో నర్తింతువేని తప్పక ముక్తి చేకూడును.

ఆ. ఈనినట్టిపులిని బూని చంపఁగవచ్చు
మనము మర్మ మరసి కనఁగవచ్చు
తారకంబు మరగి తగులుట సాధ్యమా? వి...

ఈనినపెద్దపులినైనను జావునకుఁ దెగించి పోరాడి చంపవచ్చును. మనస్సునకు మర్మమునంతయు నెఱుంగవచ్చునుగాని చిత్తశుద్ధికారణమును రాగద్వేషాదుల నివర్తింపఁ జేయునదియు నగు తారకయోగము నెఱింగియు వదలుట కష్టము.

ఆ. ఈస్వరంబు లన్ని యేడుపాళ్లుగఁ జేసి
యేడుమూర్తులకవి యిచ్చివేసి
నిత్యకర్మ మనను నిలుచురా నెఱయోగి, వి....

సప్తస్వరములను గురుతించి వానినేడుపాళ్లుగా విభజించి



సప్తమూర్తులకు వానినిబంచి యొసంగి నిత్యమును సత్కర్మముల యందుఁ దగిలియుండువాఁడె యోగి.

ఆ. ఉక్కుకల్లు దిన్న నొగి తేటగా నుండు
నుక్కుకల్లు దిన్న నుడుగువ్యాధి
యుక్కుకల్లకన్న నుర్వి గల్పము లేదు, వి. 1201

ఉక్కుదిన్న పెక్కుగుణములు కలవుగాన దాని మించిన దీలోకమున మఱియొకటి లేదు.

ఉక్కుచూర్ణమువలన దేహ మారోగ్యమునుండును. వ్యాధు లడఁగును. దీనినిమించినయోగము వేఱొకటి కానరాదు.

ఆ. ఉక్కు శుద్ధి చేసి యుంచి తినెడివాఁడు
ఉక్కుదిటవువలెనె యుండు జగతి
ఉక్కుచూర్ణముఁ దినుటొప్పగు కల్పంబు, వి...

శుద్ధిచేసిన యుక్కుచూర్ణమును దినువాఁడు ఉక్కువంటి దృఢకాయముగలవాఁడై యుండును. ఆరోగ్యమును గోరువాఁ డుక్కుచూర్ణమును దినుట చాలమంచిది.

తే. ఉజ్జ్వలంబగు పరిపూర్ణ మొందఁగానె
కుంభగతదీపశోభానికుంభలీల
కుంభకంబున మదిఁ జేర్చి కూడవలెను
గాక గాంభీర్య మూనినఁ గలదె వేమ! 1203

మనఃప్రాణములు జీవరూపమగు హంసతో లీనమొనరించి చిల్లులకుండలోఁ గదలక వెలుఁగుదీపమువలె బుద్ధిని గట్టివైచి అంతఃకుంభకము బహిఃకుంభకములతో వాయువునుపయోగిం

చుచున్నయెడల మోక్షమొందవచ్చును. వృథా గాంభీర్యముతోఁ జూచుచున్న నేమియు లాభములేదు.

ఆ. ఉతకలోనితలుపు నూగించి నెట్టెడి
పదునెఱింగి లోనఁ బట్టుఁ బట్టు
మతిని గూడి మించి మర్మంబుగనుమయా, వి.

ఉతుక నూగించి తలుపు నెట్టెడిరీతిని మనస్సును పురికొల్పి బ్రహ్మమును కాంచవలయును.

ఆ. ఉదయమందు శివుని నూహించి చూచిన
సుధయుఁ బుట్టి పరముఁ జూపుఁగాక
ముదము మించి మనము ముప్పూరి గొనకున్న
చేఁదుపుట్టి మాయఁ జెఱుచు వేమ! 1205

ప్రాతఃకాలమున నిద్దురనుండి లేవఁగనే శివుని ధ్యానముచేయుదువేని అమృతస్వరూపుఁడగుశివుఁడు నీకు మోక్షముఁ జూపును. ఐహికలంపటుఁడవై శివధ్యానముగావింపవేని మాయ విషమించి నిన్నుఁ పాపలోకమునఁ గూలఁ ద్రోయును.

క. ఉపజిహ్వకుఁ బ్రాగ్దిక్కున
త్రిపుటికి మధ్యంబునందు దీపము తానై
జపియించు నాము మెవఁడో
తపసిని గనుఁగొన్న వాఁడు ధన్యుఁడు వేమా!

జిహ్వకు తూర్పుభాగమునను త్రిపుటికి నడుమనున్న వెలుఁగును కనుఁగొనువాఁడే ధన్యుఁడు.

ఆ. ఉరిదిగాను గాలి యున్నతిగను మింటఁ
దురితముగను వచ్చి తొలఁగుచుండు
పురముపైన నిల్చి పూనికఁ జూడరా, వి...

మహదాకాశమునందుఁ బరివ్యాప్తమైన వాయువు ఊరక ఉచ్ఛ్వాసనిశ్శ్వాసముల కుపయోగపడుచుండును. ఆయువును రేచక పూరక కుంభకాది సాధనములతో నుపయోగించుటకు సాధకుఁడు యత్నము విరివిగాఁ జేయవలయును.

ఆ. ఊడిగంబు జేసి యుబ్బించి గురువును
కూడి పొందవలెను కోర్కు లడఁచి
వేఁడి పరమపదవి వెలయంగఁ జూడరా, వి...

గురునకు సేవఁ జేసి యాతనిదయ నార్జించి పరమబ్రహ్మస్థితి నెఱుఁగుము. గురుఁడే మోక్షము చూపును.

ఆ. ఊరకుంట తెలియ నుత్తమయోగంబు
మానసంపుకలిమి మధ్యమంబు
ఆసనాదివిధుల నధమయోగంబులు, వి... 1209

అహం బ్రహ్మాస్మి యను నియతి ననుసరించి కేవల మీశ్వర విచారము చేయుచు నుండువాఁడు ఉత్తమయోగము నిర్వహించువాఁడు. తన్మయుఁడై మనస్సున నానందించుచు ధ్యానము నొనర్చుట మధ్యమయోగము. కేవలాసనాదులతో నవస్థపడుట అధమయోగమని యెఱుంగనగును.

ఆ. ఊర్ధ్వలోకమందు నుచితక్రమంబున
రూప మేమి లేక రూఢినుండు
పరమయోగి చూచుఁ బరమాత్ముఁ డితఁ డని, వి.

పరమాత్మఁ డూర్ధ్వలోకమున తగువిధముగా నామరూప రహితుఁడై స్పష్టముగా వెలుఁగొందుచున్నాఁడు. ఆపరమాత్ముని నుత్తముఁడగు యోగిదక్క తదన్యులు గురుతించి కనుఁగొనఁ జాలరు.

తే. ఊర్జితానందపరిపూర్ణయుక్తియందు
స్వార్జితంబగు గురుభక్తి సంతరించి
దుర్జయంబును తొలఁగంగ దోలునేని
కర్జముగ ముక్తి లభియించు గదర వేమ! 1211

సాధకుఁడు ఐహికచింతల దిగద్రావి సంతోషపరిపూర్ణుఁడై యుండి తానార్జించిన గురుభక్తి గురూపదేశము నాధారముఁ జేసికొని అంతరంగశత్రువులగు నరిషడ్వర్గమును జయింపఁగలిగినచో ముక్తి తప్పక చేకూరుననుట సత్యము.

ఆ. ఊరు సేరి యుండ నోగి సంతసింతురు
అడవియన్న మాత్ర నడలుచుంద్రు
ఊరు నడవి రెండు నొకటిగాఁ జూచిన
నారితేరుయోగి యతఁడు వేమ! 1212

అవివేకులగు ప్రజలూరు చేరినచో సంతోషింతురు. మార్గవశమున నడవిలో నుండవలసివచ్చినచో విచారపడుచుందురు. ఊరును అడవిని సమానముగా భావించువాఁడు ఆరితేరినయోగిగా గణింపఁదగును.

ఆ. ఋగ్యజుస్సులెఱిఁగి యోగ్యతలేకున్న
విప్రుఁడైన నెట్లు విహితుఁ డగును



భర్త గలిగి యన్య భావించుసతివలె, వి...

ఋగ్యజురాదివేదములఁ జదివినను యోగ్యత లేనిచో బ్రాహ్మణుఁడైనను వందనీయుఁడు కాఁజాలఁడు. అట్టిబ్రాహ్మణుఁడు భర్త గలిగియు విటులకై వెదకు జారసతివలె విసర్జింపఁదగినవాఁడనుట సత్యము.

ఆ. ఎగువదిగువఁ జూడ కేప్రొద్దు మదిలోన
తగవు లేని తలఁపు దలఁచి వలచి
నీల్గి చూచుటల్ల నెఱజాణవిద్యరా, వి... 1214

పైనఁ గ్రిందఁ జూచుచు నానావస్థలను బడుటకంటె నిస్సందేహములగు నాధ్యాత్మికసిద్ధాంతము లాశ్రయించి బ్రహ్మస్వరూపమును విజృంభించి కనుఁగొనయత్నించుటయే యుత్తమవిద్యయగును.

తే. ఎచటఁ జూచిన నచ్చట నేమి తోఁచు
నచటిదృశ్యము దృక్కుగా నంటిపట్టి
రచ్చ జేయుట ముక్తికి రాజపథము
సచ్చిదానంద మపుడొప్పఁ జాలు వేమ! 1215

శబ్దస్పర్శరూపాదిపంచవిషయములు నెఱుంగు పంచేంద్రియములు దృశ్యములు. వీనిని కార్యములయందు నియోగించువాఁడు దృక్కు. ప్రపంచమునంతటనున్న యీదృగ్దృశ్యముల నెఱింగి దృక్కును బ్రహ్మస్వరూపముగా గ్రహించుటయే ముక్తికి రాజమార్గము. సచ్చిదానందస్వరూప మారాజమార్గము ననుసరించినచో దప్పక గోచరించును.

ఆ. ఎచటనుండి వచ్చు నెచటికిఁ దాఁ బోవు
నిద్రచంద మెఱుఁగ నేర్చెనేని
అచలమైన వ్యక్తి నచ్చట నందుము, వి...1216

నిద్దుర ఎటనుండివచ్చుచున్నది. యెచ్చటకుఁ బోవుచున్నది యనువిషయము సమగ్రముగ తెలిసికొనిగిచో నిశ్చలమగు వ్యక్తిత్వము నీకు దప్పక లభించునుగావున నందులకై ప్రయత్నించుట కర్తవ్యము.

ఆ. ఎంతభాగ్యమున్న నంతకష్టపుఁజింత
చింతచేత మనసు చివుకు మనుసు
చింతలేకయుంట చెడిపోనిసంపద, వి... 1217

ఐశ్వర్య మెక్కువయగు కొలఁది మానవునకు విచారము మెండగుచుండును. విచారమువలన మనస్సు చెడిపోవుచుండును. కావున సర్వానర్థములకు మూలమగు చింత కెడమీయక యుంటయే యైశ్వర్యము.

ఆ. ఎన్ని యెన్ని పూజ లెచటఁ జేసిన నేమి
భక్తి లేనిపూజ ఫలము లేదు
భక్తి గల్గుపూజ బహుళ కారణ మగు, వి.1218

ఎన్నిపూజలను జేసిన భక్తియే ప్రధానము. అది లేనిచో వ్యర్థమగును. భక్తితోఁ జేయుపూజ తప్పక మోక్షసాధనము గాఁ బరిణమించును.

ఆ. ఏకమమరయుక్తి పాకంబుగ మనిరిచి
పోకిరి యుండుమ వెల్లసూటి యగును



తాఁకి తాఁకి మిగిలి తళుకొత్తవలె నయా, వి.

అహం బ్రహ్మాస్మి యను మూలార్థమును గమనించి పరబ్రహ్మ స్వరూపముపై దృష్టియుంచి హృదయమును బ్రహ్మమునం దైక్యముగావించుటయే మోక్షమనఁబడును.

ఆ. ఏకమైనదాని నెక్కడఁ జూతురు
పాక మెఱిఁగి చెప్పు పరుఁ డెవండు
లోకమాయఁ జూడ లో వెలి నిండెరా, వి.

మాయ సర్వము నావరించియున్నది గావున బ్రహ్మస్వరూపమును సందర్శింపఁగలుగుట సామాన్యకార్యము కాదు. దీనికను పగు సులభసూత్రమును బోధించు దైవతుల్యుఁడగు గురుఁడు కానరాఁడు గదా?

క. ఏచూడ్కి నిలిచి యుండునొ
యాచూడ్కినిబట్టి మదిని నొఁ గాదనకే
రేచకపూరకకుంభక
సూచన పర మెడు బయలు చూడుము వేమా!

మనస్సు నిచ్చవచ్చినటులఁ బోవనీయక యోగాభ్యాసముచేఁ జూపునునిలుప నభ్యసించి రేచకపూరకకుంభకాదులచే వాయునిరోధాదుల నొనరించుచు మహదాకాశమును దర్శింప నభ్యాసముచేయుట చాల ముఖ్యము.

ఆ. ఏరుదాఁటి మెట్ట కేఁగినపురుషుండు
పుట్టి సరకు గొనక పోయినట్లు
యోగపురుషుఁ డేల నొడలిఁ బాటించురా, వి.

నదిని దాఁటినపిమ్మట మానవుఁడుపడవను లెక్కపెట్టక తన త్రోవను దానేగునట్లు యోగమునెఱింగిన ధన్యుఁడు సంకల్పసిద్ధుఁడైనపిమ్మట నీదేహమును విసర్జించుటకుఁ గొంచెమేని సంశయింపఁడు.

ఆ. ఐదు చక్రములను నాదిని బడవైచి
నైదుచక్రములకు నవల వెలసి
నైదుచక్రములను నడవి బైలైతోఁచు, వి.

పంచభూతవివేచనఁ జేసి ఆపంచభూతావృత మగుదానికంటె నవ్వల నున్న యాత్మనిరూపమును గుర్తింపవలయును.

ఆ. కడుపులోనివాని గానఁగా లేరయా
కష్టపడుదు రింతెకాని జనులు
హీన మెఱుఁగ నాతఁ డిదియేల యెఱుఁగును? వి.

మానవులు వృథాప్రయత్నములతో శ్రమల నొందుచుందురుగాని హృదయస్థుఁడగు శివుని గమనింపఁజాలరు. ఈస్వల్పాంశమును గమనింపఁ జాలనివారు మోక్షము నేమిగ్రహింపఁగలుగుదురు.

ఆ. కదలనీయకుండ గట్టిగా లింగంబుఁ
గట్టివేయ నేమి ఘనత గల్గు
భావమందు శివుని భావించి కానరా, వి...

లింగధారులు కంఠమున గట్టిగా లింగమును బంధింతురు. దాన నేమిలాభము కలదు? శివుని త్రికరణశుద్ధిగా ధ్యానింపఁ జాలనివానికి యెంతలింగమున్నను లాభములేదు.



ఆ. కదియఁ బట్టి హంస కళ లంట గమకించి
సదయహృదయమందు సంతరించి
విదితమైనబయల వెన్నంటి చూడరా, వి...

బుద్ధిని బంధించి హంసకళల నవలోకించి హృదయమునందాకళలు నెలకొల్పుకొని మహదాకాశమును జ్ఞానపూర్ణమగు దృష్టితోఁ గనుట కభ్యాసము చేయనగును.

ఆ. కనుల చూపు నిలిపి కాంతిని గమనించి
కాంచవలెను చిత్రకళలు దాఁటి
కోటకొమ్మఁ జేరి కోర్కు లడంపరా, వి... 1227

దృక్శక్తిని నిలుపుట నేర్చుకొని కళలను నిలుకడగాఁ గాంచ నేర్చి ఆవల గానవచ్చు జ్యోతిర్మూర్తిపై దృష్టినుంచి ఐహికములగు కోర్కులనన్నింటిని అడఁచుకొనుటకుఁ దీవ్రముగా యత్నింపుము.

ఆ. కనులు రెంటినడుమఁ గాసంత నిలిపిన
బొమలమీఁది చూడ్కిఁ బొందఁ జేయు
క్రమ మెఱింగి లోనికాంతిని పట్టుము, వి...

దృక్శక్తిని నిలుపనేర్చి భ్రూమధ్యముననున్న (త్రికూటస్థానమునందున్న) మహాకాంతిపుంజము నవలోకింప నేర్చి యాకాంతిని హృదయమున నెలకొల్పుటకు యత్నింపుము.

ఆ. కన్ను మిన్ను చేసి కాంతిని గమకించి
తన్ను నిలిపి చూచి తలఁపు వదలి
యున్నవాఁడు పరము గన్నవాఁడే యగును, వి...

నదిని దాఁటినపిమ్మట మానవుఁడుపడవను లెక్కపెట్టక తన త్రోవను దానేగునట్లు యోగమునెఱింగిన ధన్యుఁడు సంకల్పసిద్ధుఁడైనపిమ్మట నీదేహమును విసర్జించుటకుఁ గొంచెమేని సంశయింపఁడు.

ఆ. ఐదు చక్రములను నాదిని బడవైచి
యైదుచక్రములకు నవల వెలసి
యైదుచక్రములను నడవి బైలైతోఁచు, వి.

పంచభూతవివేచనఁ జేసి ఆపంచభూతావృత మగుదానికంటె నవ్వల నున్న యీశునిరూపమును గుర్తింపవలయును.

ఆ. కడుపులోనివాని గానఁగా లేరయా
కష్టపడుదు రింతెకాని జనులు
హీన మెఱుఁగ నాతఁ డిదియేల యెఱుఁగును? వి.

మానవులు వృథాప్రయత్నములతో శ్రమల నొందుచుందురుగాని హృదయస్థుఁడగు శివుని గమనింపఁజాలరు. ఈస్వల్పాంశమును గమనింపఁ జాలనివారు మోక్షము నేమిగ్రహింపఁగలుగుదురు.

ఆ. కదలనీయకుండ గట్టిగా లింగంబుఁ
గట్టివేయ నేమి ఘనత గల్గు
భావమందు శివుని భావించి కానరా, వి....

లింగధారులు కంఠమున గట్టిగా లింగమును బంధింతురు. దాన నేమిలాభము కలదు. శివుని త్రికరణశుద్ధిగా ధ్యానింపఁ జాలనివానికి ఎంతలింగమున్నను లాభములేదు.



ఆ. కదియఁ బట్టి హంస కళ లంట గమకించి
సదయహృదయమందు సంతరించి
విదితమైనబయలు వెన్నంటి చూడరా, వి...

బుద్ధిని బంధించి హంసకళల నవలోకించి హృదయమునందాకళలు నెలకొల్పుకొని మహదాకాశమును జ్ఞానపూర్ణమగు దృష్టితోఁ గనుట కభ్యాసము చేయనగును.

ఆ. కనుల చూపు నిలిపి కాంతిని గమనించి
కాంచవలెను చిత్రకళలు దాఁటి
కోటకొమ్మఁ జేరి కోర్కు లడంపరా, వి... 1227

దృక్శక్తిని నిలుపుట నేర్చుకొని కళలను నిలుకడగాఁ గాంచనేర్చి ఆవల కానవచ్చు జ్యోతిర్మూర్తిపై దృష్టినుంచి ఐహికములగు కోర్కులనన్నింటిని అడఁచుకొనుటకుఁ దీవ్రముగా యత్నింపుము.

ఆ. కనులు రెంటినడుమఁ గాసంత నిలిపిన
బొమలమీఁది చూడ్కిఁ బొందఁ జేయు
క్రమ మెఱింగి లోనికాంతిని పట్టుము, వి...

దృక్శక్తిని నిలుపనేర్చి భ్రూమధ్యముననున్న (త్రికూటస్థానమునందున్న) మహాత్కాంతిపుంజము నవలోకింపనేర్చి యాకాంతిని హృదయమున నెలకొల్పుటకు యత్నింపుము.

ఆ. కన్ను మిన్ను చేసి కాంతిని గమకించి
తన్ను నిలిపి చూచి తలఁపు వదలి
యున్నవాఁడు పరము గన్నవాఁడే యగు, వి...

కన్ను నూర్ధ్వముగా బఱపి చిత్స్వరూపమును గుర్తించి ధ్యానించిన కేవలుఁడై తన్మయుఁ డగును.

ఆ. కన్నెపడుచు గాంచి కదలనీకుండిన
యాస బట్టి యొక్కయూపుఁ బట్టి
కరఁగఁ బెట్టి దాని కడముట్టఁ జేయరా? వి...

కన్నెపడుచులఁ గాంచినంతనే మోహమున వారలనంటి చలించు నీచబుద్ధిని బట్టితెచ్చి సమాధియనుమూసలోఁ బెట్టి దానిని కఱఁగి రూపుమాపుటకు యత్నింపుము.

ఆ. కపట వేషమూని కడగండ్లు పడనేల
విపినభూమి తిరిగి విసుగనేల
యుపముతోనె ముక్తి యున్నది కనవలె, వి...

వేషములు వేసి యోగినని పేరుబెట్టుకొనుటయు అడవులు తిరిగి విసుగునొందుటయు వృథాయాసము. ముక్తి సులభోపాయములతో లభ్యముకానుండ మందమతులు నానావస్థలకు లోనగుచున్నారు.

ఆ. కరఁగ కరఁగఁ బుట్టు కనకంబునకు వన్నె
పెనఁగ పెనఁగ బుట్టు ప్రేమ సతికి
ముదియ ముదియఁ బుట్టు మోహంబు లోభంబు, వి.

కరుగఁగాఁ కరుగఁగా కనకమునకు వన్నె పుట్టును. అటులనే యెలపుడు పెనఁగుచున్నచోఁ సిగ్గు విడియముగల స్త్రీకి సైతము ప్రేమగలుగును. ముదిసినకొలఁది మానవునకు వలపు ద్రవ్యాదులపై నాశయుఁ జనించుచుండును. ఇది లోకధర్మము.



ఆ. కరతలంబు నెత్తి కాలి నదిమిపట్టి
యూర్ధ్వదృష్టిచేత నొనర నిల్పి
సర్వమై తనరుటఁ జాలనాయువు కల్గు, వి...

చేతులను పయికిసాచి కాలినదిమిపట్టి దృష్టి నూర్ధ్వప్రసారము గావించి సర్వావయవములఁ దనవశమునం దుంచుకొనుట యుత్తమయోగము. ఇది వీరాసనమునకుఁ జేరుప. దీని నవలంబించినచోఁ బూర్ణాయువుగలుగును.

ఆ. కల్పమనఁగ నగును గారణబీజంబు
కల్పమనఁగ శివునికల్పితంబు
అల్పుఁ డేమి యెఱుఁగు నానందభోగము, వి...

కల్పమనఁగా బ్రహ్మకొకదినము. ఇది ఈశ్వరకల్పితము. ఈకల్పమే కాలకల్పనమునకును సృష్టికిని బీజము. ఈకల్పము భువనానందకరమనియుఁ గల్పములు గడచుట శాశ్వతస్వర్గప్రాప్తికని స్వల్పబుద్ధు లెఱుంగరు.

ఆ. కలిగియు దినలేక కష్టించురోగికి
నాఁడువారిమీఁద నాస గలదె
అన్నమదముతోడ నఖిలమదంబులు, వి...

ఉన్నంతవఱకుఁ దిని సుఖముగా బ్రదుకచేతగాని కష్టజాతకుఁడగు రోగి చెలువలపై వలపూనఁజాలఁడు. అన్నమదము తలకెక్కినవానికే మోహ మావరించును.

ఆ. కలిగినట్టి యుండు కలుగక యుండును
మఱియు లేకపోవు తిరిగిఁ గలుగు

గలిమి నెచటఁ జూడ గారడి యనవచ్చు, వి...

సంపద నింద్రజాలములోఁ బోల్పవచ్చును. సంపదకలిగి నటులె యుండి సమకూరకయుండును. ఒకపుడు కలుగును. మఱియొకపుడు నశించును. దానికించుకేనియు నిలుకడ యను మాటలేదు.

ఆ. కలిమిగలయతనికిఁ గన్యక నిచ్చుచు
మొఱియుచుంద్రు గాదె మూఢజనులు
పూజఫలమె కాని పూనిక ల్నిల్చునా? వి...

కలిమి గలవానికి కన్నెనిచ్చి యుబ్బిపోయెదరు. ఇది చాల యవివేకకార్యము. ఇపుడున్న సంపదలు ఈపట్టుదలలు చివరవఱకు నిలువఁగలవా? పూర్వసుకృతము లేనివానికి సంపదలెన్నఁటికిఁ గలుగవు.

ఆ. కలుగుచింతలన్ని కడఁకతో దాఁటఁగ
వెలుఁగుచంద్రకాంతి వేడుకలర
నిష్పత్తిల్లఁ గోరు నిర్గుణయోగులు, వి... 1238

చింతలను అంధకారమును దాఁటినచో జ్ఞానమను చంద్రకాంతి గోచరించును. దాన మోక్షము సిద్ధించును. నిర్గుణులగు యోగులు సైతము మిట్టికాంతిని దర్శించుటకై ప్రయత్నము చేయుచున్నారు.

ఆ. కలుగుసుఖము లెల్లఁ గల్లగా రోయుచు
మెలఁగుచుండవలయు మిహిరుపగిది
తిరుగు నేర్పుఁ జూడ ధీరుఁడే యగునయా, వి...



సుఖముల నన్నింటిని జులకనగాఁ జూచి తిరస్కరించి మనుజుఁడు జ్ఞానవంతుఁడై స్వయంప్రభతో సూర్యునివలెఁ బ్రకాశింపవలయును. ఇటుల మెలఁగు నేర్పుగలవాఁడె ధైర్యశాలియు నుత్తముఁడు.

ఆ. కలుపు దీసి నరులు కాపాడి పయిరులఁ
బెంచు ప్రేమవలెను బెనిచి మదిని
దృశ్యములను ద్రుంచి తెంపుగా నుండుము, వి.

కర్షకులు కలుపుదీసి పైరుగాపాడి ప్రేమతోఁ జూచునటుల సాధకుఁడు మాయావరణమగు దృశ్యమును దిరస్కారభావముతోఁ జూడవలయును.

ఆ. కలుష మెల్లఁ దెలియఁ దలవంపులకు మూల
మరయ దత్త్వ మెల్ల నాత్మ బుట్టుఁ
దెలిసినందునకును ధీరుఁడు గావలె, వి... 1241

ఐహిక సంబంధములగు పాపములకు లోఁబడుట మిగుల నవమానకరము. నీహృదయమునందున్న జీవుని శివునిగాభావించి యాత్మజ్ఞాన మార్జించి యుత్తముఁడవగుము.

ఆ. కలుష మొక్కయింత కాన్పింప దెందును
జూడ నెవరికైన సొంపు మీఱఁ
దామసం బడంగఁ దా వెల్గు జ్ఞానంబు, వి...

పుట్టువు మొదలుకొని వీఁడు పాపాత్ముఁడు వీఁడు పుణ్యాత్ముఁడని యెవనినేని నిర్ణయింప శక్యముగాదు. ఒక[illegible]స్వభా

వము లేకున్నచో ప్రతినరునకు జ్ఞానము కరగతమగుననుట సత్యము.

ఆ. కస్తురిపలవేల గజరాజమున కెన్న
తనదు మదపుధారతావి గాక
యోగి కేల రంభ యోగహర్షం బుండ, వి...

మదపుటేనుఁగు తనగండచ్యుతము లగుమదధారలతావి కానందించునుగాని కస్తూరిమొదలగు సుగంధద్రవ్యములను గోరదు. అటులే యోగిసైతము తనయోగవిద్యలతో నానందించును గాని వలపులాండ్రులచక్కఁదనమున కించుకేని మురియఁడు.

ఆ. కానరానిబయలు గనుటయే మోక్షంబు
మేను మఱచి నిద్ర మెలఁగినట్లు
తాను తాను గాను దలఁపు మఱపు దాఁటు, వి.

బాహ్యశరీరమును ప్రపంచమును నేను నీ వనుభావమును మఱచి సామాన్యదృష్టికగుపడని మహాకాశమును దిలకింపఁగలుగుటయేగాక; తనదేహమును దామఱచి నిదురనొందినటు లుండుటయే మోక్షము.

ఆ. కానరానివాని కనుపించువానితో
కాపు చేయ నలుక కరుణతోడ
కానరానివాని కరుణేమికందురో? వి.... 1245

కానరాని బ్రహ్మస్వరూపమును గానవచ్చు సామాన్యమానవునియం దారోపించి యుపాసనము జేయవలయును. లేకున్న



యెడల నదృశ్యాకారముగనున్న బ్రహ్మస్వరూపముయొక్క దయఁబొందుట కష్టము.

ఆ. కామి యైనజనుఁడు ఘనుఁడు గాఁడాయెనే
కామిగాఁడె కృష్ణసామి ముందు
కామి గానిజనుఁడు గణపతి గాఁడొకో? వి...

ప్రథమమునఁ గామవికారములకు లోనైనవారు పిమ్మట మహాజ్ఞానులుగావచ్చును. దైవముగా భావింపఁబడు శ్రీకృష్ణుఁడు పూర్వము కాముకుఁడెగదా! కామాదివికారముల నెఱుంగక పుట్టు బ్రహ్మచారిగా నున్నవాఁడు వినాయకునివలెఁ గుక్షింభరుఁడె.

ఆ. కాయము దగ గూడి కడఁగి యోగిగ నున్న
కాయ మిలను బడిన ఘనుఁడు గాఁడు
కాయమునను ముక్తి కడతేఱవలె నయా, వి.

దేహమునాశ్రయించిదీనిసాహాయ్యముతో యోగియనిపించుకొనినవాఁడు మరణించెనేని వానిశ్రమ యంతయు వ్యర్థమగును. అట్టివాఁ డుత్తముఁడు గాఁడు. దేహముండఁగనే మానవుఁడు కడతేఱఁ బ్రయత్నింపవలయును.

ఆ. కాలు చేయి లేదు కంచుకంబు గలదు
కొమ్ము లేక యురికి చిమ్ము వేగ
గరిడి లేక చంపు కడుచోద్యమగునయా, వి....

మరణమనుదానికిఁ గాలుచేతులు లేవు గాని మాయావరణమను కంచుకముగలదు. కొమ్ములులేవుగాని కాలపాశమను గొ

ష్మలతో నెట్టివారినైన కుమ్మఁబోవును. ఇంతియగాక యెట్టి సాము సాధనములను దోసుదీసికొనక యెంతవారినైనఁ బోకార్చును.

ఆ. కోటకోట తిరుగు కొమ్ము లేనుఁగు గాదు
త్రాటిపట్టెసందు తగిలియుండు
పోటుబంటునైన బొర్లింపక విడఁడు, వి...1249

జీవుఁడు ప్రతికళేబరమునందును గోటకుఁగోటకు దిరుగు నేనుఁగువలె సంచరించును. దేహమునకు ఈశ్వరునకునంటి తిరుగుచుండును. మాయావరణమును లోఁగొని యెంతవారినినైన జీవుఁడు వంచించుచునుండును.

ఆ. గగనచిత్తదృష్టి గద్దియపైఁ జేర్చి
యనువరైనయాతఁడచల మంటి
యుజ్వలాంశమందు నూహించుఁ దత్త్వము, వి.

దృగ్లక్ష్యము నార్జించుటకుముందు మహదాకాశముపై చూపు నిలుపవలయును. పిమ్మట నాచూపు సహస్రారమునఁ బ్రవేశింపఁజేయుట కభ్యసించి అచలయోగము ననుసరించి పరమాత్మస్వరూపము నూహించుటయే తత్త్వ మనఁబడును.

ఆ. గట్టుమీఁద నున్నఁ గాన్పించు సర్వము
తెలిసి తేటపడినఁ దెలియు నెల్ల
లోకవిషయములును లోనిరహస్యముల్, వి...

ఉన్నతమగు కొండపై నెక్కినచో సమస్తవస్తువులు క్రింది



వి గానుపించునట్లు జ్ఞానమునార్జించిన వానికి ప్రపంచవిషయములు లోకరహస్యములు స్పష్టముగాఁ దెలియును.

ఆ. గట్టురాళ్ల దెచ్చి కాళ్లఁ జేతులఁ ద్రొక్కి
కాఁచి యులులచేతఁ గాసిఁ జేసి
మొఱకురాళ్ల కెఱఁగు మొప్పెల నేమందు? వి.

కొండరాళ్లుదెచ్చి కాళ్లతోఁ జేతులతోఁ ద్రొక్కి యులులతోఁ జెక్కి బొమ్మలుచేసి యవివేకులా బొమ్మలకు మ్రొక్కుచున్నారు వారి నేమనవలయును?

ఆ. గర్వియింద్రియముల గట్టివేయఁగలేక
చావు వచ్చునపుడె సన్న్యసించు
నాత్మజయము లే దిఁ కంటునా మోక్షము? వి.

సంసారలంపటుఁడు ఇంద్రియముల జయించి సన్న్యాసము యౌవనమునఁ దీసికొనలేక చావఁబోవునపుడు సన్న్యాసముఁ బుచ్చుకొనును. ఆత్మోన్నతిలేనివాఁడు సన్న్యసించినను మోక్షము సమకూరనేఱదు.

ఆ. గాలి గాలి గలసె గగనంబు గగనంబు
మన్ను మన్ను గలసె మంటమంట
నీరు నీట గలసె నిర్మలంబై యుండె, వి...1254

జీవుఁడు పంచభూతావృతమగు దేహమును విడచెనేని పృథివ్యాపస్తేజోవాయురాకాశములయందు ఆయాభాగములు వెంటనే గలసిపోవును. అపుడు జీవుఁడు నిర్మలముగనుండును.

ఆ. గాలి ఫణికిఁ జేసెఁ గసవు పసికిఁ జేసె

మంటి నెఱుకఁ జేసె మఱవ కిలను
పుడమిని జనులకు బువ్వట్లు చేసెరా, వి. 1255

పాములకు గాలియు, పశువులకు గసవు, ఎఱ్ఱలకు మట్టియు దైవ మాహారములుగఁ జేసెను. అటులె దైవము మానవులకు అన్నముగల్పించెఁ గాన దాని మానఁదగదు.

ఆ. గాలియందె పుట్టి గాలియందె పెరిఁగి
గాలి దెలియ లేరు గాదె నరులు
గాలియందె యాత్మ కల దదే తత్త్వంబు, వి...

మానవులు గాలియందు జనించి గాలియందు వృద్ధినొంది గాలియొక్కశక్తి నెఱుంగఁజాలకున్నారు. ఆత్మయు గాలియందే కలదు. ఆవాయుస్థమగునాత్మయే తత్త్వము బ్రహ్మస్వరూప మని యెఱుంగవలయును.

మత్తకోకిల:—
గాలి రాకలు పోక లుండెడికాలమే బ్రతుకాయెరా
లీలతోఁ బరమాత్మ నెంచఁగలేనిమాయల గంటిరా
చాల నమ్మియు నాత్మశీలున సాధనంబునఁ గానరా
మేలుగా నిఁక నీవు నీయెడ మేళగింపర వేమనా!

గాలియొక్క రాకవలన బ్రతుకుట పోకవలనఁ జనిపోవుటలు కలుగుచున్నవని యెఱింగియు మానవుఁడు మాయావశుఁడై యీశ్వరవిచారము చేయఁజాలకున్నాఁడు. పరమాత్ముని యందు విశ్వాసముంచి యాత్మసాధనముతో నీశ్వరుని గాంచి జీవేశ్వరైక్యము గావింపఁ బ్రయత్నించువాఁడు కడలేరును.



ఆ. గుణవిహీనజనుని గుణ మెంచఁగా నేల?
బుద్ధి లేనివాని పూజ యేల?
మనసు లేనివాని మంత్రంబు లేమయా, వి. 1258

సుగుణములు లేనివానిని గూర్చి విశేషించి చర్చింపఁదగదు. బుద్ధిహీనులను బూజచేసి గౌరవింపఁగూడదు. మనసు నిలుకడ లేనివానిపద్ద మహామంత్రములున్నను బాటించి వానిని బరిగ్రహింపఁ గూడదు.

ఆ. గురువు సేవఁ జేసి గురితోడ భుజియింప
వలెనటంచు నరులు వాంఛ దీఱ
బలుకుచుంద్రు గాని భావంబు గానరు, వి. 1259

గురువును సేవించవలయును. గురువులపంక్తిలో భుజింపవలయును. లేదా వారి ప్రసాదమును దినవలయును. అని పామరులందురు గాని దానియందలి భావము నెఱుఁగఁజాలకున్నారు. ఈ యాడంబరములకంటె గురుశుశ్రూష సలుపుటయే మోక్షకరము.

ఆ. గుహలలోన జొచ్చి గురువుల వెదకంగ
క్రూరమృగ మొకండు తారసిలిన
ముక్తిదారి యదియె ముందుగా జూపురా, వి.

కొంద అవివేకులు మహామునులు గుహలలోనుందురు; వారు దర్శింతురని గుట్టలను గట్టులను గుహలను దిరుగుచుందురు. వాండ్రు తిరుగుటతోఁ బెద్దపులిలో నగు క్రూరమృగములు

తారసించెనా ముక్తికదియే యోగులకంటె ముందుగాఁ జ్రోవఁ జూపును.

తే. గెంటి యెఱుకను జిత్తనుమంటఁ గలిపి
కంటి కింపగు గురుశక్తి మింటఁ జేర్చి
జంట బాసిన ఘనుఁడె పో జాణుఁ డరయ
బంటుతన మది పరమందుఁ బనికి వేమ! 1261

తనపరిజ్ఞానమును ఆత్మజ్ఞానముగా మార్చి దృక్శక్తిని మహాదాకాశముపైని జేర్చి సుఖదుఃఖములను జంటను దొలఁగిన వాఁడె యుత్తముఁడు. ఆతఁడె పరలోకమును బొందఁగలుగును.

ఆ. గొఱ్ఱెలు పదివేలు కూడియుండినచోట
తల్లి నెఱిఁగి వచ్చు దానికొదమ
పరమయోగి నెఱిఁగి భక్తుండు వచ్చురా, వి...

పదివేలగొఱ్ఱెలలో తనతల్లి నెఱిఁగి పిలవచ్చునట్టులనే భక్తుఁడును పరమయోగిని గుర్తించి వచ్చును.

ఆ. ఘటపుజలములందు గగనము గాన్పించు
ఘటము జలము లేమి గగన మేది
ఘటములోన జ్యోతి క్రమమున జూడరా, వి...

కుండనీటిలో నాకాశము గాన్పించును గాని వట్టికుండలో నాకాశము గానుపింపదు. అటులే దేహమునాధారముగాఁ జేసి కొందువేని దేహమునందున్న ఆత్మతత్త్వము గానుపించును గాన దేహమె మోక్షసాధనము.



ఆ. చంద్రసూర్యగతులఁ జర్చించి వేగమే
రంధ్రమునను జొచ్చి రంగుమీఱఁ
జంద్రశాలఁ జేరి చైతన్య మందరా, వి... 1264

చంద్రసూర్యనాడుల గుర్తించి భ్రూమధ్యమున దృష్టి నిలిపి ఈశుని భజింపుము.

ఆ. చపలచిత్తవృత్తి జయమొంద గమకించి
నిపుణుఁడయ్యు యోగనియతి మీఱి
తపముఁ జేయువాఁడు తత్త్వాధికుండురా, వి...

మనస్సునకుఁ గలచాంచల్యమును దొలఁగించుకొనుటకు యోగముల నభ్యసించి, దాన కృతార్థుఁడై తపము జేయువాఁడు తప్పక యీశ్వరస్వరూపమును సందర్శింపఁగలుగును.

ఆ. చర్మ మెపుడు జీవసౌఖ్యంబు గోరును
జీవి కర్మములను జేరుచుండు
జీవి కర్మమెల్లఁ జెడరోయ తత్త్వమా, వి. 1266

దేహములోని యొక్కొక్కభాగ మొక్కొక్కసుఖమును గోరును. చర్మము స్పర్శసుఖమున కాశించును. జీవి కర్మములకొఱకు వెదకుకొనుచుండును. కర్మములను వదలుకొనుటయే తత్త్వము నెఱుంగుట యగును.

ఆ. చిక్కి దక్కబోదు చిగిరించు మదిలోన
నిక్కు బట్టి గురుతు నెఱయఁ జూచి
సొక్కియున్న ఘనులు సూత్రాత్ము లగుదురు, వి.

ఆత్మతత్త్వము సాక్షాత్కరించి వెంటనే మాయమగును గాన నిశ్చలబుద్ధితో నుపాసించెదరేని తన్మయులగుదురు.

ఆ. చిత్తమందు శివుని జింతించి చూచిన
హత్తుకొనును బదవి హాని లేక
పొత్తు మఱవగానె పొందును సుఖములు, వి...

మనస్సునందు ఈశ్వరస్వరూపమును బ్రతిష్ఠించి చూచినచోఁ గొంతకాలమునకు ఈశ్వరసాక్షాత్కారమగును. ఎట్టియపాయము కలుగదు. ఇటు ఈశ్వరసాక్షాత్కారమైనపిమ్మట దేహమును వదలినయెడల మోక్షసౌఖ్యము సమకూరును.

ఆ. చిత్తవాజి నెక్కి శిక్షింప నేరక
తత్తఱపడినంతఁ దఱుగునొక్కొ
వారణాసి తనకు వైయాసి కాఁబోలు, వి...

చిత్తమను గుఱ్ఱమునెక్కి మానవుఁడనుకొను మెలఁకువతో దానిని నడిపింపవలయును. భయపడినమాత్రమున అశ్వమువలని ప్రమాద మెన్నటికిఁ దప్పదు. మనస్సను చంచలాశ్వము నెక్కినవాఁడు కాశికిబోయినను గయకుబోయినను లాభము లేదు.

ఆ. చింత పాఱఁదోలి చెవి యొగ్గి వినఁగనె
కొన్ని హితవు లమరి కొఱఁత దీఱు
కాన గురుని జేరి గమనించి చూడరా, వి...

ఐహిక సంబంధములగు విచారములను బోఁద్రోలి దేశికుని చెంతఁజేరి జ్ఞానోపదేశము నాలకించినయెడలఁ గొఱఁతలన్నియుఁ దీఱిపోవునుగాన గురుని సేవించి విజ్ఞానము నార్జించుటకర్తవ్యము.



క. చిన్నది యెలప్రాయంబునఁ
గన్నది పతిలేక సుతుని కడుచిత్రముగా
నెన్నఁడు రతి లవ మెఱుఁగదు
చన్నీయక పెంచె నౌర జగముల వేమా!

మాయ యనుచిన్నది తొలుదొలుతనే, సంసారమను సుతుని గాంచెను. మాయకుఁ బరేశ్వరునితో నెప్పుడు సాంగత్యమే లేదు. అయినను గుమారుల నెటులగాంచెనో ఎటుల సాకెనో యను సంశయము ఆశ్చర్య కారణముగా నున్నది. (మాయవలన బ్రపంచము నడచుచున్నదని భావము.)

ఆ. చీఁకటింటఁ బుట్టి చీఁకటఁ బెఱిగిన
చీఁకటి మఱుఁగుననె చిక్కనేల
చీఁకటి దెలిసిన సృష్టి కాన్పింపదా? వి... 1272

మానవుఁడు మాయలో జన్మించి మాయలో బెఱిఁగిమాయావరణమునఁ దగులుకొనుచున్నాఁడు. ఈమాయఁబోనాడినచోఁ బ్రకృతిస్వరూపము గోచరించును.

ఆ. చెట్టునందుఁ బుట్టి చెలరేఁగు కాయలు
దనరు కాంతితోడఁ దగిలి పండ్లు
పండు వానిదిండ్రు వర్ణంబు దెలియుఁడీ, వి...

బ్రహ్మాండ మనువృక్షమునందు జ్ఞానమను కాయలు కలవు. మోక్షమను ఫలములు కలవు. మోక్షఫలమును భుజించుటకు నుత్సాహముతోఁ బ్రయత్నింపుము.

ఆ. చెవులలోన బుట్టు రవమె యాకాశంబు
కన్నుల గనునదియె కళల జ్వాల
ముక్కులోనిగాలి ముక్తికి త్రోవరా, వి. 1274

చెవిలో మాఱుమ్రోఁగు ప్రణవనాదఘంటాధ్వనియే మహాకాశము. కనులముందుఁ గానవచ్చుకళలె జ్వాలాసమూహము. ప్రాణాయామానుసారముగా నాసికతోఁ గాలిబిల్చుటయే యోగసాధనము. ఈమూఁడును మోక్షమునకు మార్గములు.

ఆ. చెవుల విన్నయట్టి రవమును వివరించి
మన సదెఱిఁగినపుడు మఱలుకొనును
చెవులు శబ్దమునను జెడరోయ ముక్తిరా, వి...

చెవులలోఁ బ్రణవరవమును విని దానిని మనస్సున నెలకొల్పుకొని ఇఁక శ్రుతిని శ్రవణమును విడిచి తన్మయతతో నుండి యితరశబ్దములకు విముఖతగా వర్తించుటయే ముక్తి.

ఆ. చదివి చదివి చదివి చావంగ నేటికి
చావు లేనిచదువు చదువవలయు
చదవు లేక కోటిజనులు సచ్చిరి గదా, వి...

చదివి చదివి కడకుఁ జచ్చిపోవుటకంటె చావు బ్రదుకులు లేని జ్ఞానవిద్య నభ్యసించుటయే యుత్తమము. చదువుకొనిన వారందఱు కడకుఁ జనిపోవుచుంటచే వారిచదువులు నిష్ఫలములు.

ఆ. చనఁగ చనఁగ దాఁకు జనుఁ ద్రోవలో కాశి
వినఁగ వినఁగ ప్రణవ విభవరవళి



కనఁగఁ గనఁగఁ బుట్టు కారణ మదియెరా, వి...

బాటసారిగాఁ జెంపులేకపోవుచున్నచోఁ బోవఁబోవ కాశి సమీపమగును. అటులే ఇతర ధ్వనులనాలింపక సమాధినుండి యాలించినచో దశవిధనాదములు వినవచ్చును. ప్రపంచచిత్రములు గాంచుటతోఁ దృప్తినొందకున్నచో బ్రహ్మమును సందర్శింపవచ్చును

ఆ. చలముపట్టి మదిని జనియించుగుణముల
తతిని ద్రుంచి వేగఁ దమక ముడిగి
సతముగాను బుద్ధి సవరింప నదె ముక్తి, వి...

పట్టుదల వహించి మనమునందు జనించు సత్వరజస్తమోగుణముల బలము నడంచి జ్ఞానశాలివై బుద్ధిని లోఁబఱచుకొన్న యెడల నదియే మోక్షమనఁబడును.

ఆ. చావు దెలియువాఁడు సన్న్యసించు న దెట్లు
కడపలందు ఘనత గదురు నెట్లు
పాప మొకటె మీఁద ఫలమేమి లేదురా, వి...

తన కింతకాలమే ఆయుఃపరిమితియని బాగుగాఁ దెలిసినవాఁడు సన్న్యసించియీస్వల్పకాలములోనే నేమియాత్మవిచారము చేయఁగలననిసన్న్యాసమునకంగీకరింపఁడు.అట్టివాఁడుఅంత్యమునఁ బొందఁదగినవిజ్ఞానము నొందలేఁడు. ఇంతకు ముఖ్యమే మన తనబంధువుల నందఱనెడఁబాసి పరితపింపఁ జేసినపాప మొక్కటియే దక్కును.

ఆ. చూపులోనిచూపుఁ జూడంగఁ జూడంగఁ

దెలివిలోని తెలివి వెలుఁగుచుండు
నిద్రలోనినిద్ర నిజమని తెలియరా, వి. 1280

బహిః ప్రపంచసందర్శనమును మాని లోని చూపుతో హృదయకమలమును దర్శింపనెంతువేని కళ లుదయించును. కళాసందర్శనానంతరము చూపులు పరబ్రహ్మస్వరూపమును దర్శింపఁగలవు.

ఆ. చూపులోనిచూపు సూక్ష్మమౌ దెలియంగఁ
జూపులోనిచూపు శుభ్రమగును
జూపులోనిచూపు సురవర గమ్యంబు, వి...

నీవునిశ్చలము నిర్మలమునగు పరముపై నాసక్తియున్నయెడల దృష్టిని నాసాగ్రమున నిమిడ్చి యుత్సాహముతోఁ బట్టుదలతోఁగాంచుచున్నయెడల బ్రహ్మస్వరూపము మిగులసమీపములోనె గోచరించితీఱును.

ఆ. చొక్కమైనపరము చుఱకరివై చూడ్కి
ముక్కుతుదనుగూర్చి ముదముతోడఁ
దక్కఁ జూచినంత దగ్గఱై యుండురా, వి...

దృష్టిని నాసాగ్రమునందు నిలిపి తదేకచిత్తుఁడవైయుపాసించిన బ్రహ్మము సాక్షాత్కరించును.

ఆ. ఛురికతోడఁ గోయఁ జొప్పడునే కాని
దానిపిడిని గోయతరమె నీకుఁ
దెలివి లేనిమేని బలమేమి చేయును? వి. 1283

కత్తితో నితరమును కోయఁగలవే గాని ఆకత్తిపిడితో



దేనినికోయఁ జాలవు. అట్టులే తెలివి లేనట్టి శరీరబలముతోనే కార్యమును ఉపాయము లేకున్న సాధింపఁజాలవు.

ఆ. జననమరణము లిల జంగమునులు సుమ్మి
జననిజనకు లిలను జలధిరీతి
వినుతిఁజేసి గురుని వెన్నంటి చూడరా, వి...

జననమరణములును జననీజనకులును చక్రభ్రమణపురీతిని గలుగుచుండును గావున సూక్ష్మరూపి యగునీశుఁ గాంచికృతకృత్యుఁడవు కమ్ము.

ఆ. జపము బాహ్యపూజఁ జాలగాఁ జేసియుఁ
గపటము విడలేక కష్టనరులు
ముక్తి నొంద లేక మునిఁగిరి తమమున, వి...

కొందఱు తమోగుణప్రధానులగు జనులు జపము, శివపూజలు గావించుచుఁ గపటవృత్తిని మానుకొనక యుండుటచే ముక్తిని బడయఁజాలక కడకుఁ దమోగుణమున నే మునిఁగిపోవుచున్నారు.

ఆ. జాగ్రతనఁగ నేమి జన్మ మనఁగ నేమి
జన్మమునకు నరయ జాగ్రతాయె
జన్మజాగ్రతలను సాధింపరా ముక్తి, వి. 1286

జన్మమన నేమియో జాగ్రత్తయన నేమియో యీరెంటికి సంబంధ మెట్టిదో? సామాన్యు లెఱుంగఁజాలరు. జన్మమునకు జాగ్రత్తగ మంచిసంబంధముకలదు. ఈసంబంధము గమనించిన ముక్తి సాధ్యమగు ననుటసత్యము.

ఆ. జాతి వేఱులేక జన్మక్రమంబున
నెమ్మదిని నభవుని నిలిపెనేని
నఖిలజనులలోన నతఁడు ఘనుండయా, వి...

జాతిభేదములు మతవైషమ్యములు పాటింపక జన్మక్రమము వలనమనుష్య జాతియంతయు సమానమని తలంచువాఁడు సర్వ జాతుల వారిలోన నుత్తమోత్తముఁ డనుట సత్యము.

ఆ. జాతులందు నెట్టిజాతి ముఖ్యమొ చూడు
మెఱుకలేక దిరుగ నేమిఫలము
ఎఱుక గల్గ మనుజుఁ డేజాతి గలవాఁడొ, వి...

జాతులలో నేది ముఖ్య మని తెలినితక్కువచేత దిరుగుట వ్యర్థము. జ్ఞానము గలిగివిచారించినయెడల ఎఱుకగలమానవుఁడే జాతిలోనివాఁడైనను పూజనీయుఁ డనుట సత్యము.

ఆ. జారపురుషుమీఁద సద్భక్తి నిలుపుచుఁ
బతికి నిచ్చకముగఁ బరగుభంగిఁ
బరముకొఱకు యోగి పాటించు దేహంబు, వి.

మిండమగనిమీద మిగులప్రేమ వలపు నిలిపి మగనివద్ద నిచ్చకముగా మెలంగు అంకుటాలివలె నిజమగుయోగి పరలోకముపై హృదయముంచి తత్సాధనము కొఱకే దేహము ధరించుచుండును.

ఆ. జీవలింగపూజఁ జేసినవారికి
శిలలరూపమందుఁ జింత యేల
చెలఁగి మధువు గ్రోలఁ జేఁదు రుచించునా, వి.



జీవుఁ డనులింగమును అరసి పూజ చేసినవానికి ఇతరశివలింగములపూజ చేయ నవసరము లేదు. తేనియఁ ద్రావి తత్స్వాదు వ్యము ననుభవించువానికి చేదువస్తువు లెన్నఁటికిని రుచింపఁజాలవు.

ఆ. జీవిఁ జంపు టెల్ల శివభక్తి తప్పుటే
జీవు నరసి కనుఁడు శివుఁడె యగును
జీవుఁడు శివుఁడనుట సిద్ధంబు దెలియురా, వి...

జీవహత్య చేయుట శివునిజంపుటవంటిది. ఏలయన జీవుఁడే శివుఁడు, జీవుఁడు నీశ్వరరూపుఁడు. శివుఁడను నంశము సిద్ధాంతముగాన నమ్మదగినది.

ఆ. జ్యోతియందె పుట్టె సొంపైన నాదము
బిందు వమరె నాదమందుఁ దెలియ
బిందు వందుఁ బుట్టెఁ బృథివి యాకాశముల్,వి.

జ్యోతియందు నాదము, నందు బిందువును, అందు బృథివ్యాది పంచభూతములు జనించె నని యెఱుంగుము.

ఆ. టక్కుయోగి యెంత టాటోటు చేసిన
వివర మరసినంత వెగటు గలుగుఁ
బరము సున్న నరకబాధయు సిద్ధంబు, విశ్వ....

టక్కరియోగులు లోకులను మోసగించుట కెన్నియో మోసములు చేయుచుందురు. వారు కృత్రిములని తెలిసికొన్నపిమ్మట వారిచేష్టలన్నియు మిగులనసహ్యము పుట్టించును.

ఇట్టిబూటకపు సన్న్యాసులకుఁ బరలోకమున నరకబాధ తప్పక కలుగును.

ఆ. టక్కుమాట లాడి చిక్కులఁ బెట్టిన
నిక్క మెఱుఁగు నతఁడు నిర్వహించుఁ
జక్కనైన జ్ఞానసారంబు తెలియురా, వి. 1294

వంచకుఁడగుయోగి టక్కరిమాటలాడుచు నెదటివానిని జిక్కులఁ బెట్టుటకు యత్నించెనేని సత్యమగు జ్ఞానముగలవాఁడా మోసమెఱింగి స్వకార్యము నిర్వర్తించుకొనఁగలుగును. కావున వంచకుల బారిని జిక్కకుండుటకై జ్ఞానసారము నార్జింపవలయును.

ఆ. తీవి మిగులఁ గలుగఁ డెక్కెమ్ము లెత్తించి
యూరు నేల ముక్తి యుత్తదియగు
మంచిత్రోవకొఱకు మహిని యత్నింపరా? వి. . .

రాజులు కేవలము భోగపరాయణులు, ఐశ్వర్యలాలసులునై ధ్వజపతాకాదు లెత్తించి యాడంబరముగా రాజ్యమునేలుచుందురు. వైభవములమీఁదఁ దృష్ణగలవారికి ముక్తిలభింపదు గావున సన్మార్గముకొఱకు బాగుగాఁ గృషిచేయుము.

ఆ. తేవలేక యున్న డిల్లపోఁ డెన్నఁడు
నిక్కమైన జ్ఞాని నిలుకడగను
ఎంతలాపదలు నిఁకెన్నఁడు నెన్నఁడు, వి. 1296

బాహ్యాడంబరములు పటాటోపములు లేనిమాత్రమున నిజమగు జ్ఞానముగలవాఁడ మానితుఁడుకాఁడు. పైఁగానిలుకడగా



నుండనేర్చును. అట్టినిరాడంబరున కెంతలాపదలువచ్చిననుడ నంత తొలంగి పోయితీఱును.

ఆ. డాఁగుపడినఁ బండు బాగు లేదందురు
అట్టిడాఁగు తమది యరయ లేరు
తమ్ము నెంచువారు తమడాఁగు కానరు, వి. 1297

పైభాగమునఁగొంచెము డాఁగున్నంతనే ఫలములను బాగుండలేదందురు. నిజమునకిట్టిడాగులు తమకులేకున్నవా? తమ్ముగొప్పవారినిగాఁ దలంచుకొనువారు తమకుఁ గలడాఁగులను గుఱుతింపలేకున్నారు.

ఆ. తంత్రవాదు లెన్నఁ దఱుచుగ నున్నారు
మంత్రవాదు లరయ మహిని లేరు
జంత్రగాని బొమ్మచందము చూచిన, వి. 1298

ప్రజలందఱుగారడివాని బొమ్మవంటివారు. వీరలందఱు కేవలము తంత్రవాదులు. అంతియెగాని మంత్రవాదులుకారు. అనగా స్వకార్యములఁ దంత్రములతో నిర్వహింతురుగాని మంత్రముల బలిమితో నిర్వహింపలేరు.

ఆ. తనకు భాగ్యమున్నఁ దక్కువ లేకుండఁ
గలుగుభాగ్యమెల్లఁ గల్లయనుచు
నమ్మకముగఁ జూచు నరుఁడగు యోగిరా, వి.

తానైశ్వర్యవంతుఁడయ్యుయెకొఱంతలేని భాగ్యశాలియయ్యు భాగ్యములన్నియుఁ గల్లలని తలంచువాఁడెవఁడో యాతఁడొక్కఁడె నిశ్చయమగుయోగి.

ఆ. తను భరించునతనిఁ దనయాయుధమ్ముల
నగ్ని నింకఁ బరుని యాలి నెన్న
సరసమునకుఁ గొనఁగఁ జావె సిద్ధించును, వి....

తనను బోషించు ప్రభునితోడను తనఆయుధములతోడను, నిప్పుతోడను, బరకాంతతోడను, సరసములాడువానికిఁ దప్పక చావు చేకూరును గాన నివి వర్జనీయములు.

సీ. తమతలంపులలోనఁ దత్త్వశిఖామణిఁ
దలఁచినవారెల్లఁ దత్త్వవిదులు
ఘనమైన నిబిడాంధకారంబునకు జ్యోతి
ననువునఁ జూచిన యతఁడ యోగి
శివునిలో జీవుని జీవునిలో శివు
నొనరఁ దెలియువాఁడు యోగదృక్కు
సాంఖ్యయోగంబున సర్వంబు శివుఁ డని
నిశ్చయించినవాఁడు నిర్మలుండు
ఆ. ఇట్టి జాడఁ గాన రెందఱైనను నేమి
పుట్టుకాలశివుని బట్టఁగలరె
పొట్టజీవుఁ బాసి పోయి తా నుబ్బురా, విశ్వ.

తలంపులలో నీశ్వరుని నెలకొల్పి మననముచేయువాఁడె తత్త్వవేత్త, అజ్ఞానమను నంధకారమును బోఁగొట్టు జ్ఞానజ్యోతినిగలవాఁడె యోగీశ్వరుఁడు. శివునకు జీవున కభేదాధ్యవసాయము గావించువాఁడె యోగదర్శి. సాంఖ్యయోగానుసారముగాఁ బ్రపంచము నంతయు నీశ్వరమయముగా నెంచువాఁడు



నిర్మలుఁడగుజ్ఞాని. ఇట్టిధర్మముల నెఱుంగనివారలు ఈశ్వరసాన్నిధ్యముచేరి యుబ్బఁ జాలరు. వారు చనిపోయిన పిదపఁ గళేబర ముబ్బవలసినదే!

ఆ. తఱుచుఁ జదువఁ జదువఁ దర్కవాదమె కాని
దివ్యమైన తెలివి తేటపడదు
పసిరికాయపురుగుపగిదిని జెడిపోవు, వి. 1302

మిగులశ్రమచేసి సమస్తవిద్యలు పఠించినయెడల నావిద్యలు కేవల వితర్కములకు వాదములకు నక్కఱకు వచ్చును గాని జ్ఞానసాధకముగాదు. పసిరికాయ పురుగులతో చెడినటులావిద్వాంసుఁడు విద్యవలననే చెడిపోవును.

ఆ. తరుణియంగ మెల్ల పురుషుఁ డెఱుంగును
బురుషు నంగ మెల్లఁ బొలఁతి యెఱుఁగుఁ
జీరగట్టనున్న సిగ్గౌనో యెగ్గౌనో, వి.... 1303

స్త్రీలయొక్క అవయవములు సమగ్రముగా మగవాఁడెఱుంగును. మగవానియవయవములుఁ బూర్తిగా స్త్రీయెఱుంగును. అట్టిచో చీరెలుగట్టుకొనుట యెందులకు? కట్టుకొన కున్న కీడుకలదా సిగ్గుగలదా?

తే. తలఁప నెదిలేక భేదంబు తలఁపనీక
జోలలందును నర్థియై జోల లాడు
చున్న యోగీంద్రుఁ డనిచెప్ప నుచితమగును
వేమ ననియెడు యోగిని వెలయ వేమ! 1304

హృదయమున నెట్టివాంఛయు నుంచుకొనక శబ్దములయం

దున్న ప్రణవనాదమును ఆలించుచు ఇతరలోకవ్యవహారము లుజ్జగించియున్నవాఁడే యోగీంద్రుఁడు. అట్టివారిలో వేమన యొకడు.

ఆ. తల్లి గన్నతల్లి తనతల్లి పినతల్లి
తండ్రి గన్నతల్లి తాతతల్లి
యెల్ల శూద్రులైరి యేటిబ్రాహ్మణుఁడిక, వి...

బ్రాహ్మణుని వంశక్రమము బ్రహ్మవద్దనుండి దీసికొందుమేని యాతనిపరంపర యంతయు శూద్రజాతియైయున్నది. దీనిచేఁ బ్రపంచమంతయుఁ శూద్రజాతియే యని స్పష్టముగాఁ దెలియుచుండఁగా లోకులు మేము బ్రాహ్మణులమని యేల విఱ్ఱవీఁగెద రోగదా!

మత్తకోకిల:—

తల్లిదండ్రులు నన్నదమ్ములు తాతబందుగు లేలరా
మళ్లి జన్మము లేని సద్గురుమర్మభావము నొందరా
పుల్లలైనను రాదు వెంటను భూమి దాఁటి యటేగుచోఁ
గల్లభ్రాంతిని వీడి వేమన కార్యసిద్ధిని గాంచుమా.

తల్లిదండ్రి అన్నతమ్ములని మమకారము పెట్టుకొని తిరుగుట వృథాభ్రాంతిగాని వేఱుగాదు. కావున ప్రతిజన్మమున నిట్టి మమకారములతో నవస్థనొందక గురుసేవచే జన్మరాహిత్యము గావించుకొన యత్నింపుము. మన మెంతసంపాదించినను వెంట పూరిపుడకయైనను రాదని గ్రహించి ద్రవ్యవ్యామోహమును క్రమముగ నడంచుకొని కార్యసిద్ధికి (మోక్షముకొఱకు ప్రయత్నించుట) ధర్మము.



ఆ. తల్లిదండ్రు లెంద ఱల్లజన్మము లెన్ని
తిరిగి యెఱుఁగనట్టి దిక్కు లెన్ని
స్థిరము నస్థిరమును దెలియలేఁ డజ్ఞాని, వి. 1307

అజ్ఞానియగు మానవుఁడు, తల్లిదండ్రులు పూర్వజన్మమున నెందఱైరో తిరిగి యింక నెందఱుకానున్నారో దృశ్యములలో నేవి స్థిరములో ఏవియస్థిరములో యనునంశమును దెలిసికొనఁ జాలఁడు

ఆ. తాను నింద్రియములఁ దనర జయించినఁ
దత్త్వ మరసి చూడఁ దాన యగును
రాజయోగి యిట్లు తేజరిల్లుచు నుండు, వి...

ఇంద్రియముల పెంపు నడంచి జయించిన యెడల సత్యవంతుఁడగు నాతఁడే బ్రహ్మస్వరూపుఁడు రాజయోగి. యీవిధము గనే వర్తించుచుండును.

ఆ. తానె తత్త్వమయ్యుఁ దన్నెఱుంగఁగ లేక
మాయ తత్త్వమనుచు మఱుగుచుండు
ధర్మకర్మములను దారోయ తత్త్వము, వి...

మానవుడు తానీశ్వరస్వరూపుఁడయ్యు నది గ్రహింపఁజాలక మాయయే తత్త్వమని తలంచుచుండును. ధర్మము కర్మము ఇవి రోయుటయే తత్త్వమను నది గ్రహింపఁ జనును.

క. తిన్నగఁ ద్రిపుటిని గురిగని
యున్ననునాదంబు వినఁగ నూహింపుములో

మిన్ను కని నిన్ను మఱతువు
వెన్నెలలో బయలు సేరి వెలయుము వేమా!

దృష్టిని ద్రష్ట దృశ్యము దర్శనమను త్రిపుటయందు లగ్నము గావించి ప్రణవనాదము వినఁగోరుము. పిమ్మట జ్యోతిర్మయమగు తేజస్సును గాంచెదవు. పిదప తన్మయముతో నాజ్యోతిర్మూర్తిలో లీనుఁడగుదువు.

ఆ. తిరిగి తిరిగి తిరిగి ద్రిమ్మరిగా నేల
తీర్థయాత్ర లనుచుఁ దెలివిమాలి
తెలివిలోనిగురుని దెలపిగా జూడరా, వి. 1311

వ్యర్థముగా తీర్థయాత్రలను తిరిగియలయక బుద్ధిలోని ఈశ్వరు నెఱింగి సేవింపుము. తీర్థయాత్రలు నిష్ఫలములు.

ఆ. తెలుపు మాయఁ జేసి దిట్టతనంబునఁ
దెలుపు భస్మముగను దేటపఱచు
విధము కన్నఁ బరుసవేదియు లేదురా, వి. 1312

ఇదియొక స్వర్ణయోగము, పాదరసమునందలి తెలుపురంగును బోకార్చి పిమ్మట భస్మముగాఁ జేసినచో దానిసాధనమున బంగారమును జేయవచ్చును. ఇంతకంటె స్వర్ణయోగమునకు వేఱొక స్పర్శవేది లేదు.

ఆ. తొట్టిమూసలోని తొఱటజీవుల నెల్ల
మొల్లలేక చంపు ముదముతోడ
నగ్ని లేనిమంట యది యేమిచోద్యమో, వి...



అనశ్వరము సారహీనమునగు నీ దేహము నాశ్రయించియున్న దుర్బలప్రాణుల నకారణముగా మృత్యుదేవత దనపొట్టను బెట్టుకొనుచున్నది. మృత్యుదేవతచేష్టలు అగ్ని లేని మంటలతో సమానము.

ఆ. తొలుతి త్తిలోనఁ దొలుతఁ బుట్టినతాను
వెనుకఁ దెలియవలయు వివర మరసి
వెనుకఁ దెలియలేమి వెఱ్ఱియై చెడిపోవు, వి...

తాను తొలుతిత్తియందు జనించితిననియు గర్భస్థుఁడై బాలుఁడై యౌవనుఁడై వివిధావస్థలనొందితిననియు మానవుడు మఱచి గర్వాహంకారములతో వెఱ్ఱివాఁడై చెడిపోవుచున్నాఁడు.

క. త్రిపుటికిఁ జూడ్కిని బైనిడి
యుపజిహ్వకు సూటి చేసియు న్మదిలోనే
తప మొనరించెడు భక్తుఁడు
నిపుణుండై వెలుఁగులోనె నేర్పున వేమా!

చూపును ఉపజిహ్వకుఁబై నుండి త్రిపుటి కంటు నటులఁ జేసి నిశ్చలమనస్సుతో తపస్సుచేయు భక్తుఁడు నేర్పఱియై ఈశ్వర సాక్షాత్కారమొందఁగలుగును.

ఆ. తనియుఁ బిండమునను దగిలినమనుజుండు
పుట్టలేఁడు వాఁడు పుడమిలోన
నట్టిపుట్టుక గన నవనిలో లేదయా, వి... 1316

గర్భస్థుఁడై పిండాకారముగానున్న జీవుఁడు పూర్వావస్థ

తితో నానఁదించుచు మాయావృతుఁడై మఱల జనించిపూర్వ
స్మృతిఁ గోలుపోవుచున్నాఁడు. పూర్వస్మృతితో మాయావృ
తుఁడుగాక జనించు జీవుఁ డీభూలోకమున నెందును లేఁడు.

ఆ. దాత యైనవాఁడు తానె మున్నిచ్చెడుఁ
గానివాఁ డొసఁగునె కానియైన
జలము దప్పి దీర్చు మల మెట్లు తీర్చును? వి...

దాతయైనవాఁడు ఇతరులతోఁబోటీ పెట్టకొనక తనకుఁ
దోచినది ముందుగ నిచ్చును. లోభి యొకపైసయేని యీయఁ
డు. మానవుని దప్పిదీర్చుటకు జలముపనికివచ్చును గాని మలము
పనికిరాదు గదా! అటులే అర్థికి దాతసాయపడును.

ఆ. దార బందిగంబు తనయులు సంకెలల్
బంధువర్గ మెల్లఁ బ్రహారిగోడ
మోహ మెఱుఁగ లేదు మొక్కలికాఁడయా, వి.

మానవునకు సంసారము పెద్దచెఱసాల. భార్య బంధనాల
యము. కొడుకులు కూతుండ్రు సంకెళ్లు. చుట్టములందఱు ప్ర
హారిగోడలు. మోహము ముఖ్యముగా నీకారాగృహవాసకార
ణము. అవివేకి యిదియెఱుంగజాలఁడు.

ఆ. దేవభూములందు దేవాలయములందు
దేవుఁ డనుచు మ్రొక్కి సేవఁ జేసి
తెలియ విశ్వకర్మ దేవాదిదేవుఁడౌ, వి... 1319

దేవాలయములలోని విగ్రహముల నజ్ఞానముతో దైవము
గా నెంచుచుందురు. నిజమున కీవిగ్రహములుగాదు దేవుఁడు.



వీనిని సృష్టించిన విశ్వకర్మయే (శిల్పియే). దేవాది దేవుఁడని
గ్రహింపవలయును.

ఆ. దొడ్డివాఁడు పెద్దతోఁడేలునైనను
మట్టుఁ జూచి దాని మర్మ మెఱిఁగి
గొడ్డు గొఱ్ఱె నైనఁ గొని చననీయఁడు, వి...

గొఱ్ఱెలను మందగాఁ జేర్చికాయు గొల్లవాఁడు తోడేలు
పొలకువగ్రహించి నంతన కలరూపు నెఱింగి కడకు గొడ్డు
బోతుగొఱ్ఱె నైనఁ దీసికొని పోనీకుండఁ గాపాడును.

ఆ. దొమ్మరాటవాని దోర్బల మెల్లను
బొట్టకూటికొఱకె పట్టిన దగు
నదియె యోగి కమర నానంద మందఁడా, వి.

దొమ్మర ఆటవాఁడు ఆటపాటలలో మిగులనేర్పుఁ జూపు
చున్నాఁడు: వాఁడు తననేర్పు పొట్టకూటి కుపయోగింపక
యోగాభ్యాసమున కుపయోగించినచో శాశ్వతానందము సిద్ధిం
చునుగదా.

ఆ. దోసముల్లువంటి తుర్యమందాత్మను
జూచి యాసల నటు స్రుక్కఁ జేసి
వాసనఁ దెలిసినవాఁడెపో బ్రహ్మము, వి...1322

దోసముల్లువలె కానవచ్చియుఁ గానరానటుల మిగుల సూ
క్ష్మముగా నున్న పరబ్రహ్మ స్వరూపమునందుఁ దలంపులు మగ్న
ముగావించి జ్ఞానవాసన నార్జించినవాఁడె బ్రహ్మస్వరూపుఁడు.

ఆ. ద్వారబంధమునకుఁ దలుపులు గడియలు
వలెనెనోటి కొప్పు గల నియతులు
ధర్మ మెఱిఁగి పలుక ధన్యుఁడౌ భువిలోన, వి...

తలుపులు ద్వారబంధములు గొళ్లెములు గృహమున కెటుల సంరక్షకములో అటులే నోటికి దంతములు పెదవులు సంరక్షకములు. కావున వాఙ్నియమము నెఱింగి మెలఁకువగాఁ బలుకువాఁడె ధన్యుండు

ఆ. నచ్చు సేయరాదు నమ్మినైక్యమునకు
ముచ్చెలుకను మ్రింగి ముదము గాంచి
చొచ్చి బయలుదేరి సొమ్మసిల్లును యోగి, వి...

యోగి తాను నమ్మినజీవేశ్వర ఐక్యమును గూర్చి సంశయింపఁడు. అజ్ఞానమును బూర్తిగా నశింపఁజేసి పిదప జ్యోతిస్స్వరూపమగు బ్రహ్మమును సందర్శించి తన్మయానందమున నోలలాడసాగును.

ఆ. నయనదృష్టి మీఱి నడవడి గుర్తించి
భయము లేక నొక్కి బయలువడక
స్వయము జ్యోతి నంటి సౌభాగ్యమందురా, వి.

దృక్శక్తి నుపయోగించి హృదయాది స్థానములనున్న షట్కమలములను గుర్తించి అజ్ఞానాదులవలనఁ గలుగు భయముబోఁదోలి స్వయంజ్యోతి నంటి మోక్షము నొరదఁ గృషిచేయుము.



క. నలుగురు దొంగలఁ బట్టుక
తలఁబట్టఁగవలయు నొకని దగ దండింపన్
వలెరా ముఫ్వురిఁ దీర్చుమి
యిలలోపల నెఱుకఫలమె యిది యగువేమా!

ధర్మార్థకామమోక్షములను నాలుగుపురుషార్థములలో నొకటియగు మోక్షమును స్వీకరించి మిగిలినమూఁడును ధర్మార్థకామముల వదలుటయే జ్ఞానమున్నందులకు ఫలము.

క నలుగురు దొంగలఁ బట్టుక
తల ద్రుంపక యున్నయట్టి తామసి కేలా
గలుగును జ్ఞానము ధర ని
శ్చలపావన మాత్మసుఖము సత్వము వేమా!

ధర్మార్థకామమోక్షము లనునాలుగుపురుషార్థముల పైఁ గలకోరిక నడంచివేసి నిష్కామబుద్ధిలో నిర్వికల్పసమాధిలో నీశ్వరధ్యానముగావింపక ఆత్మసుఖము కలుగనేరదు.

క. నాటుము గురువరమంత్రము
దీటుగ మదియందుఁ జేర్చి ధీరుఁడ వగుచున్
దాఁటుము నినుఁ గనుచోటికిఁ
గోటికిఁ బడగెత్త నేమి కుదురుర వేమా! 1328

మానవుఁడా, సంపదలనాసించి కోటికిఁ బడిగనెత్తఁ దలంపక గురువర్యుఁడుపదేశించిన మంత్రమును జపించుచు మనస్సునఁబునశ్చరణఁ జేయుచు నీశ్వర సాన్నిధ్యముఁ జేరుటకుయత్నింపుము.

ఆ. నాఁడెమైనలంజె నగవుమేలు నెఱుంగు
విటుని గుత్తరించువివర మెఱుఁగు
బానిసయినదాని పాటి గోరఁగరాదు, వి...

యువకులను వలపింపనేర్చిన లంజెకత్తియనగవుపొందికతోనే మోహము కలిగించును. మాయోపాయములతో విటుల వంచించును. కామమునకు బానిసలగు నట్టిఱంకుటాండ్రతోఁ గూడరాదు.

ఆ. నయముగాను దృక్కు నాళంబులో నుంచి
భయము మాని వట్టి భ్రమలఁ ద్రొక్కి
స్వయముగాను బుద్ధి సాధించి చూడుము, వి...

అంతర్దృష్టిని సూర్యచంద్రాది నాడులనుండి సహస్రారకమలమునఁ జేర్చి భయముభ్రమమాని స్వబుద్ధితో యోగసాధనముగా వింతువేని యీశ్వరసాక్షాత్కారమగును.

ఆ. నరుఁడె యైన లేక నారాయణుం డైనఁ
దత్త్వబద్ధుఁ డైన ధరణి నరయ
మరణ మున్నదనుచు మదినినమ్మఁగవలె, వి...

మానవుఁడైనను మాధవుఁడైనను తత్త్వవేత్తయైనను దైవమైనను చావుతప్పదనియు నేనాఁటికైనవచ్చియే తీఱుననియుంగట్టిగా నమ్మవలయును.

క. నాడీచక్రము చూడఁగ
నాడులు పదిముఖ్య మల్లనాడులలోనన్



గూడలి నాసికనడి యెడ
మూఁడును నిళపింగళాఖ్యములఁ దగ వేమా!

నాడీచక్రమునందున్న వానిలోఁబదినాడులు (దశవిధప్రాణములు) ముఖ్యములు,గణనీయములు. వీనికుండలి నాసిక. అందు మిగులఁ బ్రాముఖ్యములు ఇడా పింగళా సుషుమ్నా నాడులని తెలిసికొనవలయును.

ఆ. నాదబిందుకళల నయమొంది యాత్మయం
దంది చపలచిత్త మమర నిల్పి
బ్రహ్మరంధ్రమునను బ్రబలిన యోగియా, వి...

సమాధిలోనుండనేర్చి నాదబిందుకళలఁ గనుఁగొనుటయభ్యసించి చిత్తమునకు నిలకడనలవాటుచేసి బ్రహ్మరంధ్రమునందు గానవచ్చుజ్యోతిర్మండలమున దృష్టి లీనము గావింతువేని యోగివయ్యెదవు.

క. నాదము బిందువు బిందువు
నాదముగాఁ జేసి కళను నాదును బిందున్
నాదుగఁ జేసియు నీయొక
నాదంబునఁ జూచుయోగి నాథుఁడు వేమా!

చిత్తశాంతితో నాదబిందుకళలను సందర్శించుటయేగాక నాదమును బిందువుగను బిందువును నాదముగనుజేసి కళలను నాదమును బిందువునునాదముగను అనులోమవిలోమములంగా మార్చుచు ఒక్కనాదంబుననే ముప్పదియెనిమిదిచిత్కళలను జూచుట యోగికే సాధ్యము.

ఆ. నాద మలరఁ జేసి నాదముఁ బొంగించి
ఖేద మింత లేక పెనఁగినపుడు
పాలుకాల్వవలెను బాలురా యీనాదు, వి...

గురూపదేశ మార్గాను సారముగా వినవచ్చుచు ప్రాణవాయువుల సంచారమువలనఁ బుట్టునాదమును ఆలకించుచు నానందించుచుఁ దన్మయమునొందినయెడల హృదయాకాశము నాధ్వని విశేషించి ప్రవహించును.

ఆ. నాసికందు దృష్టి నయనించు యోగికి
వాసి వన్నె లేల వసుధలోనఁ?
గాశినాథుఁ డతఁడె గణుతింప లేరయా, వి....

నాసికయందు దృష్టిని నిలిపియోగాభ్యాసము చేయుయోగిని గూర్చి వేఱు యోజింపవలసిన పనిలేదు. ఆతఁడు తప్పక కాశీవిశ్వేశ్వరసమానుఁ డగును.

ఆ. నాసికాగ్రమందు నయముగా గుఱినిల్పి
వాసిగాను జూడ వశ్య మగును
గాశికంచులఁ గనఁ గడగండ్లు పడనేల? వి...

దృక్శక్తి నాసికాగ్రమున నిలిపి నిశ్చలముగాఁ జూచినచో సమస్తప్రపంచముగూడఁ గానుపించును. ఈయోగము సిద్ధించినచో తీర్థయాత్రలకని కాశికని కంచికని తిరుగవలసిన పనిలేదు.

ఆ. నాసికాగ్రమందు నయమునఁ జేర్చక
మూసి మూయక కనుమూలలందుఁ



జూచి చూడ నతఁడె శుకయోగి యగుతన్నుఁ
బాయకున్న నాఁడె పరము వేమ! 1338

చూపులను నాసికాగ్రమునఁ జేర్చి కనులు అర్ధనిమీలితములుగాఁ జేసి లోచనమూలములతో (కనుగొలకులతో)ఁ జూచియుఁ జూడనటుల సర్వమును దర్శించుయోగి శుకయోగియె.

ఆ. నివురు గప్పినట్లు నిశ్చలభక్తితోఁ
దగిలియుండ ముక్తి దానె వచ్చు
జగతి నొప్పఁ జెప్ప జాణఁడు లేఁడయా, వి...

తనకుఁ దెలిసిన యోగాదుల ననుష్ఠించుచు నివురుగప్పిననిప్పువలె బయటి కాడంబరములు చేయకయుండువానికి మోక్షము చేకూరును. తనకుఁ దెలిసినదంతయుఁ బ్రపంచమునకుఁ జాటుట యసాధ్యము.

క. నిజగురులక్ష్యం బుంచుక
యజపాదిక్రియల మీఱి యలమటపడకే
నిజవిమలాంత స్సందిన
సుజనుని నెన్నంగఁ దరమె సూటిగ వేమా!

గురూపదేశమార్గమునఁ బోవుచు గురుభక్తిఁ గోలుపోవక తికమకపడక హృదయస్థుఁడగు బ్రహ్మస్వరూపుని గనుగొనినవాఁడు ధన్యుఁడు.

తే. నిటలదుర్గములో నున్న నిజ మెఱింగి
పటుతరంబుగ మది నిల్పి ప్రబలుయోగి

యంటిముట్టును నిర్గుణం బట్టె మదిని
గెంటువడ దెప్డు తెలియు నీకిటుకు వేమ! 1341

భ్రూమధ్యమున దృష్టినిసారించి మనస్సును విషయాదుల పైకిఁ బోకుండబంధించియుండుయోగికి నిర్గుణస్వరూపమగును. ఈరహస్యము గ్రహింపఁదగినది.

ఆ. నిటలదుర్గ మెక్కి నిక్కి చూడంగనె
కుటిలరూపకళలఁ గూల్చు నెఱుక
పటుతరంబుగాను బట్టి సాధింపుఁడు, వి....

భ్రూమధ్యమున దృష్టిసారించినపుడు కృత్రిమ రూపములగు వికారదృశ్యములు గానవచ్చును. చూపును జలింపనీకవానిని జ్ఞానముచే సాధించినఁగాని కామితము ఫలింపఁజాలదు.

ఆ. నిద్రలోని నిద్ర నిజముగాఁ దెలిసిన
భద్రమగును మిగులు బ్రహ్మవిద్య
నిద్ర తెలియువాఁడు నిర్మలయోగిరా, వి...

సమాధిలో మనస్సు కలిగినను మనోవికారము లంటవుగాన సమాధియే నిద్ర. సమాధిలో నచంచలుఁడ వగుదువేని బ్రహ్మము సాక్షాత్కరించును. సమాధి నెఱింగినవాఁడు నిజమగు యోగి.

ఆ. నిద్రలోన మనసు నిలుపుచు లోకముల్
భద్రముగను జూపి భ్రమయఁజేసి
పోతు విడువకుండు పోఁగఁగ నీలోన, వి...



మనస్సును సమాధియందు మగ్నముగావించుచు స్వల్పవికారములకు లోనుగాక స్థిరసంకల్పుడ వగువఱకు సమాధిసంబంధము విడువకున్నచో కామితసిద్ధియగును.

ఆ. నెనరు గలుగ గురుఁడు నిటలదుర్గముఁ జూపుఁ
గనులఁ జూడ్కి మఱుఁగుఁ గవయఁజూపుఁ
జెనకి యాత్మరూపు చేసేతఁ జూపురా, వి....

గురుఁడు శిష్యునియెడ ననుగ్రహించినయెడల దృక్కులను నిటలమునఁ జేర్చువిధము, చూపు నంతస్సునందుఁ బ్రవేశింపఁ జేయువిధమున నేకాక, యజ్ఞానముఁ బోకార్చి యాత్మస్వరూపమునుగూడఁ జేసేతఁజూపును.

ఆ. పంచతత్త్వఫలము భావించి కడ మించి
కొంచెమైన మదిని గోలుపోక
యెంచి మించువాఁడ యేర్పడ్డయోగిరా, వి...

తత్త్వపంచకమును గుర్తించి వానిఫలములఁ దెలిసికొని మనోవికారములకు లోనుగాక పరమాత్మస్వరూపమును దర్శింపఁగలవాఁడే నిజమగుయోగినాఁబడును.

ఆ. పచ్చఁ జూచువారు పచ్చ మెచ్చెడువారు
పచ్చమీఁద వాంఛపడినవారు
పచ్చ విడుచువానిఁ బ్రభునిగాఁ జూతురు,వి...

లోకములోఁ గలరత్నములలో మిగులవిలువగలదిపచ్చ, అట్టి పచ్చలను జూచిమురియువారు, దానికాసించువారు మిక్కిలి

పెట్టివారు. దానిపై నాసఁబోనాడి తృణముగాఁ జూచువాఁడె యోగీశ్వరుఁడు.

ఆ. పంచభూతములను నెంచుచు మదిలోన
మించి యందవలెను మిత్తిగొంగ
నంచుఁ దెలియువాఁడె యఖిలజ్ఞుఁ డగుయోగి, వి.

పంచభూతములను వివేచన సేయుచు మనస్సు నీశునిపై బంధించువాఁడు సర్వజ్ఞుఁడగును. ఇట్టివివేకముగలవాఁడు యోగీశ్వరుఁడనఁబడును.

ఆ. పట్టువిడక లోని గుట్టును గమనించి
ముట్టు టదియె యెఱుకమూల మగును
బట్టబయలునందుఁ బాటింప నెఱు కేది? వి...

పట్టుదలఁ బోనాడక యోగాభ్యాసముగావించి బ్రహ్మస్వరూపము దర్శింపఁగలుగుటయే జ్ఞానము. కేవలమవాదాకాశమును గాంచుచున్న జ్ఞానమువలని ఫలము సమకూరఁజాలదు.

ఆ. పండువలనఁ బుట్టెఁ బరగఁ బ్రపంచము
పండువలనఁ బుట్టెఁ బరము నిహము
పండుమే లెఱిఁగెఁ బ్రహ్లాదుఁ డిలలోన, వి....

ప్రకృతివలన భగవంతుఁడు వానివలన నిహపరలోకములు జనించెను. ప్రపంచనిర్మాతయగుభగవంతుని గొప్పతనమును పరమభక్తుఁడగు ప్రహ్లాదుఁ డెఱింగెను.

ఆ. పతగ మితరజంతువితతి కంతకు మేటి
యగున రెక్కలుండి యెగురకున్న



పట్టి యోగి యిట్టి వైఖరివాఁ డయా, వి...

రెక్కలుగలిగియు నెగురఁజాలకున్నచో పక్షి యితర జంతువులతో సమానమేగాని యేమియుఁగొప్ప లేదు. అటులే యోగరహస్యము తెలియఁగకున్నచో యోగిగూడ సామాన్యమానవుఁడుగ నెంచఁదగినవాఁడె.

ఆ. పతనమందునట్టి పక్వఫలంబును
బట్టి తినఁగలాఁడు పచ్చికాయ
కాసపడనిరీతి నైహిక ముందును, వి... 1352

మనుజులు తొడిమవాడిపడిన బాగుగాఁ బండినపండుదిన నెంచునుగాని పచ్చికాయకాసింపఁడు. అటులె నిజమైనయోగియు నైహికముల నాశింపఁడు.

ఆ. పతిని విడువరాదు పదివేలకైనను
బెట్టి చెప్పరాదు పెద్దకైనఁ
బతిని దిట్టరాదు సతి రూపవతియైన, వి....1353

చెలువలు తామెంతవయసుకావరముననున్నను మగనివిడువరాదు. తాము రూపవతులమని మగని నాక్షేపింపరాదు. తామైశ్వర్యవంతులమని పెట్టి నలుగురిలో సాటరాదు.

మత్తకోకిల:—

పరమగురుపరమంత్రసిద్ధిని
బట్టి నీలో నుంచరా
యురములో గుటి బయలు దాఁకెడి
నూని నాక్కినతోడనే

కరతలామలకంబు బ్రహ్మము
గ్రాలుచుండును బ్రజ్ఞలోఁ
దిరము వేమన చేరుపదవిని
దెంపుగా మది నుంచరా. 1354

యోగ్యుఁడగు గురునాశ్రయించి మంత్రశక్తినార్జించిహృదయమునందున్న లక్ష్యమును గుర్తించి బుద్ధిని నొక్కెడవేని బ్రహ్మము సాక్షాత్కరించి కనులముందుఁ బ్రకాశించుననియు నది కైవల్యమునకుఁ జేర్చుననియు మనస్సులోఁ దలంపుము.

ఆ. పరమపదవిఁ గోరు భక్తుండు నిత్యము
రాజు గోరుచుండు రణజయంబు
మూర్ఖుఁ డెవుడు గోరు ముదితలతోఁబొందు,వి.

రాజులు రణజయమును గోరునట్టులనే సహజముగాభక్తుఁడు పరమపదవిని కోరును. అవివేకియగు నింద్రియలోలుఁడు పరకాంతల పొందునకుఁ దిరుగుచుండును.

ఆ. పవలు రేయుఁ జూడ భావంబులోపలఁ
దాను నేన టనెడితలఁపు మఱచి
యున్నయట్టియతఁడె యుత్తమయోగిరా, వి...

అవకాశమున్నపుడెల్ల రాత్రింబవళ్ళను భేదములేకుండ జీవుని ఆత్మను నేకముగాఁ దలంచియున్నవాఁడె (సర్వజీవులు సమానులు, వాఁడె నేను, నేనె వాఁడు) నిజమగుయోగీశ్వరుఁడు.

ఆ. పాదవాయువులను బరగ దేహము మోయు



దేహిజీవములను దెలియు మోయు
ధరణి వీని రెంటిఁ దా నేల మోయునో, వి...

పాదములను మర్మేంద్రియములను దేహము మోయుచున్నది. దేహమును ప్రాణము మోయుచున్నది. ఈదేహమును బ్రాణములను జీవాత్మఁడేల మోయవలయునో తోఁచకున్నది.

ఆ. పితృపతికిని జిక్కి పెనుత్రోవ గానక
వెతలఁ జిక్కువాఁడు వెఱ్ఱివాఁడు
సతులవలలఁ జిక్కి సంతాపపడనేల? వి...1358

యముని బాఱినిబడి నరకయాతనల నొందువాఁడు మిగుల నవివేకియనఁదగువాఁడు. స్త్రీలవలపువలలఁ జిక్కి ప్రాయమునఁ గను గలిగి మెలఁగినచో నంత్యమున నిట్టియవస్థ యెవనికి ఉండదు.

ఆ. పిల్లి యెలుకఁ బట్టుఁ బ్రియమున నుండఁగ
నదియె కోడిఁ బట్ట ననుగమించు
మమత విడువకున్న మానునా మోహము? వి.

పిల్లియెలుకను బట్టుకొని మ్రింగును. అంతతో నూఱకయుండక కోళ్ళనుగూడ మ్రింగఁబ్రయత్నించును. అటులె మమకారముగూడ నున్నంతతో లభించినంతతోఁ దృప్తినొందక మోహమును వృద్ధిచేయును.

ఆ. పుట్టినజను లెల్ల భూమిని మనియున్నఁ
బట్టునే జగములు పట్ట వెపుడు
యముని లెక్క హెచ్చు నపలఁ దగ్గుచునుండు, వి.

పుట్టినవారందఱు బ్రతికియున్నయెడల భూలోకము పట్టనే పట్టదు. ఉన్నవారుచచ్చుట క్రొత్తవారుపుట్టుట యమునివద్దజన సమరణముల లెక్క హెచ్చుటతగ్గుట సహజము.

ఆ. పుట్టినది మొదలుగఁ బురుషుఁ డేకాలంబు
పాప మెఱిఁగి శుద్ధపశువు గాక
ముదిసి యోగికరణి ముద మొప్పఁగావలె, వి...

జన్మము మొదలుకొని మనుజుఁడు పాపము చేయని దివసమే లేదు. కావున గురునియనుగ్రహముని జ్ఞానియై యోగియై వయసుతీరినిపిదపనేని కడతేరవలయును.

ఆ. పుట్టు దుఃఖమునను బోరలు దుఃఖమునను
గిట్టు దుఃఖమునను గ్రిందువడును
మనుజదుఃఖమువలె మఱి లేదు దుఃఖము, వి...

వృద్ధిక్షయభయాదులవలన మనుజుఁడు దుఃఖించుచుండును. ఆహా! దుఃఖ మెంతటిది? దానితో సమమగు నితర వస్తువు లేదు. ఇంతయేల మనుజుని దుఃఖమువంటి దుఃఖమే లేదు.

ఆ. పుట్టు బ్రహ్మలైదు పుడమిని నడువఁగాఁ
జేత బ్రాహ్మఁ డేల శ్రేష్ఠుఁ డగును
ఏల విగ్రహములు ఎత్తుకోదినుటకా?, వి...

పంచభూతమయమై ప్రపంచమంతయును ఈశ్వరుని రూపమున భాసిలునపుడు విగ్రహములఁ బూజించుట వ్యర్థమే యగును. ప్రపంచము బ్రహ్మనడుపుచుండ బ్రాహ్మణుఁడెట్లుగొప్ప.



ఆ. పుడమి యుప్పరంబుఁ బురికొనె జగముల
రక్ష సేయఁ గల్గు రాజు లెవరు?
మహిపతి యనిపేరు మనుజున కేడదో?, వి....

భూలోకమున భూమ్యాకాశములు గలసిన విశాలప్రదేశమై యున్నది. దీనినంతయును నేకముగాఁ బరిపాలింపఁదగిన రాజే లేఁడు. నిజమిటులుండ కొలఁదిభూభాగమును బరిపాలించువాని మహీపతి యనఁదగునా ?

ఆ. పువ్వుచన్ను గలుగ భూమెల్ల వెలసేయుఁ
గోవమచన్నులు గన గోటిసేయుఁ
దడకచన్నులు గన దయ్యాలు నొల్లవు, వి...

విటులుకామాంధులై చెలువల పూఁపచనులకుఁ బ్రపంచమంతయు వెలచేయుదురు. పటువుగానున్న పాలిండ్లకుఁ గోటిరూకలు వెలచేయుదురు. వాలుచనులు విటులుకాదుగదా దయ్యములైన నొల్లవు.

ఆ. పెట్టినంతఫలము పెక్కండ్రకుపహతిఁ
జేయకున్నఁ దాను జెరుపకున్నఁ
బెండ్లి సేయునట్టి పెద్దఫలంబురా, వి... 1366

తాను బెట్టకపోయిన మానె పెక్కండ్ర కపకారముచేసి వారికార్యములు చెఱుపకున్నయెడల పెండ్లిచేసినంత పుణ్యము వచ్చునని పెద్దలు చెప్పుదురు.

ఆ. ప్రాణులందు శివుని భావింప నేరక
యోగమందు నేరేల? నోగులార!

యోగమందుఁ గలదె భోగమందున్నట్లు,వి....

ప్రాణులలో నున్నశివుని ధ్యానింపఁగాఁజాలక జోగులై యోగము యోగమని మూఢులారా! కలువరించెదరేల? భోగములననుభవించుచు ముక్తినొందనవకాశముండ యోగములు యోగములని యేల మురియవలెనో.

ఆ. పృథివిఁ బుట్టె మొలక పృథివిలోఁ గలిసెను
మఱల నదియె పుట్టు మగఁడె సుతుఁడు
ధరణిజనుల కెల్లఁ దల్లియౌఁ బెండ్లము, వి...

మొదట పృథివిస్వరూపమగు స్త్రీయుఁ బిదప బీజస్వరూపమగు పురుషుఁడు జనించిరి. ఈయిరువురు సంగమింపఁ బ్రజావృద్ధియయ్యెను. జనన పరంపరవలనఁ దానే కొడుకుగఁ జనించుగాన ప్రజలకుఁ బెండ్లము తల్లియగుచున్నది.

ఆ. బడుగు నెఱుఁగ లేని ప్రాభవం బది యేల
యోగి నెఱుఁగలేని యోగ మేల
వ్యాధి దెలియలేని వైద్యుఁడు నేలయా?,వి...

దీనులను దెలియఁజాలనివారి ప్రభుత్వమును, యోగినెఱుఁగలేనివాని యోగమును, వ్యాధిదెలియనివాని వైద్యమును వ్యర్థములు.

ఆ. బాల్యమందు శివుని బరికింపఁగాలేరు
యౌవనమునందు నరయలేరు
ముదిమియందుఁ గూడ మోసమే గందురు, వి.



మనుజు లలసులై బాల్యయౌవనవార్ధకములందు నయితము ఈశుని గుర్తింపక మోసపోయెదరు.

ఆ. బిగియు దృష్టి నెపుడు బింబమం దుంచిన
మనసమందు నెఱుక మగ్న మగును
లగ్నచిత్త మమర రక్షించుచుండురా,వి...

దృష్టిని చిక్కఁబట్టి మననము చేసినచో జ్ఞానము సాక్షాత్కరించును. ఇట్లు జ్ఞానలగ్నమైనచో చిత్తము రక్షించుచుండును. ఎఱుకకు మనము ముఖ్యము.

ఆ. బిందు నాదుఁ జేసి ప్రియ మొప్పఁగా నల్ల
నాదు బిందుఁ జేసి నయముగాను
బిందునాదునందు భేదించి చూడుము, వి...

ఓంకారము (ప్రణవమును) నుచ్చరించుచు తద్గతచేతస్కుఁడవై నాదబిందువులమధ్యను పరీక్షింపుము.

ఆ. బుద్ధియుతున కేల పొసఁగనిసఖ్యము
కార్యవాది కేల కడుచలంబు
కుత్సితునకు నేల గురుదేవతాభక్తి, వి... 1373

బుద్ధిమంతునకు కలియనిమైత్రియును, కార్యపరతంత్రునకుఁ బట్టుదలను, కుత్సితునకు గౌరవసంపదయు నుచితములు గావు.

ఆ. బూటకంబుచేతఁ బుడమిలో నొకకొన్ని
నాటకంబు లాడి నయముఁ జూపి
దీటులేక తాము తిరుగుచు నుందురు,వి....1374

మూర్ఖులు కపటనాటకంబుల నాడుచు లోకులను వంచిం చుచు తమ కెదురులే దని తిరుగుచుందురు గాన వారిఁగలయ కుము. వారు బయటికి నీతిమంతులవలెనే యుందురు.

ఆ. బూదిపూఁత లెన్న బుజముల పేంకాలు
ముద్రలు లింగములును నరుసమతము
లిక్కడఁ దగుఁగాక యెక్కడఁ దగు నట్లు, వి.

భస్మలేపనములు బుజపుముద్రలు లింగములు మున్నగునవి ఇహలోకమున వంచింప నుపయోగించునే కాని పరమునఁ బని కిరావు. మతచిహ్నములు మోక్షసాధకములు గావు.

ఆ. కేసికంటివానిఁ బెంపార మదిఁ జేర్చి
పూజ చేయవలెను బుద్ధి నిలిపి
యాత్మపూజకంటె నదనంబు లేదయా, వి...

త్రినేత్రుని సర్వదా మనస్సునందు నిలిపి పూజచేయవల యును. ఇట్టి యాత్మపూజకంటె లోకమునం దీక నేదియుం నధికము లేదు.

ఆ. బొంది యెవరిసొమ్ము పోషింపఁ బలుమారు
ప్రాణ మెవరిసొమ్ము భక్తి సేయ
ధన మదెవరిసొమ్ము ధర్మమే తనసొమ్ము, వి...

మానవునకు శరీరమును రక్షించుటకుఁగాని ప్రాణముల నర్పిం చుటకుఁగాని ధనమును దానమును సేయుటకుఁగాని తనవలనఁ గాదు. కాని తానుచేసినధర్మమును తనసొమ్ముగా నుపయోగించి కొనఁగలుగును.



ఆ. బొమ్మలాటవాఁడు బొమ్మల నాడించు
భువిని జనులు చూడఁ బొలుపుమీఱఁ
దాను మఱఁగియుండి దైవము నాడించు, వి...

బొమ్మలాటవాఁడు తాను గన్పడక బొమ్మల నాడించువిధ మున నే తాను గానరాకుండనుండి జనులనందఱను బొమ్మలాట వాఁడు బొమ్మల నాడించినటుల భగవంతుఁ డాడించుచు న్నాఁడు.

ఆ. బొమలనడుమఁ గుఱ్తుఁ బొందింపఁ జాలక
విమలదృష్టి మదిని వెలుఁగఁబోదు
తమము దీఱినంతఁ దత్త్వంబు తా నగు, వి...

కనుబొమల నడుమ దృష్టి నిలుపనిది యోగదృష్టి కుదు రదు. అట్లైనగాని తమ మడఁగదు. తమ మడఁగునేని తత్త్వం బు తాన యగును.

ఆ. బొంది నమ్మి మిగులఁ బోషించి పలుమాఱు
ప్రాణి విడుచు టెల్లఁ బాతకంబె
తనదులోన భక్తిఁ దనరుటె మోక్షము, వి...

శరీర మిహపరసాధకమని నమ్ముకొని కడకు ఉపవాసాదులచే శుష్కింపఁజేసి ప్రాణములను విడచుట మిగులఁ బాపకా ర్యము. హృదయమున భక్తి పొడుకొలుపుటయే మోక్షమునఁ బడును.

ఆ. బోడితలల జడల బూడిదె పూఁతల
భాషణాసనముల వేషములను

యోగు లైరె లోన బాగుగా నుండిన? వి.

హృదయశుద్ధి లేనివాఁడు బాహ్యాడంబరముగ తలలు బోడి చేసికొన్నను బూడిదె పూసికొన్నను వేదాంతములు భాషించు చున్నను లాభములేదు. వాఁడు యోగిపదవాచ్యుఁ డెన్నఁటికిఁ గాఁడు.

ఆ. బ్రదుకు నిత్య మనుచుఁ బదరుచు వగమీఱ
విఱ్ఱవీఁగువాఁడు వెఱ్ఱివాఁడు
ప్రాణులెల్ల యమునిబారికి గొఱ్ఱెలు, వి...1382

బ్రదుకు స్థిర మనుకొని విచ్చలవిడిగ మెలఁగువాఁడు వెఱ్ఱివాఁడు. ప్రపంచములోని ప్రాణులెల్లను యమునిపాలిటికి గొఱ్ఱెలవంటివే. యముఁడనుకటికివాఁ డీగొఱ్ఱెల నెపుడో తెగటార్ప నున్నాఁడు.

ఆ. బ్రహ్మ మనఁగ నెటనో పరదేశమున లేదు
బ్రహ్మ మనఁగఁ దానె బట్టబయలు
తన్నుఁ దా నెఱిఁగినఁ దానె పో బ్రహ్మంబు, వి....

బ్రహ్మము బ్రహ్మ మనఁగా నెచ్చటనో లేదు. తననుతా నెఱుఁగుటయే బ్రహ్మము నాఁబడును. బ్రహ్మము తానె.

ఆ. బ్రహ్మ మేడ ననుచుఁ బలుమాఱు నాడేరు
వెఱ్ఱిమూర్ఖజనులు విధముఁ జూడ
బ్రహ్మ మన్నిటఁ దగుఁ బరిపూర్ణమై యుండ, వి.

బ్రహ్మ మేది? లేదే యని వెఱ్ఱులై హేళన చేయుదురే గాని బ్రహ్మము సమస్తమునందును నిండియుండుట అవివేకులగు జను లెఱుంగఁ జాలరు.



ఆ. బ్రహ్మ ఘటము మేను ప్రాణంబు దగ గాలి
మిత్రచంద్రశిఖులు నేత్రచయము
మఱియు బ్రహ్మ మనఁగ మహిమీఁద లేదయా, వి.

బ్రహ్మస్వరూప మన నెచ్చటనో లేదు. మానవుఁడే బ్రహ్మము. మానవదేహము బ్రహ్మస్వరూపము. వాయువె ప్రాణము. సూర్యచంద్రాగ్నులే నేత్రములు. ఇట్టి మానవదేహము బ్రహ్మ మనుట సత్యము.

ఉ. మేదిని లేనివాదముల మిక్కుటమైన బలంబు లే
దు లే, నాదుగ గాలి లేని యెడ నవ్యము మేఘము
గప్ప దట్లె సద్బోధము లేక సద్గురునిపుత్రుఁడవా
చె విదానదృశ్యమా, వాదులఁబోక యుండుమిఁక
వచ్చునదెల్ల నెఱుంగు వేమనా. 1386

వృథావాదములవలన నెన్నఁటికిని జ్ఞానము సమకూఱఁ జాలదు. వాయువు లేకున్న మేఘములు ప్రోఁగుకానటుల జ్ఞానమే లేకున్నచో నీవు గురుశిష్యుఁడవు కాఁజాలవు. వ్యర్థవాదములకుఁ బోక ప్రతిమహానుభావునివద్దను నోపినంతవఱకు బ్రహ్మవిద్య నెఱుంగఁ బ్రయత్నింపుము.

సీ. మొదలు మూలాధార మొదవ విఘ్నేశ్వరుం
డచ్చోట దేవాళి యలరుచుండు
నందుమీఁదటను రెండంగుళంబులమేర

స్వాధిష్ఠచక్రంబు వఱలు బ్రహ్మ
దీనికి నెన్మిది దేహాంగుళంబుల
మణిపూరచక్రంబు మలయును హరి
యంత దశాంగుళ మవల ననాహత
మొప్పరుద్రుం డట నొనరియుండుఁ
తే. బదియు రెండంగుళములకుఁ బైని విశుద్ధ
మందు జీవుఁడు పొందుగా నలరుచుండు
వెలయ మహిమాత్ముఁ డగ్నియై వెల్గుచుండు
నిట్టిజాడలు తెలియుట యెఱుక వేమ! 1387

మానవదేహమునందు గుదస్థానమున మూలాధార చక్రము గలదు. దాని కధిష్ఠానదేవతగ వినాయకుఁ డుండును. దానికి రెండంగుళముల పైభాగమున స్వాధిష్ఠాన చక్రము గలదు. దాని కధిపతి బ్రహ్మ. దానికావల నెనిమిదంగుళముల దూరమున మణిపూరక చక్రము గలదు. దానికధిపతి విష్ణువు. దానికావలఁ బదియంగుళముల దూరమున అనాహతచక్రము గలదు. దాని కధిపతి శివుఁడు. దానికి పండ్రెండంగుళముల దూరమున విశుద్ధ చక్రము గలదు. అందు జీవుఁ డధిపతిగ నుండును. జీవుఁడట అగ్నివంటికాంతితో నలరారును. ఇదియే ఆగ్నేయచక్రము. ఈ విషయముల నెఱుంగుటయే జ్ఞానము.

ఆ. యోగి ననుచుఁ గొంత యోగము గూర్చుక
జగము నెల్లఁ బట్టి చంపి తినుచు
ధనముకొఱకు వాఁడు తగవాడుచుండిన



యోగికాఁడు వాఁడె యోగు వేమ! 1388

యోగిని యోగి నని పేరు పెట్టుకొని లోకములను పీకికొని తినెడివాఁడు యోగికాఁడు గాని యోగు (పనికిమాలినవాఁడు) మాత్రము అగును.

సీ. వాతపైత్యశ్లేష్మరీతు లొక్కటిగాఁగ
శాత్రవమిత్రులు సమముగాఁగ
సరవితో నన్న మౌషధము లొక్కటిగాఁగ
స్వర్ణలోష్ఠంబులు సమముగాఁగ
జాతిభేదంబుల సమము లొక్కటిగాఁగఁ
గర్మధర్మమ్ము లొక్కటియుఁగాఁగ
ఘనసుఖదుఃఖంబు లెనయ నొక్కటిగాఁగఁ
గన దివారాత్రు లొక్కటియుఁగాఁగఁ
ఆ. దెలిసి యాత్మలోన దేదీప్యమానమౌ
తేజమందు శివుని దేటపఱచి
మనసుఁ జేర్చి శివుని మగ్నత నుండరా, వి...

వాతపైత్యశ్లేష్మాది దేహధర్మములను లెక్కింపక విరోధులను మిత్రులను సమముగాఁ జూచుచు అన్నమును ఔషధమును నొకటిగాఁ దలంపుచు, బంగారమును మట్టిబెళ్లను సమముగా నెంచుచు, జాతిభేదములను బాటింపక, కర్మమును ధర్మమును సరిగా నరయుచు, సుఖదుఃఖములను దివారాత్రములను నొకేరీతి తిలకించుచు, హృదయగతమగు జ్ఞానజ్యోతి సహాయమున పరాత్పరుని సందర్శించుచు నీశ్వరునిలో నైక్యముగా నెంచినవాఁడు యోగి యనఁబడును.

---

# బ్రహ్మస్వరూపపద్ధతి.

అవతారిక. మోక్షార్థియగు జనుఁడు విరాగియై కాంతాకనకలోష్టముల సమానదృష్టితోఁ గాంచుచుఁ గామ్యములను విసర్జించి త్యాగియై యుండవలయును. అట్టిధన్యుఁడు త్రయీసారభూతము నాదబిందుకళారూపమగు ప్రణవస్వరూపమును గుర్తించి యోగాది సాధనములచే నింద్రియములను జయించి జీవేశ్వర స్వరూపములను బ్రహ్మస్వరూపమును గుర్తింపఁ గలఁడనియు బ్రహ్మస్వరూపానుభవము సామాన్యసాధనమువలన సాధ్యము కాదనియు తత్సాధనముల కీవిధముగా సాధకుఁడు ప్రయత్నింపవలయుననియుఁ దెలుప నిశ్చయించి వేమనయోగి బ్రహ్మస్వరూపపద్ధతినిగూర్చి చెప్పఁబోవుచున్నాఁడు.—

క. అఖిలాకారుఁ డనంతుఁడు
సకలాత్మలయందు సర్వసాక్షియుఁ దానై
నిఖిలముల నిర్వికారుఁడు
నికరము బ్రహ్మ మ్మనంగ నిజమురవేమా! 1390

సమస్తవస్తుస్వరూపుఁడును నాశరహితుఁడును హృదయములో సాక్షిగ వర్తించువాఁడును వికారరహితుఁడునై బ్రహ్మము తేజరిల్లు ననుట సత్యము.

ఆ. అగ్రమందుఁ జేరి యగ్రేశుఁడై యుండు
నిగ్రహించి యెఱుక నియతి మీఱి



మోహగుణము లన్ని ముక్కలుగాని దాఁటరా, వి.

బ్రహ్మము అగ్రభాగమున నుండును గావున నింద్రియముల నిగ్రహించి మోహగుణములను పోఁద్రోలి తన్మయుఁడవై బ్రహ్మమును దెలిసికొనుము.

ఆ. అచలతత్త్వ మనఁగ ననుభవగమ్యంబు
చూపి చెప్పరాదు సూక్ష్మ మదియు
మదికిఁ దోఁచుఁగాని మర్మ మెన్నఁగ రాదు, వి.

అచలతత్త్వము (అనఁగా: బ్రహ్మము) అనుభవవేద్యమే కాని చూపుటకుఁగాని చెప్పుటకుఁ గాని వీలు కలుగునది కాదు. అనుభవవశమున గనుగొనఁదగినది గాని దీని మర్మమిది. ఇటులఁ గనుఁగొన నగునన వీలులేదు.

క. అచలతపోనిష్ఠయుక్తిని
బ్రచురించెడియాత్మకాంతి ప్రతిబింబములో
సుచరిత్రంబగు నిష్కళ
రచియింపుము బట్టబయలు రాజిలు వేమా!

నిశ్చలమగు తపోదృష్టితో నున్నచో హృదయమునఁ గాంతిపుంజములు గోచరించి దృక్శక్తిని చెదరఁ జేయును. అపుడు నిబ్బరించినచో నాకాంతులడంగుటయేగాని నిర్గుణస్వరూపము కానవచ్చును.

ఆ. అచలయోగతపము నందంగ గమకించి
ప్రచురమైనకాంతిఁ బడయుచుండి
రుచిరముగను దాఁటి రూపింపఁ బరమాత్మ, వి.

నిశ్చలసమాధి నొందఁ బ్రయత్నించి దివ్యతేజమును దర్శించి మాయాతీతుఁడవై నిరూపించిన పరమాత్మ యగును.

క. అతిసూక్ష్మదృష్టిలోనను
మది కింపుగ శివుని గూర్చి మఱియొక పైనన్
బ్రతిలేనిమోక్ష మదె యగు
సతతపునిర్వాణపదవి సాక్ష్యము వేమా! 1395

దృష్టిని మిగుల సూక్ష్మలక్ష్యముగ నొనరించి ఈశ్వరస్వరూపమును దర్శించుచు నేకాగ్రబుద్ధితో నున్న యెడల ముక్తి చేకూరును. కైవల్యపదవి నందుట కిదియే సులభోపాయము.

ఆ. అందరానిపండ వడవి వెన్నెల నుండు
నుండుఁ జూడ నొద్ద నుండుగాని
పండుపడినఁ జెట్టు పట్టంగ లేరయా, వి... 1396

బ్రహ్మము అనఁగా అలభ్యమగు ఫలమువంటిది. అయ్యది చిదాకాశము నంటియుండును. అట్టిబ్రహ్మము సాక్షాత్కరించిన సంసారవృక్షము ఛేదకమగును.

క. అది యిది యని మదిఁ దోఁచెడు
సదనము గుర్తించి లోన సాధించినచోఁ
గుదురును బ్రహ్మానందము
గదిసిన మదిఁ జేర నొక్కి కనవలె వేమా! 1397

అది యిదియని వస్తునిరూపణము చేయుభావమును గుర్తించి దానిని లోబఱచుకొన్న యెడల చంచలస్వభావము నశించి బ్రహ్మానంద మనుభవములోనికి వచ్చును.



ఆ. అందు నిందు ననక యన్నిటియందును
విష్ణు వమరియుండు వెలయ భువిని
వెనుకఁ జక్రి తిరుగు విష్ణుచక్రంబుతో, వి...

ఇచ్చట నచ్చట ననక సర్వవస్తువులందును విష్ణువు వ్యాపించియే యుండును. ఆతఁడే పరతత్త్వ మని యెఱుఁగుము. ఆతఁడు ప్రకృతి ననుసరించి చక్రధారియై వర్తించును.

ఆ. అన ననాహతమున నది లెస్సగాఁ జూచి
ఇఁకను దాన వాయు వీహఁ జేసి
కడమవాయు వందుఁ గదలకుండినవాఁడు
చెప్పనేల వాఁడె శివుఁడు వేమ! 1399

అనాహతచక్రమున దృష్టిని బాగా నెలకొల్పి ఉదానవాయువు ననుసరించి ప్రాణ అపాన సమాన వ్యాన వాయువుల ననుగమించి చూచువాఁడు శివుఁడనియే చెప్పవలయును.

ఆ. అన్నదానమునకు నధికసంపద గల్గి
యమరలోకపూజ్యుఁ డగును మీఁదు
అన్న మగును బ్రహ్మ మది గనలేరయా, వి...

అన్నదానమువలన సంపద లధికముగా గల్గును. సురలోకనుతుఁ డగును. అన్నమే బ్రహ్మము. దీనిని జను లెఱుంగక తిరుగుచుందురు.

ఆ. అన్నము నమృతమ్ము నంటు నం టనుడును
బరిహరింత్రు తెలియఁబడక ద్విజులు

అన్న మమృత మిదియ హరిహరబ్రహ్మలు
అంటవన్న వాని కంటు వేమ! 1401

అన్నము అమృతస్వరూపము. అట్టిదానిని అంటు అంటని పరిహరించెదరు. అట్లు చేయరాదు. హరిహరాదులును అమృత స్వరూపులే కదా! హరిహరాదులకువలె నన్నమున కంటులేదు. అంటు అం టనువానికె యంటు.

తే. అమల మవ్యయచింతన మసిపదంబు
గోరి జీవేశ్వరైక్యంబు గూర్చినంత
నవిరతంబగు పరిపూర్ణ మమరు నయ్య
వాదులాడంగఁ జిక్కఁగ రాదు వేమ! 1402

విమలమును నాశనరహితము నగుతత్త్వమస్యాదిపదఘటితం బగుజీవేశ్వరైక్యంబును గూర్చిన పరిపూర్ణుఁడ వగుదువు. వాదములవలన బ్రహ్మము సాక్షాత్కరింపఁడు.

ఆ. అయిదువర్ణములనె యఖిలంబు తెలిసిన
నయిదునందుముక్తి యమరియుండు
నయిదులోన నున్నయతఁడె పో యఖిలము, వి.

పంచాక్షరి స్వరూపమును బాగుగా నెఱింగినచో ముక్తి యాయైదువర్ణములలోనె యిమిడి యున్నది. ఈయైదక్షరములలో నున్నవాఁడే సమస్తవ్యాపియగు భగవంతుఁడు.

ఆ. అర్థయంకణమున కాధార మైనట్టి
యొంటిమేడగుంజ నొనరఁ నిల్పె
నింటికొకమగఁడె యిల్లాండ్రు నేడ్గురు, వి.



దేహము ఒంటిస్తంభపుటిల్లువంటిది. దీనికి జీవుఁ డొకఁడె యజమానుఁడు కాని యిల్లాండ్రు (సప్తప్రకృతులు) ఏడ్గురు.

ఆ. అష్టదళములకును నాధార మైనట్టి
యాదిదేవుఁ డొకఁడె యఖిలజగము
త్రయముదాఁటువాఁడు తానె పో బ్రహ్మంబు, వి.

అష్టదళములకు నాధారమై యుండెడి దేవుఁడొక్కఁడే ప్రపంచాతీతుఁడు. ఆతఁడే బ్రహ్మమును అగును. త్రిగుణముల నతిక్రమించువాఁడె బ్రహ్మస్వరూపుఁడు.

క. ఆఁకలిఁ జంపిన రావది
యాఁకులఁ దిని యడవులందె యలసిన నైనన్
జీఁకటికోనం జిక్కదు
ఏకాకృతి మదిని నిల్పి యెఱుఁగుము వేమా!

బ్రహ్మసాక్షాత్కారము ఆఁకలిని జంపినంతనే రాదు. చీఁకటిగుహల గూర్చున్న చిక్కదు. ఆకలములు దిన్న సాధ్యము కాదు. కావున నిరంతరధ్యానమున సంపాదింపుము.

క. ఆకాశంబున వాయువు
ప్రాకున దావాగ్ని యటుల మానసమందా
యేకాకారుఁడు జగమున
జోకై తను దానె వెల్గు సుమ్మురవేమా! 1407

ఆకాశమునందు గాలియును ప్రానులో నగ్నియు నెట్లు లీనమై యుండునో అట్లే ఏకాకారుఁ డగుదైవము జగము లన్నియు నిండి స్వయంప్రకాశుఁడై యుండును.

ఆ. ఆకు వక్క సున్న మవి మూఁడువన్నెలు
నేక మైనచోటఁ దాఁకు నెఱుపు
సోఁకి త్రిగుణ మట్లు శోభించుఁ బరమాత్మ, వి.

మూఁడురంగులవియగు ఆకు వక్క సున్నము కలిసిన ఎట్టులు రక్తిమ యుదయించునో అట్లే త్రిగుణసంపర్కమున పరమాత్మయు శోభిల్లును.

ఆ. ఆకులేనికొమ్మ యభ్ర మెల్లను నిండె
మ్రాకు మొదలుఁ దుదయు మహిని లేదు
ఏకమైనపండు నింపొందుచుండును, వి....1409

ప్రకృతి యనుమహావృక్షము ఆకులు కొమ్మలు లేకున్నను ప్రపంచమంతయు నావరించియున్నది. దానికి మ్రాకును మొదలును లేదు. దానిఫలము బ్రహ్మానందానుభవమని తెలియుము.

ఆ. ఆకృతి నరయఁగ నిరాకృతి యనఁ దగు
నాకృతి నొగిఁ దగు నిరాకృ తిట్టు
లవియు రెండులేక యపురూపమై యుండు, వి.

బ్రహ్మ మేయాకారమున నుండునని విచారించుకొలఁది నిరాకారతఁ గాంచును. ఇట్టులే నిరాకారమును ఆకారతఁ బరిణమించును. కావున నీరెండును లేనిది బ్రహ్మము అని యెఱుఁగుము.

ఆ. ఆదిఁ జూచుచుండ నన్నిటఁ దా నుండు
నాది చూడ నొకరి కలవి కాదు
ఆదిముక్తి తెరు వ దాత్మనే యుండును, వి...



ప్రపంచమూల మేది యని చూచిన నన్నిటను నది కన్పించియు నసాధ్యమగును. ఆమూలమే ముక్తికి తెరువు. అయ్యది తనయాత్మనే యుండును.

ఆ. ఆది యెవరు పుట్టి యవనికి దొరలైరి
వారె బ్రహ్మ విష్ణు వరశివు లనఁ
గనఁగ మాయశక్తి ఘనతేజ మందఱు, వి...

లోకమును ప్రజలందఱికంటె ముందుగా జన్మించి ప్రపంచపరిపాలనము గావించినవారు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, వీరుమువ్వురు మాయాస్వరూపులు.

ఆ. ఆఱుదూలములకు నాధార మైనట్టి
యొంటికంబ మింటి కొనర నిల్పి
యింటి కొకఁడు కర్త యేపారుచుండును, వి.

షట్చక్రమయమగు నీశరీరము అనుయింటికి బ్రహ్మదండమను (వెన్నెముక) నొంటికంబమును నిలువఁబెట్టి జీవస్వరూపుఁడగు నీశ్వరుఁడు గృహకర్తయై యలరారుచున్నాఁడు.

ఆ. ఉనికి మేరుశిఖర మున్నతతను జూచి
కనియుఁ గానఁబోవుఁ గదల పదియు
వినియు వినవు దాని విమలాంతరంగము, వి...

మేరుశిఖరమునందు నిలిచియున్నను కనిపించియు కనిపింపనట్టిదియై వినియు విననట్టిదై యుండునదియే బ్రహ్మము. ఇచ్చట మేరుశబ్దము యోగపారిభాషికము.

ఆ. ఉప్పు నీరునట్టు లూహించి చూచినఁ
గప్పురంబు జ్యోతి గలసినట్లు
లుప్పతిల్లు మదిని నొప్పుగా శివుఁ డుండు, వి...

నీటిలోఁ నుప్పు కలయునట్టులను, మంటలో కప్పురంబు లీన మగునట్టులును ఈశ్వరుఁడును మనస్సున కలసి యదృశ్యాకార ముగ నున్నాఁడు.

ఆ. ఉబ్బి గుర్తు చూచి యూహను రెట్టించి
నిబ్బరపడువాఁడు నిర్మలుండు
అబ్బరాని బయలునందును పొందును, వి....

ఉచ్ఛ్వాస నిశ్శ్వాసమును బిగియించి ఈశ్వరసంకేతమును చూచి మనస్సును చిక్కఁబట్టి తాల్మిగలవాఁడు దుస్సాధమగు బ్రహ్మము నొందఁగలుగును.

ఆ. ఉర్వీజనులు పరమయోగీశ్వరునిఁ జూచి
తెగడువారె కాని తెలియలేరు
అమృతపురుచులను హస్త మెట్లెఱుఁగును? వి.

అమృతముయొక్క రుచిని హస్తమెఱుఁగనివిధమున ప్రపంచములోనివారు పరమయోగిని జూచి పరిహాసింతురేగాని యాతనిమహాత్మ్యము తెలియఁజాలరు.

క. ఊకొనఁ జెప్పిన విన దది
ప్రాకటముగ లోకములను బాలించెడియా
పాకము మదిలో బయలని
యేకాకృతి నవిరతముగ నెన్నుము వేమా! 1418



చూచుటకును వినుటకును మాటలాడుటకును శక్యముగాక సర్వలోకములయందును నిండియుండిన బయలే బ్రహ్మమనియు నదియే సమస్తలోకములను బాలించుచున్నదని యెఱుంగుము.

ఆ. ఎక్కువెట్టి గుఱుతి కేకమైనంతట
సొక్కి సోలి యుండు సూత్రముగను
ముక్కు సెవులు లేనిమూలమే పరమాత్మ, వి.

సమాధి నొంది లక్ష్యమును చిత్తదార్ఢ్యముతో నైక్యముచేసి నపిస్మృటఁ గలిగెడి యపరిచింత్యమగుమూలమే పరమాత్మయను కొనుము. పరమాత్మ నిరాకారము.

తే. ఎఱుక దోడ్కొని తత్త్వంబు నెఱుఁగు టెట్టు
లెఱుక తొలఁగిన తత్త్వము నెంచరాదు
ఎఱుక మఱపుల కందని యిరవు గనుము
ఎఱుఁగుచుండెడి దానినె యెంచి వేమ! 1420

జాగ్రదవస్థ నున్నతత్త్వము ననుసంధింప వీలులేదు. ఇట్టులే బొత్తిగా జ్ఞానశూన్యమైనను వీలు కలుగదు. కావున జాగ్రత్సుషుప్తులకు రెంటికి సంధనిస్థలము గనుము. అదియే బ్రహ్మము.

క. ఎఱుకను బుట్టును తనువులు
మఱికిని దా మునుఁగుచుండు మోయుట గాదా
యెఱుక గలతనువు నొందిన
మఱియును జన్మించు టెట్లు మహిలో వేమా!

శరీరములు అజ్ఞానజన్యములై మఱికిలో మునిఁగి తేలుచుం

డును. కావున జ్ఞానయుతమగు శరీరము నొందినచో మరిమఱి జన్మము నొందవలసిన పనిలేదు.

ఆ. ఎఱుక నెంచి చూడ నెఱుఁగించుచుండును
బరము దాఁకి చూడ బట్టువడును
గుఱికి బయలుఁ జేర గుణరహితంబురా, వి...

జ్ఞానముఁ బరికించినచో సమస్తము నెఱింగించుచు బరేశుని సాన్నిధ్యముఁ జేర్చి సాధ్యపడును. అలక్ష్యముగాఁ బ్రయత్నింతుమేని యేమియు లాభములేదు.

తే. ఎఱుక మఱపులు గానిది యెఱుఁగలేరు
పరమపరిపూర్ణసుఖ మూని పట్టలేరు
ఉరము బెదరని గుఱిగని యుండ లేరు
నిరుపమానందసంతృప్తి నిలుపవేను! 1423

జాగ్రత్స్వప్నాద్యవస్థలు లేనిదియును పరిపూర్ణసుఖస్వరూపము కలదియు నగుబ్రహ్మము నెఱుఁగఁజాలరు.

ఆ. ఎఱుకమాలు జీవి యెంతకాలంబున్న
చచ్చిపుట్టుచుండు సహజముగను
ఎఱుక మఱచు చోటి నెఱుఁగుట బ్రహ్మము,వి.

జ్ఞానశూన్యుఁ డెన్నిమాఱులైనను జననమరణాదుల నొందుచునేయుండును. కావున జ్ఞానము నార్జించి బ్రహ్మముగనుటకు జ్ఞానాతీతమగు పదవిని సాధింపవలయును.

ఆ. ఎఱుక మఱపులందు నేమేమి తోఁచిన
సరికి గుఱియె గాదు సత్యమునకు



పరమనిర్గుణంబుఁ బాటించి కనవలె, వి... 1425

జాగ్రత్సుషుప్త్యాదులతో నేయేరీతులు పొడఁగట్టినను నమ్మక నిర్గుణస్వరూపమును బ్రయత్నించి కనవలయును.

ఆ. ఎఱుకయుండువాని కెఱుకయే యుండును
ఎఱుక లేనివాని కెఱుక లేదు
ఎఱుక లేనియెఱుక నెఱుఁగుట తత్త్వము, వి.

జ్ఞానహీనునకుఁ బ్రపంచజ్ఞాన మెన్నఁటికిఁ గలుగదు. జ్ఞానశాలికి సమస్తాంశములు సుబోధములై యుండును. ఆట్టిజ్ఞానము నార్జించుటయే తత్త్వ మనఁబడుచున్నది.

ఆ. ఎవరి కెవరుగారి కెవ్వరుఁ గాఁబోరు
గవయఁ గోరు హంస గదియ నొక్కి
శివునిరూప మూని సేవింప దొరకొను, వి...

ఈప్రపంచమున వృథా మరులుకొందురే కాని ఒకరి కొకరు కాఁజాలరు. కావున హంసనుబిగబట్టి మోహముఁ బోఁద్రోచి శివుని సేవింపఁ బూనుట యుత్తమము.

తే. ఎవ్వఁ డజ్ఞానతిమిరంబు నేపు మాపి
జ్ఞానమను వెన్నెలం దోప్పఁ బూను నేని
చంద్రుఁ బోలిన గురునండ సాధకముగఁ
గూడినను గాని తీరదు కోర్కి వేమ! 1428

అజ్ఞానాంధకారమును బోఁద్రోలి జ్ఞానతేజమును వెలయించు సామర్థ్యముగల గురుని సాయ మున్నఁగాని బ్రహ్మము నొందఁ జాలవు. అపుడే కామితములు తీఱును.

ఆ. ఎవ్వఁ డేమెఱుంగు నింపైనవస్తువు
దేహ మే మెఱుంగు దివ్యబోధ
విధము దెలియఁగోరి వేదాంత మెఱుఁగుఁడీ, వి.

అజ్ఞులు దేహ మేదియో క్రియ యేదియో యక్రియ యేదియో నెఱుఁగఁజాలరు. కావున దివ్యబోధరీతి నెఱుఁగఁ గోరిన నుపనిషత్స్వరూపము నెఱుఁగవలయును.

ఆ. ఐదు నైదు నారు నెన్మిది నొక్కటి
యొడలిలోన నుండి యొనరసిల్లు
నొడ యెక్కి తిరుగు నొడయఁడే తత్త్వంబు, వి.

పంచవింశతి (25) తత్త్వములతోఁ గూడిన యీశరీరమున కధిష్ఠాతయై యుండెడివాఁడే పరమాత్మ యని తెలియుము.

ఆ. ఏడుమార్గములను నేకాంతమునఁ జేరి
యాడి పాడి ముక్తి గూడి వేఁడి
జాడలోని బయలు సాధించి కనవలె, వి 1431

సప్తస్రోతస్సులను కదియఁ జేర్చి మనస్సునందు తన్మయత్వము నొందించి ధ్యానించి బ్రహ్మమును సాక్షాత్కరించికొనవలయును. అదియే ముక్తి.

ఆ. ఏడె యక్షరముల నీయంద మొందిన
నందు నిందు ముక్తి యలరుచుండు
నందు నిందు తెలియ నదియపో బ్రహ్మము, వి.

సప్తాక్షర ప్రకృతియందున్న యీశ్వరరూపమును గుర్తించినయెడల ఇహము పరము చేకూరును. ఇటుల నిహపరములను సాధింపఁ గలుగుటయే బ్రహ్మసాక్షాత్కారము.



ఆ. ఏపుమీఱ మదిని నెంచి మించుచు గుర్తు
రూపవు భ్రమ లడఁచి రూఢిపడక
కాపురంబుఁ జేరి కడగండ్లు మానుము, వి...

యోగాభ్యాసమున నిశ్చలముగా నుంచిన దృక్ఛక్తికిముందు వికారాకారములు చాలగానవచ్చును. వానికిలోనుగాక యచంచలముగానున్నచో ఐహికసంబంధములగు నవస్థలన్నియు నంతరించితీఱును.

క. ఏరూప మెచటఁ జూచిన
నీరూపమె గానిపించు నిలిపి తెలివియా
నీరూపమె తా నెఱిఁగిన
ధారుణిలో నీశ్వరుండు తా నగు వేమా! 1434

నిశ్చలసమాధిలో నుండి యేరూపమును సాకారముగావీక్షింపఁదలంచిన నారూపము ప్రత్యక్షమగుచుండును. అట్లు ఈశ్వరస్వరూపమును దర్శించినచో నాతఁడే యీశ్వరుఁడనఁబడును.

క. ఏరూపున నారూపము
లోరూపునఁ జూచుచుండ లోకారాధ్యం
డేరూపుఁ జూచువారికి
నారూపై కానిపించు నభవుఁడు వేమా! 1435

పరమేశ్వరుఁ డిట్టియాకారము గలవాఁడు అని హృదయదృష్టిలోఁ గాంతుమేని లోకనాయకుఁడగు నాయీశ్వరుఁడు స్మ

రణానురూపమగు సాకారముతో భక్తులకుఁ గనిపించి కామితము లొసంగును.

ఆ. ఒకట రెంట మూట యోగీంద్రులను గూడి
యుదయపర్వతంబు మొదలి గిరుల
క్రమ మెఱింగి కాంచు ఘనపట్టణంబుల
వీరుఁ డొక్కఁ డేలు వినుర వేమ! 1436

జాగ్రత్స్వప్నసుషుప్తులను మూడవస్థలయందును యోగీశ్వర సాన్నిధ్యముఁ జేయుచు క్రమముగా నుపాసన జేయువాఁడు కేవలుఁడగు నీశ్వరునిఁ గాంచఁగలుగును. ఈశ్వరుఁడే విశ్వమును బాలించుచున్నాఁడు.

క. ఏరూపు మదిని గోరిన
నారూపే తోఁచు భ్రమల నొఁ గా దనమిం
ధారాళముగను బ్రహ్మము
కోరికలను మించి చూడ గుదురును వేమా!

మనస్సు నిష్టము వచ్చినట్టులు పోనిచ్చుచుండిన విభ్రమములపాలు నేయును. గాన కోరికల నడంచి మెలఁగవలయును. అపుడు భావాతీతమై బ్రహ్మము సాధకునకు సాక్షాత్కరించును.

ఆ. ఒక్కఘటములోనఁ బెక్కురూపులు నిల్చు
నెన్ని యెన్ని రూపు లెసఁగుచుండు
నవియుఁ దొలఁగనేని యన్నియుఁ బైకొను
నాత్మతత్త్వ మిట్టు లౌర వేమ! 1438

ఒక్కఘటములో నీరుపోసి యుంచినచో నం దనేకవస్తు



వులు ప్రతిబింబించును. నీరు తొలఁగించినయెడల అందేమియుఁ గనుపింపవు. అటులే జీవుఁడొకఁడే పెక్కుదేహములఁ దాల్చి కనఁబడుచున్నాఁడు. దేహసంబంధము తీఱినచో జీవుఁ డీశ్వరునిలో లీనమగును.

ఆ. ఒంటికంబమందు నొనరఁ జూచెడు జ్ఞప్తి
గూడి యాడి పాడి కోర్కెదీఱ
మేడదాఁటి చూడ మితి మీఱుచుండురా, వి.

ఉపనిషత్తులు మొదలగువానివలన అద్వైతస్వరూపుఁడగు పరబ్రహ్మను దెలిసికొనవచ్చును. అట్లు దెలిసికొని మన సార ఆపరమాత్మను గొనియాడి యుత్తమోత్తమమగు వేదాంతజ్ఞానమున విచారించుకొలఁదిని ఆపరబ్రహ్మ దివ్యవైభవములకు మితిమేర లేకపోవుచుండును. పరబ్రహ్మలీలలు ఆధ్యాత్మవిద్యాతీతములు.

ఆ. కడఁక నింద్రియములఁ గట్టివేయఁగ లేక
చావు వచ్చునపుడు సన్యసించు
నాత్మజితము గాని నందునా మోక్షము? వి...

కొంద అవివేకులు ఇంద్రియములను లోఁబఱుచుకొనఁజాలక చావఁబోవుముందు సన్న్యాసము నొందుదురు. ఇంద్రియముల జయించనివానికి మోక్షమబ్బునా?

ఆ. కడుపులోనిమలము కష్టమై యుండఁగా
నన్న మేమి కీడొ యనుచుఁ దలఁచి
యుప మెఱుఁగక మనుజు లుపవాసముందురు, వి.

శరీరములో నున్నమలము అసహ్యముగా నున్నను సహించి యన్నము నేమి పాపమో కాని తినక జను లుపవసింతురు. గాన నుపవాసులు జ్ఞానశూన్యులు.

ఆ. అక్షరపుట మిట్టియరదంబులోఁ జూచి
యమర నొక్కరవము ననుభవించు
నతనికొలఁకు ముక్తి యక్షయమై యుండు, వి.

బీజాక్షరసముదయ మనురథములో హృదయమునుంచి స మాధిలోనున్నచో ఓంకారరవము మిగుల గంభీరముగా వినిపిం చును. దాని నాలకించువానికి ముక్తి యెల్లపుడు చేకూరును.

ఆ ఆత్మతేజ మూని యనుభవించుట ముక్తి
ఆత్మతత్వ మెఱుఁగునతఁడె యోగి
యెఱిఁగి మరగినంత నేకమై తోఁచురా, వి...

ఆత్మరూపము నొంది తత్సైక్య మనుభవించుటయే ముక్తి. అట్టిది కలవాఁడే యోగి. అట్టివానికి సర్వము నేకవిధమున నీశ్వ రస్వరూపముగాఁ గనిపించుచుండును.

ఆ: ఆత్మయందె తలఁపు ననువుగా నొనరించి
నిశ్చలముగ దృష్టి నిలిపెనేని
యతఁడు నీవె సుమ్మి యనుమాన మేలరా, వి...

మనస్సులోఁ దలఁపులను జక్కఁగఁ గుదురుపఱిచి నిశ్చల మగుదృష్టితోఁ గాంచుచున్నయెడల ఈశ్వరస్వరూపము గోచ రించును. అపుడు నీవె యీశ్వరుఁడవగుదు వనుటకు సందేహము లేదు.



ఆ. ఆత్మలోనిశివుని ననువుగా శోధించి
నిశ్చలముగ భక్తి నిలిపెనేని
సర్వముక్తుఁ డగును సర్వంబు దా నగు, వి...

హృదయకుహరాంతరాళమును శోధించి యందునున్న ఈశ్వ రునియందు నిశ్చలభక్తి గలిగియుండునేని తాను సర్వముక్తుఁడ గుటయేగాక యీశ్వరుఁడగును.

క. ఆత్మానాత్మవివేకము
స్వాత్మను గని యంతమీఁద స్వచ్ఛందగతిన్
ఆత్మకు లో వెలి నెగడు మ
హాత్ముని బొగడంగవశమె హరునకు వేమా!

ఆత్మ అనాత్మ వీనికిఁ గలసంబంధములు బాగుగా గ్రహించి స్వతంత్రబుద్ధి సముపార్జించి యాత్మాతీతమగు నీశ్వరస్వరూప మును దర్శింపఁ బ్రయత్నింపుము. అదియె మహాత్మ. సర్వదేవ స్తుత్యము.

ఆ. ఆదిమూలవిద్య నానందభరితుఁడై
వేదతుల్య మనుచు విడక పూని
పాదుకొనినవాఁడు పడయును మోక్షంబు, వి.

ఆదిమూలమగు వేదాంతవిద్య నొంది యానంద పరిపూర్ణుఁ డై అద్దానిని విధివిహితమని నమ్మి పట్టు విడక ధ్యానించుచుం డెడివాఁడు మోక్షమును బడయఁగలుగును.

ఆ. ఆదిశక్తి దొడరి యలమటఁ జెందక
ప్రాణపంచకంబు పట్టు నెఱిఁగి
అంతరిక్షమందు నభినుతించుట ముక్తి, వి...

ఈశ్వరవిచారమసాధ్యమని అలసత్వమును వహింపక సర్వదా పంచప్రాణములను నియమించి ఆకాశతత్త్వస్వరూపుఁ డగు నీశుని నుతించుటయే ముక్తి నాఁబడును.

ఆ. ఆశవిడక కాని పాశముక్తుఁడు కాఁడు
కాఁడు ముక్తుఁడైన గాని మృతుఁడు
మృతిని బడయకున్న క్షితి మోహమూడదు, వి.

ఆశవిడచినఁ గాని ముక్తుఁడు కాఁజాలఁడు. అట్లైనఁ గాని విషయములనుండి విరతుఁడు కాలేఁడు. విరతుఁడు అర్థాత్తును మృతుఁడైనఁ గాని మోహము నశింపదు.

ఆ. ఉత్తమాంశ బూనియు న్మహిలోఁ జేరి
మత్తు మించినట్లు మరగి రాక
సత్తమంబుమీటి సాధింప ముక్తిరా, వి. 1450

ఉత్తమమగు దైవాంశమువలన జనించి మానవు లజ్ఞానమువలన మత్తులై వర్తించుచుందురేగాని యవివేక కారణమగు తమోగుణమును బోఁగొట్టుకొనుటయే ముక్తియని గ్రహింపఁజాలకున్నారు.

క. ఉదకములోపలి తత్వము
వెదకియుఁ దా నగుట దెలిసి వేగమె మదిలో
నుదకమువలెఁ దాఁ దత్వము
మదిఁ దెలిసినవాఁడె తత్వమయుఁడౌ వేమా!

నీటిలోనినీడఁ దానేయని తెలిసికొన్న విధముగ శరీరము నాశ్రయించినజీవుఁడె యీశ్వరుఁడని యనుభవరూపముగా నెఱింగినవాఁడె మోక్షానుభవముగలవాఁ డనఁబడును.



తే. ఉన్న నిర్వాణనిజచర్య గన్నవాఁడు
తన్ను తనలోనఁ జూచెడితత్త్వ మెఱిఁగి
సన్నుతించును బరమాత్మ సమతమతిని
గన్ను గాననివాఁ డేమి గాంచు వేమ! 1452

కలరూపు నెఱింగి ఆత్మరూపమును హృదయాంతరాళమున గని ధ్యానించుటయే పరమాత్మసమ్మత మగు మార్గము. కన్ను గానని యజ్ఞానాంధుఁ డిందులకుఁ బనికిరాఁడు.

ఆ. ఎచటఁ జూడ్కి నిలిపి యెంతగఁ జూచిన
నచటఁ దోఁచు కళల నంద రాదు
అచలమైనవ్యక్తి నందుట మోక్షంబు, వి...

ధ్యానము నెందేని నెలకొల్పి నిలుకడగాఁ జూచినచో తోలుఁదొలుత కళలు గోచరించును. అవి యనుభవసాధ్యములు మాత్రము కావు. పిదప నీశ్వరరూపము దర్శింపఁగలుగుటయే ముక్తి.

ఆ. ఎన్నితనువు లైన మృతికి నడ్డము గావు
మృతిని గెలువ లేక యెఱుక లేక
దొంగరీతి కాగ దొరకునా మోక్షంబు? వి...

ఎన్నితనువులు దాల్చినను అవి మృత్యువును జయింపఁ జాలవు. మృతిని జయింపలేక దొంగవలె మృత్యువునకు లోఁబడినవానికి మోక్ష మెన్నఁటికి లభింపనేరదు.

క. ఏకబ్రహ్మము నిత్యము
వైకృతము లనంగ దగినవస్తువు లెల్లన్

ఏకత్వం బని యెఱిఁగిన
శోకములేనట్టి ముక్తి సులభము వేమా! 1455

బ్రహ్మము ఏకమును నిత్యమునై యున్నయది. వికృతి స్వభావములగు వస్తువు లెల్లను బ్రహ్మమయములని యెఱింగినచో ముక్తి సులభముగా నగును.

ఆ. ఏకమునను జూడ నెఱుక యేకంబను
భువిని సతిని గూడుపురుషుమాడ్కి
లోకకాంతునట్టు లోపల వెలుఁగును, వి. 1456

ఐక్యబుద్ధిని బరికించినచో లోకమునందలి దాంపత్యము వలె బ్రహ్మము ప్రపంచముతో నైక్యము వహించి యున్నట్టులు స్పష్టమగును.

ఆ. ఏమి చదివి యేమి యెఱుక లేకుండిన
చదువులందు బరమసౌఖ్య మేది?
మానసైక్యముననె మఱి ముక్తి కలుగురా, వి.

ఎన్నిచదువులు చదివినను బరమసౌఖ్యప్రదమగు జ్ఞానమలవడదేని వ్యర్థము. కావున మానసమును బ్రహ్మముతో నైక్యము నొందింపఁ బ్రయత్నింపుము. దాననే ముక్తికలుగును.

ఆ. ఒకటిలోనఁ గొట్టి నొకటిలోన నె పెట్టి
యొకటిలోను చూడు మొకటి చూపు
ఒకటియందె చూడ నొనరంగ ముక్తిరా, వి.

అజ్ఞానమును హృదయమునందె నిర్మూలముగావించి జ్ఞానమునందు లీనముఁజేసి నిశ్చలదృష్టితోఁ గాంచెదవేని కళ లగుపడును. పిమ్మట బ్రహ్మస్వరూపను దాన గోచరించును.



ఆ. కలుష మెన్నికొనఁగ గౌరవహానియే
యరయఁ దత్వమెన్న నాత్మఘుటిక
తెలసి తాను పిదప స్థిరుఁడు కావలెనయా, వి.

పాపముల నెన్నిన గౌరహానియే కాని ఫలము లేదు. కావున తత్వము నెన్ని తాను శాశ్వతుఁ డగుటకు ప్రయత్నింపవలయును. అపుడుగాని సాధకుఁడు స్థిరమగు విజ్ఞానముగలవాఁడు కాఁజాలఁడు.

ఆ. కష్టమైన మనసు గాంతిఁంచు యోగికి
జ్ఞానదీపశిఖయు దా నటింపఁ
గానవచ్చు నాత్మ క్రమమైన జ్ఞప్తితో, వి...

మిగుల కష్టకరమై విషయాదులపైకిఁ బోవు హృదయమును లోఁబఱచుకొన్న యోగి హృదయమున జ్ఞానజ్వాల ప్రజ్వరిల్లును. పిమ్మట నాత్మస్వరూపము క్రమమగువిధముగ గోచరించును.

ఆ. కష్టమైనమలము కడుపులో నుండఁగ
నంతకంటె జెడెనె అన్నరసము
ఉపము లేనిజనము లుపవాస ముందురు, వి...

పాపభూయిష్ఠమగు మలము తమకడుపులోనే యుండినను అజ్ఞులై జను లుపవాసములఁ జేయుదురు. అద్దాన కొంచెమైనను ఫలము లేదు. గర్భమందలిమలముకంటె అన్నరసము దోషముకాదు గాన నుపవాసము నిరుపయోగము.

ఆ. కష్టలోభివాని కలిమికి నాసించి
బడుగువాఁడు దిరిగి పరిణమించుఁ
దగరువెంట నక్క దగిలినచందము, వి... 1462

పాపాత్ముఁడగు లోభివానిసంపద కాసించి తగరువెంట నక్క దిరిగినట్టులు దరిద్రుఁడు ధనాశాపిశాచావిష్టుఁడై తిరుగుచుండును.

ఆ. కాయగాయ గాల్చి కనకముఁ జూడరా
కాయ మనఁగ బ్రహ్మకాయ మండ్రు
కాయఁ దెలియునతఁడె కౌస్తుభధరుఁడగు, వి...

సంసారమను విషవృక్షఫలమును నశింపఁ జేసి విద్యుత్తేజమును చూడవలయును. ఇట్లు బ్రహ్మరూపమును దర్శించినవాఁడు సాక్షాత్తు విష్ణువనియె యెన్నఁ దగును.

ఆ. కాయమును గడఁగియు గనక యావలనున్న
కాయమును విడిచినఁ గాఁడు యోగి
కాయమందు ముక్తిగతి కేఁగవలయురా, వి.

శరీరమును శోధించి యాత్మస్థితమగు జీవేశ్వరుని శరీరమును చూడక దేహము విడిచిపెట్టినవాఁడు యోగి కాఁజాలఁడు. కావున శరీరమునందే ముక్తిగతిని కనిపెట్టవలయును.

ఆ. కాలధర్మ మెఱిఁగి కపటవృత్తులు మాని
యాలుపిల్లలందు నాశ వదలి
మేలుగాను శివుని మేల్కని చూడరా, వి...

కాలప్రస్వభావమును కనిపెట్టి కపటమును మోహమును



వీడి పెండ్లముబిడ్డలపైఁ గలమమకారము దిగద్రావి ఈశ్వరుని దర్శింప యత్నింపుము.

ఆ. కాశియాత్ర కేఁగి గంగస్నానముఁ జేసి
కష్టపడిరి ముక్తి గానలేక
యెనుము దిరుగుచుండు నెనుబోతు వెంబడి, వి.

అజ్ఞులు కొంద అంతస్థితుఁడగు నీశ్వరుని దర్శింపఁగాలేక కాశియాత్ర కని పోయి పెక్కు కష్టముల నొందిరి. ఇది ఎనుబోతువెంట నెనుము తిరిగినటుల నిష్ప్రయోజనము.

ఆ. కాశియాత్రఁ జేసి గాసిపడుటె గాని
మోస మగును దాన ముక్తిలేదు
పాశ ముడుగఁ బూనుఫలమె యా కాశిరా, వి.

కాశీయాత్ర యని కష్టపడుటే కాని దానివలన మోస ముదప్ప ముక్తి లేదు. కనుక కర్మబంధము వీడుటయే కాశి యనుకొని యందులకై ప్రయత్నింపవలయును.

ఆ. కూడిపరవశంపుకోర్కులు లేకుండ
నాటపలెను బుద్ధి నయముగాను
చోటు గనని వెలుఁగుఁ జూచుటే మోక్షము, వి.

అస్వాధీనములగు కోరికలు లేకుండ బుద్ధిని లోఁబఱచుకొని ఈశ్వరునియందు పాదుకొలిపి యవేద్యమగు తత్కైవల్యము నొందుటయే మోక్షము.

క. కోటులు సంపాదించినఁ
గాటికి సరిపోయె బ్రదుకు గుంపులు కూలెఁ

ఏటికి నీసంసారము
చోటున నిను గన్ననాఁడె సుదినము వేమా!

కోట్లకొలఁది సంపాదించినను కూటికె సరిపోవును. తనవారందఱు తాను నశించుచున్నారు. కనుక నిఁక నీసంసారమునందు బ్రహ్మరూపము నెఱుంగుటకన్న ప్రయోజనము మఱి లేదు.

ఆ. కోపమునను నరకకూపముఁ జెందును
కోపమునను గుణము కొఱఁతపడును
కోపమునను బ్రదుకు కొంచెమై పోవును, వి...

కోపము మానవుని నరకకూపమునఁ గూలఁద్రోయును. కోపమువలన మానవుని యుత్తమగుణము లన్నియు నడుగుఁ బట్టును. కోపమువలన బ్రతుకు నీచమైపోవును. గాన దానిని చేరఁదీయుట నీచము.

క. గంగాయమునల నడుమను
బంగారపుబొమ్మవోలె బాలిక యుండున్
సంగతిగఁ జెలిమిఁ జేసిన
భంగము లేకుండ ముక్తిపరమగు వేమా! 1471

ఇడాపింగళానాడులకుమధ్య కుండలినీశక్తి ప్రకాశించుచుండును. దానిని యోగాభ్యాసపాటవమున లోఁబఱచుకొన్న యెడల ముక్తి సాధ్యమగును.

క. గంగాధరుఁడే దైవము
సంగీతమె చెవులకింపు సర్వజ్ఞులకున్



బంగారమె యుపభోగం
బంగజుఁడే మృత్యుహేతు వరయఁగ వేమా!

సర్వజ్ఞులగు వారలకు శివుఁడే దైవమును, సంగీతమే వీనులకు ఇంపు జనించునదియును ధనమే యుపభోగముగను మన్మథుఁడే మృత్యువునకు హేతువుగను తోఁచును.

తే. గమ్య మగుజ్ఞాన మందుట గగనవిద్య
జ్ఞాన ముదయించి మించఁ బ్రజ్ఞాన మమరుఁ
బరగు బ్రజ్ఞానమందుట బ్రహ్మపదవి
పరశివుం డగు నిది యంక ధరను వేమ! 1473

లక్ష్యమగుజ్ఞానము నందుటయే యుత్తమవిద్య. అట్లైనఁ బ్రజ్ఞానమును దాన బ్రహ్మమును బడయఁగలుగును. ఇదియే తుదకు కైవల్యమునకు సాధకము నగును.

ఆ. గీము విడిచిపెట్టి గిక్కురు మనకుండ
జీవ ముడుగువేళ శివుని దలఁచు
మనసు గొల్పకయును మాయచేఁ బొరలెడు
పాపజనుల కెచటిపరము వేమ! 1474

బ్రదికినకాలమునందు తన యిచ్ఛవచ్చినట్లు ప్రవర్తించి చావుకాలము వచ్చినప్పుడైనను ఈశుని తలంచుటకు ఒప్పుకొనక అజ్ఞుఁడు మాయచే భ్రాంతుఁడగుచుండువానికి మోక్ష మేవిధముగాఁ గలుగఁగలదు.

ఆ. చిత్రదీపము వలెఁ జింతను దిగఁద్రొక్కి
మిత్రముగను మనసు మెలఁగ వెలిఁగి

శత్రుగుణము లెల్ల సాధించుటయె ముక్తి, వి.

దీపము చీఁకటులఁ బోఁకార్చునటులనే జ్ఞానముచే నజ్ఞానమును రూపుమాపి మనస్సును మిత్రునివలె లోఁబఱచుకొనువిధము నెఱింగి కామక్రోధాదులగు అరిషడ్వర్గమును జయింపఁ గలుగుటయే ముక్తి యనఁబడును.

ఆ. చక్కఁగాను మదిని జర్చించి కనవలె
ముక్కు తుదిని నించి మురివెముగను
దృక్కుబ్రహ్మమనుచు మ్రొక్కినంతనె ముక్తి, వి.

చక్కఁగా మనస్సునందు చర్చించి నాసాగ్రమందు దృష్టిని నిల్పి దానినే బ్రహ్మమని ధ్యానించుచు మ్రొక్కినచో ముక్తి చేకుఱును.

ఆ. చందమామ నీడఁ జక్కఁగాఁ దనలోన
నుండఁ జూచి కేల నూఁదిపట్టి
వెన్నెలబయలందు వెదకినంత నెముక్తి, వి. 1477

చంద్ర ప్రతిబింబమును హృదయఫలకమునందు ప్రతిబింబితమగునట్టులు చూచి వెదకినంతనే ముక్తి వెన్నెలబయలునుండి సమువలభ్యమై సాధకునిఁ గడతేర్చును.

ఆ. చదువులందు లేదు శాస్త్రంబులను లేదు
వేదములను లేదు వాదములను
బయలునుండు ముక్తి పాటించి చూడరా, వి.

చదువులందును శాస్త్రాదులయందును [illegible]



బ్రహ్మముండును. అద్దానిఁ బాటించి కనినచో ముక్తికలుగును మెలఁకువగాఁ జూచిన ముక్తి బయలనే కలదు.

ఆ. జీవమునను నాత్మ స్థిరతను గానక
తిరుగు నస్థిరమును గుఱిగ నమ్మి
స్థిరము నస్థిరమును దెలియ జీవికి ముక్తి, వి...

అవివేకియగు మానవుఁడు తనదేహమునందున్న యాత్మకుఁ గలనిలుకడ నెఱుంగక యస్థిరవస్తుసముదాయము నీశ్వరబుద్ధితో నమ్ముచుండును. అటులొనర్పక స్థిరాస్థిర వస్తువివేచనము గడించుటయే ముక్తి.

క. జీవాధారుఁడు రుద్రుఁడు
సేవార్చనపరుఁడు నగుచు స్థిరమతి వెలుఁగున్
భావాతీతపరంబుగఁ
గావించుము మనసు బయలు ఘనముగ వేమా!

సమస్తజీవములకు నాధారుఁడగునీశ్వరుఁడు స్థిరమతిని సర్వదా వెలుఁగుచునే యుండును. అట్టివాని సేవించి ముక్తుఁడవగుటకు భావాతీతుఁడవై హృదయము బయలుగావింపుము.

క. జీవుని దెలియక వేఱుగ
దేవుని భ్రమ దిరుగునరుఁడు దేవుఁడు తలఁపన్
జీవుండని వివరించిన
భావింపఁగ ముక్తి బట్టబయలగు వేమా! 1481

జీవుని ప్రభావమును గ్రహింపఁజాలక యనుభవశూన్యుఁడగు మానవుఁడు దేవునికొఱకు వెదకుచుండును. అట్టి భ్రాం

తులఁ బోనాడి జీవుఁడు దేవుఁడు నొకటియేయని తెలిసికొను టయే ముక్తి యనఁబడును.

ఆ. జీవిలోన నుండు స్థిరమును గానక
తిరుగు నస్థిరమునె వరుస నమ్మి
స్థిరము నస్థిరమును దెలియ జీవికి ముక్తి, వి...

మనుజుఁడు లోన నీశ్వరస్వరూపుఁడగు జీవుఁడున్నాఁడని యెఱుంగఁజాలక యస్థిరవస్తు సముదాయముగ నమ్మి సంసార సాగరమును దరింపలేక యవస్థపడుచుండును. జీవతత్త్వము నెఱుంగుటయే ముక్తిమార్గము.

ఆ. జీవులెల్ల ముందు జీవాత్మ పరమాత్మ
జత లెఱుంగఁ బాపజలధిఁ బడరు
నావ నడుపువాఁడు నట్టేట మునుఁగునా? వి. 1483

సమస్తప్రాణులును జీవాత్మపరమాత్మ భేదమును ముస్ముందు గనే యెఱింగెదరేని వారికిక పాపములుండవు. ఎట్లందురా? నావనడుపువాఁ డేటిలోఁ బడునా?

క. జెండా వేయఁగవచ్చును
గొండలు పెకలింపవచ్చుఁ గుదిరినమదిలో
నిండారఁగ బరిపూర్ణముఁ
జెండాడఁగ ముక్తిత్రోవఁ జెలఁగును వేమా!

అజ్ఞాన పరిపూర్ణమగు నవివేకమును జెండాడినచో ముక్తి మార్గము సుగమమగునని జెండావేసి చాటింపుచేయవచ్చును.



ముక్తిమార్గము నెఱింగినవాఁడు కొండలనైన పెకలింపఁగలఁడు. వాని కసాధ్యము లేదు.

తే. జాడ గలగుఱిమేడలో జోడుగూడి
వేఁడి యష్టాక్షరములందు విధ మెఱింగి
కూడి యాడెడువాఁడె పో కోవిదుండు
సత్త్వసంసిద్ధి పడయంగఁ జాలు వేమ! 1485

హృదయమునందు నీశుని ధ్యానించి యష్టాక్షరములను పారాయణ నేయుచు సర్వదా యానందనిమగ్నుఁ డగువాఁడే కోవిదుఁడు నాఁ దగువాఁడు. వాఁడె సత్యరూపుఁడగు నీశ్వరుని గాంచఁగలుగును.

క. జ్ఞానికిఁ గర్మం బేటికి
జ్ఞానికిఁ గర్మంబు గలుగఁజాలదు చూడఁగ
జ్ఞానమె కర్మంబైనను
మానవులకుఁ గర్మముక్తి మహిలో వేమా!

జ్ఞానానుభవము గలవానికి కర్మములంటనేరవు. జ్ఞానికిఁగర్మలతో నవసరము లేదు. జ్ఞానులకుఁ జ్ఞానమే కర్మ. సామాన్య మానవుల కటులగాదు కర్మముల నంత మొందించుకొనుటయే వారికి ముక్తి.

తే. తనదు దేహమందుఁ దనకున్న పరివార
మంతఱిని బిగించి హర్షమెసఁగ
నెల్లచావు లెఱిఁగి యిందందు యోజించి
నడవ మేటివర్తనమురా వేమ! 1487

శరీరమును తదంతరస్థమగు నింద్రియములను బిగియఁబట్టి ధ్యానించి యీశ్వరుని వెదకుటయే యుత్తమవర్తనమును బ్రహ్మ ప్రాప్తికి సాధనమును నగును.

క. తను దానై బయ లందుచు
ననుమానము లేక తానె యచలుం డగుచున్
వినయవిధేయత లొందిన
మనమే యానందరూపమయ మగు వేమా!

తను దానై యుండుచు సందేహములను పరిత్యజించి గర్వింపక మనస్సును ఆనందరూపము నొందింపఁదగును.

ఆ. తలఁచు దమము బాసి తనువులు మఱచియుఁ
బరమునందు మనసు బయలుపఱచి
కదియ నున్నయట్టి ఘను లెందఱున్నారొ, వి...

అజ్ఞానమును బోఁగొట్టివైచి నిర్వికల్ప సమాధిలో హృదయమును లీనముగావించి హృదయమును బ్రహ్మముపై నెలకొల్పి తదానంద మనుభవించు ధన్యులు చాల స్వల్పసంఖ్యాకులుగా నున్నారు.

క. తలఁచిన దత్త్వం బగునే
తలఁపక తా నూరకున్న దత్త్వం బగునే
తలఁచుటయు తలఁపమియు రెండును
తలఁపక తా నుండెనేని దత్త్వము వేమా! 1490

చింతించినంతమాత్రమునను చింతించనంతమాత్రమునను తత్త్వము చేకూ



రఁబోదు. కావున మనసామననసాధారణమేమి లేకుండ నిశ్చలముగా నుంటయే తత్త్వమని గ్రహింపుము.

క. తా ననఁగ నెన్నఁ డయ్యెనో
యేనన నెవ్వండు గలఁడో యెఱుకగుదానిన్
దానని మనమున నెఱుఁగక
పూనెడు జీవుండు జడుఁడు బొంకరి వేమా!

ఈశ్వరుఁ డెపుడేర్పడెనో జీవుఁడెప్పుడు విడిపోయి మఱల నెపుడీశ్వరునితోఁ గలసికొనునో తెలిసికొని దైవమును ధ్యానింపనివాఁడు మందమతియుఁ గల్లరివాఁడునునగు ననుటసత్యము.

ఆ. తాను సకలమౌటఁ దనలోని సకలంబు
తనదులోనివెలుఁగుఁ దానె యెఱిఁగి
యున్న మానవునకు నొనరును ముక్తిరా, వి...

సమస్తస్వరూపుఁడు తానే యనియును, సమస్తవస్తువులలో వెలుఁగును తానే యనియును తనలో నిట్టివెలుఁగుఁగలదనియు తెలిసికొనువానికి ముక్తి హస్తగతమై యుండును.

తే. తాను సంకల్పరూపుఁడై తమకమందుఁ
దాను సంకల్పరహితుఁడై తగులు ముక్తి
ముక్తి యనఁ జిత్తశూన్యంబు మోక్ష మదియ
దీని నిక్కంబు గనువాఁడె మౌని వేమ! 1493

తాను ఇతరవ్యాసంగములను మానకున్నచో నాందోళనము కలుగును. అట్టివ్యాసంగములను మాని యీశ్వరధ్యానము చేయుటయే ముక్తి. ముక్తియన శూన్యభావముతో నుంటయే దానినే

మోక్షమందురు. ఈరహస్యము నెఱింగినవాఁడె మునీశ్వరుఁడు.

క. ధ్వని పుట్టిన నాలించుచు
ధ్వనిమధ్యమునందుఁ జేరి ధ్వని తానై తాఁ
గనుపించునంతఁ దనహృ
ద్వనజంబునఁ జూడ ముక్తి వశమగు వేమా!

నిర్వికల్పసమాధిలో నున్నపుడు గొప్పనాదము తొలుదొలుత జనించును. ధ్వని మధ్యనుండి ధ్వని స్వరూపుఁడగు బ్రహ్మము కనిపించు. దానిని దర్శించిన ముక్తి సాధ్య మగును.

సీ. ధరణిలోఁ జదువెల్లఁ బరమాత్మలోనాత్మ
నైక్యంబు సేయని యజునిసొద్దు
పంచభూతఘటితప్రకృతిని దలపోసి
యెఱుకెఱుంగనివాని నెత్తిసొద్దు
పంచవింశతితత్త్వపద్ధతి నెఱుఁగక
వేదాంతి ననువాని మీఁదసొద్దు
అంతరంగములోని యానుకూల్యము లేక
యోగి నే ననువాని కొక్కసొద్దు
తే. తాను తానైన తత్త్వంబు తగులుగలిగి
వెలినిలోనను నొకటను దెలివి తెలిసి
బ్రహ్మవేదంబు గనలేని పామరునకు
వెనుక నొకసొద్దు గల దింక వినుము వేమ! 1495

ప్రపంచముననున్న విద్యలన్నింటిని పరమాత్మలో నాత్మను గలు



పుట కుపకరించునటుల జేయనందున బ్రహ్మ నింద్యుఁడు. మానవుఁడయ్యు పంచభూతమయమగు ప్రకృతిని బంధించు జ్ఞానము లేనివాఁడు నింద్యుఁడు. ఇరువదియైదు తత్త్వములస్వరూపము నెఱుంగక వేదాంతినని నిక్కువాఁడు నింద్యుఁడు. హృదయము వశముగావించుకొనలేక యోగీశ్వరుఁడని చెప్పుకొనువాఁడు నింద్యుఁడు. జీవునకు ఈశ్వరునకుఁ గలసంబంధము నెఱింగి అంతరంగమున బహిరంగమున దేవునిదర్శించుచు బ్రహ్మతత్త్వము నెఱుంగఁ జాలని పామరుఁడు నింద్యుఁడు.

ఆ. నాకు నెవరు దిక్కు నడినాళములలోను
వెగుచుక్కనంటి వెలుఁగుదిక్కు
వెలుఁగుకంటె దిక్కు వెదుకంగ లేదయా, వి...

నాకు ఇతరులు దిక్కులేరు. సుషుమ్నానాడికి మధ్యనున్న తేజస్సే నాకు దిక్కు, నన్నదియే కడతేర్పఁదగినది. దానిని మించినదిక్కు లేదని మానవుఁడు తలంపవలయును.

ఆ. నాదు నాదు చూడ నాతులయందుండు
నాదు లేనియట్టి నరులె లేరు
భేద ముడిగి దీని బ్రియపడి కనుఁడయ్య, వి...

నాదము స్త్రీపురుషాదుల హృదయములందుఁ గలదు. నాదములేనిమానవులే లేరు. స్త్రీపురుషాదివర్ణాదిభేదములుఁ మాని ప్రియముతో ప్రణవనాదమును గ్రహింపుము.

ఆ. నిజము కళలమీఱి నిత్యుండు కావలెఁ
బలుకులోనిపలుకు పదిలపఱచి

వేడుకలర ముక్తి వెన్నంటియుండురా, వి...

సత్యస్వరూపమును చక్కఁగా యోచించి కళల నతిక్రమించి ధ్యానము జేయుచు హృదయాంతరాళమున నద్దానిఁ బదిల పఱచినచో ముక్తి వెన్నంటియుండును.

క. నే ననఁగ మేను గాదని
మానసమున నెఱుఁగకున్న మనుజులకెల్లన్
స్వానుభవసిద్ధి దొరకదు
తానగు పరమాత్మ నెఱుఁగఁ దరమా వేమా!

నేను నేను అను అహంశబ్దవాక్యము శరీరముగాదు; శరీరియే యని తెలియనిమనుజులకు స్వానుభవసిద్ధి దొరకజాలదు. తాన తానగుపరమాత్మ నెఱుంగనగును.

ఆ. నే ననువచనంబు నీ వనఁగా వచ్చు
నీవు నే ననఁబడు నిష్ఠ దెలియ
నేను నీవె నీవె నే ననవచ్చురా, వి... 1500

'అహం బ్రహ్మాస్మి' యని యందఱు ననవచ్చునే కాని అద్దానియందలి పరమార్థము నెఱిఁగి యనుట కష్టము. అర్థమెఱిఁగినచో నేను నీవని నీవు నేనని పలుకనగును.

ఆ. నేను నీ వనియెడి నెత్తంపుమాటలు
మాని యుండువాఁడె మానవిదుఁడు
తాను నే ననియెడి తమకంబు మానరా, వి...

నేను నీవు అనియెడి భేదబుద్ధిని పరిత్యజించియుండెడివాఁడే



ముక్తుఁ డగును. కావున నాభేదబుద్ధి త్యజించి యందఱు నొకటియెయని తలంచుటధర్మము.

క. పంచగుణాక్షయబిందువు
పంచాక్షరినాద మండ్రు పరమమునీంద్రుల్
ప్రాంచితముగ నది తెలిసిన
మంచిగనన్ మ్రొక్కునతఁడు మహిలో వేమా!

అక్షయమగు ప్రణవబిందువునే పంచాక్షరినాద మనిపెద్దలు చెప్పుదురు. దానిని తెలియువాఁడు విజ్ఞుడు.

ఆ. పంచతత్త్వములకు బ్రహ్మాల కొకసొడ్డు
వారితండ్రి నెత్తి వైతు సొడ్డు
నంతరంగమెల్ల నాదిశక్తి యెఱుఁగు, వి...1503

ముక్తికి పంచతత్త్వములు బ్రహ్మదేవుఁడు ఆదివిష్ణువు కారణములని కొందఱుచెప్పుచున్నారు. వారందఱు నిందాపాత్రులు. హృదయమును బాలింపఁదగినది ఆదిశక్తిగాన నామెను మ్రొక్కుదును.

క. పంచమహాభూతములై
పంచశరీరములు గలిగి బ్రహ్మాండంబై
పంచావస్థలు దాటి న
టించుట పరిపూర్తిఁ జెందు డెంకిర వేమా!1504

పంచమహారూపస్వరూపములఁ జెంది శరీరాకారముచే పరిణతులై బ్రహ్మాండభాండమునందు పంచావస్థలను దాటినటించువాఁడే పరిపూర్ణుఁడగును. వాఁడే ముక్తుఁడగును.

ఆ. పంచశత్రువులను బంచబాణుని గెల్చి
పంచవర్ణములను బరగఁజేసి
పంచవక్త్రములను బ్రతిఫలించెడువాని
పంచఁ జేరువాఁడె పరుఁడు వేమ! 1505

పంచేంద్రియములను మన్మథుని జయించి నమశ్శివాయమంత్రము పఠనము చేయుచుఁ బంచముఖుఁడగు నీశ్వరుని ధ్యానముగలవాఁడు తప్పక మోక్షమునొందును.

క. పంచాక్షరిజపమందిన
సంచితకర్మములు వాయు సాకల్యముగా
మించును బరమజ్ఞానము
ద్రుంచును దుర్భ్రమల మదిని రూఢిగ వేమా!

పంచాక్షరిని జపించినచో కర్మలు తొలఁగును. జ్ఞానము సాకల్యముగా సాక్షాత్కరించును. అజ్ఞానమును దుర్భ్రాంతులును నశించును. ఉత్తమ జ్ఞానము సమకూరును.

క. పడిపడి మ్రొక్కఁగ నేటికి
గుడిలోఁ గలకఠినశిలల గుణములు చెడునా
గుడి దేహ మాత్మ దేవుఁడు
చెడువాళ్లకు పట్టిపూజ చేయకు వేమా! 1507

మానవులు అవివేకులై గుళ్లలోనుండు రాళ్లదేవతలని భ్రాంతిపడి పడుచులేచుచు మ్రొక్కి మ్రొక్కి దండములు పెట్టెదరే గాని ఆకఠినమైన రాళ్లు ఎప్పుడైన మెత్తఁబడునా? ఫలము నిచ్చునా? అట్టి పట్టిభ్రమలకుఁ బోవనేల? తన దేహమే గుడి.



తన దేహములో నుండు ఆత్మయే గుడిలోనుండు దేవుఁడు. కనుక తనఆత్మను బూజింపవలయును గాని పట్టి కొండరాళ్లన్నిటికిఁ బూజచేయకుము.

ఆ. పదును గల్గ మ్రాను పచ్చనై యుండును
ఈవి గలుగ లంజె యింట నుండుఁ
దలఁపుగలుగ హరియుఁ దన యొద్ద నేయుండు, వి.

వాన గురిసి భూమి యంత పదునై చల్లఁబడినప్పుడు చెట్లన్నియుఁ జిగిర్చి పచ్చగా నుండును. కోరక డబ్బు దోచిపెట్టుచుండిన రంకులాఁడి తనయింటనే కసిపెట్టుకొని యుండును. అట్లే భగవానుఁడును దనపై నెల్లప్పుడును ధ్యానము గలిగియున్నపుడు వదలక భక్తుని వెనునంటియే యుండును. భగవత్సాన్నిధ్యమునకు నెడతెగనితలఁపే ప్రధానము.

తే. పరమనిర్గుణవిద్యలో భావ ముంచి
మానసజ్ఞానపరిపూర్ణమననమందు
నేకరూపము మది నెంచి నిచ్చఁ గనుము
శాశ్వతానందసంసిద్ధి జరగు వేమ! 1509

భావమును నిర్గుణపరముగా ననుసంధించి మననముఁ జేసి యైక్యత నొందించి ఏకరూపుఁడగు నీశ్వరుని ధ్యానించుచో శాశ్వతమగు నానందము (మోక్షము) చేకుఱును.

ఆ. పరము గోరనట్టి పామరజనులకు
స్థిరము గాదు బుద్ధి చిక్కఁబోదు
తరముగానిపరముఁ దలపోత యగు రోఁత, వి.

పరము నపేక్షించని పామరులకు బుద్ధి స్థిరత నొందదు. కావున నట్టివారు తమ కళక్యమగుదానికొఱకై ప్రయత్నింప కుండుటయే మంచిది. వారు పరతత్త్వము కొఱకుఁ బ్రయత్నము చేయుటకంటె నగుబాటులేదు.

క. పరమాత్ముని వివరింపఁగ
నరుఁడా? యణురేణువందు నతిసూక్ష్మగతిన్
బరికింప నన్నిరూపుల
గురుఁడై తా వెలుఁగుచుండు గుఱుతుగ వేమా!

పరమాత్ముని దెలిసికొనవలెనన్న ఆశ్చర్య మేమున్నది? ఆ పరబ్రహ్మము పరమాణువుయొక్క రేణువులో సూక్ష్మాంశమందును అతిసూక్ష్మ రూపముగా నుండియు అంతటను వ్యాపించి ఎలవుడును సర్వముబోధించుగురుఁడై ప్రకాశించుచుండును.

ఆ. పరము పరమటంచుఁ బలుకుదు రందఱు
పరమునందు నేమి ప్రబల ముండుఁ?
బరమునందు నిందుఁ బరిపూర్ణుఁడే కదా! వి...

కొందఱు అవివేకులు పరము పరము అని యేమో పరమందు మిక్కిలి యున్నట్లు కలవరింతురు. అందేమి ఆధిక్యమున్నదో తెల్లియదు. ఆపరబ్రహ్మము పరమునందును ఇహమునందును పరిపూర్ణముగ నిండియేయున్నాఁడు గాని ఒకచో నుండి వేఱొకచో లేకపోలేదు.



క. పాదమున నడచు నరుఁ డట
లేదనఁగా భూమి దిరుగు లెస్సగఁ దనకే
యేదైన హాని వచ్చిన
సాధనమగు పదము నడవ జరుగదు వేమా!

మానవుఁడు కాలు తీసికొని పోవునట్లెల్ల నడచిపోవుచునే యుండును. ఒకచోఁ గానిపనికిఁ గాల్బలముకొలఁదిని భూమి అంతయైనను దిరుగనేతిరుగును. తిరుగునప్పుడు వచ్చెడుపాపము తనకే వచ్చునుగాని తనను దీసికొనిపోయిన కాలున కెప్పటికిని రాదు. కావున ముందుగాఁ గాలు కదలనీయక దానిని తన స్వాధీనములో నుంచుకొనవలయును.

ఆ. గగన మమరఁ జూడ్కి కనుబాట నిక్కించి
నిలిపి చూడఁ జూడ నిలుచు సుఖము
సుఖములోనివరుస సూత్రింప బ్రహ్మము, వి...

చూడ్కిని కనుబొమలనడుమ నిల్పి ధ్యానించినచో సుఖము చేకుఱును. ఆసుఖక్రమమును పరికించినచో నదియే బ్రహ్మమగును. కానసాధకుఁడు ముందు దృష్టి నచంచలముగావిం పవలయును.

క. ఘంటారవమును మదిలో
వింటిన్నే గంటఁ గంటి విమలపుగాంతిన్
వెంటాడక బ్రహ్మంబును
గంటిని వగ కాదు నన్నుఁ గనుఁగొన వేమా!

ఘంటానాదమును బోలిన ప్రణవనాదమును హృత్పద్మమున

సాలకించితిని. కళారూపమగు మహాత్కాంతి పుంజములఁగాంచితిని. వెంటనంటిన బ్రహ్మస్వరూపమునుగంటిని నిజమని వేమన సాటుచున్నాఁడు.

క. ఘనసార మగ్ని దోరఁకొన
ఘనసారం బగును గాదె కారణవిద్యా
ఘనసారము విద్యాగ్నికి
ఘనసారమె కంటకంబు గలుగుర వేమా!. 1516

ఘనసారము (అనఁగా కప్పురము) అగ్నిసంయోగమాత్రాన ఘనసారము (గప్పుమనునది) యైనట్టులనే కారణవిద్యాఘనసారము అవిద్యాగ్నికి ఘనసారము అగును.

తే. చంద్రసూర్యాగ్ను లేర్పడ్డ చంద్రశాలఁ
జేరి పరశివు నాత్మలోఁ జింతఁ జేసి
చిన్మయానందమునఁ జేరఁ దన్మయంబు
ముక్తిమూలం బిదే జనమ్ములకు వేమ! 1517

చంద్రసూర్యసంచారము గల నభస్తత్త్వమును మనస్సును చేర్చి పరశివుని ధ్యానించి చిన్మయానందమున తన్మయుఁడగుటయే ముక్తినాఁబడును.

ఆ. చంద్రునీడ నునిచి చక్కఁగా రవిమీఁద
నుండఁ జూచి కోఱత నుండఁజేసి
వెన్నెలఁ గదియుటయె వెలయంగ ముక్తిరా,వి.

రాగానుభవ వశమున హృదయదృష్టిక్రిఁగానవచ్చు సూర్య



చంద్రాదుల నతిక్రమించు కళాసముదయమును జూచి యాకాంతిపుంజమున భావమును లీనముగాంచుటయే ముక్తి.

క. చిత్తరువు ప్రతిమ కైవడి
చిత్తమును గల్ప మడఁచి చిరతరబుద్ధిన్
జిత్తునఁ దెలిసినవాఁడే
యెత్తినసుజ్ఞాని యందు రిహమున వేమా! 1519

హృదయమును చిత్తరువువలెఁ జేసి ఇతరతలంపులుమాని నిశ్చలచిత్తముతో చిత్స్వరూపము నెఱింగినవాఁడే జ్ఞానశాలియని లోకమునఁ బ్రసిద్ధివహించును.

క. చిత్తము మనమును బుద్ధియు
హత్తు నహంకారగుణము నాత్మను లోఁగా
మొత్తముఁ జేయఁగ నేరని
మత్తులకును ముక్తి లేదు మహిలో వేమా!

మనస్సు బుద్ధి అహంకారము లోనగువానిని హృదయమునందు లయము గావింపఁజాలని యున్మత్తులకు మోక్షమెన్నఁటికిని లభింపఁజాలదు.

తే. చోరులకుఁ జిక్కిపోయినతీరె యగుట
నోటఁ గొణియించు మంత్రము నీటఁ గలియు
మాటలందును బరమాత్మ మరగి రాఁడు
చిత్తమున స్వస్థతయు లేమిఁ జెడుగు వేమ!

మనస్సు శుద్ధిచేయక నోట జపించు మంత్రముదొంగకు చిక్కినసొమ్మువలె నీటఁగలసిపోవును. మాటలతోఁ బరమాత్మ

లోనుగాఁడు గావున హృదయమును ముందు నిలుకడగలదిగాఁ జేయవలయును. లేకున్న సర్వము చెడును.

క. చన్నుగవరీతి సంపద
కొన్నాళ్లకు వ్రేగుఁజూపి గొబ్బున వ్రాలుక్
వెన్నెల చీకటి సరియగు
నన్నా శివలింగమాయ యన్నియు వేమా! 1522

సంపదలు నిలుకడలు లేనివి. ఈశ్వరమాయచే నైశ్వర్యములు జవరాండ్ర గబ్బిగుబ్బల గట్టితనము తగ్గునట్లు పున్నమనాఁటి వెన్నెల లంతరించునట్లు నదృశ్యమగును.

తే. చూపు చెదరని వృత్తిలోఁ జూడ్కినంటి
యేపుమీఱిన మదినందు రూపుమాపి
తన్నుఁ దాఁ గాంచుచుండును దత్త్వవేత్త
నిర్వికారుండు నా భువి నెగడు వేమ! 1523

నిశ్చలవృత్తితో ధ్యానించి హృదయమున నీశుని పాదుకొలిపి తత్త్వవేత్త యనువాఁడు తత్త్వమును అనఁగా తన స్వరూపమును నిర్వికారుఁడై పరికించుచుండును.

ఆ. చావు వచ్చినపుడు సన్న్యసించుట దెల్లఁ
గడకు మొదటికులము చెడుట కాదె
పాప మొప్పు వేఱె ఫలముండఁ బోదయా, వి.

ఆతురసన్న్యాసమని చావఁబోవువానికి సన్న్యాసమిప్పించెదరు. అది మొదటికులమును మాపుకొనుటకె గాని మఱియొందులకు గాదు. దానివలన పాపమోగాని ఫలములేదు.



ఆ. చూపులోనిచూపు సుజ్ఞానదాయిని
మనసులోనిమనసు మాయఁ దవులు
ఎఱుకలోనియెఱుక నెఱుఁగుముర మూర్ఖ! వి.

దృగ్దృశ్యములను బరిశీలించుట జ్ఞానదాయకము. మనస్సులో ధ్యానముచేయుటవలన నజ్ఞానము తొలఁగఁజాలదు. కావున వివేకసాధ్యమగు జ్ఞానము నుపార్జింపుము.

ఆ. చూపులోనిచూపుఁ జూడ నేర్చినవాఁడు
చూపులోననుండి చూచువాఁడు
చూడఁజూడఁ దన్నుఁ జూచును నిక్కము, వి.

చూపులోనిచూపు (అనఁగా: అంతరంగదృక్కును) కలిగియుండెడివాఁడే నిక్కముగాఁ దనలోఁదన్ను చూచెడివాఁడును ఆత్మస్వరూపమును దర్శించువాఁడు నగును.

ఆ. జంగమాఖ్యభక్తి సంధి వేఱుగ లేదు
సగుణభావ మిదియ శాస్త్రవిధియు
నిర్గుణంబు వీడు నెరవేది యోగము, వి... 1527

శాస్త్రవిధిప్రకారముగా నాలోచించితిమేని జంగమభక్తి సగుణోపాసనమార్గము యోగమార్గము నిర్గుణోపాసనమార్గమని గ్రహింపుము.

తే. జన్మమరణావ్యవస్థలజాడ మీఱి
మన్మయం బగుపరిపూర్తి మఱుఁగుఁ జేరి
తన్మయాకృతి నొందుటే తత్పదంబు
నిర్వికారుని కిది కల్గు నుర్వి వేమ! 1528

జననమరణాదులు లేనిదియును చిత్స్వరూపమున నిండి యుండునదియు నగునాకృతితో తన్మయత్వము నొందుటయే ముక్తి నాఁ బడును. ఇవి నిర్వికారునకు మాత్రమే సాధ్యము.

క. జపములు చేసినఁ జిక్కదు
విపినములందున్నఁగాని విడుచునె భ్రమ లా
జపమంత్రమాలసిద్ధికి
నెప మెన్నని మోక్షపదవి నిలుచుర వేమా! 1529

జపములను చేసినను అడవులఁ గూరుచున్నను కేవలము భ్రమయేకాని మోక్షపదవి చిక్కదు. కావున నట్టిమాల మంత్రసిద్ధుల కన్నిటికిని కారణము అగు మోక్షమార్గము నొందుము.

ఆ. జయము భయము దాఁటి చలపట్టి యుండును
దయకుఁ బాత్రుఁ డగును ధర్మపరుఁడు
నయముగాను గురుని నమ్మి నెమ్మది వేఁడు, వి.

ధర్మపరుఁడు జయమును భయమును వీడి పట్టుఁబట్టి గురుని యనుగ్రహమున కృతకృత్యుఁ డగుటకుఁ బ్రయత్నించును. నీవును నట్టులనే చేయుము.

ఆ. జిహ్వారసమువల్ల జీవంబు పోషించు
బ్రహ్మ మన్న రసముఁ బడయ లేరు
రసముఁ ద్రాగనట్టి రాజులు సావరే? వి... 1531

జిహ్వారసము (అన్నరసము) ప్రాణాధారము గావున మానవులు దానికై వెంపరలాడుచుందురు గాని ఇహపరలోకతారక



మగు బ్రహ్మరసముకొఱ కెవరు యత్నింపరు. ఇఁక రాజు లన్నో మదమత్తులై మద్యరసము లేకున్న చత్తుమన్నటు లుందురు గాని యీశ్వరవిచారణ గావింపరు.

ఆ. జీవగుణము గలుగుజీవంబు బ్రహ్మంబు
సాటివచ్చు టెట్లు సరవిఁ దెలియ
నూరికుక్క సింగ మొక్కటి యగునొకో, వి.

జీవగుణంబులు కలిగియున్నంతవఱకును జీవము బ్రహ్మము కాఁజాలదు. ఎట్లనఁగా నూరికుక్క సింహమగునా?.

ఆ. జీవనము దెలిసినఁ జెలఁగి మదిఁ జలించు
దైవ మగపడినను దగులు బుద్ధి
దీప్తభానుని గని తిమిరంబు నిలుచునా? వి...

తన యాయుర్దాయ మెంతకాలమో తెలిసినచో మనస్సు చంచలించును. దైవము సాక్షాత్కరించినచో బుద్ధి తదాసక్తమై యుండును. సూర్యునియందు చీకటులు నిలువనటుల జ్ఞాని నవివేకమాయ ఆవరింపఁజాలదు.

క. జీవము శాశ్వతరూపము
భావమునను నిలిచి లోన పరుఁడై యుండున్
గేవలనిర్గుణ మదె యగుఁ
గావరమును గడకుఁ ద్రోసి కనవలె వేమా! 1534

జీవముయొక్క శాశ్వతమగు (అచంచలము నపరిణామియు నగు) రూపమును మనస్సులో నిల్పి ధ్యానించినచో నయ్యదియే నిర్గుణరూపమగును.

ఆ. జీవుఁ డనఁగ మీరు చిక్కులు పడనేల?
వాయు వాకసంబు వహ్నిఁ గూడి
దేహి యనఁగ నొప్పె దేహంబులం దొప్పి, వి.

జీవుఁ డనఁగ పంచభూతసముదాయ విశిష్టుఁడై యేయున్నాఁడు. కాన నతనికై దుర్భ్రమలు నొందవలదు.

ఆ. జీవుఁడె యగసాలి క్షితిలోనఁ దెలియంగ
భావ మైన తానె పరమశివుఁడు
వాయు వనెడియతఁడె వసుధ బ్రహ్మము కాదె, వి.

జీవుఁడు చిత్రములగు సొమ్ములుచేయు కంసాలివంటివాఁడు ఈశ్వరుఁడు భావవేత్తయగు జ్ఞానస్వరూపుఁడు. బ్రహ్మము సర్వజన జీవనము సమస్తవ్యాప్తియు గలవాయువు వంటివాఁడు.

ఆ. జ్ఞానముద్రచేత గనఁగ వచ్చెడి తళ్కు
కదియె మదికి శ్రేష్ఠమనుచు మునులు
పలికి రదియె తెలియఁ బరమార్థ మగునయా, వి.

జ్ఞానముద్రావశమున నున్నసమయమునఁ గానవచ్చు ప్రకాశము మిగుల నుత్తమమైనదని మహామునులే చెప్పిరి. అదియే పరమార్థమని మనస్సులో గ్రహింపుము.

తే. జ్ఞానసుజ్ఞానగతు లొప్పుజాడ లెఱుఁగ
నగును దైవజ్ఞు లగువార లరసిరేనిఁ
బాలు నీరును భేదింపఁ బరగు హంస
లట్టిసామర్థ్య మొప్పువా రవని వేమ! 1538



జ్ఞానము సుజ్ఞానము అను నీరెంటిజాడలు బాగుగా గమనించినమహానుభావులు సామాన్యులుగారు. పాలును నీరును విడఁదీయ నేర్పుగల హంసలవంటివారనుటలో సందియములేదు.

ఆ. ఒక్క మెత్తి చెప్పు మొక్కఁడే దేవుఁడు
నిక్కముగను లోన నిలిచియుండుఁ
జక్కఁ జూచునతని సంతోషమున ముంచు, వి.

దేవతలు పెక్కుమందిలేరు. ఒక్కఁడే యని జెండా ప్రాతి చెప్పవచ్చును. ఆతఁడు హృదయమునసే కలఁడు. అతని సాధ్యములచే దర్శింతుమేని సంతోషమున ముంచివేయును.

తే. తత్పదము నెన్న ప్రత్యగాత్మమ్ము సుమ్మి
త్వంపదం బన బ్రహ్మరూపమ్మె కదర
అసి పదమ్మున లక్ష్యమ్ము నైక్యము గన
సోహమేర్పడుఁ దెలియంగఁ జూడు వేమ! 1540

తత్త్వమసియనుమహావాక్యములోనితత్పదము ప్రత్యగాత్మను దెలుపుచున్నది. త్వంపదము బ్రహ్మమును అసిపదము రెంటికిఁగల ఐక్యము నెఱింగించుచున్నది. దీనిని బరిశీలించి నేను ఈశ్వరుఁడనని తెలియును.

ఆ. తథ్యమైన పూర్ణతత్త్వము నీలోన
మిథ్య నరయఁగానె మిత్ర మగును
సత్యనిత్యకర్మసాక్షి బ్రహ్మంబురా, వి... 1541

నిశ్చలమగు పూర్ణతత్త్వమును మనస్సులో ధ్యానించి జగ

ము మిథ్యయని భావింతువేని జీవుఁడు గానుపించును. సత్యముని త్యములు సగుకర్మ లన్నింటికిసాక్షి బ్రహ్మమని యెఱుంగుము.

ఆ. తనదురూప మెల్లఁ దనలోనఁ జూచియు
మనసు దీపమునను మమత విడచి
యనుదినమును గాంచు నతఁడె పో బ్రహ్మము,వి.

ఆత్మస్వరూపమును తన ఆత్మలో నీక్షించి సమస్తము నాత్మా నుకృతిని జూచువాఁడు బ్రహ్మమున నైక్యము నొందును.

క. తనగుణము తనకు నుండఁగ
నెనయంగా నొరుని గుణము నెంచును మదిలోఁ
దనగుణము దెలియ కన్యునిఁ
బనిగొని దూషించువాఁడు వ్యర్థుఁడు వేమా!

మంచివో చెడ్డవియో తనగుణములు తనకుండగా ఇతరుల గుణములను ఎన్నుచు దన్నుదాను తలంపక పరులను దూషించు వాఁడు వ్యర్థుఁడని భావింపవలయును.

ఆ. తనదురూప మెల్లఁ దనలోనఁ జూచియు
మనసుదీపముగను మమత విడిచి
యనుదినమును గాంచు నతఁడెపో బ్రహ్మంబు,వి.

మనస్సును దీపముగా నొనర్చి మనోదృష్టిచే నాత్మరూపమును ననుదినమును లోపల (అనఁగా:) అంతర్హృదయమునఁ గాంచువాఁడే బ్రహ్మస్వరూపుఁడు అగును.

ఆ. తన్నుఁ దాఁ దెలిసినఁ దానె పో బ్రహ్మంబు
తనువులోనె ముక్తిఁ దగిలియుండు



త న్నెఱుఁగనివాఁడు తా నెట్టిబ్రహ్మంబు? వి...

తనను దాఁ దెలిసికొనుటయే బ్రహ్మమగును. ఇట్టిది తెలియనివాఁడు బ్రహ్మము కాఁజాలడు. ముక్తి దేహమునందే యిమిడియున్నది గాని ఇతరస్థలమున లేదు.

ఆ. తన్ను వెదకి చూడఁ దానె యా జీవుండు
తత్త్వ మరయ నగును దానె యాత్మ
మన్ను మిన్ను లేదు మాయయు లేదయా, వి.

ఆత్మరూపమును వెదకినచో తానే (అనఁగా: జీవుఁడే) ఆబ్రహ్మస్వరూపమును చెంది కాన్పించునే కాని తదితరమున నెందునైనను బ్రహ్మస్వరూపము లేదని తెలియుము.

ఆ. తపము లేల యరయ ధాత్రిజనుల కెల్ల
నొనర శివుని జూడ నుపమ గలదు
మనసు చెదరనీక మహిలోనఁ జూడరా, వి...

తపము మొదలగువానిచేఁ గృశించుట పనికిమాలినపని. ఈశ్వరుని జూడఁదలంచినచో నిట్టికష్టములతో నించుకేనియుపని లేదు. మనస్సు చెదరనీయక నిలుపఁ గలిగినచో ఈశ్వరసాక్షాత్కారమగును.

తే. తమము మించినధ్యానంబు తత్పదమగు
విమలసుజ్ఞాన మనుప్రజ్ఞ విడిది గనుచు
నిర్ణయంబును గనుచుండు నేర్పుతోడ, వి. 1548

తమోగుణమును వీడి ధ్యానించుచు తత్పదవాచ్యుఁడై

ప్రత్యక్షరూపమును గుర్తెఱుంగుచు నుండిన కైవల్య నిర్ణయము గావించి యందులకు యత్నించువాఁడు నేర్పరి.

ఆ. తఱచు తనువుఁ బాసి తఱితోఁ దను మఱచి
తాను నే ననఁ దగు తలఁపు మఱచి
యుండునాతఁడు గద యుత్తమయోగియౌ, వి.

తనువుపై గలమమకారాదులు తొలగించి తన్నుతాను మఱచి వీఁడు పరుఁడు ఇతఁడు స్వీయుఁడను విభేదమునుమాని యుండువాఁడే యుత్తముఁడగు యోగి.

తే. తలఁపుమఱపులు లేనందుఁ దాఁకినపుడె
తాను బ్రహ్మంబులోఁ జేరి తలఁగకుండుఁ
దత్పదంబును మరగిన తానె బ్రహ్మ
జ్ఞాన మిద్ది యెఱింగిన ఘనత వేమ! 1550

తలంపును మాయావృతముగా నీయక జీవునియందు నెలకొల్పఁ గలిగినచో బ్రహ్మానుభవము కలుగును. బ్రహ్మానుభవముగల వాఁడె బ్రహ్మ. ఈజ్ఞానవిషయము నెఱుంగుట మిగుల గౌరవకరము.

ఆ. తల్లి యొకతె భువిని దండ్రియు నొక్కఁడు
నెల్లలోకములను నెంచిచూడఁ
గల్లగాదు గౌరి కఱకంఠులే సుమీ, వి... 1551

లోకమున కంతకును పార్వతీపరమేశ్వరులే జననీజనకులు. వారికంటె నితరము మఱియేదియును లేదు. ఎల్లలోకములఁ బరిశీలించినను ఇదియొసత్యము.



ఆ. తాను జన్మమెత్తి దానధర్మము లీయఁ
గర్మగతిని యముఁడు కష్టపఱచుఁ
గర్మధర్మములను గడఁద్రోయు బ్రహ్మము, వి...

దాతయగువాఁడు పుట్టినదాది దానములుగావించినను కర్మములవలన యమబాధలు తొలంగకుండును. కావున కర్మముల నుధర్మములను తొలంగించుకొనుటయే బ్రహ్మము.

క. తా ననెడియహంకారము
మానక తనుఁ దానె చెఱుచు మైమఱపించుక్
నేనని పలికెడివారికి
మానునె దుష్కర్మఫలము మహిలో వేమా!

అహమస్మి యనుగర్వభావమును త్యజింపనివారి కెచ్చటకు పోయినను దుష్కర్మఫలములు మానునా? అహంకారి మైమఱుపువలననే నాశనమొందును.

క. తానవుట దెలిసి మది నొక
తానును లేకుండు టెల్లఁ దనుఁ దానె యనం
దా నెఱిఁగి పరిణమించిన
మానవులకు ముక్తి గలదు మహిలో వేమా!

తానే జీవుఁడని గ్రహించి ఇంకొకదేవుఁడు లేఁడనియు జీవుఁడే యీశ్వరుఁడని ఈశ్వరుఁడే జీవుఁడని తలంచినవానికి మోక్షము సిద్ధించును.

క. తానును నే నని వేఱుగ
మానసమునఁ దలఁచునట్టి మానవుఁ డెటులుం

గానఁగ నేరఁడు తత్త్వము
మౌనులతోఁ దిరిగి నైన మహిలో వేమా!

విభేదబుద్ధిలో నరుఁడు స్వీయుఁడని తలంచుచున్న మానవుఁడు మునులతోఁగలసి చిరకాలము వర్తించినను ఈశ్వరతత్త్వము నెన్నఁటికైనను గుర్తింపఁజాలఁ డనుట సత్యము.

క. తానును నేర్పరినైనను
దానకములఁ దన్నుఁ దానె తప్పించికొనం
దా నెన్నివిధములను మఱి
తానే పరమాత్మ యనుచుఁ దలఁపర వేమా!

నేర్పరియగు మానవుఁడు జ్ఞానబలముచే మాయావృతుఁడు గాక తొలంగి వివిధములగు నుపాయములచేఁ దనలోనున్న జీవుఁడే యీశ్వరుఁడని తలంపవలయును.

ఆ. తాను బుట్టుచోటు దాఁ జూచి పలికినఁ
దాను దిరుగుబుద్ధి ధరణిలోనఁ
దాను బుట్టుచోటు తత్త్వంబు తలపోయ, వి

తనపుట్టుకకు అగుమూలకారణమగు మర్మస్థలమును (అనఁగా పంచభూతవివేచనఁ జేసినచో) మనస్సును విఱిగిపోవును. మాత్మ స్వరూపమునందలి తత్త్వము నెఱింగిన విరక్తి కలుగును.

తే. తామసంబంటు బుద్ధిని దగులఁ బెట్టి
నియమనిష్ఠలు మదియందు నిగుడఁ జేసి
కామవర్గము జయమంద గలుగు ముక్తి
ఆమహాత్మునిని సేవింప నగును వేమా! 1558



తమోగుణప్రధానమగు బుద్ధిని విసర్జించి నియమము నిష్ఠ వీనియందు హృదయమును నెలకొల్పి కామాదులు విసర్జించిన వానికి మోక్షము గలుగును. అటులు వర్తించు మహాత్ముని సేవింపనగును.

ఆ. తిరిగి తిరిగి నరుఁడు మరులుకొనుటె గాక
యందువలన నేమి యాస గలుగు?
నంతరాత్మ నిలుపునతఁడె పో బ్రహ్మంబు, వి...

తిరిగి తిరిగి మానవుఁడు తీర్థయాత్రలతో మునిఁగి తేలుచుండును. దానివలన నించుకేనియు ఫలము లభింపదు. హృదయమును నిలుపువాఁడె బ్రహ్మస్వరూపుఁడు.

ఆ. తిట్టికొట్టిరేని తిరిగి మాటాడక
యూఱకున్నఁ జూడ నుర్విమీఁద
వాఁడగుఁ బరమాత్మ వర్ణింప శక్యమా? వి...

ప్రజలు చేయుదూషణభూషణలకు మాఱువల్కక యూఱకున్న వాఁడు పరాత్ముఁడే యన వచ్చును. అట్టివానిని వర్ణింప శక్యము గాదు.

ఆ. తిరిగి తిరిగి నరుఁడు దిమ్మరి కాఁగానె
యందువల్ల నేమి యధిక మొప్పు
నంతరంగ మెఱిఁగినప్పుడే శివుఁడౌను, వి... 1561

అంతరంగము నెఱింగిన శివుఁ డగునే కాని తీర్థాదులవలన దిమ్మతిరుగుటచేత నిసుమంతయుఁ బ్రయోజనము లేదు.

ఆ. తెరువు ముక్కు చాయఁ దేఁగలిగినమీఁద
నందుఁ గనఁబడునదె యరయ లేరె
యరసిచూడ బయలె యల్లదె ముక్తిరా, వి...

నాసామార్గమున ధ్యానస్తిమితలోచనుఁడవై యుండు నప్పుడు కన్పట్టెడిబయలె ముక్తి యని భావింపుము.

ఆ. తెలుపువాఁ డెవండు తెలియువాఁ డెవ్వఁడు
గుట్టెఱుంగునంత బట్టబయలు
సొరిది భాండమందు సూర్యునిచందంబు, వి...

ఈశ్వరతత్త్వమును గూర్చి యొకరు తెలుప మఱియొకరు తెలిసికొనవలసిన పనియుండదు. నీటికుండలోని సూర్యునిబింబమువలె, దానిరహస్యము నెఱింగినచో నీశ్వరరూపము గోచరించును.

ఆ. తేఁకు నమర బుద్ధి తెల్లముగా నిల్పి
తాఁక నది ప్రణవపుధ్యానమగును
సోఁకి మించువాఁడె సురలోకమును బొందు, వి.

బుద్ధిని దృఢముగా నిల్పి ప్రణవమున ధ్యానించుచు చిత్కళ నంటినచో సురలోకము నవశ్యము నొందును. అనఁగా దేవత్వము నొందు ననుట.

ఆ. దాన మమరఁ జేయ దరిఁ జేర్చు నయ్యద్ది
మనసు మోవమ్మె నేని మాయయందు
జ్ఞానకలిక నమ్మ జంపురా వైరుల, వి... 1565

ఊహ్యము.



క. దృక్కునకు దృశ్యమునకును
మక్కువతో భేద మెంచ మఱిలేదు సుమీ
దృక్కునకు దృక్కు బ్రహ్మమె
నిక్కము నీయందు నిండి నెగడును వేమా!

దృగ్దృశ్యములకు భేదము నెంచ లేదు. దృక్కును దృశ్యమును రెండును బ్రహ్మస్వరూపమునందే నిండియున్నవి. ఈరెండును నీయందుఁ గలవు.

ఆ. దూలములను బోలుదురవస్థలవి యెల్ల
రోసి యాసలన్ని కోసివైచి
వాసనఁ ద్యజించువాఁడెపో బ్రహ్మంబు, వి...

మిగుల గొప్పవియగు కర్మబంధముల నన్నింటిని దొలంగించుకొని ఆసలను గోసివేసి ఐహికములగు వాసనలన్నింటిని విసర్జించిన ధన్యుఁడే యీశ్వరుఁడు.

క. దేహియు జ్ఞానానలమున
దాహంబై దేహ మెల్లఁ దల్లడపడఁగా
దేహములోఁ బొర్లాడుచు
మోహము విడ శివుని జూడు ముక్తికి వేమా!

దేహము జ్ఞానాగ్ని చేత దగ్ధమై తల్లడపడు నప్పుడైనను మోహమును వీడి శివుని జూడుము. అదియే ముక్తి మార్గమనుకొని ఐహికములను విడచిపెట్టుము.

ఆ. దైవఘటన లేక దైవసుజ్ఞానం బ
దేల వచ్చు రెంటి కెఱుకపడక

యెఱుక నెఱుఁగువాని కెఱుకలోఁ గనిపించు॥ వి.

మానవునకు ఈశ్వరుని ప్రేరణ లేక జ్ఞానము కలుగనేరదు. అట్లుగాక ఈశ్వరుని ప్రేరణయే యున్నచో వానికి జ్ఞానము సహజముగనే లభ్యమగును.

ఆ. దొడ్డవాండ్ర మనుచుఁ ద్రోవ డొంకలు గొట్టి
యడ్డమైనజనుల నంటఁగట్టి
దోఁచుకొన్న నట్టి దోష మెక్కడఁ బోవు? వి.

ద్రవ్యవంతులు పలుకుబడి గలవారునగు మూర్ఖులు త్రోవలు గొట్టి అడ్డము వచ్చినవారలను చెట్టుల కంటఁగట్టి పరుల ద్రవ్యములను దోఁచుకొందురు. ఈదోషఫలము పరలోకమున మాత్రము విడువకపోదు.

క. ధూమాదులు నావృతమై
వ్యోమంబున కెగసి కలియునుపమను దనలో
శ్రీమించు శివుని జేరును
గామాదులఁ గలియఁడతఁడు ఘనముగ వేమా!

భూమియంతయు నావరించినపొగ మెల్లగా నాకాశము లోఁ గలసిపోవుచున్నది. అటులె మానవహృదయములలో నున్న జీవుఁ డీశ్వరునితోఁ గలసికొనును. జీవుఁడు కామాది వికారములకు లోనుగాఁడు.

ఆ. ధరను దేవళముల తగులు వీడినవాఁడు
తనువు గుడిగఁ జేసి తన్ను నిలిపి
లోకబుద్ధి విడిచి లోచూపుఁ జూడరా వి...



విగ్రహారాధనబుద్ధి నశించినచో శరీరమునే ఆలయముగా జేసి యందు తనయాత్మనే నిలిపి లోకసాధారణదృష్టితో దైవ మని వీక్షించినను ముక్తి కలుగును.

క. నాదము బ్రహ్మం బనుచును
వేదములను జదువవచ్చు విని కనినంతన్
నాదంబు లేనిబయలున
నాదాంతమె పూర్ణపదవి నయముగ వేమా!

నాదమె (శబ్దమె) బ్రహ్మంబని వేదములందు చదివి తెలిసికొనవచ్చును. ఇట్లు సర్వదా మననము చేయుచున్నచో నాదాంతమగు పూర్ణపదవియే బ్రహ్మమని సాక్షాత్కరించును.

క. నాదము ముక్తికిఁ దెరువగుఁ
బాదును దెలియంగ నగును బరిపక్వముతో
భేదంబు మాని మదిలో
వేదికపైఁ జేరి వినుము వినువక వేమా! 1574

నాదమే ముక్తికి సాధనముగావున నాదతత్త్వమును పరిపక్వ మగు బుద్ధితో నెఱుంగుటకు భేదబుద్ధులు పోనాడిహృదయ మను వేదికపైఁ జేరి ప్రయత్నము చేయుము.

క. నిండినమతమున వెదకిన
నుండెడి నేవస్తువైన నుపము దలిర్పన్
దండిగ నిండినపిమ్మట
ఖండించిన వ్యక్తిగాదు గదరా వేమా! 1575

మతస్థాపకులగు నాచార్యపురుషులచే నెలకొల్పఁబడినమత

ములో బాగుగాఁ బ్రవేశముకలిగించుకొని యోచించినచో తరింపఁదగినమార్గములు పెక్కులుకలవు. మతరహస్యములు బాగుగానవగతము చేసికొనినవాఁడు మత ధర్మములను ఆక్షేపింపఁజాలఁడు.

ఆ. నిన్నుఁ జూచెనేనిఁ దన్నుఁ దా మఱచును
దన్నుఁ జూచెనేని నిన్ను మఱచు
నేవిధమున మనుజుఁ డెఱుఁగు నిన్నును దన్ను, వి.

బ్రహ్మమునుఁ జూచినచో తనను దా మఱచును. (ఇచ్చట నిన్ను తన్ను శబ్దములు ఆత్మ దేహముల కన్వయించును) తన్నుఁ జూచినచో బ్రహ్మమును మఱచును. ఇట్టిస్థితిలో నుభయము నెఱుఁగఁగల్గుట కష్టతరము.

తే. నిమిషమైనను మది నిల్పి నిర్మలముగ
లింగజీవేశులను గాంచి భంగపడక
పూజ మదియందుఁ జేరుట పూర్ణపదవి
పరముగోరిన నిది చేయ బాగు వేమ! 1577

ఎంతకార్య బహుళముగలవాఁడైనను నిముసమేని తీఱిక కలుగఁ జేసికొని నిర్మలమగుబుద్ధితో లింగమును జీవేశులను గూర్చి నిశ్చలబుద్ధితోఁ గాంచి పూజించుచో పూర్ణపదవి సిద్ధించును. మోక్షార్థికిది యావశ్యకము.

ఆ. నియతవృత్తి మీఱి నిటలదుర్గముఁ జేరి
భయము లేకయుండు బ్రహ్మవేత్త
జయముగల్గ ముక్తిఁ జవిచూచుచుండురా, వి.



సంసారమునకు నియతములగు పనిపాటలు వదలి దృచ్ఛక్తి నిటలమునఁ జేర్చి నిర్భయముగా వర్తించువాఁడె బ్రహ్మవేత్త. అతఁడె ముక్తిని జవిచూడగల ధన్యుఁడు.

క. నిరతం బెడతెగకుండఁగ
పరిపూర్ణ బ్రహ్మ మాత్మపదమున నుండఁగ
నిరవద్యమైనపవిని
జరియించును జగ మెఱుంగ సత్యము వేమా!

ఎల్లపుడు నెడతెగకుండ పరిపూర్ణమగు బ్రహ్మము హృదయము నందుండఁగా అవివేకులగు మానవులు అడవులఁ బట్టియందే మోక్షమని వెదకుచుందురుగదా?

ఆ. నిహాలిపుట్టుపులకు నెల విహ మందురు
నిహారలోకమందు గుతుక మేది?
దహరమందుఁ జూడఁ దగులును దత్త్వంబు, వి.

జననమరణములకు ఇహమే కారణమందురు గాని నిహార లోకమందు గుతుకము కానరాదు. దహరమునందుఁ జూచినచో తత్త్వంబు తగులును.

తే. నిర్గుణాంశము మది నెన్ని నేర్పు మీఱ
స్వర్గ మని యెంచుచుండిన శాశ్వతంబు
భర్గుఁడై తాను బాముల పాపునయ్య
దుర్గుణభ్రమలను బాయు దొసఁగు వేమ! 1581

నిర్గుణమగు నంశమును నేర్పుతో తా ననారతము ధ్యానించి తద్ధ్యానస్తిమితుఁడై భావించుచో భర్గత్వము నొంది పాపములఁ బాపఁగలుగును. మనోభ్రమలు తొలఁగును.

తే. నిష్ఠయందును వృథమైనదృష్టి బూని
కష్టయోగంబులను మించి కాంక్షదీఱ
వ్యష్టిపరిపూర్ణ నుందుట వదలకున్న
స్పష్ట మగు డౌను సంతోషపదణి వేమ! 1582

నిష్ఠలు నియమములయందు బుద్ధిని నిలుకడగాఁ గష్టములగు యోగములను వదలివేసి జ్ఞానపరిపూర్ణుఁ డగుటకుఁ బ్రయత్నముచేసినచో బ్రహ్మానందము చేకూరును.

క. నీరనుఁ బుట్టిన దుప్పగు
క్షారము నీరాయె నీరు క్షారము నొకటే
యీరీతి శివుని జీవుని
వారక మది దెలుఁగ నగును వసుధను వేమా!

నీటివలనఁ బుట్టినది క్షారము. క్షారము నీటిస్వరూపము. ఇదే విధమున జీవునకు ఈశ్వరునకుఁ గల జన్యజనక తాదాత్మ్యము నూహింపవలయును.

క. నీ వాడిన నే నాడుదు
నీవుండిన నేను నుందు నిర్విణ్ణుఁడనై
నీవు దలంచిన దలఁపుదు
నీవు నగిన నేను నగుదు నిజముగ వేమా! 1584

పరమాత్మా! నేను స్వతంత్రుఁడను గాను. నీవు పలికిన నేను పలుకుచున్నాను. నీవున్న నే నుందును. నీవు తలంచిన నేను తలంచుచున్నాను. నీవు నవ్విన నేను నవ్వుచున్నాడను. నేను చేయునవి నీలీలలే.



తే. నీవు నెఱిఁగను లోకంబు నీకుఁ దోఁచు
నీవు మఱిగినతోడ్తోడ నెందుఁ బోయె
ననెడి యెఱుకను విడనాడఁ డయ్యయోగి
దానఁ బరమార్థ మెఱుఁగంగ నౌను వేమ!

"నీవు కనుగొనుచో నీకు లోకము కానిపించును. నీవు పరమాత్మదర్శనమునుండి లోకము గాంచవేని నీకు లోకమే లేదు" యోగియంశమును గమనించి పరమార్థమును గ్రహించుచున్నాఁడు.

క. నేఁ జచ్చినతోడనె మఱి
దాఁ జచ్చును నపుడె పంచతత్త్వము లొకటౌ
రాజత్స్వరూపమందును
దా జితుఁడై నిలచియుండు తథ్యము వేమా!

అహంకారము నశించినంతనే తానను బుద్ధియుఁ బోవును. పంచతత్త్వము లవు డేకమై పరమాత్మస్వరూపము మాత్రము నిలచియుండును.

ఆ. పంచభూతములను బరగియుండినవాఁడు
పంచలింగములను బ్రబల్గియుండు
పంచబీజమునను భావింపఁ దానయా, వి.....

పంచభూతములును పంచేంద్రియములును పంచబీజములును పరేశ్వరుని రూపులు.

ఆ. పంచభూతములను బరగ నింద్రియముల
సంచరించినపుడు జగము కలుగు

సంచరింపకున్న జగమెట్టు కలుగురా? వి... 1588

పంచభూతములతోడి సంయోగమున నింద్రియములు చరించెనేని జగము లుత్పత్తియగును. లేకున్న జగము లుత్పత్తియగుటకవకాశమే లేదనవచ్చును.

ఆ. పటిమమీఱ మనసుఁ బాటించి చూడక
కిటుకుఁ దెలియరాదు కెరలుటకును
జటిలవేష మేల జైత్రుఁడై సాధింప, వి....1589

మనస్సును పటిమతో నిల్పకున్న అందలికిటుకును తెలిసికొనఁజాలవు. జటిలవేషమును వేయఁ బ్రయోజనము లేదు. మోక్షము సాధించుటకు జటివేషము అవసరములేదు.

క. పంతము విడకయె నెమ్మది
చింతనమున గుర్తుఁ దెలసి చిన్మయమందన్
వింత లడంగును మానస
మింతింతని చెప్పరాని దెలుఁగును వేమా!

పట్టినపట్టు పదలక ధ్యానించుచుండిన చిత్స్వరూపము నొందఁగలఁడు. అప్పుడు భ్రాంతులు తొలంగును. ఇంతయనరాని బ్రహ్మముగూడ గోచరించును.

ఆ. పసిఁడితొడవులు వేఱు బంగార మొక్కటి
పలుఘటములు వేఱు ప్రాణ మొకటి
యరయ దిండ్లు వేఱు టాకలి యొక్కటి, వి....

బంగార మొకటియయ్యు పనులమెఱుఁగుచే ననేకవిధములుగానవచ్చునటుల ఆహారములు వేఱువేఱయ్యు నాకలి



యొకటియే యగునట్లు పరమాత్మఁ డొక్కఁడై మాయావికారములచే వేఱుగాఁ గనిపించుచున్నాఁడు.

ఆ. పరగ బొందులు పది ప్రాణంబ దొక్కటి
పుష్పజాతులు పది పూజ యొకటి
పసులవన్నెలు పది పా లన్ని యొక్కటి, వి....

దేహములు పెక్కులుగా నున్నను వానియంతరంగమున గల ప్రాణ మొకటియే. పూవులు వేఱువేఱుగా నున్నను పూజయొకటియే. పశువులవన్నెలు వేఱువేఱుగా నున్నను పాలొకటియే.

ఆ. పరధనంబునకును బొరుగాఁ జేఁ జాచి
సత్య మింత లేనిచట్టుద్విజులు
ద్విజుల మనుచు నెంత్రు తేజ మింతయు లేక, వి.

పరధనముల కాశించి దుర్దానములు గొనుచున్న యవివేకులగు బ్రాహ్మణులు తామే బ్రాహ్మణులమని నిక్కుచుందురు. ఇట్టి నీచవృత్తిఁ గలవారికడ బ్రహ్మతేజ మెటులుండును.

ఆ. పరగ బొమ్మగుడ్డు పరికించి చూచిన
గులములన్ని యందె కూడి పుట్టె
నంద ఱొకటఁ గలియ నన్నదమ్ములె కదా! వి....

తొలుదొలుత బ్రహ్మాండ మను గ్రుడ్డునుండి జాతులన్నియుఁ గలసి జన్మించెను. కానఁ బ్రజలంద ఱన్నదమ్ములు. జాతిభేదము లుంతగవు.

క. పరులను నీ వని తలఁచెడి
పరబుద్ధిని మీర కీవు పదరక యున్నన్
స్థిరపేత్త్రై తందు దోఁచెడు
పరిపూర్ణమె బట్టబయలు బాగుగ వేమా! 1595

ఇతరులు తాను అనెడి భేదబుద్ధిని వదలిన సత్త్వము నవలంబించెదవేని బ్రహ్మస్వరూపము పరిపూర్ణముగా బట్టబయలగును. అభేదస్థితియే ముక్తిదాయకము.

ఆ. పలుగురాళ్లఁ దెచ్చి పరగ గుడులు గట్టి
చెలఁగి శిలలసేవఁ జేయ నేల?
శిలలసేవఁ జేయ ఫలమేమి గల్గురా? వి... 1596

రాళ్లతో గుళ్లగోపురములు గట్టి యర్చన చేసినంతమాత్రానఁ గొంచెమైనను ఫలము గలుగఁజాలదు. శిలలసేవ జేయుట వలన మోక్షమురాదు గాన విగ్రహారాధనము అనవసరము.

ఆ. పాలు ద్రాగినపుడు ప్రాణంబు రక్షించుఁ
బాలు ద్రాగకున్న బడలి కౌను
పాలవలన ముక్తి ఫలమందఁగా లేక
చాల రోగపడును జగతి వేమ! 1597

పాలుద్రావినచో అలసియున్న ప్రాణములు కుదుటపడును. పాలు ద్రావకున్నచో బడలిక గలుగును. పాలుద్రావినచో రోగములనుండి విముక్తి గావచ్చునని తెలియక మానవులు రుజాపీడితు లగుచున్నారు.



ఆ. పాలు పెరుఁగు వెన్న పరగు నన్నముఁ దిని
స్త్రీల గననివాఁడు శీలవంతుఁ
డొక్కఁడైనవాఁడె యుత్తమశివుఁడయా, వి.

పాలు పెరుఁగు వెన్న లోనగు క్రొవ్వుగలిగించు బలమైన యాహారములను భుజించుచు స్త్రీలకొఱకుఁ బ్రయత్నింపని వాఁడె బుద్ధిమంతుఁడు. వాఁడె యీశ్వరరూపుఁడు (ఉపవాసము లుండువారు విరాగులలో విశేషములేదు).

ఆ. పిండ మండమందు బెనఁగుచునున్నట్టి
తండ్రి బిందునాదు దనరఁ గూడి
యండమై నిలిచిన యపుడు గర్భ మటందు
రవనిజనము లప్పు డరయ వేమ! 1599

పిండము గర్భకోశమునఁ జేరి బిందునాదువుల నొంది యండరూపమున నిలిచె నేని గర్భ మని పలుకుదురు.

ఆ. అండ పిండము నడిబిందు వాత్మజ్యోతి
యర్కుజ్యోతి సరసిజాండమందు
నాదబిందువులకు నడుమ నద్భుతజ్యోతి, వి...

పిండాండములనడుమబిందువున సరసిజాండమందు సూర్యుని జ్యోతియును నాదబిందువులనడుమ పరమాత్మయును అద్భుత కాంతితో వెలుఁగుచుండును.

ఆ. పిడుగుపడినతావు దడదడగా నుండు
పిడుగుపడినఁ గొంప సడికిఁ గూలు
పిడుగుపడినవానిప్రేత మేమనవచ్చు? వి. 1601

పిడుగుపడిన తావు గడగడ వడఁకుచుండును. పిడుగు మానవునిపై బడెనేని వానిసంగతి నింకఁ జెప్పవలసిన దేమి?

ఆ. పిన్నవాండ్ర స్వేచ్ఛ మన్ననఁ జెఱచును
ఆఁడువాండ్ర స్వేచ్ఛ గో డొనర్చు
పురుషవరుని స్వేచ్ఛ భూతిని గూర్చురా, వి...

పిన్నవాండ్రకు స్వేచ్ఛ యిచ్చినచో అడఁకువ తొలఁగి పోవును. స్త్రీలకు స్వేచ్ఛ యిచ్చినచోఁ గీడు తెచ్చును. పురుషునికి స్వేచ్ఛ యిచ్చినచో సంపదను గూర్చును.

క. సిరిగొనుహంసను మదిలో
బిరబిర గుంభించి పట్టి బిత్తరపోకన్
స్థిరభావసిద్ధిఁ గైకొని
పరిపూర్ణసమాగమమును బడయును వేమా!

హంసకళను మనస్సులో కుదుటపఱచి భయముఁ జెందక స్థిరత్వమును గైకొని పరిపూర్ణబ్రహ్మసమాగమము నొందుము.

క. పిండము పృథివిని బడఁగా
నండనె తగుమంత్రసాని యది దెల్పును దా
మెండుగ మగవాఁ డంచును
దండిగ నీజనము లెఱుఁగ ధరలో వేమా! 1604

మాతృగర్భమునుండి పిండము భూమిమీఁదఁ బడఁగానే మంత్రసాని యాపిండమునుజూచి మగవాఁడో ఆఁడుబిడ్డయో తెలుపుచున్నది. ఆయంశమును లోకులు గ్రహించుచున్నారు.



ఆ. పిడుగును నఱచేత బిగఁబట్టి యందులో
గల్మషంబు లెల్లఁ గడకు తీసి
కడమకరముచేతఁ గలిజనములఁ బ్రోచు
కర్మకర్త నెఱుఁగఁ గదర వేమ! 1605

దైవము అమేయమహిమోపేతుఁడు. పిడుగునైనను అరచేతఁ బట్టుకొని పాపములఁ బోఁద్రోసి యాప్తుల నాశ్రితులను రక్షించును. ఆతఁడే సమస్తకర్మసాక్షి.

క. పిలిచినఁ బలుకును దేవుఁడు
పలుకుననే నిండియున్న ప్రభువై యుండున్
వెలుఁగున వెలుఁగై మించెడు
వెలుఁగే పరమాత్మ బయలువిడ కది వేమా!

పరమాత్ముఁడు మానవునిహృదయమున నున్నాడు. పలుకులో నిమిడియున్నను పిలిచిన పలుకఁడు. హృదయముననున్న జ్ఞానజ్యోతియే పరమాత్ముఁడను సంశయమును మాత్రము మఱచిపోకుము.

ఆ. పిసినివానియింట పీనుఁగు వెడలినఁ
గట్టెకోలలకును గాసు లిచ్చి
వెచ్చమాయె నంచు వెక్కివెక్కి యేడ్చు, వి.

పీనాసివానియింటిలోఁ బీనుఁగువెళ్లినచో దహనాదికృత్యముల కెటులో కాసో రూకయో వెచ్చించి పిదప ద్రవ్యమంతయు వ్రయమాయెనని వెక్కివెక్కి యేడ్వసాగును.

ఆ. పుక్కిటిపతివానిఁ బూజింప దోషంబు
యురముసుదతివాని యూహ లెస్స

నెత్తియువిడవాని బత్తియే పర మిచ్చు, వి...

బ్రహ్మను పూజించుట దోషమేగాని ఫలములేదు. విష్ణుమూర్తిని పూజించుట కొంతవఱకు మంచిది. శివుని పూజించుటయే మిగుల నుత్తమము. శివునిపైఁ గలభక్తియే భక్తి.

ఆ. పుట్టలోను తేనె పుట్టినరీతిని
గట్టుమీఁద మణియుఁ బుట్టునట్లు
కట్టెలోన నగ్ని పుట్టినవిధమునఁ
బుట్టి మెట్టవలెను భువిని వేమ! 1609

పుట్టలోఁ దేనె పుట్టినట్లు కొండరాళ్లలో మణులు పుట్టినట్లు, కట్టెలలో అగ్నిహోత్రము జనించినట్లు మానవుఁడు ఘనత నే పొందవలయును. అట్టివానిపుట్టువే పుట్టువు.

ఆ. పుట్టి చచ్చు నరుఁడు పూర్వమే మెఱుఁగక
బట్టబయలనుండి భ్రమసి యైనఁ
దెలివి విడిచి భూమి దిరుగంగ నేటికి? వి...1610

మానవుఁడు జననమరణములను గూర్చి చూచి ప్రపంచమంతయు భ్రాంతిమూలకమని యెఱింగియు తెలివిమాని విషయలోలుఁడై ప్రపంచమంతయుఁ దిరుగుచున్నాఁడు.

ఆ. పుట్టినదియు మొదలు పురుషుఁ డేర్పడుదాఁక
మంత్రసానిగూడు మరగి యరత
పోసు రావె యనుచు పుత్త్రుఁడు నెలవిచ్చి, వి...

జన్మించి పురుషుఁడేర్పడునంతకును మంత్రసానిపైఁ గౌరవమునుంచి పిమ్మట పంపివేతురు. అనఁగా: కార్యముండినంతవఱకును లోకులు ఆదరింతురు. సూతికాదూతికలు నావికులు కార్యాంతమున విసర్జనీయులని లోకోక్తి గలదు.



ఆ. పుట్టినపుడె బొడ్డు పట్టి కోయుచు నుండ
నప్పుడు గురుముద్ర లానతిపడె
ముద్ర లేనివారు ముజ్జగంబుల లేరు, వి...1612

శిశువు పుట్టినపుడే బొడ్డు కోయుచు నుండినప్పుడు గురుముద్రలు పడినవి కావున నీమూఁడు లోకములందు గురుముద్రలును లేనివారలే లేరు.

తే. పుట్టినప్పుడు తెచ్చునే పుడమి విడచి
గిట్టునప్పుడు గొనునొకో యట్టిధనము
నడుమ నీయాజ్ఞ వచ్చెఁ ద్రినయన యనుచు
నర్థికిని నీయఁ డేమందు వ్యర్థు వేమ! 1613

మానవుఁడు పుట్టునపుడు వెంట ధనముగొని రాలేదు. చనిపోవునపుడు వెంటఁ గొనిపోవఁడు కాని నడుమ కర్చుపెట్టవలసి వచ్చినపుడే యీశ్వరా! యెట్లురా యని లోభి పరితపించుచుండును.

ఆ. పుట్టువార లెవరు పుట్టకుండు రెవరు
పుట్టి గిట్టనట్టిపురుషు లెవరు
పుట్టి పుట్టనట్టు బోధించి చూడరా, వి... 1614

కర్మానుభవము గలవారందఱు జననమరణములకు లోనగుచున్నారు. పుట్టినవారిలోఁ జావనివారు లేరు. కావున పుట్టువుల వలని వెతలేనిమార్గము జ్ఞాని యోజింపవలయును.

ఆ. పుట్టుశక్తులైదు పుడమి నటింపంగ
విప్రులెల్ల వేదవేత్త లండ్రు
శక్తిపుత్రుకులము జగతి నెఱుంగరో, వి...1615

శక్తిపంచకము పుడమి నుండఁగా విప్రులందఱును వేదవేత్త లగుచుందురే కాని శక్తిపుత్రునికులము నెఱుంగరు.

క. పుడమిని గలనడజీవులు
బడబాగ్నియు దీప్తులనును భానుని యెడలన్
జడమును గూడినయప్పుడె
వెడలని ప్రళయంబులకును విధమిది వేమా!

ప్రాణులయందలి ప్రాణతేజము బడబాగ్నియు సూర్యునియందలి వేడిజలములందలి జడము ఇవియన్నియు నేకమగునపుడు జవదాఁటరాని ప్రళయము కలుగుచుండును. ఇదియె ప్రళయ విధము.

ఆ. పుడమిలోన నరులు పుత్త్రులఁ గనఁగోరి
యసలుచుందు రనుపమాశ చేతఁ
గొడుకు కలిగినంతఁ గుల ముద్ధరించునా? వి...

ప్రపంచమునందు మనుజులు పుత్త్రులఁ బడయఁగోరి బడలుచుందురే కాని కొడుకు పుట్టినమాత్రాన కులము నుద్ధరించునా? ఉద్ధరింపఁడు. ఇది పేరాస.

ఆ. పుత్త్రసంతు లేక పుత్త్రుండు జగతిలోఁ
బుణ్యలోక మెట్లు పొందఁగలఁడు?
పుత్త్రహీనునకును బుణ్యంబు గల దెట్లు? వి...



పుత్త్రసంతానములేని మానవుఁడు పుణ్యలోకము నెటులనేని పొందఁజాలఁడు. పుత్త్రహీనునకుఁ బుణ్యములు సైతము లభింపవు.

ఆ. పురుషచిహ్నఁ జూడ బుట్టె స్త్రీలకు భ్రమ
పురుషుఁ డేహ్యమనుచుఁ బుట్టరాదె
శివుఁడు పురుషుఁడైన స్త్రీలకు జిక్కునా? వి...

పురుషేంద్రియములు గాంచఁగనే స్త్రీలకు వలపుజనించుచున్నదిగాని పురుషుఁ డసహ్యరూపుఁడని మాత్రము విరాగము కలుగుటలేదు. పురుషుఁడు ఆత్మసాక్షాత్కారముగలవాఁడైనచో నెన్నఁటికిని స్త్రీలకుఁ జిక్కఁడు.

క. పురములు నాఱేఁటిపై నొక
పురమందున మూలశక్తి పూనిక గనుమా
యురమున గురి గనినంతట
పరిపూర్ణపుబ్రహ్మరూపు బయలగు వేమా! 1620

షడాధార చక్రములకుఁ బయినున్న సహస్రారమునన్న మూలశక్తిని లక్ష్యదృష్టితోఁ దిలకించుటకు అభ్యసించినచో పరిపూర్ణమగు బ్రహ్మస్వరూపము గోచరించి తీరును.

ఆ. పురహరునకు నేతపురువు తా నేసిన
స్థిరము కలుగు జ్ఞానజీవమయ్యె
నేత కేమి వచ్చె నిజభక్తి పోతువు? వి...1621

(కాళహస్తిలో) ఈశ్వరునకు వస్త్రము నేయుటచేత సాలెపురుగునకుఁ గూడ చక్కనిజ్ఞానము కలిగెను. వస్త్రమున కేమి గాని భువిలో పురుషునకు భక్తియే ప్రధానవిషయము.

ఆ. పునుఁగుఁబిల్లి యేల పుట్టించువాసన
ల్గానిమహిమ లేమి ధరణిలోన
బ్రహ్మచేతలెల్ల బాడైనచేతలు, వి.... 1622

పునుఁగుపిల్లి సామాన్యజంతువు. దానియందు గొప్పతనమను నది లేకపోయినను మిగుల సువాసనగల పునుఁగు నిచ్చుచున్నది. ఆనీచజంతువున కంత మహత్త్వము నొసంగుటబట్టిచూడ బ్రహ్మ చేష్టలు పనికిమాలినవని తోఁచుచున్నది.

ఆ. పురుషుభాగ్యముననె పుణ్యవతిదొరకుఁ
బుణ్యవతికినట్టె పుట్టు సుఖము
నిరువు రనుభవింప హితులును బుత్త్రులు
నష్టభోగములును నమరు వేమ! 1623

పురుషునిపుణ్యమువలననే అనుకూలవతియగుభార్య లభించి దానివలన భర్తకు సౌఖ్యములు లభించుచున్నవి. ఈయిరువురు సంసారసుఖములనుభవించుటవలన హితులు పుత్త్రులు మొదలగు అష్టైశ్వర్యములు లభించుచున్నవి.

ఆ. పూజ సేయఁ జేయఁ బూజారి తానాయె
పూజ్యవస్తు వెన్న భువిని దానె
ఏడఁ బూజ సేయ నెల్లదిక్కులు తానె
తాను నేను నేను దానె వేమ! 1624

కులీనుఁడైనను పూజచేయచేయ పూజారియగును. పూజ్య వస్తువే తానుపూజారియై పూజింపవలసినది దేనిని? సర్వత్ర



తానే బ్రహ్మస్వరూపుఁడైయుండ ఇతరపూజావిధులవలన ఫల మేమి?

తే. పూని సుఖదుఃఖముల మీఱి లోనఁ జేరి
తాను తానగుతత్త్వంబుఁ దాఁకి తాఁకి
పోరి పరిపూర్తి నొందుట పుణ్యమయ్యె
ఇట్లు కాకున్న కడతేరు టెట్లు వేమ! 1625

సుఖదుఃఖములను లక్ష్యము సేయక తాను తానగుతత్త్వ మును గమనించి ధ్యానించి పూర్ణస్వరూపము నొందుటయే మేటిపుణ్య మగును.

క. పూర్ణమగుయుక్తి యోగికిఁ
బూర్ణము సాధనము సపరిపూర్ణము సంసా
రార్ణవతారకగోచర
పూర్ణము పరిపూర్తిఁ జెందఁ బూనుము వేమా!

యోగానుకూలములగు యుక్తులను గ్రహించుట యోగికిఁ బ్రధానసాధనము. పిదప సంసారసాగరమును దరించుటకు అను కూలమగు పరిపూర్ణత్వమును సంపాదించుటకుఁ బ్రయత్నము చేయనగును.

ఆ. పెక్కుచదువు లేలఁ జిక్కువాదము లేల
నొక్కమనసుతోడ నూరకున్న
సర్వసిద్ధుఁ డగును సర్వంబుఁ దానగు, వి...

పెక్కుచదువులు పెక్కువాదములకంటెను ఒక్కమనసు

తోడ వివేచన చేసితేని సర్వమయస్వరూపుఁడగు దైవమే తా నగును.

ఆ. పెట్టువార లెవరు పెట్టకుం డ్రెవ్వరు
పెట్టి పెట్టనట్టి దిట్ట లెవరు
పట్టుఁ దప్పకుండ భావించి చూడరా, వి...

ఒకఁడు పెట్టువాఁడు.ఒకఁడు పెట్టనివాఁడు లేఁడు. పెట్టియుఁ బెట్టనియటుల నటించువాఁడును లేఁడు. పెట్టినను పెట్టకున్నను జీవులకు ఈశ్వరుఁడే కర్త గాన నాతని ధ్యానింపవలయును.

ఆ. పెట్టి పోయువాఁడు కట్టిడిగలదాత
తిట్టి పోయువాఁడు తుట్టెపురువు
రట్టు సేయువాఁడు రాణింపునకు రాఁడు, వి...

బీదసాదలకు మిగుల సంతోషముతోఁ బెట్టిపోయువాఁడు మంచిదాత. పెట్టియుఁ దిట్టువాఁడు తుట్టెపురుగువంటివాఁడు. తాను పెట్టితినని రద్దిచేయువాఁ డెన్నఁటికి ఎన్నికలోనికి రాఁజాలఁడనుట సత్యము.

ఆ. పెరటఁ జెట్టు బెట్టి పరికింపకుండిన
వెలుగుదాఁటి తీగ వెడలఁబాఱు
నాఁడు దానిగుణము నటువలె నుండురా, వి...

పెరటిలోఁ జెట్టును బెట్టి దాని మొగము చూడకున్నచో దానితీగకంచెనుగూడ దాఁటి బజారునఁబడును. అటులె యాఁడుదానిని హద్దులో నుంచకున్నచో సంసారము చెడును.



ఆ. పొట్టివాఁడు కీడు పొడలపురుగు కీడు
వట్టియాశ కీడు వరడు కీడు
పొట్టిచేయి కాలు పొసఁగుట కీడురా, వి...

పొట్టివానివలన నపాయముకలుగును. పొడలపురుగు నపాయకరమే. వృథాకాంక్షయు వరడుగూడ నపాయకరములు. ఇంతియే సహజముగానుండక పొట్టిగానున్న కాలుచేతులుగూడ నపాయకరములే.

క. పొందుము హృది గుఱిదగు నా
నందము సదసద్వివేకనాదము పైగా
నిందించు భ్రమల నెల్లను
సందీయనబయలు చేరు సాక్షిగ వేమా! 1632

మంచిచెడుగు అను వివేకము ఓంకారనాదమువంటిది.దానిని నాలకించినచో నానందము కలుగును. ఆయానందానుభవము నొందుచు భ్రమలను బోనాడి తిలకింతువేని బ్రహ్మమును జేరఁగలుగుదువు.

ఆ. ప్రణవమంత్రమహిమ భావింప లింగంబె
మూఁడుమూర్తులందు మొనసి యుండు
మాన్యు లెఱిఁగి కొలువ మనుజుల శక్యమా?,వి.

ఓంకారమహిమమే పరికించినచో త్రిమూర్త్యాత్మకమై తేజరిల్లును. కావున నట్టిదానిని సేవింపుము. ఇది యెఱింగి సేవించుట సామాన్యజనుల కసాధ్యము.

క. ప్రత్యక్షము రవిచంద్రులు
ప్రత్యక్షము వాయు వహ్ని పానీయంబుల్
ప్రత్యక్షము భూదేవత
ప్రత్యక్షము విశ్వ మెల్లఁ బరగెడి వేమా! 1634

శివుని యష్టమూర్తులలో నేడుమూర్తులు మాత్రము ప్రత్యక్షములుగాఁ గనిపించుచున్నవి. ఎనిమిదవమూర్తిని గుర్తించుటకుఁ బ్రయత్నముచేయుము.

ఆ. ప్రణవ మెఱుఁగనతఁడు భక్తుండు తాఁ గాఁడు
జ్యోతి జూడ నతఁడు జోగి గాఁడు
నిత్య మెఱుఁగ నతఁడు నిర్వాణి కాఁడయా, వి.

ఓంకారము నెఱుఁగనివాఁడు భక్తుఁడుగాఁడు. ఆత్మజ్యోతి నెఱుంగనివాఁడు యోగికాఁడు. నిత్యమును గుర్తింపనేరనివాఁడును నిర్వాణి కాఁజాలఁడు.

క. ప్రత్యక్ష మగును శివ యని
నిత్యము మదిలోనఁ దలఁచి నిలచినయపుడే
సత్యముగ జ్యోతి కనఁబడు
నిత్యములోఁ దృప్తిఁ జెంది నెరయుము వేమా!

సాక్షాత్కరింపుము శివా యని ప్రతిదినమును మనస్సున ధ్యానించుచుండినచో నిజముగా జ్యోతి (ఆత్మరూపము) ప్రత్యక్షమగును: తద్దర్శనము నొంది సంతుష్టుఁడవగుము.

క. ప్రథమమున మాతృదేవత
పదపడి జనకుం డటుగాను బరికింప నికన్



గుదిరినపదములగురుఁడే
తుదిదైవము పెరలు వేరు తోరము వేమా!

తొలుత తల్లిదండ్రులును పిమ్మట గురువును దైవరూపులగుదురు. ఇంతకంటెను వేఱు లోకమందు లేరు.

ఆ. ప్రభుల కిచ్చునట్లు రహిఁ పేదలకు నీరు
వనిత కిచ్చునట్లు వటుల కీరు
సురకు నిచ్చునట్లు సుధకును నీయరు, వి...

అవివేకులగు మానవులు రాజులకు దండుగులుకట్టుదురు గాని పేదసాదల కీయరు. జారులు స్త్రీలకు రొక్కము కుమ్మరింతురు గాని వటువులకుఁ గొంచెమేని యీయరు. త్రాగుబోతులు మద్యమునకు వెచ్చింతురుగాని పాలుకొనరు. ఇది లోకాచారముగా నున్నది.

ఆ. ప్రవరయున్న వేరు పరిధవిల్లిన నేమి
దానియందు నేవు తగ్గె మీకు
నిజము దెలియ మీరు నిత్యము పూజ్యులై వి.
యుండఁ గంద్రు జగతి నొసర వేమ! 1639

బ్రాహ్మణోత్తములారా, మీకుఁ బ్రవరగలదు. మీరు ఋషిసంప్రదాయములోనివారె. కాని మీకులగౌరవములయందు మీకు విశ్వాసములేకున్నది. నిజము యోజించినచో జ్ఞానానుభవముతో వర్తింతురేని మీరు నిత్యమును పూజ్యులె.

ఆ. ప్రాకటముగ నింత లోకమందున గుంటె
పల్లెము త్తఁ డెన్న పరమగుణుఁడు

అన్నదానమునను హరిపూజచేతను
హరునిలోనఁ గలిమి కతఁడె వేమ! 1640

ప్రపంచమునందుఁగల దాతలందఱికంటె గుంటుపల్లి ముత్తనామాత్యుఁడే యుత్తముఁడు. అన్నదానమునందు శివపూజయందు ఈశ్వరసాక్షాత్కారమునందు అంతవాఁడు లేఁడు.

ఆ. ప్రాణబంధములను బంటకా వెఱుఁగునా
యెఱుకగలుగు జ్ఞాని యెఱుఁగుఁ గాక
ముద్రలందు లేదు మూలమందే కాక, వి...

ప్రాణబంధములను పంటకాపు ఎఱుంగఁజాలఁడు. గాని యోగి యెఱుఁగఁగలఁడు. ముద్రలందు ముక్తిలేదు. మూలమునందే ముక్తి గలదు.

ఆ. ప్రాణమగును గాలి బ్రహ్మాండ మగు మేను
మిత్రచంద్రశిఖులు నేత్రచయము
మఱియు దేవుఁ డిఁకను మహిమీఁద నెవరయా? వి.

విశ్వమే విరాట్పురుషుఁడు. ఆవిరాట్పురుషునకు గాలియే ప్రాణము. బ్రహ్మాండమే దేహము. సూర్యచంద్రులే నేత్రద్వయము. ఇఁక నింతకుమించి ప్రత్యక్షదైవ మెందుఁగలఁడు?

ఆ. ప్రాణ మిలను లేక పరమందఁగా రాదు
ప్రాణముండఁగానె పరము కలదు
ప్రాణి పరము గను భావింప నేరరే, వి...

మనుజులు ప్రాణమున్న నే పరము నందఁజాలుదురు. లేకపోయిన చో పొందఁజాలరు. కావున ప్రాణి పరము గనుట యెటులో జ్ఞాను లెఱుంగనగును.



ఆ. ప్రాణరక్షణ కిల పరమశివునిమీఁద
ధ్యాన మమర లేమి దగిలి నరుఁడు
పుట్టు చచ్చుచుండు పుడమిలోపలఁ బుట్టు
చెదలుగానువాఁడు చెడును వేమ! 1644

ఆత్మోద్ధరణమునకుఁ దన్ను దా ప్రోత్సహించికొని ధ్యానింప యత్నింపనివాఁడు చెదలుపురుగువలె మాటిమాటికిఁ బుట్టుచు చచ్చుచునుండుగాని యెన్నఁటికిని గడతేరఁజాలరనుట సత్యము.

ఆ. ప్రాణిచేరునాఁడు పరగ దేహమునకు
సాని లేక యుండు నరయ నంట
ప్రాణి పోయినపుడు పనికిరా దీదేహ
మనుచుఁ బలుకుదు రిల జనులు వేమ! 1645

ప్రాణమున్నంతవఱకే దేహము ఎట్టినేగి నొందక బాగుగా నుండును. ప్రాణముపోయినపిమ్మట నీదేహము ఎందులకయినను బనికిరాదని లోకు లంద ఱెఱింగియున్నారు.

ఆ. పృథివివారి కెల్లఁ బెట్టును నొకగిన్నె
పొత్తు గుడిచి కులము పోలియఁ జేయ
తలను చేయి వెట్టి తగ నమ్మఁ జెప్పును
వారకాంత నమ్మవలదు వేమ! 1646

పడుపుచెలియగు భోగముదానివలనఁ గావలయు నన్నిచెడుగులు గలుగును. విటులందఱకు నొకపాత్రలోనె యన్నము

బెట్టి వారిపొత్తునఁ గుడిచి కులముల ముందఁ బోకార్చును. నెత్తిని చేయిబెట్టి నమ్మకములు పలుకుగాని మనస్సు మాత్ర మీయదు.

ఆ. ప్రొద్దు పొడుచుచోటుఁ బ్రొద్దునిలుచుచోటుఁ
ప్రొద్దుగ్రుంకుచోటుఁ బొసఁగఁ జూచి
ప్రొద్దెఱిఁగినవాఁడు పొలుపైనయోగిరా, వి

ఉదయాస్తమయములందలి యాథార్థ్యము నెఱింగి ప్రవర్తించువాఁడు ఉత్తముఁడగుయోగి.

ఆ. ప్రియము లేనివిందు పిండివంటల చేటు
భక్తి లేనిపూజ పత్రి చేటు
ఓజమాలు నాలఁదోలిమాఁడల చేటు, వి...1648

ప్రియముగాఁ బెట్టని విందువలన వస్తువ్యయముదక్క ఫలము లేదు. భక్తిలేని పూజ పత్రిపాడుచేయుటకె. పతిభక్తిలేని భార్య డబ్బు దండుగునకెగాని ఫలము లేదు.

ఆ. ప్రొద్దుపొడుచు టెఱిఁగి ప్రొద్దునడ యెఱింగి
ప్రొద్దుగ్రుంకునట్టిపోలి కెఱిఁగి
ప్రొద్దుదెలియునతఁడె పొలుపొంద బ్రహ్మంబు,వి.

సూర్యుఁ డుదయించుట నడచుట అస్తమించుట వీనికిఁ గ్ప కారణముల గ్రహించి వీనిని దన మానవజీవితములోఁ బోలులకొని భగవత్స్వరూపుఁడగు సూర్యుని తత్త్వము నెఱుంగువాఁడె బ్రహ్మము.



ఆ. ఫణితి దెలిసి మాటు పల్కుటే యుక్తము
గణన కెక్కునట్టి ఘనుఁడె యెవుడు
గుణము లేకయున్న గుదురునే యూహాలు, వి.

న్యాయవేత్తయగు నుత్తముఁడు విషయము గ్రహించెనేని సమయము నెఱింగి తెలియఁ బలుకుటయే యుక్తము. గుణశాలి కానివాఁడు సత్యము నెఱింగి తెలిపినను లోకులు పాటింపరు.

ఆ. ఫలక మెడమచేతఁ బట్టి ఖడ్గం బూన
బంటుతనము రాదు ప్రతిభ లేమి
వీథిలోను దిరుగ వెలఁది పురుషుఁ డౌనె, వి....

డాలుడవాలును బూనినమాత్రాన సహజపరాక్రమము లేనివానికి బంటుతనమురాదు. తెగించి వీథిలో దిరిగినంతమాత్రాన స్త్రీయెన్నంటికిని బురుషునితో సాటిగాదు.

ఆ. ఫలము లేనికార్యములు సేయ నొల్లరు
కలజనంబు లెల్ల నిల నిజంబు
ఫలము మంచిదైన బరమందు ముదమందు, వి.

ఎవరైనను నిష్ప్రయోజనముగా నేపని కైనను గాని నమ్మి తలపెట్టరు. ఆఫలము మంచిదైనచో ఇహము పరము చేకూరి సంతోషకారణ మగును.

ఆ. ఫాలనేత్రుఁడైన భావింప లేఁడయా
ఆలి మీఁదఁ బెట్టి యాదిమరవ
గోలయనుచు నమ్మకూడదు వెఱ్ఱియై, వి...

ఈశ్వరునంతటివాఁడైనను స్త్రీకిస్వాతంత్ర్యము నిచ్చినచో తద్వర్తనమును గుఱుతింపలేఁడు. స్త్రీ నెన్నఁటికి వెట్టిది యనినమ్మి వదలుట యపాయకరము.

ఆ. బంగి త్రాగి తిరిగి బకము చాడ్పున నుండ
సంగ్రహింపరాదు చంద్రకళలు
భ్రుంగు మదిని లోఁగి మిన్నంది యుండరా, వి.

బంగి త్రాగి కొంగవలె దొంగజపము చేసిన వానికి చంద్రకళలు లభ్యములు కావు. మనస్సును లోఁబఱిచికొని విజ్ఞానదృష్టితో నాకసముగాంచిననే గోచరించును.

ఆ. బట్ట త్రాళ్లతోను బంధించి గట్టఁగా
లింగ మెవరిసొమ్ము దొంగిలింప
నాత్మలోనిలింగ మటువలె యుండునే? వి...

జాఱిపోవునేమోయని లైంగ్యులు బట్టలతో త్రాళ్లతో లింగమును బంధించి కట్టుకొందురు. దానిని దొంగయేని దొంగలింపలేఁడు. కాని ఈశ్రమయేల? హృదయమున ఈశ్వరుఁడను లింగము లేదా? ఇంత పదిలముగ నదియున్నదా?

ఆ. బంగి త్రాగువాఁడు భావమునందఁడు
నింగి కెగయుకైపు నిల్వలేఁడు
లింగమమర బంగి లీలను చెందునా? వి....1656

బంగి త్రాగువాఁడు మత్తుచే నిలువలేక పడిపోవునేగాని యోగానుభవమునకు అక్కఱకు రాఁజాలఁడు. బ్రహ్మస్వరూపము భంగీమత్తున కెన్నఁటికి సాధ్యము కాదు.



క. బట్టబయలందు శ్వాసము
ముట్టుచు నెగరోఁజిపట్టి మూలమునందే
నెట్టుచు విడుచుచు నుండిన
గుట్టుపరబ్రహ్మమంచు గూడుము వేమా! 1657

రేచకపూరక కుంభకాదుల నియమములననుసరించి వాయువును బీల్చుచు విడచుచు లోన నిముడ్చుకొనుచు నుండు వానికి పరబ్రహ్మస్వరూపమునకుఁ గల గుట్టు తెలియును.

తే. బట్టబయలైన తత్త్వమే బ్రహ్మ మనఁగ
నిట్టనిలువున మదిఁజేర్చి సెగడవలెను
దట్టిగట్టిన జయమున్నె జెట్టివలెను
గుట్టులో గుట్టుపరమంబు గూడు వేమ! 1658

బ్రహ్మమన నేదియో రహస్యముకాదు. అది బహిరంగమయిన తత్త్వమే! హృదయము నిలిపిన బ్రహ్మమును దర్శింపవచ్చును. దట్టి గట్టి జెట్టివలెఁ దిరిగిన లాభములేదు. ఈగుట్టు నెఱింగిన పరమము బోధపడును.

క. బట్టబయలైనబ్రహ్మము
గుట్టును మది నెంచి లోన గుణము పడినచో
దిట్టముగ జగము గిట్టును
దిట్టరివై యెఱుక మఱచి తిరుగుము వేమా!

ప్రస్ఫుటమై బ్రహ్మమనుమాయను పరికించినచో జగత్తు అంతయును మిథ్య యని తెలియును. అపుడు నీవు నేర్పరివై

జ్ఞానానుభవమును వదలి యీశ్వర సాక్షాత్కారముచే నానందింపవచ్చును.

ఆ. పటువుగాను బుద్ధి పరికించి నొక్కుచు
కుటిలగుణములన్ని కూల ద్రొక్కి
పటుతరంబుగాను బలపడఁ జూడరా, వి...

బుద్ధిని ప్రస్ఫుటముగా నొక్కుచు కుటిలగుణములను పోనడంచి బ్రహ్మముఁ గనఁ బ్రయత్నము సేయుము.

ఆ. బండదానికేల బంగరుమొలత్రాడు
విధవరాలికేల వెండిగొలుసు
ముచ్చుముండకేల ముంజేతికడియాలు? వి...

మొండిబండదానికినుపకడియములు చాలును. బంగారుమొలత్రాడెందులకు? విధవకుఁ దులసిపేరులే కావలయునుగాని వెండిగొలుసులెందులకు? ముచ్చుదానికి దరిద్రవేషమే తగునుగాని ముంజేతికడియము లెందులకు? నిరుపయోగములు.

తే. బంధముక్తుల రెంటిని పదిలముగను
కోరరాకయ మదియందుఁ గోర్కె లడఁచి
చేయుపనులెల్ల బయటను జెనకి మించు
వలయునది కూడు నీకె యావలను వేమ! 1662

బంధమునుగాని ముక్తినిగాని అభిలషింపకయే నిష్కామమనస్సుతో కార్యములను చేయుచున్నచో బ్రహ్మత్వము నొందును. వాంఛితములు తమంతనే నెఱవేఱును.



ఆ. బంధుకోటిఁ బాసి బయలును దెలియక
సింధుపుత్రిమాయఁ జిక్కెఁ గాదె
శార్ఙ్గియంతవాఁడె జనులకు శక్యమా? వి...

విష్ణుమూర్తి యంతటి మహానుభావుఁడు అజ్ఞానియై భార్యయగు లక్ష్మిమాట లాలించి తనవారిని విడిచి యత్తవారిల్లగు సముద్రము చేరెను. తక్కినవారిసంగతి చెప్పవలసిన దేమున్నది?

ఆ. బన్నపడగ గుఱిని పట్టులో పట్టుగా
చిన్నబలముఁ జేర్చి చింతవిడిచి
యున్నవాఁడె ముక్తి గన్నవాఁడగు సుమ్మి, వి...

భంగమునొందక పట్టినపట్టు వీడక సూక్ష్మశరీరిని గుఱితించి నిశ్చింతతో నుండినవాఁడే ముక్తుఁ డనఁదగును.

క. బయలందె పుట్టె సర్వము
బయలందే లీనమగును బ్రహ్మాండంబుల్
బయలని మదిలోఁ దెలిసిన
బయలందే ముక్తి బట్టబయలగు వేమా! 1665

సమస్తమును బయలునందున జనించును. బ్రహ్మాండాదులు గూడ బయలులో లీనములగుచున్నవి. బయలుస్వరూపమును బాగుగా గ్రహించినయెడల ముక్తి యందే గోచరించును.

క. బయలున పుట్టినబంధము
బయలందే లీనమగును బరమాత్మునకున్

బయలున పుట్టెడిసంపద
బయలుగ కలుపంగ ముక్తి బయలగు వేమా!

బయలున సమస్తము జనించినటులే బంధములుగూడ జనించి బయలులోనే లీనము లగుచున్నవి. బయలునుండి జనించు సమస్తమును బయలుతోఁ గలుప నేర్చినచో ముక్తి సుసాధ్యమగును.

ఆ. బయలు బయలుగాను పరికింపఁ జాలక
బయలులోనివారు బయటపడిరి
బయలులోనిచాలు పరికింప తత్త్వమౌ, వి...

సాధకులు బయలును బయలని పరికింపలేక పెక్కుభంగపాటుల నొందిరి. కావున బయలులోని నిజమును పరికింపుము. ఆదియే బ్రహ్మము.

ఆ. బయల నిల్లు గట్టి పరికింప నేరక
బ్రమసి తిరుగువాఁడె పామరుండు
బయలుపడిన తానె బ్రహ్మమై పోవును, వి...

మహదాకాశమున దృష్టిసారించి చిత్కళలు దర్శించి తరింపక పేరాశలకు భ్రమసి తిరుగువాఁడు పామరుఁడు. బయలు స్వరూపమును గుర్తించినవాఁడె బ్రహ్మస్వరూపుఁ డనఁబడును.

క. బయలనుచు బయలుపొడగన
బయలునఁ దనమనసు నిలిచి బాగుగఁ దనరున్
బయలని తలఁచెడి భ్రాంతియె
బయలై తనుదానె కాంచు బ్రహ్మము వేమా!



బయలె యాకాశమని భావించి దానినిజూచి మనస్సు నిలిపినచో బయలు సామాన్యప్రదేశమనుభ్రాంతి తొలఁగి బ్రహ్మస్వరూపమును సందర్శింప నవకాశము తటస్థించును.

క. బయలున బంధము పుట్టును
బయలున పరమాత్మునకును బంధము కలుగున్
బయలున గంధము గదిసెను
బయలున బయ లయ్యెడిదియె పరమగు వేమా!

బయలుననే బంధము జనించుచున్నది. బయలువలననే పరమాత్మకు సహితము బంధము కలుగుచున్నది. బయలునుండి బంధము సంభవించి తమకే తాము తొలంగి యందుఁ బరము గోచరించుచున్నది.

ఆ. బయలు బయలుగాను బలపడినప్పుడే
తెగువతోడ నైక్య మగును మదిని
జ్ఞప్తియందు నెఱుక గనుటయే లేదయా, వి...

బయలు బయలుగా బలపడి యపుడే బ్రహ్మైక్యము కలుగును. అప్పుడు జ్ఞప్తి యుంచికొని యెఱుకకై యత్నింపవలసిన యవసరమే యుండదు.

ఆ. బయలు బ్రహ్మ మనుచుఁ బరికించుచుందురు
బయ లదేల దాను బ్రహ్మ మగును
బ్రహ్మమైనబయలు పరికింప తత్త్వమె, వి...,

బయలు బ్రహ్మ మనెదరు; కాని తానే బ్రహ్మమైయున్న

ప్పుడు ఆబయలులో నేమి ప్రయోజనము? బ్రహ్మస్వరూపమగు బయలు నెఱుంగుటయే తత్త్వ మనఁబడును.

ఆ. బయలురూపు తనకు బయలుగాఁ జేసి యా
బయలురూపు నంటి భ్రమయకుండి
బయలులోనిబయలు భావింప పరమాత్మ, వి

ఆకాశతత్త్వమును ఆత్మాధారమునుగా నిలిపి తద్ద్వారా చూపును బ్రహ్మమునంటఁగాఁ జేసి భ్రాంతి నొందక భావించినచో పరమాత్మ సాక్షాత్కరించును.

ఆ. బయలురూపురూపు బయలుగా చేసియు
కంటిరూపు బయటఁ గదియఁ జేసి
బయలుకానిబయలు పరికింప తత్త్వము, వి....

ఆకాశమునందు నిర్మలముగ దృష్టిసారించి కంటికగుపించు సామాన్యవస్తువులనుసందర్శింప మీదృక్శక్తిని కదియఁ జేసినచో తత్త్వము తనంత సిద్ధించును.

ఆ. బయలు రూపు లేనిభావంబులో నుంచి
బయలురూపుబట్టి బయలు చేసి
బ్రహ్మము బయలనుచు భావింప తత్త్వము,వి....

బయలును తొలుదొలుత శూన్యస్థలముగాఁ దలంచి పిదప బయలును సాకారముగా నిరూపించి పిదప నిరాకారముగఁ దలంచుచు బ్రహ్మమునుగూడ నిటులె బయలుగా భావించు టయే తత్త్వ మనఁబడును.



ఆ. బయలులోనె పెనఁగి బయలులో మునిఁగియు
బయలు దెలియలేఁడె బంధకుండు
బయలు బ్రహ్మ మనుచు భావించి చూడరా, వి.

బయలులో పెనఁగియు మునిఁగియును బయలనఁగా బ్రహ్మమని బంధకుఁడు (అనఁగా: సంసారి) తెలియలేఁడు. బయలే బ్రహ్మమని భావించి చూడవలయును.

ఆ. బయలులోనిబయలు పరికించి చూడక
బయలు రూపుఁ జూచి వలచు నౌర
ముఱికి దేహమందు మోహంబు విడఁడయా, వి.

సామాన్యులు బయలునం దిమిడియున్న యాకాశతత్త్వము జూచి యాథార్థ్యము గ్రహింపఁజాలక బయలుజూచి తమ్ము తరింపఁ జేయునని మురియు చున్నారు. ఇంతియగాక మలి నాకరమగు దేహముపైని గూడ వ్యామోహము వదల లేకు న్నారు.

క. బయలే చూడఁగ సర్వము
బయలున లీనములు చూడ బ్రహ్మాండంబుల్
బయలని తోఁచెడి మదిలో
బయలందిన ముక్తి బట్టబయలగు వేమా! 1678

సమస్తప్రపంచమునకును బయలే ఆధారము. దాననే సమస్త బ్రహ్మాండములు అన్నియు నిమిడియున్నవి. ఇద్దాని గనిన సమ స్తమును బట్టబయలగును. ముక్తి చేకూరును.

క. బయ లయినది యెంతెంతయొ
బయలున బ్రహ్మాండమునకు పట్టది యెంతో
రయమున రవి తా నెంతో
భయపడుదురు దానిఁ జూడ బయలని వేమా!

ఆకాశము ఎంతవైశాల్యముగలదో బ్రహ్మాండమునకా యాకాశముననున్న నెలవెంతయో అందిమిడియున్న సూర్యుఁడెంత వాఁడో సామాన్యులు గ్రహింపఁజాలక పృథాభయములకు లోనై యది బట్టబయలని యుపేక్షింతురు.

ఆ. బట్టెలట్టు లఱవ ఫలమేమి కలదురా
అందు సార్థకంబు జెందకున్న
విన్నవారు వారి వెట్టులుగా నెంత్రు, వి...1680

వేదములను గేదెలవలె ఊరక యఱచిన ఫలము లేదు; దాని యందలి (అనఁగా: వేదమునందలి) అర్థమును గని తత్ప్రకారము కృతకృత్యులు కావలయును. లేకున్న వెట్టివానిగ లోకు లెంతురు.

ఆ. బలముకొనఁగ గాలి బట్టి రేచించుచు
గలియఁ బూరకంబు గడలుకొనఁగ
విలయకుంభకంపువిధ మంది చూడరా, వి...

బలిష్ఠమగుశ్వాసమును నిరోధించుట నెగయించుట పూరించుట మున్నగుత్రిమార్గముల నభ్యసింపుము.

ఆ. బలము చూపువేల బలిపెంతముగ రాదు
కులము జూచి మెచ్చ గురుఁడు బోఁడు
తలముఁ ద్రొక్కి యట్లు తలకొని విడరాదు,వి.

బలము చూపినను కులముఁ జూపినను ఆత్మజ్ఞానము కలుగఁబోదు. వెంట నంటి పట్టువీడకయ ప్రయత్నింపవల యును. దాననే బ్రహ్మము గోచరింపఁగలదు.



క. బహువిధవస్తువులందును
మహి గలిగెడి యెల్లజాతి మనుజులయందుఁ
రహిమించు బ్రహ్మమని మది
గ్రహియింపుము బాహ్యశబ్దకథితము వేమా!

సమస్తవస్తువులందును జాతులందును మనుజులయందును మించి యుండెడునదియే బ్రహ్మ మని గ్రహింపుము.

ఆ. బాగుగాను ముక్తిఁ బడయంగ ముందుగా
యోగిగాఁగ గురుని కేఁగి మ్రొక్కి
వేగ బుద్ధినొక్కి విలయమొందుట తగు, వి....

ముక్తిని సులభముగాఁ బడయ నెంచినవాఁడు గురువర్యునాశ్రయించి శుశ్రూషఁ జేసి బుద్ధిని వశపఱచుకొని ఐహికముల నుండి తొలంగుటయె తగినపని.

ఆ. బాట తెలియకున్న బహుదూరమై తోఁచు
చోటు తెలియకున్న చూపోనరదు
కోటకొమ్మమీఁద గుఱుతుగఁ జూడరా, వి...

బాట తెలియకున్నచో గమ్యస్థానము మిగులదూరముగాఁ దోఁచును. ద్రష్టవ్యపదార్థము తెలియకున్నచో చూపు చాలఁ

జాలదు. కాన హృదయస్థుఁడగు ఈశ్వరుని తొలుత గుర్తించి సందర్శింపఁ బ్రయత్నించి కడతేరుము.

ఆ. బొంతఁ జేసి జడలు భస్మాంగలేపనల్
పదనముదముతోడ మాత్రుమలయ
కోక లుడిగి యంగరేకలు బట్టిసెరా, వి...1686

మొదట యోగులుకానెంచి కొందఱు చలచిత్తులు జడలు బాఱలకొలఁది పెంచి బూడిదపూసి కాసెకోకలుకట్టి సన్యాసి వేషములు వేయుచున్నారు. ప్రపంచము, స్త్రీలముఖము చూచి వలపునకులోనై మరల వస్త్రాలంకారముల కియ్యకొను చున్నారు.

తే. బాలప్రాయంబునను ముక్తి బడయరాదు
వయసునందును కామంబు వదలఁబోదు
ముదిమియందును చింతలో ముక్తిలేదు
చచ్చి సాధింప నగునేమొ జగతి వేమ! 1687

బాల్యమునం దజ్ఞానమునను వయసునందు కామోద్రేకమునను ముదిమిని చింతలచేతను కాలము గడచునే గాని ముక్తికై ప్రయత్నించుట కష్టము. చచ్చినపిదప ముక్తి సాధింపవచ్చునే మోగాని బ్రతికినంతవఱకు సాధ్యముగాదు.

ఆ. బాలప్రాయమందె భ్రమల నడంపక
మేలుపొంద రెపుడు మేదినందు
కీలు దెలిసి మదిని కీడ్పడకుండుము, వి.... 1688

లేతప్రాయముననే భ్రాంతుల నశింపఁజేయకున్న ఎట్టివారై



నను పిదప మేలును పొందఁజాలరు. కావున నీరహస్యము నెఱింగి కీడ్పడక ముక్తిని సాధింపుము.

ఆ. బాల్యమందు స్వామిభక్తి లేకుండును
యౌవనమున హరుని సేవఁ గనరు
వార్ధకంబునందు వర్ణింప లేరిఁక, వి... 1689

మనుజులు బాల్యమున అజ్ఞానులైనకతన ఈశ్వరవిచారణ జేయఁజాలరు. యౌవనమున కాంతాలోలురై తత్త్వము నన్వేషింపఁజాలరు. వార్ధకమున దేహము రుజాపీడితమగుటచే మోక్షవిచారము సలుపలేరు. ఇఁక వీరు కడతేరువిధ మేదియో?

క. బాలుఁడవై యున్నప్పుడు
చాలవు యౌవనమునందు సంపదరూపుల్
మేళనమౌ ముదిమియె యే
వేళను గడతేర్పుశివుని వెదకుర వేమా! 1690

బాల్యము ఈశ్వరవిచారమునకు శక్తిగలదికాదు. యౌవనము కామోద్రేకాదులను గలుగఁజేయును. కావున ముదిమియే మానవునిగడతేర్చి యీశ్వరసాన్నిధ్యమునకుఁ జేర్చును.

ఆ. బిందునాదు నాదుబిందునుగాఁ జేసి
నాది బిందులాది నాదుఁ జేసి
బిందులోనినాదు భేదించిచూడరా, వి.... 1691

బిందునాదులను నాదుబిందులనుగా తాదాత్మ్యము నొందించి బిందులోనినాదును భేదించి చూడుము. దాన తత్త్వరూపము గోచరింపఁగలదు.

ఆ. బిందురక్తములను బెరసినదేహము
చంద మెఱుఁగక ద్విజన్బద్ధ మిడుచు
నడచినన్ విడుచున నరకంబు మృత్యువు, వి...

బిందురక్తములు బెరసినదేహప్రచందము నెఱుఁగక ద్విజుఁడనుకొనినచో మృత్యువే కాని వేఱుఫలము కలుగఁబోదు. కడకాతఁడు నరకముపాలుకాక తప్పదు.

ఆ. బిందు వనఁగ మాయ బీజంబు శివుఁడయా
అందు కనక మయ్యె నప్పులయ్యె
సంధి వెలయ జగము సర్వంబు తా నాయె, వి.

బిందుబీజములును, మాయయును, ఈశ్వరుఁడును; వారివలననే యీపరిదృశ్యమానమగు సమస్తప్రపంచము సృజింపఁబడినది. ఈసంధివలననే సమస్తప్రపంచము ఈశ్వరరూపముగానేర్పడినది.

ఆ. బిందువందు పుట్టె పెంపైననాదము
నాదమందు పుట్టె నాదిశివుఁడు
శివునిమధ్యమందుఁ జెలఁగును సూక్ష్మంబు, వి...

బిందువునందు నాదము పుట్టఁగా నందు పరశివుఁడు జన్మించెను. శివునిమధ్య సూక్ష్మమగు ప్రకృతిరూపము గోచరించుచున్నది.

ఆ. బిందుసేవకుండు బీజమై యుండును
సాధుసేవకుండు సర్వహితుఁడు
తీర్థసేవకుండు తిరుగుచుండెడి గదా! వి...



ఎల్లపుడు ఇంద్రియవశంవదుఁ డగువాఁడై బీజమై జననాదికములతో మునిఁగి తేలును. సాధువుల సేవించువాఁడు సమస్తజనహితుఁ డగును. తీర్థసేవకుఁడు కాకివలెఁ దిరుగుచుండును.

ఆ. బొంది వేఱు కాని భువి ప్రాణ మొక్కటి
అన్నము లిల వేఱు ఆఁక లొక్కటి
పుష్పము లిటు వేఱు పూజ యొక్కటిసుమ్ము, వి.

శరీరములు వేఱువేఱుగను ప్రాణము ఒక్కటిగ నుండును. ఎట్లనఁగా: అన్నములు వేఱైనను ఆఁకలి యొక్కటియైనట్టులనే పువ్వులు వేఱైనను పూజ యొక్కటి యైనట్టులనే యని యెఱుంగుము.

ఆ. బ్రహ్మ గుఱ్ఱమయ్యె భవుఁడు పల్లంబయ్యె
నాదివిష్ణు వెన్న నంకమాయె
నందు మీఁద నుండు నాఁడుదో మగవాఁడో, వి.

బ్రహ్మ గుఱ్ఱమయ్యెను. శివుఁడా గుఱ్ఱమునకు పల్లమయ్యెను. విష్ణువు ఆపల్లమునకు అంకమాయెను. పైనెక్కినది స్త్రీయో పురుషుఁడో (ప్రకృతి) గురుతింపుము.

ఆ. బ్రహ్మ జంపి విష్ణుభాగంబున గలిపి
విష్ణుఁ జంపి శివుని వీటఁ గలిపి
శివుని జంపి తాను శివయోగి కావలె, వి...

ముందు బ్రహ్మనుధ్యానించి పిదప నాతనివదలి విష్ణునిధ్యానింపుము. ఆవల విష్ణునివదలి శివునిధ్యానింపుము. శివధ్యాన

మును మానినచోఁ గడకు నీవె శివస్వరూపుఁడవై శివయోగిగా మాఱఁగలవు.

తే. బ్రహ్మ తన్మయచింతన భవహరంబు
బ్రహ్మ మాత్మావలోకనప్రముదితంబు
బ్రహ్మమం దైక్య మగునాత్మ పరవశంబు
విమలమతి నెంచునవు డిదె విధము వేమ!

బ్రహ్మ తన్మయచింతన పాపహరము. బ్రహ్మము ఆత్మావలోకనప్రముదితము. బ్రహ్మమునందు లీనమగుట సంతోషహేతువు. కావున నెల్లప్పుడును బ్రహ్మము ననుసంధింపుము.

ఆ. బ్రహ్మ బ్రహ్మ యన్న బ్రహ్మం బదెట్టిదో
వలసి తెలిసి చూడ వద్దనుండు
ముద్రలోన నుండు ముద్రిక గానరు, వి.... 1700

బ్రహ్మస్వరూపమును యోగాది సాధనలతో దర్శింపనేర్చినచో సాధకునకు అండగానుండి కడతేర్చును. బ్రహ్మము హృదయముననున్నను సామాన్యులు తెలిసికొనఁ జాలకున్నారు.

ఆ. బ్రహ్మమవల నున్న ప్రళయకాలంబైన
నదియు బ్రహ్మచేత నందవచ్చు
బ్రహ్మ మమరు జ్ఞప్తి పట్టులో కట్టురా, వి....

బ్రహ్మమును సందర్శించి కృతార్థుఁడైనవానికి ప్రళయకాలమునందైన ముక్తిఁ బడయుట కవకాశములు కలవు. బ్రహ్మమును హృదయమున నిలుపుకొని సందర్శించుట కభ్యాసము బాగుగాఁ జేయవలయును.



ఆ. బ్రహ్మ మున్నచోటు పరగంగ తెలియక
ఎందొ వెదుక బ్రహ్మ మేల గలుగు
నంజనంబు లేక యాసొమ్ము దొరకదు, వి...

అంజనము లేక సొమ్ము దొరకనియట్టులనే బ్రహ్మమున్నచోటు తెలియక తక్కినతావుల వెదకినను దొరకదు.

ఆ. బ్రహ్మమును తెలియవు భావమం దుంచిన
తనువు గుడిగఁ జేసి తన్ను నిలిపి
లోకబుద్ధి విడచి లోఁజూపు చూడరా, వి...

భావమును గుదురుపఱచి అందు ఆత్మభావము నుంచి విభేదదృష్టిమానినచో బ్రహ్మమును పొందఁగలుగుదువు.

తే. బ్రహ్మ మెఱుఁగనివా రెట్లు పారు లైరొ
జిహ్వ రుచులకు దోఁపదో జీవులార
గహ్వరంబైనమదియందు కనుఁడి మీరు, వి...

బ్రహ్మమును తెలియనివార లేవిధమున బ్రాహ్మణులు కాఁగలిగిరి? బ్రహ్మము జిహ్వావేద్యము గాక మనోవేద్యమని యెఱుంగుఁడు. ఈసంగతి సత్యమో యసత్యమో మనస్సులో నూహింపుఁడు.

ఆ. బ్రహ్మ మెఱుఁగు జ్ఞప్తి పదిలంబుగా నుంచి
తనువు మఱచి వేగఁ దన్ను దలఁచి
లోకబు మఱచి లోఁజూపు చూడరా, వి....

బ్రహ్మము నెఱుఁగఁదగినయెఱుకను పదిలపఱచి నిస్పృ

హుఁడై లోకము అనుబుద్ధిని బొత్తిగా మఱచి హృదయాంతర మునందు వెదకినచో ముక్తి గలుగును.

ఆ. బ్రహ్మ యెవనికొడుకు పరికింపఁగాభువి
విష్ణు వెవనికొడుకు వెలయఁ జూడ
శివుఁ డెవరికి కొడుకు చిత్తమందుంచరు, వి...

లోకులు మాయావశులై త్రిమూర్తులయందె భక్తియుంతురుగాని బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరు లెవరికుమారులో వారికి జనన కారణమగు పరతత్త్వస్వరూప మెట్టిదో యెఱుంగఁ బ్రయత్నము చేయుటలేదు.

ఆ. బ్రహ్మవంశభవులు ప్రబలులై యుండఁగా
నితరజాతులకును గతులు గలవె
వనములోనిక్రోఁతి వసుమతి నడపునా? వి. 1707

బ్రహ్మవంశ్యులు ప్రబలులై యున్నంతవఱకు నితరులకు గతులు లేవు. కలిగినను వారసమర్థులయ్యే యుందురు కోఁతి భూపరిపాలనముచేయలేనటుల నితరజాతులు కార్యతంత్రములు నడుపలేరు.

ఆ. బ్రహ్మవాదు లెల్ల బ్రహ్మం బనంగను
వలసి తెలిసిచూడ వద్దనుండు
ముందునున్నయట్టి ముద్రికఁ గానరు, వి...

బ్రహ్మవాదులు బ్రహ్మమని చెప్పెడిదానిని పరిశీలించి చూచినచో నీయొద్దనే యుండును. ముందున్నదానినే బ్రహ్మమునే) లోకులు కాంచఁ జాలకున్నారు.



ఆ. బ్రహ్మవిష్ణుశివుల భాగంబులను నిల్పి
పరమయోగియైన బ్రహ్మ మగును
బ్రహ్మమైనవాని భావింప శక్యమా? వి... 1709

త్రిమూర్తులయంశముల నెఱింగి యోగియైనచో బ్రహ్మస్వరూపము నొందును. అట్టివానిని భావింప శక్యము అగునా? కాదు. వాఁడు కేవలదైవస్వరూపుఁడు.

ఆ. బ్రహ్మవేత్తల మని పౌరుష మాడేరు
బ్రహ్మమేమి దానిభావ మేమి
తెలుపొ నలుపొ యెఱుపొ తెలిసినపలుకుఁడీ, వి.

వృథాడంబరులగు కొందఱుమానవులు మేము బ్రహ్మవేత్తల మని పలుకుచుందురేగాని బ్రహ్మమన నేమియో అది తెలుపొ నలుపొ ఎఱుపొ తెలిసికొనరు. తెలిసికొన్న చెప్పకుందురా?

ఆ. బ్రహ్మసంతతి యన భక్తులై వెలసిరి
ఋషులజాతు లెన్నొ రీతు లయ్యె
ఱోత కెక్క వారి రోయక పిలుతురా? వి. 1711

బ్రాహ్మణులు బ్రహ్మసంతతివారనియు భక్తులనియుఁ ఋషిసంప్రదాయమువారనియుఁ బెక్కురీతులఁ బేరొందియున్నారు. వా రుత్తమమగు నాత్మవిచారము చేసిననే గౌరవింతురు గాని చెడునడవడితో లోకము గౌరవింపదు.

తే. బ్రహ్మసుఖతత్త్వవిజ్ఞానపరముఁ గోరి
గురుకళాజాలనియతమౌకోర్కి మిగిలి

యోగనిర్ముక్తరూపుఁడై యున్న యెడల
పరమశివుఁడని భాసిల్లు ధరణి వేమ! 1712

బ్రహ్మసుఖమును గోరి గురుమార్గక్రమమున కళలగమనించి యోగనిరతుఁడై యున్న యెడల బంధముక్తుఁడై పరమశివుఁడై భాసిల్లఁ గల్గును.

ఆ. బ్రహ్మవిష్ణువులకు పరఁగఁగ రుద్రుఁడు
సిగయ యగుట నెఱిఁగి సృష్టిజనుల
రుద్రనిందఁ జేసి రూఢి తప్పుదురయా, వి...

బ్రహ్మకును విష్ణువునకును శివుఁడు శిఖవంటివాఁడు. జనులట్టి పరాత్పరుఁడగు నీశ్వరరూపము నెఱుఁగఁ జాలకమతావేశముచే శివనిందఁ గావించి దుర్గతిపాలగుచున్నారు.

ఆ. బ్రహ్మపరువు చెడును బ్రాహ్మణులాదొడ్డ
బ్రహ్మవలనఁ బుట్టి పరగి రనఁగ
బ్రహ్మవేత్త యగును బ్రాహ్మణుఁడే యైన, వి...

అవివేకులగు మానవులు తాము బ్రహ్మసంతతివారమని చెప్పుకొనుటవలన బ్రహ్మకు గౌరవముపోవుచున్నది. జాతిమాత్రముచే బ్రాహ్మణులు గొప్పవారు కారు. బ్రాహ్మణుఁడైనవాఁడు బ్రహ్మవేత్తయై యుండవలసినదే కాని వాఁడెట్లు బ్రాహ్మణుఁడు?

ఆ. అంగమందు లింగ మమరంగ మర్దించి
జంగమందు బెట్టి యరగుపఱచి
రంగుగాను వసుధ గ్రుంగఁగఁజూడరా, వి...



హృదయమునందు నీశ్వరస్వరూపమును లీనముగావించుకొని జంగమరూపుఁడగు దైవమును ధ్యానించుచుఁ బంచభూతావృతమగు ప్రపంచమును శూన్యభావముతోఁ జూడ నభ్యసించుము.

క. అంచ ఘనాక్షరబిందువు
పంచాక్షరినాదమండ్రు పరమమునీంద్రుల్
ప్రాంచితముగ నది తెలిసిన
మంచాసన మెక్కువాఁడు మహిలో వేమా!

హంసయే ఓంకారస్వరూపమనియుఁ అదియే పంచాక్షరీనాదమనియు నుత్తములగు మునీంద్రులు చెప్పుచున్నారు. ఈవిషయమును బాగుగా నెఱింగినవాఁడె యోగీశ్వరుఁ డనఁబడును.

ఆ. అచరచరసమూహ మంగము లింగము
సరణి దెలిసి యట్టి శైవమేల
అష్టతనువు లమర హరుఁడౌట నెఱుఁగరా, వి.

అచరలింగమని చరలింగమని లింగములతో నవస్థపడు శైవులమతము నిస్సారమైనది. శివుఁ డష్టమూర్తి స్వరూపుఁడై సమస్తవ్యాపియైయుండ లింగములో నుండెనని లింగధారణము చేయుట నిరుపయోగము.

ఆ. అందలమును మోయ యందఱుపై నుండి
పొంది వేడ్క మీఱు పూర్ణుఁ డతఁడు
అతనిపూజఫలము నందఁగఁ జేయును, వి...

భక్తులందఱు అందలముపై నెక్కించి మోయుచుండ భక్తులపైనుండి స్వోత్కర్షకు గరువింపక యీశ్వరస్వరూపము దర్శిం

చువాఁడె సంపూర్ణుఁడు. అట్టిఘన్యుని పూజచేసినయెడల ఫలము లభించును.

క. అనుచితపురుషుం డొక్కఁడు
వినునిత్యానిత్య మనెడి విధ మెట్టి దనం
దనసంకల్పమె బంధము
తనసంకల్పంబె క్షయము దనరఁగ వేమా! 1719

మానవజన్మము మిగుల ననుచిత మైనది. నిత్యానిత్యములను గూర్చి విచారించుటకు సూక్ష్మమగు సాధన మొకటెగలదు. తన సంకల్పమె కర్మబంధమునకును కర్మక్షయమునకుఁ గారణమగు చున్నది.

క. అనుభవకేళికి లోనగు
తనువులు మూఁడుడిగి లోనితథ్యము గని యా
జననాంతర మమరంగను
కనునదె బ్రహ్మంబు మదిని గట్టిగ వేమా! 1720

అనుభవకేళికి వశంవదమగు స్థూలసూక్ష్మ కారణశరీరములు మూఁడింటినివదలి తత్త్వరహస్యమును గమనించి పుట్టువు మొదలు చావువఱకు బ్రహ్మమును సందర్శింపఁ బ్రయత్నింపవలయును.

ఆ. అనువుమీఱ మదిని నానంద మందెడి
నరుఁడు పరుఁడు గాఁడె నయముగాను
మనసు నిలుపకున్న మఱి ముక్తి లేదయా, వి.

హృదయమునందు పరికించినచో నానందము ననుభవించెడి



పురుషుఁడే పరాత్మ యనియును దానిపై మనసునిల్పుటయే ముక్తియనియు నెఱుఁగఁదగును.

తే. అన్యు లుండనిస్థలమందు నాత్మవిద్య
చిత్తతిమిరమ్ము నణఁగించి చెంగలించి
పండువెన్నెలకాంతిలో బ్రాఁకిచూడు
మప్పు డానందమును బొంద నగును వేమ! 1722

ఇతరు లెవరులేని నిర్మానుష్యప్రదేశమునఁ జేరి హృదయగత మగునజ్ఞానమునంతయుఁ దొలఁగించుకొని మనస్సునందున్న జ్యోతిస్స్వరూపమును దర్శింపనారంభించినచో నానందముకలుగును.

ఆ. అమల మవ్యయంబు నంతరాత్మకు లోన
విమలదృష్టిఁ జూని విడక మించి
తెమలకున్న వాఁడు తెరబయ ల్పేరును, వి...

నిర్మలమును నాశనరహితము నగు ఆత్మతేజస్సే ఈశ్వరుఁ డని నమ్మి పొందవలయును. అట్టివాఁడు బ్రహ్మమును జేరి కృతార్థుఁడు కాఁగలఁడు.

క. అభవుని మదిలో గాంచెడు
శుభకరమగుచూడ్కి నంది సొంపలరంగా
నభిముఖదృష్టిని జూనుము
రభసము లేనట్టియెఱుక రాజిలు వేమా! 1724

దృక్శక్తిని హృదయమున కేంద్రీకరించి యీశ్వరుని సందర్శించుట కభిముఖుఁడ వగుదు వేని సులభసాధ్యమగు జ్ఞానము సమకూరుననుట సత్యము.

ఆ. అయిదు నైదు నైదు నైదింటఁ జేకూడు
మూఁడు మూఁటఁ జేరి మఱియు నొకటి
మఱిసిన సకలంబు మోహించి యుండుగా, వి.

ఈశరీరమునందు పంచమహాభూతములకు పంచేంద్రియము లకు పంచప్రాణములకు పంచతన్మాత్రలకు సంబంధముగలదు. స్థూలసూక్ష్మకారణదేహవిశిష్టమగు కళేబరమునకు త్రిగుణముల వలని యాటంకముకలదు. వీనినన్నిటిని జ్ఞానదృష్టిచే నెఱింగి మోక్షమును బడయుము.

ఆ. అయిదువర్ణములను నానంద మెఱిఁగిన
నందె చూడ ముక్తి యలరుచుండు
అయిదులోనఁ దెలియుటదియెపో బ్రహ్మంబు,వి.

పంచాక్షరియందలి ఆనందమె వెలుఁగుచుండును. అదియే ముక్తియును బ్రహ్మము అనియుఁ జెప్పఁబడును. అందలియా నంద మెఱుంగుటయే ముక్తిని పొందుట.

ఆ. అల్పసుఖము లెల్ల నాశించి మనుజుఁడు
బహుళదుఃఖములను బాధపడును
పరసుఖంబు నొంది బ్రదుకఁగ నేరఁడు, వి...

మానవుఁడు స్వల్పములగు నింద్రియసుఖములకు జిహ్వాచాప ల్యములకు లోనై వివిధదుఃఖములచే బాధలొందుచుండునేగాని దుఃఖనివారణమార్గమగు మోక్షసౌఖ్యమును గడింపఁజాలఁడు.

ఆ. అక్షయమనుటంక మండంబుతోఁ గూర్చి
అమరగుణవికార మనుభవించి
అక్షయంబునంట నక్షయంబై యుండు, వి...

అనశ్వరమగు కైవల్యమును మనస్సునఁ జేర్చి గుణవికారరహి తుఁడై యక్షయత్వము నొంది బ్రహ్మము నొందవలయును.

క. అక్షరపదవికి పదివే
లక్షరముల నఱవ నేల నల శివ యను రెం
డక్షరము లణఁచు దురితము
తక్షణమే పదవి గలుగు తథ్యము వేమా! 1729

అక్షరరూపము (బ్రహ్మత్వము)నొందుటకు పదివేలమాటలను పలుకుటకంటెను శివయనునొకమాటఁ బలికిన చాలును. ఆరెం డువర్ణములే తక్షణము శివసాయుజ్యము సమకూర్చును.

క. అక్షరపుటడవిఁ జొరకయె
యక్షరమగుమహిమ గాన నవనిం దొలుతా
నక్షరమును జపియించిన
నక్షయముగ నదియె చాలు నరయుము వేమా!

అక్షరములనుఅడవినిచొరకయే యక్షరత్వము నొందఁజాలవు. కావున తొలియక్షర మగునోంకారము నుపాసించి జపించినచో నదియే నిన్నుతప్పక తరింపఁజేయును.

ఆ. ఆకసంబు శూన్య మందు శబ్దము పుట్టె
శబ్ద మధ్యమునను సరగఁ జూడ
శబ్దరహిత మగుచు వెలఁగును బ్రహ్మంబు,వి....

ఆకాశము శూన్యము. అందు శబ్దము పుట్టెను. ఆశబ్దము

(ఓం) నందే బ్రహ్మము శబ్దరహితముగ స్ఫోటరూపమున వెలుఁగుచున్నది.

ఆ. ఆత్మతేజమూని యనువుగా శోధించి
తేజమాత్మయందు తేటపఱచి
యింటిమింటి నడుమ నిన్నంది చూడరా, వి...

ఆత్మతేజముతో బ్రహ్మమును సంశోధించి బ్రహ్మమునం దాత్మతేజమును వెలకొల్పి దృక్ఛక్తిని పరంజ్యోతిస్వరూపముపై వెలకొల్పి చూచుటకు అభ్యాసము గావింపుము.

ఆ. ఆది నంటిచూడ నలవి గా దెవ్వరికి
సోది చెప్పఁదరమె సుఖమెఱింగి
వాద మేల బయలు వర్ణించి చూడరా, వి...

అన్నిటికి నాదియగు ప్రకృతిని కనుఁగొన నెవ్వరికిని సాధ్యము కాదు. కావున కేవల చిత్స్వరూపమును ధ్యానింపుము. ఆదిని గాంచితిమని చెప్పువారిమాట లనృతము.

ఆ. ఆలుమగఁడు సుతుఁడు నందఱిలో నాత్మ
మేలుగాను యుండి మెఱయుచుండు
వేఱువేఱుగాను వెలసెనురూపంబులై, వి...1734

దారపుత్రాదులందును సమస్తమునందును ఏకరూపముగా నాత్మప్రకాశించుచున్నను ఘటభేదమున వేర్వేఱుగా ప్రకాశింపుచున్నది. కావున నాత్మసంబంధముచే మానవులు సమానులు.



ఆ. ఆశపాశము బట్టింతు రాలుసుతులు
గాసిపడెదవు కూటికే గడపరాదు
శోకమందిన కాలుఁడు తాఁకి విడఁడు
పాకమెఱిఁగిన బ్రహ్మంబు పరఁగు వేమ! 1735

ఆలుబిడ్డలవలన మానవులకు ఆశాపాశముదక్క నితరసుఖము లేదు. సంసారము చేయువానికి కూటికి గుడ్డకు సంపాదన చాలదు. ఇట్లు సంసారదుఃఖముతోఁ బుణ్యాపాపములు మఱచి చనిపోయినచో నాతనికి యమబాధ తప్పదు. కావున నుచితము నెఱిఁగి మొదటినుండి వర్తించిన బ్రహ్మము లభించును.

ఆ. ఇట్టియౌవనమున నీశ్వరధ్యానంబు
గలిగి జేయవలయుఁ గడఁకతోడఁ
జేయకున్న యెడల తుది సౌఖ్య మేదయా? వి...

ఈయౌవన మున్నప్పుడే యీశ్వరుని పట్టుదలతో ధ్యానింపలేనిచో నిఁక నీప్రపంచమున నెప్పటికిని సౌఖ్యమే లేదు.

ఆ. ఇట్టిలింగమందు నీరేడుజగములు
పుట్టి బ్రదుక నరులు భువిని వెలసి
గట్టిగా యమునికి కానుకలై యుంద్రు వి...

ఈప్రకృతి శక్తివలనఁ బదునాలుగు లోకములు పుట్టినవి. అందు నరు లభివృద్ధి నొందిరి. మానవులంద ఱొకనాఁటికైనను యమునకుఁ గానుక కావలసినవారే!

ఆ. ఇతరచింతలన్ని వెతలని మది నెంచి
జతుకమంటురీతి జగము మఱచి

సతత మాత్మయందె సయ్యాటలాడరా, వి....

తక్కినవైహికచింత లన్నియును బాధల గల్గించును. కాన వానిని విడనాడి నిరీహుఁడవై యాత్మధ్యానము సేయుము. అక్క యితరవస్తువుల నంటునట్లు జగముల కంటి యంటనటు లుండుము.

క. ఇది యది గానిది మదిలో
చెదరనిగుఱితోడఁ జూచి చేపట్టికనన్
గదలక మెదలక తోఁచెడు
విదితం బే దందు బెనఁగి వెలయుము వేమా!

ఇట్టిదని నిరూపింపరాని బ్రహ్మస్వరూపమును లక్ష్యబుద్ధితో దర్శించినచో నిశ్చలమ్ముగా గోచరించును. నీబుద్ధియందు లీనముగావించి కృతార్థుఁడవు కమ్ము.

క. ఇది రాజమార్గభావము
సుధయై జగములకు నెల్ల సూక్ష్మాకృతియై
సదమలమతియై తోఁచెడు
నదియే పరమయినబయ లనందగు వేమా! 1740

సూక్ష్మాకృతితోనున్న బ్రహ్మస్వరూపమును నిశ్చలమగు మనస్సుతో గాంచి మోక్షానుభవము నొందుటయే సాధకునకు రాజమార్గమును అమృతప్రాయము నయియున్నది.

క. ఇది లేక జరుగ దనుచును
మదిలో నేవస్తువైన మమతఁదగుమతిం



గదిసి విడిచి పోఁజాలని
దదెపో సంసారబీజ మనఁబడు వేమా! 1741

ఈవస్తువు లేనిచో గడువఁజాలదని ఏవస్తువుపైనేని మమకారము వహించి దానిని వదలక లోనగుటయే సంసారబీజమని విజ్ఞానులు చెప్పుచున్నారు.

క. ఇంద్రియపరవశుఁ డధముం
డింద్రియపరవశుఁడె భక్తియెడ మధ్యముఁడౌ
నింద్రియజయుఁ డుత్తముఁడు జి
తేంద్రియసమధికుఁడు విన మహేశుఁడు వేమా!

ఇంద్రియవశంవదుఁడగు మానవుఁ డధముఁ డగును. అట్టివాఁడు భక్తియోగమున కక్కఱకురాఁడు. ఇంద్రియములను జయించినవాఁ డుత్తముఁడు. యోగ్యుఁడు. ఈశ్వరస్వరూపుఁడని చెప్పఁబడును.

క. ఇరుమూఁడక్షరసాధన
పరుఁడగు నిర్వాతదీపపద్ధతి మదిలో
గుఱిమీఱి బయలు సేరిన
నిరుపమసానందమూర్తి నిత్యుఁడు వేమా! 1743

పంచాక్షరీసాధనపరుఁ డగువాఁడు నిర్వాతదీపమును బోలి నిశ్చలుఁడై ధ్యానించి ఈశనిరూపము నొందఁగలఁడు.

ఆ. ఈజగమున ముక్తి కిరుమూఁటి కవ్వాల
రాజమార్గ మమరు రంగుగాను

తేజ మూని నొక్కి తెంపుగాఁ జూడరా, వి...

పంచతత్త్వములను విమర్శించినచో తదనంతరమునం దద్వ్య సహితముగనే ముక్తి కలదు. బ్రహ్మతేజము సార్జించి బుద్ధిని లోఁబఱచికొని తెంపుతో ముక్తికై యత్నింపుము.

ఆ. ఈడుగానిదాని తోడికిఁ బొల్పడి
జోడుగూడరాదు నూటిగాను
కూడి తప్పె నేని గుణములు కొంచెమౌ, వి...

తనకుఁ దగనిపొలఁతితోఁ దగులాటమునకుఁ దిగరాదు. కొంతకాలము కలసియుండి పిదప నాయుంపుడుకత్తె తన్నువదలినచో ఉన్న గౌరవమంతయు దానివలననే పోవును.

క. ఉత్తమమగుజ్ఞప్తికై
సత్తమ నిజరూపభావసాదృశ్యములోఁ
బొత్తున పారంగతుఁడై
హత్తెడునధ్యాత్మవిద్య ననువుగ వేమా! 1746

ఉత్తమజ్ఞానముతో తాదాత్మ్యసిద్ధికై రూపము,భావము,సాదృశ్యముల నెఱిఁగి యత్నించుటయే యధ్యాత్మవిద్య యనఁబడును. దాని సార్జింప యత్నింపుము.

క. ఉదయాద్రికి పైనుండెడు
సదయుని మది నిల్పి చూడ శక్యము గాఁగాఁ
గుదురుపడు జ్ఞప్తి నిలిచిన
నదియే పరిపూర్ణసౌఖ్యమందెడు వేమా! 1747



ఉదయాద్రి కావలనుండు సూర్యబింబమునందు విష్ణువు నిలచియున్నాఁడు. ఆమహావిష్ణుస్వరూపమును దర్శింపఁగలుగుదువేని జ్ఞానము కుదురును. ఇందు నిశ్చలబుద్ధి కలవాఁడవగుదువేని మోక్షసౌఖ్యము గూడఁ దనంత లభించును.

క. ఊకొనఁ జెప్పిన విన వది
ప్రాకటముగ లోకములను బాలించెడు నా
పాకము మదిలో బయలని
యేకాకృతి నవిరతముగ నెన్నుము వేమా!

చెప్పినను వినినను గ్రహింప సాధ్యము కానట్టిది బ్రహ్మస్వరూపము; అద్దానిని యేకాకారమున ధ్యానించిననే లభ్యము అగును. అదియే బయలు. సమస్తలోకముల నదియే పాలించుచున్నది.

క. ఊకొని వినఁగావచ్చును
బ్రాకటముగ కథల నెల్ల బలుదెఱఁగులుగా
నేకీభావమునందును
పోకుట దుర్లభము మదికి నుడివడు వేమా!

ఎన్నిమాటలైనను చెప్పవచ్చును వినవచ్చును; ఎన్నికథలనైన నెఱుంగవచ్చును. గాని బ్రహ్మైక్యత నొందుట యలవిగానిపని యని యెఱుంగుము.

క. ఊపిరి లోనికి లాగుచుఁ
బ్రాపుగ లోనిలువఁ జూచి పనుపుగ విడుచున్

జూపోర్వనిబయలందుచు
గావుగ నీలోన నిన్నె కనవలె వేమా! 1750

శ్వాసమును బీల్చుచు బిగియఁబట్టుచు విడుచుచు మనస్సును నిశ్చలత్వము నొందించి బయలున నున్నయాత్మరూపమును సందర్శింపుము. (ఇవియే రేచక పూరక కుంభకము లనఁబడును.)

తే. ఊపి రున్నంతవఱకును కాపురంబు
చేసి కడ తేఱలేకయే చిక్కువడరె
పాపలో చూపుమించుటే పాసనంబు
దానిమార్గంబె తెలియగాఁ దగును వేమ! 1751

మానవు లూపిరియున్నంతవఱకు సంసారపుజంజాటములోఁ బడి మునిఁగి తేలుచుండి నానావస్థలకు లోనయ్యెదరు. దాని తొలంగించుకొనుటకు కనీనికలయందున్న తత్త్వము గ్రహించుట యవసరము. దానికి వలయువిధము గ్రహింపుము.

ఆ. ఎక్కువెట్టి పరము నేకాంతమును గోరి
ముక్కుకొనను చూడ్కి మొనయ నిలిపి
సాక్షియుండు టదియె సోహంస్వరూపము, వి.

మనస్సును ఎక్కువెట్టి నిశ్చలత నలవఱచికొని దృష్టినాసాగ్రమున నిలిపి తత్పరుఁడై యుండుటయే సోహంస్వరూపము.

ఆ. ఎక్కువెట్టి మనసు నేకాంతమునఁ జేర్చి
మ్రొక్కువాఁడెపరము దక్కువాఁడు



నిక్కిచూచునపుడె నిర్ఘాంత మబ్బురా, వి...

ఈశ్వరునిపై లగ్నముచేసిన హృదయమును ఏకాంతముగా నించి దైవస్వరూపము సందర్శించి మ్రొక్కువాఁడె మోక్షము గడింపఁగల్గుగును. వెఱ్ఱిగాఁ జూచినచో వానికేమియు గోచరింపదు.

ఆ. ఎక్కువెట్టి మనుజుఁ డేకాంత మమరఁగా
దక్కఁగోరుచుండు ధన్యుఁ డరయ
బ్రక్కనుండు నెఱుక పరిపూర్ణమందురా, వి...

జ్ఞానము మానవునకు సమీపముననే యున్నదిగావున దాని నొందుటకై దృక్ఛక్తి కేంద్రీకరించి ఏకాంతమున నీశ్వరరూపము సందర్శింప యత్నించి కృతార్థుఁడవు కమ్ము.

తే. ఎచ్చుగచ్చులు నుడివిన నేమి ఫలము
మ్రుచ్చువేషంబు పూనిన మూల మేది
అచ్చుపడ తన్నెఱింగినయతఁడె యోగి
సచ్చిదానందపూర్ణుఁడౌ జగతి వేమ! 1755

టాఱక డంబములు పలికిన ఫలములేదు. కపటసన్యాసివేషములవలన ఫలములేదు. ఆత్మజ్ఞానము గలవాఁడే యోగీశ్వరుఁడు. సచ్చిదానందసంపూర్ణుఁ డనఁబడును.

తే. ఎండమావులచాడ్పున నుండు జగము
లుండు పరమాత్మ యందును దండిగాను
నిండుమదిలోన శోధించి నెగడవలెను
మిథ్య యనునమ్మకము నీవు మీఱి వేమ! 1756

ఈశ్వరతత్త్వమను బ్రహ్మాండమునందు, లోకములన్నియు ఎండమావులవలె నిలుకడ లేకున్నవి. పరిశుద్ధాంతఃకరణముతో తత్త్వవిచారముచేసి జగము మిథ్య; ఈశ్వరుఁడు నిత్యుఁడని గ్రహింపుము.

ఆ. ఎంత కడుగ నోటి యెంగిలిపోవునే
యెల్లకాలమందు నెంగిలితగు
ననుదినంబు చూడ నమృతమాడెడు నోరు, వి.

అనుదినమును అమృతమాడుచున్న యీనోటిని శుభ్రము చేయవలయునన్న సాధ్యముకాదు. ఎంతకడిగినను నెంగిలిపోదు; నోరున్నవఱకు ఎంగిలియు స్థిరముగా నుండునదియే.

తే. ఎదుట గాన్పించుదానిని యెంచరాదు
మదిని గుఱుతొంది యుండుట మానితంబు
సదయహృదయత సాక్షిగా సంతరించు
హృదయరంజక మపుడగు నెన్న వేమ! 1758

బ్రహ్మము కన్నులయెదుట గనుపట్టుచున్నను ఎంచుట కలవి గానియట్టిది. అట్టి బ్రహ్మరూపమును సార్వకాలీనమగు చిత్తసాక్షిత్వము నొందుడువేని నిత్యానందము లభించును.

క. ఎందును తలఁపఁగ లేఁడఁట
పొందుగఁ బరమాత్మ నిఁకను బొందుట యెట్లౌ
ముందుగఁ దను దా దెలిసిన
నదే పరమాత్మ తెలియు నవనిని వేమా! 1759

పరమాత్మ ఎందును నిత్యముగా లేడని చెప్పుచున్నారు. దాని



పొందువిధ మెటులని సాధకుఁడు తొలుదొలుత నే గ్రహించెనేని అందే (ఆతలంపునందే) పరమాత్మ గోచరించును.

తే. ఎదుట నిల్పినచూపులో నేక మమర
నెఱిఁగి మరగినతోడనే యెంచరాదు
మదికి లోవెలి బయలగు మఱుఁగుఁజేరు
స్థిరత చిత్తంబునకుఁ గూర్పఁ దివురు వేమ! 1760

ఎదుటివస్తువుపైని దృష్టి నిలిపి దానియందు మనస్సు లగ్నమైనపిమ్మట యూరకుండక యా చిత్స్వరూపము నొందునట్టుల యత్నింపుము.

ఆ. ఎనిమిదక్షరముల నేర్పడ నెఱిఁగియు
వినియు కనఁగరాక వెలయువాని
తనువు మఱచి తెలియఁ దత్త్వాత్ముఁడగును రా, వి.

మనుజుఁడు అష్టాక్షరములం దిమిడియున్న యాభగవత్స్వరూపమునందు నెఱుఁగఁగల్గిన తత్త్వరూపుఁడు కాఁగలఁడు. అందులకు యత్నించువాఁడు తన్నుఁ దా మఱువవలయును.

క. ఎనిమిదిదిక్కులు బయలై
యెనిమిదిఁటికి నారి కెన్న నెక్కుడుబయలై
వినరానిబయల నడచినఁ
గనరా యచ్చోట నన్ను గలసియు వేమా!

అష్టదిక్కులును ఆకాశరూపమున ననంతత్వము నొంది షడధ్వముల కతీతమై యనిర్వాచ్యమగు తత్త్వము గనుము.

తే. ఎన్నిదినములు బ్రతికిన నేమి ఫలము

పిన్న పెద్దలు చెలరేఁగి పేరులేక
యన్నదమ్ములు నాప్తులు నందె చనిరి, వి...

పెద్దలు పిన్నలు మిగులనభివృద్ధిలోనికి వచ్చి గతించిరి. అన్నలు తమ్ములు ఆప్తులు ముందుగాఁ జనిపోయిరి. ఇఁక నెన్ని దినములు బ్రతికినను ఫలములేదని వేమన విరక్తిగాఁ జెప్పుకొనుచున్నాఁడు.

తే. ఎన్నివిద్యలు నేర్చిన నెఱుఁగరాదు
తన్ను నిర్గుణమనుజ్ఞప్తి తాఁకవలెను
నిర్ణయోనాస్తి యన్నది నిండియుండు
గురునిబోధకు నన్యమే కొలఁది వేమ! 1764

ఎన్నివిద్యలు నేర్చినను ఆత్మస్వరూపము గుర్తించుట చాలకష్టము. దైవము నిర్గుణుఁడనుభావము తనంతనే కలుగవలయును గాని నిర్ణయింపఁ దగిన సాధనములు లేవు. "నిర్ణయోనాస్తి" యని గురువులు బోధించుచున్నారు.

క. ఎనుబది నాలుగు లక్షల
టనఁబరఁగిన జీవరాసులందును మును దా
జనియించువిధము దెలిసిన
మనుజుఁడెపో దారి గాంచు మహిలో వేమా!

ఎనభైనాలుగులక్షల ప్రాణికోటిలో తనమునుపటి జన్మవిధము నెఱింగినవాఁడె ముక్తుఁడగును.

ఆ. ఎల్లి నేఁడు నిన్న నేలాగునను గాని
మనసు నిలుపువాఁడు మంచివాఁడు



శివుఁడు భర్తకర్త చింతింప నేలరా? వి...1766

ఎప్పటికైనను మనస్సు నిలుపువాఁడు మంచివాఁడు. కనుక ఈశ్వరునియందు మనస్సు నిల్పి ఆయనయే సమస్తమునకు నాధారమని ధ్యానింపుము. ఇతరవిచారము లనవసరము.

తే. ఎవ్వరెవరన నేనను నేమెఱిఁగియొ
తానెవం డైన నెఱుఁగనిమానవుండు
అడిగినప్పుడైన లక్ష్యంబు నమరఁజేయు
గొంత తెలిసెడిఁగాదె యీవింత వేమ! 1767

తా నెవఁడో గ్రహింపలేని మానవుఁడు ఎవఁడవు నీవనినం తనే నేనేయని చెప్పుచున్నాఁడు. ఎదటివాఁడు ఎవఁడవు నీవన్నపుడు అంతరి యంతరార్థము లక్ష్యమునందుంచికొన్నచో తాన నెవఁడో గుర్తించుటకు వీలుగలుగును.

తే. ఎవ్వరెఱుఁగనితత్త్వంబు నెఱుఁగు టెట్లు
లోను చూడంగఁ జూడంగ లోక మగును
తలఁపు మఱపులు దాఁటుటే తన్మయంబు
నిత్యపూర్ణత సానందనిరతి వేమ! 1768

ఎవ్వరికి నెఱుంగరానితత్త్వమును తా నెఱుఁగుట దుర్లభము. కావున సర్వాంతర్యామియగు పరాత్పరుని ధ్యానించి అజ్ఞానమువదలి తన్మయత్వము నొందుట మంచిది.

క. ఏకాంత మిరవు గన్గొని
లోకాంతముఁ జేరఁబోయి లోబయలగునా

పాకంబు బూని మించిన
నీ కింపగుచిత్పరంబు నెలవగు వేమా! 1769

ఏకాంత ప్రదేశమునఁ గూరుచుండి నిత్యానిత్యవివేచనను జేయుచు ఆకాశతత్త్వము నెఱింగి మించినచో చిత్తును పొందఁగలవు.

క. ఏకాంత మిరవు గన్గొను
శ్రీకాంతుని బ్రహ్మమయుని జిన్మయుఁ బరుని
న్సాకారరూపు సాక్షి ని
జాకారమె పరమపదవి యార్యయ వేమా! 1770

ఏకాంత ప్రదేశమునఁ జేరి లక్ష్మీవల్లభుఁడును, బ్రహ్మస్వరూపుఁడును, జ్ఞానమయుఁడును, పరాత్పరుఁడు నగు సాకారరూపుని భగవానుని దివ్యరూపము దర్శించుటయే పరమపదవి యగును.

క. ఏకం బ్రహ్మ మనంగా
వైకల్పితమై జగంబు వారల కెల్లన్
సాకారత్వము లుడిగిన
శోకము మోహంబు లేదు శుభమగు వేమా!

బ్రహ్మస్వరూప మొకటియేయని భావించి లోకులకు అటులె ఱుఁగఁజేయు సాకార నిరాకారవాదము లుడిగి వర్తించు వానికి శోకమోహాతీతమగు మోక్షము గలుగును.

క. ఏచినపంచేంద్రియసుఖ
నీకవ్యాపార ముడిగి నిజముగఁ దానై



లోచూపుఁ జూడ నొల్లక
వాచాబ్రహ్మంబు వదలవలదుర వేమా! 1772

మాటిమాటికి చెలరేఁగు పంచేంద్రియములవలని సుఖములను వదలి ఆత్మజ్ఞానమును సంపాదించి వ్యామోహాకరములగు వస్తువులను జూడక వాగ్గోచరమగు బ్రహ్మమును సందర్శింపఁ బ్రయత్నింపుము.

ఆ. ఏకసమమునందు నెఱుక గల్గినయోగి
పరు లెఱింగి చూడ భావమందు
ఆశ లేక మించి యన్నిట దా నగు, వి...1773

జ్ఞానసంపూర్ణుఁడగు యోగీశ్వరుఁడు ఇతరవిషయములలోఁ బ్రసక్తి కలిగించుకొనక నిశ్చలుఁడైయుండును. పరులకాయుత్తమోత్తముఁడు ఆశాదూరుఁడై ప్రత్యక్షమగుచుండును.

క. ఏజనుఁడు గుణకదంబము
నీజగమునఁ బట్టనేర్చు నిమిడికపడఁగా
నాజనుఁడె ముక్తి కర్హుఁడు
రాజితపరిపూర్ణహృదయరంజక వేమా! 1774

ఏజనుఁడు గుణములను లోఁబఱచుకొని స్వేచ్ఛగా సంచరింపఁ జాలునో యాతఁడే మోక్షమున కర్హుఁడు. జ్ఞానాఢ్యులగువారి రంజింప నేర్పుగల వేమనా! ఇది సత్యము.

క. ఏతత్త్వ మమర గోరెదొ
ఆతత్త్వము సరిగ నడవు మారసి స్వరముల్

ఖ్యాతిగ వర్ణము లెన్నక
యాతురత న్నిలుపు మదిని ననువుగ వేమా!

జాతికులభేదములకు లోనుగాక వాంఛితమగు తత్త్వమునైన మనస్సుంచి అనుకూలములగు స్థిరముల నెఱింగి మనస్సును శ్రద్ధా విశ్వాసములతో నిలిపి కృతార్థుఁడవు కమ్ము.

తే. ఏది తినకయు బ్రతికిన నేమి గలదు
వాదునకు జిక్కఁ జక్కనివరుస గనుము
భేదబుద్ధిని జూచిన బెనఁగఁబోదు
సమత గలవాఁడె యోగ్యుఁడే జగతి వేమ! 1776

నిరాహారుఁడై మనుటలోగాని వాదించుటలోగాని భేద బుద్ధితో మెలఁగుటలో బ్రయోజనము లేదు. సమత్వముగా నుండువాఁడే భూలోకమున నుత్తముఁడు.

ఆ. ఏది యేదని మదిలోని పాదు దెలిసి
కాదు కాదని పరికించి కనులు దెఱచి
ఆదిమూలము గనుచుండు నాత్మవేత్త
దానన్తే పరమానంద మూను వేమ! 1777

నిరంతరము ఈశ్వరసక్తచిత్తుఁడై మనోభ్రమలపాలుగాక మఱపులేనివాఁడై పరమహంసస్వరూపమును కనుఁగొనుచు నాత్మ వేత్త దాననే పరమానందమును బడయఁగలుగును.

ఆ. ఏమి కానిదాని నెఱుఁగుట లక్ష్యంబు
సాముచేసినట్టు సాధ్యపఱచి
నియమనిష్ఠ వదలి నిర్ణయమందరా, వి...1778



ఇదమిత్థమని నిరూపింపరాని బ్రహ్మస్వరూపమును సామునేర్చి నటుల నేర్పుతోఁ గాంచనేర్చి లక్ష్యముంచి నియమము నిష్ఠ వదలి మోక్షము నొందును.

తే. ఏమిసాధనముల నంద నేమిఫలము
తామసాన్విత మగును త్రిపగులఁ బెట్టి
నీమనిష్ఠలు మదియందు నెఱపవలెను
మనసునిలుకడ గనునట్లు మనఁగ వేమ! 1779

ఇతరసాధనముల నెన్నిటి నవలంబించినను లాభములేదు. కావున తన్నుతా నుద్ధరించుకొనఁ దలంచినచో తమోగుణమును పూర్తిగ వదలవలయును. మనస్సు నిలుకడ నొందుటకు వలయు నియమనిష్ఠ లవలంబింపవలయును.

క. ఏరికిఁ దక్కనిచిన్మయు
దారికిఁ దోడ్పడుట నెఱుక తనలో దానై
పోరుచు బైకొనుచుండును
సారెకు సమయింపఁ జూడు సరసత వేమా! 1780

ఎట్టివారికిని సాధ్యుఁడుగాని చిత్స్వరూపుని జ్ఞానసాహాయ్యమున హృదయమునందే గని తన్మయత నొందుటచే నజ్ఞానము తనంతన నశించును.

క. ఏవంక మనసు కలిగిన
నావంకను నింద్రియంబు లన్నియు నెగు
న్నీవంక మనసు కలిగిన
నేవంకకు నింద్రియంబు లేగవు వేమా! 1781

మన స్సెదిక్కునకుఁ బోవునో యింద్రియములన్నియు నాది క్కునకే బోవుచుండును. ఇంద్రియములవలన మోసపోక కడ తేర నెంచినచో మనస్సును ఈశ్వరునిమీఁదికిఁ ద్రిప్పుము. ఇంద్రియము లీశ్వరునియందే లీనమగును.

క. ఒకటని రెండని యెన్నుచుఁ
ప్రకటితముగ లెక్కఁబెట్టి పైకొనుచుండున్
నికరముగ నెలుకదాఁటిన
సకలేశుని గాంచుటదియె సరసము వేమా! 1782

గురూపదేశమగు మంత్రమును నిశ్చలహృదయముతో జపమాలదాల్చి ఒకటి రెండు మూఁడని లెక్కించుచు జపముగావించునెడ జ్ఞానము లభించును. జ్ఞానము నతిక్రమించుచో నీశ్వర సాక్షాత్కారమగును.

క. ఒంటరిగా నున్నప్పుడు
గంటికి మింటికిని నడుమ గోపురముగ నీ
యింటను గన్గొని పిమ్మట
జంటించు జితాత్మమయుని జపమున వేమా!

ఏకాంతముగా నున్నపుడు కంటికి మింటికి మధ్య నెలకొని యున్న యీశ్వరస్వరూపమును హృదయమున నెలకొల్పి చిదాత్మమయుఁడగు బ్రహ్మముతో లీనముగాఁ బ్రయత్నింపుము.

ఆ. ఒంటికంబమందు నొనర నంకణమొను
ఆరునంకణముల నమర నిల్పి
అవల నిలకడూఁడ నమరును తత్వజ్ఞుఁ, వి...



ఈశరీరము ఒంటిస్తంభపుమేడవంటిది. ఇందు ఆధారములు ఆఱును నారంకణములు. వీటినిదాఁటి అటుపైనియున్న బ్రహ్మమును సందర్శింపుము.

ఆ. ఒంటిమేడలోన నొనరంగఁ జూచిన
మంటిమింటినడుమ మహితముగను
కంటిజ్యోతినిగిరి కలియ నెక్కును హంస, వి.

ఒంటిస్తంభము మేడలో నిశ్చలమగు ధ్యానమున జూచినచో గొప్ప వెలుఁగు కానవచ్చును. దానినిపొందుటకై యత్నింపుడు వేని హంసను నొక్కవలయును. (ప్రాణాయామసాధనము చేయవలయును.)

ఆ. కడఁకతోన నరుఁడు కామంబు గట్టినఁ
జిత్తమునను చికిలి చిత్రరూపు
కైవడి నిలనుండు ఘనుఁడాతఁడేసుమీ, వి...

కామమును జయించి మనస్సును వశపఱచుకొని చిత్తరువులోనిబొమ్మవలె విషయములకు లొంగకయుండెడువాఁడె యాత్మస్వరూపుఁ డనఁబడును.

క. కడలేనియాదికాలం
బెడఁబడకుండఁగను జ్ఞాన మెఱుఁగక యున్నన్
విడువఁడు జడమతులను మఱి
నడువుఁడి ఘనులెల్ల ముక్తి నట్టుగ వేమా! 1787

బ్రతికినంతకాలము విషయాదులకు లోనై జ్ఞానమును సమార్జింపఁజాలని మందమతులతో స్నేహముచేయుట మాని ముక్తి

మార్గమును యోగ్యుఁడగువాఁ డన్వేషించి సౌఖ్యము లొందుట ముఖ్యకర్తవ్యము.

ఆ. కడుపునిండ సుధను క్రమముతోఁ ద్రావిన
పాలమీఁద నేలఁ బాఱుమనసు
తత్త్వ మెఱిఁగువెనుక తన్వంగు లేటికి? వి...

తృప్తిగా నమృతము ద్రావినవానికి పాలక్కఱలేనట్టులే మనస్తత్త్వము నెఱింగినవానికి ఇతరతత్త్వము, స్త్రీలతో భోగించుట యనావశ్యకములు.

తే. కదలకుండఁగ మది నిల్పి కదిసి పట్టి
నిదురలో నిద్రచూచుచు నేర్పు మిగిలి
పదరకుండెడివాఁడె పో బ్రహ్మనిష్ఠుఁడు
నిదియె సంతోషముల కెల్ల నిజము వేమ! 1789

మనస్సును నిశ్చలముగా నుంచి సమాధిస్థుఁడవై నిదురలో నుండి నిద్రాతత్త్వమును గ్రహించి లేనిపోనిడంబములనుబలుకక జాగ్రతను వహించితివేని బ్రహ్మము నొందఁగలవు. ఆబ్రహ్మమే సంతోషముల కెల్ల నిధి యనఁబడును.

క. కదలనిజీవములందును
తుదిమొదలుగనాఱురుచులుతొలఁగకయుండున్
గదలెడిజీవములందును
వదలవు కష్టంబు సుఖము వసుధను వేమా!

కదలమెదలలేని ముదుసలివారికిఁగూడ జిహ్వాచాపల్యమునశింపదు. కదలిమెదలి స్వయంసహాయముతో వర్తించువారికి జిహ్వా



చాపల్యమెగాక కష్టసుఖములుగూడ వదలవండుననుటలో నాశ్చర్యమేమి?

క. కనుచాటు తప్ప కాగుఱి
మనసంబునఁ జేసి నొక్కి మార్కొనినంతన్
వినుచుండుఁ బ్రణవరవమును
గని దాఁటున నిర్గుణంబుగతి యగు వేమా!

కనుఱెప్పపాటునైన నడ్డమురానీక లక్ష్యమును సందర్శింతువేని మహత్తరముగాఁ బ్రణవరవము వినిపించును. దానిని దాఁటితివేని నిర్గుణస్వరూపమగు బ్రహ్మము గోచరించును.

తే. కనులఁచూడ్కిని జెదరక కట్టి నొక్కి
తనువుపై నాస విడిచిన తావు బట్టి
యున్నమనుజుఁడె శివుఁడయా యుర్విలోన
నతనికేటికి సుఖదుఃఖవితతి వేమ! 1792

దృష్టిని నొక్కిపట్టి శరీరమును మఱచి ఈశ్వరునియందు మనస్సును లగ్నముచేసినవానికిఏవిధములైన సుఖదుఃఖములును లేవు. ఆతఁ డీశ్వరస్వరూపుఁడు.

ఆ. కనులఁ జూడఁబడని కలుషవిదూరుని
మనమునందు జేర్చి మరులుగొనక
తనకు ముక్తి లేదు తలఁపులు మెండైన, వి...

అపరిదృశ్యమానుఁడగు నీశ్వరుని మనస్సునందుఁ జేర్చి నిష్కాముఁడై ప్రవర్తింపక పెక్కుతలంపులతోఁ బ్రవర్తించినయెడల ముక్తి లభ్యముకాదు.

క. కప్పయు పామును బోరం
గప్పను సర్పంబు మ్రింగుకైవడి మెఱయం
గప్పను వెడలం ద్రోసెడి
యొప్పున నాచొప్పు దెలిసి యుండర వేమా!

మండూకమును సర్పమును బోరునెడ సర్పము మండూకమును మ్రింగివైచును. సమర్థుఁడైనచో ఆపామునుండి మండూకమును విడిపించును. అట్లే మాయ జీవుని మ్రింగునప్పుడు విజ్ఞుఁడై గురువు మాయను విడిపించును.

ఆ. కపటమైన పనులు కడఁబెట్టి చూడక
తత్త్వ మెట్లు తనకు తగులుపడును
వగుఁపబుద్ధిఁ గాని ధన్యత నొందఁడు, వి...

పరులవంచించు చెడుబుద్ధిని బోనాడినగాని తత్త్వము మానవునకుగోచరింపదు. తత్త్వము గోచరించినగానిమానవుఁడు కృతార్థుఁడు కాఁజాలఁడు.

ఆ. కంబమునను జొచ్చి కడ తేఱిపోయెడి
తెరు వెఱుఁగకయుండెఁ దిరిగివచ్చి
తెరువు దెలిసి దాఁట దేవుఁ డందురు కదా, వి...

శరీరములో ప్రవేశించి వెడలుచుండెడి ఈయవస్థలను తెలిసికొని ఏతదతీతుఁ డగుటయే ఈశ్వరత్వము నొందుటయని యందురు. దానినొందినవాఁ డీశ్వరుఁడె.

క. కర్మజ్ఞానేంద్రియములు
నిర్మలహృదయమునఁ జేర్చి నిర్గుణమతితో



ధర్మంబని వివరించుట
మర్మం బధ్యాత్మయోగమహిమము వేమా!

కర్మేంద్రియమును జ్ఞానేంద్రియమును ఈశ్వరవిచారమున కుపయోగించుచు హృదయమును నిర్గుణముగావించి ధర్మాధర్మ వివేచనముఁ జేయుచు నుండుటయే అధ్యాత్మయోగ మనఁబడును.

ఆ. కల్ల నిజము తెలిసి గాలిభూతము రోసి
యింటిమీఁద నాస యేల విడరొ
నీటిమీఁద బుగ్గ నిలుకడ కాదయా, వి...1798

మానవదేహమునకుఁ గలస్థిరత్వము అస్థిరత్వము దెలిసికొని ప్రాణవాయువు మిగులఁ జంచలమైనదని గుర్తించిగూడ జనులు దేహముపై వ్యామోహము మానలేకున్నారు. నీటిబుగ్గలవంటి యీ మేనులకు నిలుకడ యెక్కడిది?

తే. కలుషములనెల్ల ఖండించు గతి నెఱింగి
చిన్మయానందపట్టాభిషిక్తుఁడైన
వాని నెన్నంగఁదరమె యీవసుధయందుఁ
బరశివుండని వర్ణింపఁబడును వేమ! 1799

పాపకార్యముల నన్నింటిని విసర్జించి జ్ఞానానందసామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడైయుండు మహాత్ముని వర్ణించుట యశక్యము. ఆతఁడు కేవల మీశ్వరస్వరూపుఁడు.

ఆ. కాంతపైనిప్రేమ స్వాంతము రంజించు

చింతదీఱు దరుణి చిక్కినపుడె
వింతయగ్నరఁ బోదు విశ్వసాక్షిని గూడ, వి...

స్త్రీని వలచినపుడు మనస్సున కానందముగానుండ ను. చెలువచేతికిఁ జిక్కనేని చింతలన్నియుఁ దీఱిపోవును. పరమేశ్వరునితో లీనమగుచో శాశ్వతానందమేగాని యిట్టిటుచ్ఛమగు నింద్రియసుఖము లభింపఁజాలదు.

క. కించిన్మాత్రమును మదికిఁ
జంచలమును బుట్టనీక జాగ్రతతో నా
సంచితమగు గురుభక్తిని
మించినపరిపూర్ణమూని మెలఁగుము వేమా!

ఇసుమంతైనను మనస్సునుచలింపనీయక మెలఁకువతో గురూక్తమార్గమున నాత్మధ్యానము చేయుటయే ముక్తి కనువగు మార్గము.

ఆ. కీలుదెలిసి మదిని గేవలాత్మను గూడి
భావమందు సొక్కి బయలు దాఁకి
చేరియుంట ముక్తిఁ జెందంగఁ బూనరా, వి...

ఆధ్యాత్మిక విద్యారహస్యమును గ్రహించి హృదయము నాత్మతో సంయోగించి తన్మయమున చిత్స్వరూపమును జేరితివేని ముక్తి సముపలభ్యమగును.

క. కుండలియోగము దెలిసిన
బండాలము యోగి కేల బాలికబొందం



దండిగ నాతను వందునా
మెండుగ నిల ముక్తికాంత మెలఁగుఁ వేమా!

కుండలినీయోగము నెఱింగిన యుత్తముఁడనుయోగికి కాంతాసంగమనుతోఁ బనియుండదు. అట్టియోగి హృదయమున ముక్తికాంత సంచరించుచుండ నింకఁ బరకాంతతో నేమిపని?

ఆ. కేవలాంతరాత్మ జీవుండు నిజమని
పట్టివాదులాడువారి ద్రొక్కి
త్రొక్కి పట్టి నాల్క తుదిఁ గోయ పాపమా? వి...

కొంద ఱవివేకులు అంతరాత్మయేజీవుఁడనివాదించుచున్నారు. ఇటుల మిథ్యావాదముచేయువారి సిగద్రొక్కిపట్టి నాలుక గోసినను పాపము కలుగనేరదు.

ఆ. కొండమీఁద జ్యోతి కొమరు దీపింపఁగా
నిండి పూర్ణముండు నిబిడముగను
అండఁజేరకున్న నంటగరాదయా, వి... 1805

హృదయస్థమగు సహస్రారకమలమున సంపూర్ణమగు ప్రకాశముకలదు. ఆజ్యోతిస్స్వరూపము నాశ్రయించి దరిచేరకున్నచో మోక్షము లభింపఁజాలదు.

ఆ. కోరి మదిని గురుని కొలుపు జేయుట మేలు
గారవమున దెలుపు గహనవిద్య
దూరదృష్టి నిలిపి తొడరుట మోక్షంబు, వి...

గురువులను ప్రార్థన చేసి కోరికొనినచో నాదరించి రహస్య

మగు సధ్యాత్మవిద్య నిత్తురు. దాని సార్జించి దూరదృష్టితో మెలఁగుదువేని మోక్షము లభించును.

క. క్రమమున దేహత్రయములు
విమలజ్ఞానంబుచేత వివరించినచో
నమలం బగునస్తోకము
కొమరొప్పగ జాగ్రతందు గూడును వేమా!

దేహత్రయములను (స్థూలసూక్ష్మకారణములు) నిర్మలమగు జ్ఞానదృష్టిని వివరించి గర్హించినచో నందు అమలమగు జ్యోతిస్సు అపరాత్మరూపము కనుపట్టును.

తే. ఖండపరశువుఁ బూజింప దండిదావి
భూతి నిచ్చును గావున నీతి గలిగి
శివుని బ్రార్థించుతరి ననుభవము నందఁ
జేయు నైశ్వర్య మిచ్చుటచేత వేమ! 1808

శివునిఁ బ్రార్థించినవారికి సమస్తములగు నైశ్వర్యములు లభించును. శివునియోగాద్యనుభవరూపమునఁ బ్రార్థించిన యెడల నాతఁ డణిమాద్యైశ్వర్య ప్రదానముచే సాధకులఁ దృప్తి పఱచును.

తే. గట్టురాచూలిపతియైన గంగధరుని
గుట్టు మదిలోనఁ దెలిసినఁ బట్టువిడక
చట్టువలె మనముందుట శాశ్వతంబు
దిట్టయగునట్టి యాతఁడె తెలియ వేమ! 1809



ఈశ్వరుని తత్త్వమును హృదయమున నెలకొలిపి నిరంతరధ్యానమునఁ దన్మయత్వము నొంది నిశ్చలముగ నుండువాఁడె ముక్తుఁ డని తెలిసికొనుము.

తే. గగనగోచరనిర్గుణగమ్యు మూని
తమము మీఱిన ధ్యానంపుతత్పరమున
దెమలకుండుట మోక్షంబు తెరువు గాదె
విమల సుజ్ఞాన మబ్బిన వెలయు వేమ! 1810

చిద్గమ్యమగు తత్త్వము నొంది యజ్ఞానమును రూపుమాపి నిరంతరధ్యానముతో నుండుటయే మోక్షము. అది జ్ఞానశాలికి మాత్రమె లభించుగాని యన్యులకు లభింపదు.

తే. గమనగమ్యునిరాలయగతిని మనసు
సమరసత్వంబుగా నుంచి సాక్షి యగుచు
భ్రమ లడంచిన బ్రహ్మంబు బట్టబయలు
క్రమ మెఱుంగమి లోనెల్లఁ దమమె వేమ! 1811

చిత్స్వరూపమునందు హృదయమును నిరామయముగా నెలకొల్పి తాను సాక్షియై భ్రాంతులను దొలంగించుకొన్న యెడల బ్రహ్మము బట్టబయలగును. లేకున్నచో అంతస్తమము నశింపదు.

తే. గగనగోప్యనిరాలయ ఘట్టమందు
విమలనిర్మలనిష్కళవేదిఁ జేరి
తన్ను గని చింత చేయుటె తత్పదంబు
గురుకటాక్షము లభియింప గుదురు వేమ! 1812

చిద్గోప్యమును నిర్మలమును నిష్కళమును అగు నాపరేశుని చింత జేయుటయే తత్త్వము. అయ్యది గురువుల కటాక్షము గలవారికే లభించి సాధ్యమగును.

ఆ. గుడులు దేవతలని గుర్తులు గావింత్రు
ముక్తిబాపలనుచు మూర్ఖనేల
మొప్పెలకును దారి మురియుచుఁ జూపిరి, వి...

గుడులు దేవతలను బ్రాహ్మణులు తమ జీవికకై ఏర్పఱచిరని మూర్ఖులు విశ్వసించుచుందురే కాని బ్రహ్మప్రాప్తికి మూర్ఖుల కీవిధమునఁ జూపిరని గ్రహింపలేరు.

ఆ. గుణికి జ్ఞానమహిమ గోరంతఁ జెప్పిన
కొండ యగును వాని గుణముచేత
గుణవిహీను కెట్లు గుదురు నారీతిగ, వి...

గుణవంతునకు జ్ఞానమహిమ నలుసంత చెప్పినను కొండంత యగును; కాని గుణహీనునకు మాత్రము అట్లు కాదు.

ఆ. గురువు లేక విద్య గుఱుతుగా దొరకదు
నృపతి లేక భూమి తృప్తి గాదు
గురువు విద్య లేక గురుతరద్విజుఁ డౌనె? వి...

గురువులేనిచో విద్య నిస్సందేహముగా లభింపదు. రాజులేకున్నచో పరిపాల్యులగు ప్రజలకు భూమి భోగ్యము కాఁజాలదు. గురువు విద్యలేనివాఁ డెన్నఁటికిని బ్రాహ్మణుఁడు కానేరఁడు.

తే. ఘనచిదాకాశమైనట్టిగతి నెఱింగి
యనిల రేచకపూరకం బనువుగాను



పనుపడఁగ లాగి కుంభించి పాటుపడర
మనెదు సుజ్ఞాన మిహిర నేమరక వేమ! 1816

బ్రహ్మస్వరూపమౌ చిదాకాశమనునంశమును గ్రహించి రేచక పూరకకుంభకాదులచేఁ బ్రాణవాయువును వినియోగము గావించుచు పాటుపడినయెడల జ్ఞానివై కడతేరగలవు.

ఆ. చింతమానుకొనను జేరిన నలకాంత
వింతఁ జూపి చనును విడువరాదు
పంతగింపఁ దాని పట్టిననే మేలు, వి... 1817

మనస్సును విశ్వసించినఁ దప్పుత్రోవల నీడ్చుకొనిపోవును. గాన నట్టులు పోనీయక పట్టియుంచుటయే మేలు.

తే. చిన్మయానందపురి నడిసీమఁ జేరి
తన్మయుండైన పరశివతత్త్వవేత్త
మన్మయంబగు రాజ్యంబు మఱిగి యుండు
జన్మరాహిత్యమందు నిజమ్ము వేమ! 1818

చిన్మయానందము నొంది పరశివతత్త్వవేత్త యగువాఁడు మనోరాజ్యమును పాలించుచు జన్మరహితుఁడై యుండఁగలఁడు.

క. చెప్పియుఁ జూపఁగరానిది
మెప్పుగ మదిలోనఁ జూచి మెలఁకువతోడన్
త్రిప్పులు పడకయ చూచిన
నొప్పుగ జగ మెల్ల నిండి యుండిన వేమా!

నోటితో చెప్పుటకును కంటికి చూపుటకును వీలుకానట్టిది పరబ్రహ్మస్వరూపము. కావున భ్రాంతిరహితమగుదృష్టితో చూచిన లోకముల నిండి కాన్పించును.

తే. చెప్పవచ్చును దా నెంతో చేసినట్లు
ముప్పు త్రిప్పలు దలఁగను మూలమేది
చెప్పుమాటలు తనమది సేతఁగునె, వి...1820

ఎదటివాని కెన్నివార్తలనైనను జెప్పవచ్చునుగాని మనస్సు భ్రాంతికి లోనుగానిమార్గము నెఱుంగుట చాలకష్టము. మాటల నెన్నియేనియెదటివానికిఁ జెప్పుట సులభమెగాని తానాచరించుట యసాధ్యము.

ఆ. చెలిమితోడ ముందు చింతించి గగనంబు
బలముతోడ బ్రాకి భావమూని
ఫలవిహీనమైన భావచిన్మయమంది
విలయమందువాఁడు విభుఁడు వేమ! 1821

మొదట సమభావముతో మహదాకాశమునుసందర్శింపనేర్చి పిదప నిశ్చలదృష్టితోనవలోకింప నభ్యసించి ఫలరహితమగుజ్ఞాన స్వరూపమును గనుగొని మరణించువాఁడె యుత్తమోత్తముఁడని చెప్పఁబడును.

ఆ. చక్కఁగాను మదిని సాధించి కననలె
నిక్కి చూచు నెఱుక నేర్పుమీఱ
ముక్కుతుదిని చూపు ముదమందఁ జూడరా, వి.



నాసాగ్రమందు దృష్టి నిలుపు తెఱఁగును చక్కఁగా నభ్యసించి పిదప నారీతిని చేసి బ్రహ్మమును సంతసముతో సంశోధించి కనుగొన యత్నింపుము.

తే. చేరి యష్టాక్షరము లెంచి దారిమిగిలి
కోరికలు లేని మోక్షాధికారి యగుచుఁ
బోరి చిత్పదమందినఁ బొంచి యుంచు, వి...

అష్టాక్షరిమంత్రమును జపముగావించుచు జ్ఞానమార్గమును గ్రహించి నిష్కామముగా బ్రహ్మస్వరూపము సందర్శింపనేర్చి చిత్పదమును జెంది సుఖింపుము.

ఆ. చక్కఁజేసి మదిని సాధింప నేరమి
ముక్కుమీఁద దృష్టి మొనయ దరుదు
నిక్కమైనజ్యోతి నిన్నంటియుండురా, వి...1824

మనస్సును చక్కచేసికొనకుండునంతవఱకు నాసాగ్రమున దృష్టి నిలుచుట కష్టము. దృష్టి నిలిచెనా పరబ్రహ్మము సర్వము నీలో నివసించియుండును.

క. చక్కనిపూనికతోడను
ముక్కుతుద న్నిలిపి మనసు మూలము గనమి
న్దక్కదు నిత్యవినోదము
దృక్కగునా బయలు సేర దృఢమగు వేమా!

నిశ్చలమగు ప్రయత్నముతో నాసాగ్రమునందు దృష్టిని నిలిపి మనోమూలముఁ బటుతరముగా నందుఁ జేర్చినచో బ్రహ్మస్వరూపము బయలుపడును.

ఆ. చంద్రమామ వెలుఁగుఁ జక్కఁగాఁ బరికింపు
వెన్నెలం దలరెడి వెలయు బయలు
దానిరూపుఁ దెలియఁగా ముక్తి ఘటిల్లు, వి...

చంద్రబింబమునందుఁ గలవెలుఁగును జక్కఁగాఁ బరికించి పిదప వెన్నెలయందున్న వెలుఁగును బరికింతువేని బయలుగోచరించును. దానితత్త్వమును గ్రహించెదవేని ముక్తి లభించితీఱును.

ఆ. చదువులందు లేదు శాస్త్రంబులను లేదు
వాదములను దైవభేదములను
బయల నున్న ముక్తిఁ బాటించి చూడరో, వి...

చదువులలోను శాస్త్రములలోను వెదకినఁ గానరాక తదతీతమైన రూపముతో బయలనున్న ముక్తిని కనుగొనుము.

ఆ. చదువులన్ని చదివి చాలవివేకియై
మగిడి తన్నెఱుఁగక మందజనుఁడు
నిసుగుచదువటంచు వెట్టియై చెడిపోవు, వి...

మానవుఁడు సమస్తవిద్యలు శ్రద్ధతో నేర్చి ఆత్మతత్త్వమును గ్రహింపఁజాలక చదువులన్నియు నిష్ఫలములు. ఇందులకై విలువగల కాలము వ్యయము గావించితిననుకొని వెట్టితో గడబట్టుచున్నాఁడు.

ఆ. చాయలోనిచాయఁ జక్కఁగాఁ గుర్తించి
కోయవలెను భ్రమలఁ గొంకులేక
మాయమాయమాను మహిఁ దత్త్వమందురా, వి.



జ్యోతియందు జ్యోతిస్స్వరూపముగనున్న బ్రహ్మమును గురుతించి భ్రమలను మొదలంట నశింపఁజేసినయెడల మాయ యంతరించి తత్త్వము లభించును.

తే. చూపురూపుల రెంటిని జూచి దాని
నిరుకు తెలియంగ నదినుంచ నేర్పు గనుచు
గోపురంబగు కైవల్యకార్యమాను
నిర్మలజ్ఞాని పని బూని నిజము వేమ! 1830

చూపును రూపును ఐక్యముఁ జేసి మనస్సును తదాయత్తముఁ జేసి యందలిరహస్యములఁ గనిపెట్టుచు కైవల్యమునొందుటకై యత్నము సేయవలయును.

తే. చూపులో చూపు వెలిచూపు చూడ నేల
నాదియంత్రము లేనట్టి దచల మగును
వేదగురుమూర్తి మది నుంచు వేగముగను, వి.

ఆంతరంగికమగు లక్ష్యమును చూచి యచలమగు తత్త్వమును మనస్సునందు చేర్చి ధ్యానించుట ముక్తికి సాధనము.

తే. చూపురూపుల రెంటిని జూచి దాని
నన్నియును గాక తన్ను దా గన్నదాని
నిర్మలంబుగ మది నెంచు నిర్మలుండు
నిర్గుణబ్రహ్మ మరచేత నిలుపు వేమ! 1832

చూపును రూపమును బాగుగా సందర్శించి వానియందు లక్ష్యమును వదలి యీశ్వరునిపై విశ్వాసముంచి నిర్మలమతితో వర్తించువాఁడే పుణ్యాత్ముఁడు. వానికి నిర్గుణబ్రహ్మ మఱచేతఁ జిక్కును.

ఆ. జగమునందు లేదు జలములందును లేదు
నిగమవేద్యమైన నిజపదంబు
సగుణనిర్గుణముల సాధించి చూడరా, వి...

బ్రహ్మము నిగమవేద్యము. అది లోకములయందు జలమునందును లేదు. సగుణోపాసనము నిర్గుణోపాసనములు విసుకక గావించినచో నీవు సంపర్కించి కృతార్థుఁడవు కాఁగలవు.

ఆ. జతుక మంటురీతి జాబిల్లి వెలుగంది
ప్రతిఫలింప గుణిని పరిణమించి
వెదుకవలెను మదిని వేదాంతమర్మము, వి...

లక్కకరణి యితరవస్తువులను అంటునటులు హృదయమును కళాసాక్షాత్కారమున గోచరించు చంద్రజ్యోతియందు లీనము గావించి వెదుకనేర్చినచో వేదాంతరహస్యము (బ్రహ్మము) కన్పించును.

ఆ. జననమరణవేళ స్వాతంత్ర్యమూ లేదు
తేను లేదు మున్ను పోను లేదు
నడుమఁ గర్తననుట నగుఁబాటు గాదటే, వి...

మానవునకు జన్మమున మరణమున స్వాతంత్ర్యము లేదు. ధనము వెంటతీసికొని వచ్చుట లేదు. ఆర్జించినది కొనిపోవుట లేదు. ఇటులుండ అవివేకులు మేమే యన్నింటికిఁ గర్తలమనుట నవ్వులబాటు కాదా!

ఆ. జాతికులములంచు జనులెల్ల బద్ధులై



భావపరమునందు ప్రాలుమాలి
చచ్చుపుట్టుచుంద్రు జడమతులై భువి, వి...

జాతి యని కులమని ఎల్లజనులు బద్ధులై వివేచనశూన్యులై జననమరణములను జడత్వమువలన పొందుచుందురు.

ఆ. జాతిమతము విడిచి చని యోగిగా మేలు
జాతితోనె యున్న నీతివలదె
మతము బట్టి జాతి మానకుంట కొఱంత, వి...

యోగిగా నెంచినవాఁడు జాతిమతములను వదలుట మంచిది. జాతి నాశ్రయింతుమేని నీతి నెన్నఁటికి వదలరాదు. ఏమతము వాఁడైనను జాత్యనుచారములగు దురాచారముల వదలకుంట దోషము.

ఆ. జీవభావ మెఱుఁగఁ జెడ దెన్నటికి మతి
దైవమును నెఱుంగ దనరు బుద్ధి
తేజ ముదయమంద దిమిరంబు నిల్వదు, వి...

జీవమర్మమును తెలిసికొని యున్నచో తేజము గలిగిన తిమిరములు నిలువనట్టులనే విఘ్నములు లేక బ్రహ్మత్వము నొందఁ గల్గుదురు.

ఆ. జీవవశమురీతి చిన్మాత్రతను మించి
భావమమత నమరు పట్టుఁ బట్టి
కలియుహంస మదిని గర్మసన్న్యాసియై, వి...

జీవునకు వశంగతమైన చిన్మాత్రతను అతిక్రమించి భావమును

బ్రహ్మముపై నెలకొల్పి హంసను కదిసి కర్మసన్యాసి వగుదువేని కడతేరఁగలవు.

క. జపదాఁట నేల గుఱిగా
భవహారమగు భక్తి బూని పరిపక్వముగా
ధ్రువమైన బయలు జేరఁగ
శివ మన్మయచిన్మయంబు చేకురు వేమా! 1840

లక్ష్యమును విసర్జింపక పాపములఁబోకార్చి ఈశ్వరునియందు భక్తి గలిగియున్నచో కర్మము పరిపక్వమై చిత్స్వరూపము నొందఁగలఁడు.

ఆ. జాలి నొందరాదు జపదాఁటి కనరాదు
ఆదిమూలమైనయాత్మ మఱుఁగు
పోరిచేరి పొంది పూర్ణము నందురా, వి....

ఆత్మరహస్యమునకుఁగల మూలతత్త్వము కాంచఁజాలమైతిమేయని విచారపడినను యోగనియమములు పరిత్యజించినను లాభములేదు. ఇంద్రియముల జయించి ఈశ్వరతత్త్వము నొందవలయును.

ఆ. జ్ఞాననిష్ఠఁ బూని మేను మఱచువాఁడు
కామిగాఁడు మోక్షకామిగాని
నీమనిష్ఠ లుడిపి నిర్గుణ మందురా, వి... 1842

జ్ఞాననిష్ఠ కలిగి నిస్పృహుఁడై యుండువాఁడు మోక్షకామియగుఁగాని కాముకుఁడు కాఁజాలఁడు. కావున నియమనిష్ఠలు మాని నిర్గుణబ్రహ్మము నొందుము.



క. తక్రముతో నుద్భవమై
తక్రమ్మున దేలు వెన్న తరబడి సంసా
రక్రమమున బుట్టియు మన
చక్రము గుర్తింప నగును జతురత వేమా!

తక్రము (మజ్జిగ)లో బుట్టి దానినుండి వేఱుపాటునొంది పరిదృశ్యమానమగు వెన్నవలె సంసారమునఁ బుట్టియు నద్దానినుండి జ్ఞాన మేర్పడవలయును.

క. తననిజరూపము జూడం
గను దగుమార్గంబు తెలియఁ గావలె నన్నన్
ఘనగురునియండ జేరక
యొనఁగూడదు నె సాముఁ జేయ నుర్విని వేమా!

ఆత్మరూపము నరయవలయునని కోరిక గలిగియున్నచో గురునియండను జేరి మెలఁగవలయును. లేకున్నచో నెంతవానికైన యాత్మరూపము గోచరింపదు.

క. తనలోపల సకలంబును
తనరం దా నగుట నెఱిఁగి తారక మాత్మం
గనుఁగొనుచుఁ బరిణమించిన
మనుజునకును ముక్తి గలదు మహిలో వేమా!

తనలోనే సమస్తమును గని తానె సమస్తస్వరూపుఁడగునట్లు భావించి తారకమును బాగుగా గుర్తించి సమత్వము నొందిన వానికి ముక్తి యవశ్యము గలదు.

క. తనలో సర్వం బుండఁగ
దనలోపల వెదుకలేక ధర వెదకెడి యీ
తనువుల మోసెడియెద్దుల
మనములఁ దెల్పంగవశమె మహిలో వేమా!

తత్త్వమంతయుఁ దనయందేయుండఁగా నెచటనోగలదని వెదకసాగుఅవివేకులు దేహభారము మోయుపశువులవంటివారు. వారికి తత్త్వబోధగావించుట యశక్యము.

క. తనమతమును తా నెఱుఁగఁడె
మనమున్కఁ గలపోయ నెవని మార్గం బగునో
యనయము నీజాలంబును
గని మెలఁగుట ముక్తి కిరవు గదరా వేమా!

తాను మోక్షార్థమై యవలంబించు మతమేదియో తా సే మార్గము నాదర్శముగా నుంచికొనెనో యనునంశము అందలిరహస్యము గుర్తించుటయే ముక్తిప్రధానకారణము.

క. తనుఁ దా దెలియుట తత్త్వము
తన కన్యులు బోధసేయ ధరలో గలరా
తనుఁ దాఁ దెలియక యుండిన
తన కెవరును తెలుపలేరు తథ్యము వేమా!

తత్త్వమనఁ దన్నుఁ దాఁ దెలిసికొనుటయగును. ఈవిషయమును దృష్టాంతసమన్వితముగ నెవరు దెలుపలేరు. స్వయముగా నీవిషయమును గ్రహింపఁజాలనివాని కెవరు బోధింపఁజాలరనుట సత్యము.



తే. తాను తానైన బయలున దనరి బుద్ధి
పూనికను నిల్చునప్పుడే పూర్ణమంది
నిర్ణయో నాస్తి సర్వత్ర నిండునదియె, వి...

జీవుఁడె యీశ్వరుఁ డనుభావమును గ్రహించి నిశ్చలమగు సమాధియోగమునొందుట పూర్ణతత్త్వము. ఇందునకు శాస్త్రీయములగు నిర్ణయములు లేవు. ఆత్మతత్త్వము సర్వత్ర నిండి యున్నది.

ఆ. తావు లేనిచోట తావు తానై యుండు
తావు గలుగుచోటఁ దాను లేఁడు
తావు తానె యైనఁ దత్త్వంబు తెలియునా? వి.

శూన్యమునఁ బూర్ణుఁడై పూర్ణమున శూన్యుఁడై చిత్రముగా పరాత్మఁడు వెలుఁగుచున్నాఁడు. తావు తత్త్వము అయియున్న ఈశ్వరునిమహిమ గుర్తింపుము.

క. తొమ్మిదితొఱ్ఱలతిత్తిని
నమ్మి శివుని దలఁప లేక నశియింతువు నీ
విమ్మహి గృధ్రచయంబులు
సమ్మతిగా నిన్ను దినును చక్కఁగ వేమా! 1851

నవరంధ్రమయమగు నీశరీరమును నమ్మి ఈశ్వరుని సేవింపవేని నశింతువు. ఇయ్యది (దేహము) చివరకు గద్దలపాలగునేకాని యుపయోగింపదు.

ఆ. త్రాడు పాముటంచు తాఁ జూచి భయపడుఁ

తెలిసి త్రాడటన్న దీఱు భయము
భయము తీఱినపుడె బ్రహ్మంబు తానగు, వి...

అజ్ఞానమునఁ ద్రాడే పామని నమ్మినచో భయము కలుగుచుండును. అట్టిభయజనకమగు భ్రాంతి తీఱినా ఆనందము కలుగును. అటులే సంసారము భ్రాంతిగాని నిజముకాదని తెలిసెనా? ఆనందమయమగు బ్రహ్మము లభించును.

తే. దర్పణంబున దనరూపు తగిలినట్లు
నేర్పు గలిగినమదిలోన నీదురూప
మర్పణంబుగ నెఱుకలో నడచిచూడ
నోర్పు కలవాఁడె నేర్చు తా నొనర వేమ! 1853

అద్దములోఁ దనరూపమునుజూచునట్లు హృదయమున నీశ్వర రూపమును సందర్శింపనేర్చి జ్ఞానశాలివై వర్తింతువేని మోక్షము నీకు సులభసాధ్యము కాఁగలదు.

క. దాపున నున్నది యద్దము
రూపున నీరూపుఁ జూచి రూఢిగ గనియా
పాపకు లోనగుచూపున
బ్రాపై శివుఁడుండుఁ గనుము పసుపడి వేమా!

జ్ఞానమను అద్దము నీకు సమీపముననే యున్నది. అందు నీ యాత్మతత్త్వమును గుర్తించి దర్శించి యంతర్దృష్టిలో నిలచి యున్న ఈశ్వరస్వరూపమును దిలకించుటకుఁ బ్రయత్నింపుము.

ఆ. దూరమాలోచనలకు దూరమౌ దైవము



తనువు దూరమైనఁ దగులునపుడు
జీవి దవ్వుచేయ దేవుఁడై నిలుచును, వి...1855

ఆలోచనలను చేయుచు కాలక్షేపము గావించుచో దైవము మిగులదూరమగును. ఆలోచనలు దేహమునకు దూరముగావించినచో బ్రహ్మముసమీపించును. ఆలోచన లంతరింపఁగనే మానవుం డీశ్వరత్వమును బడయును.

ఆ. దేహమూలమందు దేహి దేవుఁ డటంచుఁ
దెలిసియున్న బుధులు తీర్థయాత్ర
లరయ బోరు జగతి నాత్మ తామై యునికి, వి.

శరీరములో నున్న జీవియే దేవుఁడని తెలిసినబుధులు (అనఁగా: జ్ఞానులు) తామె దేవరూపులు గనుక తీర్థయాత్రలకుఁ బోవరు. తామె యాత్మరూపులమని యెఱుంగుదురు.

ఆ. దొమ్మ మాయఁ కొఱకు నమ్మవారికి వేఁట
లిమ్మటం ద్రిదేమి దొమ్మతెవులొ?
అమ్మవారిపేర నందఱు దినుటకా, వి... 1857

గ్రామములలో నేవేనివ్యాధులు ప్రబలినచో నది నివారించుటకు అమ్మవారికి వేఁటలను బలియిమ్మని కొందఱు బోధించుచుందురు. అదియేమిరోగమో యట్లుచెప్పుటకు? అమ్మవారి పేరుతో బొట్టనిండఁ దినవలెనని కాఁబోలును.

ఆ. ధాత్రిజనుల కెల్లఁ దగ నెఱింగించెద
నొనర హారు నెఱుంగు నుపమ యొకటి
మనసు చెదరనీక మహిమతోఁ జూచుటే, వి...

ఈశ్వరుని చూచుటకు మనస్సును నిశ్చలముగా నుంచుట యొక్కటియే మంచియుపాయము. ప్రపంచమున కంతటికిని సులభోపాయము నెఱుఁగఁజేయుచున్నాఁడను.

క. నాదము దెలిసినయోగియె
వేదాంతములోన నున్నవిధి దెలుపుమది
న్నాదంబె ముక్తిపదమని
యాదరమున జనులతోడ ననరా వేమా! 1859

ప్రణవనాదము నెఱింగిన యోగీశ్వరుఁడు వేదాంతమునందు గలమూలతత్త్వమునంతయు బోధింపఁ గలుగును. ప్రణవనాదమే ముక్తిపదమని యనుభవవిదులు లోకములో సాటనగును.

ఆ. నాదునాదు గూడి నామరూపంబైన
నాదులోన నాదు నాటియుండు
వాదుఁ జేయువారు వర్ణింపలేరయా, వి...

శబ్దము శబ్దమును ఒక్కటిగా చేరి నామరూపాదుల నొంది ప్రపంచమునందంతటను వ్యాపించియుండును. కాని దీనిని మూర్ఖులు తెలిసికొనఁజాలరు.

క. నాలుగువీథుల మధ్యను
మేలుగ బ్రహ్మంబు నుండ మెలఁకువతోడం
జాలగ గురుమూలంబున
వీలుగఁ బొందంగ నగును వినరా వేమా! 1861

నాలుగుతత్త్వములతోఁ గూడికొని బ్రహ్మము జాగ్రదవస్థ



నొందియుండును. కావున గురునిసాయమునఁ గృషిచేసి బ్రహ్మమును బడయుటకు శక్తికొలఁది ప్రయత్నింపుము.

ఆ. నిజము వరుస నెఱేఁగి నిర్గుణత్వం బంద
పలుకులోనిశబ్ద మలర దెలియఁ
బలుకకుండువాఁడె పరమాత్ముఁ డందురు, వి....

సత్యమును గ్రహించి నిర్గుణస్వరూపమగు బ్రహ్మము నుపాసించి ప్రణవనాదమును భక్తిశ్రద్ధలతో నాలించి యానందించు ధన్యుఁడు పరమాత్మతో సమానుఁడని చెప్పుదురు.

తే. నిత్యసత్యనిరామయనిర్గుణంబు
మృత్యుసమదృష్టిలో నెంచి మిన్నకుండి
భృత్యభృత్యానురాగుఁడై భ్రుకుటి నంటి
నృత్యమాడుచు నుండు[illegible] నియతి వేమ! 1863

నిత్యము, సత్యము, నిరామయము, నిర్గుణమునగు బ్రహ్మమును, మృత్యువును సమానదృష్టితోఁ గాంచుచువిషయాదు లుజ్జగించి పరిజనమును ప్రేమించుచు భ్రుకుటియందున్నజ్యోతి నంది నృత్య మాడుటయే యోగనియమ మనఁబడును.

తే. నిత్యసత్యవ్రతాచారనిపుణుఁడ వయి
పరమధర్మార్థములనెల్లఁ బట్టి చూచి
సిద్ధిబొందెడి పరిపూర్ణచింతఁ బూను
మప్పు డానంద మమితమౌ నయ్య వేమ! 1864

సత్యాచారము నవలంబించి ఉత్తమధర్మముల నభ్యసించిసిద్ధి

నొందుట సర్వదా ప్రయత్నించుచుండుము. అందువలన ఆనంద మమితముగా లభించును.

క. నిత్యానందవివేకము
సత్యంబుగ దెలియకున్న శక్యంబగునా
ముత్యము సరిగురుమర్మము
భృత్యుఁడవై మది నెఱుంగఁ బెంపగు వేమా!

నిత్యానందమగు కైవల్యము తద్విషయిక జ్ఞానములేనివానికి లభింపదు. నిర్మలుఁడగు గురుని సేవించి భృత్యభావముతో బ్రహ్మవిద్య నభ్యసింపుము.

ఆ. నిద్రమేలు తెలిసి నిలువుఁడీ మీలోన
బ్రాణిమేలు తెలిసి బాయకుండుఁ
బ్రాణి నిదురసందు పరమాత్మఁ డుండును, వి...

జాగ్రదవస్థయందలి సుగుణము గ్రహించి దాని నవలంబించి జీవి కెంతయో మేలు కలుగును. ప్రాణికి సమాధికిని మధ్య పరమాత్మఁ డిమిడియున్నాఁడని మనస్సులో గ్రహింపుము.

క. నిను నీ వెఱుఁగఁగ నెంచిన
మనమున సంకల్పములను మానఁగవలెరా
అనుమానరహితముగ గుఱి
వినయంబున గురుని బట్టి వెదకుము వేమా!

ఆత్మతత్త్వము నీ వెఱుంగఁదలంచితివేని యితరసంకల్పముల నన్నిఁటిని మానుకొనవలయును. అనుమాన రహితమునకై గుఱి



గలగురుని నాశ్రయించి వినయముగ శుశ్రూషఁ గావింతువేని కృతార్థుఁడ వగుదువు.

ఆ. నిన్ను జూచుచుండ నిండును తత్త్వంబు
తన్ను జూచుచుండ దగులుమాయ
నిన్ను యెఱిఁగినపుడె తన్ను దా నెఱుఁగును, వి.

ఆత్మను సందర్శింపఁ జాలుదువేని తత్త్వము లభించును. నిన్ను నీవు చూచుకొందువేని మాయఁ దగులుకొనును. ఆత్మతత్త్వము నెఱుంగుదువేని బ్రహ్మము నీయందె కనిపించును.

ఆ. నిర్మలాత్మవిద్య నిత్యసత్యజ్ఞాన
నిరతుఁడైనవాఁడ నేర్పుమీఱ
ననుభవింపఁ గోర నలసట బొందును, వి...

నిర్మలమగు నాత్మ విద్యను నిత్యసత్యవ్రతనిరతుఁ డగువాఁడు ఎన్నికష్టముల కైన నోర్చి యభ్యసించి యనుభవింపఁ గోరునే గాని వదలివేయఁబోఁడు.

క. నీతియు భక్తియు జ్ఞానము
రీతుల వర్తించు మదిని రేవెలుఁగగుచుఁ
జ్యోతిని నాదగు బ్రహ్మము
భూతాత్ముఁడు నిన్నుఁబొందు బోడగను వేమా!

నీతి, భక్తి, జ్ఞానము అనురీతులలో మెలంగుచు హృదయము నందలి జ్యోతిస్స్వరూపముతో లీనుఁడవగుచు నందుదయించు ప్రణవనాద బ్రహ్మముతోఁ గలసికొనుటకుఁ బ్రయత్నము చేయుము.

క. నీలోని యెఱుక యనునది
నీలోననె పెరిఁగి పెరిఁగి నీలో నడఁగుఁగ
నీలోని చిత్ర మడఁచిన
నాలోనన బ్రహ్మ బయలు నందును వేమా!

హృదయాంతరస్థమగు జ్ఞానము పెరిఁగి పెరిఁగి యందే లీనమగును. నీలోని చిత్రములను బరికించి అడంచినచో బ్రహ్మ మట్టివానికి బహిరంగమై గోచరించును.

ఆ. నీళ్ల మునుఁగ నేల నిధుల మెట్టఁగ నేల
మొనసి వేల్పులకును మ్రొక్క నేల
కపటకల్మషములు కడుపులో నుండఁగా, వి...

హృదయమున పాపవర్తనము మోసము ఉన్నంతవఱకు పుణ్యతీర్థములలో మునిఁగినను నిధులలో నివసించినను వేల్పులకుఁ బ్రాణాచారములు సల్పినను ఫలములేదు.

క. నీవనినను నేననినను
భావమ్మున నెఱుక యొక్క పద్ధతి యగునా?
భావంబు దెలిసి మది ని
ర్భావముగా నిన్ను గనుట పరమగు వేమా!

నీవు నేను అని వాదులాడుకొనుభావము జ్ఞానపురీతి గాదు. మరి యేదియందురా, ఈశ్వరతత్త్వ మెఱింగి నిర్భావముగా ధ్యానించుటయే పరమునొందు సాధకము.

ఆ. నీవు నిలిచియుండు నిఖిలంబు నిలువదు
నిలిచియుండు నెండ నీరువలెను



నీవు నిశ్చయంబు నిఖిలంబు మాయయౌ, వి...

ఈశ్వరా! నీవు నిలచియుందువు. సమస్తవస్తువులు కొలఁది కాలములో నశించునవియె. నీవలన వెలుఁగు సూర్యుని తేజము గూడ నీరువలె నెన్నఁడో మాఱిపోవును. నీవొకఁడవె సత్యస్వరూపుఁడవు. లోకమంతయు మాయయే.

ఆ. నీవు పలుకుచున్న నిత్యపూజితుఁ డౌను
నీవు పలుకకున్న నిదురపోవు
నీవు పలుకుపలుక నిర్మలుం డగునయా, వి....

ఈశ్వరుఁడు జీవరూపమున హృదయమునఁ జేరి పలుకుచో మానవుఁడు పూజ్యుఁడగును. ఈశ్వరుఁడు పలుకఁడేని జనుఁడు మరణించి నటులే! ఈశ్వరప్రేరితుఁడై పలుకువాఁడు పాపరహితుఁ డనఁబడును.

ఆ. నీవు వినగ నొకటి నిలిచి యుండఁగ లేదు
నిలువ నెండమావి జలములట్లై
నీవు నిన్నెఱుఁగుట నిశ్చయం బాయెరా, వి...

ఈశ్వరా! నీవువినాగా లోకములో స్థిరమైనపదార్థము వేఱొకటిలేదు. ఇతరములు ఎండమావులలో జలమువలె భ్రాంతిజనకములె గాని స్థిరములు గావు. నీ ప్రభావము నీవు తప్ప సామాన్యు లెఱుంగఁ జాలరనుట సత్యము.

ఆ. నేయి వెన్న కాఁచి నీడనే యుంచిన
పేరి గట్టిపడును పెరుఁగు రీతి
పోరిపోరి మదిని పోనీక పట్టుము, వి... 1877

వెన్న కాచి సిద్ధము చేసినదైనను నేయి నీడనుంచిన గట్టి పారినట్టులే పరిపక్వముచేసినను మనస్సును కొంచె మేమరి నచో లోఁబడదుగాన నెటులేని దాని లోఁబఱచికొనుము.

ఆ. పంచభూతములను పరఁగ వలను బట్టి
సంచరింపకుండు సరణి దెలిసి
వేఁటలాడి బెస్తవాటంబు నెఱుఁగుము, వి...

పంచభూతములను జ్ఞానమనువలతో పట్టి చలనము లేకుండఁ గట్టివైచి వేఁటాడి వేఁటవానినిబోలె వశపఱచికొనవలయును.

ఆ. పంచఋషులు భువిని పరమపవిత్రులు
మించి లోకమునకు మేలుకొఱకు
సంచితార్థములను సమసింపఁ జేయరా, వి....

ఏవురు ఋషులు కేవలము లోకోద్ధరణమునకు మాత్రమే పుట్టియున్నారు. వారు సమస్తపాపములను పోఁగొట్ట శక్తి గలవారలు. వారిసేవించి సంచితములఁ బోకార్చుకొనుము.

ఆ. పంచముఖములందు పంచాక్షరి జనించె
పంచవర్ణములను బ్రబలె జగము
పంచముఖుని మీరు బ్రస్తుతి సేయుఁడీ, వి. 1880

పంచముఖుఁడగు నీశు నైదుముఖములనుండి పంచాక్షరి జనించెను. కావున పంచాక్షరీజనకుఁడగు నీశుని నుతింపుఁడు. ఆపంచవర్ణములనుండియే ప్రపంచమేర్పడినదని గ్రహింపుఁడు.

ఆ. పంచవర్ణ మెఱుఁగ పరము నెఱుంగును
పరము నెఱుఁగ నిచ్ఛ ప్రజ్వరిల్లు



ప్రజ్వరిల్లువాఁడు పరము తా నగునయా, వి.

పంచాక్షరిమంత్రములోనితత్త్వ మెఱింగినచో పరునిగూడ నెఱుఁగఁగల్గును. అట్టివాఁడు తానే పరముఁ డగును.

క. పడయఁగ రానిది పూర్ణము
తడఁబడకలమననమందు దలపడినంతం
జిడిముడి లేకటు నిల్చిన
విడనాడఁగ బట్టబయలె వెలయును వేమా!

సామాన్యజనలభ్యముగానియట్టి పరాత్ముని పూర్ణస్వరూపము తత్తఱపాటు లేనిమనములో మననము చేసిన బ్రహ్మము బట్టబయలువలె గోచరించును.

క. పసుపడి నిర్గుణ మనునది
తన కెద్దియుఁ దోఁపఁ బోదు తత్త్వ మెఱుఁగకే
మననాంతరంగమందును
వినయం బగుబయలు జేరి వెలయును వేమా!

నిర్గుణమనునది ఏదియును తత్త్వము నెఱుంగనంతవఱకు బాహ్యచక్షుస్సులకు గోచరింపదు. హృదయము ధ్యానానుకూల మొనరించినచో చిత్స్వరూపమును జేరును.

తే. పరమసిద్ధాంతమగునట్టి బయలు చేరి
పట్టువిడుపులు వదలి తాఁ బ్రాఁకి నిలిచి
పట్టినని లోకపాశంబు వదల నగును, వి...

ఉపనిషత్ప్రతిపాదితుఁ డగునీశ్వరుని ననవరతము ధ్యా

నించుచు సన్నిహితుఁడై పట్టువిడుపులను విడచి లోకవ్యామోహ మును మాని వర్తించుట మోక్షార్థికిఁ గర్తవ్యము.

ఆ. పరుస మినుము సోఁక బంగారమైనట్లు
కప్పురంబు జ్యోతి గలసినట్లు
పుష్పమందు దావి పొసఁగినట్లగు ముక్తి, వి...

ఇనుము పరుసవేది సంస్పర్శమున బంగరైనట్టులనే, కర్పూరము జ్యోతిలో లీనమైనట్టులనే, పువ్వులో దావి యున్నట్టులనే జ్ఞానము ననుసరించి ముక్తి గలదు.

ఆ. పరమసిద్ధికొఱకుఁ బాపల నిగుడించి
శ్రవణమననవృత్తి సంగ్రహించి
యెఱుక మఱచువాఁడె యేకాగ్రచిత్తుఁడు, వి.

పరాత్మసిద్ధికొఱకు దృష్టినిగుడ్చి శ్రవణమననములను పెద్దల వలన నేర్చి చేయుచు నేకాగ్రచిత్తుఁడై యైహికజిహాసువగు వాఁడు ముక్తుఁడగును.

క. పరమాత్ముని-చింతనలో
దఱుచుగ నుండుటయె తగును ధర నాఁకటికిం
గిరిపము నెత్తి భుజించుచు
దొరవలె గృహవేదికందు తొంగుము వేమా!

దైవచింతనతోఁ గాలముగడపుచు భిక్షాన్నముతో నాఁకలిఁ దీర్చుకొనుచు నిదురవచ్చినపుడే యరుగుమీఁదనైన శయనించు చు కాలముగడుపుట యోగి కవసరధర్మము.



క. పరిశీలించినజ్ఞప్తిని
గుఱినిల్పెడుభక్తిచేత గోర్కు లడఁగెడిన్
స్థిరరూప మంది పొందెడు
పరిపూర్ణసమాగమంబుఁ బడయుము వేమా!

జ్ఞానమును సాధనముగాఁ జేసికొని యీశ్వరతత్త్వము గుర్తింపఁగలిగినచోఁ గోర్కు లన్నియు నశించును. పిమ్మట స్థిరతరమైన మోక్షమును బొందుటకుఁ బ్రయత్నముచేయుము.

ఆ. పలుకులోనిపలుకుఁ బరగంగఁ జూచినఁ
బలుకులందు బ్రహ్మపదము గలుగు
పలుకుఁ గాన లేక పరువు దప్పిరి జనుల్, వి...

ప్రణవములోని యంతస్తత్త్వములను విమర్శించినచో అందును బ్రహ్మము నెలకొనియుండును. గాని మూర్ఖులు గొంద ఱిద్దానిఁ దెలియలేక చెడిపోవుచున్నారు.

ఆ. పలుకులోనిబిందు పలరంగఁ గావలె
పలుకులోనిదాని పదిలపఱచి
వేడుకైన దాని వితఁ బెట్టకుందురు, వి...

నాదమునందుబిందువవలె దానీశ్వరతత్త్వమునందు గలియఁ బ్రయత్నించుచు ప్రణవనాదమును బలుకులయందె లగ్నము గావించి వినోదమునకైన బ్రహ్మానుభవమును వదలకయుండు వాఁడె యోగి నాఁబడును.

ఆ. పాశమునను జూడఁ బరగ దేహమునకు

హానివచ్చుఁగాన నదియుఁ జూచి
జ్ఞానదీపకళిక కడకొత్తవలెనయా, వి... 1891

మోహము, ఆశ, కామము లోనగునవి పాశములవంటివి. వానికి లోఁబడినచో మానవుఁడు బంధితుఁడై హానిచెందును. కావున హృదయమున జ్ఞానదీపమును ప్రజ్వలింపఁజేసినచో పాశములు వ్యర్థములగును.

ఆ. ప్రాణమందు శివుని భావించి తెలియక
ముద్ర లనుచు బడెడిమూఢులార
ముద్రలందు లేదు మూలమందే కాక, వి....

ప్రాణమునం దున్నశివుని భావింపలేక ముద్రలు ముద్రలని బలుకుచుందురు. మూర్ఖులార! దైవము మూలమునందే కలఁడు గాని ముద్రలలో లేఁడని నమ్ముఁడు.

ఆ. బ్రదుకువార లెవరు బ్రదుకకుండు రెవరు
బ్రదికి బ్రదుక లేనిప్రాణు లెవరు
శ్రుతిని శోధజేసి స్థిరముగాఁ జూడరా, వి...1893

చక్కఁగా వివేచనఁ జేసి చూచినచో నీప్రపంచమునందు బ్రదుకువారు బ్రదుక గలవారలు బ్రదుక లేనివార లెవ్వరెవ్వరో తేటతెల్లమగును. అందఱు నస్థిరులే.

క. భగవంతుఁడైన దేవుఁడు
జగముల దనలోనఁ బెంచి జాలముజూపుం
దగురీతి నిండా నన్నిఁటి
నగణితుఁడై వెలయుచుండు ననువుగ వేమా!



షడ్గుణైశ్వర్య విరాజితుఁడగు దేవుఁడు జగము తనలోనే పెంచి మాయఁజేసి తా నాజగము లన్నిటిలోనునిండి వర్ణింపరాని విధమున వెలుఁగుచున్నాఁడు.

క. భగవంతుని ప్రతిబింబం
బగు నీశుం డొరసి మాయ నగులోకమునం
దగభోజ్యమునగు జీవుం
డొగి భోక్తయె విద్య గూడి యొప్పుఁగ వేమా!

భగవంతుని ప్రతిబింబమగు నీశ్వరుఁడు జీవుఁడై జ్ఞానశాలియై యొప్పుటచేత మాయావృతమగు సమస్తమును భోజ్యముగాఁ జేసికొని తాను భోక్తయై శాశ్వతముగ నెలకొనియున్నాఁడు.

తే. భద్రమైనమనసు బలపడినంతట
వద్దఁ దగును పరము వశముగాను
నిద్రలోనినిద్ర నిలుపుకొనుచుఁ జూడు, వి...

మనస్సును జాగ్రత్తగా బలపఱచినచో సమాధియలవడును. అటుపైని ధ్యానమునుండి ఈశ్వరతత్త్వము బయలపడి సమీపస్థితమగును.

క. భయముసుమీ యజ్ఞానము
భయ ముడిగిన నిశ్చయంబు పరమార్థంబౌ
లయముసుమీ యీదేహము
జయము సుమీ జీవుఁ డనుచు సాటర వేమా!

అజ్ఞానము భయంకరమైనది. అయ్యది పోయిన పరమార్థము

తెల్ల మగును. ఈశరీర మెప్పటికైనను లయమగునదియే యనియు జీవుఁడు స్థిరముగా నుండు ననియు సాటి చెప్పుము.

ఆ. భానుసోమవహ్నిభవ్యలోచను మదిఁ
దలఁపకున్న ఫలము గలుగఁ బోదు
ఇహపరంబులకు మహేశ్వరుఁ డతఁడౌట, వి...

సూర్యచంద్రాగ్నులు నేత్రములు గాఁగల ఈశ్వరుని మదిలో దలంపనివారికి ఇహపరముల కధినాథుఁ డగు నీశ్వరుని యనుగ్రహము లేనివారికి మోక్షము లభింపదు.

ఆ. భార్యమీఁద నాశ పరగు బురుషునకు
మగనిమీఁద నాస మగువకుండు
శివునిమీఁద నాశ సిద్ధునకుండుఁగా, వి...1899

భార్యను ప్రేమించిన భర్తనుకూడ భార్య ప్రేమించును. ఇయ్యది ప్రపంచలక్షణము. ఇట్లే ముక్తుఁడగు సిద్ధునకును శివునకును పరస్పరము ప్రేమ యుండును.

ఆ. భావ మరయ వేఱె పరదేశమున లేదు
తాను జేయుపనులఁ దగిలియుండు
భావమందు శివుని పరికింపుచుండుము, వి...

భావము భావ మనఁగా ఎచ్చటనో లేదు. తాను చేయుపనుల నంటియున్నది. తనభావము దానుపరీక్షించినచో దనయందే ఈశ్వరుఁడు నంతర్యామియై యున్నాఁడుగానఁ బరికింపుము.

క. భావాభావము లంటక
సేవించెదను బట్టబయలు స్థిరమతిలోనన్



కేవలము శివధ్యానము
తావరమును గన్నవాఁడె ధన్యుఁడు వేమా!

భావము అభావములను అంటుకొనక బట్టబయలుగ చిత్స్వరూపము హృదయస్థమై యున్నది. కేవలము ఈశ్వరధ్యానము గావించుధన్యుఁడామహాత్స్వరూపమును సందర్శింపఁగలుగును.

తే. భాష లెన్నిటిలోనైన భావ మొకటె
వేషములలోన జిక్కనివిధ మెఱుంగు
పోషకుండని తలఁచుట పొందు గాదు
దోషమున్న నెఱుంగుము తొలుత వేమ! 1902

భావము నెదటివాఁడు గ్రహింపకుండుటకుఁ బెక్కుభాష లుపయోగించుచున్నారము. అటులే యీశ్వరుఁ డొకఁడయ్యు సర్వజనసాధ్యుఁడు కాకుంటకుఁ బెక్కువేషములతో నున్నాఁడు. ఈశ్వరుఁడు సర్వజనపోషకుఁడుగదా నన్ను గాపాడఁడా యని తలంపఁదగదు. ఆత్మదోష మెఱుంగనివాని నీశ్వరుఁడు కాపాడఁ జాలఁడు.

క. భువనాకారుని మదిలోఁ
బ్రవిమలశుభమూర్తిగాను బరికించినచో
భవనాశమగును బూర్ణుఁడు
శివదేవుఁడు చిన్మయుండు స్థిరుఁడగు వేమా!

ప్రపంచాకారుఁడగు నీశ్వరుని శుభమూర్తిగా నెంచి హృదయమున సందర్శింపఁగలిగినచో జ్ఞానమయుఁడగు నాదైవము స్థిరముగా హృదయస్థుఁడై గోచరించుచునే యుండును.

ఆ. మంట లోహమందు మ్రాకుల శిలలందు
పటములందు గోడ బ్రతిమలందు
దన్నుఁ దెలియుకొలఁదిఁ దగులదా పరమాత్మ, వి.

మంట లోహము మ్రానులు శిలలు పటములుఁ బ్రతిమలు మున్నగువానియం దెల్లయెడలను పరమాత్మ నిండియే యుండును. అటులే నీయందును నిండియున్నదని గ్రహింపుము.

ఆ. మంటికుండవంటి మాయశరీరంబు
చచ్చు నెన్నఁడైనఁ జావ దాత్మ
ఘటము లెన్నియైన గనన మొక్కటికదా, వి...

మృద్ఘటమువలె నున్నసీశరీర మెప్పుడో యొకప్పుడు నశించును గాని ఆత్మ నశింపదు. ఆకాశప్రతిబింబము గల కుండలు పెక్కులు నశించునుగాని ఆకాశము నశింపదుగదా!

ఆ. మడియువాఁ డెవండు మడియని దెవ్వఁడు
పాటుఁ జేసి చూడ బట్టబయలు
సోరది జలఘటమున సూర్యునిచందము, వి...

జలఘటములోని సూర్యబింబమువలె నీప్రపంచమున్నది. బాగుగా యోచించి చూచినచో నిందు రహస్యమేలేదు. లోకములో స్థిరముగానుండువాఁ డెవఁడు? గతించువాఁ డెవఁడు? అంతయుం మిథ్య.

ఆ. మది నెఱిఁగినవాని మహి గాన మెందును
మది నెఱుంగువాఁడె మహి మనుజుఁడు
వెదకి తనువులోన వేడ్కతో నిను జూచు, వి...



మనస్తత్వమును బాగుగా నెఱింగినవారు చాలయరుదుగానున్నారు. మనస్సు నెఱింగినవాఁడె మనుష్యుఁడనఁదగువాఁడు. అతఁడు తనహృదయము శోధించి యందు నీశ్వరుని గాంచఁగలిగియున్నాఁడు.

ఆ. మనముఁ జూచి గెల్చి మనములో సుఖియింప
గడకు మోక్షపదము గను నచటనె
చెట్టుఁ బెట్ట ఫలము చేకురదే దాన? వి... 1908

మనస్తత్వమును జూచి దానిగెల్చి సుఖించినవానికి మోక్షతత్త్వము మనస్సులోనె గనుపట్టును. చెట్టుబెట్టి పోషించినచో ఫలము గలుగుటలో నాశ్చర్యమేమున్నది?

ఆ. మనసునందు ముక్తి మలయుచు నుండఁగ
మనసు నెఱుఁగ లేనిమనుజు లెల్ల
మనసు నంట లేక మాయమై పోయిరి, వి...

మనసులోనే ముక్తియుండఁగా మూర్ఖులై మనుజులందఱును మనస్సును తెలిసికొనలేక నశించిపోయిరి.

ఆ. మనసు ముక్తి యనుచు మది నెఱుఁగఁగ లేరు
మనసుచేతఁ దగిలి మాయ మైరి
మనసు తానయైన మర్మజ్ఞుఁ డగు యోగి, వి...

మనస్సే మోక్షమునకు సాధనమని సామాన్యమానవు లెఱుంగఁజాలక మనశ్చేష్టలకు లోనై మాయమై పోవుచున్నారు. మనస్తత్వము గుర్తించి లోఁబఱచికొన్న ధన్యుఁడే మర్మవిజ్ఞానియగు యోగీశ్వరుఁ డనఁబడును.

ఆ. మనసులోన శివుని మానక నిల్పిన
యోగి యగు నతండె యుర్విలోన
శివుని దలఁపలేనిచిత్తంబదేలనో? వి... 1911

హృదయమున శివుని నిలిపి ధ్యానించువాఁడు యోగియనఁ బడును. అటుల శివుని నిలిపి ధ్యానింపఁజాలనిమానవునకుఁ జిత్త మున్నను లేకపోయినను ఒక్కటియే.

ఆ. మాయరూపు రూపుమాయగాఁ జేసియు
మాయరూపును బెనుమాయఁ జేసి
మాయలోనిమాయ మఱి పరంజ్యోతిరా, వి...

అజ్ఞానావరణము సంతయుం జ్ఞానసాధనముచేఁ దొలఁగించుకొని మాయయే ప్రకృతిస్వరూపమను రహస్యమును గ్రహించి మాయాపురుషుఁ డనఁదగి జ్యోతిస్స్వరూపముతో నున్న బ్రహ్మమును దర్శింప యత్నింపుము.

ఆ. ముగురిలోన వెక్కు ముందు గానఁగ లేక
నరకమునకుఁ బోవునరులు గలరు
ముగురికందనట్టిమూలమూర్తి యొకండు, వి.

జనులు త్రిమూర్తులలో వారుగొప్ప వీరుగొప్ప యని చర్చింపఁబోయి తెలియక నరకమునఁ గూలుచుందురే గాని త్రిమూర్తుల నతిశయించి ఆదిమూర్తిని ఎఱుంగఁ బ్రయత్నింపరు.

ఆ. ముగురుమూర్తు లన్నమూలభావ మెఱిఁగి
మూలవానితోడ ముచ్చటాడి



సత్తు చిత్తు లోనిసారంబు తెలియురా, వి...

త్రిమూర్తు లున్నచోటును కని వారిని దర్శించి సత్తుచిత్తుల సారమును తెలిసికొని ముక్తుఁడ వగుము.

ఆ. మూఢజనుల కెల్ల మూలమై తగుయోగి
తారకంబు గాను దైవరూపు
బట్టబయలు జేసి పరమాత్మఁ జూపఁడో? వి...

మూఢజనుల కందఱికి తారకుఁడై సజ్జనుఁడగుయోగి దైవరూపము నెఱింగించి మనుజుల ధన్యులను చేయకయుండునా? కాన గురు నాశ్రయింపనగును.

ఆ. మేకచంకఁ బెట్టి మెలఁగుచు మందలో
భ్రమసి తిరుగు గొల్లపగిదిగాను
దేవు నెఱుఁగక పెఱదేవతల దలంచు, వి...

అవివేకులు మేఁకను చంకలోఁ బెట్టికొని మందంతయును వెదకుగొల్లవానివలెహృదయమునందున్న దేవుని గుర్తింపలేక పెఱ దేవతలను దలంచుచుందురు.

ఆ. మ్రానుఁ గాలవేసి మహిమీఁద నొకజాణ
పూని తిరుగుచుండెఁ బొందుగాను
కాలివేయు మ్రాను కడురమ్యమై యుండు, వి.

పరమాత్మయనుజాణ సంసారమను బండకొయ్యను కాలికిఁ దగిలించికొని లోకవ్యాపారమును బాగుగా జరుపుచున్నది. కాలికిఁ దగులుకొనియున్నసంసారమను బండకొయ్యే మనోహరముగా అనుకూలముగానున్నది. పరమాత్మకు దుఃఖకరముగలేదు.

క. ప్రాఁకున ననలంబుండును
ప్రాఁకటన నాయనలముపలె మనుజులలోనన్
డీకొని తా రాజిల్లుచు
నేకంబగు బ్రహ్మముండు నెప్పుడు వేమా! 1918

ప్రానులో నగ్ని యంతర్ధానమై యున్నయట్టులనే పరమాత్మ యును సమస్తమానవులహృదయములలో నేకరూపముగ బ్రహ్మము ప్రకాశించుచున్నది.

ఆ. రతి యొనర్పఁ బూని సతిని వేఁడినయట్టి
మతిని వేఁడి పరముమఱుఁగుఁ దెలిసి
గతిని గోరుచుండు ఘనయోగు లిలలోన, వి.

తనవలపులాడిని సంభోగార్థము ప్రార్థించినటుల పరమాత్మను మోక్షముకొఱకుఁ బ్రార్థించి తత్త్వము నెఱింగి కైవల్యమును సదా కోరుచుండువాఁడు యోగి యనఁబడును.

ఆ. రమ్యమైన మనసు రాజని యెంచుచు
గమ్యముగను దాని గట్టు టెఱిఁగి
మరగి పూర్ణపదవి మహిలోనఁ గానరా, వి...

సాధకుఁడా! నీహృదయము చదరంగములోనిరాజుగా భావించి దానిని గట్టువిధమును దెలిసికొని కైవల్యమును బడయుటకుఁ బ్రయత్నము చేయుము.

ఆ. రూప మడఁగ జీవరూపంబు గనరాదు
అట్టిరూప మడఁప నలవి గాదు
బ్రహ్మమడఁగకున్న బ్రహ్మంబు గనరాదు, వి...



మనుజుఁడు రూపమడఁగి మరణించుచో నీశ్వరతత్త్వ మన దగు జీవుని కనుగొన వీలుండదు. మనుజుఁడు గతించినను జీవుఁడు గతింపఁడు. అతఁడు నిత్యుఁడు. అనిత్యస్వరూపమగు బ్రహ్మము నెఱుంగుట బ్రహ్మకులసంభవము సాధనము కాదు.

ఆ. రూపవంతులట్లు రూపులు ముగ్గురు
వారివారి నెఱిఁగి గారవింప
మొదల తానె యుండి మోక్షంబు గల్గురా, వి.

త్రిమూర్తులు మంచియాకృతి గలవారు. వారిమువ్వుర నెఱింగి గౌరవింపఁ బ్రయత్నించుచో ముందు ఆత్మతత్త్వము తెలియును. పిమ్మట మోక్షముగూడఁ గలుగును.

ఆ. రూపుఁ జూచి మెచ్చి రూపింప నేరక
వేదశాస్త్రములను వెదకు టేల
దాపుగానె యున్న దర్పణ మట్టుల
శివుఁడు భావమందు జెలఁగు వేమ! 1923

బ్రహ్మస్వరూపము తనహృదయములో నున్నను ఇట్టిదని నిరూపింపఁజాలక వేదశాస్త్రములను వ్యర్థముగా వెదకఁ బూనెదరే కాని భావములోని శివుని కానఁజాలరు.

క. లలితశివతత్త్వపదమునఁ
గలిసిన శివయోగి యేల గలియు జగములన్
జలబిందువు ముత్తియమై
కలియునె తొల్లింటినీటఁ గనరా వేమా! 1924

ముక్తుఁడైనవాఁడు మరల నిఁక నెప్పటికిని జగములలోఁ గలియక ముత్తియమైన నీటిబిందువు మరల నీటిస్వరూపమును బొందనియట్టులనే యవినాశియు నవికారియునై యుండును.

ఆ. లేదు జగతి నంచు వాదు సేయఁగ వచ్చు
సోది సెప్పరాదు సూక్ష్మ మెఱిఁగి
పాదుకొల్పి బుద్ధిఁ బరికించి చూడరా, వి...

ఈశ్వరుఁ డనువాఁడు లేనేలేఁడు. సత్యమని వాదముల నెన్నింటినైనఁ జేయవచ్చును, నీవారశూకమువలె సూక్ష్మాకారముగనున్న పరమాత్మ నెఱింగితినని చెప్పుట సామాన్యము కాదు. బుద్ధిని లోఁబఱచికొని చూచినగాని పరమాత్మ గోచరింపదు.

తే. లోకములయందు వెలియైనలోతుఁ జూడ
బూని వర్తించి పరిపూర్తి పొందువాఁడు
ఉన్నవాఁ డౌను ముక్తుఁడై యున్నవాఁడు
పరమసంతోషనిలయుఁడై పరగు వేమ!. 1926

లోకాతీతమైన బ్రహ్మస్వరూపమును సందర్శించి జ్ఞానపూర్ణుఁడై యుండువాఁ డొకఁడె ప్రపంచములో నుండువాఁడు. అతఁడు ముక్తుఁడై సంతోషనిలయుఁడై శాశ్వతసుఖములఁ బడయఁగలుగును.

ఆ. వాఁడు వాఁడు గాఁడు వానిలోపలనుండు
వాఁడె వాఁడు వాఁడు వాఁడు గాఁడు
వాఁడు వానిఁ గూర్చువాఁడెపో బ్రహ్మంబు, వి.



మానవుఁ డెన్నఁటికి ఈశ్వరుఁడు కాఁడు. మానవదేహమునందున్న ఆత్మయే యీశ్వరుఁడు. మానవుని యీశ్వరునిగాఁ దలంపఁజనదు. ఆత్మను పరమాత్మతో జతపఱచువాఁడె బ్రహ్మ మనఁబడును.

క. వినవలె నాదము తనలోఁ
గనవలె బ్రహ్మంబు విడక కౌతుక మొప్పన్
గనవలె సోహంభావము
తను దానై పరమునంద దగులక వేమా! 1928

ప్రణవమును విని యద్దానియందు మ్రోయుచున్న నాదును గని సోహ మస్మి యనుమహావాక్యార్థమును గ్రహించి తత్కైవల్యమును బొందఁగాఁ దగును.

ఆ. విన్నవాఁ డెవండొ కన్నవాఁ డెవ్వఁడొ
విన్నకన్న వానివివర మేమొ
అరసి చూడవలయు నంబుధి నైనను, వి...

ద్రష్టయై ప్రపంచమునంతయుఁ దిలకించువాఁ డెవఁడో, శ్రోతయై సర్వరహస్యములనాలించువాఁ డెవఁడో అట్టిదైవమునుగూర్చి వివరమేదియో మోక్షార్థియగువాఁడు సముద్రమునేని గాలించి తెలిసికొనవలెను.

ఆ. విమలదృష్టిఁ బూని విజ్ఞాన మందమి
తమము బాయ నగునె తథ్యముగను
దమము మీఱినంతఁ దత్త్వజ్ఞుఁ డగునయా, వి.

నిర్మలమగుదృష్టితో విజ్ఞానమును బొంద కున్నంతవఱకును

తమ మడంగదు. అట్లు క్రమక్రమమున తమమడంగెనేని వాఁడే తత్త్వమై యుండఁగలఁడు.

తే. వేదగీతంబులను మించి వెలయువాని
నాదబిందువు కళలంటి నయము గాను
సాధకంబున జొచ్చుటె సన్మతంబు
జన్మసార్థక మప్పుడె జనును వేమ! 1931

వేదాతీతుఁడును నాదబిందుస్వరూపుఁడును అగు బ్రహ్మము సాధకమున (అనఁగా సాధనచతుష్టయసంపత్తిచేత) కలియుటే తన్మయత్వ మనఁబడును. అయ్యది కలిగిననే జన్మము సార్థకమైనట్టులు లెక్కింప నగును.

ఆ. వేదముఁ జదివియు విఱ్ఱవీగుటె కాని
యధమగతిని బడిరి యయ్యలెల్ల,
బ్రహ్మమహిమఁ దెలిసి బ్రదికిన బ్రదుకయా, వి.

బ్రాహ్మణులు మేము వేదములను జదివితి మని విఱ్ఱవీగుటే కాని బ్రహ్మము మహిమను గనఁజాలక యధోగతికి పాలగుటను ఎఱుంగరైరి. బ్రహ్మము నెఱింగినవాని బ్రదుకే బ్రదుకు.

ఆ. వేదవిప్రులెల్ల విశ్వోపకారులు
సాక్షి యున్నవాఁడు జగతిలోన
నట్టివారి నరులు నరయ రిదేలొకో, వి...1933

వేదవిప్రులందఱును విశ్వమున కుపచరించినవారలు అందులకు దైవమే సాక్షియై యున్నాఁడు. లోకులు అట్టివారిని ఎందులకో విచారింపవలసినను విచారింపరు.



తే. వేదశాస్త్రపురాణముల్ వెదుక నేల ?
ఆది తుదియును లేకయ యచల మగును
సార మిది మించి వెలిగెడి సత్యమగును
వాదములఁ గానరాకుండి పరలు వేమ! 1934

వేదములు పురాణములు మున్నగువాని నేల వెదుకవలయును ? ఆద్యంతశూన్యుఁడై యచలుఁడై యున్న బ్రహ్మమును సర్వవ్యాపిని కోరినచోట కనుము. వాదములకు దిగినవాతఁ డెన్నఁటికిని గోచరింపఁజాలఁడు.

ఆ. వెన్ను దగిలియుండు కన్ను గాననినాఁడు
చిన్ననాఁటినుండి చెలిమిఁ జూపు
అన్నదమ్ములకును నాప్తుఁడై యుండును, వి...

దైవము కన్నులు దెఱువని పసికందువులమై యున్నపుడు మనకు నెన్నఁటియుండియు చిన్నతనము మొదలుకొని మిగులస్నేహముతోఁ దిలకించుచు అన్నదమ్ములవలె మిగులనాప్తుఁడై కాపాడుచున్నాఁడు.

ఆ. వేదసార మెల్ల వెదకి తాఁ జూచియు
లీనమైన బ్రహ్మరీతి దెలిసి
పరము గనెడివాఁడు పరమాత్ముఁ డగునయా, వి.

వేదములలోని సారమునంతను వెదకి లీనుఁడై యున్న పరమాత్ముని తెలిసికొనెడివాఁడే పరమాత్మ యగును.

క. వేదాంతసారగుణ సం
వాదితుఁ డగు గురుని వేఁడి పరిపూర్ణుఁడవై
మోదంబున గుఱినుంచుము
సాధనలో ముక్తి గలుగు సత్యము వేమా!

ఉపనిషత్సారజ్ఞుఁ డగుగురువును ప్రార్థించి పరిపూర్ణభావముతో గురూపదేశమును సంతోషపూర్వకముగా గుఱిదప్పక ధ్యానించినచో ముక్తి తప్పక కలుగును.

---

# గురుభక్తిపద్ధతి.

---

అవతారిక:—ఏకాగ్రచిత్తమునకు సాధనము లగు యోగనియమములు షట్చక్రస్వరూపము క్షేత్రక్షేత్రజ్ఞ విచారము సాంఖ్యామనస్కతారకాదుల నియమములు పంచముద్రల స్వరూపభేదములు దశవిధనాదములు కళాదికములు లోనగు నాధ్యాత్మిక రహస్యములను నేర్వవలయు నన్నచో బ్రహ్మజ్ఞానియగు యోగీశ్వరుని గురునిగాఁ జేకొనవలయు ననియు అట్టుల గురూపదేశము లొందకున్నచో సాధకుఁడు తరింపఁజాలఁ డనియు స్వయంకృషివలన నాధ్యాత్మిక రహస్యపరిజ్ఞానము లబ్బదని యిందు నిరూపించుచు సాటిచెంది వేమన మహాయోగి గురుభక్తిపద్ధతిలో గురుసేవావిధము నెఱుంగఁ జేయుచున్నాఁడు.—



ఆ. అంజనంబు కనుల కంటించి చూచిన
సొమ్ము దొరకుభువిని సూత్రముగను
గురునినమ్మి కరుణ గుణమంటిచూడరా, వి...

కాటుకను పెట్టుకొనిచూచిన భూనిక్షిప్తమగునిధి దొరకిన రీతిగానే గురుసహాయమున మోక్షము నొందఁ గలుగుదువు.

ఆ. అన్ని దానములను నన్నదానమె గొప్ప
కన్నవారికంటె ఘనులు లేరు
ఎన్న గురువ కన్న నెక్కువ లేదయా, వి... 1980

ప్రపంచమునందలి యన్నిదానములకంటె నన్నదాన ముత్తమమైనట్టులే గురునికంటె నుత్తములు వేఱే లేరు. తల్లిదండ్రులను మించినయోగ్యులు లేరు.

ఆ. ఆత్మయందె దృష్టి ననువుగా నొనరించి
నిశ్చలముగ దృష్టి నిలిపెనేని
అతఁడు నీవె సుమ్మి యనుమాన మేలరా? వి.

చూపును ఆత్మయందు బెదరనీయక నిలుచునట్టులు చేయఁగలిగినచో కైవల్యము నొందఁగలుగుదువు.

క. ఇతరాపేక్షలు పోనిడి
సతతము గురుభక్తి యుక్తి సారముగనకే
గతి యగు బ్రహ్మానందము
మతి కింపుగ దోఁపఁబోదు మహిలో వేమా!

సంసారసంబంధము లగు నపేక్షల నన్నింటిని బోకార్చుకొని భక్తిచే మోక్షమును గూర్చిన యుపదేశములు గురువువలన

గ్రహించినఁగాని శిష్యునకు జ్ఞానరూపమగు బ్రహ్మానందము కలుగఁజాలదు.

క. ఇరువదియాఱవతత్త్వం
బరయగ జీవాత్మునెలవు నలపరమాత్ము
న్నిరువొందఁ గూర్చు గురుపద
మెరయంగా గురువటంచు నెంతురు వేమా!

శరీరము పంచవింశతి తత్త్వమయమైనది. గురువు ఇరువదియాఱవతత్త్వ మనఁదగు జీవునిస్థానమునఁ బరమాత్ముని పొందునట్లుచేయును గనుక గురువని యందురు.

ఆ. ఇహమునందు గురున కీదేహ మిచ్చిన
పరముఁ జూపి గుఱుతు బట్టియిచ్చు
స్థిరముగాను బుద్ధి చెడనీక చూడరా, వి...1943

ఈలోకమునం దనశరీరమును గురువుల కర్పించువాని కాగురుఁడు పరము నెఱుఁగు నుపాయములఁ జూపించును. పిమ్మట నిశ్చలబుద్ధితో కనుంగొని యాత్మతత్త్వముతో నానందింపవచ్చును.

ఆ. ఇహమునందు నేమి యిడుములఁ బడినను
బరమసాధనార్థపథము గాదు
గురునియుక్తి మీఱి గుర్తించి చూడరా, వి....

ఇహలోకమునకై యెన్నిపాటులఁబడినను అయ్యవి పరలోకసాధకములు కానేఱవు. కావున వానిఁ బరిత్యజించి గురువుల సేవించి బ్రహ్మమును సందర్శింపఁ బ్రయత్నింపుము.



ఆ. ఇహము విడచి ఫలము లింపుగ గలవని
మహిని బల్కువారి మాట కల్ల
ఇహములోనె పరము నెసఁగుట కానరా, వి....

ఇహమునఁ బ్రయత్నింపనేల పరమునఁ బెక్కులు ఫలములు కలవని చెప్పెడివారిమాట యంతగా పాటింపఁదగినది కాదు. గనుక ఇహమునందె పరమునుకూడ సాధింపవలయును.

క. ఈఘటమునందుఁ జూచియు
ఏఘటమున నింతె యనుచు నెఱుఁగక మదిలో
నేఘటముమీఁద వాంఛయు
మోఘం బని కొనఁగవలయు ముఖ్యము వేమా!

ఆత్మౌపమ్యమున సమస్తశరీరులు నిట్లే యుందురని నిశ్చయించికొని ఇతరులపై మమత్వము నభిలాషమును వ్యర్థమని విడిచి పెట్టవలయును. ఇది ముఖ్యకర్తవ్యము.

ఆ. ఈఁదవచ్చు నేరు బాధ లేకుండనే
యాదిగురువు లేక యందరాదు
సోదిఁ జెప్ప వేల చొక్కినమది చూడు, వి...

అనాయాసముగా నేటినైన నీఁదవచ్చునుగాని గురువులేక బ్రహ్మము నుపాసింపఁ జాలము. ఇంతసోదియేల? జ్ఞానదృష్టితోఁ జూచిన నిది నీకే తెలియును.

తే. ఈషణాదుల నన్నిటి నీడ్చిపట్టి
మోసపోకయు మదిలోన గాసిపడక

రోసి బయలున జేరుట వాసి యగును
ఇట్టులగు నాతఁ డెన్నిక కెక్కు వేమ! 1948

ధనదారాపుత్రేషణములను నంటగట్టుకొని కష్టములపాలు గాక విరక్తివహించి విజ్ఞానముచే ముక్తినార్జించుట కర్తవ్యము. ఇటులొనర్చువాఁడె పేరెన్నిక నొందఁ గలుగును.

క. ఉచితాహారమువల్లనె
యుచితంబుగ బుద్ధిస్థిరత నొప్పునటులనే
యుచితగురుబోధవల్లను
సుచరితుఁడై పరము గాంచు సుమ్మువ వేమా!

అనుకూలమగు సాత్త్వికాహారమును భుజించిన యెడల సాత్త్వికగుణ మలవడును. అటులే యనుకూలుఁడగు గురువర్యుని నాశ్రయించినయెడల మోక్షమును బడయవచ్చును.

క. ఉచ్చకు త్రోవగు తావున
ద్రచ్చంగా జగము పుట్టె తాతలనాఁడే
హెచ్చగు కులజుం డెవ్వఁడు
మచ్చిక మది దోయుమయ్య మాన్యత వేమా!

ఉచ్చకు నిలయమగు స్థానమునఁ బుట్టి వచ్చుచున్న యీజగత్తులోని మనుజులు తమలో తాము హెచ్చుతగ్గులకై పోరుట మంచిది కాదు.

ఆ. ఉండునుండు జ్ఞాని యుగములు చనినను
ప్రాణహాని లేదు ప్రళయమునను
బ్రాణహానిరైన పరమాత్మ గలియురా, వి...



ఎన్నియుగములు గడచి చనుచున్నను చలింపక జ్ఞానియగు వాఁ డుండును. ఆతనికి ప్రాణహానియే లేదు. అట్లెప్పుడైనఁ గల్గినచో నదియే కైవల్యము.

క. ఉడుగక క్రతువులఁ దపముల
నడవుల తీర్థములఁ దిరిగినంతనె ధరలో
నొడయని గనుగొనఁ జాలఁడు
కడుధీరత గురుఁడు సెప్పఁగల డిది వేమా! 1952

విసుగు విరామము లేక యజ్ఞయాగాదులకు అడవులకుఁ దిరుగుచున్నంత మాత్రమున మానవునకు ముక్తిచేకూరదు. పట్టు దలవహించి గురూపదేశమును దలఁదాల్చినవానికే మోక్షము లభ్యమగును.

తే. ఉత్తమజ్ఞాననిలయమహా నుపము చేత
భక్తి సాధించి పూర్ణత బడయవచ్చు
ముక్తి కిరవగు గురునాజ్ఞ మొదటిదయ్యె
నది లభించిన సర్వంబు నబ్బు వేమ! 1953

పరిపూర్ణమగుభక్తిని సాధించి పూర్ణుఁడై గురువులు చెప్పిన చొప్పున నడచుకొనుచుండెనేని వాఁడు తప్పక ముక్తి కిరవగును. మోక్షమునకు జ్ఞానజన్యమగు యుక్తిగావలెను.

తే. ఉదధి లంఘించి దాఁటినయుత్తముండు
మదిని రామాజ్ఞ మీఱక మాయ లడఁచి
హృదయమందున రాముని బదిలపఱచె
నౌర మారుతి తత్వజ్ఞుఁ డగుట వేమ! 1954

సముద్రములను కూడ నొక్కయంగలో దాఁటిన యుత్తమోత్తముఁడు పరమభక్తుఁడు బ్రహ్మచారి యగు నాంజనేయుఁడు గూడ రాముని గురువుగా నమ్మి యాతని యాజ్ఞ మీఱక శ్రీరామస్వరూపము హృదయగతము గావించుకొని తత్త్వము గ్రహించెను. గురూపదేశములేని దెంతవానికేని తత్త్వము సాధ్యము కాదు.

ఆ. ఉన్న దన్న దెఱుక నూహను రెట్టించి
మన్ను మిన్ను నడుమ మాఱు లేక
యున్నవాఁడె పరము గన్నవాఁ డగుసురా, వి.

సర్వమునకుఁ గారకుఁడుగా భగవంతుఁ డొకఁడు గలఁడని తలంచి హృదయగతమగు సహస్రారమున దృచ్ఛక్తినిజేర్చి జ్యోతిర్మండలమును సందర్శింపఁగల ధన్యుఁడే పరమాత్ముని గాంచినవాఁడు.

ఆ. ఉపము చేత గురుని దపమునఁ జూడక
జపము చేయువాఁడు చపలుఁ డగును
నెపము వడక మించి నేర్పున జూడరా, వి....

గురూపదేశానుసారముగ బ్రహ్మస్వరూపమును యుక్తిచేఁ గనుగొనవలయునుగాని జపము తపముఁ జేయుచున్న నేమియు లాభముండదు. నీయవివేకముచేఁ దత్త్వము గనవైతి వను నెపమునొందక నేర్పుతో మెలంగుము.

ఆ. ఉపము గలుగునాతఁ డూరకుండగ రాదు
గురునితోడ బొందు కూడవలయు



గురుఁడు సెప్పురీతి గుఱిమీఱరాదయా, వి...

యుక్తిగలవాఁ డూరకప్రొద్దుఁ బుచ్చక గురుని జేరి యాతని సేవించుచు నతని చెప్పినచొప్పున నడచికొని కృతార్థుఁడగుటకై యత్నింపవలయును. గురునాజ్ఞ జవదాఁటరాదు.

ఆ. ఉపముతోడ గురుని నొప్పుగా సేవించి
జపము హృదిని జేయు జాడ లెఱిఁగి
తపముఁ జేయువాఁడు తత్త్వజ్ఞుఁ డగు యోగి, వి.

యుక్తిగా గురుని సేవించు రీతులను జపము చేయు చొప్పును నరసి ధ్యానించువాఁడు, తపముఁ గావించువాఁడు తత్త్వజ్ఞుఁడుగా గణింపఁబడును.

ఆ. ఉపము దోఁపనట్టియుపవాసముల లేదు
తపము చేయనైన తగులరాదు
జపములోన గురుని జవదాఁటకుండరా, వి...

ఉపములేనియుపవాసాదుల తపముల నెన్ని చేసినను నిష్ప్రయోజనమే కావున గురువులనాజ్ఞను మీఱక మెలఁగి కృతకృత్యుఁడవుగా నెంతువేని గురునాజ్ఞ దలఁదాల్చి మెలఁగుము.

ఆ. ఉబ్బి గురుని వేఁడి నిబ్బరపడువాఁడు
దబ్బరాడఁబోఁడు తత్తఱమున
నిబ్బరంపుమదిని నిర్వాణతను గాంచు, వి....1960

సంతుష్టుఁడై గురుని నుతించుచు ఆత్మధ్యానముఁ జేయువాఁడు తన్మయుఁ డగునుగాని ఐహికములకు లోనై కల్లలాడి కాలము గడుపఁడు.

ఆ. ఉసురులేనితిత్తి యిసుమంత నూఁదిన
పంచలోహములును భస్మ మగును
పెద్ద లుసురు మన్న పెనుమంట లెగయవా? వి.

ప్రాణములేని కొలిమితిత్తి యించుక యూఁదినమాత్రమునఁ గుంపటిలోనున్న సమస్తలోహములు బూడిదయై పోవుచున్నవి. పరబ్రహ్మస్వరూపము నెఱింగిన యుత్తములు సూరు మన్నచో లోకములు మండిపోకుండునా?

క. ఎక్కడ వెదకిన తానై
మ్రొక్కను తా వెందు లేక మూలము తానై
చక్కగ నిర్భయుఁ డగుచును
నిక్కము నిన్నంటియుండు నిజముగ వేమా!

పరమాత్మ ఎచ్చటఁ జూచినను నిండియుండి నీవెనువెంటనే సంచరించుచుండును. గాన ధీరుఁడవై తత్త్వమును కనుఁగొనుటకు బ్రహ్మస్వరూపము గాంచుటకు యత్నింపుము.

తే. ఎక్కువెట్టిన రూపము చిక్కువెట్టి
నిక్కఁబట్టుము నిజ మని సొక్కి ముట్టి
చిక్కగను బూర్ణమందుము చిక్కవెందు
గురుని బెడియ కుపాయంబు కుదురు వేమ!

ధ్యానమున నిష్పనపదరూపమునే చెదఱనీయక పట్టి పూర్ణరూపుఁడవై గురునిసాయమున కేవలుఁడవు అగుటకై యత్నింపుము. గుర్వనుగ్రహమునఁ గార్యసిద్ధి యగును.



ఆ. ఎట్టిమంత్రమైన నెంగిలి గాకుండు
బలుకవశము గాదు బ్రహ్మకైన
ఎంగి లెంగి లందు రీనాటితోడనే, వి... 1964

ఎటువంటి మంత్రము నైనను నోటితో నుచ్చరింపవలసి వచ్చుటచే ఎంగిలి గాని మంత్రమే ఈలోకములో లేనే లేదు. కావున ఎంగిలని నిందింపరాదు.

క. ఎడపక క్రతువులు తపములు
నడవులవాసంబు తీర్థయాత్రలచేయన్
ఒడయని కనుగొనఁజాలఁడు
కడుపడి గురునిష్ఠ పరుఁడు కావలె వేమా! 1965

ఎడతెగక యజ్ఞములు తపములు అరణ్యావాసములు తీర్థయాత్రలు చేయుచున్నంత మాత్రమున భగవంతుఁడు ముక్తి నీయఁడు. ముక్తికి గురునిష్ఠ ఆవశ్యకము.

క. ఏపాపమైనఁ జక్కగఁ
బాపును గురుమర్మఘుటిక బహుజన్మతతిన్
జూపట్టి యడఁగఁద్రొక్కుచు
కాపై మదిలోన వెలుఁగు ఘనమున వేమా!

గురుభక్తి యనున దెట్టిపాపముల నైనను పాఱఁద్రోలి జన్మదుఃఖములను తొలఁగించి పరతత్త్వమును సాక్షాత్కరింపఁ జేయును. అంతేగాక తోడునీడయై హృదయమున నెప్పుడు వెలుఁగుచుండును.

ఆ. కపట ముడిగి గురునికై దండ యొసరించి
యుపముతోడ భక్తి నునికిఁ జేసి
తప మెఱింగినంత ధన్యత వొడమును, వి...

సాధకుఁడు కపటమును వదలిపెట్టి గురునిసాయము నవలంబించి శుశ్రూషఁ జేసి తపస్తత్త్వపురహస్యము నెఱుంగఁ గలిగినచో ధన్యుఁడు కాఁగలఁడు.

ఆ. కారుకారు గురులు కాగుణితముఁ జెప్ప
శాస్త్రపాఠములను జదివి చెప్ప
ముక్తిదారిఁ జూపు మూలము గురుఁడురా, వి.

కాగుణితమును కావ్యాదులను చెప్పినంతమాత్రాన నందఱు గురువులు కారు; కాని ముక్తిదారి జెప్పువాఁడొక్కఁడే ముఖ్యుఁడగుగురువు.

తే. గుట్టుగురుభక్తిలో ముట్టి మిట్టిపడక
జెట్టివలె బోరి లోమర్మ మిట్టి దనుచు
నట్టుపడఁ జూచి మించుట నాణె మరయ
పిట్టకబురులచే నేమి గిట్టు వేమ! 1969

గురుభక్తిలోనిగుట్టును తెలిసికొని గర్వింపక జెట్టివలె మాయతోఁ బోరి కనిపెట్టి మోక్షమునకు ప్రయత్నింపవలయునే కాని పిట్టకబుర్లవలనఁ గొంచెమైన నుపయోగము లేదు.

ఆ. గురుచరణము బట్టఁ గుక్కలు గఱచునా
గురుచరణము విడువ గుక్క కఱచుఁ
గుక్కకున్న గుణము గురునకు లేదురా, వి...



గురునిపాదములయండ నున్నన్నినాళ్లను మాయ యేమియుఁ జేయఁజాలదు. కాని అండఁబాసినచో బాధింపఁబూనును. గాన గురునికంటె మాయయే సర్వవిధముల గుణముగలది.

క. గుఱి గానలేక మర్త్యులు
పరిచితశాస్త్రముల వాదపద్ధతి గనర
గ్గుఱి గురువు జ్యోతి నిచ్చును
దరి దెలిసినవాఁడె యోగి ధరలో వేమా! 1971

మనుజుఁడు లక్ష్యశుద్ధిని పొందలేక ఎన్నిదినములు శాస్త్రములవాదించినను బ్రహ్మము నొందఁజాలఁడు. గురుని సేవించినచో జ్ఞానజ్యోతిని జూపి కడతేర్చును.

క. గురుఁడగు నాత్ముఁడు శిష్యుఁడు
పరగంగా జీవుఁడనుచు బరికించుచు నీ
గురుశిష్యపరమయోగం
బురుతరముగ గూర్చువాఁడు యోగిర వేమా!

గురువు పరమాత్ముఁడు శిష్యుఁడు జీవాత్ముఁడు అను మూలతత్త్వము నెఱింగి జీవాత్ముని పరమాత్మునిలోఁ జేర్చుటకు యత్నించు ధన్యుఁడే నిజమగు యోగిగా గణింపఁదగినవాఁడు.

క. గురుఁ డనఁగ ధేనువై తగు
వరశిష్యుఁడు వత్స మగుచు వర్తింపంగా
దఱి గలిగినప్పు డొసఁగును
నిరుపమలక్ష్యామృతంబు నిజముగ వేమా! 1973

గురువు కామధేనువు. శిష్యుఁడు వత్సమువంటివాఁడుగనుక గురువు జ్ఞానామృతమును శిష్యునకుఁ దరుణము గనిపెట్టి యొసంగి కాపాడుచుండును.

క. గురుఁ డనఁగా బరమాత్ముఁడు
పరగంగా శిష్యుఁ డనఁగ బటుజీవుఁ డగుఙ్
గురుశిష్యజీవసంపద
గురుతరమునఁ గూర్చు నతఁడె గురువగు వేమా!

శిష్యుఁడు జీవాత్ముఁడు. గురువు పరమాత్ముఁడు. గురుశిష్యసంయోగమే జీవేశ్వరైక్యము. ఇదియే మోక్షము. ఇది గుర్వనుగ్రహమునఁగాని లభ్యము కాఁజాలదు.

క. గురుఁ డనఁగా మొదలంతకు
గురుశిష్యు లనంగ నెల్ల కొమ్మలు కానం
గురువును గానఁగఁ జూతురు
ధరలోపల మనుజులెల్ల దలఁపఁగ వేమా! 1975

సమస్తమునకును గురుఁడు మూలము. శిష్యులు శాఖలు కావున వారుభయులును పరస్పరసాయమున లోకము నుద్ధరింపఁ బూనవలయునుగాన ప్రతిసాధకుఁడు గురునినాశ్రయించును.

ఆ. గురువు శిష్యుఁ డనఁగ గొన లెట్టు మొద లెట్టు
గురువు శిష్యుఁ డనెడి గుఱుతు లెట్లు
గుఱుత నుండఁదగిన పరువు లేకుండిన, వి....1976

గురుశిష్యులకుఁ గల సంబంధ మెట్టిది? గురుశిష్యులకుఁ గల



పరస్పరభేద మెయ్యది అనునంశము గురువు తానుండఁదగిన గౌరవస్థితిలో నన్నఁగాని తేలదు.

ఆ. గుఱుతు గనుచుఁ జెప్పు గురు వెవ్వఁడును లేఁడు
గురు తెఱుంగు శిష్యనరుఁడు లేఁడు
గురుఁడు శిష్యుఁ డనుట గ్రుడ్డెద్దు చేనురా, వి.

గురుశిష్యన్యాయము చాల యసందర్భముగా నున్నది. శిష్యునకు జ్ఞానోపదేశముచేయు గురువుగాని గురునియాన ననుసరించి మెలంగు శిష్యుఁడుగాని లేఁడు. గురుశిష్య న్యాయము గ్రుడ్డి యెద్దు చేనులోఁ బడినటులున్నది.

ఆ. గురుని గూడు చేసి గుణము వత్తిగఁ జేసి
సరవి గర్మసమితిఁ జమురు జేసి
మూల నొక్కజ్యోతి ముట్టించి చూడరా, వి.

తిథి వారాదులఁ బాటించి కర్మముల నాచరింపక పోవుటవలన జాతియంతయు సంకరమయ్యెను. స్త్రీలయవినీతిగల నడతవలనఁ బురుషుల సిగ్గుబోవుచున్నది. మడుగులుంటవలన భూమియంతయుఁ జెడిపోవుచున్నది.

ఆ. గుఱుతు తిథులవలనఁ గులమెల్లఁ జెడిపోయె
స్త్రీలనడతవలన సిగ్గుపోయె
నేహ్యాపల్వలముల నిల యెల్లఁ జెడెనయా, వి.

గుఱుతు తిథులవలన కులములును స్త్రీలవలన సిగ్గును పాడుగుంటలవలన భూమియును చెడిపోయెను.

ఆ. గురునితోడఁ బొందు కూడి యుండినవాఁడు
చేరి బ్రహ్మ మంటి చెలఁగి యుండు
మఱుఁగు తెలిసెనేని మర్మంబు లేదయా, వి...

గురునితో నైక్యముఁ జెందియుండుటే కైవల్యము. ఈమ ర్మము నెఱింగినవాఁడే బ్రహ్మము. ఇంతకంటెను వేద్య మిఁకను లేదు. గురుబోధవలన మరుగుఁ దెలిసెనా కష్టముండదు.

ఆ. గురుని నిందఁ జేసి గుట్టెఱుంగనివాఁడు
యమునిబాధ నొందు క్రమముగాను
దేసెలోనియీఁగ తెఱఁగున నగునయా, వి...

గురుని నిందఁ జేసి, విద్యామర్మము తెలిసికొననివాఁడు తేనె లోఁ బడినయీఁగవలె బాధలకు పాల్పడును.

ఆ. గురుని పరమగురుని గుఱుతుగా దెలియక
గురు వటంచుఁ దలఁప గ్రుడ్డిరీతి
గురువకు గురువైన గురుఁడు ప్రాణేశుండు, వి.

అవివేకియగు మానవుఁడు గురువెట్టివాఁడో పరమగురు వెట్టి వాఁడో తెలిసికొనఁజాలక కానఁబడిన వానినే గురువుగాఁ దలంచును. జ్ఞానబోధచేయువాఁడు గురువు. మోక్షప్రదాత యగు భగవంతుఁడు పరమగురుఁడు.

ఆ. గురుని శిష్యునియతి గుఱుతుగా మదిలోన
కానలేదు భ్రాంతి మానలేదు
గురునిశిష్యుఁ డెందు గూఁటిమీదె యగునయా, వి.



అజ్ఞానియగు శిష్యుఁడు గురుశిష్యులకుఁ గల యంతరము గ్రహింపఁజాలక భ్రాంతిచేఁ జెడిపోవును. ఈకారణమువలన నే గురుని శిష్యుఁ డాక్షేపించుట తటస్థించుచున్నది.

తే. గురుపరంపర నీవిద్య గూఢ మెఱిఁగి
పరిమపరిపూర్ణ మందుట పరవశతర
నిరుపమానందసుఖకేళి నెఱపవలెను
బరశివుం డన భాసిల్లవలెను వేమ! 1984

గురుపరంపరవలన నీయాత్మవిద్యలోఁ గల రహస్యము నెఱింగి పూర్ణత నొంది ఆనందము ననుభవించుచు పరశివుఁడుగా సాధ కుఁడు మారుటకు యత్నింపవలయును.

సీ. గురుబోధ తెలియని కుటిలశాస్త్రంబులు
పరికింపఁగా నేమి ఫలముగలదు
ఆత్మైక్య మెఱుఁగక యఖిలయోగంబులు
సాధింపఁగా నేమి సాధ్యమగును
తన్మయత్వంబును తా నెఱుంగనివారి
సేవఁ జేసిన నేమి సిద్ధికలుగు
తుది చేటెఱుంగక చదువులు పెక్కులు
చదివిన ఫలమేమి సత్యముగను

తే. అనుచు సద్గురుబోధగా ననవరతము
వేయినోరులఁ జెప్పిన మాయజగము
వానిచేఁ జేయఁ జూతురు వాస్తవంబు
మదిని దెలియంగలేరిశు మహిమ వేమ! 1985

గురుబోధను బడయఁజాలక పరస్పర విరుద్ధము లగు శాస్త్రములు పఠించుటవలన ఫలములేదు. జీవునకు ఈశ్వరునకు ఈశ్వరునకు గల నైక్యభావము సాధింప లేనివాని కేమియుఁ సాధ్యముకాదు. ఎల్లపుడు తన్మయానందమున మునిఁగి తేలుచుఁ దన్ను జ్ఞానార్థియై సేవించు శిష్యుని మొగమేని చూడని గురుని సేవించుటవలన ఫలము లేదు. ఎప్పుడో చావు గలదని గ్రహింపక కలకాలము చదువుకొను చదువు నిష్ఫలము. ఇటుల నెన్నివిధముల వేమన సాటి చెప్పుచున్నను ఈమాయజగ మీయంశమును గ్రహించి హృదయమున నీశ్వరరూపమును గాంచలేకున్నది. ఏమన్న నేమిలాభము?

ఆ. గురువు తానయ్యును గుణమించుకయు లేక
చందమామ కిచ్చె శాప మతఁడు
గురుఁడు కోప మూనఁగూడ దెప్పటికైన, వి.

తాను గురువయ్యును ఓర్పునకు బదులుగా మార్పు నొంది బృహస్పతి చంద్రుని శపించెను. గురుఁడైనవాఁ డెన్నటికిని గోపించి శిష్యుని శపింపరాదు.

తే. గురుముఖంబున నెఱిఁగిన గుఱ్తు విడక
నిస్తరంగసముద్రంబు నియతి మనసు
నిలిపి యపరోక్ష మందుట నిర్గుణంబు
దాన పరిపూర్ణసంతోష మౌను వేమ! 1987

గురుముఖమున విని యున్నగుఱుతును వదలిపెట్టక నిశ్చలసమాధియందు మది నంది మోక్షము నొందుటయే నిర్గుణోపాసనాఫలము దానివలన శాశ్వతానందము సులభముగా లభ్యమగును.



ఆ. గురువు కలుగు నాత్మ గురు తెఱింగెద మని
కాల మెల్ల రిత్త గడిపి రయ్య
గురువు దొరకువపుడు కూలు నీదేహంబు, వి.

పెక్కండ్రు వంచకులు మేము గురువులము జ్ఞానోపదేశము గావింతుమని కాలమును విత్తమును దుర్వ్యయము గావించిరి. నిజమగు గురుఁడు లభించినగాని యీశరీరసంబంధము తొలఁగిపోదు.

ఆ. గురువు చిల్లగింజ కుంభ మీదేహంబు
ఆత్మకలుషపంక మడుగుఁబట్టు
తేరి నిలిచెనేని దివ్యామృతమ్మురా, వి.... 1988

పాపావృతమైన యీదేహము మురికినీటికుండ. నీటిమురికి నంతయు నడుగుఁబట్టఁ జేయుట గురుఁడను చిల్లగింజ కావలయును. అపుడు జ్ఞానమను పరిశుద్ధోదకము తేరి పానయోగ్యముగా లభించును.

ఆ. గురువు తా నయినను హరుని తాఁ జూపును
బ్రహ్మలోక మితఁడు పాఱఁజూపు
శిష్యు నఱసి తట్టి చీఁకటిఁ బాపురా, వి...1989

నిజమగు గురువే యైనయెడల యాతఁడు ఈశుని జూపించి బ్రహ్మలోకమును జూపి హస్తమిచ్చి శిష్యుని చేరఁదీసి యాతని

యజ్ఞానమును పాఱఁద్రోలి యభయహస్తమిచ్చి ముక్తి నెనయించును.

ఆ. గురువునకును పుచ్చకూరైన నీయరు
అరయ వేశ్యకిత్తు రర్థమెల్ల
గురుఁడు వేశ్యకన్న గుణహీనుఁడగునొకో, వి.

లోకులు నాస్తికులై గురువునకుఁ బుచ్చకూరనైనను నీయక భోగముదాని కర్థముల నర్పింతురు. ఆహా! భోగముదానికన్న గురుఁడు గుణహీనుఁడా?

ఆ. గురువు లేక విద్య గురుతుగా దొరకదు
నృపతి లేక భూమి నియతిగాదు
గురువు విద్య లేక గురుతరజ్ఞుఁడౌనె? వి...

గురువు లేకున్నయెడల జ్ఞానసంబంధము ఎన్నిటికిఁ గుదురదు. రాజు లేక యున్నయెడల భూమి సర్వజనభోగ్యము కాదు. గురువు జ్ఞానము ఎవనికి లేదో వాఁడు బ్రాహ్మణపదవాచ్యుఁడుగాఁడు.

ఆ. గురుని శిక్షలేక గుఱుతెట్లు కల్గునో
అజునికైన వానియబ్బకైన
తాళపుఁజెవి లేక తలుపెట్లు లూడును, వి...

గురునియనుగ్రహము కొంచెమైనను లేక బ్రహ్మదేవు నంతటివాని కైనను లక్ష్యము సిద్ధింపదు. తాళము చెవి లేక తలుపువచ్చునా? రాదు కదా.



ఆ. గురువు వచ్చుచున్నఁ గూర్చుండి లేవని
తుంటరులకు నెట్లు దొరకు ముక్తి
మగని లెక్కగొనని ముగుద కాగతి పట్టె, వి.

గురువువచ్చుచున్న లేచి యెదురురానిమూర్ఖులకు సద్గతి దొరకదు. మగఁడు వచ్చుచుండఁ జూచి లేచి నిలచియుండని కాంతకుఁ గూడ నటులే సద్గతి లభింపఁ జాలదు.

తే. గురువుసెప్పినయుక్తులు కూడి మిగిలి
మఱపులేదని నిజమాడి మహితుఁడగుచు
నెఱపుచుండును శివయోగి నేర్పుతోడఁ
బరము సాధింప నతని కేర్పడును వేమ! 1994

గురువు చెప్పినబోధనమును మఱచిపోక యనుష్ఠించుచు దాననుష్ఠించినవిషయము గురున కెఱింగించుచు నుండువాఁడె శివయోగి. పరలోక మట్టివానికి మాత్రమె సుసాధ్యమగును.

ఆ. ఘటములోన నున్న గతు లన్నియును ద్రెంచి
దిటవు చేసి మనసు తేటపఱచి
ఘటము నిల్పువాఁడు ఘనతత్వయోగిరా, వి...

ఘటములో నున్నట్టిగతులను త్రుంచివైచి మనస్సును దిటవు చేసికొని శరీరమునం దీశుని నిలుపుకొనువాఁడే తత్త్వవేత్త యగును.

ఆ. చపలచిత్తవృత్తి సాధించి నిలిపినఁ
ద్రిపుటిబిలముఁ జేరు దెంపుగలిగి
జపము లోనిజపము జయశీలతను మించు, వి...

చపలమగు చిత్తవృత్తిని నిలిపి త్రిపుటియందు చేర్చి బ్రహ్మమును ధ్యానించుచుండవలయును. అట్లుచేసినచో తా నొనరించిన జపము సఫలమగును.

తే. చప్పుమీఱినజ్ఞానంబు సంతరించి
మూర్ఛజెందినయట్లున్న ముక్తిగలుగు
గూర్చి మెచ్చఁడె గుఱిదాఁటి కోవిదుండు
తీర్పు గురువరి జేకంగ గిరిరి వేమ! 1997

జ్ఞానమును కూర్చికొని మూర్ఛనొందినట్లు తన్మయము నటించుచు లక్ష్యమును దాఁటి బ్రహ్మమును జేకుటకై కోవిదుఁడు యత్నించును. ఎందేని భ్రాంతియున్న గురుఁడు తొలంగించి తోడ్పడును.

ఆ. చెడుగుణంబు లెల్లఁ జేపట్టి శిక్షించి
పరమపదవి సిద్ధపడఁగఁ జూపు
నట్టి గురుని వేఁడి యపరోక్ష మందరా, వి....

దుర్గుణములను పాఱద్రోలి పరమపదమును జూపించుగురుని ప్రత్యక్షముగ సేవింపుము.

ఆ. చదువు రాదటన్న సామాన్యత యిఁకేల
బుద్ధి కుదురకున్న పొందికేల
గురుని గూర్ప ముక్తి కరతలామలకమౌ, వి....

చదువురానివాని సమత్వమును నిశ్చలబుద్ధి లేనివాని పొందికయును నిరర్థకములు. గురునాశ్రయించినయెడల ముక్తి యఱచేతనే కానవచ్చును.



క. చుట్టుకొనియున్న మాయను
నెట్టుము గురుభక్తి మీఱి నియతాత్ముఁడవై
ముట్టుము తత్పరతను మన
పట్టిటును జెందనీక మాన్యత వేమా! 2000

ఆవరించియున్న మాయను నశింపఁజేసి గురుభక్తిగలిగి నియతుఁడవై తత్పరతతో మనస్సుఁ జంచలింపనీయక బ్రహ్మమునుపాసింపుము.

క. చూచెడివఱకే సాధన
చూచిన మదియందు దోఁచు సులభంబగునా
తోఁచెడిమర్మము నీవని
కాచుకొనియు గురుని గోరి కనవలె వేమా!

చూచునంతవఱకే సాధన. కావున మనస్సునందున్న మర్మమునుజూచి సర్వమునాత్మమయమనినమ్మి ముక్తుఁడవు కావలయును. ఇందులకు గురుని నెడబాయక యత్నింపవలయును.

ఆ. ఛాత్రధర్మ మెఱిఁగి చక్కనిభక్తితో
గురుని సేవఁ జేయ గుదిరినపుడె
సర్వమర్మములును జక్కఁగా విడిపోవు, వి....

గురుశిష్య సంప్రదాయములు బాగుగా నెఱింగి నిశ్చలభక్తి గురుసేవఁ జేయ నేర్చుకొనినంతనే హృదయగతములగు మర్మములన్నియుఁ దమంతటనే విచ్చిపోవును గాన గురుసేవ జ్ఞానసాధనమున కావశ్యకము.

ఆ. ఛాయ నొసఁగుఁ జెట్టు సాధువు బోధట్టు
లడఁగి దరిని జేరి బడయవచ్చు
నట్టునిట్టు దాఁట నది పోవు నిది రాదు, వి...

నీడనొసఁగు చెట్టును సాధువగు గురువొసంగు బోధయుం ఫలదాయకములగును. ఈరెండును (చెట్టు గురువు) ఫలములను (నీడను జ్ఞానమును) దరిచేరిననే ప్రసాదించును. లేకున్న జ్ఞానము కలుగదు. నీడ లభింపదు.

క. జగమున గురుఁ డుదయించిన
జగమునఁ గలజనులు శరణు శరణన రొక్కో
జగ మెఱిఁగి మ్రొక్కఁ జూచెడి
నిగమాగమ నిర్వికారనిపుణుఁడు వేమా! 2004

సర్వలోకగురుఁ డుదయించినచో మానవు లాతనికి శరణాగతులై మ్రొక్కుచుందురు. ఆగురూత్తముఁడు లోకము మ్రొక్కుటను నిర్వికారముగఁ గాంచి యనుగ్రహించును.

ఆ. జననమరణములన స్వప్నసుషుప్తులు
జగములందు నెండ జగములుండు
నరుఁడు జగమునంట నగుబాటు గాదొకో, వి.

చావుపుట్టువులు కల నిద్దురవంటివి. జగములుగూడ నెండమావులలోని నీటివలె నిజముకానివి. ఇట్టిచో వివేకియగు మానవుఁడీ తుచ్ఛలోకములలోఁ దగులుకొని వదలించుకొనఁజాలకుంట నవ్వులచేటు కాదా!



తే. జాగుసేయక గురుసేవ జరిపి దాన
యోగయోగాంగముల నేర్చి యోగు లగుచు
ఆశలను మానుటను కాదె యచలతపము
సిద్ధినొందును ముక్తికిఁ జేర్చ వేమ! 2006

ఆలస్యము నొనర్పక గురువుల సేవించి యోగయోగాంగముల నభ్యసించి యోగులై యాసల మొదలంటఁ గోయఁగలుగుటయే నిశ్చలమగు తపస్సు. దానఁ దపస్సిద్ధియుం ముక్తియుం లభించును.

ఆ. జాణలమని యంద్రు చపలాత్ము లగువారు
తెలివి లేక తమ్ము తెలియ లేరు
కష్టమైనయడవి గాసిలుచున్నారు, వి... 2007

చపలులు తమ్ము జాణుల మని చెప్పికొందురే గాని తమ తెలివిలేమిని తాము కొంచెము గాని దెలిసికొనఁజాలరు. అట్టి అవివేకులు తపములు చేసికొనుచు సారము నెఱుంగక యడవులలో నానావస్థలపా లగుచున్నారు.

ఆ. జ్ఞానమెన్న గురువు జ్ఞానహైన్యము బుద్ధి
రెంటిసందు రిమ్మ రేచునపుడు
రిమ్మ తెలిసె నేని రెండొకరూపురా, వి...

జ్ఞానము గురువు, జ్ఞానశూన్యత అజ్ఞానము. జ్ఞానాజ్ఞానముల మధ్య చంచలహృదయము భ్రమల నొందుచుండును. ఈభ్రమ నెఱింగి కట్టివేయఁ గలిగినచో జ్ఞానాజ్ఞానము లేకరూపములై మోక్షసాధకము లగును.

ఆ. జ్ఞానవంతుని కడు కర్మసంబద్ధులు
వెఱ్ఱియంద్రు ప్రకృతి విడువలేక
వెఱ్ఱి కనని ప్రకృతి వెదకినఁ గల్గునా? వి... 2009

జ్ఞానము గలవానిని గొందఱు వెఱ్ఱివారని యనెదరేగాని లోకములో వెఱ్ఱికి తెలియని వేద్య మేదియును లేదని యెఱుంగరు కదా. (వెఱ్ఱియనుమాట జ్ఞానికిదగును.)

ఆ. జ్ఞాని యనెడువాఁడు ఘనతేజమందును
బూని సుఖము జెందు పుట్టఁబోఁడు
తానె తానటయ్యు తనలోనె వెల్గును, వి...

జ్ఞానవంతుఁ డగు నుత్తముఁడు ప్రతిభాశాలియై ప్రశస్తి నొందును. ఆతనికి బునర్జన్మ మనునది యుండదు. ఆత్మస్వరూపమగు బ్రహ్మముతో నాతఁడు గలసి యానందము ననుభవించు చుండును.

ఆ. టీక వ్రాసిన ట్లనేకులు పెద్దలు
లోకమందు జెప్పి రేక మనుచు
కాకులట్టిజనులు కాన రీమర్మము, వి... 2011

ఎందరో పెద్దలు ప్రపంచములోని మర్మమును టీకవలె వివరముగా చెప్పినను తెలివిలేనివారై లోకులు దేవుఁ డొకఁడే యను నీరహస్యము నెఱుంగఁజాలకున్నారు.

ఆ. తత్త్వ మెఱుగువాఁడు దైవంబు నెఱుఁగును
సర్వసారములను జావఁ జేయు
కదళి మ్రింగువాఁడు గరళంబు మ్రింగఁడు, వి...



తత్త్వవేత్త దైవమును ఎఱుంగఁగలుగును. సమస్తమునుకూడ తెలిసికొనఁగలఁడు. ఎట్లన: గరళము మ్రింగెడివాఁడు కదళిని మ్రింగఁజాలఁడా?

ఆ. తనదుమనసుచేత దర్కించి జ్యోతిష
మెంతఁ జేసె ననుచు నెంచి చూచు
తనయదృష్టమంత దైవ మెఱుంగఁడా? వి...

మూర్ఖుఁడై తాను విఫలుఁడైనప్పుడు గ్రహములు వక్రించి వెతలఁ గూర్చెనని నిందింపఁబూనుకొనునే కాని తొలుత తన యదృష్టమును దైవమెఱింగి యట్లు చేయుచున్నాఁడని తలంపఁడు.

ఆ. తనవిరక్తి యనెడి దాసిచేతను చిక్కి
మిగిలి వెడల లేక మినుకుచున్న
నరుని కేడ ముక్తి వరలెడి చెప్పుఁడీ, వి...2014

విరక్తియను దాసి దాని తగులాటములో నిరుకుకొని దాని బాఱినుండి తొలఁగి బయటఁ బడఁజాలని యశక్తుఁడగు మానవునకు ముక్తి యేవిధముగానైన లభింపఁ జాలదు.

ఆ. తనివి దీఱ గురుని ధ్యానించి మదిలోన
దనువుమఱచి గురుని దాఁకి నపుడె
తనరుచుండు బ్రహ్మతత్త్వమందురు దాని, వి.

గురుని హృదయమున ధ్యానముఁ జేయుచుఁ దన్నుదా మఱచి బ్రహ్మానందము నొందుచు ధ్యానదృష్టిలో గురుస్వరూప

మును దర్శింపఁ గలుగుచో నదియె బ్రహ్మతత్త్వ మని చెప్పు దురు.

ఆ. తలఁపులోనఁ గలుగు దా దైవ మేప్రొద్దు
తలఁచి చూడ నదియె తత్త్వ మగును
ఊరకుండ నేర్వ నుత్తమయోగిరా, వి...2016

భగవంతుఁడు హృదయమున నివసించి యున్నాఁడు. సంకల్పరహితుఁడవై చూచినచో తత్త్వరూపుఁడగు భగవంతుఁడు కనుపించును. ఎట్టి వికారము లొందక తత్త్వరూపము దర్శించువాఁడె యుత్తముఁడగు యోగి.

ఆ. తలఁపులోనిగురుని తలఁపు లెఱుంగక
తలలు బోడులైన ధన్యు లేమి
తలఁపులోనితలఁపు తత్త్వంబు చెఱుఁగుము, వి.

మనోమర్మముల నెఱుంగఁజాలక తలలను బోడులనుచేసికొని నంతనే ధన్యులు గాఁజాలరు. తత్త్వము గ్రహించినగాని ఫల ముండదు.

తే. తలపరులకైన నెప్పుడు ధర్మ మొప్పు
సామియానతిఁ జేయుచు తా మెఱుఁగమి
గురులహితబోధ విహారెడికూళలకును
నరకకూపంబె శరణమౌ యరయ వేమ! 2018

తలపరులు రాచకర్జములయందు నేమఱక యజమాని యానా నిర్వహించుచు ధర్మమును లోలంగక యుందురు. అట్టు శిష్యులు



కూడ గురునియానకు లోఁబడవలయును. లేకున్నచో నట్టి శిష్యులకు నరకమే గతి యగును.

ఆ. తల్లిదండ్రిమీఁద దయలేనిపుత్త్రుండు
పుట్ట నేమి లేక గిట్ట నేమి
పుట్టలోనఁ జెదలు పుట్టదా? గిట్టదా? వి...2019

తల్లిదండ్రులపై ప్రేమలేని పుత్త్రుని పుట్టుక పుట్టలోని చెదలుపుట్టుకవలె నిరర్థకము అగును. వాఁడున్నను ఊడినను ఒకటె.

ఆ. తల్లిదండ్రు లెన్నఁదగు తొలిగురువులు
పార్వతీభవులిల పరమగురులు
కూలివాండ్ర జగతి గురులన ద్రోహము, వి...

తల్లిదండ్రులు ఆదిగురువులు, పార్వతీపరమేశ్వరులు పరమగురువులు నగుదురు గాన ధనాశచే నితరు లేవిధముగా బోధించినను ఆ రెండు విషయములు మఱువరాదు. కూలికి లేనివి కానివి బోధించువానిని గురువనఁ బాపము వచ్చును.

ఆ. తల్లిబిడ్డలకును తగవు పుట్టించెడి
ధనము సుఖము గూర్చు నని గడింత్రు
కాని యెల్లయెడల ఘనదుఃఖకర మది, వి....

తల్లిబిడ్డలకు తగవుల బుట్టించు ధనము సుఖప్రద మనికూర్చుటకు యోగ్యము కాదు. ధనము సర్వవిధముల దుఃఖము కలిగించును.

ఆ. తల్లి యాలు నయ్యె తగఁ గోడలును నయ్యె
గోడ లనఁగ నంగ గూఁతు రాయె
మాయవిడక ముక్తి మహి నిఁకఁ గల్గదు, వి...

జనులు మరల మరల పుట్టుచుండుటచేత ఈజన్మమునందలి తల్లి మున్నగువారు ఇంక నొకజన్మమున ఆలు మున్నగువారుగా పుట్టుచుందురు. ఇదియే యీశ్వరమాయ. దీనినిదాఁటినగాని ముక్తి కలుగదు.

ఆ. తాను నిర్మలుఁడుగ దనరుగుణము లన్ని
చేయలేని గురుఁడు చెడుగురుండు
గుడ్డితట్టు నెక్కి గుణికి నట్లగుసురా, వి.... 2023

తాను నిర్మలుఁడై గుణముల నన్నిటిని నిర్మలములుగా చేయలేని గురువు నాశ్రయించుట గ్రుడ్డిగుఱ్ఱము నెక్కి గూర్కినట్లగును. అట్టిగురువు మిగుల నీచగురువు.

ఆ. తాను విమలుఁడైన దనగుణ మంతయు
శివున కీని గురువు చెడుగుగురువు
గ్రుడ్డిగుఱ్ఱ మెక్కి గుడిఁ జుట్టినట్లగు, వి...

తాను విమలుఁడై తనగుణములను లోకముల కుపయోగింపనివాఁడు కుజనుఁడు. అట్టిగురు నాశ్రయించుట గ్రుడ్డిగుఱ్ఱము నెక్కి గుడిచుట్టు తిరుగుటవంటిది.

ఆ. తామసించి చేయఁ దగ దెట్టికార్యంబు
వేగిరింప నదియు విషమ మగును
పచ్చికాయఁ దెచ్చి పడవేయ ఫలమౌనె? వి...



తొందరపడి యేపనియుఁ జేయరాదు. తొందరపాటువలనఁ గార్యము భంగము. కక్కురితిపడి పచ్చికాయ దెచ్చి పడవేసినమాత్రమున నది పండదు గదా!

ఆ. తిత్తిలోనిశివుని స్థిరముగా దెలియక
తిక్కపట్టి నరుఁడు తిరుగుచుండు
దిక్కుదెల్ప గురుఁడి కొక్కఁడె దిక్కురా, వి...

శరీర మనుపసంచిలో నున్నయీశ్వరు నెఱుంగఁజాలక తిక్కయెత్తితిరుగు నీనరులకు తెల్పి సమాధానముచేయుటకు గురుఁడు తప్ప యితరులు తగరు.

ఆ. తిరిగి తిరిగి నరుఁడు మరులుకొనుటె గాక
యందువలన నేమి యధికమగును
అంతరంగ మెఱుఁగ నప్పుడు శివుఁడగు, వి...

దేశములన్నింటిని దిరిగినంతమాత్రమున నెన్నఁటికిని లాభములేదు. దానివలన వృథాశ్రమయే మిగులును. ఆంతరంగస్థుఁడగు శివస్వరూపమును గుర్తించుటయే మోక్షసాధనము.

ఆ. తొత్తుతోడిపొందు తొట్టిపెసలమూట
ముచ్చుతోడిపొందు తెచ్చు నింద
తలవరిదగుపొందు తలతోనె తీరురో, వి...

చినిగినగోతమునుండి పెసలు కారిపోవునట్లు దాసితో సంగమించినచో నది తప్పక బయటపడును. ముచ్చుదానితో భోగించినచో లోకనింద మిగులును. తలవరివానిసతితోఁ గూడినచో నెన్నఁటికేని ప్రాణాపాయము కలుగఁజేయును.

తే. తొల్లి జేసినపాపంబు తొలఁగుకొఱకె
పుట్టిచచ్చుచు మఱలను బుట్టుచుంద్రు
గురుని జేరియు వేఁడి తాఁ గొల్చునేని
పుట్టుదుఃఖము బాడయి పోవు వేమ! 2029

పూర్వజన్మసంచితపాపములు నశించుటకే మనుజుఁడుమరల మరల చచ్చిపుట్టుచుండును; గాన గురుని సేవించినచో మరల మరలఁ బుట్టవలసినయావస్థ కలుగదు.

ఆ. త్రాడు మెడకు వేసి తనకు శూద్రత్వంబు
పోయె ననెడి దెల్ల బుద్ధిలేమి
మది నిలువక త్రాడు మఱి పన్నె దెచ్చునా? వి.

మెడలో (జందెము) త్రాడువేసి శూద్రత్వము పోయెనను కొనుట బుద్ధిలోపముగాని వేఱుకాదు. మనస్సు నిలుకడ లేని వాని నీ జందెపుఁబోగులు కడతేర్పఁ జాలవు.

ఆ. దగ్గ ఱున్నవాఁడు తప్పక దక్షుఁడు
ఎడము పడినవాఁడు దుడుకు గడుసు
అనుసరించువారి కయ్యెడు గార్యముల్, వి...

ఎంతటివేర్పరియైనను సర్వదా యాశ్రయింపనిచో కార్యములను నెఱవేర్చుకొనఁజాలఁడు. దూరముగ నుండి యాశ్రయింపకున్నచో గడుసువాఁ డని వంకలు పెట్టుచుందురు; అనుసరించువారికిఁగాని కార్యములు కావు.

ఆ. దశగలారినెల్ల తమబంధువు లటంద్రు
దశయులేమి నెంత్రు తక్కువగను



దశ యనంగను ధనదశ యొక్కటే దశ, వి....

అదృష్టవంతుల నందఱను జనులు తమవారని చెప్పుకొనుచుందురు; గాన లోకములో నన్నిటికంటె ధనదశయే గొప్పది. ఆదశ లేకున్నచో జాతియున్నవాఁడును జాతిహీనుఁడే!

ఆ. దర్శనంబునందు ధర షణ్మతములందు
వర్ణ మాశ్రమమును వదల కెప్డు
తిరుగుచున్నవాఁడు ధరలోన నజ్ఞాని, వి...

అవివేకి యగువాఁడు అంధపరంపరగా షడ్దర్శనములను షణ్మతములను వర్ణాశ్రమ ధర్మములను విడువఁజాలక యజ్ఞానియై స్వతంత్రబుద్ధి రహితుఁడై సంచరించు చుండును.

ఆ. దాత లేనికొంప దయ్యాలపెనువాడ
నీతి లేనిమాట రాతివేట
ప్రీతి లేనిలంజె ప్రేతవాహనమయా, వి...2034

దాతలేని గ్రామము దయ్యాలపట్టణము. నీతి లేక పలుకు మాట రాతితో నాడు దెబ్బలాట. ప్రేమలేని వలపులాఁడి కూటమి పీనుఁగును మోయుటే.

ఆ. దాస రనఁగవచ్చు వేసార్లకైనను
జంగ మనఁగవచ్చు లింగ మున్న
బాప డనఁగరాదు పదివేలకైనను, వి... 2035

పట్టె నామములు బెట్టి దాసరి యనిపించుకొనవచ్చును. లింగము గట్టుకొని జంగమనిపించుకొన వచ్చును గాని బ్రహ్మ

జ్ఞానము లేనిది వట్టిశటాటోపములతో బ్రాహ్మణుఁ డనిపించుకొనుట యసాధ్యము.

క. దినముల వ్యర్థము పుచ్చక
కనుచుండుమి యాత్మ నెపుడు ఘనగురుబోధ
న్నిను నీ వెఱుఁగక యున్నను
గొనకొని మది చెఱుచుపన్ను గొబ్బున వేమా!

కాలమును వ్యర్థముగా గడవఁ ద్రోయక నీలో నీవు గురువు చేసినయాత్మబోధను ధ్యానించి ఆత్మస్వరూప సందర్శనమునకుఁ గృషిచేయుము. నిన్ను నీవు చంచలుఁడవై యెఱుఁగఁజాలవేని చెడిపోదువు.

తే. దురితముల నెల్ల ఖండించుగురుని జేరి
పరమనిర్గుణమననంబు ప్రాఁకినంత
గురుతరంబుగ గుణములు కొట్టువడును
పరశివుం డన భాసిల్లు ధరను వేమ! 2087

మోక్షమార్గ ద్రష్టయగు గురునాశ్రయించి నిర్గుణోపాసనము విధ్యుక్తముగ నెఱవేర్చిన యెడల దుర్గుణంబు లన్నియు నంతరించును. శివస్వరూపమును బిమ్మట వహించి ధన్యుఁడు కావచ్చును.

తే. దివ్యపరతత్త్వ మనుజ్ఞప్తి ధీజయుండు
మరలి పుట్టనిగురుభక్తి మహిమతోడ
నతఁడు యాత్మకపరమంది యమలుఁ డగును
ఏమలిన మాతనికి నంట దెవుడు వేమ! 2088



పరతత్త్వోపాసనము గావించుధన్యునకు గురుభక్తియే తరింపఁ జోద్పడును. వానికి మోక్షము సుగమ మగును. ఐహికసంబంధమగు నెట్టి మలినమైన నాతని నంటుకొనఁ జాలదు.

తే. దివ్యమైనట్టి పరశివతేజ మూని
భవ్య మగుయుక్తి మదిలోన భద్రపఱచి
సేవ్యుఁడై యుండుటేముక్తి స్థిరము గాను
కావ్యముల రాదు గురుబోధ కలదు వేమ!

పరశివ తేజమును హృదయమునందు నుంచుకొని నియమానుసారముగ దానిని ధ్యానించుచు సేవించుటవలన ముక్తి చేకూరును. గురుబోధవలన నేనాఁటికైన మోక్షము లభించును గాని గ్రంథపఠనమువలన లభింపదు.

ఆ. దేవభూములందు దేవాలయములందు
దేవుఁ డనుచు మ్రొక్కి తెలియలేక
తిరుగుచుండువాఁడు దేవాదిదేవుఁడా, వి...

కొందఱు దేవళములలో దేవుఁడున్నాఁడని యెడతెఱుఁగక మ్రొక్కుచుందురు. ఇటుల మ్రొక్కువారవివేకులుగాని దైవస్వరూపానుభవము గలవారు కానేకారు.

ఆ. దేహ మాత్మరూపు తేటతెల్లము జేసి
యవలి చూపు జూచు నతఁడె గురువు
భ్రమరము తనరూపు క్రిముల కిచ్చినరీతి, వి...

తుమ్మెద తనయాకారము పురుగునకుఁ గలుగఁజేయునట్లు ఆత్మరూపము శిష్యున కెఱింగించి దేహభ్రాంతిని బోఁగొట్టి

స్వస్వరూపజ్ఞానము శిష్యున కందఁజేసినవాఁడె గురువనఁదగు వాఁడు.

తే. దేహ మాత్మలు వేఱని తెలియలేక
మోహమునఁ జిక్కి నిద్రలో మునుఁగువల?
సాహసంబున గురుభక్తి సలుపవలెను
వివర మాతండు దెలిపెడి వేగ వేమ! 2042

శరీరమునకు ఆత్మకు సంబంధములేదని తెలిసికొనలేక అజ్ఞానులు మోహనిద్రలో మునిఁగి తేలుచున్నారు. సద్గురుసన్నిధి చేరినచో నతఁ డజ్ఞానమును బోకార్చి తరింపఁజేయఁగలఁడు.

ఆ. ధర్మమునకు గీడు తలఁచినవాఁడు తా
దుష్టుఁ డగుచు తుదకు ద్రోవయె చెడు
గురువుపత్ని గవయ గోరెడునీచుండు
మొదలు చెడఁడె ముష్ప మూఢి వేమ! 2043

ధర్మమును జవదాఁటి సంచరించునీచుఁడు తప్పక నశించును. గురుపత్నితో సంగమించిన చంద్రుఁడు గొప్పదనము నంతయుఁ గోలుపోయి మొదలునకె మోసము చెందలేదా?

ఆ. నిజగురూపదేశ నిశ్చయాత్మకవిద్య
రక్షకం బటంద్రు రాజవీథి
మధ్యమార్గమందు మాన్యతఁ జూడరా, వి...

గురూపదేశ మగు నిజమైన విద్య శిష్యుని గడతేర్చుటకు రాజవీథి వంటిది. ఈమార్గము ననుసరించి నిర్గమించినచో మోక్షము సుగమమగును.



ఆ. నిజము కల్ల రెండు నీలకంఠుఁ డెఱుంగు
నిజము లాడకున్న నీతి దప్పు
నిజములాడునపుడు నీరూప మనవచ్చు, వి...

సత్యాసత్యములను సర్వేశ్వరుఁ డెఱింగియేయున్నాఁడు. కావున నిజమునే బలుకుము. నీతిని తొలఁగి నడవకుము. నిజము పలుకువాఁ డీశ్వరరూపుఁ డనవగును.

క. నిందించు భ్రమలఁ జెందక
పొందినమదిఁ జేర నొక్కి పోడిమితో నీ
వందుకొని గురురహస్యము
సందియ్యక పూర్ణుఁ డగుము సరగున వేమా!

నిందాభ్రమలను వీడి మదిని చిక్కఁబట్టి గురూపదేశ రహస్యమును సర్వదా ధ్యానించి పూర్ణుఁడవగుము.

తే. నిరత మాత్మచిదానందనిలయమందు
సరవితోడుత పరిపూర్ణసౌఖ్య మెఱిఁగి
యరిది యగుబయ లేరుట యనుభవంబు, వి.

ఎల్లప్పుడును ఆత్మ యనుచిదానందనిలయమునందు పరిపూర్ణ సౌఖ్యస్వరూపము నెఱింగి చిన్మయుఁ డగుటయే యనుభవమనఁబడును. దాన బయలు చేరవచ్చును.

ఆ. నూటెనిమిదిగళ్ల నోముల పుణ్యాలు
కలవా జీవులకును గణనలేదు
చెడిననీళ్లు నదుల చేరెడినట్లయా, వి... 2048

అష్టోత్తరశతగాయత్రిజపమువలనను దదితర జపముల వలనను గొంచెమేని లాభములేదు. ఈజపతపములు మురికి నీరుగుంటలఁ జేరునట్లు గాలిలోఁ గలసిపోవు ననుట సత్యము.

ఆ. నూఱు పలుకవచ్చు నుడి వ్రాయఁగారాదు
వ్రాఁతకన్న సాక్షి వలవ దెన్న
బరగ లేనివ్రాఁత భంగపాటుం దెచ్చు, వి...

కల్లలు అవసరము వెంట ఎన్నింటినైన పలుకవచ్చును గాని కల్లమాత్రము వ్రాయరాదు. వ్రాఁత పరలోకమున మన పాపమునకు సాక్ష్యమగును. లేనివ్రాఁత ఇహపరములలో నానావమానములు గూర్చును.

ఆ. నేర్చి నడతు నన్న నేరమి తా వచ్చు
నోర్చి నడతు నన్న నోర్వరాదు
కూర్చి నడతు నన్న కూడంగ నీయదు, వి...

నలుగురి కనుకూలముగా నేర్పుగా నడుచుకొందమనుకొన్న నేదియో పొరపాటువచ్చుచునే యుండును. ఓర్పుగా నుందమనుకొన్న సహనశక్తి కలుగుటలేదు. నలువురితోఁ గలసి మెలసి యుండమన్నఁ బరిస్థితులు కలియనీయవు. ఇఁక నెటులో?

ఆ. పట్టుగొమ్మ వదలి పలవింప నేటికి
ఇట్టె గురుని వేఁడి గుట్టు నెఱిఁగి
నిట్టనిలువు గాంచి నిర్గుణ మొందరా, వి. 2051



అవలంబము లేక విలపించుటకంటె గురువును జేరి రహస్యము నొంది నిర్గుణత్వము నొందుము.

ఆ. పడఁతి మోసె నొకఁడు పడఁతి మెసె నొకండు
పడఁతి నురము జేర్చి బ్రదికె నొకఁడు
పడఁతికొఱకె పెక్కుపాట్లను బడిరయా, వి...

లోక మంతయును స్త్రీలకై పెక్కుపాటులను అనుభవించి యున్నయది. శివుఁడు తనయాలిని సగము మేనదాల్చి మాయ లేక తిరుగుచున్నాఁడు. విష్ణువు వక్షమున నుంచికొనినాఁడు. బ్రహ్మదేవుఁడు తననోటిలో నుంచికొనినాఁడు. చూచితిరా త్రిమూర్తుల యవస్థలు.

ఆ. పడుచుమాటలాడి పరితపింపఁగ నేల
వెడగుచర్య లడచి వేఁడి గురుని
యడుగులంటిమ్రొక్కియాసనువిడఁద్రొక్కు, వి

పడుచుమాటలఁ బలికి పిమ్మట పశ్చాత్తప్తుఁడవగుటకంటెను ముందుగనే గురువులపాదములపై వ్రాలి ముక్తుఁడవగుటకు యత్నింపుము. చెడునడవడి మానుకొమ్ము.

ఆ. పడుచు నూఱుకేలఁ బాఱ జూచెదరొక్కొ
యెంతవారలైన భ్రాంతి నొంది
లోన మీఱుకామము లొంగఁజేయఁగలేక, వి.

ఎంతవారైన స్త్రీలు కనుపింపఁగనే లోనికామమును లొంగదీయఁజాలక లోకులు వారివేల పాఱఁజూచి చెడిపోయెదరో కదా!

ఆ. పరఁగ దేవుఁ జేసి ప్రజలను మ్రొక్కించి
తొలఁకుభూమి కెల్ల దొరను జేసి
మనుజవరులకు నిల మాంగల్యమును జేసి
యాజ్ఞ చేసి యేలె నతఁడు వేమ! 2055

శిల్పి దేవునివిగ్రహము సృష్టిచేసి యాతనినే (ఆవిగ్రహమునే) ప్రభువునుగాఁ జేయుచున్నాఁడు. మనుజులకు దాంపత్యబంధములు తెగిపోవకుంటకై మంగళసూత్రముల నిర్మించుచున్నాఁడు. ఇందుచేఁ బాలించువాఁడు శిల్పియే కదా!

ఆ. పరఁగ నింతదనుకఁ బడినపా టెఱుఁగఁడో
ఘనత నొప్పుమనుజుఁ డనఁగఁ బుట్టి
కీడు మే లెఱుఁగక క్రిందగు చిత్రము, వి...

మనుజుఁడు తా నిన్నిజన్మములందును పడినపాటును స్మరించియును మరల క్రిందుమీఁ దగుచుండును. ఎంతటి చిత్రము!

ఆ. పరధనంబులకును ప్రాణము లిచ్చును
సత్య మింత లేక జారుఁ డగును
ద్విజులమంచు నెంత్రు తేజ మించుకలేదు, వి.

ఈకలికాలమునఁ బరులధనమునకు నాశించి దానిగ్రహించుటకుఁ బ్రాణములైన ధారవోయుచు జారవృత్తితోఁ బడుపుఁ గెలువలఁ గవయుచు జ్ఞానహీనులు మేము బ్రాహ్మణులమని తేజశ్శూన్యులయ్యుఁ జెప్పుకొనుచున్నారు. ఎంత లజ్జాకరము!

ఆ. పరపురుషునిమీఁదఁ బ్రాణంబు వెట్టుక
మగువ సేయుచుండు మంచితనము



అట్టిభంగి యోగి యాత్మ భావించును, వి...

జారిణి పరపురుషునిమీఁది యాసచేత మగనిదరిని మంచితనమున నటించునట్టులే యోగియును ఆత్మసిద్ధికై శరీరమును పోషింపుచు మోక్షమునకై ప్రయత్నించును.

క. పరమాత్మునిచింతనలోఁ
దలఁచుచుగ నుండుటయె తగును ధర నొక్కటికిఁ
దిరిపము నెత్తి భుజించుచు
దొరవలె గృహవేదికందు తొంగుము వేమా!

పరమాత్మధ్యానమే తలఁచుచుగా మదిలో నుంచుము. ఇట్లు చేయుచు నిరీహుఁడవై యేగృహముననేని యుండి భిక్షాన్నముతోఁ బొట్టబోసికొనుము.

క. పరిపక్వ మొప్ప శిష్యున
కురమందలి బయలు చూపి యుద్ధతి మీఱన్
పరిపూర్ణ మంచఁ జేసెడు
గురుఁడు పరబ్రహ్మమైన గుణనిధి వేమా! 2060

శిష్యుని కర్మము పరిపక్వమొందుటకు హృదయమందున్న ఆకాశమును జూపి జ్ఞానపరిపూర్ణుని గావించు మహానుభావుఁడే గురుఁడనిగాని పరబ్రహ్మమనిగాని చెప్పఁదగువాఁడు.

ఆ. పరులవిత్తమందు భ్రాంతి వాసినయట్టి
పురుషుఁ డవనిలోనఁ బుణ్యమూర్తి
పరులవిత్త మరయ పాపసంచితమగు, వి...

పరద్రవ్యములపైని ఆశ లేనివాఁడే యరసినచో పుణ్యమూర్తి యని తెలిసికొనుము. పరులద్రవ్యమున కాసనొందుట పాపము మూటఁగట్టుకొనుటయే.

ఆ. పక్షిజాతి బట్టి పరఁగ హింసలు బెట్టి
గూళ్ళ గట్టి యందు గుదురఁబెట్టి
యుంచువారి కట్టిపంచన రాదొకో, వి... 2062

నిరపకారులై యుండుపక్షులఁ బట్టికొని గూళ్లలో పంజరములలో బంధించువారికిఁ గూడ అట్టిగతియే కలుగును.

క. పాదుకొని హృదయమందును
సాధారణవృత్తు లడఁచి సన్నుతిగను జీ
వాధారచక్రమందును
మోదంబున విఘ్నపతికి మ్రొక్కుము వేమా!

హృదయమును ఆవరించియున్న ఐహికములగు సాధారణవృత్తుల వదలివేసి జీవాధారచక్రము నధిష్ఠించియున్న విఘ్నపతికి నమస్కరించుచు గడతేఱుటకుఁ బ్రయత్నింపుము.

ఆ. పాలగలియు నీరు పాలైయె రాజిల్లు
నట్లు గురునివలన గోవిదుఁడగు
సాధుసజ్జనముల సంగతు లిట్లురా, వి... 2064

పాలతోఁ గలసిన నీరు మాధుర్యము వర్ణమునొంది పాలె యగునటుల సామాన్యశిష్యుఁడు సహితము గురుసేవవలన గురునియంతవాఁ డగుచున్నాఁడు. సజ్జనసాంగత్యము లీవిధము గనే యుండును.



ఆ. పాలనీటికలఁత పరహంస మెఱుఁగును
నీరుపాల నెట్లు నేర్చు నెమలి
అజ్ఞుఁడైన హీనుఁ డలశివు నెఱుఁగునా? వి...

పాలనీళ్ల భేదమును పరహంస మెఱుఁగునుగాని నెమలి యెఱుంగనట్టులనే అజ్ఞుఁడు ప్రాజ్ఞునివలె శివుని యెఱుఁగఁజాలఁడు. పరమార్థజ్ఞాన మీశ్వరదత్తము.

ఆ. పాలప్రియముచేతఁ బరఁగ నేడ్చెడిబిడ్డ
తృుత్తు దప్పుల కిల శోకపడఁగ
దల్లిపనులు తీర్చి తనయుని ముద్దాడు, వి...

పాలకై బిడ్డ లేడ్చుచున్న పని త్వరితముగ తీర్చికొనిన పిమ్మటనే బిడ్డలను తల్లిముద్దాడినట్టులు గురువును శిష్యుని ఆదరించి ముక్తునిఁ జేయును.

ఆ. పాలరాళ్ల దెచ్చి పరఁగంగ గుడిగట్టి
చెలఁగి శిలల పూజ చేయుచుంద్రు
శిలలసేవఁ జేయఁ జిక్కున దేమిటి? వి... 2067

అలంకారములకొఱకుఁ దెల్లని పాలఱాళ్లతో దేవళములు గట్టి యజ్ఞులు మురియుచు నంచున్న శిలల దైవముగా నెంచి పూజించుచుందురు. శిలలను పూజించుటవలన లభించు ఫలమేమియుఁ లేదు.

ఆ. పాలు పెరుగు వెన్న పాయసంబును నేయి
జున్ను లెన్నియైనఁ జూడ పాలె
పాలవంటికులము బ్రహ్మంబు గానరో, వి...

వెన్న పరమాన్నము. నెయ్యి జున్ను లోనగునవి యన్నియు నామభేదములు దాల్చియున్నను మూలవస్తువుపాలెగదా? ఆటులె బ్రహ్మగూడ సాధకుల యభిరుచులఁ బట్టి నామాంతరములు రూపాంతరము లొందుచున్నాఁడు.

ఆ. కల్లలాడుకంటె కష్టంబు మఱి లేదు
కష్ట మెపుడొ కీడు కలుగఁజేయు
ద్విజుఁడ ననుట చూడ త్రిమ్మరితనమురా, వి...

కల్లలకంటె కష్టప్రదములు వేఱుగాలేవు. ఆయినను కల్లలకు జంకక తిరిగెడువాఁడు ద్విజుఁడైనను ద్రిమ్మరియే యగును. కల్లలాడిన నేఁడు కష్టమురాకున్నను ఏనాటికైన కష్టము రాక పోదు.

ఆ. కల్లుద్రాగువాని కల్లుముచ్చనరాదు
కల్లలాడువాఁడె కల్లుముచ్చు
కల్లుద్రాగుకంటె కల్లలాడుట కీడు, వి... 2070

మధుపానము చేయువాని ద్రాగుబోతని యనరాదు: కల్లలాడువాఁడె నిజముగాఁ ద్రాగుబోతు కల్లుద్రాగుటకంటెఁ గల్లలాడుటయే మిగుల గీడుగలుగఁజేయును.

ఆ. నిజము లాడునతఁడు నిర్మలుఁడై యుండు
నిజము నాడునతఁడు నీతిపరుఁడు
నిజము బల్కకున్న నీచచండాలుఁడు, వి...

నిజముబల్కువాఁడు నిర్మలుఁడైయుండును. వాఁడే నీతి



పరుఁడు. నిజమును పలుకనివాఁడే నిజమును బగికించినచో చండాలుఁ డనఁదగును. జాతిచండాలుఁడు చండాలుఁడు కాఁడు.

క. పగ లుడుగ నాశ లుడుగును
వగ పుడుగం గోర్కె లుడుగు పడి జన్మంబుల్
తగు లుడుగు భోగ ముడిగిన
త్రిగుణంబును నుడుగ ముక్తి తెరువగు వేమా!

విరోధములు మానినగాని ఆశ లంతరింపఁజాలవు. విచారము మానినఁగాని కోరుకు లంతరింపవు. భోగముల యంటుఁ బాసినఁ గాని జన్మాంతరము లొందుట దప్పదు. త్రిగుణముల వదలినఁ గాని మోక్షము చేకూఱదు.

ఆ. పుట్టు పుట్టలేదె పుడమిని జనులెల్ల
పుట్టి గిట్టలేదె పూర్వు లెవరు?
పుట్టి గిట్టు టెల్ల పట్టి భ్రాంతులు సుమీ, వి...

పుట్టినవారందఱు మరణించుచునే యున్నారు. పుట్టినవారిలోఁ జావనివారులేరు. పుట్టువు చావు రెండును భ్రాంతులు. ఏలయనఁ జచ్చినవాఁడు తిరుగఁబుట్టుచున్నాఁడు. పుట్టినవాఁడు తిరుగఁ జచ్చుచున్నాఁడు.

ఆ. పూసపోగుపసిఁడి పుష్పంబు మొదలగు
సంపద గలవాఁడు జగతియందు
హీనకులజుఁడైన హెచ్చునియందురు, వి... 2074

పూసబుట్ట మున్నగునాభరణము లున్నవానిని హీనజాతి

వానినైనను హెచ్చుచుందురు. ఆహా! ఏమి చెప్పఁదగును. అర్థ వైభవమును.

ఆ. పెట్టి పోయలేని వట్టిదేబెలు భూమి
బుట్టిరేమి వారు గిట్టిరేమి
పుట్టలోనఁ జెదలు పుట్టదా గిట్టదా, వి... 2075

ఇతరులకుఁ గొంచెమేని యీయఁజాలని [illegible]వేళి దేబెలు పుట్టిన నెంతయో చచ్చిన నంతయే. పుట్టలోఁ జెదలుపుట్టి చచ్చునట్లు వీని జననమరణములు మిగిలినవారిని ఏచూపి పెట్టవు.

ఆ. పొత్తుగుడువ వచ్చు పుత్రుఁడే యయినైన
దొత్తుకొడుకు నెంగి లెత్తుకుండ్రె
కాని వానిజోలిఁ గాన రీరీతిగా, వి... 2076

కొడుకును ఎంతపెద్దవాఁడైనను దగ్గఱఁ జేర్చుకొని తండ్రి పొత్తునభోజనముఁ జేయుచున్నాఁడు. తొత్తుకొడుకుతో నెవరేని యిటులఁ జేయరు. కానివానిని లోకులీవిధముగాఁ దిరస్కరింతురు.

ఆ. ప్రభువు క్రోఁతియైన ప్రగ్గడ పందియగు
సైనికుండు పక్కి సేన పసులు
నేన్గు లశ్వములును నెలుకలు పిల్లులు, వి. 2077

రాజు కోఁతివలెఁ జంచలుఁడైన, మంత్రి పందివలెఁ దిండిపోతగును. సైనికులు పక్షివలెఁ దిరుగుబోతులగుదురు. సైన్యము పశువులవలెఁ గుక్షింభరులగుదురు. ఏనుఁగులు గుఱ్ఱములు, ఎలుకలు పిల్లులవలెఁ బనికిమాలిన వగును.



ఆ. ఫణికి కోఱ లుండ భయ మొందునట్టులే
వెఱతు రయ్య దుష్టవిభవమునకు
కోఱలూడఁ ద్రాఁచు మీఱినా దుష్టత, వి...

పామునకుఁ గోఱలు విషముగలదని భయపడినటుల లోకులు నీచుని యైశ్వర్యముఁగాంచి కూడ భయమొందుచు నుందురు. కోఱలూడిన పామువలె సంపదలేని నీచుఁ డపాయకారి కాఁడు.

ఆ. బాపఁ డనఁగ నేమి భక్తుఁ డనఁగ నేమి
జోగి యనఁగ నేమి సుక్క నేమి
ఇన్ని యేల వెనుక నినజుండు పని దీర్చు, వి ..

బ్రాహ్మణుఁడు భక్తుఁడు మున్నగు భేదముల నాలోచింపక యముఁడు అందఱను వారివారి పాపముల కనుగుణముగా దండించును. ఈమాఱు లోకము లితరలోకములలో సాగవు.

ఆ. బాలచనులఁ బూలబంతులఁ బోల్తురు
ప్రాలుమాలినట్టి భ్రాంతు లవని
మాంసఖండమందు మఱి యేమి యున్నది? వి.

స్త్రీలచన్నులను పూలబంతులు అని పల్కుదురే కాని అందేమియు లేదు. ఇట్లు చెండ్లతోఁ బోల్చువారు భ్రమగలవారు. చనులు కేవలము మాంసపుముద్దలుగాని వేఱుగావు.

ఆ. బాల్యమందు తాను బహువిధముల పట్టి
చప్పరించినట్టి స్తనములకును
మోహ మింత యేల మూఢాత్మ తెలియరా, వి.

స్పష్టము.

ఆ. బూతులేనిలంజె భూతంబు కూఁతురు
ప్రీతి లేనిపాటు చేతచేటు
దాత లేనియూరు దయ్యాలపేటరా, వి... 2082

విటుల యభిమతముఁ దీర్పఁగలేని యుంపుడుకత్తె పిశాచము. ప్రియముగాఁ జేయనిపని నిష్ఫలము. దాతలు లేనివాడ దయ్యాలకొంపయే.

ఆ. బ్రాహ్మణునకు మ్రొక్క బహుదీపన లొసంగు
నాత్మశుద్ధి గలుగు నాతఁడైనఁ
గలుగు నన్ని కామి గంతశోష యె సుమీ, వి.

ఆత్మశుద్ధి గలవాఁడైన బ్రాహ్మణునకు మ్రొక్కిన పెక్కుదీవ నలనిచ్చును. కానివానికి మ్రొక్కిన కంఠశోష తప్ప వేఱె ఫలములేదు.

క. భక్తికి మూలము జ్ఞానము
రక్తిగ గురుచెంతఁ జేరి రక్కొనినంతన్
యుక్తిగ నెఱుకై తోఁచును
ముక్తికి నిలయమగు దారి మునుకొని వేమా!

భక్తిమూలముగాఁ గలది జ్ఞానము. గనుక గురువుల భక్తితో సేవించి ముక్తికిరవగుజ్ఞానము నొందుము.

ఆ. బత్తిలేక లంజె పలుమారు పిలచిన
బత్తిగాదు లయపుమిత్తిగాని
మిత్తి చొరఁగ నిల్లు మ్రింగక పోవునా? వి..



వలపులేనిలంజె పలుమాఱు పిలచినదని గవయఁబోరాదు. దానివలనఁ జావు తప్పదు. మృత్యుదేవత యిల్లుఁ జొచ్చినచో మానవుల గడతేర్పక విడువనట్లు లంజెవలనఁ జావు తప్పదు.

ఆ. భక్తి ముక్తి గలుగు భాగ్యంబు గలుగును
చిత్త మెఱుఁగుపడఁతి చెంతఁ బతికి
జిత్త మెఱుఁగనిసతిఁ జేరంగరాదురా, వి...

భార్య చిత్తానుకూలయైనచో భక్తిముక్తులు మున్నగునవి చేకూరును. లేనిచోఁ గలుగవు. కావున చిత్తము నెఱుఁగక స్త్రీని కూడఁదగదు. చేరనీయకూడదు.

ఆ. భక్తి యున్నచోటఁ బరమేశ్వరుం డుండు
భక్తి లేనిచోటఁ బాపముండు
భక్తి గలుగ వాఁడు పరమాత్ముఁడగునయా, వి.

భక్తిగలచోటఁ బరమేశ్వరుఁ డుండును. భక్తిలేనిచోట నుండునది పాపమే. భక్తిగలవాఁడు పరమేశ్వరస్వరూపుఁడుగాని సామాన్యుఁడు కాఁడు.

ఆ. భగము గోరువారె పలువురు గాన్పింత్రు
భగము గోరకున్కి జగతి లేదు
భగము గలుగువాఁడు భగవంతుఁడగునయా, వి.

ప్రపంచములోని మానవులలోఁ బెక్కండ్రు విషయాసక్తులై భగముల కాశించుచున్నారు. భగమున కాశింపనివానికి లోక

మే లేదు. భగముగలవాఁడు భగవంతుఁ డనిపించుకొనుచు న్నాఁడు.

క. భల్లుకము లోలి ప్రాజ్ఞులు
యిల్లోకమునందు గురుని నెఱుఁగరు తమలో
ముల్లోకము లెఱిఁగినటుల
గొల్లున బొగడుకొనుచుందు్రు గొనకొని వేమా!

కొందఱు ఎలుగుబంట్లవలె బలిసి ఈలోకములో గురుని నెఱుంగలేక తమ్ము తామే పొగడుకొనుచుందురు.

ఆ. భవుఁడు చిత్రముగను భార్యల మోయును
అట్టు మోయగలుగు దిట్టమైన
అతనివలెనె బూది యలఁదిన మెఱుఁగగు, వి.

ఈశుఁడు భార్యను ఆసక్తుఁడైయే వహించెను. ఆతనితో సామ్యము గోరువాఁడును అట్టి నేర్పుతో భార్యను మోయుట యేగాక విరాగియై విభూతిఁగూడ నటులే పూయవలయును.

తే. భోగభాగ్యంపుసుఖములఁ బొందవచ్చు
రాగవైషమ్యములనెడు దీగె దెంచి
వేగ మదియందు గురుభక్తి సాగనిమ్ము
యోగివరులకు దీటుగా నుందు వేమ! 2091

రాగద్వేషాదులను నిగ్రహించి గురుభక్తిని ఆర్జించినచో సౌఖ్య భోగభాగ్యములను అనుభవింపఁగలుగుదువు. గురుభక్తి హృదయమున నెలకొల్పఁగలుగుచో యోగీశ్వరులకు సాటిగా బ్రదుక వచ్చును.



తే. భ్రాంతిచేతను మర్త్యులు భక్తి విడువ
భయదమౌ పుట్టుచావులు ప్రాప్తమగు
నిట్టినరులకు కష్టంబు లెట్లు తీఱు
గురుని సన్నిధి తీర్చునా కొఱంత వేమ! 2092

భ్రాంతులై మర్త్యులు భక్తిని త్యజించి జననమరణములపాల్పడుదురు. ఇట్టివారెన్నటికిని ముక్తులు కాలేరు. వీరు ముక్తినొంద నెంచినచో గురుసన్నిధి చేరవలయును. గురువు ఈలోపమును దీర్పఁగలఁడు.

ఆ. మంటలోహములను మ్రానుచీలలయందు
పటముగోడలందు బరగ నిసుక
చెట్టునంటునట్లు పెనఁగు దేహము జీవి, వి...

లోహముల కగ్నియు, మ్రానులకుఁ జీలలు, గోడలకుఁ బటములు, చెట్టులకు నిసుకయు, బయటికంటినటులుండి నిజముగా నంటనటుల జీవుఁడు దేహముగూడ నటుల నంటి యంటనటు లుండును.

ఆ. మంటిలోనఁ బుట్టి మంటిలోనఁ బెరిగి
మంటిలోనె తిరిగి మనుజుఁ డాయె
మన్ను మంటఁ గలుప మనుజుఁడే తత్వము, వి...

మంటిలోఁ బుట్టి మంటిలోఁ బెరిగి మనుజుఁడు తుదకు మన్ను అయిపోవుచున్నాఁడు. మన్ను మంటిలోఁ గలుపఁగా మిగిలిన జీవుఁడే యీశ్వరుఁడు.

ఆ. మతములోనియోగి మాయ లన్నియు గోసి
ఘటములోన నున్నఘనుని దెలిసి
మాటమాటకు గురు మఱువక తెలుపురా, వి.

నిజమగుయోగి గ్రామనివాసమును మాని మఠమునందు వసించి ఆత్మస్వరూపుఁడగు భగవంతుని దర్శించుచు గురువాక్యమును స్మరించుచు నుండును.

ఆ. మంత్ర మొకటి చెప్పి మఱి దేవతార్చనఁ
జేసి కరుణ తమకు జెందినదని
వేదపఠనఁ జేసి వెఱ్ఱులై పోదురు, వి... 2096

మంత్రముల నుచ్చరించి దేవతలఁ బూజించి తాముకరుణాశీర మైతి మనుకొని మనుజులు వెఱ్ఱివారై పోయెదరే కాని కరుణాళురుమాత్రము నిక్కముగా కాఁజాలరు.

ఆ. మతిని గానలేరు మఱి బ్రహ్మమూర్తిని
మదిని గన్నవారు మహిని లేరు
వెదకి తనువులోన వేడ్కతో నెఱిఁగిన
యతఁడె యోగివర్యుఁ డరయ వేమ! 2097

మాటలే గాని మదిలో నున్న బ్రహ్మము నెఱుఁగలేరు. ఎవరైనను తమశరీరమును శోధించి యందలి ఈశ్వరు నెఱుఁగఁ గల్గెనేని వారే యోగివర్యు లనఁదగుదురు.

ఆ. మదమువలనఁ గలుగుమాటలు మఱి బల్కి
మ్రుచ్చుసుద్దులు నాగి మోసపుచ్చి
కాసురాఁ జేనఁగదరు కష్టుఁడగు గురుఁడె? వి...



మదమువలన జనించినదోసపుమాటలు పలుకుచు పంచకోత్తులచే నితరుల మోసగించుచు కాసురూక లార్జించు కష్టాత్ముఁడు గురుఁ డెన్నటికిఁ గాఁజాలఁడు.

ఆ. మదిఁ గలిగినపూజ మదనారి మెచ్చును
మనసు నిల్చినంత మహితుఁ డగును
మనసు లేనిపూజ మట్టిసమానము, వి... 2099

మనస్థిమితముగలిగిన పూజయైనచో నీశ్వరుఁడు సంతసించి జనుని తరింపఁజేయును; కాని అట్లు గాదేని ఆపూజ నిరర్థకమగును. మనస్సు నిలుకడఁగలవాఁడు పేరొందును.

ఆ. మనసులోనఁ బుట్టు మదికోర్కె లన్నియుఁ
గోర్కెలందు ముక్తి కుదురుపడదు
మనసు బ్రహ్మమనుచు మది నెఱుంగఁగ లేరు,వి.

మనస్సులోనికోర్కెల నన్నింటిని రూపుమాపినఁగాని మోక్షము కుదుటపడఁ జాలదు. అట్లైన గాని మనస్సు బ్రహ్మము నొందఁజాలదు. సామాన్యులు మనస్సు బ్రహ్మమని యెఱుంగఁజాలరు.

ఆ. మనసునందు ముక్తి మఱి యెఱుంగఁగ లేక
మనసుచేతఁ దగిలి మాయ మైరి
మనసు తానయైన మర్మజ్ఞుఁ డగుయోగి, వి...

మనస్సులో నున్నముక్తి నెఱుంగఁగాలేక మనుజు లనేకులు మోసపోయిరి. కావున మనసులోనిమర్మము నెఱింగి తాను మనస్సు ఏకముగావలయును.

ఆ. మనసులోనివాని మనసులోనె కలిసి
మనసులోనివాని మగ్న మంది
మనసుఁ దెలియువాఁడు మర్మజ్ఞుఁడై యుండు,వి.

మనసులో నున్నవానిని మనస్సులోనే కలిసికొని తన్మయుఁడై తత్త్వము నెఱింగినవాఁడే బ్రహ్మము నొందఁగలుగును. వాఁడే మనోమర్మజ్ఞుఁడు.

ఆ. మనసులోనె పుట్టె మాయసంసారము
మనసు విఱిగ నేని మాయ తొలఁగు
మనసు నిల్పె నేని మహి దానె బ్రహ్మము. వి.

ఈమాయసంసారము మనోజన్యము. మనస్సు విఱిగిన సంసారపుమాయ విఱుగును. కావున మనస్సును నిలుపుట వలన మానవుఁడు బ్రహ్మము నొందుచున్నాఁడు.

ఆ. మన్ను కుప్పఁ జేసి మంటిలో గోరాడి
మంటికుండ నంటి మరగి తిరిగి
మన్ను మంటఁగలియు మఱియొందుఁబోయెనో,వి.

దేవుఁడు మంటికుప్పవలన దేహములను సృజించుచున్నాఁడు. జీవుఁడు అజ్ఞానియై మఱియొక మంటిబొమ్మ కంటుపడి తిరుగుచున్నాఁడు. మన్ను మన్నులోఁ గలియుచు తఱి (జీవుఁడు[illegible]) మమకార మేమగునో?

క. మని[illegible]యుండెడి[illegible] యెల్లను
చని[illegible]వారిపుణ్య[illegible] తెలిసి



న్వినవలె మనవలె చనవలె
ననిమిషులకు నైన తెలియ దంత్యము వేమా!

బ్రదికియున్నవా రెల్లను భుక్తిముక్తులకు మూలములగు గతించినవారిచరిత్రములను వినవలయును. చదువవలయును. ఆరీతిగా నడచికొనవలయును. చావు ఎపుడో తెలియదుగాన పుణ్య మార్జింపవలయును.

ఆ. మనసు వాక్కు కర్మ మఱియేమి లేకయె
రాకపోక లేని రాజవీథి
పరఁగ హాని కలదె పరతత్త్వయోగికి, వి...

మనోవాక్కాయములకు అందక ప్రవృత్తినివృత్తిశూన్యుఁడగుపరాత్మునితో నైక్యము జెందిన యోగికి నాశములేదు.

క. మనసే మాయామృగమా
మన సేమిటి పైకిఁ గాని మఱిపోనీకా
మనసున మనసును జంపిన
మనసందే ముక్తి గలదు మహిలో వేమా!

మనస్సే మాయామృగము. ఆమనస్సును దేనిపైకిఁ బోవనీయక మనోవికారములను మనస్సుననే యంత మొందించిన యోగికి ముక్తి మనస్సుననే జతపడును.

ఆ. మన్ను పాఱఁ బట్ట మన కేమిలాభము
ధాన్యమట్లు చేయఁదగును గాని
ఘనునిలోప మెన్నగారాదు విడువుము, వి...

ధాన్యము పాఱఁబట్టిన లాభము గాని మన్ను పాఱఁబట్టిన

లేదు గదా! అటులే సంసారసంబంధములు విడువని వానిని విమర్శించిన లాభముగాని ప్రపంచాతీతుఁడగు యోగిని విమర్శించిన నేమి లాభము?

ఆ. మన్ను మిన్ను నంటి మహిమీఁద నొకకోట
కొమ్ము లమరియుండుకొనలు మిగిలి
దివ్వె లేనివెలుఁగు తేజరిల్లుచు నుండు, వి...

పృథివ్యాకాశముల నిండి మహదాకృతితో సమస్తవస్తుగతమై బ్రహ్మము చెలువొందుచున్నది. అది దివ్వెలేని వెలుఁగుగా జ్యోతిర్మయమై ప్రకాశించుచున్నది.

క. మాటల మాటలు వచ్చును
మాటలనే కలుగుచుండు మణిమంత్రంబుల్
మాటలపొందిక తెలిసిన
మాటలనే ముక్తికలుగు మహిలో వేమా!

మాటలవలన అపవాదము, మంత్రాది వశ్యసాధనములు కలుగుచున్నవి. మాటల పొందిక తెలిసినవానికి ముక్తి మాటలవలననే కలుగఁగలదు.

ఆ. మాదిగ యనఁగనె మఱి తక్కువందురు
మాదిగ యిల సురల మామగాదె
మాదిగకును బిడ్డ మనయరుంధతి గదా, వి...

మాదిగవానిని మిగుల నీచముగాఁ జూతురు. మాదిగ యొవరు? దేవతలకు మామయేగదా! మాదిగల యింటియాఁడుపడుచు దేవతలలో నొకఁడగు వసిష్ఠుని ధర్మపత్నియే గదా!



ఆ. మాయ నరక మనుచు మాయ రోయక సాటి
సమముగ నరదేవసభలయందు
సందడు ఘనులైన హరునకు దా వేది? వి...

మాయ నరక మనియును మాయయందే జనులు మగ్నులై పోవుచున్నారు. అట్లు వారుమాయావశులు కానిచో సందఱును ఈశ్వరమయులే యై కైలాసమునఁ జేరినచో ఇఁక హరునకు నిలువతలము చిక్కునా?

ఆ. మోదమునను గురుముఖ్యులకరుణచేఁ
దొమ్మిదిస్థలముల దొడ్డువాయ
సర్వజీవుఁ డాయె సర్వంబు తా నాయె, వి...

సంతసముతో గురువుల నను గ్రహమును సంపాదించి నవరంధ్రయుతమగు నీశరీరబంధమును వదల్చుకొనఁగలిగినచో సర్వమయత్వము జీవు నొందఁగలుగును. అపుడు సర్వరూపుఁడగును.

ఆ. మోహజలధిలోన మునిఁగి చచ్చుటె కాని
హరిపరాయణత్వ మమరఁబోదు
ముట్టి గురుని పాదమూలము నొందుము, వి.

మానవులు ఎన్నిదినములు శ్రమపడినను సంసారమోహమున మునిఁగి చచ్చుటే కాని హరిపరాయణత్వము నొందఁజాలరు. ఈ పీడ నివారించుకొనవలయు నన్నచో గురుపాదములను బట్టి జ్ఞానము నార్జింపవలయును.

ఆ. మోహమనెడి బుద్ధి మూలంబు నెఱిఁగి తా
మోహరించి గురుని మోముఁ జూచి

మోహమందు ముక్తి ముక్కొను నిక్కము, వి.

మోహమనెడిబుద్ధిమూలమును కనిపెట్టి గురుని సేవించి ముక్తి నొందుటకై మోహమునే సాధనముగాఁ జేసికొనుము.

ఆ. యోనియందు బుట్టి యుత్తమకులజుఁడై
బ్రహ్మకులమునందు బ్రదుకుచుండ్రు
బ్రహ్మ నెఱుఁగలేక పడి చత్తురిదె వింత, వి.

యోనిజనితజీవులే తామయ్యును సర్వోత్తములని బ్రాహ్మణుల మని చెప్పికొనుచు బ్రదుకుదురు. ఎంత వింత !

ఆ. రద్దిమూని మనసు రాపాడి ధ్వనిఁ జూపి
ముద్దుగులుకునాత్మ మూల మంది
సద్దుసేయకున్న సంసారి యోగియా, వి...

లేనిపోనియార్భాటములఁ జేయక మనస్సును చిక్కపట్టి యాత్మమూలమునఁ బాదు సేసి కేవలానందమును బొందవలయును.

ఆ. రాకపోక లడఁచు రాజమార్గముఁ బూని
నాక మనెడిగుర్తు వీక నెఱిఁగి
సోకి మించ బయలు సూత్రంబు గాదొకో? వి.

మనోవినిగ్రహప్రవేశములను గుర్తించి చిత్స్థానమునందు నెల కొల్పి ధ్యానించుట బ్రహ్మసాక్షాత్కారమునకు తగినసూత్రము. ఇది మోక్షసాధనసూత్రము.

ఆ. రాకపోకలేని రాజమార్గములోన
నేకమూర్తు దలఁచియున్న టరుదు



సోకి సోకి మాయ సోక్కించు టరుదురా, వి.

ప్రవృత్తినివృత్తిరహితమైనపద్ధతిని భగవంతుని ఏకరూపుగా ధ్యానించుచు మాయకు లోఁబడక మెలఁగవలయును.

ఆ. రాజయోగమూని తేజ మందుట ముక్తి
తేజ మందకున్న దేబెలె కద
మర్మ మంత లేక మహి గురుఁ జూడుము, వి.

రాజయోగము నవలంబించియును తేజము నందఁగలుగుట యే ముక్తి. అటులందఁజాలక యున్నచోఁ బట్టి తెలివిలేనివాఁడవు గనుక గురువుల నాశ్రయించి ముక్తుఁడవు గమ్ము.

ఆ. రాజయోగమునను రాజత్వమును బొంది
రాజరాజు దొడ్డరా జనంగ
రాజయోగమునను రాజశేఖరుఁ డాయె, వి....

రాజయోగము నాశ్రయించుటచేతనే రాజరాజు చక్రవర్తి యయ్యెను. రాజయోగమున నీశ్వరుఁడు రాజశేఖరుఁడయ్యెను. రాజయోగము ఆచరణీయము.

ఆ. రాజసంబుచేత రాజ్యభారం బందు
నోర్వ లేనియాతఁ డుభయతఁ జెడు
నీటిపైన గుండు నిలుచునా మునుఁగక, వి....

రాజసంబు గల సాధకునకు రాజ్యాధిపత్యము కలుగును. రాజై శాంతము మాని ప్రజలఁ బీడించువాఁడైనచో రాజ్యము మోక్షము చెడును. నీటిపై ఱాయి నిలువ నటుల శాంతహీనుని కేదియు నిలువదు.

ఆ. రాజసంబు జెంది రమణులపొందాస
పడెడువాఁడు గురునిఁ బ్రాపెఱుఁగునె?
విటులమరుగుయువతి విభుభక్తి యెఱుఁగునా? వి.

రాజసము గలవాఁడయ్యు గాంతాలోలుఁడగు జడుఁడు గురునియనుగ్రహము నేవిధముగ నైనఁ బడయఁజాలఁడు. విటుల కలవాటు పడిన వెలఁది భక్తితో భర్తను దిలకింపదు గదా!

ఆ. రూఢిగాను భక్తి రూపించి చెప్పిన
వాఁడె పరమగురుఁడు వసుధలోన
వేఁడి పరము గనుఁడె వేదాంతవేద్యము, వి...

భక్తిని నిరూఢిగాఁ దెలియఁ జెప్పువాఁడే యుత్తమోత్తముఁ డగు గురువు. కావున నాగురువును బ్రార్థించి ముక్తుఁడవగుము. మోక్షము నొందుటయే వేదాంత మెఱిఁగినందులకు ఫలము.

ఆ. రూఢి మదిని మించి రొదవినఁ జాలక
కాఁడు జేర నేమి ఘనము గలుగు
వీటిలోన రవము విన్నంద వినుచుండు, వి...

మనస్సును మించి నాదము కనిపెట్టఁజాలక శ్మశానములో తిరుగాడుచున్నంతమాత్రాన నేమియు నాధిక్య మలవడదు. నాదము నాలించువేని మహదాకాశము నెఱుంగవచ్చును.

ఆ. రోగిదైనవాఁడె రోగి నెఱుంగును
రోగి నరసి చూచి రూఢిగాను
రోగి కిడినవాని రాగి బంగారమౌ, వి... 2126

రోగి యగువాఁడె యొదటివానిని బరీక్షించి రోగిగాఁ గుర్తిం



పఁ గలుగును. ఇతరుఁడు గుర్తింపలేఁడు. అట్లు గుర్తించి రోగికి తామ్రభస్మమునిచ్చినను సువర్ణభస్మము వలెఁ బనిచేయును.

ఆ. లజ్జలజ్జ యనుచు లలనలమీఁదికి
లజ్జ విడిచి తిరుగు లావరియయి
లజ్జ తెలిసె నేని లలనలఁ దాఁకునా? వి... 2127

కొందఱు గడుసరివాండ్రు బయటికి లజ్జలజ్జయని యిచ్చకము లాడుచు లజ్జవిడచి తిరుగుచున్నారు. నిజముగా లజ్జగలవారు పడతులఁ దాఁకనైనఁ దాఁకుదురా?

ఆ. లేఁడు లేఁ డనినను లేఁడు లేనే లేఁడు
కాఁడు కాఁ డటన్న గానె కాఁడు
తోఁడు తోఁ డనినను దోడనే తోఁడగు, వి...

దైవము మనుజుల మనోధర్మము ననుసరించి లేఁడన్న వానికి లేకయు కాఁడనినవానికి కాకయు తోఁడనినవానికి తోడ్పడియు వచ్చుచుండును.

ఆ. లోకమందుఁ బుట్టి లోకమందె పెరిగి
లోకవిభవ మోర్వలేక జనుఁడు
లోకమందు జవికి లోఁబడి చెడిపోవు, వి...

జనులు లోకములోఁ బుట్టి అందే పెరిగి యిచ్చట లోకులగు వారిసంపదల నోర్వఁజాలక విషయాసక్తులై చెడిపోవుచుందురు.

ఆ. లోకములకు గురువు లోకులకును గురు
పదియుఁ దెలిసి మోక్షమందఁ గోరి
గురుని గనక నరకకూపముఁ జెందును, వి...

లోకములకు లోకులకు గురువే ఆధారము. ఆయంశమును గ్రహించి మోక్షము నొందఁ దలఁచిన వాఁడు గురునాశ్రయింప వలయును. లేనిచో నరకమే గతి యగును.

ఆ. లోను జూచినతఁడు లోకంబు లెఱుఁగును
బయలఁ జూచినతఁడు పరమయోగి
తన్నుఁ జూచినతఁడు తా నౌను సర్వము, వి.

అంతస్సును కనిపెట్టినవాఁడు అఖిలమును కనిపెట్టఁజాలును. బయలు దర్శింపఁ గలవాఁడె యుత్తముఁడు. తనలోని యాత్మ తత్త్వము గ్రహించినవాఁడె యాత్మజ్ఞుఁడు.

క. వంచన చేసెడి యెఱుకను
మించినపరతత్త్వ మమరు మేలిమి గన నా
శించును గన్గొని యుండిన
సంచారము లేనిబయలు సరగున వేమా! 2132

సామాన్యజనులకు లోనుగాక వంచించు జ్ఞానము నార్జించి మించినవానికి పరతత్త్వ మమరును. దానిని దర్శించి యానందించుచున్నచో నిర్గుణస్వరూపమగు బ్రహ్మము సాక్షాత్కరించును.

ఆ. వట్టిమమతఁ జిక్కి వావివరుస లంచుఁ
దిక్కుపట్టి నరుఁడు తిరుగుఁ గాని
యెక్కుడితలిదండ్రు లేమియుం దన కేల? వి.

నిరర్థకమగు మమత్వమునకు లోఁబడి వావులని వరుసలని నరుఁడు దిక్కుపట్టి తిరుగుచుండునే కాని తలిదండ్రులతత్త్వము నరయఁజాలఁడు.



ఆ. పక్షమందు గురుని వర్ణించి చూడరా
రక్షకత్వమునకు రాచబాట
అక్షమాల జపమె యవని దొంగలరీతి, వి...

హృదయమున నిశ్చలముగా బ్రహ్మస్వరూపమును దర్శింపఁ బ్రయత్నించుట ఆత్మోద్ధరణమునకుఁ ద్రోవ. అక్షమాలఁ బెట్టుకొని జపములు గావించుట పరులను మోసగించుటకె.

ఆ. వాక్కువలనఁ గలుగు పరమగు మోక్షంబు
వాక్కువలనఁ గలుగు వరలు ఘనత
వాక్కువలనఁ గలుగు నెక్కుడైశ్వర్యముల్, వి.

మాటవలననే మోక్షము ఘనత యైశ్వర్యము మున్నగునవి యన్నియును గలుగును.

ఆ. వాక్కునందు గురువు వక్తృతను గురువు
చీఁకటినటు గురుఁడు చిక్కియుండు
అఖిలమునకు గురువె యాధారమై యుండు, వి.

వాక్కులకు వక్తృత్వమునకు అంధకారమునకు దానిని పోఁగొట్టుటకు ఇంతయేల? సమస్తమునకు గురువే మూలాధారమని నమ్ముము.

ఆ. వారకాంత లెల్ల వలపించి వత్తురు
బుద్ధులెల్ల తొలఁగఁ బుచ్చుకొఱకు
మాట రూఢిగాఁగ మగ లెల్ల వత్తురు, వి. 2137

పురుషులబుద్ధులు చెఱచి వారిసంపదలఁ గొల్లగొనుటకు వార

కాంతలు వలపించుచుందురు. తమలోఁ దమకు మాటలు గలి యఁగనే పురుషులు రోఁవెలందుల విడువకుందురు.

ఆ. విటునిఁ జేరఁ గోరి వీథిని మది నుంచు
పడఁతిరీతి పరము బ్రాఁక నగును
గుణము లన్ని మఱచి గుర్తించి చూడరా, వి.

జారిణి విటుని జేరఁగోరి వీథిలోఁ నిలువఁబడియుండునట్టు లనే గుణము లన్నిటిని లెక్కసేయక మఱచి పరమునకొఱకుఁ బ్రయత్నింపుము.

ఆ. విటులఁ జూడఁగానె మటుమాయఁ జేయుచు
కిటికియందుఁ జేరి కేకరించు
పటిమ మీఱ స్త్రీలఁ బరికింప లేరయా, వి...

స్త్రీలు గావించు మోహతంత్రములు సామాన్యములుగావు. పురుషులను మోసముచేయుట కెన్నివిధములనో యత్నింతురు. కిటికిలోఁజేరి వలపుఁజూపులతోఁ జూచుచుందురు. స్త్రీలవంచ నోపాయము లెఱుంగుట యసాధ్యము.

ఆ. వెఱపు లేక గురుని వేఁడుచు వేసారి
స్థిరముగాను పూజ చేసి చేసి
పరము గన్నవాఁడు పరిపూర్ణయోగిరా, వి...

వైరాగ్యము శ్రమయే. ఎటులను భయముఁ బోనాడి గురుని బలుమాఱు బూజించుచు మోక్షరహస్యములఁ దెలుపఁ బ్రార్థించుచు గురూపదేశానుసారముగాఁ బరముగన్నవాఁడె జ్ఞానపూర్ణుఁడగు యోగి.

---

# ప్రపంచస్వభావపద్ధతి.

అవ. పంచభూతముల సమ్మేళనమువలనఁ బ్రపంచము కలిగెను. ఈ ప్రపంచమునందలి మానవులు కుటుంబభారవాహులై ఆశాపాశములచేఁ గట్టఁబడి యుక్తాయుక్తవివేచనశూన్యులయి కార్యాకార్యవిచారణశూన్యులై యున్నారు. ఆత్మోద్ధరణమార్గము యోజించుటకు మాఱు స్వలాభములగు పనులలోఁ బై మఱచి వర్తించుచున్నారు. మృత్యువు సన్నిహితముగా నుండెననియుఁ స్వల్పావకాశముగల యీమానవజీవితములోఁ బరమార్థవిచారణముచేయఁదగిన యమూల్యకాలము ఇంద్రియసౌఖ్యములకు వినియోగించుట మిగుల దోషమనియుఁ బ్రపంచమునకు వేమనమహాయోగి సాటనెంచి యీక్రిందివిధముగ ప్రపంచస్వభావపద్ధతిఁ దెలుపుచున్నాఁడు.—

ఆ. అండములను బుట్టు నలరు ప్రాణులు కొన్ని
బుద్బుదములఁ బుట్టు పురుగు లెల్ల
స్వేదములను బుట్టు జీవులు కొన్నిరా, వి....

ప్రపంచమునందలి జీవరాశి పెక్కువిధములఁ గానుపించుచున్నది. కొన్ని గ్రుడ్లనుండియుఁ గొన్ని చెమటనుండియుఁ మఱి కొన్ని వాయువునుండియుఁ జనించుచున్నవి.

ఆ. అందె యింద్రజాల మమర్త్యలోకంబులై

మించె నొకటికొకటి మింటియందు
తన్నుఁ దానె జూడ తలఁపులు మఱచెను, వి...

ప్రకృతియందు దైవవశమున లోకము లేర్పడెను. పిదప గారడిపలె మాయలోకము నావరించెను. పిదప నొకదానినొకటి మించ జీవరాశి ప్రయత్నము చేయసాగెను. మాయావశమున జ్ఞానశక్తి జీవరాశి కోలుపోయెను.

ఆ. అన్ని జాతులకును నాధార మైనట్టు
లున్న సానగాది మన్నెఋషుల
నెన్ని జన్మములను నెక్కడగానము, వి... 2143

సమస్తమునకు నాధారమై యుందురని వినువట్టి సానగాది ఋషిగణము ఎచ్చటఁ జూచినను కానఁజాలము. ఈకలికాలమున నట్టిమహర్షులు కనుపించుటలేదు.

క. అరిషడ్వర్గంబులచే
నరులెల్లను జిక్కి సొక్కి నైజము విడకే
యరుగుదురు గాక యెఱుఁగక
మఱుఁగైనది బ్రహ్మమనుచు మహిలో వేమా!

మనుజులు కామాదివికారములచేఁ గృశించుచు స్వభావసిద్ధమగు చిత్తచాంచల్యమును విడువక బ్రహ్మము మఱుగున నున్నది. దానిని కనుఁగొందమని ప్రయత్నింపఁజాలకున్నారు.

ఆ. ఆలివంకవార లాత్మబంధువులైరి
తల్లివంకవారు తగినపాటి
తండ్రివంకవారు దాయాదులైరయా, వి...



లోకములో పెండ్లమువంకవారు ఆత్మబంధువు గుచున్నారు. తల్లివంకవారుతగుపాటిబంధువులగుచున్నారు. తండ్రివంకవారిసంగతి తెలుపనే పనిలేదు. వారే దాయాదులు.

ఆ. ఆలి నొంచలేక యధమత నొందుచు
వెనుక నుంటి ననుట వెఱ్ఱితనము
చెట్టుముదురుపనేని చిదిమిన బోవునా? వి...

భార్యను స్వాధీనముఁ జేసికొనఁజాలక వెనుకఁబడుట తెలివితక్కువ యగును. కావున తొలుతనుండియే యత్నింపవలయును. చెట్టుముదిరినపిమ్మట వంగునా?

ఆ. ఆలు రంభ యైన సతిశీలవతి యైన
జారపురుషుఁ డేల జూడ మాను
మాలవాడ కుక్క మరగిన విడుచునా? వి...

ఆలు చక్కనిదైనను గుణవంతురాలైనను జారుఁడగు మగఁడు పరకాంతలను వెదకుచునే యుండును. కుక్క మాలవాడలో నలవాటుపడిన మరల నిల్లు చేరదుగదా!

ఆ. ఇచ్చి పుచ్చుకొన్న హితులును మనువులు
తగ్గు లేక యల్లుఁ దామరవలె
కాచి పూచి పండి కడు రమ్యమై యుండు, వి.

ఇచ్చిపుచ్చుకొనుటవలన చుట్టపక్కము లెక్కువగుదురు. చుట్టరికము తామరకొలనువలె నుండును. అపుడాకుటుంబము నేత్రానందకరముగ నుండును.

ఆ. ఇలను శూద్రు లౌట నెఱుఁగరు మొదలను
మనసు నతనిమీఁద మరలుకొల్పి
కొల్వఁగారొ ద్విజులు కోటానుకోట్లుగా; వి....

లోకులు బ్రహ్మత్వముకొఱకుఁ బెనఁగులాడ నవసరములేదు. దైవముపై నిజమగు భక్తిగల ప్రతిమానవుఁడు బ్రాహ్మణుఁడగును. ఈ బ్రాహ్మణులందఱు ఉపనయనము కాకముందు శూద్రులే!

ఆ. ఈకె లంటఁ జేసెఁ దోఁకలంటఁగఁ జేసె
గోక లంటఁజేసె లోకమునకు
మానరక్షణంబు మర్యాద యని తెల్ప, వి...

దేవుఁడు మనుష్యులకు మానసంరక్షణమే మర్యాదయని తెలుపుటకు తనసృష్టిలోని జంతువులకు ఈకలు తోఁకలు కోకలు మున్నగువానిని సృజించెను.

క. ఈఘనసూత్రము మెఱుంగుము
నీఘటమున శివుఁడు జేరి యిరవుకొనంగా
నేఘటపటములఁ గనదగ
తా ఘనుఁడై యాడుచుండు తథ్యము వేమా!

దేవుఁడు నీశరీరమును ఇరవుగాఁ జేసికొని ఘటములకుఁ బటములకు నందక మనస్సునం దాడుచున్నాఁడు. ఈసూత్రమును మెలఁకువతో గ్రహింపుము.

క. ఈచెవి గొఱికిన నొల్లరు
వాచవులకు విందుమన్న వాక్యంబులచే



పూచను బడుచులు వెఱచిన
ఆచందము లాయె జగము లన్నియు వేమా!

కలహప్రియులు పరులమీఁదఁ జెప్పు కొండెము లాలింపఁ జెవులొసంగుదురుగాని చెవికొఱకుట కిష్టపడరు. పూఁపచను పడంతులు కలయికకు వెఱచునట్లు బుద్ధిమంతులు కొండెములు వినుటకే వెఱతురు.

క. ఈతనువునందుఁ జూచిన
నేతనువుల కింతె యనుచు నెదిరిని దన్నుం
జూతురు లోఁగాఁ జూపున
నాతురముగఁ దపసు లెల్ల నమరఁగ వేమా!

తనదేహమునం దెటుల బ్రహ్మముగలదో ప్రతిశరీరమున నటులే గలదని పరమయోగులు ఎదటివానిని దన్ను సమానభావముతోఁ గాంచుచుందురు.

ఆ. ఉత్తమోత్తముఁ డగు నుర్వితత్త్వజ్ఞుఁడు
మహిమ జూపువాఁడు మధ్యముండు
వేషధారి యుదరపోషకుఁ డధముండు, వి....

తత్త్వము నెఱిఁగినవాఁ డుత్తముఁ డనియును మహిమఁ బ్రదర్శించెడివాఁడు మధ్యముఁ డనియును గుక్షింభరుఁడు వేషధారియగు దాంభికుఁ డధముఁ డనియుఁ నెఱుంగుము.

ఆ. ఉదకమందు మొసలి యుబ్బి యేనుఁగుఁ బట్టు
మతక మేమొ బయల మసలబోదు
ఎఱుక మఱుఁగుఁ దెలిసి యేకమై యుట్లుండవు, వి.

నీటిలో మొసలి యేనుఁగును బట్టి కదలనీయనియట్టులే విజ్ఞానమువలన మనస్సును బట్టి మఱగనీయక యైక్యము నొందింపవలయును. మొసలి బయట మసలలేనటుల నెఱుక లేకున్న నీబ్రదుకు వృథాయగును.

ఆ. అనయ మాసు బాపి యనలంబుఁ జల్లార్చి
గోఁచి బిగియఁగట్టి గోప మడఁచి
యాస విడచెనేని నతఁడు దా యోగియా, వి

నిజమగు యోగి కా నెంచినవాఁడు ఈర్ష్యను వదలిపెట్టి కామానలము క్షుదనలమును విడచి మనస్సును విషయాదుల మీఁదికి మరలనీయక పదిలపఱుపవలయును. ఆస మొదలంటఁ గోసివేయవలయును.

ఆ. అన్నము తినువేళ నాత్మ రుచుల గోరు
మదియు నాల్క సెప్ప నడుగుచుండు
ఆత్మకు తృణమైన నయ్యయో యనరాదు, వి.

భోగముల ననుభవించు కొలఁదిని సంతృప్తి కలుగక ఆశయే పెరుగుచుండును. కనుక ఆత్మకై (మనస్సుకై) దయపడరాదు. ఆత్మ తృణమేని యపేక్షింపదు.

ఆ. ఆశకన్న దుఃఖ మతిశయింపఁగ లేదు
చూపు నిలుపకున్న సుఖము లేదు
మనసు నిలుపకున్న మఱి ముక్తి లేదయా, వి.

ఆశకంటె దుఃఖకారణము మఱియొకటిది లేదు. చూపు



నిలుపకున్నచో సాధకునకు సుఖము కలుగదు. మనస్సు నిలుపలేనివానికి మోక్షమురాదు.

ఆ. ఆశ గననివాని నాశ్రయింపఁగ రాదు
ఆశ దీర్చువాని నడుగవలయు
ఆశ గలుగునంత కమలుండు గాఁడయా, వి....

ఎదటి వాని కష్టమును ఆశను గుర్తించి ధనమీయని వాని నాశ్రయింపరాదు. ఆశతీర్చువానినే యాచింపవలయును. మోక్షాశగలవాఁడు ఆశాపాశము మొదలంటఁ గోసివేసిన గాని కృతార్థుఁడు గాఁడు.

ఆ. ఆశ గోసి వేసి యనలంబు చల్లార్చి
గోఁచి బిగియఁగట్టి కోప మడఁచి
యాస విడుచువాఁడు నగు నిల యోగిగా, వి.

విషయములపై గలయభిలాషను పోనడంచి కోపము మున్నగు వానిని రూపుమాపి నిరీహుఁడై యుండువాఁ డుత్తమయోగి యగును.

ఆ. ఆశచేత మనుజు లాయువు గలనాళ్లు
దిరుగుచుంద్రు భ్రమలఁ ద్రిప్పలేక
ముఱికికుండమందు ముసరు నీఁగలభంగి, వి.

విషయాభిలాషచేత బ్రదికినన్నినాళ్లును మనుజులు మురికికుండపై నీఁగలు ముసరిన ట్లుందురు. ఆశగలవాఁడు భ్రమలను దిగవిడువఁజాలఁడు.

క. ఆశను విడువనిజీవికి
క్లేశము విడిపింప దరమె కేశవునకు నా
యాశాపాశము లెల్లను
రోసిన క్లేశంబు విడుచు రూఢిగ వేమా! 2162

ఆశను త్యజింపనివానికి కేశవునంతవాఁడైనను మోక్షమొసఁగుట దుర్లభ మనియును ఆశవిడిచినచో క్లేశములు వదలుననియుః రూఢిగ నెఱుంగుము.

ఆ. ఆశపాపజాతి యన్నిటికంటె నా
యాసచేత యతులు మోసపోరె
చూచి విడుచువారు శుద్ధాత్ము లెందైన, వి...

అన్నింటికంటెను ఆశయే పాపజాతి. కావున సదా మోసపోక తత్త్వము నెఱింగి త్యజించువారు ధర్మాత్ము లనఁదగుదురు. ఆశచే మునులంతటివారు గూడ మోసపోయిరి.

ఆ. ఆశపాశము మొదలంటగా దెగఁగోసి
పాఱవేయకున్న ఫలము గలదె
కొక్కు బోనులోనఁ జిక్కినచందము, వి...2164

ఆశ యొకపాశము (బంధము) వంటిది. కాన దానిని మొదలంట కోసివేయునంతవఱకు బోనులోని పందికొక్కునకువలె జీవునకు ఇహలోక బంధవిముక్తి కలుగఁజాలదు.

ఆ. ఆశపాశ మెల్లఁ గోసి వేసినవాని
చిత్త మెపుడు గురుని చేరియుండు
మోహపాశ మున్న మోక్ష మెక్కుడిదయా! వి.



ఆశాపాశమును ఛేదించి గురుసేవ జేయుచుండుము. మోక్షము కలుగును. చిత్తశుద్ధి చేకూరును. అట్లుగాక మోహమునఁ బడితివా ఇఁకమీఁద మోక్షమే నీకు దుర్లభ మగును.

ఆ. ఆశ యనెడిదాని కోసి వేయఁగ లేక
మోసబుద్ధివలన మునుఁగువారు
కాశివాసులైనఁ గనఁబోరు మోక్షము, వి...

ఆశాపాశమును వదల్చుకొనఁజాలక మోసపోయియుండెడివారు కాశికి పోయినను ముక్తినొందఁజాలరు.

క. ఆశయె యిహపరసౌఖ్యవి
నాశము భవబంధములకు నయముఁగ తానే
యీశుని గనుఁగొన నీయదు
ఆశవినాశంబె పరము మవనిని వేమా! 2167

సంసారబంధములకు ఇహలోకము పరలోకము లేకుండఁజేయుటకు ఆశయే కారణము. మానవుని నాశనముఁజేయుటకు ఈశ్వరసన్నిధిఁ జేరనీయక పోవుటకు ఆశయే తోడ్పడుచున్నది.

ఆ. ఆశలనెడి త్రాళ్ల నఖిలజనంబులు
కట్టుపడుచు ముక్తి గానరైరి
జ్ఞానఖడ్గమునను ఖండింపరాదొకో, వి... 2168

ఆశయను త్రాళ్ళచే జనులందఱు బంధితులగుచు మోక్షమును గనుఁగొనజాలకున్నారు. ఆశను మొదలంటన నఱుకవలయునన్న జ్ఞానఖడ్గము గావలయునుగాన జ్ఞానమార్జింపవలెను.

ఆ. ఆశ లుడుగఁ గాని పాశముక్తుఁడు గాఁడు
ముక్తుఁ డైనఁగాని మునియు గాఁడు
మునియు నైనఁగాని మోహంబు లుడుగవు, వి.

ఆశలు మొదలంటఁ బోయినఁగాని పాపము లడుగంటవు. పాపము లడుగంటినగాని సంసారబంధములనుండి ముక్తుఁడు గాఁడు. సంసారముక్తుఁడై గాని మోహాదు లడుగంటఁజాలవు.

ఆ. ఇంత వగవ నేల యేకాంతబుద్ధిని
హరిహరాదులందు నాస లుడిగి
వాసన దెలిసినవాఁడెపో బ్రహ్మము, వి...2170

పెక్కువిధములఁ బరితపించుటకంటె హరిహరాదిభేదబుద్ధిని ఆశను పరిత్యజించి వాసనాతత్త్వమును కనిపెట్టినచో ముక్తుఁడు కాఁగలఁడు. వాసనాతత్త్వ మెఱుంగుటే బ్రహ్మము నెఱుంగుట.

ఆ. ఇంద్రపదవి గోరి యింపుగా యజ్ఞముల్
కలిమిచేతఁ జేసి కాములైరి
పరమయోగ మూని పట్టఁగలేమిని, వి...2171

యోగమువలన స్వర్గలోకము సాధింపఁజాలని యవివేకులు యజ్ఞములు గావించి ఇంద్రపదవిఁ బడయఁ జూచుచున్నారు. యజ్ఞమువలన స్వర్గములో దొరకునది కామమే (రంభాసంభోగమే) గాని వేఱుగాదు.

క. ఇది నాకుఁ జాల దనుచును
మదిలో దానెపుడు దలఁచి మమతగను మతిం



పొదలుచు విడువం జాలని
దదియే సంసారబీజ మనఁబడు వేమా! 2172

ఉన్నంతతో తృప్తిఁబొందవలయును. అట్లు గాక ఎంతవచ్చినను చాలదు చాలదు అని అసంతృప్తితో నుండుటయే సంసారమునకు మూలకారణము.

ఆ. ఇదియె పరమటంచు మదికి దోఁచినఁ జాలు
మనసు చెదరకోర్కె మట్టుపఱచి
సుధను గ్రోలువాఁడు సుడిఁబడి చచ్చునా? వి.

తా ననుభవించునదియే యుత్తమ మనుకొని మనస్సును చెదరనీక ఆత్మబోధామృతమును గ్రోలువాఁడు ఎప్పటికిని మృతుఁడు గానేరఁడు.

ఆ. ఎక్కుడైన యాశ లినుమడియై యుండఁ
డిక్కుపట్టి నరుఁడు తిరుగుచుండు
కుక్కవంటియాస గూర్చుండ నీయదు, వి...

ఆశలు మనుజుని పిశాచములవలె చుట్టుకొని త్రిప్పుచున్నందున నరుఁ డిట్లు భ్రాంతుఁ డగుచున్నాఁడు.

సీ. కమలభవాండంబు కర్పటం బది యెంత
దానిలోపలి జగత్త్రయ మదెంత
దానినాల్గవపాలు ధారుణి యని యెంత
దీనియేడవపాలు దీవి యెంత
యందు తొమ్మిదవది యగుతునియ యదెంత
యాతునియలభాష లమితమయ్యె

అట్టిభాషలతోడ ననువుమీఱఁగఁ గడు
పొలుపాఱుచున్నట్టి భూములెన్ని
తే. అట్టిభూముల నేలువా రమితనృపులు
ఘనులు పెక్కండ్రు గలరని కడకు నెఱిఁగి
యొకరిదయ చాలగానమ్మి యుండుమనుజు
విభవ మేమనఁగావచ్చు వెఱ్ఱివేమ! 2175

బ్రహ్మాండమంతయు నొకతలపుఱ్ఱిగాన నది మిగుల చిన్నది. మూఁడులోకములాపుఱ్ఱిలో మిగుల స్వల్పభాగములు జలమయ మగు ప్రపంచములో భూమి నాలుగవపాలు. ఆభూమియంతయు నేడుద్వీపములుగా మాఱెను. గాన నందలి మన జంబూద్వీపము మిక్కిలిచిన్నది.అందుఁ బెక్కుభాషలు మాటలాడు ప్రజలు కలరు. ఈప్రజాసమూహమును ఈస్వల్పభూమిని బరిపాలించు రాజులు నసంఖ్యాకులైయున్నారు. ఈప్రపంచములో రాజునకుగల స్వాతంత్ర్య మిట్టిదని లోకులు గ్రహింపక, యేరాజునో ఆశ్రయించి జీవించుట యెంతయజ్ఞానమో యోచింపుఁడు.

క. కన్నెల నవలోకింపఁగ
జన్నులపై దృష్టిపాఱు సహజం బిలలో
కన్నుల కింపగుదృష్టిని
తన్నెఱుఁగుట ముక్తికిరవుతగునిది వేమా! 2176

వయసువచ్చుచున్న చిన్నారికన్నెలఁ గాంచఁగనే చూపులు వారి యుబ్బుచన్నులపై ఉఱుకును. అటు లుఱుకనీయక హృద



యమునందున్న బ్రహ్మస్వరూపము నెఱుంగ నుపయోగించుటయే మోక్షసాధనము.

ఆ. కన్నె వరుఁడు చేరి కదియంగ నొక్కప్పు
డుచ్చయందు పిండ ముద్భవించు
హెచ్చుకులజుఁ డెవఁడు హీనుఁ డెవండురా? వి.

స్త్రీపురుషుల సంయోగమునందలి జలమునందే ప్రపంచమంతయును బుట్టియుండఁగా నిఁక నిట్టిప్రపంచములో హెచ్చుతగ్గులకై కొట్టుకొన ప్రయోజనము లేదు.

ఆ. కమలభవుఁడు సేయుఁ గడుసృష్టి యందురు
హరి భరించు చంపు హరుఁ డటండ్రు
మూర్తులందఱైన మూల మొక్కటియెరా, వి.

బ్రహ్మ సృజించు ననియును హరి పోషించు ననియును హరుఁడు నశింపఁజేయుననియు నందురు; కాని విచారించినచో నీముగ్గురు నొక్కరే. ముగ్గురికి మూలమొకటే యని యెఱుంగఁగలవు.

ఆ. కల్య మారగించి కన్నులు ముకుళించి
బిఱ్ఱబిగిసియుండు బీదయోగి
మేఁకపోతువలెను మెఱమెచ్చులకు నయి, వి...

చలిదిఅన్నముఁ దిని కన్నులు మూసికొని మేఁకపోతువలె బిగిసికొని మెఱమెచ్చులకై యోగుల మని కొంద ఱవివేకులు కూర్చొని యుందురు.

ఆ. కలిగినట్టులుండు కలుగక యుండును
మఱియు లేక యుండు మఱియుఁ గలుగు
నాశకొలఁదిని శివుఁ డందించుచుండును, వి...

ఆశావరవశులగు ప్రాకృతుల కీశ్వరుఁడు వారివారినిష్ఠలననుస రించి కలిగినట్లు కలుగనట్లు లేనియట్లు ఉన్నయట్లు ఆశానుసారముగా ఫలప్రదాత యగుచుండును.

ఆ. కొవవలయు మగఁడు కాంత నెల్లప్పుడు
కావలేనివాఁడు చావ వలయు
కావులేనిదానికాపురం బడుగనా? వి... 2181

మగఁడు తనభార్యను మిగుల మెలఁకువతో నేలుకొనవల యును. చేతఁగాకున్న లోకనింద చెపకిపోఁకక ముందే చావవల యును. విచ్చలవిడిగా నాఁడుదాని విడచితిమేని యాకాపుర మడుగ వీలులేదు.

ఆ. కాశి మధుర కంచి గయప్రయాగలు సేతు
వాసతోడ వీని నాత్మఁ జూచి
వాసన నెఱుఁగమి వట్టి వెట్టివిధంబు, వి...2182

కాశి గయ ప్రయాగ మొదలగు పుణ్యక్షేత్రముల నాశతోఁ జూచి వైరాగ్యమును గడించి వాసన గ్రహింపఁ జాలకున్నచో పుణ్యక్షేత్రసందర్శనమంతయు వెట్టి తిరుగుడు కాఁగలదు.

ఆ. కుక్కయే మెఱుఁగును గురులింగదేవర
నక్కపో తెలుఁగునె యొక్కప్రొద్దు
మొక్కఁడీడి కొలుచు మోక్షమందఁగగనా? వి.



నీచులు అధికుల నెఱుంగఁజాలరు. కుక్క గురుదేవర నెఱుం గునా? నక్కకు ఒక్కప్రొద్దు తెలియునా?

ఆ. కోమటికి దురాశ కొండలు వాములు
చందనంబు పోన చంద్రకళలు
ఆశకు మితి లేదిక క్కడ గతి లేదు, వి...2184

కోమటికి ఇతరజాతులకంటె దురాశ మెండు. వాని దృష్టికి కొండలు వాములవలెను, చంద్రకిరణ వారము గందపుఁ జెక్క వలెను గానవచ్చుచుండును. ఆశాలోలుర కిహమునఁ దృప్తిపర మున మోక్షము కలుగదు.

ఆ. కోమటి నిష్ఠలు గుఱికిరా వెన్నఁడు
లోభిగుణముచూడ రూఢి యగును
బలిని దాసరి కిడఁ బోలుపడ నగునొకో? వి...

కోమటిచేష్టలు (ఇచ్చకపుపనులు) ఎప్పటికి సఫలములు కానే రవు; కాని లోభము మాత్రము ప్రకట మగును. దాసరి ముం బలియొసంగిన గామితములు సఫలముగానటుల కోమటి కెంత యిచ్చినను తృప్తికలుగదు.

ఆ. చిత్తమనెడివేరు శిథిలమైనప్పుడే
ప్రకృతి యనెడిచెట్టుపడును పిదపఁ
గోర్కులనెడి పెద్దకొమ్మ లెండునుగదా! వి.

మనోమూలము శిథిలత నొందినవెంటనే మాయావృక్షముఁ కూలును. మొదలు కూలినపిమ్మట ఆశాఖలు ఎట్లు నిలువఁ గలవు? కాన యోగికి మనోనిగ్రహ మావశ్యకము.

తే. చిత్తవృత్తులు మదియందుఁ జేరనీక
రిత్తబయలున గుఱి మించి రేయి బవలు
మత్తుఁడై యుండువాఁడెపో మాన్యుఁ డరయ
సత్తఁ దెలిసియె దరిజేర సరవి వేమ! 2187

వికల్పములను మనస్సులోనఁ బుట్టనీయక చిత్స్వరూప మును ధ్యానించుచుండువాఁడే యుత్తముఁడగుయోగి యని యెఱుంగుము. ఎదటివానివిద్య నెఱుగని దాశ్రయింపరాదు.

క. చక్కెర గలిపి తినంగా
ముక్కినతవుఁ డైన లెస్స మోహము గదుర
న్వెక్కుడు బానిసయైన
న్మక్కువగను దివ్యభామ మహిలో వేమా!

చక్కెర గలిపినచో ముక్కి తవుడును ప్రియమైన భక్ష్య మానట్లే మోహముఁ గలిగెనేని దాసియును దివ్యభామవలె గాన్పించును.

ఆ. చదువులందు రాజపదవులందును పాడి
మొదవులందు స్త్రీలపెదవులందు
నాశ లుడిగినట్టి యయ్యలు ముక్తులు, వి...

చిగురాకుఁ బోఁడుల పెదవులందు పాడిపశువులందు చదువు లుద్యోగములు సంపదలు మున్నగువానిపైనను నభిలాష లేని వారే నిక్కమగు ముక్తులు అని తెలిసికొనుము.

క. చనువారెల్లను జనులం
జనిపోయిన వారిపుణ్యసత్కథలెల్లన్



వినవలెఁ గనవలె మనవలె
ననిమిషులకుఁ దెలుపఁగూడ దంత్యము వేమా!

చనిపోయిన మహానుభావుల చరిత్రమును పఠనపాఠనాద్యు లవలన సర్వదా ననుకరించుచు సాధారణులు ముక్తులగుటకై యత్నింపవలయును. తనయంత్యకాలము వెల్లడింపరాదు.

ఆ. జననమునకు మున్ను జననిగర్భములోన
మునుపు జేసినట్టి ముష్కరంబు
ననుభవించి యునికి నాశలు విడువరు, వి...

పుట్టుటకు ముందుగా తల్లిగర్భములో తా నదివఱకు చేసిన కర్మఫలమును పూర్ణముగా ననుభవించియును మరల నాశలను త్యజింపరు గదా!

క. జన్మము నెత్తినమనుజుఁడు
చిన్మయపరిపూర్ణమహిమఁ జిత్తము నెఱుఁగన్
దన్మయత నొందనేర్చును
చిన్మయుఁ బరమేశు మదిని జేర్చును వేమా!

జనుఁడు చిద్రూపపుమహిమము నెఱిఁగినచో ముందు దన్మ యము కలుగును. పిదప నీశ్వరసాన్నిధ్యము చేరును.

ఆ. జాతివార లెల్ల జాతివిద్యలు నేర్చి
జాణలైరి మీఱి జగతిలోన
బ్రాహ్మణు లనువారు బ్రహ్మము నెఱుఁగరు, వి.

ప్రతిజాతివారు తమతమ జాతీయవిద్యల నభ్యసించి మిగుల

నేర్పరులై బ్రదుకుచున్నారు. బ్రాహ్మణులమని చెప్పువారు తమ జాతివాఁడుగ నున్నబ్రహ్మము నేల తెలిసికొనఁజాలరో గదా!

ఆ. జిహ్వ రుచుల గోరు జీవించునంతకు
సతియుఁ బతియుఁ గోరు సుతుల ధనము
హవ్యవహుఁడు చూడ నందఱఁ గోరును, వి.

బ్రతికియున్నంతకాలము నాలుక రుచులను గోరుచుండును. భార్యాభర్తలు సంతానమును ధనమును గోరుచుందురు. అగ్నిహోత్రుఁడు సమయ మెఱిఁగి యందఱిను జవిచూడఁ గోరుచున్నాఁడు.

ఆ. జిహ్వాలంపటంబు జీవనంబై యుండు
జిహ్వాలంపటంబె జీవపోష
జిహ్వచేత నరులు చీకాకుపడిరయా, వి...2195

జిహ్వాలంపటము పోఁగొట్టికొనవలవి గానిది. గాననే నరులు జిహ్వాచాపల్యములకు లోనై అనేకవిధములగు కష్టములకు పాల్పడుచుందురు.

ఆ. జీవము దెలిసినఁ జెలఁగి మది చలించు
దైవ మగుపడినను దగులు బుద్ధి
దీప్తభానుని గని తిమిరంబు నిలుచునా? వి...

జీవస్వరూపముఁ దెలిసినచో మనస్సు కుదుట పడును. పిమ్మట దైవమగుపడును. సూర్యు నెదుటఁ బడుచీఁకటులవలె పిమ్మట బంధములు తొలఁగి చనును.



క. జీవాధారము నీరము
జీవాధారంబు గాలి చెలఁగుచు నుండున్
కావలసిన నవి యొక్కరి
యీవిని కోరకయె చిక్కు నిలలో వేమా! 2197

పరమేశ్వరుని జీవదయాళుత్వము నేమని కొనియాడఁగలము? సమస్తజీవములకు నాధారములై వాయు నీరములను ఇతరాపేక్ష లేక చిక్కునట్లు చేసియున్నాఁడు కదా!

క. ఎక్కడిసుతు లెక్కడిసతు
లెక్కడిబంధువులు సఖులు నెక్కడిభృత్యుల్
డొక్కువడి పోవువేళలఁ
జక్కటికిని నెవరురారు సహజము వేమా! 2198

చుట్టములు చెలికాండ్రు భార్యాసుతులు మాయలు తాను పోవుతఱి యెంత ఆప్తులుగానున్న వీరిలో నొకఁడైన వెంటరాఁడు. ఇది సహజము. ఇట్టివారిపై మమకార మేల పెట్టుకొనవలయును?

ఆ. ఏది కులము నీకు నేది స్థలంబురా
పాదుకొనుము మదిని పక్వ మెఱిఁగి
యాదరించుదాని నవలీల ముట్టురా, వి...2199

నీయంత నీవే నీకులస్థలాదులను గూర్చి చర్చింపవేని విషయవాసనపోయి వైరాగ్యము గలుగును. పిమ్మట నీశ్వరుని జేరఁగలుగుదువు. హృదయము పక్వముగానిది ఫలము లేదు.

ఆ. ఒక్కతనువున కిలఁ బెక్కుపాట్లను బడి
పెక్కుదినము లెల్లఁ బ్రేలి ప్రేలి
అగ్నిలోనఁ బడునొ యలనక్కపాలౌనొ
తెలియుమయ్య యింకను దీని వేమ! 2200

ఈతుచ్ఛశరీరమునకై ఇన్నిపాట్లుపడి ఎన్నిదినములో నోటి కొలఁది ప్రేలుచుందురు. కాని యిది ఎప్పుడో యొకనాఁడు నిప్పువాతనో నక్కలవాతనో పడును. దీని కింత మమకార మేలనో?

తే. కచముఁ గక్ష్యంబు నోరును గనులు మేను
నాభియును బాహుమూలంబు నాతి కెపుడు
నోర్వఁ దగనట్టిగౌలుతో నొప్పుచుండు
నింతకే యేల నింతిపై భ్రాంతి వేమ! 2201

మోహములగు నరులు చెలువలను గమలగంధులని సాంకవ గంధులని పేరులతో వ్యవహరింతురుగాని వీరివెండ్రుకలు, కచ కుచాదులు, కనులు, మేనుపొక్కిలి దుర్వాసన కునికిపట్టులు. ఇట్టి దుర్గంధమందిరమునకై పురుషు లేల భ్రాంతి నొందెదరో?

తే. కండ లెముకలు నెత్తురు గలిగి తనువు
మూత్రమలములతో నుండు ముట్టరాక
కాయజుని బాణమం చాస గల్గఁ జెడును
ఆస బాపెడివిధమును నరయుము వేమ! 2202

నెత్తురు మలము మూత్రము మున్నగువానితో నిండిన స్త్రీ యోని మురుగుగుంటను మన్మథబాణమని మూర్ఖుఁడై మనుజుఁడు



మెచ్చుకొని చెడిపోవుచున్నాఁడు. ఈపేరాశ తొలంగువిధము యోజింపనగును.

ఆ. కడుపులోని మలము కడమవి యెముకల
కలదు మాంస మింత కప్పుతోలు
మలము నెత్తిమీఁద మానెట్టు కలుగురా, వి.

ఈశరీరములో నేమున్నది? మలము నెత్తురు ఎముకలు మాంసము పైని తోలు. ఇట్టిదానికై జనులు ఎట్లు వలతురో కదా! ఇట్టిదేహ మాశ్రయించువారికి ముక్తివచ్చునా?

ఆ. కడుపులోనిరోఁత కడు నోటియెంగిలి
కడుగ వశమె బ్రహ్మకొడుకునకును
సత్యమున్నఁ గొంత జగతిపై సిద్ధించు, వి...

కడుపులో మిగుల రోఁతగలిగించు మలమూత్రాదులు కలవు. నోటిలో సేవము గలుగఁజేయుఁ జొల్లు ఎంగిలిగలదు. వీనిని నిర్మలము బ్రహ్మకొడుకేని చేయఁజాలఁడు. ఇట్టిమేనుతో ముక్తి చేకూరునా యని కొంద అందురు గాని సత్యవంతుఁడైనచో ఫలము సిద్ధింపకపోదు.

ఆ. కన్నెదానిమేను కస్తూరివాసన
ముసలిదానిమేను ముఱికి కంపు
వయసుదానిమేను వర్ణింప శక్యమా? వి...

మనుజులు విషయాసక్తులై కన్నెమేను కస్తూరివాసనయనియుఁ ముసలిదానిమేను ముఱికికంపు అనియును వయసుదాని మేను తావియ నుపమానమనియుఁ గొనియాడుచుందురు.

ఆ. ఒక్కతనువున కిలఁ బెక్కుపాట్లను బడి
పెక్కుదినము లెల్లఁ బ్రేలి ప్రేలి
అగ్నిలోనఁ బడునొ యలనక్కపాలౌనొ
తెలియుమయ్య యింకను దీని వేమ! 2200

ఈతుచ్ఛశరీరమునకై ఇన్నిపాట్లుపడి ఎన్నిదినములో నోటి కొలఁది ప్రేలుచుందురు. కాని యిది ఎప్పుడో యొకనాఁడు నిప్పువాతనో నక్కలవాతనో పడును. దీని కింత మమకార మేలనో?

తే. కచముఁ గక్ష్యంబు నోరును గనులు మేను
నాభియును బాహుమూలంబు నాతి కెపుడు
నోర్వఁ దగనట్టిగాలుతో నొప్పుచుండు
నింతకే యేల నింతిపై భ్రాంతి వేమ! 2201

మోహములగు నరులు చెలువలను గమలగంధులని సాంకవగంధులని పేరులతో వ్యవహరింతురుగాని వీరివెండ్రుకలు, కచకుచాదులు, కనులు, మేనుపొక్కిలి దుర్వాసన కునికిపట్టులు. ఇట్టి దుర్గంధమందిరమునకై పురుషు లేల భ్రాంతి నొందెదరో?

తే. కండ లెముకలు నెత్తురు గలిగి తనువు
మూత్రమలములతో నుండు ముట్టరాక
కాయజుని బాణమం చాస గల్గఁ జెడును
ఆస బాపెడివిధమును నరయు వేమ! 2202

నెత్తురు మలము మూత్రము మున్నగువానితో నిండిన స్త్రీయను మురుగుగుంటను మన్మథబాణమని మూర్ఖుఁడై మనుజుఁడు



మెచ్చుకొని చెడిపోవుచున్నాఁడు. ఈపేరాశ తొలఁగువిధము యోజింపనగును.

ఆ. కడుపులోని మలము కడమవి యెముకల
కలదు మాంస మింత కప్పుతోలు
మలము నెత్తిమీఁద మానెట్టు కలుగురా, వి.

ఈశరీరములో నేమున్నది? మలము నెత్తురు ఎముకలు మాంసము పైని తోలు. ఇట్టిదానికై జనులు ఎట్లు వలతురో కదా! ఇట్టిదేహ మాశ్రయించువారికి ముక్తివచ్చునా?

ఆ. కడుపులోనిరోఁత కడు నోటియెంగిలి
కడుగ వశమె బ్రహ్మకొడుకునకును
సత్యమున్నఁ గొంత జగతిపై సిద్ధించు, వి...

కడుపులో మిగుల రోఁతగలిగించు మలమూత్రాదులు కలవు. నోటిలో సేవము గలుగఁజేయు జొల్లు ఎంగిలిగలదు. వీనిని నిర్మలము బ్రహ్మకొడుకేని చేయఁజాలఁడు. ఇట్టిమేనుతో ముక్తి చేకూరునా యని కొంద అందురు గాని సత్యవంతుఁడైనచో ఫలము సిద్ధింపకపోదు.

ఆ. కన్నెదానిమేను కస్తూరివాసన
ముసలిదానిమేను ముఱికి కంపు
వయసుదానిమేను వర్ణింప శక్యమా? వి...

మనుజులు విషయాసక్తులై కన్నెమేను కస్తూరివాసనయనియుం ముసలిదానిమేను ముఱికికంపు అనియును వయసుదాని మేను తావియ నుపమానమనియుఁ గొనియాడుచుందురు.

క. కాలములవ హిమ దెలియక
వాలాయము నిత్య మనుచు పరలుదు రింతే
యేలనొ కాలము దెలియరు
వాలాయము జాటుమయ్యె వసుపతి వేమా!

మనుజులు కాలముయొక్క తత్త్వము గనిపెట్టఁజాలక తాము నిత్యమనుకొని దుర్విషయములఁ జిక్కి మూర్ఖులై నశించుచుందురు.

ఆ. కాలవశముఁ బట్టి కర్మజీ
మత్తుఁగుచు నుండి వ అఁటినారు
మత్తులైనజనుల మనసేటి మనసయా, ...

కాలవశమునఁ గర్మవశమున జనించిన యీజీవులందఱు మదోన్మత్తులై తమ్ముఁదాము మఱచి త్రొక్కులాడుచున్నారు. మత్తులగువారిమనస్సు ఎందులకు నుపయోగింపదు.

ఆ. కాలిసంకెలయగు గరిమతోఁ దనభార్య
చేతివిఱిచి కట్లు శిశువులెల్ల
సరిపడచెఱసాల సంసారరూపంబు, వి... 2208

భార్య కాలికి సంకెలవంటిది. శిశువులు చేతి విఱిచికట్టులవంటివారు. సంసారమనునది మానవునకు గొప్పచెఱసాలవంటిది. ఇందున్నపఱకు మానవునకు ముక్తిలేదు.

ఆ. కైపువస్తువులను గాంక్షించి సేవింప
కానిపను లొనర్చు మేనెఱుఁగక
అట్లు పూనువారి నధము లటందురు,వి...2209



మత్తువస్తువులను సేవించినయెడల నెంతటి యకృత్యములనేని పాపమునకు జంకక చేయవచ్చును. అట్లు చేయువానిని మాత్రము లోకులు అధముఁడని తప్పక తలంచుచుందురు.

ఆ. జన్మముల నిఁకెన్ని జన్మంబు లెత్తును
కర్మధర్మములకు గణన యెంతొ
కర్మధర్మములను కడ తేఱలేరయా, వి... 2210

ఎన్నిజన్మములకైనను నిట్టులు స్వకృతకర్మధర్మములఫలములనుభవించుటకై పుట్టుచు నే యుండవలయును. గనుక కర్మవలన గడతేఱఁజాలరు.

ఆ. జన్మ వదలి వేలు జన్మంబు లెత్తంగ
కర్మధర్మములకు గణన గలదె
కర్మధర్మములను కడ తేఱవచ్చునా? వి.... 2211

జీవుఁడు కర్మవశమున నెడతెగక జన్మాంతరములకు లోనగుచున్నాఁడు. అట్టివానికర్మలు లెక్కింప వీలులేని ప్రతిజన్మమునఁ గొన్నికొన్ని చేయుచునే యున్నాఁడు. కర్మమునుండి కడతేఱుట యసాధ్యము.

క. ధన మెచ్చిన మద మెచ్చును
మదమెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చున్
ధన ముడిగిన మద ముడుగును
మదముడిగిన దుర్గుణంబు మానును వేమా!

ధనమువలన మదమును దాన దుర్గుణమును కలుగును. అది లేకున్నఁ గ్రమముగా మదమును దుర్గుణమును మానును.

ఆ. ధర విరక్తితోడ దలఁపుల విడువమి
తనను తగులునట్లు తత్త్వ మరయఁ
దత్త్వ మరయఁ దాను దానగు బ్రహ్మంబు, వి.

విరక్తుఁడైనను కామములను పరిత్యజింపనిచో తత్త్వము కలుగఁజాలదు. ఆతత్త్వమే యాత్మరూపమునఁ దేజరిల్లుటకుఁ బ్రయత్నించిన బ్రహ్మము గానగును.

క. నడజీవులు స్థావరములు
వడి చని పోవంగ నెఱిఁగి భావములోన
న్విడువక బ్రహ్మము దలఁపరు
వడి చని పోకుందురేమొ వసుధను వేమా!

జీవులగు చరములు పర్వతాదులగు స్థావరములు కాలవశమున వృద్ధిక్షయము లొందుచున్నవి. ఈసంగతిఁ గనులారఁ జూచు మానవులు తా మస్థిరుల మని బ్రహ్మమును దలఁపఁ బ్రయత్నింపరు గదా!

క. ధర గిరులు జలధు లన్నియు
బరికింపఁగఁ బ్రళయమునను భస్మములయ్యా
సురలును మునులును జనఁగా
నెఱయోధు లిటుండఁ గలరె నెప్పున వేమా!

పర్వతములు సముద్రములు మున్నగుమహద్వస్తువులే ప్రళయకాలమున లయించుచుండఁగా నిఁక తక్కిన బ్రహ్మాదుల గూర్చి చెప్పవలసినదేమి? సర్వ మస్థిరమే!



క. ధరఁ బుట్టి భోగి నయితిని
బరమం బిచ్చునటు మాని పడఁతులకై నే
తిరిగి యలసితిని ద్రవ్యము
మఱి యార్జించితిని కడకు మరణమె వేమా!

ప్రపంచములం బుట్టి భోగవాంఛచేత పరమును విడనాడి ధనము నార్జించి నిష్ప్రయోజనముగా నలసిపోయితినికదా! ఇఁక మిగిలినది మరణ మొకటియే.

క. భుక్తిని మిక్కిలి విషయా
సక్తత తా దిరుగుచుండు సత్రములందున్
భుక్తిని ముక్తి లభింపదు
భక్తిని జీవునకు ముక్తి భద్రము వేమా! 2217

తిండికని త్రిప్పల కని జనుఁడు సత్రములందుఁ బడి తిరుగునే గాని భుక్తియును లభింపదు. ముక్తియును లభింపనేరదు. కాన ముముక్షుఁడ వగుటకు యత్నింపుము.

క. భోగంబుల కాశింపక
రాగద్వేషంబు లుడిగి రంగుగ దమలో
వేగమె మోక్షపదంబును
రాఁగను నాతండు యోగి రాయుఁడు వేమా!

భోగంబులను కోరక రాగద్వేషాదులను పరిత్యజించినవాఁడతిశీఘ్రకాలములో మోక్షము నొందఁగలవాఁ డగును. అతఁడే యోగీశ్వరుఁ డనఁదగువాఁడు.

ఆ. భోగవాంఛచేతఁ బొలుపేదొ యెఱుఁగక
ద్రోహబుద్ధి నొరుల దూరుచుండ
సాహసించువాఁడు సర్వదా చెడునురా, వి...

భోగముల ననుభవింపవలయు ననునాసతో యుక్తాయుక్త మెంచక పరులకు ద్రోహముచేయవలయునని యత్నించువాఁడు తానే సర్వవిధములఁ జెడిపోయి తీఱును.

తే. ముక్కు గోరును సద్గంధములను నల్లె
చెవులు కరములు గన్నులు జిహ్వ యొడలు
ఇన్నియును గోరునటువంటియిల్లురోసి
తన్ను గనుగొని సుఖియింపఁదగును వేమ! 2220

ముక్కుచెవులు మున్నగున విన్నియును విషయములనే వాంఛించుచుండును. కనుక వీనిని పరిత్యజించి ఆత్మను సందర్శించి సుఖింపుము.

ఆ. ముండమోపితోడ మునుఁగుచు తేలుచు
నుండఁగానె మోహ ముండెఁ గాక
అందఁబాయు వెనుక నాయాశలే లేవు, వి....

మోహమనునది స్త్రీలతోఁ గలసిమెలసి యున్నకొలఁది అభివృద్ధినొందునుగాని నశింపదు. స్త్రీసంసర్గము ఆతలంపులు మానుకొనినఁగాని యది వదలిపోదు.

ఆ. అతిథిరాకఁ జూచి యదలించి పడవైచి
కఠినచిత్తు లగుచుఁ గానలేరు
కర్మమునకు ముందు ధర్మము గానరో, వి...



అతిథి యింటికి వచ్చెనేని గృహస్థు లదలించి వెడల నడతురు గాని ప్రేమతోఁ జూడరు. ధర్మము గావించినచో గర్మములు తొలఁగిపోవునని గ్రహింపరుగదా !

ఆ. ఊరునూరు దిరిగి యున్నది గనలేదు
మోరయెత్తి చూచి మొనయలేరు
పాఱఁ జూచుటదియె పరముగాఁ గాదొకో, వి.

విషయలోలురగు మానవులు ఊరక గ్రామగ్రామములు తిరుగుచుందురు. తలయెత్తి యోగదృష్టితోఁ గాంచునట్లు మింటిని గాంతురు. అంతియేగాని పాఱఁజూచుటలోఁ బరముకలదని వారెఱుంగరు.

క. ఎండినమ్రా నొక టడవిని
నుండిన నం దగ్నిఁ బుట్టి యూడ్చును చెట్లన్
దండి గలవంశ మెల్లను
చండాలుం డొకఁడు పుట్టి చదుపును వేమా!

ఎండినమ్రాను అడవిలోనున్నచోఁ గాలవశమున దాన నగ్ని పడెనేని యడవినంతయు నది గాల్చివేయును. అటులే యుత్తమవంశమునందు ఒకనీచుఁడు జనించెనేని వాఁడు కులము గూపుమాపును.

ఆ. ఔ నవంగ వచ్చు నైనది కానిది
యన్యుఁ డెదుట నుండి యడుగఁడేని
నిలిచి యడంగువాఁడు కలిగిన నిలుపఁడు, వి....

ఎదుట నెవ్వఁడైనను ఆక్షేపించువాఁడు లేక యుండునంత

పఱికను అయినదానిని కానిదానిని కూడ ఎదురు తిరిగి వాదింపవచ్చును. ఎదుట నెవఁడేనియున్న మాటలాడఁడు.

ఆ. కట్టుబట్టఁ జూచి ఘనతఁ జెప్పఁగరాదు
కానరాదు లోనిఘనత యెల్ల
జంగమైనవాని జాతినెంచఁగ నిట్లు, వి... 2226

ఎదటివానిని వేషభాషల యాడంబరమునుబట్టి యుత్తమునిగా భావింపఁదగు. బాహ్యాకారమువలన నంతరంగము తెలియదు. ఇటులె భూతిపూఁతలుగలవారిని జంగములుగాఁ దలంపరాదు.

క. కలలోనిసంప దెల్లను
కలగని మేల్కనినపిదప కనఁబడ కేగున్
బలుభోగభాగ్యగుణములు
కలరీతిగ నమ్మవలెను ఘనముగ వేమా! 2227

కలలో కనుపించినసంపద మేల్కొనినపిమ్మట మాయమైపోయినట్టులనే భోగభాగ్యములుకూడ దమంతట నశించును. భాగ్యములను కలలోని యైశ్వర్యమువలెఁ దలంపవలయును.

ఆ. కలిమి గల్గనేమి కరుణ లేకుండిన
కలిమి తగునె దుష్టకర్ములకును
తేనె గూర్ప నీఁగ తెరువునఁ బోవదా? వి...

కలిమి కరుణాశాలురకున్న యుపయోగముగాని దుష్టులకున్న లాభములేదు. తేనె నీఁగలు సమకూర్చినటుల నీచులు ధనమార్జించినను అది సులభముగా సమస్తజనభోగ్యము కానేరదు.



ఆ. గతికి మతి యటంచు గమకించినంతలో
మతికి గతియు గల్గు మహితముగను
సతికి సుతులు పుట్టి సంతుష్టిఁ జేయరా? వి...

అదృష్టమునకు మనస్సే యాధారము. మనస్సునకు అదృష్టమే యాధారము. సతికి సుతులు జనించి సంతోషపఱచునట్లు మనస్సునకు అదృష్టము సంతోషకారణ మగుచున్నది.

ఆ. జీవిజీవి జంపి జీవికి బెట్టంగ
జీవి తాన బలసి చెలఁగుచుండు
జీవహింసకులకు చిక్కునా మోక్షంబు? వి...

ఒకజీవిని జంపి మఱియొకదానికిఁ బెట్టుటవలనఁ దినినది బలియుచున్నది. కాని యిటులఁ గాకులఁ జంపి గ్రద్దలకుఁ బెట్టువానికి మాత్రము మోక్ష మెన్నటికి సమకూరఁజాల దనుట సత్యము.

ఆ. శివి లేదటంచు డెందంబులో నెంచి
జ్ఞాని నెఱుఁగలేనిమానవుండు
డాంబికునకు లొంగి డయ్యును కడపట, వి...

జ్ఞాని నవివేకిచూచి వీనియొద్ద వేషభాషాదులవలని యాడంబరములు లేవని వదలి డాంబికుల నాశ్రయించి కడకు నానావస్థలకుఁ బాలగుచున్నాఁడు. డాంబిక మెంతయవస్థాకారణము!

ఆ. తత్త్వహీను లుండ్రు తఱచుగా భువిలోన
తత్త్వ మెఱుఁగువారు తఱుచులేరు
కలిగిరేని వారు కాన్పింపరారయా, వి... 2232

ప్రపంచములో చాలవఱకు నజ్ఞానులే కలరు గాని జ్ఞానులు తఱచుగాలేరు. ఉండిరిపో వారు సామాన్యుల కన్నులకుఁ గనఁబడరు.

ఆ. తనకు నొప్పిపుట్టి తనువెంత బడలిన
కాళవిటుఁడు యువతి గూడు సుమ్మి
పండ్లుపడిన గుక్క పసరంబు గఱవదా, వి...

తనశరీర మెంత బడలియున్నను బుద్ధిహీనుఁడై విషయములఁ గోరువాఁడు సతులఁబొందు మానఁడు. పండ్లూడినను కుక్క పసరములను గఱచుటకుఁ బ్రయత్నించుచునే యుండును.

క. తనకులగోత్రము లాకృతి
తనసంపదకలిమి బలిమి తనకేలనయా
తనవెంట రావు నిజ మిది
తనసత్యమె తోడ వచ్చు తనతో వేమా! 2234

కులము గోత్రము సంపద మున్నగున వేవియును తనతోడ రావు; కాని తాను చేసినసత్యము మాత్రము వచ్చుచుండును. కానఁ దనయున్నతి తన కుపకరింపదు.

క. తన కేనాఁడు సుభిక్షము
తన కేనాఁడును భగంబు తనవవలయునం
చును దనవశకై యెల్లెడ
మనసందువ చిప్రకుదుండు మనుజుఁడు వేమా!

మనుజుఁడు భోగము భాగ్యము మున్నగునవి యన్నియును



తనకే కావలయు నని యూఱక యాశించి చెడిపోవుచుండును. తనకై తానటు లాశింపరాదు.

క. తనతల్లిలోప మెఱిఁగిన
మనుజుఁడు చింతిల్లు నెపుడు మానసమందున్
తనయాలిలోప మెఱిఁగిన
ఘనుఁడైనను దానివిడుచు గదరా వేమా!

మానవుఁడు తనతల్లి చెడ నడవడి గలదని విన్నచో మాతృగౌరవముంచి యేమియుఁ జేయఁజాలక విచారపడును. భార్య లోపము గ్రహించెనేని దాంపత్యబంధము త్రెంచి దానిని విడచిపెట్టును.

ఆ. తనదుభ్రాతృ గులు ధర నేలుచుండఁగా
దనకు నుండు నంద్రు వెనుక వారు
తనదుకాలు గోయ తమ్ముఁడు ఏడ్చునా? వి...

తనతోఁబుట్టువు లెక్కడనో రాజ్యము నేలుచుండఁ దాము రాజులమని కొంద అవివేకులు మురియుచున్నారు. తనకాలు గోసిన తమ్మునకు నొప్పి లే బుట్టువులు రాజ్యము నేలినఁ దమ కంతియే ఫ

ఆ. తనవి జూడు
నే
గ వి...
చెడి ము
వినునప్పుడు వ్యాజముతో

తనకు పరివారమును వెదకుచునే యుండునుగాని తప్పించుకొనఁ జాలఁడు.

క. తను వలచిన దా వలచును
తను వలపకయున్న నెవఁడు తా వలవఁ డిలం
దనదుపటాటోపంబులు
తనమాయలు పనికిరావు ధరలో వేమా! 2239

మనము ఎదటివానిని బ్రేమింతుమేని మనల నెదటివారు బ్రేమింతురు. మనము బ్రేమింపమా నితరులు బ్రేమింపరు. మనపటాటోపములు మనకపటవర్తనములు జూచిమాత్రము లోకులు బ్రేమింపరు.

ఆ. తనువు తా ననుకొను తనకు వాసనఁ బట్టి
జననమరణములను జక్కఁ జిక్కి
పొలుపున నెఱుఁగక పొర్లాడుచుండెడి, వి....

మానవుఁ డైహికవాసనలకు లోనై జననమరణాద్యవస్థ లొందుచుఁ దానే తనువనుకొని ఆత్మస్వరూపము నెఱుంగక మదించి తిరుగుచుండును. ఇట్టి మదముగలవానికిఁ బరమెటుల లభించును?

ఆ. తనువు పోవువేళ దనువును బాంధవుల్
వెంటరారు నిజము వెఱ్ఱివార
తనువు విడచిపోక దనకు తోడా గుఱి, వి...

శరీరము నశించిపోయెడినాఁడు అంతవఱకును కూడనుండిన బంధుమిత్రులు మున్నగువారిలో నెవ్వరును కూడ రారు. కాని తన నడవడిమాత్రమే వచ్చును.



ఆ. తనువు విడిచి తాను దరలిపోయెడివేళ
తనదుభార్యసుతులు తగినవారు
లొక్కరైన నేగ రుసురుమాత్రమె కాని
తనదుమంచితోడు తనకు వేమ! 2242

జీవుఁడు దేహమువీడిపోవుతఱి బ్రదికినన్నాళ్లు మమకారముఁ జూపిన భార్యగాని బిడ్డలుగాని వెంటరారు. ప్రాణ మొకటియె పోవును. కడ కీప్రాణమునకుఁ దోడగునవి మంచి చెడ్డ యను రెండుమాత్రమె.

ఆ. తమకు గలుగుపెక్కు తప్పు లటుండఁగా
నొరుల నేర మెంచు నోగెపుడును
జక్కలంబుఁ జూచి జంతి కేరినయట్లు, వి....

తాము చేసినతప్పు లెన్నో యుండినను వాని లెక్కచేయక దుర్జనుఁడు ఇతరులతప్పులను చక్కిలము జంతికను వెక్కిరించినట్లు లెక్కపెట్టపోవును.

ఆ. తరుణి యన్నఁ గన్నఁ దనయుని జూచిన
మరునికళల మించు మనసుపాఱు
పాపజాతిమనసుఁ బట్టంగరాకుండు, వి.... 2244

ఆఁడుది చక్కనివాఁడగు అన్నయైనను కుమారుడైనను జూచినంతనే వలపునొంది మనస్సును విచ్చలవిడిగాఁ బోవనిచ్చును. పాపజాతిమనస్సు వలపులో యుక్తాయుక్తములు గ్రహింపనే గ్రహింపదు.

చ. తరుణుని బెండ్లియాడి తగ
తమ్ములు నన్నలు బావయం చనఁజ
వరుసలఁ జిక్కి సొక్కి మఱి
వాంఛలచేతనె తేనెటీఁగవైు
నరవి మునింగి నాతనికి సత్పథ
మబ్బునె నిన్నుఁ గాన కీ
ధరణిని ముక్తిలేదు ఇఁక
దాఁపక చెప్పుమి వెఱ్ఱివేమనా! 2245

ప్రపంచవ్యామోహమున మునిఁగి తేలుచు నెవతెనో పెండ్లియాడి అన్నలని తమ్ములని బావలని మఱఁదులని వరులఁ బ్రేమించుచు కుటుంబవ్యామోహములలో సొక్కి సోలుచుఁ దేనెటీఁగవలె ధనముఁ గూడఁబెట్టుచు నుండువానికి మోక్షము విరాగియై ఈశ్వరసాక్షాత్కారము నొందినఁగాని కలుగఁ జాలదని లోకములకు దాఁచ సాటవలయును.

ఆ. తల్లి దండ్రి చావఁ దనయుఁడు తానేడ్చు
మగఁడు చావ నాలు వగచుచుండు
కార్యవశమె కాని కలుగునా మోహము? వి.

తల్లిదండ్రులమృతికి కొడుకును మగనిమృతికి ఆలును కార్యవశమున దుఃఖించెదరే కాని నిజమగు దుఃఖము కాదు.

ఆ. తల్లి దండ్రి హితులు తగినచుట్టము లెల్ల
నేరి కోరి పోరు నెగుపు చూచి
పడుచు నిత్తు రింతె భాగ్య మీయఁగ లేరు, వి.



తల్లిదండ్రిచుట్టములు తమయాఁడుపడుచు సుఖపడవలయునని యెంచి యేరికోరి సంపదగలవారి కాఁడుపడుచు నిచ్చెదరు. ఒకప్పు డాబిడ్డ యత్తింటివారు దరిద్రు లగుచో మాత్ర మిందొకఁడేని భాగ్య మీయఁజాలఁడు.

ఆ. తాను దినక తగిన ధర్మము సేయక
కొడుకుల కని ధనముఁ గూడఁ బెట్టి
తెలియఁజెప్పలేక తీఱిపోదురు వెన్క
సొమ్ము పరులఁ జేరు జూడు వేమ! 2248

లోభులు తాము దినక ధర్మకార్యములకు వినియోగింపక కొడుకులకని ద్రవ్యము కూడఁ బెట్టి మృత్యువాసన్నమైనపుడు దాఁచినధనము నెఱింగింపలేక మరణించుచున్నారు. పిదప నాధనము పరులపాలగుచున్నది.

క. తానును జను లేమనుకొనఁ
బూనుదురో దాని నరసి పొందిక జెడనీ
రానిపథంబున నడచిన
దానసె ధర్మాత్ముఁ డండ్రు తన్నిట వేమా! 2249

తానును జనులు ఏమనుకొందురో యని భయముచెందుచు ధర్మమార్గమున నడచుకొనుచుండవలయును. అందువలననె ధర్మాత్ముఁడను పేరు వచ్చును.

ఆ. తిరిగి వచ్చువేళ మఱలిపోయెడువేళ
వెంటదేరు ధనము నంటఁ బోరు
తానెటకుఁ జనునో ధనమెందు బోవునో, వి...

పుట్టునపుడును గిట్టునప్పుడును ధనము నెవ్వరును తెచ్చుటయును లేదు. తీసికొనిపోవుటయు లేదు. తాను బోవుచోటు వేఱు. ధనము బోవుచోటు వేఱు. ఇట్టిధనమున కేల యాశపడవలెనో?

ఆ. దేహమనెడియింటి దినదినంబును నూడ్చి
యలికి పూసి మెత్తి యనువుపఱచి
కాపు విడిచి పోవు కడపట నీజీవి, వి... 2251

జీవుఁడు దేహమనునింటి నాశ్రయించి యందు వసించి దినదినము స్నానపానము అలంకారములను గృహోచితకృత్యములు చేయుచు కడకు దానిని పరులపాలు జేసి పోవుచున్నాఁడు.

ఆ. దోఁపునిచ్చువాఁడు తులలేనినెఱదాత
దోఁచుకొన్నవాఁడు ద్రోహి యయ్యె
ప్రాపుఁ జూపువాఁడు పరమపూజ్యుఁడట
ప్రాపుఁ జెఱచువాఁడు పశువు వేమ! 2252

పరులను దోఁచుకొన నిచ్చినాతఁడు గొప్పదాత. దోఁచుకొన్నవాఁడు ద్రోహి. అనదలకుఁ బ్రాపును జూపువాఁడు భూజనపూజ్యుఁడు. ప్రాపుఁ జెఱచువాఁడు పశుప్రాయుఁడు.

ఆ. ద్విజవరుండు చెడ్డ దిక్కులేకయ భూమి
మనుజు లెల్లఁ జెడుదు రనుట కేమి
కాలగతులు మాఱ కలియు ధర్మము మాఱు, వి.

బ్రాహ్మణుఁడువర్ణాశ్రమములధర్మములఁగాపాడఁదగినవాఁడు.



అతఁడు చెడినచో మనుజులందఱు స్వధర్మములు దొలంగుదురు. కాలగతులు మాఱిపోవును. కలియుగము తారుమాఱగును.

ఆ. దానధర్మములను తాఁ జేసి పుట్టమి
కర్మగతిని యముఁడు కష్టపఱచు
కర్మధర్మములను కడవీడ బ్రహ్మంబు, వి ...2254

తాను దానధర్మాదులను చేసియుండనికారణమున యముఁడు కష్టపఱచును. కావున వానిని దొలఁగించుకొనుటచే బ్రహ్మముఁ జేరును.

ఆ. ధనవిహీనుఁడయ్యు దండ్రి పుణ్యము చేయు
భాగ్యమునను నరుఁడు పట్టి యగుచు
బహుళధనము గూర్చు భద్రమార్గంబున
పరుల కిచ్చు కీర్తిఁ బడయు వేమ! 2255

ధనహీనుఁడగు మానవుఁ డెవఁడేని పుణ్యము గావించిన యెడల వానికి సుకృతవశమున నదృష్టవంతుఁడగు తనయుఁ డుదయించి విశేషధన మార్జించి తాను దాతయై కీర్తినార్జించి పేరొందుచున్నాఁడు.

క. నదియుదకంబును ప్రియమగు
మదినొదవెడి తత్త్వబుద్ధి మగ్నత నెన్నం
దుదిపదవి గలియ ఘనమగు
నుదధి ప్రవేశించుగంగ నొప్పగు వేమా! 2256

నదీనీరములు సముద్రములోఁ జేరినయెడలఁ బావనము

గును. అటులే మానవునితత్త్వబుద్ధియు మోక్షమును సాధించె నేని సార్థకమగును.

క. నరకులమునఁ దాఁ బుట్టియు
నరకులమునఁ దాను బెరిగి నరుఁడయ్యును దా
నరకులమును ఛీఛీ యని
హరకులమునఁ దిరుగునేని హరుఁడౌ వేమా!

యోగీశ్వరుఁడగువాఁడు తాను పుట్టిపెరిగి యున్నతినొందిన మానవజాతిపై మమకారము విడనాడి హరుని నిరంతరము హృదయమున ధ్యానముచేయుచున్నయెడల హరస్వరూపుఁ డగును.

ఆ. నరుఁడు జాగరమున నటియించుచుండును
నరుని కిలను జాగ్ర తరుదుసుమ్ము
నరుఁడు జాగ్రతనుట ధరణిలో పరమాత్మ, వి.

నరుఁ డెంత మెలఁకువగా నున్నను వానికి యోగరూపమగు జాగ్రతశక్తి చాలతక్కువగా నున్నది. మానవునకు జాగ్రత్త విరివిగా నున్నచో వానిని బరమాత్మగా నే తలంపవచ్చును.

ఆ. నీరుపైనిఁబడిన నిప్పులు బొగ్గులౌ
నిప్పుమీఁద కుండనీరు పెట్ట
గళపెళనుచు గ్రాలు కడు చోద్యమిది కదా, వి.

నీరు తనపైఁబడినతతమాత్రమున గజగజవణఁకుచున్న అగ్నికణములు బొగ్గులగుచున్నవి. అగ్నికణములమీఁదఁ గురడతో



నీరుఁబెట్టినచో నది కొంచెముసేపులో సలసలకాగుచున్నది. ఇది విచిత్రముగదా!

ఆ. నీరు మొదలుపెట్ట నీరమే మొలకయ్యె
మొలక విశ్వమగుచు మొనయుచుండు
నీరు విశ్వమగుట నేర్పుతో తెలియుము, వి...

తొలిసృష్టి యుదకము. అద్దాననే మహావృక్షములు ప్రపంచమంతయును జనించినది. నీరు విశ్వమగుటను నేర్పుతో తెలిసికొనుము. (ఉదకము పరబ్రహ్మస్వరూపము.)

ఆ. నీళ్లలోనిమీను నిగిడి దూరము పాఱు
బయల మూరెడైనఁ బాఱలేదు
స్థానబలిమికాని తనబలిమి కాదయా, వి...

ఎంతవారికిని స్థానబలమును అనుసరించియే మాటచెల్లును గాని వేఱు గాదు. ఎట్లనఁగా: నీళ్లలో చేప యెంతదూరమైన నీఁదగలదు. బయటికి వచ్చినచో మూరెఁడేని పోలేదు.

ఆ. నేయిలేనికూడు నీయాన కసవది
కూరలేనితిండి కుక్కతిండి
ప్రియము లేనికూడు పిండపుకూడురా, వి...

నేయిలేనిభోజనము గడ్డితినుటవంటిది. కూరలేనిభోజనము కుక్కతిండివంటిది. ప్రియముగాఁ బెట్టనియన్నము పిండములకుపయోగించుకూటితో సమానము.

క. నో రెఱఁగి తా మవేనియు
నేరనిజంతులఁ జంపి నెమ్మది దిను నా
క్రూరపుసంకరజాతుల
మారణమే మందు రింక మహిలో వేమా!

తాము విద్యావాసనగలవారయ్యు నోరులేనిజంతువులఁ జంపి తిను పాపాత్ములను యముఁడు తనలోకమునకుఁ జేర్చుకొని యెన్ని యగచాట్లు పెట్టనున్నాఁడో గదా!

ఆ. న్యాయశాస్త్ర మరయ సన్యాయ మొనరించు
ధర్మశాస్త్ర మొసఁగు దుర్మతంబు
జ్యోతిషంబు జనుల నీతులు దప్పించు, వి...

శాస్త్రజ్ఞాన మవివేకకారణము. న్యాయశాస్త్రజ్ఞాన మన్యాయములు చేయించును. ధర్మశాస్త్రజ్ఞానము దుర్మతముల బోధించును. జ్యోతిశ్శాస్త్రజ్ఞానము మనుజుల నీతిదూరులఁ జేయుచున్నది.

ఆ. పంకజాక్షిఁ గన్న బంగరు పొడగన్న
దిమ్మబట్టి యుండు తెలివి యొప్ప
మనుజులకును తత్త్వ మహి మెట్లు కల్గురా? వి.

స్త్రీలచక్కఁదనమును గాంచినను బంగారమును జూచినను మానవులకుఁ గల తెలివితేట లంతరించుచున్నవి. ఇట్టి యజ్ఞానులకుఁ దత్త్వజ్ఞాన మలవడుట యసాధ్యము.

క. న్యాసము గల తనభార్యను
కాననమున జంపవచ్చు గడుచిత్రముగా



దా నెఱుక మ్రింగురీతిని
మానముఁ గాపాడుకొనెడిమహితుఁడు వేమా!

చెడునడువడిగల భార్యను నిస్సందేహముగా నడవిలోఁ జంపవలయును. యోగి జ్ఞానశక్తిని గాపాడుకొనునటుల మానుషవంతుఁ డభిమానము గాపాడుకొనవలయును.

ఆ. పంచమనిగమంబు భారతం బగునని
పొగడి రేల జనులు బుద్ధిమాలి
హింస నెంచి చూడ నిష్టమె ట్లయ్యెనో, వి...

భారతమును పంచమవేదమని పొగడిరే కాని ఆబుద్ధిమంతుల కాహింసాకార్య మేతీరున నిష్ట మయ్యెనో చెప్పఁజాలము. భారతము ప్రశంసించువారు బుద్ధిహీనులు.

ఆ. పచ్చదనముఁ జూచి యిచ్చను కాముకు
ల్చిచ్చులో బడుదురు క్షితితలమున
యిచ్చ గలుగఁజేయు నెచ్చుగా మోహము,వి.

చెలువలమేని పసుపువన్నెఁ జూచి కాముకులు వలపుచిచ్చులోఁబడి నాశనమగుచున్నారు. మోహ మెంతవారి తలంపులనైనను వశముఁజేసికొని యాటలాడించునుగదా!

ఆ. పచ్చవిల్తుచేత గ్రచ్చుఱ జనులెల్ల
దచ్చనాడ నైరి ధరణిలోన
గులజుఁ డెవ్వఁ డిందుఁ గులహీనుఁ డెవ్వఁడు? వి.

లోకమునందలి జనులందఱు మన్మథుని పూవుటమ్ముల గుఱికి

లోనై కీలుబొమ్మలవలెవున నాడుచున్నారు. ఈ కామాంధులలోఁ గులహీనుఁడు కులీనుఁడు అను భేద మేర్పరింపరాదు.

ఆ. పట్టుకుండి యధిక భాగ్యంబు పట్టినా
 దొడ్డవారిఁ దిట్టి త్రుళ్లిపడును
 అల్పజాతికుక్క యధికుల నెఱుఁగునా? వి...

రాకరాక భాగ్యము కల్గినచో అల్పజాతివారు అధికులను గొప్పవారిని తిట్టఁబూనుకొనియెదరు. కుక్క గొప్ప కొంచెము నెఱుంగలేనివిధమున వీరును వర్తింతురు.

ఆ. పచ్చిమలము దినుచు పండుటాకు నమలి
 యుచ్చ దప్పి దీర్చి యుడుకు కోర్చి
 కచ్చను బిగియింపఁగలుగునా తత్త్వము? వి.

యోగులమని కానల వసించువా రుపవసించుటచేఁ దమమలము దాము తినుచున్నారు. జలము త్రావ మానుటచే మూత్రపానము గావించుచున్నాఁడు. ఆకలికి పండుటాకులు నమలి కామవికారము కలుగకుంటకు కచ్చబిగించుచున్నాఁడు. ఇట్టి వారికి మోక్షము కలుగునా ?

ఆ. పత్తనమ్ములందు పతులకు సతులకు
 మోహ మెచ్చుదాన యూహ లెచ్చు
 ముక్తిమార్గమునకు యుక్తియే తెలియదు, వి.

పట్టణవాసులగు స్త్రీపురుషులకుఁ గామవికారములు చెడుతలంపులు మెండు. అట్టి భోగలాలసులకు ముక్తి సాధించువిధ మెన్నఁటికిఁ దెలియరాదు.



ఆ. పరదళములఁ జూచి ప్రాణంపుబ్రీతిచే
 నుఱుకుపిఱికివాఁ డటూరిదాఁక
 యముఁడు వచ్చునేని యడ్డ మింకెవ్వరు? వి...

విరోధి సైన్యములను జూచినంతన పిఱికిబంట్లు కాలికి బుద్ధి చెప్పి పాఱిపోవుచుందురు. యముఁడు ఎదురుగావచ్చిన నింక నెంతవఱకుఁ బాఱిపోవఁగలుగుదురు ?

ఆ. పరబలంబుఁ జూచి ప్రాణరక్షణమున
 కుఱికి పాఱిపోవు పిఱికినరుఁడు
 యముఁడు కుపితుఁడైన నడ్డ మెవ్వఁడు సుమి?వి.

పిఱికివాఁడు శత్రువులఁ జూచి ప్రాణములపై నాసచే పాఱిపోవును; గాని యముఁడు కుపితుఁడైన నెట్లు తప్పించికొని పోఁగలుగును? అడ్డుపడువా రెవరుందురు ?

ఆ. పరమభాగవతులు ప్రజలు సంతోషించు
 నాటపాట నేర్చి నీటుగాను
 కోట్లకొలఁది తెచ్చి కూటికి లేకుంద్రు, వి...

ఆటలను బాటలను బాగుగా నేర్చి భాగవతులు జనులను రంజింపఁజేయుఁటకు ఎన్నిపాట్లుపడి ఎంతడబ్బు నార్జించినను కూటికి లేకయే చివరకు తంటాలుబడుచుందురు.

క. పాతకసంసారార్ణవ
 మే తెఱఁగున దాఁటె దీవు హెచ్చరికమెయిన్
 చేతనమూర్తిని మదిలో
 ఖ్యాతిగ నెన్నంగ దగును ఘనమతి వేమా!

సంసారము మహాసముద్రము. దీనినుండి బయటపడుట సామాన్యకార్యముకాదుగాన మెలఁకువఁగలిగి పరమాత్ముని హృదయమున నిలిపి ధ్యానింపుము. దానఁ గడతేఱఁగలుగుదువు.

ఆ. పాపజాతినరుఁడు పరసతిఁ గోరుట
చేఁప జిహ్వరుచికిఁ జిక్కునట్లు
తీపునంటి యీఁగ తెగువతో నీల్గదా? వి...

పాపజాతులగు మానవులు జిహ్వచాపల్యమున చేఁపలు గాలములోఁ దగులుకొన్నట్లు పరకాంతలనాశించి నశించుచున్నారు. తేనెలోబడ్డ యీఁగలకువలె పరకాంతాసక్తులకుఁ జావుతప్పదు.

ఆ. పాశబంధుచేత బంధువర్గము లెల్లఁ
జిక్కఁజూతు రరయ జీవము చన
నొక్కఁడైన నేగఁ డుసురుమాత్రమె కాని, వి.

మానవులు మోహపాశబద్ధులై చుట్టపక్కములపై మమకారము పెట్టుకొని విఱ్ఱవీగుచుందురు. చచ్చినపిమ్మట వెంట నీప్రేమపాత్రు లెవరును రారు. ప్రాణముమాత్ర మొక్కటియే వెడలిపోవును.

క. పిండంబై యుదరంబున
నుండును గొన్నాళ్లు పిదప నుర్వీస్థలిపై
పిండంబై జనియించును
పిండం బాప్రాణరతుఁ పృథివిని వేమా! 2279

స్త్రీపురుషుల శుక్లశోణితములు మొదట పిండాకారమై కొన్నాళ్లుండును. పిదప నొకరూపాకారము దాల్చి జన్మమునొం



దును. ఈపిండము తనను గడతేర్చుననుటకంటె నవివేక మింకొకటిలేదు.

ఆ. భవము పూర్వకర్మఫలము ననుభవింపఁ
గలిగె ననుచు మదిని గట్టిపఱచి
కష్టసుఖము లేవి గలిగిన తలఁపకు, వి... 2280

పూర్వకర్మఫలము ననుభవించుటకే తన కీజన్మము కలిగెనని గట్టి చేసికొని కష్టములకు లొంగక యుండుము.

ఆ. భవము సాగరంబు భార్యయే మకరము
చేఁప జలగ లగును శిశువు లెల్ల
భవహరుఁ దలఁపక పాఱ మందగ లేఁడు, వి...

సంసారమనుసాగరమునకు భార్యయే మొసలి; శిశువులు చేఁపలు జలగలవంటివారలు. ఈశ్వరుఁడుగూడ నీసంసారసాగరమునకు అంతు నెఱుంగఁజాలఁడు.

ఆ. మంత్రవిద్య లెల్ల మాయలకొఱకిల
సృష్టియందు బ్రహ్మసృష్టిఁ జేసె
నుత్తముఁడైనవాఁడు మది నిల్పలేఁడయా, వి....

మంత్రము మున్నగుమాయలు ఈజగమునంతయును మోసగింప దైవము నిర్మించెను. దీని నెఱింగియు మనస్సును నిలుపఁజాలక మదోన్మత్తులు నశించుచున్నారు.

ఆ. మదముచేత లోకమాయలు దెలియరు
మదముచేత దన్ను మఱచు నెపుడు
బుద్ధిలేనిపసులపోలికఁ జెడుదురు, వి... 2283

మానవులు మదముచే యుక్తాయుక్తజ్ఞానము కోలుపోయి లోకమాయలు గుఱుతింపలేక తమ్ము తాము మఱచి కేవలపశుప్రాయులై మరణము నొందుచున్నారు.

క. మరణము దాపగుచున్నది
స్థిరబుద్ధిని బరముకన్నఁ జిక్కును మోక్షం
బరయుచుఁ బురిలో మించిన
పరమార్థమె బట్టబయలు ప్రాఁకుము వేమా!

మరణ మాసన్నమై యున్నదియని నిశ్చయించికొని మోక్షమును వెదకుచు పరమార్థమును పొందవలయును. గాన స్థిరబుద్ధితోఁ జూచినచో స్వరూపము గానుపించును. దేహాతీతుఁడవై దానితో నేకీభవించుటకుఁ బాటుపడుము.

ఆ. మాట మఱుఁగు సిగ్గు మనుజలోకం బెల్ల
చీరె మఱుఁగు సిగ్గు చెప్పనేల
బయట నింటి సిగ్గు బండసంసారంబు, వి...

మనుష్యులు తమలజ్జను మాటలమఱుఁగున దాఁచుకొనుచున్నారు. స్త్రీలు చీరెమఱుఁగున దాఁచుకొనుచున్నారు. ఎదటి యింటివాని సిగ్గుమాత్రము లక్ష్యముచేయక యందఱు బైటవేయ సిద్ధపడుచున్నారు.

ఆ. మాయయె చెఱసాల మనసె యోచింపఁగఁ
బెద్దశృంఖలంబు భేదములను
ఇట్లు బద్ధవరుని కెన్నఁడు మోక్షము, వి...2286



మాయయే యొకచెఱసాల. మనస్సే యొక గొలుసు. ఇట్టులు బద్ధుఁడై యున్నవాని కెన్నటికిని మోక్షము చేకూఱదు.

ఆ. ముఖముఁ జూచినంత మోహంబు ఘనమౌను
దిసమొలను గనంగ దీరు నద్ది
కూడినవల పెల్ల కుస్తరింపఁగరాదె, వి... 2287

కాంతల మొగమును గనినంతనె మోహము గలుగును. చెలంవల దిగంబరరూపము చూచినంతనే ఏవముగలిగి వలపు నశించును. మోహమును దుదముట్టఁజేయుటకిది యొకయుపాయము.

ఆ. మొగముఁ జూచినపుడె మోహంబు ఘనమౌను
ధనముఁ జూచినపుడె తగులు మనసు
కూలి నష్టమైనఁ గోరనే కొఱగామి, వి....2288

ఎట్టిస్థితిలో నున్నను స్త్రీలముఖమును పొడఁగాంచినంతనె వలపు జనించును. ధనము చూచినంతనే లోభము జన్మించును. ఈవలపువలన ఆలోభమువలన గొంచెము సుఖ ముండుటవలననే అవివేకు లాశపడుచున్నారు. కూలిపాటు సుఖములేకున్న నెవఁడాశించును.

ఆ. మొండివాని కేల ముంజేతికడియాలు
తొఱ్ఱివాని కేల గట్టిపండ్లు
గాడిదలకు నేల గడ్డముల్ మీసముల్, వి...

మొండివానికి కడియములును తొఱ్ఱివానికి కృత్రిమదంతములు నపుంసకులకు గడ్డములు మున్నగునవియును నిష్ప్రయోజకములు.

ఆ. మొదట నాసఁ బెట్టి తుది లేదు పొమ్మను
పరమలోభు లైన పాపులకును
వారియుసురు దాఁకి వగచెడిపోవురా, వి...

మొదట అంతయిచ్చెద మింతయిచ్చెద మని యాసపెట్టి త్రిప్పిత్రిప్పి కడకు లేదనిచెప్పు పాపాత్ములు యాచకుల యుసురుగొట్టి యేనాఁటికైనఁ గూలారక పోవరు.

ఆ. మొలకచనులనాఁడు మూఁడుకోటులు సేయు
కులుకుచనులనాఁడు కోటి సేయు
తటుకుచనులనాఁడు దయ్యాలు నొల్లవు, వి.

మూర్ఖులును విషయాసక్తులు నైననరులు స్త్రీలను మొలకచనులు మూడుకోటులు సేయు ననుచు గులుకుగుబ్బలు కోటిరూకలు చేయుననియు వాలుచన్నులు పిశాచములకేని పనికిరావనియు నిట్టి నీమున్నగు మాటలతో వ్యామోహమును నుతింతురు.

ఆ. మృగమదమ్ము చూడ మీఁద నల్లగ నుండు
పరిఢవిల్లు దాని పరిమళంబు
గురువు లయినవారిగుణము లీలాగురా, వి...

కస్తూరి చూచుటకు నల్లగా నున్నను వాసన ఘనమైయుండు నట్టులే ఘనులగు గురువులు గుణములచే ఒప్పుచుందురు గాని బాహ్యాడంబరములతో నుండరు.

ఆ. యోని బోను జేసి యొడలు డంబుగఁ జేసి
నాల్క నిడువు గట్టి నమలుదు నని
వివర మెఱుఁగ కేర్పు విటుఁడే ద్విపాదుండు,వి.



యోని బోనుఁజేసి వివరము నెఱుఁగక విషయాసక్తతఁ దిరుగుచుండెడి మనుజుఁడే ఆలోచించినచో ద్విపాత్పశువనఁబడును. వీఁడు పశువుకన్న కడజాతివాఁడు.

ఆ. యోని గడుగునీటి నానరంగ ద్రాగిన
బ్రహ్మమత మటంచు బలుకు రెట్టు
బ్రహ్మనిష్ఠవలన బ్రాహ్మణు ల్గావలె వి... 2294

రుద్రాభిషేకము జేసిన నీరుద్రావుటవలన బ్రహ్మమతమును గాంచినటులగునని యవివేకులగు బ్రాహ్మణులు తలంచుచున్నారు. బ్రహ్మనిష్ఠవలనఁ దప్ప బ్రహ్మత్వము ఇంకొకదానివలన నెన్నటికి రాఁజాలదు.

ఆ. యోనియందె పుట్టి యోనికి రుచిఁ జేయు
చన్ను గుడిచి పెరిగి చన్నుఁ బట్టు
సృష్టిలోనిప్రాణి సిగ్గేల యెఱుఁగదు,వి...2295

యోనియందే పుట్టి మనుజులు మరల దానికే యాసించుచుందురు. చన్నుబాలుద్రావి పెద్దవారై మోహమున చెలువలచన్నులఁ బట్టుటకుఁ గోరుచున్నారు. సృష్టిలోనిప్రాణులు తాము చేయుఁ అవినీతికార్యముల కేల లజ్జింపరో?

ఆ. రాజసంబు గోరి రాజ్యభారమునందు
నోర్పు లేనియీతఁ డుభయతఁ జెడు
నీటిపైన గుండు నిలుచునా మునుఁగక? వి...

రాజసభావముచేత రాజ్యభారమును వహింపలేని రాజు ఉభయలోకములయందును భ్రష్టుఁడై చెడిపోవును. నీటిపైన

రాతిగుండు నిలువఁజాలనటుల రాజస మపేక్షించువారికి రాజ్య మెన్నటికిని దక్కఁజాలదు.

ఆ. రాతిబసవని గని రంగుగా మ్రొక్కుచు
రూఢిబసవని గాల రుద్దుచుంద్రు
బసవభక్తు లెల్ల పాపులు తలపోయ, వి...2297

శివభక్తులు రాతితోఁ జేసినబసవనికి మ్రొక్కుచు నిజమగు బసవని కొట్టుచుందురు; కావున బసవభక్తు లెల్లరును ఎంత పాపాత్ములో కదా!

ఆ. రాతిప్రతిమ దెచ్చి రాజసంబుగ నుంచి
పూజ సేయునరుఁడు బుద్ధిమాలి
భావమందు నరుఁడు భావింప నేరఁడు, వి...

మనుజుఁడు తెలివిలేమిచేత రాతిబొమ్మను తెచ్చి రాజసభాపముతోఁ బూజఁ జేయుటకు పూనుకొనును. అంతియ కాని యీశ్వరస్వరూపమును మనస్సులో భావింపలేఁడు.

ఆ. రాతిలింగమునకు రాజులు మొదలుగా
పూజసేయుదు రిల పూలతోడ
ఆత్మలింగమునను నానంద మొందఁడు, వి...

రాజులు మున్నగువా రెల్లరును రాతిలింగములకే పూజలు సేయఁబూనుదురే కాని ఆత్మలింగమును పూజించి యానందింపరు కదా! ఎంత యవివేకము!

ఆ. రామభక్తుల మని రాతిబొమ్మకు మ్రొక్కి
భజన సేయ నేల భక్తిలేక
భక్తినిల్ప నతఁడు భజనము సేయునా? వి.2300



రామభక్తి గలవారలమని రాతిబొమ్మకు మ్రొక్కుచు భజనలు చేయువారికి మనస్సులో భక్తిమాత్ర ముండదు. భక్తినిలుపని వారు భజనసేయఁగలుగుదురా? దాన ఫలముండునా?

ఆ. రూపులేని వనిత రూఢిపతివ్రత
నీటులేనివాఁడు పోటుబంటు
తెలుపవచ్చు నెట్లు దేవరబంటుల, వి .. 2301

అందము లేనిస్త్రీ పతివ్రతయును నీటులేనివాఁడు పోటుమానిసియుఁగా నుందురు. ఆహా ఇట్టిమూఢలోకము దేవభక్తుల నెటుల గుర్తింపఁగలదు.

ఆ. రూపువంక పేరు రూఢిగా నిలుచును
పేరువంక క్రియలు పెనఁగుచుండు
నాశ మౌను తుదకు నామరూపక్రియల్, వి...

మానసికోపాసనము గావించినయెడల దివ్యస్వరూపము గోచరించును. దాని నొకనామముబెట్టి గుర్తించి యారాధింపవచ్చును. పిదపఁ బూజాదిక్రియ లామూర్తి కర్పింపవచ్చును. ముక్తుఁడగుతఱి కానామము రూపము క్రియ లంతరించును.

ఆ. రూపువివర మొకట రూఢిగా దాఁగన్న
తలఁచునప్పు డెల్ల మెలఁగు మదిని
అట్లు మెలపి కోరు మాగురురూపుని, వి...2303

ఒక ఆకారమును హృదయముననుంచి ధ్యానించినయెడల స్పష్టముగా నది కాన్పించుచుఁ దలఁచినపుడెల్ల దర్శన మొసఁగు

చుండును. అటులె గురుస్వరూపమును గూడ మనస్సులో నిలిపి దర్శింపఁ గలుగుట తారణోపాయము.

ఆ. లవణ మెంత దానిలాభంబు గన నెంత
కొద్ది దనుచు నెన్నఁగూడదయ్య
భోగ మేటికి నుపయోగంబె లెక్క గు,వి...2304

చిన్నవస్తువులను సైతము లక్ష్యము చేయకుండ నుండరాదు. ఉప్పెంత దానిభోగ మెంత? కావున నుపయోగము కొలఁది గౌరవింపవలెనుగాని గొప్పతనమును గౌరవింపరాదు.

ఆ. లోభమోహములను ప్రాభవములు దప్పు
దలఁచినపను లెల్ల తప్పి చనును
తా నొకటి దలఁచిన దైవ మొండగుచుండు,వి.

లోభము మోహము ఈరెండుగలవానికి గొప్పతనముదక్కదు. వాఁడు తలంచినపనులన్నియు వ్యర్థములగును. వాఁడొకటి తలంచిన దైవము వేఱొకటి తలంచి కార్యభంగము గావించుచుండును.

ఆ. లోభివానికల్మి లోలత నాసించి
బడుగువాఁడు తిరుగఁ బరిణమించు
తగరు వెంట నక్క దగిలినచందము, వి...2306

లోభికిఁ గలసంపదఁ జూచి యెటులైన సంగ్రహింపవలయు నని ధనాశాలోలుఁడగు నవివేకి వానిని వెంటనంటి తిరుగ సాగును. పొట్టేలువెంటఁబడిన నక్కవలె నాయవివేకి నిష్ఫల సంకల్పుఁడగుచున్నాఁడు.



ఆ. లోభి దాత యైన లోకంబులోపల
పరుల నడుగ బోఁడు ప్రాలుమాలి
ఒకని కీనివాఁడె యాచింపఁ బెనులోభి, వి...

దాతలు లోభులైనయెడల లోకమున యాచకులే లేక పోయెడివారు. ఒకరి కీయక తా ననుభవింపక యుండులోభు లుంటవలనఁగూడ యాచకులసంఖ్య యెక్కుడగుచున్నది.

ఆ. లోభివాని జంప లోకంబులోపల
మందు వేఱువలదు మతమె గలదు
పైక మడుగ నతఁడు భగ్గురుమని చచ్చు, వి...

లోభిని చంపుటకు తగినయౌషధము లవసరములేదు. దీనికి మంచియోగ మొకటిగలదు. ఆలోభిని పైకమడిగితిమా యీయ నోపక తనంతనే చచ్చును.

ఆ. వనము బిలములందు వరయోగి తా నుండు
పనియె యిందుననక పాటుపడును
తనివిదీర మదిని దలకొని చూచును, వి...2309

అడవులందును బిలములందు నుండి విసువక సర్వదా నీశ్వరుని తనమనస్సున నిలుపుకొని యీలోకమున నాకేమి యనుకొనక యీయుపున్నవఱకు మోక్షమునకుఁ బాటుపడి తృప్తితీఱఁ బర మాత్మస్వరూపమును బిదపఁ గాంచువాఁడు నిజమైన యోగీశ్వరుఁడు.

ఆ. వరలు రత్నసమితివలె గూర్చు ధాన్యంబుఁ
జక్క దంచి వండి మిక్కుటముగ

సుష్టుభోజనములఁ జూరగా నిడువాఁడు
చెప్పనేల వాఁడు శివుఁడు వేమ! 2310

రత్నములను సమకూర్చినటుల శ్రమపడి ధాన్యము పోగు చేసి బాగుగా నాధాన్యమును అరుగదంపించి వండి తృప్తిగా భోజనమిడువాఁ డుత్తముఁడు.

ఆ. వలపు గలిగెనేని వనజాక్షి యధరంబు
పంచదారకుప్ప పాలకోవ
చూతఫలరసంబు జున్నుసమానము, వి...2311

వలపు గలిగినచో వలపులాడివాతెఱ పంచదారవలెను పాలకోవవలెను తీయమామిడిరసమువలెను జున్నువలెను విటులకు మిగుల రుచిగానుండును.

ఆ. వలపు దీఱెనేని వనజాక్షియధరంబు
ములకపంటి గిజరు ముష్టిరసము
చింతపొంత యగును జీడిసమానమౌ, వి...

విటులచే వలపున్నపు డంతగొప్పగాఁ బొల్పఁబడిన చెలువ మోవి కామము దీఱినపిమ్మట ములగపండు గిజరువలె, విషముష్టికాయరసమువలె, చింతపండువలె, జీడిగింజవలె నసహ్యము కలుగఁజేయుచున్నది.

ఆ. వల్లవైపులేక వాగ్దత్త మటుచేసి
అదిగొ యిదిగొ యనుచు నాసవెట్టి
గడువుపెట్టి రేపు గడియగా నిమ్మను, వి...2312

లోభులు వెనుక ముందుల నాలోచించికొనక వాగ్దత్తమును చేసి అదిగో యిదిగో యని యాసలఁబెట్టి యాచకులను ద్రిప్పి



త్రిప్పి కడకు నేఁడు రేఁపు ఎల్లుండి యని గడువులు బెట్టి తుట్టతుదకు లేదు పొమ్మనియందురు.

ఆ. వాఁడువాఁ డనంగ వానికేమిర లోటు
వాఁడట నరదేవవర్యు నెపుడు
వాఁడు కాక యదియె వాఁడనఁ దప్పేమి? వి.

వాఁడువాఁడని భగవంతుని పిలచినంతమాత్రమున వానికేమియు లోపమురాదు. ఎవ రెటులఁదలంచినను భగవంతుఁడు సర్వలోకపూజ్యుఁడే. అతఁడు స్త్రీ కాదు గావున వాఁడనవచ్చును దానఁ దప్పులేదు.

ఆ. వాతగుణముచేత వగగన్న మగవాఁడు
లొట్టకనులదాని లోలతకును
బుట్టి జగతి నిలుచు పునరుద్భవించును, వి...

వాతరోగముచే నవయవములు వశముగానివాఁ డెటులోఁ గామవికారము నాపుకొనలేక లొట్టకన్నులదానిని గలసి మరలఁ గుమారుఁడై పుట్టి మరలఁ గలసి మరలఁ బుట్టి యిట్లు జన్మాంతరముల ననుభవించుచున్నాఁడు.

ఆ. వానభయముచేత వడి దూరెదరు లోన
నెంతకెంత నైన మొండిచఱతు
రేల లోకజనులు మే లోర్వకుందురు, వి...

లోకులు చల్లఁగా నున్న వాన కోర్వరు. ఎంత వేఁడిగానున్నను మొండిచఱచి ఎండకు ఓర్చెదరు. ఇంతయేల లోకులు మేలును బొత్తిగా నోర్వఁజాలరు.

ఆ. వారకాంత లెల్ల వలచి యేతెంతురా
పొందుఁజేసి ధనము పుచ్చుకొనక
మాట రూఢిగాఁగ మగ లెల్ల వత్తురు, వి...

వారకాంత లాడుమాటలను నిజములుగాఁ దలంచి విటులు వత్తురుగాని వారకాంతలుమాత్రము ధనము చెల్లింపనిది ఎంత వానినైన వలచి భోగింపనీయరు.

ఆ. విజయుఁ డైనవాఁడు విల్లందినంతనె
కుజను లెల్లవారు కూలిరిగద
భజనచేయునతఁడు విజయము గాంచఁడా? వి.

విజయుఁడు రణమున విల్లు బాణములు పట్టుకొన్నంతమాత్రమునఁ గౌరవసైన్యమంతయుఁ నశించెను. వారు ఈశ్వరధ్యానము చేయుచున్నచో నట్టి మృత్యువులేకుండ సుఖముగా బ్రదుకు వారే!

ఆ. విటునిగన్న వలపు విశదమై యుండును
బోటిచూపునకును సాటి గలదె
కంటిలోనిపాప కుంటెనగాఁడయా, వి... 2319

విటులను జూడఁగానే కాంతలు చూపులతోనే వలపు వెల్లడించుచున్నారు. వారిచూపులకు సామ్యము లేనేలేదు. ఇంతయేల? ఆసతీపురుషులకుఁ జూపులోని పాపయే తార్పుకాఁడు.

ఆ. విటులకనుల కెంతొ విభ్రమమై తోఁచు
సాటిలేనిపాలఁతి చక్కఁదనము
కంటిలోనిపాప కుంటెనతనమె కా!, వి... 2320



విటులకంటికి వలపులాండ్ర మేలఁకువలు మితిలేని సౌందర్యమును జూపుచుండును. ఇదియంతయుఁ గంటిపాపచేయుఁ కుంటెనతనమె.

ఆ. విడువవలయు నూరు విశ్రాంతి గాకున్న
విడువవలయు నాలివిధము చెడిన
విడువవలయు రాజు వితరణి గాకున్న, వి...

విశ్రాంతిలేనియూరును చెడువిధము గలభార్యను వితరణము లేనిరాజును పరిత్యజింపవలయును.

ఆ. విడువ ముడువ లేక కుడువ కట్టఁగ లేక
వెఱపు లేక విద్యవిధము లేక
వెడలలేనివాని నడపీనుఁగనరొకో, వి... 2322

కట్టుటకు పెట్టుటకు మున్నగువానికై ద్రవ్యము నార్జింపలేని వాండ్రు ధనము నార్జింప ననుకూలమగు విద్యావివేకములు లేని వాండ్రు నలుపురిలోకిఁ బోయి రాలేనివాండ్రు నడపీనుఁగులుగా లోకులచే భావింపఁబడుదురు.

ఆ. విత్తహీనమైన వేళలందును తల్లి
తనయు లాలు సుహృదు లనెడివార
లెల్ల శత్రులగుదు రెందైన నిజ మిది, వి...

ద్రవ్యములేనియప్పుడు తల్లి కొడుకులు స్నేహితులు మున్నగువారైనను శత్రువులై పోయెదరు. ఇది సత్యము.

ఆ. విత్తు ముగ్గగేని వృద్ధి కానేరదు
విత్తు ముగ్గకున్న వృద్ధి యగును
విత్తు విశ్వమునకు వివరింప నేదియో?వి...2324

విత్తు వేఁడిచే ప్రగ్గకున్నచో బీజరూపము దాల్చును. విత్తు ప్రగ్గెనేని యెన్నఁటికి మొలువదు. ఇటులె విశ్వము మొలచుటకుఁగూడఁ బూర్వ మొక విత్తుగలదు. దాని నెఱుంగవలయును.

క. విధి లేక జరుగ దనుచును
మదిలో నేపస్తువైన మనసునఁగూడన్
బొదలుచు విడువఁగఁజాలని
యదియే సంసారబీజ మనఁబడు వేమా! 2325

మనస్సు కామాదివికారములపైఁ దగులుకొన్నపుడు విధి యటులుంటచేఁ దగులుకొనెనని పలుకుచు మనోవికారముల నణంచుకొనక పోవుటయే సంసారమూల మగుచున్నది.

ఆ. విన్నవానికన్నఁ గన్నవాఁ డధికుండు
కన్నవానికన్నఁ గలియువాఁడు
ఉన్నతోన్నతుఁడయి యుర్విలోపలనుండు, వి...

ఈశ్వరచరిత్రము విన్నవానికంటె ఈశ్వరచరిత్రము కనుఁగొన్నవాఁడు ధన్యుఁడు. అంతకంటె నీశ్వరునితో నైక్యమగువాఁడు మహానుభావుఁడు. ఉత్తముఁడను పేరొంది శాశ్వతకీర్తి నొందఁగల్గును.

ఆ. వినియు వినకయుండు కనియుఁ గానకయుండు
తలఁచి తలఁపకుండు తాను యోగి
మనుజవరులచేత మఱి పూజ గొనుచుండు, వి.



జ్ఞానియగువాఁడు మోక్షధర్మములు వినియు విననియట్లు ఈశ్వరస్వరూపము కనియుఁ గననియట్లు ఈశ్వరుని దలంచుచుఁ దలంచనట్లు నుండి మానవులచేఁ బూజాదుల నొందుచునుండును.

ఆ. విప్రు నెంగిలాకు వీథికుక్కలపాలు
మాలపుల్లె యైన మానితంబు
మంతు కెక్కునాకు మాలపుల్లె యటండ్రు, వి.

విప్రులుండువాడలో విస్తరులు చెల్లచెదరుగా నుండును. కుక్కలు పీకుచుండును. త్రోవను బోవువారు మాలవిస్తరాకు అని యసహ్యించుకొనుచున్నారు. మాలవిస్తరులైన ఇంతకుఁ గొంతవఱకు నయము. మాలవాడలో నెక్కడనో యొకచోటఁ ఒకటే కాన్పించును.

ఆ. విశ్వమందు పరుని వివరంబుఁ గానక
పరమహంస నెట్లు పట్టవచ్చు
మానసమున నిష్ఠ బూనఁగవలెఁ గాని, వి...

ప్రపంచములోనున్న పరాత్పరుని వివరమును తెలిసికొననివారు పరహంసమును గనిపట్టఁజాలరు. కావున నిష్ఠను పూనుకొనవలయును. పరమహంసమును గుర్తింప వలెను.

ఆ. విశ్వమందు బ్రహ్మ విస్తరించుట గాక
వేఱె బ్రహ్మ మనుచు వెదుక నేల?
తగిలి యుండుఁగాదె తనలోన బ్రహ్మంబు, వి...

ప్రపంచమునందు బ్రహ్మము విస్తరించియున్నాఁడు. వేఱె

బ్రహ్మము లేనే లేదు. తనహృదయమున బ్రహ్మము నిలిచియుండ బ్రహ్మమునకు వెదకుట పొరబాటు గదా!

ఆ. విశ్వము నడుపంగ విశ్వేశ్వరుం డుండ
బ్రాహ్మణులకు నేల పట్టుదలలు
వనములోనిక్రోఁతి వసుమతి నడపునా? వి...

ప్రపంచమునంతను నడుపుటకు ఈశ్వరుఁ డుండఁగా బ్రాహ్మణుఁడు తనతో నున్నదని పట్టుబట్టుట యజ్ఞానవిలసితము. అడవిక్రోఁతి ప్రపంచమునడుపుచున్నట్లుబ్రాహ్మణులు ప్రపంచము నడుపుచున్నారు.

ఆ. కానికులముదైన కంటికింపైనప్డు
విటుఁడు తలఁచెనేని విడువలేఁడు
మరగి గ్రుడ్డికుక్క మలమును తినునట్లు, వి...

స్త్రీ ఎట్టినీచవంశపుదైనను చక్కని దైనచో విటుఁడు మహానందమున దానినుపభోగించుచు వదలజాలకుండును. గ్రుడ్డికుక్క వెంటమరగినటుల విటులు పరకాంతల మరగుచున్నారు.

ఆ. విశ్వసింపఁ దగిన వేషంబు మరి లేదు
కుడువఁ గూడు లేదు కోక లేదు
విశ్వమయుఁడె యైన విభు నేల తెలియరో? వి.

ఈసాధారణమానవులు వేషభాషల యాడంబరము లేనివారయ్యుఁ దినుటకుఁ దిండి గట్టుటకు వస్త్రములు చాలినన్నిలేకుండియు నీశ్వరవిచారము చేయకున్నారు. భగవంతుని నేసంబం



ధములు లేని గర్భదరిద్రులే తలంపకున్న నిఁక శ్రీమంతులగుభోగలాలసులు తలంతురా ?

ఆ. విష్ణుభక్తులిలను విభూతిపాలైరి
శివునిభక్తు లెల్ల సిద్ధులైరి
భక్తు లెల్ల జీవిపాటిని దప్పిరి, వి... 2334

వైష్ణవులు శైవులుగను శైవులు సిద్ధులుగను మాఱి వివిధవిధములఁ జెడిపోయిరి. భక్తులలోఁ గట్టుబాటులు సరిగా లేవు.

ఆ. వీడవలయువానిఁ గూడిన నెగ్గగు
వీటివాడలందు వెలయువాఁడు
పాడుచేయుపనులు పరిపాటియే గదా! వి...

సహవాసము చేయఁదగనివారితో చేరిన నెంతవాఁడైనను అసమానము నొందును. నలుగురిలోనికిఁ బోనేర్చినవాఁడు నీచస్నేహము చేయరాదు. నీచులకు నింద్యకార్యములు సహజములే గదా!

ఆ. విడుచుదానిపొందు విడువఁ జాలనివాఁడు
చచ్చుదాఁక మోయు చాపగుడిసె
భాగవతులపట్టుఁ బాపంగ నోపఁడు, వి...2336

విడిచివేసిన గుడిసెవేటుదాని కలవాటుపడినవాఁడు దాని వెంట చాపగుడిసె సామానులు వీదిభాగవతులు బుట్టలు తట్టలు మోసినటుల మోసికొని లజ్జాభిమానములు విడిచి తిరుగక తప్పదు.

ఆ. వెదకి కానలేఁడు వేదాంతవేద్యుని
తత్త్వవేత్త లేఁడు ధరణిలోన
గలిగెనే నతండు కానంగరాఁడయా, వి...

పరేశ్వరుని వెదకి కన్నులతో చూచినవాఁడు ఎవ్వఁడును లేఁడు. భూలోకమున నిజమగు తత్త్వవిదులు లేరు. ఒకవేళ తత్త్వవేత్తలగువారలున్నచో సామాన్యమానవుల కెన్నటి కగుపడరు.

ఆ. వెదకి వెదకి వెదకి వేసారి వేసారి
తిరిగి తిరిగి తిరిగి దిమ్మతిరిగి
బొమ్మలాటఁ జూచి పోఁబడి గంటిరా, వి...

మూర్ఖులారా! మీరు పరమాత్ముని గనుగొన వెదకి వెదకి వేసారితిరి. క్షేత్రములని పాత్రములని దేశదేశములను దిరిగితిరి. లోకము బొమ్మలాటవంటిది. దీనిని మీరు కనులారఁ గాంచియుఁ జావు సమీపములో నున్నదని యెఱుంగఁజాలకున్నారు గదా!

ఆ. వెన్న చేతఁ బట్టి వివరంబు తెలియక
ఘృతముఁ గోరునట్టి యతవిభంగి
తాను దైవమయ్యు దైవంబుఁ దలఁచును, వి.

వెన్న చేతిలోఁబట్టుకొని నేతికై వెదకువానివలె తానె దైవమయ్యును అజ్ఞుఁడు దైవముకొఱకు వెదకులాడును. వెన్న కాఁచిన నెయ్యియగును. రెండునొకటే. అటులే జీవుఁడు మాయావరణము తొలఁగి పరాత్మ యగును. రెండు నొకటే.



ఆ. వెనుకఁ జూత మన్న వెసను కష్టపుగుంట
ముందుఁ జూత మన్న ముఱికిగుంట
వెలఁదిఁ జూచి యేల వేడుకపడుదురు? వి...

స్త్రీజన్మము మిగుల ఏహ్యమైనది. స్త్రీస్వరూపము ముందుఁ జూచిన మురికిగుంట; వెనకఁ జూచిన వెగటుగుంట. ఇట్టి స్త్రీ నిజూచి కాముకులేల వేడుకపడి వలచి వెన్నాడుచున్నారో తోఁచకున్నది.

ఆ. వెట్టివానికైన వేషధారికి నైనఁ
రోగికైనఁ బరమయోగికైన
స్త్రీలఁ జూచినపుడు చిత్తము రంజిల్లు, వి...

వెట్టివానికైనను కపటునకైనను రోగపీడితునకైనను యోగీశ్వరునకైననా స్త్రీరూపము గానవచ్చినంతన కామవికారములు గలుగుచుండుట సహజము.

ఆ. వెలఁదిసొంపుఁ జూచి విఱ్ఱవీగఁగ రాదు
కలికి గుణము కాదె కారణంబు
చపలచిత్తవృత్తి జారిణి కుండదా? వి... 2342

స్త్రీలకు సొగసుకంటెను గుణమే ప్రధానమైనది. కావున సొంపుకై గర్వింపరాదు. చక్కనిదని వలచితిమేని యది జారిణి కావున చపలమగుచిత్తముగలదై పరులకొఱకుఁ బ్రాకులాడసాగును గాన రూపమునకు మురియరాదు.

ఆ. వేదములను జదివి వెఱవేమి గాంచిరి
యరిగి తిరిగి వత్తు రందఱు కద

బ్రహ్మ మేమొ దెలిసి బ్రదుకుట నిజమయా, వి.

బ్రాహ్మణులు వేదములు వేదములని కలువరింతురుగాని వేదములను జదివి యేమివెఛఫు నొందిరి. కావున బ్రహ్మమనఁగానేమొ తెలిసికొని బ్రదుకుట యుత్తమము. ఇదియేబ్రాహ్మణధర్మము.

ఆ. వేదవిద్య లెల్ల వేశ్యలవంటివి
భ్రమలఁ బెట్టి తేటపడఁగ నీవు
గుప్తవిద్య యొకటె కులకాంతవంటిది, వి...

వేదాదివిద్యలు వేశ్యలవంటివి. ఏలయన వేదాదులయందలి సిద్ధాంతములు పరస్పరభిన్నముగా నుండును. వేశ్యలుఁగూడ నిటులే పరాభిప్రాయములతో నుందురు. ముక్తినియ్యఁజాలినది గుప్తమగు యోగవిద్య యొకటే.

ఆ. వేదశాస్త్రములను విరివిగాఁ దా నేర్చి
వాద మాడువాఁడు వట్టివాఁడు
సారమైనగుణితు సాక్షిగా నెంచుము, వి...

వేదములను శాస్త్రములను చదివి వాదములాడువాఁడు వ్యర్థుఁడు. కావున నట్లుచేయక సర్వసాక్షి యగువానిని ధ్యానింపుము. అదియే నేర్చినవిద్యకు ఫలము.

క. వేదాంతుల మనిః కొందఱు
వాదములకు నడుముగట్టి వత్తురు వారల్
సాధులు గారని చెప్పఁగ
భేదగుణం బొకటి గుఱుతు పెద్దది వేమా!



వేదాంతులమని కొందఱు వంచకులు పేరులుబెట్టుకొని ఔనన్నది కాదని కాదన్నది ఔనని వాదింతురు. వారు సాధుశీలురు కారని చెప్పుటకు వారికిఁగల భేదబుద్ధి యొక్కటియే దృష్టాంతము.

ఆ. వేషధారి నెపుడు విశ్వసింపఁగరాదు
వేషదోషము లోకవిధమె యగును
రట్టుకాదె మునుపు రావణు వేషంబు, వి...2347

వేషములను వేసికొని యుండువాని నెల్లప్పుడును విశ్వసింపరాదు. రావణుఁడు వేషము వేసికొన్నందులకేగదా పరుల మోసగించి అంతటియపకీర్తికి పాలయ్యెను. వేషముదోష మిందు చేసమము.

ఆ. వేష మొనరఁ గట్టి వెఱ్ఱి శూద్రత్వంబు
తనకు లేదనుకొను ధరణిద్విజుఁడు
అరిది గిట్టువేళ నడఁగు ద్విజత్వంబు, వి...

అవివేకి యగుమానవుఁడు యజ్ఞోపవీతాదులు భూతిపూతలు లోనగు బాహ్యచిహ్నాలు దాల్చి తనకు శూద్రత్వములేదు. బ్రాహ్మణుఁడనని విఱ్ఱవీగుచుండును. చనిపోయిన పిదప నీబాహ్యచిహ్నాలు తొలగింపఁబడును గావున అప్పుడైన నీబాహ్యము కడఁబట్టుచున్నది.

ఆ. వ్యాధి నెఱుఁగలేనివైద్య మదేలరా ?
కొదవఁ దెలియలేనికోర్కు లేల ?
మనసు తెలియలేనిమర్మజ్ఞు లేటికి? వి... 2349

వ్యాధి దెలియనివైద్యమును కొదువ దెలియని కోర్కెలును మనసు నెఱుఁగలేని మర్మజ్ఞతయును నిష్ప్రయోజనకరములు.

ఆ. వ్రతము లాచరింప వట్టికష్టమె గాని
బ్రతుకుమీఁద నాశపడుట లేదు
వ్రతముచేత గురుని వెదుకంగలేరయా, వి...

వ్రతము లుపవాసములు కష్టప్రదములు మాత్రమేయగును; గాని కార్యసాఫల్యము నొందింపఁజాలవు. వ్రతములుచేయువారు బ్రదుకు నాశింపరు. గురునివెదకి పడయలేరు గదా!

ఆ. వ్రతము లెన్నియైన వట్టిచిక్కులె కాని
యాత్మచిక్కు గావ నలవికాదు
ఆత్మచిక్కు బాపునతఁడె పో ఘనయోగి, వి...

ఎన్నివ్రతములయినను చిక్కులే గాని ఆత్మచిక్కెడలించునది యొక్కటియును లేదు. అట్టిదానిని కనుఁగొనినవాఁడే ఆత్మచిక్కును దొలంగింపఁగల యోగీశ్వరుఁడు.

ఆ. శాంతమె జనులను జయము నొందించును
శాంతమునసె గురుని జాడ దెలియు
శాంతభావమహిమఁ జర్చింప లేమయా, వి...

జనులకు శాంతము జయము నిచ్చును. గురువులగొప్పతనము శాంతము తెలియఁజేయును. ఆహా! దానిగుణములను సాంతముగా వర్ణింపతరముకాదు గదా!

ఆ. శిలను బ్రతిమఁజేసి చీఁకటిలోఁ బెట్టి
మ్రొక్కవలవ దీఁకను మూఢులార



ఉల్లమందు బ్రహ్మ ముండుటఁ దెలియుఁడీ, వి.

ఓమూర్ఖులార! ఇటుపైని రాళ్లను బొమ్మలనుచేసి మ్రొక్కకుండవలయును. హృదయములో బ్రహ్మము ఉన్నాఁడని యెఱుఁగుఁడు.

ఆ. శిలలఁ జూచి నరులు శివుఁడని భావింత్రు
శిలలు శిలలె కాని శివుఁడు కాఁడు
తనదులోనిశివుని తానేల తెలియఁడో, వి...

రాళ్లను జూచి నరుఁడు శివుఁడని భావించునే కాని శిలలు శిలలే. శివుఁడు కాఁడని యెఱుఁగఁడు. అవివేకి తనహృదయములో నున్నశివుని కానలేఁడు కదా!

ఆ. శివుఁడు బ్రహ్మ మనుచు స్మృతు లెల్లఁ బలికినఁ
బరుల నేలఁగొల్చు బ్రాహ్మణుండు
హరునిభక్తు లెల్ల నరయఁగా నరుదెకా, వి...

స్మృతు లన్నియును శివుఁడే బ్రహ్మ మని పలుకుచున్నను బ్రాహ్మణుఁడు పరులనెందులకు సేవింపవలయును. ప్రపంచములో నిజమగు శివభక్తులు చాలయరుదుగా నున్నారు.

ఆ. శిష్యవర్గమునకు శివుఁ జూపనేఱక
కాని మతములోనఁ గలుపునట్టి
గురుని నరసి చూడ గ్రుడ్డెద్దుచేనురా, వి...

తన్నాశ్రయించిన మోక్షార్థులగు శిష్యులకు నీశ్వరుని జూపలేక పోగా కానిమతములు గలుపుచు చెడుబోధగలుపు గురువు

గురువు కాఁడు. వానిబోధ గ్రుడ్డియెద్దు చేనులోఁ బడినటు లుండును.

క. శీలము గలసుందరి తన
యాలైనను స్వర్గమేల నైహికసుఖమే
శీలము లేనిది చూడఁగఁ
గాలునిపటుదూత యగును గదరా వేమా!

గుణవంతురాలగు స్త్రీ భార్యయైనయెడల సంసారము స్వర్గమువలె సౌఖ్యదాయకమై యుండును. భార్యగుణవంతురాలు కానిచో నది యమదూతవలె మగని ప్రాణములు దీయును.

ఆ. శూద్రతనము వోయె శూద్రుఁడ గానని
ద్విజుఁ డనుకొను టెల్ల తెలివిలేమి
ఇత్తడెసఁగు పసిఁడి కీడనవచ్చునా? వి....2358

శూద్రత్వము పోయినది. బ్రాహ్మణుఁడ నైతి ననుకొన్నంత మాత్రాన విప్రుఁడు బ్రాహ్మణుఁడు కాఁజాలఁడు. ఇత్తడి ఎత్తుకెత్తి నను పసిఁడికి సమానమని చెప్పరాదుగదా!

ఆ. శూద్రయువతికొడుకు శుద్ధాంతరంగుఁడై
వేదవేద్యమైనపాదు తెలిసి
బ్రహ్మపదవి గన్నఁ బ్రాహ్మణుఁడే కదా! వి...

శూద్రుఁడైనను గురూపదేశమునొంది వేదములకందని బ్రహ్మస్వరూపమును దెలిసికొనఁగలిగెనేని అతఁడే బ్రహ్మస్వరూపము నెఱింగిన బ్రాహ్మణోత్తముఁడు. సామాన్యులు బ్రాహ్మణులే కారు.



ఆ. శూద్రు లనుచు భువిని శూద్రుల బోనాడు
మాలకన్న దుడుకు మహిని లేఁడు
నరకమునకు నేఁగు నష్టమైన వెనుక, వి...2360

శూద్రులు జాతిహీనులని చులుకనజేసి పలుకువాఁడు మాలవాఁడు. ఆమాలవానికంటె దుడుకు వేరొకఁడు లేఁడు. అతఁడు చచ్చి పిదప జాతిదూషణవశమునఁ దప్పక నరకమునఁ బడిపోవును.

ఆ. సకలజాతిపురుషసాంకర్యమునకును
సతుల నిచ్చి తాము సమ్మతింత్రె
ఉంకునె కనలేని యోగులు బాపలా, వి...

తమకులకాంతలు చెడిపెలై సకలపురుషులతోఁ గొన్నియెడల మెలఁగుచుండ బాపలుచూచి యూరకుకొనుచున్నారు. తమ లోపము తాము గ్రహింపలేని జోగులు బాపలెటులగుదురో తెలియకున్నది.

క. సకలము నాఁకలికొఱకే
నికరంబుగఁ బెట్టె మనకు నీచపుగుణముల్
సకలంబందు వసించెడి
యకలంకుఁడె యేమి వింతొ యరయర వేమా!

మనము చేయు మంచిచెడుగులన్నియు ఆఁకలికొఱకె; పొట్టబోసికొనుటకె భగవంతుఁడు సమస్తములగు నీచగుణములు కల్పించుచున్నాఁడు. ఈపనులు చేయించువాఁడు సర్వనియంత యగు భగవంతుఁడు. ఎంతవింత !

ఆ. సకలరూప మాత్మసాక్షిలో నెంచుట
నికరమైనబయలు నిర్ణయంబు
వికల మింతలేక వెలుఁగును తత్త్వంబు, వి...

సమస్తజగత్స్వరూపమును ఆత్మలో నెంచుచు చిత్స్వరూపమును వైకల్యము నొందక గాంచుటయే తత్త్వమగును.

ఆ. సకలవిద్య లెఱిఁగి చచ్చి బ్రదుకువిద్య
యొకటినేర మనుచు నుర్విజనులు
కటకటంబడుదురె కడపటిని దెలియరు, వి...

అన్నివిద్యలను తెలిసికొంటిమి. చచ్చినవాని బ్రతికించువిద్య నెఱుంగలేకపోతిమి గదా! యని మనుజులు చివరకు చింత నొందెదరు. తాము చనిపోవుటమాత్ర మెఱుఁగరు.

ఆ. సకలశాస్త్రములను జదివియు వ్రాసియుఁ
దెలియఁగలరు చావుఁ దెలియలేరు
చావుఁ దెలియలేనిచదువు లవేలరా? వి...

జనులు సమస్తశాస్త్రములను చదువుకొన్నను తమచావును తాము తెలిసికొనఁజాలరు. చావు దెలియలేనియాచదువులు వ్యర్థములు. నిష్ఫలములు.

ఆ. సకలశాస్త్రములను సంపుటంబులు వ్రాసి
చదువ నేర్చియైనఁ జా వెఱుఁగరు
చా వెఱుఁగనిచదువు చదువంగనేలనో? వి...

శాస్త్రముల నన్నింటిని దిరుగఁదోడి క్రొత్తగా వ్రాయనేర్చినవారైనను చావెట్టిదో యెపుడు వచ్చునో యెఱుంగఁజాలకున్నారు. తమచావు తా మెఱుంగనివారి కీచదువు సందెలెందులకో?

ఆ. సతత మాత్మరూపు సాధించి శోధించి
యుతముగాను బుద్ధి నూని నొక్కి
గతిని గోరి ముక్తి గనుటయే లాభంబు, వి...

ఆత్మస్వరూపము గనుఁగొనుటకు గాటముగాఁ బ్రయత్నించి హృదయము శోధించి బుద్ధిని లోఁబఱచుకొని సద్గతి కోరి బ్రహ్మస్వరూపమును గాంచఁగలుగుటయే మోక్షము.

ఆ. సంతబసివిపొందు చలిపందిలిజలంబు
త్రోవ నమ్ముతోడు తొత్తునంటు
రచ్చసభల నిద్ర రాజులు మెత్తురా? వి...2368

గుడిసెలఁ జెత్తోఁ గవయుట, చలివేంద్ర నీరుద్రావుట, త్రోవనుబోవువాని నమ్ముట, దాసితోఁ గలయుట, కొలువుకూటములో నిదురించుట యనునివి నీచములు. రాజనింద్యములు.

ఆ. సత్య మనఁగ వేఱె జగమున గనలేదు
నిత్య మగుచు నాత్మ నెగడియుండు
నిత్యవస్తు వెఱుఁగ నీవెపో బ్రహ్మంబు, వి...

సత్యమనునది వేఱుచోటలేదు. హృదయమునందె యిమిడియున్నది. నిత్యమగు సత్యరూప మెఱుఁగుటయే బ్రహ్మస్వరూప మెఱుంగుట.

ఆ. సత్యవంతులయెడ సరసమాడఁగరాదు
పేదవారితోడఁ బెనఁగరాదు
కలిమిగలుగువారి గలియనేరాదయా, వి...

సత్యవంతులతో సరసము లాడరాదు. పేదవారితో బెనఁగ రాదు. కలిమి గలుగువారితోఁ గలియరాదు.

ఆ. సతికి బతికి నైన సంపదే సంపద
పుత్రసంపదయును భువిని మేలు
సరగ ముదిసి బ్రదుకు సంపదే సంపద, వి...

సతీపతు లానందముతోఁ బరస్పర మనుభవించు భాగ్యమే భాగ్యము. పుత్రసంపదయే సంపద. ముదిమిలో నైశ్వర్యముతో ననుకూలవతియగు పత్నితో సత్పుత్రులతో లేమిలేక బ్రతుకు వాని సంపదయే సంపద.

ఆ. సతి యొనర్చుచెడుగు పతి కవశ్యము వచ్చు
పతి యొనర్చుమంచి సతికి సగము
పతి యొనర్చుచెడుగు సతి కేలరాదురా? వి.

భార్యచేసిన చెడుగులో సగపాలు భర్తకు తప్పక వచ్చితీరును. భర్తయొనర్చు మంచిలో సగము భార్యకు సంక్రమించును. భర్తజేయుచెడుగు భార్య కేలరాదో యని నా కాశ్చర్యమగుచున్నది.

ఆ. సతులమాయనమ్మి సౌఖ్యంబు గలదని
మతివిహీనులైరి మనుజులెల్ల
గతులు సతులవలనఁ గానంగ లేరయా, వి...

స్త్రీలమాయను నమ్మి సౌఖ్యము గలదని మనుజులు మూర్ఖులై చెడిపోయిరి. సతులను నమ్మికొనినచో స్వర్గాదిగతులు కలుగవని యది వేఱ తెలియంగలేకున్నారు.



ఆ. సంద్రమునకుఁ జూడ సరి యేదియును లేదు
అట్టిజలధినీర మనువు గాదు
అనువుగానినీరె యది యేమి చేయును? వి...

సముద్రమునందలి నీరపారము. అంతనీరెచటను లేదు. కాని యందలినీరు త్రావుట కుపయోగింపదు కాన నా నీరంతయు వ్యర్థము. అటులె లోభిసంపదయు సర్వజనభోగ్యముగామి వ్యర్థము.

ఆ. సభాసనందు వేశ్య సైగలు కనుపింప
ముదితమీఁద నాశ ముడివడంగ
మదిని భ్రమయకెపుడు మార్కొనిచూడరా, వి.

ఒకానొకతఱి సభలలో వేశ్య లాడుచుందురు. వేశ్యలు అభినయముపట్టుచు సైగలు గావింతురు. అపుడు నీ కావేశ్యపై ఆశ కలుగవచ్చును. నీవు భ్రమనొందక వేశ్యలకృత్యములు కృత్రిమములని మాత్రము తలంచి వారికి లోఁబడక యెదిరింపుము.

ఆ. సతిని జూచి చూచి సౌఖ్యంబుఁ గోరును
గతిని గానలేఁడు కర్మజీవి
గతులు సతులవలన గానంగ లేరయా, వి...

కర్మబద్ధుఁడగు మానవుఁడు పరస్త్రీని గాంచినంతనే వలచి దానిని గవయఁ బ్రయత్నించునేగాని రాఁగలగతులను విచారింపఁడు. సతులవలన గతులకుఁ దొలంగవలసివచ్చునని వారెఱుంగరు.

ఆ. సాటి చెప్పనగునె సాధుసజ్జనునకు
గొప్పచదువుఁ జదివి యొప్పు ననుచు
వాదులాడునతని వదరుట లేలరా? వి... 2377

సాధువులగు నుత్తములకుఁ దఱచి తఱచి చెప్పుట కష్టము. వారు గొప్పగొప్పవిద్యలు నేర్చియుఁ దగుదుమని యెదటివారితో వివాదము లాడుచుందురు. ఈ వదరుబోతుతనమువలనఁ బ్రయోజనముకలదా?

ఆ. సాటి చేయవచ్చుఁ జదివి వాదములాడ్రు
చదువరులను జెట్టి సముదయమును
పోరి పోరి గెల్చునోరునోవనివాఁడు, వి....

"శాస్త్రములను జదివి వాదులాడువారిని జెట్టీలను సమానులుగ పోల్చవచ్చును. పండితులు వాదులాడునపుడు ఎంతపోరినను నోరునొచ్చనివాఁడే గెలుపు నొందినవాఁడు.

ఆ. సాటి యెవరు లేరు సాంబమూర్తికిఁ బోల్ప
దీటులేని గొప్పదేవుఁ డతఁడె
ధాటి కలుగు నతని ధ్యానించువానికి, వి....

ఈశ్వరుని పోల్చిచూపుట కెవ్వరును అతనిసాటిదైవములు లేరు. కావున నతనిని అనన్యచిత్తముతో ధ్యానించినవారికి గొప్పతనము చేకూరును.

ఆ. సాధనంబు లేక సమకూడ దేదియు
బోధలేనివిద్య పొంద దెపుడు
పాదుకొల్పి మదిని భావించి చూడరా, వి....



అభ్యాసము లేక యేదియైనను నలవడ గానేరదు. గురుబోధ లేనిదే విద్యయుఁ బట్టుపడదు. కావున దేవుని మదిలో పాదుకొల్పి నిరంతరమును ధ్యానించి కనుఁగొనుచుండుము.

ఆ. సాధుజనుల చెలిమి చాలింపఁగారాదు
ప్రకృతి విడక యున్నఁ బరము లేదు
పిందె గోసి చూడ బీజంబు గలుగునా? వి...

సాధువులగువారి చెలిమిని మానరాదు. ఐహికముల జంజాటము మానుకొనకున్న మోక్షముకలుగదు. పిందెనుగోసినచో బీజములు (విత్తులు) లభింపవు. అటులె ప్రకృతిబంధములు విడిపోవకున్నచో మోక్షము రాదు.

ఆ. సాధుజనులఁ బట్టి సంతాప మొందింప
కులవినాశమందు క్రూరజనుఁడు
సాధుజనులపూజ సాయుజ్య మిచ్చురా, వి...

సజ్జనుల సంతాపింపఁ జేసిన క్రూరునికులము నశించును. వారిని పూజించినచో నీశ్వరసాయుజ్యము లభించును.

ఆ. సారము గలయుక్తి సమముగా మది నిల్పి
నిత్యమైనముక్తి నెల వెఱింగి
భక్తియుక్తి మీఱి బయలంది యుండుము, వి.

సారముగలది యగు యోగవిద్య నభ్యసించి ముక్తియందు హృదయమును మగ్నముగావించి భక్తియోగమును సాధనము గావించుకొని యీశ్వరరూపమును దర్శించి కృతార్థుఁడవు కమ్ము.

ఆ. సిద్ధులైనవారిచిత్తము రంజిల్లు
నొడలిమెఱుఁగు లెక్క కిడరు గాన
పనసపండుఘనత పై నేమి కలదురా? వి...

సిద్ధులచిత్తము నిత్యము సంతోషవంతమై యుండును. వారు పైమెఱుంగులఁగాంచి లేనిపోనిమమకారములు పెట్టుకొనరు. పనసపండు బైటికెటులున్నను లోన మిక్కిలిబాగుగా నుండును. పైమెఱుంగులన్నచో బయట సొంపు. లోన కంపు.

ఆ. సుగుణవంతురాలు సుదతియై యుండిన
బుద్ధిమంతు లగుచుఁ బుత్రు లొప్ప
స్వర్గమేటి కయ్యె సంసారి కింకను, వి... 2385

మంచిగుణములు గలభార్యయు, బుద్ధిమంతులగు కుమారులు గలిగి యున్నవానికి వేఱుస్వర్గలోక మక్కఱ లేకయే సంసారమే స్వర్గమగును.

ఆ. సుతులుసతులు మాయ సుఖదుఃఖములు మాయ
సంస్మృతియును మాయ జాలి మాయ
మాయ బ్రతుకున కనె మాయ గల్పించెరా, వి.

కొడుకులు భార్యలు సుఖదుఃఖములు మున్నగునవి యన్నియును నస్థిరములే. ఆహా! ఈయస్థిరమగు బ్రదుకున కెన్ని యస్థిరములను నిర్మించినవాఁడు.

ఆ. సురలు మౌను లెపుడు సరవి వర్తింతురు
ధర్మమార్గ మొకటి తారకముగ
అట్లుకానివార లసురులై చచ్చిరి, వి.... 2387



మునీశ్వరులు దేవతలు ఎల్లప్పుడును ధర్మమార్గముననే చరింతురు. ఆధర్మముఁ దప్పినవారలు అసురులై జనించి చచ్చిరి కదా! కాన ధర్మమే యనుసరణీయము.

ఆ. సూక్ష్మ మరయ నీకు సుఖతత్త్వభావంబు
పుట్టు చావు లేనిపురపుదారి
మానసంబు నంటి మఱవక చూడరా, వి...

సూక్ష్మబుద్ధియే నీకు సుఖతత్వభావము అదియే. చావు పుట్టుకలు లేనియోగము. కావున మనస్సులో దాని ననుసంధించి మఱచి పోకయుండుము.

ఆ. అడుగ కర్థ మిచ్చునతఁడు బ్రహ్మజ్ఞాని
అడుగ నర్థ మిచ్చు నతఁడు త్యాగి
అడుగ నీయలేనియాతఁడు పెనులోభి, వి...

అడుగకయే ధనమిచ్చువాఁడు బ్రహ్మజ్ఞాని. అడిగిన నిచ్చువాఁడు త్యాగి. అడిగినను నీయనివాఁడు లోభి.

క. అడుగఁ దగువారి నడుగుట
యిడినయెడం గొసరకుంట యీలే నసఁగాఁ
గడుసై వేడకయుండుట
యడిగెడివారలకు నీతి యగురా వేమా! 2390

అడుగఁదగినవారిని మాత్రమే యాచించుటయు, ఇచ్చినచో దాతను గొసరకుండుటయు, ఈయనివానిని ప్రార్థింపకుండుటయు యాచకు లెఱుంగఁ దగిననీతి.

ఆ. అరుదుగా నడిగినయతఁ డర్థి గాఁబోఁడు
తఱుచుగా నొసఁగక దాత గాఁడు
దాత కర్థి కింత తారతమ్యము సుమా! వి...

ఎప్పుడో అడిగినంతమాత్రాన జనుఁడు అర్థిగాఁడు. ఎప్పుడును ఇచ్చినగాని దాతకాఁడు. దాతకు అర్థికి నంతటిభేదమున్నది.

ఆ. అల్పుఁడైనవాని కధికభాగ్యము గల్గ
దొడ్డవారి దిట్టి తొలఁగఁద్రోలు
అల్పజాతివారు అధికుల నెఱుఁగునా? వి...

అల్పుఁడు ఎక్కువసంపదనొందెనేని గర్వించి గొప్పవారి తిట్టుటకుఁ బూర్వస్థితినుండి దొలంగించుటకు యత్నించును. నీలు ఉత్తముల నెఱుంగఁజాలరుగదా!

ఆ. ఇచ్చి నొచ్చువేల నిల భాగభోగ్యముల్
వచ్చిపోవుచుండు వాంఛదీఱ
చచ్చినట్లు నరుఁడు శత్రుఁడై సాధించు, వి...

యాచకులకుఁ గొంచెమో గొప్పయో యిచ్చి పిదప విచారపడరాదు. సంపదలు వచ్చుచుఁ బోవుచుండును. మనుజుఁడు శత్రువు సాధించినట్లు సంపదల సాధింపఁగలఁడు.

క. ఇచ్చెడివారలసంపద
హెచ్చెడినే గాని లేమి యెట్లు కలుగురా?
నిచ్చలమనీటిఁ జల్లిన
విచ్చలవిడి నూరుచుండు వినరా వేమా! 2394



ఇచ్చెడివారిసంపద హెచ్చునే గాని తగ్గదు. చెలమనీళ్లుచల్లుకొలఁదిని ఊరుచునే యుండునుగాని తగ్గదు.

ఆ. ఇచ్చువానియొద్ద నియనివాఁడుండిన
చచ్చుఁ గాని యీవి సాగనీఁడు
కల్పతరువుక్రింద గ్రచ్చచెట్టున్నట్లు, వి... 2395

దాతయొద్ద లోభివాఁడున్నయెడల ప్రాణమైన దీసికొనునుగాని దాతను గాసైన నీయనీఁడు. కల్పతరువును గచ్చచెట్టు ఆవరించినటులు లోభి దాత నావరించియుండును.

ఆ. ఇంచుకంత బోన మీశ్వరార్పణ మన్న
పుణ్యలోకములకుఁ బోవు నరుఁడు
అన్నదానముకన్న నధికదానము లేదు, వి...

తన కున్నంతతోఁ గొంతయీశ్వరార్పణమని యతిథులకుఁ బెట్టినంత మాత్రనజనులు పుణ్యలోకముల కేగుచున్నారు. కావున నన్నదానమును మించిన యోగ్యమగుదాన మింకొకటి లేదు.

క. డంబములు పలుకువాని ని
జంబుగ దా నమ్మునట్టి జనుఁ డరయఁగ జ్ఞా
నం బిసుమంతయు లేని మృ
గం బని యెంచుటకు నడ్డు లేదుర వేమా! 2397

మాటిమాటికి బడాయిలు పలుకుచున్నవానిమాటలు సత్యములని నమ్మువాఁడు జ్ఞానము లేనిమృగమని యెంచుటలో సాహసముగాని సందేహముగాని లేదు.

ఆ. తండ్రిసొమ్మదైన దాయాదిసొమ్మైన
పరులసొమ్ము లైనఁ బ్రాప్తధనము
దయను దీనులకును దానము నిచ్చును, వి...

సొమ్ము ఎవ్వరిదైనను తనచేతఁ బడినవెంటనే బీదలకు దానము చేయఁ బ్రయత్నించువాఁడె నిజమగుదాత.

ఆ. తనదుదాన మరయఁ దనబిడ్డ సమమగుఁ
దండ్రిదాన మెల్ల తనకు తోడు
అన్యు లిచ్చుదాన మది తల్లివంటిది, వి... 2399

తాను చేసిన దానము తనకుఁ గొమారునివలె నాపత్కాలమునఁ దోడగును. తనతండ్రి చేసిన దానము తోఁబుట్టువువలె సాయపడును. రక్తసంబంధులగు తనబంధువులు చేసినదానము తన్ను కన్నతల్లివలెఁ గాపాడును.

ఆ. తనదుకర్మ చేతఁ దాను లోకములోనఁ
దనదుతల్లిగర్భమున నె పుట్టె
తన్ను మఱచి యింకఁ దగనివి చేయునా? వి...

తాను పూర్వము చేసికొనినకర్మలవలన తల్లిగర్భమున మానవుఁడు కర్మవశమున మాతృగర్భమున మరలమరల జన్మము నొందుచున్నాఁడు. తనజన్మావృత్తి మనుజుఁ డెఱింగి యింక నీ జన్మము లెత్తుట చాలుననుకొని కర్మమునుండి తొలంగవలెను.

ఆ. తనదుబాగు గోరి ధర్మంబుఁ జెప్పిన
దిట్టమనుఁడు సభమునఁ డెట్ట యెదుట
గడ్డివేయఁ బోట్లగొడ్డు కొమ్మాడించు, వి...



గడ్డివేయఁబోగా పోట్లగొడ్డు కొమ్ములాడించునటుల నీచుఁడు తనమేలుకుగోరి చెప్పినను ఎదటివాని దూషించుటకు మొదలుపెట్టుచుండును.

ఆ. తల్లిగర్భమందుఁ దాఁ బుట్టినప్పుడు
నలుతలింగమున్నె యరయుమయ్య
నడుమ లింగమూన నగుఁబాటు గాదొకో, వి.

మాతృగర్భమునుండి బయలుదేరునపుడు మానవున కెవనికి కంఠమున లింగములేదు. మధ్య లింగమును గట్టుకొనుట నవ్వులబాటుగాక వేఱుగాదు.

ఆ. తల్లిదండ్రు లాత్మసఖులు నన్నలు దమ్ము
లెలమి బంధుభృత్యు లెల్ల జనులు
గలిగి వర్ధిలంగ ఘనతతో నుండుము, వి...

తల్లిదండ్రులు చెలికాండ్రు అన్నదమ్ములు చుట్టములు బంట్లు మొదలగు జనులతోఁ గలసి మెలసి యుండుట మంచిది, అట్లు ఏకభావముతోనుండి ఘనత సంపాదింపఁ బ్రయత్నము చేయవలయును.

ఆ. తాత గన్నతల్లి తండ్రిని గనుతల్లి
తన్ను గన్నతల్లి తల్లితల్లి
తల్లి శూద్రురాలు తా నెట్లు బాపఁడు? వి...

తాత తల్లి మున్నగువా రందఱును శూద్రులైయుండఁగా తాను మాత్ర మెక్కఁడెట్లు బ్రాహ్మణుఁ డగును?

ఆ. తాను తను వటంచు తప్పుడుఁ బలికిన
మోహవార్ధిలోన మునుఁగకున్నె
కాన తా ననునది గానంగ లేఁడయా, వి...

జీవుఁడు దేహము నొకటియే యని తలంచునవివేకి సంసార సముద్రమునఁబడి తప్పక వినాశన మొందును. అట్టివాఁడు ఆత్మస్వరూపము నెన్నఁటికిని గనుఁగొని తరింపఁజాలఁ డనుట సత్యము.

ఆ. తాము గడన సేయు ధన మెల్ల దమదని
నమ్మి యుండ్రు వెఱ్ఱినరులు భువిని
తా మొరుల కొసంగఁ దమకును నది కల్గు, వి.

తాము సంపాదించిన ధన మంతయును తమదే యని నమ్మెదరే గాని వెఱ్ఱిజనులు తా మితరులకు దానము గావించుట వలననే తమకు లభించెనని కొంచెమేని యెఱుంగకున్నారు.

ఆ. తా మొరులకుఁ బెట్టఁ దమకును గలుగును
నడుగ నిడినఁ దాము నడుగఁగలరు
ఇందు నీనివాని కెందును గలుగదు, వి...2407

తాను ఉన్నంతలో నితరులచే నడిగించుకొనక పెట్టిన యెడలఁ దనకు మరల దైవ మొసంగును. అడిగించుకొని పెట్టిన యెడల నితరుల యాచించి జీవింప వలసిన యవస్థ పట్టును. ఈలోకమున దానము చేయనివాని కే లోకమునను ఏమియు లభింపదు.



ఆ. తీర్ప నార్పలేని తీర్పరితనమును
కూర్ప విప్పలేని నేర్పుపనులు
పెట్టిపోయలేని బీరముల్ వ్యర్థముల్, వి...

ఎదటివారి తగవుదీర్చి న్యాయము చెప్పఁజాలనివాని న్యాయాధిపతిత్వము ఒక యోచనచెప్పి యెదటివాని యోచన గ్రహింపఁ జాలనివాని నేర్పరితనము పెట్టిపోయి లేనివాని డంబములు పనికిమాలినవి.

ఆ. దాతగానివాని తఱుచుగా వేఁడిన
వాఁడు దాత యగునె వసుధ నెందు
నవురు దర్భయగునె యబ్ధిని ముంచిన, వి...

దాత కానివాని నెన్నివిధముల వేఁడినను దాత గాఁజాలఁడు. నవురుగడ్డి సముద్రములో ముంచినంతనే దర్భలు కాదు గదా! అట్లులనే లోభియు దాత కానేరఁడు.

ఆ. దాన మడుగువాఁడు ధరలోన నధముండు
దాన మడుగనతఁడు దైవసముఁడు
దాన మీనివాఁడు ధన్యుఁడు గాఁడయా, వి....

ఎదటివానిని దేహియని చేయిజాచి యడుగువాఁడు నీచుఁడు. ఎవ్వనినేని యాచింపక జీవించువాఁడు దేవునితో సమానుఁడు. ఇతరులకు దానము చేయనివాఁ డెన్నఁటికిఁ గడతేఱలేఁడు.

ఆ. దానములను జేసి దరిఁ జేరు నొకవంక
మనసు నొకటి నమ్మ మాయఁ దగులు
జ్ఞాన మెపుడు నమ్మఁ గడతేర్పు కడగండ్ల, వి...

తన కున్నంతలో విరివిగా దానము చేసినవాఁడు ఒక విధముగాఁ గృతార్థుఁ డగును. మనస్సును నమ్మి యోగాదుల నేర్చి నచో మాయాదికములు నశించును. జ్ఞానమును నమ్ముకొనిన యెడల సర్వానర్థములు తొలంగిపోవును.

ఆ. దానములను జేసి ధరఁ గీర్తినొందంగ
బహుధనముల నొసఁగి భక్తిలేక
తుదకు నరుఁడు చెడును గద కడగండ్లరా, వి.

కొందఱు మూర్ఖులు దాతయను పేరొందఁ దలంచి చేత నున్న ధనమంతయు నితరుల కొసంగుదురు. పిదప కుటుంబ పోషణమునకు ఇతర వ్యయములకుఁ జేత నేమియు లేక నానా వస్థలపడుదురు.

ఆ. దానములను నన్నదానమె దొడ్డది
గానములను సామగాన మెచ్చు
ధ్యానములను శివుని ధ్యానమే శ్రేష్ఠంబు, వి.

దానములలో నెల్ల నన్నదానమె గొప్పది. ధ్యానములలో శివుని ధ్యానమే యుత్తమ మైనది. గానము లన్నిటిలో సామ గానమే శ్రేష్ఠమైనది.

ఆ. ధనము చాల గూర్చి తనుదానధర్మముల్
ఒనరుపకయ యిచ్చు తనయులకును
తేనె గూర్చి యీఁగ తెరువరులకు నీదె? వి.

లుబ్ధుఁడు ధనమును విస్తారముగా కూడఁబెట్టి దానధర్మములను చేయకయే తన కుమారుల కిచ్చును. తేనెటీగ తేనెగూర్చి తెరువరుల కిచ్చుటయు నిదియు సమము.



ఆ. ధనము లేమి యనెడిదావానలం బది
తన్నుఁ జెఱుచు మీఱి దాపు చెఱచు
ధనము లేమి మదిని దలఁచినపాపము, వి...

దరిద్రమను కాఱుచిచ్చు తనను తన తావునుగూడఁ గాల్చి వేయును. దరిద్రమును దలంచు కొన్నంత మాత్రమునఁ బాపము గూడవచ్చును.

ఆ. ధనము గూడఁ బెట్టి ధర్మంబు సేయక
యూరకుండ్రు పాపు లూహ లేక
ధనము వెంటరాదు ధర్మంబు సేయుఁడీ, వి...

ధనము కూడఁబెట్టి పాపాత్ములు ధర్మము చేయక యూరకుందురు. మీరట్టులు చేయక ధర్మమును చేయుఁడు. ధనము వెంట రాదు. ధర్మము వెంటవచ్చి సర్వవిధముల తోడ్పడును.

ఆ. ధర్మకంటకుండు ధనముచే గర్వించి
సకలసంపదలను సరగఁ గనియు
కడకు తాను మేలు గానక చెడిపోవు, వి...

ధర్మము వలనఁ గంటకించు దుర్మార్గుఁడు ధనగర్వమున నిట్టి పీఁగుచుఁ దన సంపదలకుఁ దానె మురియుచుఁ గట్టకడకు దన మేలునేని తాను పొందక చెడిపోవుచున్నాఁడు.

ఆ. ధర్మమన్న వినరు తనువు నమ్మిన నరుల్
యముని వారు వచ్చి యడలఁ జేసి

చొచ్చి కట్టఁ దరుముచోఁ బాఱఁగలరొకో, వి.

ధర్మము చేసినచో ఇహపరములలోఁ దరింప వచ్చునని యెన్ని విధములఁ జెప్పినను లోభులు తెలిసికొనఁ జాలకున్నారు. యమకింకరులు వచ్చి నానావస్థలఁ బెట్టుచున్నపు డెటులఁ దప్పించుకొందురో ఈలోభు లపు డెచటికిఁ బాఱిపోదురో?

క. ధనలక్ష్మిని సేవించిన
ధన మార్జింపంగ వచ్చు ధర్మముగానే
ధనహీనులకు నొసంగెడు
ధనమే మూలంబు ముక్తి దారికి వేమా! 2419

ఎల్లపుడు భక్తి శ్రద్ధలతో ధనలక్ష్మిని సేవించిన యెడల ద్రవ్యము విశేషముగా సంపాదింప వచ్చును. సంపాదించిన ద్రవ్యము ధర్మార్థముగా విరివిగా ధనహీనుల కొసంగిన యెడల నాదాత ముక్తి నొందఁ గలఁడు.

తే. ధర్మపరుఁడైన పరిపూర్ణదాత గురుఁడు
దాన మొనరించునంతటఁ దత్వ మమరు
దాను దానగు మననంబు దాఁకఁగ నగు
దాన సార్థక్య మపుడటు తనరు వేమ! 2420

ధర్మపరుఁడై దాతయైనవానికి తత్త్వము తప్పక సిద్ధించును. తత్త్వము సిద్ధించినచో ఆత్మ సందర్శనము గావించు నేర్పు అలవడును. దానితో జన్మము సార్థకమై సిద్ధ సంకల్పుఁ డగును.



ఆ. ధర్మ మరసి పూని ధర్మరాజాదులు
నిర్మలంపు ప్రౌఢి నిల్పికొనిరి
ధర్మమే నృపులకు తారకయోగంబు, వి...

తత్త్వవేత్త లగుటవలన ధర్మరాజు మొదలగు పూర్వ రాజన్యులు ఇహలోకమునఁ బరలోకమునఁ గడతేరిరి. రాజులకుధర్మము తొలంగక యుండుట తారక యోగమువలె శుభప్రదము.

ఆ. నమొనమొ యనవచ్చు నారాయణనవచ్చు
మేలువారిఁ జూచి మెచ్చవచ్చు
కొంగుకాసు నడుగ గొబ్బున నీలేరు, వి...

'నమోనమోనారాయణా' యనవచ్చును; గొప్పవారినిచూచి మెచ్చుకొనవచ్చును గాని కొంగుకాసు నడిగినచో నీవాగాడంబరులుమాత్ర మీయరు. ఈ డంబములు లోభుల కెందులకో?

---

## స్వభావపద్ధతి.

---

అవతారిక. మానవుఁడు తోలుత సజాతీయులగు జనులహృదయములు భావములు పరిణామములు గుర్తించినఁగాని ప్రపంచ వ్యవహారములు నిర్వర్తించుకొనఁజాలఁ డనియు, ఇందులకు సాధారణధర్మములు, నీతి, నియమములు ప్రతిమానవుఁ డెఱుంగవలయుననియు నీతిలేనిమానవుఁడు, మానవతత్త్వపరిజ్ఞానము లేనిజనుఁడు పరమార్థవిచారణమునకు ఈశ్వరకైంకర్యమునకు అక్కఱకురాఁడనియు స్వభావజ్ఞానము నీతిగ్రహణము ఆవశ్యక

మనియుఁ దలంచి వేమనమహాయోగి ప్రపంచోద్ధరణార్థమై నీతులను మానవస్వభావముల నీక్రిందివిధముగా లోకమున కెఱింగించుచున్నాఁడు.—

ఆ. ఆఁడుదానిబొంకు గోడపెట్టినయట్లు
పురుషవరునిబొంకు పూరితడుక
స్త్రీలనేర్పు మగలఁ జీకాకుపఱచురా, వి...

ఆఁడుదాని బొంకు గోడవలె దృఢముగా నుండును. మగవాఁడు బొంకినచో తడికవలె నతుకులు బొతుకులుగా నుండును. స్త్రీల నేర్పులే మగవారల ననేక విధములుగాఁ జిక్కులపాలు చేయుచున్నవి.

క. ఆలనఁగలసౌఖ్యములకు
నాలయ మగునేని దాని నాలనవచ్చు
న్నాలాగునఁ గాకుండినఁ
గాలుని పెనుదూత యదియె కదరా వేమా!

మగని సౌఖ్యములకు నిలయమగు సాధ్వియే నిక్కమగు భార్య; దానినే భార్యయని ప్రశంసింపవలయును. మగని కష్టములలోఁ బాలుగొనక నానావస్థలఁ గలిగించుదాని యమదూతయనినను దోషము లేదు.

క. ఆ లనఁగా నాత్మసుమీ
యా లనఁగా నమ్మసుమ్మి యరయఁగ మదిలో
నా లమ్మ యనఁగ నెవ్వరొ
వాలాయము దీని దెలియవలయును వేమా!



భార్య ఆత్మవంటిది. అంతియేగాక తల్లి గూడ నైయున్నది. తానే భార్యయందుఁ గొడుకై జనించుగాన భార్య తల్లితో సమానమను ధర్మమును ప్రతిమానవుఁడు తెలిసికొనవలయును.

ఆ. ఆలిఁ దోలి వెంట నధముఁడై తా వెంట
నేల పోవుటెల్ల నెడ్డెతనము
చెట్టు ముదర నిచ్చి చిదిమినఁ బోవునా? వి·

స్వేచ్ఛయిచ్చి భార్యను ముందుచెరిపి దానివెంటనే తానును చెడి పోయెడివాఁడు పరమమూర్ఖుఁడు. చెట్టు ముదిరిన పిమ్మట సాధ్యము గానట్లు చనవు బలమైనపిదప భార్య లోఁబడదు.

ఆ. ఇంతిచనులబిరుసు కొంతకాలమె గాని
పంతగించి చూడ పాలతిత్తి
చెంత విడక యేడ్చి చీరఁడా పుత్త్రుఁడు, వి...

స్త్రీల స్తనముల కాఠిన్యము ఎల్లకాలము నుండునది కాదు. అవి పాలతిత్తులు. కొడుకు పాలకై యేడ్చి వానియందలి సారము గట్టితనము గుంజివేయుచున్నాఁడు.

ఆ. ఇంతి తనదుపేరె యెల్లకాలంబును
ప్రజలు దలఁచునట్లు ప్రతిభ గాంచె
నింతికి పతిభక్తి యెంతనవచ్చును? వి... 2428

ఆఁడుది తనపేరే శాశ్వతముగా నిలుచునట్లు సంతానరూపమున నెలకొనుచున్నది. స్త్రీ యట్లు ప్రతిభ గాంచుటకుఁ గారణము ఆమెకుఁ గల పతిభక్తియే సుమా!

ఆ. ఇహపరంబులందు నింతులపై నాస
సహజవృత్తి దగిలి సమయుచుండ్రు
రహిత మగురు భక్తి రాణింప దేలొకో, వి...

ఐహికాముష్మికములందు స్త్రీవాంఛచేత ననేకులు చెడిపోయెదరు. ఇది జనులకు సహజమైనది. విషయాదులయందు శూన్యబుద్ధి మానవుల కేల కలుగదో గదా!

ఆ. ఈఁత వచ్చినపుడు లోఁ తనిపించునా
ప్రాతదోషి కెపుడు భయము లేదు
క్రోఁతి కొమ్మ కెక్కి కుప్పించి దూకదా, వి...

కోఁతికిఁ జెట్టుమీఁదినుండి దుముకుట యెటులసులభమో అటులే ఈఁతగానికి నెంత లోఁతుగల నీటిని దాఁటుటకైనను తేలిక. ప్రాఁతనేరగానికిఁ గూడ నటులే యెంత తప్పునినను భయము లేదు.

ఆ. ఎట్టిజీవికైన నిల కాంత భ్రాంతియే
తెలియరయ్య యెపుడు తేటగాను
మనసుశుద్ధి గన్న మఱియొక్కటగునయా, వి.

ఎటువంటివానికైన స్త్రీల వలపేయుండును; గాని వారిపై విరక్తికలుగదుకదా! మనశ్శుద్ధిగలవారి కీవ్యామోహమే యుండదు.

ఆ. ఎట్టిస్త్రీలఁ గనిన నింతింత యనరాదు
కామవహ్ని లక్క గరఁగినట్టు
ఇట్టి గాఢమోహ మెంతైనఁ జేయురా, వి...



స్త్రీల సౌందర్యమును గాంచినంతమాత్రమునఁ బురుషుఁడు లక్కవలెఁ గరఁగి నీరగుచున్నాఁడు. ఇట్టిమోహము మానవుని నధోగతికిఁ ద్రోయుననుటలో నించుకేని యాశ్చర్యములేదు.

ఆ. ఒడలు శిథిలమైన నోరుపు గలసతి
గుణము మేల్మిఁ బట్టి కోటిసేయుఁ
బ్రాఁత యెనుము పాలు రోఁ తనవచ్చునా? వి.

వయసుజారి యవయవపటుత్వము తగ్గినను గుణవంతురాలగు కులసతి తనమేల్మిగొనములచే నెంతయేని విలువఁజేయును. ప్రాఁతది (ముదుసలిది) యగుకొలఁది యెనుముపాలు సారవంతములుగా మాఱుట మన మెఱుంగనిదా?

ఆ. ఔర యాఁడుదాని నాబ్రహ్మ సృష్టించె
పురుషుపాలిటి పెనుభూతమట్లు
దానివలను జిక్కగానివాఁడుండెనే, వి...2434

బ్రహ్మ ఆఁడుదానిని పురుషునిపాలిటి భూతములాగున సృష్టించెను. ఆహా! దాని వలనుపడనివాఁడును కలఁడా?

ఆ. కాకిగూఁట నాఁడుకోకిల తనగ్రుడ్లఁ
బెట్టి పెనుపఁ జేయు గుట్టెఱుఁగుఁడి
యాఁడువారిమోస మపుడైనఁ దెలియదా? వి.

కాకిగూఁటిలో నాఁడుకోకిలమఱుఁగుగా గ్రుడ్లుపెట్టిపోవుచున్నది. కాకి పొరపడి తనశిశువులని పెంచుచున్నది. ఈగుట్టు గ్రహించినయెడల స్త్రీజాతి యెంతమోసముచేయునదో తెలియును.

ఆ. కాంతమేను జూచి కలవరపడెదరు
కడుపులోని రోఁత గానలేక
ఇంతరోఁత గల్గు నీదేహ మేలరా? వి... 2436

బయటికి మాత్రము పొంకముగా మేడిపండువలెనున్న స్త్రీ యాకారమునుజూచి దానిశరీరమునఁగల రోఁతఁ బరిశీలింపక మోహించుచున్నాఁడు. ఇంత రోఁతమేనుతో సంబంధము తన కెందులకో?

ఆ. కూటికి నెడఁబాసి కూర్చున్న మనుజుఁడు
వెలఁదులఁ గనుఁగొన్న వెతలఁబడును
చెలఁగి యగ్నిజూచు శలభంబుచాడ్పున, వి...

తినుటకు తిండి లేక మాడుచున్నవారు సయితము ఆఁడువారిఁ బొడఁగనినచో మరులొంది అగ్నిలో మిడుతలవలె స్త్రీలవలలోఁబడి గతించుచున్నారు.

ఆ. కూడు చీరఁ బాసి గుళ్లపంచలఁ బడు
నట్లు వ్రాసె బ్రహ్మ యతుల నొసలు
తోయజాక్షి చేర దోసంబు లంటురా? వి...

యతీశ్వరులముఖమున బ్రహ్మదేవుఁడు కూడుగుడ్డలు మాని గుడులపంచలలోఁ బడియుండుఁడని వ్రాసెను. కావున వారు స్త్రీలను జేరుట మిగుల బాధకారణము.

ఆ. కైక పుట్టి చెఱిచెఁ గా రాముపట్టంబు
సీత పుట్టి లంక చెఱిచెగాదె
కౌరవులను జెఱిచెఁ గద ద్రౌపదియుఁ గూడ,వి.



కైకజననమువలన రాముఁడు పట్టాభిషిక్తుఁడగుట తప్పెను. సీత పుట్టుటవలన లంకారాజ్యము పాడుబడెను. ద్రౌపదివలనఁ గౌరవరాజ్యము కడతేఱెను. కాన స్త్రీవలనఁ బ్రపంచమున కెంతయరిష్టమేని గలదు.

ఆ. కొప్పుసొగసు గన్న కుచకుంభములు గన్న
చెప్పరానితావు చెలిమి గన్న
ముప్పిరి గొనుచుండు మునికైన మోహము,వి.

చెలువలకొప్పుఁ జూచినను, చనుగుండల బింకముఁజూచినను, మర్మప్రదేశపు సోయగముఁ జూచినను మునులకైనను వలపు గలుగుచుండును.

ఆ. చక్కనైనవాని మక్కువ గన్నంత
తక్కువగనుఁ జూచు తనదువిభుని
ఆఁడుబుద్ధికంటె నపరబుద్ధి యింకేది? వి.... 2441

ఆఁడుది చక్కనివానిని చూడఁగనే వానినివలచి తనపెనిమిటిని తక్కువవానిఁగాఁ బరికించును. ఆఁడుదానిబుద్ధికంటెఁ బాపపుబుద్ధి లోకములో లేదు.

ఆ. చదువులెల్లఁ జదివి సర్వజ్ఞులై యుండి
బ్రహ్మవిద్యలెల్ల పదటఁ గలిపి
పడఁతిఁ దలఁచునంత పరమయోగము మాను,వి.

సమస్తవిద్యల నభ్యసించి సర్వవిషయముల నెఱింగిన మహానుభావులు సైతము తమకుఁగల బ్రహ్మజ్ఞానమును బూడిదలోఁ గలిపి స్త్రీనిగాంచినంతనే యోగవిద్య మానుచున్నారు.

ఆ. గుణవతి గలగృహము గోము నొందించును
చీఁకటింట దివ్వె చెలఁగునట్లు
దేబె యున్నకొంప దివ్వె మల్పినయట్లు, వి...

గుణవంతురాలగు స్త్రీ యున్నయిల్లు దీపముగల యింటివలె తేజరిల్లును. అది లేనియిల్లు పాడుపాటిన చీఁకటింటివలె గహనమై తేటిచూడ వీలులేకుండును.

క. జిత్తులమాఱు లనందగు
తొత్తులతోఁ గూడ నేమి తుష్టి గలుగురా
చిత్తమున బ్రహ్మ మరయుము
సత్తత నీకప్పు డొప్పఁ జాలును వేమా! 2444

మోసకత్తెలతోఁ గూడినమాత్రాన నీకు వచ్చున దేమియును లేదు. కావున ఆసాంగత్యమునువీడి చిత్తమును బ్రహ్మమునుపాసించుటయందు వర్తింపఁజేయుము.

క. జిలిబిలిమాటలు పలికెడు
కులటల నమ్మంగ రాదు కుహనయుపగురా
తెలివితో నవమానించుచు
తొలిప్రియమును చూపకుండ తొలఁగుము వేమా

జారసతుల జిలిబిలిమాటలకు మోసపోయితివేని కొలఁది కాలమునకే అవమానించి తొల్లిటిప్రియముఁ జూపకయుందురు. కావున వాఁడుదానిని నమ్మక వారిపైఁ బ్రేమఁ బ్రకటింపక తొలుతనుండి మెలఁకువతో మెలఁగుము.



తే. జారుచనుదోయి పైకెత్తి చేర బిగియఁ
గంచుకము కట్టి కామినీకపటవేష
ధారిణులవలఁబడి నీవు తగులుకొనకు
తలఁగు మది నరకము చేర్చు దారి వేమ! 2446

స్తనములు జాఱి వయసు చెల్లినను స్త్రీలు పురుషులను వలలో వేసికొనుటకై పైకెత్తి బిగియఁగట్టికొని నటించెదరు. కావున నట్టివారివలన నీవు తగుల్కొనకుము. తగులుకొంటివా నీకు నరకమే గతియగును.

ఆ. జాలలోన నుండి స్త్రీల వీథులవంకఁ
జూడ నీయరాదు సుమ్ము వినక
చేతు రేని యట్లు చేటులు మూఁడురా, వి... 2447

గవాక్షములో నుండి స్త్రీలను తొంగితొంగి వీథులవంకఁ జూడ నిచ్చినయెడల ఎప్పుడో యొకనాఁడు వాంఛ్రకు జెడుబుద్ధి పుట్టును. దాన సంసారమునకే చేటువచ్చును.

ఆ. జగడమునకు బోదు జారిణి యెప్పుడు
మాయఁ జేసి పురుషు మమతఁ బెట్టు
కానిమాటలాడుగయ్యాళి సతతము, వి...

జారయైన స్త్రీ పెనిమిటితో తగవులాడక సాధ్యమైనంత వఱకు మాయఁజేసి మమత్వమును గల్గించును; కాని గయ్యాళి మాత్రము అట్లు కాదు. తగవునకు కాలుదువ్వును.

ఆ. జ్ఞాత యైనవాని నేతగా భావించి
నీతు లెఱుఁగవలయు నియతిగలిగి

జ్ఞాను లున్న లాభ మూను నే తెలియమి, వి...

తెలిసినవానిని దేవునిగా భావించి నీతులను నేర్చికొనవల
యును. అట్లైనచో జ్ఞానులున్నందువలనిలాభములు చేకుఱును.
లేకున్నచో జ్ఞానులవలని ప్రయోజనమే లేకపోవును.

ఆ. తేనె పంచదార తియ్యమామిడిపండు
దిన్నగాని తీపి తెలియ రాదు
కన్న నింపు పుట్టు కామిని యధరంబు, వి...

తేనె పంచదార తీయమామిడిపండులోనగు మధురవస్తువుల
చవి తినినగాని తెలియదు. చెలువల మోవియటులఁగాదు. చూచి
నంతమాత్రముననే తీపికలుగఁజేయును.

ఆ. తొడలమెఱుపుఁ జూడ దొడ్డచనులఁ జూడ
వగలు చూడ వానివన్నెఁ జూడ
నయ్యల కెపుడైన నాశలు పుట్టవా? వి...

చెలువల తొడలబింకము, బటువు చనులపొంకము, వగలు,
కులుకులు, మేనినిగ్గులు చూచినంతమాత్రమున యోగులకైనను
స్త్రీలపై వలపు కలుగుచుండును.

క. తొమ్మిదిక్రంతలతిత్తికి
నిమ్మగుసొమ్ములును కులము నేటికి చెపుమా?
నమ్మకు దేహము నాదని
నెమ్మది బ్రహ్మంబు తెలియు నేనని వేమా! 2452

నవరంధ్రములుగల యీశరీరమునకు కులుకులు సొమ్ములు మున్న



గున వేటికి? నిష్ప్రయోజనములు. కావున శరీరమును స్థిరమను
కొనక బ్రహ్మముఁ జేరుము.

ఆ. దేహభావమెల్ల తెలియంగఁ జూచిన
నఖిలహేయములకు నాలయంబు
పరసతిగమనంబు ప్రత్యక్షనాశము, వి... 2453

దేహముయొక్క రీతిని పాఱఁజూచినచో సమస్తహేయ
ములకును తానమైయుండును. పరసతులతోఁ బొందు ప్రత్యక్ష
ముగ వినాశనము గల్గించును.

క. నతిచేసి పతిని వేఁడెడు
సతి మర్మము కానవచ్చు సరసోక్తులనే
మతిపోక లడఁచిపట్టిన
సతిదుర్గతి వీడినదగు సత్యము వేమా! 2454

మాటిమాటికి విధేయతఁ బ్రకటించుచు మగనిని వేఁడు
చుండెడిమగనాలిపరిహాస చేష్టలఁ జూచి దానిహృదయమర్మమును
గనిపెట్టవచ్చును. ఇచ్చవచ్చినటులఁ జూచినవానిపైకిఁ దలం
పును బోనీయనికాంతకు దుర్గతులు కలుగవు.

క. నభమైన నందవచ్చును
ఇభమును బట్టంగ వచ్చు నిముడికగానే
వ్యభిచారిణి మది నిలుపఁగ
ప్రభువులకును సాధ్యపడదు పైకొన వేమా!

ఆకాశము నైనను అంటుకొనవచ్చును. ఏనుఁగును నిలిపి

లోబఱుపవచ్చును; కాని ఎంతటిప్రభువుల కైనను వ్యభిచరించు దాని మనస్సును నిల్పుట దుష్కరము.

ఆ. నరుని బిందువునను నాతిగర్భము దాల్చు
రాతియుప్పుచేత రసము దాల్చు
బుద్ధితెలివియున్న భువనంబు తాల్పదా, వి...

పురుషుని బిందువువలనఁ జెలువ గర్భముఁ దాల్చుచున్నది. పాదరసము రాతియుప్పువలనఁ గట్టుపడుచున్నది. మానవుఁడు బుద్ధిశాలి యైనచో నటులె సమస్తభువనములను తలఁపులోనిలుప వచ్చును.

ఆ. నాడెమైన చెడిప నయ మెఱింగి తిరుగు
విటుని గుస్తరించు వివర మెఱుఁగు
బానిసైన తొత్తు పాటింపరాదయ, వి... 2457

నేర్పుగల అంకుటాలు యుక్తాయుక్తముల నెఱింగి విటుల వలపించు వివరముగ్రహించి మెలఁకువగా సంచరించును. బానిస యగు తొత్తుమాత్ర మటులఁ జరింపక విటునిబ్రదుకు బయట వేయును.

ఆ. నాతిపైనిప్రేమ నానాఁటికిని రోఁత
జ్యోతిపైని ప్రేమ జూడఁగాను
మాతృప్రేమ యొకటె మర్యాద దాల్చును, వి.

స్త్రీలపైనిప్రేమఁ బెట్టుకొనుట రోఁత. జ్యోతిపైని పెట్టుకొనుట దగియుండును. అది తల్లిపైఁ జూపు ప్రేమవలె గౌరవముఁ గాపాడును.



ఆ. నాథుఁ డున్న యట్టి నవబోఁడి యాతని
దేవుఁ డనుచు నెంచి సేవఁ జేయఁ
దగును గాని యొరుని తా నంటవచ్చునా? వి.

పెనిమిటి గలస్త్రీ అతనినే (పతినే) దైవమునుగా భావింప వలయునే కాని ఇతరులను ముట్టుకొనరాదు. భర్తనుదైవముగా నెంచి యెల్లపుడు సేవింపవలెను.

ఆ. నీళ్లమీఁదఁ జూడు నెఱియ నోడలబల్మి
బట్టబయలఁ జూడు బండిబలిమి
ఆఁడుదానిబలిమి నాడనే చూడరా, వి...

పడవకుఁ గల గట్టితనము నీటిపైనఁ దేలును. బండికిఁగలగొప్ప తనము బహిరంగస్థలమున దెలియును. ఆఁడుదాని గొప్పతనము సంసారము చేయుటలోఁ దెలియును.

ఆ. పలుకనేర్చునపుడు బంగార మాసించు
మాటలకు వలచుట మహిమ గాదె
కొఱక నేర్చినదియు గోఁకిన చెప్పునా? వి...

వేశ్య మాటమాటాడినందులకు ధనమునిమ్మని విటులఁ బీడించును. అది యెపుడు మాటకారివానిమాటలకు మోహింపదు. కొఱికినగాని పలుకనిదానిని గోఁకినయెడల నేమిలాభముండదు గదా!

ఆ. పతిని తిట్టరాదు పదివేల కైనను
పెట్టి చెప్పరాదు ప్రియముగాను
పతిని మీఱరాదు సతి మానవతి యేని, వి....

పతిని తిట్టకుండుటయును బరులకు దాన మొసఁగి చెప్పకుండుటయును భర్తను మీఱకుండుటయును మానవతియగు మగువకుండవలసిన శుభలక్షణములు.

ఆ. పతిని నిందఁ జేసి పాటించి యెంచని
సతుల కెట్లు ముక్తి సాధక మగు
ఎట్లు కల్గు నియతి నెంచఁగా శక్యమా, వి...

పతిని నిందించుచుండెడి పాపాత్మురాండ్రకు గతులు ఎట్లును గలుగఁజాలవు. వారికిఁ బాపవిముక్తిగల్గి మోక్షమబ్బు విధము తెలుప నెవనికేని వశముగాదు.

ఆ. పతిని భావమందు పరమాత్మగా నెంచు
పడఁతి కమరుగతిని పరమటండ్రు
పతిని దూరుపట్టి పడఁతికి దుర్గతి, వి... 2464

పతిని మనస్సులో దైవముగా భావించు స్త్రీకి పరము కలుగును. అట్లు గానిదానికి దుర్గతి కలుగును.

ఆ. పరపురుషునిమీఁదఁ బ్రాణంబు పెట్టుక
మగువ సేయఁ జూచు మంచితనము
అట్టిభంగి యోగి యాత్మను భావించు, వి...

పరపురుషునిపైఁ బ్రాణములను పెట్టుకొని యాఁడుది స్వభర్తకు ప్రియముఁ జేయఁ జూచుచుండును. అటులే యోగీశ్వరుఁడును సంసారమునందు భ్రాంతియుంచుకొనక బ్రహ్మమునందే మనస్సునుంచుకొని కాలముగడుపును.



ఆ. పరసతిగమనంబు ప్రత్యక్షనరకంబు
అరయ నిందల కెల్ల నాలయంబు
పురుషుఁడు వినఁ జంపు భూపతి నొప్పించు, వి.

పరసతితోఁ గలసినయెడల నరకమునఁ బడవలసివచ్చును. లోకనిందలు తలపైఁ బడును. మగఁడు వినెనేని ప్రాణములను దీయును. రాజు విన్నచో శిక్షించును.

ఆ. పిచ్చివాని కైన పేదవానికి నైన
కుష్ఠరోగి కైన కుంటి కైన
భామ కానుపింపఁ బాముల పెట్టురా, వి...2467

పిచ్చివాఁడైనను పేదవాఁడైనను కుష్ఠరోగియైనను కుంటియైనను స్త్రీ కనిపించినంతమాత్రాన మరులొల్కొనును.

ఆ. కోఁటి యొకతె బ్రహ్మనోటిమీఁదనె తన్నె
కొమ్మ యొకతె విష్ణురొమ్ము తన్నె
సఖియ యొకతె శివుని సగముగాఁ జేసెను, వి.

స్త్రీలవలన మహామహులే యవమానమునొందిరి. ఇఁక సామాన్యులగతి యడుగవలసినదేమున్నది. సరస్వతి బ్రహ్మను నోటిమీఁదదన్నినది (నోట నివసించెను). లక్ష్మి విష్ణుని రొమ్ము మీఁదఁ దన్నెను (వక్షమున నివసించెను). పార్వతి శివుని దేహములో సగముగాఁజేసెను. ఇఁక మానవులాఁడువారిముం దెంత!

ఆ. బొల్లిమాటలాడు భోగముదానితో
దొల్లి దుల్ల నిల్లు గుల్లఁజేసి
వెళ్లిర మ్మటంచు వెడలించు నింటిని, వి...2469

పురుషుఁడు బొల్లిమాటలాడు బోగముదానితో పొందుఁ జేసినచో నిల్లంతయును దోఁచుకొని వెళ్లిపొమ్మని వెడలనడఁచును.

ఆ. భాగ్యవంతురాలు పరులయాఁకలి దప్పి
తెలిసి పెట్టనేర్చు తీర్పనేర్చు
తనదు దుష్టభార్య తనయాఁకలినె గాని
పరులయాఁక లెఱుఁగఁబడదు వేమ! 2470

ఉత్తమురాలగు స్త్రీ పరుల యాఁకలిదప్పికలు గమనించివారలకు అన్నాదికములఁ బెట్టితృప్తిపఱచును. దుష్టురాలు తనయాఁకలిని మాత్రము పాటించి పరు లెంత యాఁకలితోనున్నను గన్నెత్తిచూడదు.

ఆ. భార్య తనదుపాలిభారపుసంకెలల్
చిన్నచిన్నశిశువు జింజరీలు
అరయఁగ చెఱసాల యగును సంసారము, వి.

పురుషునకు సంసారము చెఱసాలవంటిది. భార్యయే సంకెల్ల. చిన్నచిన్న శిశువులు సంకెళ్లకు బిగించు మేకులవంటివారు. దీనిలోఁబడినవారి కెన్నఁటికిని మోక్షముండదు.

ఆ. మగఁడు తప్పులేక మనసిచ్చియున్నను
సహజగుణము విడదు జారకాంత
పిండిదిన్నకుక్క పీతికాసింపదా? వి.... 2472

మగఁడు తప్పింపక మనస్సునంతను తనకే యిచ్చియున్నను జారకాంత పిండితినుకుక్క పీతికిప్రేమించునట్లు ఇతరులను వలచుచునే యుండును.



ఆ. మగఁడు మదనుఁడైన మంచికాఁపురమైన
సహజ మేల మాను జారకాంత
పాలుద్రావు కుక్క పరుగెత్తి పోవదా? వి...

పాలుద్రాగినకుక్క యజమానిపైఁ గృతజ్ఞతోనుండక పాఱిపోవునటుల మంచికాఁపురము గలదైనను మగఁడుచక్కనివాఁడైనను జారకాంత నైజమగుచంచలబుద్ధిని మానుకొనదు.

ఆ మాట మిగులు నాలు మగనికి యమదూత
యొరపడఁగ పాము కుద్ది యగును
తనకుఁగానియాలు దానవురాలురా, వి...2474

మాట మిగిలి మగనిని దూషించుకాంత భర్తపాలిటికి యమదూత. పడఁగవిప్పి కఱవనుంకించుపాము. భర్త నుపకరించని భార్యను రాక్షసియని చెప్పవలయును.

ఆ. మానధనము విడదు మఱి పుణ్యవతి యైన
బూని పతికి భక్తి పొసఁగఁ జేయు
లోన మెచ్చుచుండు లోగుట్టు గనవలె, వి...

పుణ్యవతియైన స్త్రీ మానమును సంరక్షించుకొని పెనిమిటికి శుశ్రూషలను చేయుచుండును. పతిభక్తి యెప్పుడును విడనాడదు. భర్తృగుణములు హృదయమున గణించుచుండును. అట్టి యుత్తమురాలి హృదయము గ్రహింపవలయును.

ఆ. యోనిలింగమందు నుద్భవమయ్యెను
వాదమేల తనకు భేద మేల
ఆదిహరుఁడె తండ్రి యాహరియే తల్లి, వి....

యోనిలింగములలోనుద్భవమైన ఈమాయసంసారమున నైకమత్యములేక యేల వాదులాడుకొనవలయును? శివుఁడు లోకులకుఁ దండ్రి. విష్ణువే జనులకు దల్లి యని యెఱుఁగనగును.

ఆ. యోనిలోనె పుట్టి యోనిలోనే పెరిగి
యోనిలేని తెరువు గానలేక
యోనిఁ జూచి పరమయోగంబు మఱచురా, వి.

మానవుఁడు మాతృయోనినుండి బయలువెడలి యోనిలోఁ ఖిండమాదిపెరిగి తుద కా యోనికొఱకె వెదకసాగి యోగాది విద్యల మఱచుచున్నాఁడు. జన్మదుఃఖములు లేనిమార్గమును యోజింపఁజాలఁడు.

ఆ. వరుఁడు చక్కనైన వజ్రాలగని యైన
తళుకుమెఱుఁగువంటి తత్త్వమున్న
నన్యపురుషవాంఛ యాఁడుదానికి నుండు, వి.

తనభర్త వజ్రమువంటివాఁడైనను సొగసుకాఁడైనను చదివియున్నను ఆఁడుది మాత్రము సహజముగా పరపురుషునిపైనసే ప్రేమ నుంచికొనును. ఇది స్త్రీసహజము.

ఆ. వల్లభునికి నిష్టవస్తువు నందిచ్చి
యతనిమానసమున కలికియున్న
నట్టివనిత మంచికట్టడి కలదగు, వి... 2479



భర్త కభిమతముల నొనఁగూర్చుచు నతని కనుకూలముగా నున్నయువతి సద్గతి కలది యగును.

ఆ. వశము గానియాలి వైర మే మనవచ్చు
యశముఁ జెఱుచు గాని యనువుపడదు
కొసరు టెల్ల దానికోరికనే తీర్చు, వి... 2480

స్వాధీనముగాని యాలు ప్రబలమైనశత్రువు. యశోపహారిణియునై యుండును. అట్టిదానిని మరల మరల కొసరుట దాని యిష్టమును దీర్చుటకే గాని వీనిమంచికి గానేరదు.

ఆ. వాడ సత్యమెల్ల వడిసముద్రములోన
బండి సత్యమెల్ల బట్టబయల
నాఁడుదానిసత్య మేడను జెల్లదు, వి... 2481

పడవయొక్క గొప్పతనము సముద్రములోఁ బ్రయాణము చేయుతఱి తెలియును. బండియొక్క గొప్పదనము నేలపై బరువు మోయుచోఁ దెలియును. ఆఁడుదాని సత్యవృత్తిమాత్ర మెచ్చటను నిర్ణయింపరాదు.

ఆ. వాదమాడి తిట్టు పరుస నెవ్వరినైన
జేరరా దటన్నఁ జేటు తెచ్చు
గడుసురాలు తెలియ వడిసెలఁబోలురా, వి...

గయ్యాళిపెండ్లము వడిసెలవలెఁ బరులనొప్పింపనుమాత్ర మక్కఱకువచ్చును. ఎంతవారితోనైనఁ దగవులాడును. చేర దీయకపోయినను అపాయమును గలుగఁజేయును. ఇట్టి గయ్యాళిచెలిమి యపాయకరము.

ఆ. వెడగువేత్తలగుచు వినగన రీనరుల్
వేయిమార్గములను వేలుపజుఁడె
అతఁడు సృష్టికర్త యంతకు గురు తెన్న, వి...

ఎన్ని చెప్పినను ఈనరులు మోహమున తెలియలేరు; గాని దేవుఁడే అజుఁడు. ఈసమస్తమును అతఁడే సృజించెనని నమ్ముము. ఈగురుతును బ్రత్యక్షముగాఁ జూపినను బామరులు వినకుంటకన కుంట పరితాపకరము.

ఆ. వెతలు దీర్చువాఁడు వేదాంతవేద్యుండు
రతుల నేలువాఁడు రమణుఁ డగును
సతిని చెనఁగువాఁడు సంసారయోగిరా, వి...

సంసారసంబంధములగు శ్రమలను దొలంగించువాఁడేగురూత్తముఁడు. వలపుదీఱఁగలయికలలో నలరించువాఁడె వలపుకాఁడు. సంసారిణియగు కులకాంతతోఁ గలసి యోగముల మఱువని వాఁడె సంసారయోగి.

ఆ. వెదక వెదక దొరకు వేదాంతవేద్యుండు
వెదకువానిఁ దాను వెదకుచుండు
వెదుక నేర్చినట్టి వెరవర్లు గలరొకో, వి...2485

వెదుకగా వెదుకఁగా వేదవేద్యుఁడగు నీశ్వరుఁడు దొరకును. ఆయీశ్వరుఁడు సైతము తన్ను వెదకు భక్తుని నొకకంటఁ గని పెట్టియే యుండును. భగవంతుని వెదకు నుపాయశాలురు మాత్రము చాల దక్కువమంది యున్నారు.



ఆ. ముద్దుగుమ్మ కేల ముసలిమగఁడు మది
వశముగాక విటుని వలను జిక్కు
వెఱ్ఱి మొద్దునకును వేదశాస్త్రము లేల? వి...

జవ్వనికి ముసలిమగఁడున్నచో నతనికి వశముగాక విటుని వలలలోఁ బడును. అటులె నవివేకియగు మూర్ఖునకు వేదశాస్త్రజ్ఞానమున్న యెడల ననుభవయోగ్యముగాక విఫలమగును.

ఆ. సముదయంబునందు సర్వ మొక్కటియైన
వైర మొదవ దేమి వార లేమి
ఎచ్చుతగ్గులందు నేర్పడనే హాని, వి... 2487

ప్రపంచమునందలి జాతులన్నియు నొక్కటియే యని తలంచినచో దగవులకు తానేయుండదు. జాతులనువిడఁదీసి హెచ్చుదగ్గుల నేర్పఱచిన నపాయమువచ్చును.

తే. సర్వకులధర్మమర్మముల్ సంతరించి
సకలయోగంబులను మించి సమ్మతముగ
బట్టబయలందుఁ జేరుటే బ్రహ్మవిద్య
గుట్టిది యటంచుఁ దెల్పురా గురుఁడు వేమ!

సమస్తములకు కులాచారాదికములను వదలివేసి సర్వసమత్వము నవలంబించి సమస్తయోగముల కనుకూలముగా మోక్షస్వరూపము నెఱుంగుటయే బ్రహ్మవిద్య. ఈరహస్యము నెఱింగించువాఁడె గురువు.

ఆ. సాధుసజ్జనులను సంతరించినవాఁడు
ప్రజలసంతసంబు పఱచువాఁడు

కదిసి శాత్రవులను గరుణఁ జూచినవాఁడు
పాదుకొన్న ముక్తిపరుఁడు వేమ! 2489

నిరుపద్రవకరులగు సజ్జనులను సంతోషపఱచువాఁడును, ప్రజారంజకుఁడగువాఁడును, తనను జంపవచ్చిన విరోధినేని గరుణించినవాఁడును దప్పక మోక్షమును బడయఁగలఁడు.

ఆ. సిగ్గటంచనఁబడు సిగ్గ దెచ్చో నుండు
నాఁక లెచటనుండు నరయగాను
దాఁగియున్నవాని దా నేల తెలియఁడో? వి...

సిగ్గు, ఆఁకలి మున్నగునవి మనోజన్యములే కాని వస్తుతః లేవని యెఱుంగుము. ఈదాఁగియున్నవానిని దెలిసికొనుటయే యోగానుభవమునఁగల ప్రధానఫలము.

ఆ. సిగ్గు గల దటంద్రు సృష్టిలోపలివారు
వెఱ్ఱివేమనఁగని వెఱఁగుపడిరి
తనకుఁ గలుగు సిగ్గు దైవ మెఱుంగఁడా? వి...

అవివేకులగు ప్రజలు తామె సిగ్గుగలవారమని దిగంబరుఁడైన వేమనయోగినిఁజూచి భయపడుచున్నారు. తాము లజ్జాపదము నెంత దాఁచినను దానిని భగవంతుఁ డెఱింగియేయున్నాఁడు. ఇంక నెందుల కీలజ్జావరణము.

ఆ. సిగ్గు దాఁగు నెచట జీకటి యెట దాఁగు
నాఁక లేడ దాఁగు నాత్మలోన
దాఁగియున్న నిద్ర దాఁగుట తెలియుఁడీ, విశ్వ.



ఈపంచభూతావృతకళేబరమున సిగ్గెచట దాఁగియున్నదో అజ్ఞాన మెచట దాఁగియున్నదో ఆకలి యెట దాఁగియున్నదో నిదుర యెచట దాఁగియున్నదో యోగి యగువాఁడు ముందు గ్రహింపవలయును.

ఆ. సిగ్గు విడువకున్న శివసౌఖ్యమే లేదు
తగ్గి మొగ్గకున్న సిగ్గు విడదు
సిగ్గు విడుచువాఁడె చిరకాలజీవిరా, వి...2493

లజ్జాభిమానములు విసర్జించినగాని మోక్షము లభింపదు. అహంకారాదుల జంపుకొని శుశ్రూషలఁ గావించినగాని సిగ్గు పోదు. సిగ్గువిడచినవాఁడె మృతజీవుఁ డనఁబడును.

ఆ. శీలవ్రతముచేత శిష్యులశిష్యులై
తపసి కర్మములను దార వ్రాసి
విశ్వకర్మకులము వీటిఁ బుచ్చిరి గదా, వి...

విశ్వకర్మవంశజులగు (కంసాలురు) వారు శీలవంతులమని ఆచారవంతులమని పెద్దపేరులఁ బెట్టుకొని తమలోఁ దామె శిష్యోపశిష్యులగుచు తపస్సు కర్మము వీనిని బాటించక తామె గాక జాతినిగూడఁ బాడుచేయుచున్నారు!

ఆ. సున్న మన్న నేదో సూక్తిని దెలిసిన
వన్నె గన్న యట్టి వారు గాక
యెన్నఁగలరె యొరు లిఁకెన్ని యోజించిన, వి.

వస్తు స్వరూపము మానవుఁడు ప్రపంచానుభవముచే గుర్తింపవలయును. ఒక్కసున్నము తార్కాణ దీసికొనుఁడు. అను

భవశూన్యుం డది సున్నమని గ్రహింపఁగలఁడా! అటుల సమస్తవిద్యల కనుభవము కావలయును.

ఆ. సొమ్ము గన్నదనుక జ్యోతివెలుఁగ నవలె
సొమ్ము గన్న వెనుక జ్యోతి యేల
దేవుఁడైన వెనుక దేహంబు చీఁకేల, వి...2496

సొమ్ములు వెదకుకొన్నంతవఱకు దీపము కావలయును. సొమ్ములగుపడిన పిదప దీప మెందులకు? అటులె జీవుఁడు ఈశ్వర సాక్షాత్కార మగువఱకు దేహము దాల్పవలెనుగాని యాపల నీదేహముతోఁ బనియుండదు.

ఆ. సొమ్ము లున్నచోట్ల శోధింపఁగలుగును
సొమ్ము లేనిచోట శోధ యేల
అంజనంబు లేక యాసొమ్ము తెలియదు, వి...

సొమ్ము లెచటనున్నవో యచటనే శోధింపవలయును. ఈ భూగర్భద్రవ్యము గుర్తింప అంజనము కావలయును. అటులే సాధకుఁడుగూడ తత్త్వ మెచ్చట నున్నదో అచ్చట శోధింపవలయును. అయ్యది గురువుల యనుగ్రహము లేనిది లభింపదు.

ఆ. సోమయాజి ననుచు సొంపుగా వేషంబు
గట్టిమాంస మెల్లఁ గాల్చి తినును
ద్విజుఁడఁ దా ననఁగ నధిక మేమి గల్గును? వి...

సోమయాజులమని వేషము వేసికొని గట్టిగట్టిమాంసమును గాల్చుకొని తినుచు కొందఱు బ్రాహ్మణులు మేమే ద్విజులమని చెప్పుకొనుచున్నారు. వీరి కాధిక్యము ఎట్లువచ్చునో?



ఆ. సోమలతలరసము సోలలకొలఁదిని
ద్రావ నేల త్రావ మే లటంద్రు
క్రతుఫలంబు కంఠగత మగుఁ గాఁబోలు, వి...

సోమలతలరసము ఎంతదాఁగినను ప్రయోజనము కొంచెమైనను కానరాదు. ఆధిక్యము సోమరసము త్రాఁగుటవలన రాదు. ఇంతమాత్రమున వారికి యజ్ఞఫలము గొంతవఱకు బట్టునందురుగాని యదియు కల్లయే.

ఆ. స్వప్నమనఁగ మేనిస్వాతంత్ర్యమా గాదు
స్వప్నమనఁగ జీవ సంకటంబు
అల్పనరుఁడు తెలియు టవనిలో నరుదయా, వి.

స్వప్నమనునది భ్రమ. అందువలన స్వప్న మెన్నటికి దేహస్వతంత్రముగాదు. అజ్ఞానావృతుఁడై జీవుఁడు కలలోఁ గొట్టుకొనునుగాన కల జీవుని సంకటపఱచునది. ఈసంగతి సామాన్యులెఱుంగఁజాలరు.

ఆ. స్నాన మొనరఁ జేసి సద్ధర్మ మీయక
నీళ్లమునుఁగ నగున నేర్పులేక
నీళ్లయందు కోడి నెలవుగా మునుఁగదా? వి.

స్నానముఁ జేసి ధర్మమును చేయక మునిఁగితిమన్నంతనఁ గొంచె మైనను ఫలము గలుగఁబోదు. నీటికోడి నీటిలో నెల్లపుడు మునుఁగుటలేదా? వీరిస్నానమంతే.

ఆ. స్నానసంధ్యజపము జరియించు భుజియించు
నిష్ఠ లెన్నియైన నెఱుపుగాని

ఒకని కీయఁడేమి సుకృతంబు కలుగునో? వి...

లోభి స్నానము సంధ్య జపము మున్నగువాని నెన్నిటినైనను జేసికొనును గాని సుకృతమును మాత్రము తెలిసికొని యాచకున కొకకాసైననీయఁడు. ఒకని కీయనివాని కెటులఁ బుణ్యము కల్గును?

ఆ. స్వానుభూతిలేక శాస్త్రవాసనలచే
సంశయంబు విడదు సాధకునకు
చిత్రదీపమునను చీఁకటి పోనట్లు, వి... 2503

స్వానుభవము లేనిచో ఎంతటిశాస్త్రవాసనయున్నను నజ్ఞానాంధకారము పాయదు. చిత్రపటములో నున్నదీపమువల్ల నెన్నఁటికిఁ జీఁకటిపోదుగదా!

ఆ. స్త్రీలచనులు పూలచెండ్లుగాఁ బోల్చును
ప్రాలుమాలినట్టి పందకొడుకు
చన్ను లెట్లు పూలసాటియౌ చెప్పుము? వి...

మోహమున నొడలెఱుంగని యవివేకులు చెలువలగుబ్బలను బూలబంతులుగాఁ బోల్చుచున్నారు. మాంసపుముద్ద లగు చన్నులు పూలచెండ్ల కెటుల సాటివచ్చునోగదా!

ఆ. స్త్రీలఁ జూచి నరుఁడు చిత్తంబు నిలుకడ
చేయలేక తాను చెడును గాదె
ఏటికట్టమ్రాన నెందాఁక నిలుచురా? వి...

స్త్రీని చూడఁగానే యెంతవానికైనఁ జిత్తము చలించును మోహము నాపుకొనఁజాలక కడకుఁ జెడిపోవును. ఏటియొడ్డు



నఁగల మ్రానునకు నిలుకడ లేనట్లు స్త్రీలతోఁ గలసి యుండు పురుషుని శీలము నిలుకడలేనిది.

ఆ. స్త్రీలు కల్గుచోటఁ జెల్లాటములు కల్గు
స్త్రీలు లేనిచోటు చిన్నవోవు
స్త్రీలచేత నరులు చిక్కులఁ బడుదురు, వి...

స్త్రీలున్నచోటఁ దప్పక తగవులు కలుగును. అటులని స్త్రీలను విసర్జింతమా? స్త్రీలు లేనిచోటులలో నందములేదు చందములేదు. మానవు లనేకులు స్త్రీలవలె ననేక చిక్కులపాలగుచున్నారు.

క. అతినిద్రావంతునకు
న్నతిపానికి నిరశనునకు నతికోపునకున్
ధృతిహీనున కపకృతునకు
జతపడ దీబ్రహ్మవిద్య చాటర వేమా! 2507

అపకారబుద్ధి, అతినిద్ర, పానము, ఉపవాసము, మితిమీఱినకోపము, అధైర్యము గలవానికి బ్రహ్మవిద్య పట్టుపడదని చాటవచ్చును.

ఆ. అద నెఱిఁగినమగువ యనువెర్గు చనువెర్గు
ముదముతోడి మగని మోహ మెఱుఁగు
విభుని శ్రేష్ఠగుణము వేశ్య తా నెఱుఁగురా? వి.

యుక్తాయుక్తజ్ఞానముగల కులకాంత మగని మంచితనము చనువువలపు గ్రహింపనేర్చును. కేవల ధనలోలురాలగు వేశ్య విటుని మంచిగుణములను గ్రహింపఁజాలదుగదా!

ఆ. అధికజనులతోడ నాప్తులతోడను
పరువు గురు తెఱంగి పలుకకున్న
వచ్చు చెడ్డతనము హెచ్చుగా గాంభీర్య
మహిమ హానిఁ జెందు మహిని వేమ! 2509

గొప్పవారితోను ఆప్తులతోను పరువుసుకనిపెట్టి సంభాషి పక యుండినచో నాపదలు వాటిల్లును. అటులె నన్నియెడల గాంభీర్యముగానున్నను విపత్తులు కలుగును

ఆ. అనఁగ ననఁగ రాగ మతిరమ్యమై యుండు
వెనఁగఁ బెనఁగ సతికి ప్రేమ పుట్టు
తినఁగఁ దినఁగ వేము దియ్యనై యుండురా, వి.

పాడఁగాఁ బాడఁగా రాగములువచ్చును. కలసినకొలఁది సతికిఁ బురుషునిపైఁ బ్రేమకలుగును. తిన్నకొలఁది వేపాకుఁగూడ దీయఁగా నుండును. సాధనమువలనసాధ్యముగాని దేదియు లేదు.

ఆ. అనువు గానిబంటు నల్పుఁ డేలినయెడ
మాఱుమలయు నొండె మగుడు టొండె
దూలమూతకోల దొరకినచందము, వి... 2511

దూలమును చేతికఱ్ఱగాఁ దీసికొన్న నేరీతిగా నుపకరింపదో అటులే పనికిమాలినివానిని బంటుగా నుంచికొనినచో లాభ ముండదు. అట్టిబంటు యజమానునకుఁ దిరుగఁబడును లేదా కొట్టవచ్చును.

ఆ. అప్పుదీయ రోఁత హరిహరాదుల కైన
మొప్పెతోడ మైత్రి మొదలె రోఁత



తప్పు పలుక రోఁత తాకట్టిడిన రోఁత, వి... 2512

అప్పుతీయుట, కుదువఁబెట్టుట, అసన్మైత్రి, అసత్యభాషణము హరిహరాదులంతటివారికైనను రోఁతలు పుట్టించును.

ఆ. అరయ లజ్జఁ జూడ నందఱియందుండు
లజ్జ లేనివాఁడు లాలితుండె
లజ్జ గల్గువానిలాభంబు లేమయ? వి... 2513

లజ్జ ప్రతిమానవునకుఁ గలదు. లజ్జలేనివాఁడు మనుష్యగణములోఁ జేరినవాఁడు కాఁడుకాని లజ్జవలనమాత్రము లాభము లేదని నొక్కి చెప్పవచ్చును.

ఆ. అల్పుఁ డైనవాని కధికార మబ్బినా
దొడ్డ కొంచె మనక తూల బలుకు
చెప్పుకొఱుకు కుక్క చెఱకు నే మెఱుఁగురా? వి.

అల్పునకు అధికార మిచ్చినచో మంచిచెడ్డలను విచారింపఁబూనక పెద్దల తూలనాడఁ బూనును. చెప్పురుచిమరఁగిననీచపుజంతువగు కుక్క చెఱకునందుఁ గలమాధుర్యముగ్రహింప లేదుగదా!

ఆ. అల్లుని కగుమృతికి నాత్మ జింతించును
తనయుమృతికి తాను తల్లడిల్లు
పుణ్యపురుషు మృతియు భూమికి మృతియగు, వి.

లోకులు సామాన్యముగా అల్లుఁడు గతించిన లోలోన జింతింతురు. తమగర్భవాసమునఁ బుట్టినకొడుకు గతించినచో

తల్లడిల్లుచుండురు. ఉత్తముఁడు గతించిన దలిదండ్రులేగాదు లోక మంతయుఁ దల్లడిల్లును.

ఆ. ఇంగలంబుతోడ నిల నల్పుతోడను
పరునియాలితోడ పతితుతోడ
సరసమాడు టెల్ల చావుకు మూలము, వి...

నిప్పుతో నీచునితో పరస్త్రీతో పాపాత్ములతో సరస మాడుట యంతయును తన చావునకే మూలమని యెఱుంగ వలయును.

క. ఇచ్చకము భువి నవశ్యము
కుచ్చిత మిహలోకనింద కోవిదునకు నీ
తచ్చనె హాని వచ్చును
మచ్చరమే తన్ను జెఱచు మహిలో వేమా!

ఇచ్చకములాడుట కుచ్చితముగావర్తించుట ఇతరుల నిందించుట లోనగునవి యెంత తెలిసినవానికేని యపాయకరము. మచ్చరము ఎంతవానికేని ప్రాణహానికరము.

ఆ. ఇహమునందు బాధ లెన్నైన బడవచ్చు
యమునిబాధ లేక యమరవలెను
పరునిబాధ లేక బ్రతుకుఁడు సరులార, వి...

ఇహలోకమునందుఎంతటికష్టములనైన సహింపవచ్చును గానియమలోకకష్టము అసహ్యములై యుండును. కాన యముని బాధనిపడకుండ బ్రదుకవలెను.



ఆ. ఈఁగతల విషంబ దిముడదు నీలోన
తేలు తోఁకవిషము తెంపుఁ జూపు
పాముకోఁ అవిషము పట్టి చంపును గదా, వి...

ఈఁగతలలోవిషముగలదు.అదిలోనికేగినవాంతులుకలుగును. తేలుకొండిలోనివిషము చాల బాధపెట్టును. పాము కోఁఱలోని విషము ప్రాణము దీయును కాన విషమునుండి బయటపడుము.

ఆ. ఈఁగ తేనెరుచికి నింపుగాఁ జచ్చును
ఓగు కామరుచికి నొదిగి చచ్చు
త్యాగి గానివాని ధర్మ మడిగినఁ జచ్చు, వి...

ఈగ తేనె కాసపడి దానిలోఁబడి చనిపోవుచున్నది. అవివేకి చెలువల చక్కఁదనముఁజూచి కామమునఁ గన్నుగానక చనిపోవుచున్నాఁడు. లోభిని ద్రవ్యమడిగినంతన ప్రాణములను గోలుపోవుచున్నాఁడు.

ఆ. ఉక్కుచూర్ణము దిన నుడుగును కష్టంబు
లుక్కుచూర్ణము దిన నుడుగు క్షయయు
నుక్కుచూర్ణము దిన నుడుగును కర్మముల్, వి.

ఉక్కుచూర్ణము తినుటవలన క్షయసమస్తకష్టములును కర్మములును తొలఁగి సుఖింపఁగలుగును.

ఆ. ఊపి రున్నయపుడె యుపదేశ మందుము
రూపుమాయు నెపుడో రూఢిగాను
బాపఁడైన నేమి బడబాగ్ని మ్రింగునా? వి...

ప్రాణమున్నప్పుడే పరమునకై పాటుపడి కృతార్థుఁడవు కమ్ము. ప్రాణమెపుడో పోవును. నీవు బ్రాహ్మణుఁడ వని నిన్ను మృత్యుదేవత యెన్నఁటికి విడువదు.

ఆ. ఋణము పెంచి సుతుని హీనుగా నొనరించి
విడుచుతండ్రి వైరివీరుఁ డరయ
అలవిగానియట్టి యాలును నట్టులే, వి... 2523

ఋణములుచేసి కుటుంబమును జిక్కులపాలుచేసిన తండ్రి కొమారునకు విరోధివంటివాఁడు. తన్ను మించినభార్యయుం మగనికిఁ గూడ నటులె శత్రువని యెఱుంగనగును.

ఆ. ఎంచి యెంచి పూజ లెన్ని సేసిన నేమి
భక్తిలేని పూజ ఫలములేదు
కాన పూజ సేయఁ గారణ మెఱుఁగుఁడీ, వి...

ఎన్నివిధములగు పూజలను చేసినను భక్తిలేనిచో నవియన్నియును నిష్ప్రయోజనములు. పూజకు భక్తియే కారణ మనునది గమనింపఁదగినయంశము.

ఆ. ఎఱుక లేనిదొరల నెన్నాళ్లు కొలిచిన
బ్రదుకులేదు వట్టిభ్రాంతికాని
గొడ్డుటావు పాలు గోకిన చేపునా? వి...2525

విజ్ఞానములేని ప్రభువులను ఎన్నిదినములు కొలిచినను వ్యర్థమే యగును. గొడ్డుపోయినఆవు గంగడోలు నెంతగోకినను బాలు చేపుగదా.



తే. ఏగుణముల నాపదలగు
నాగుణము లడంప వలయు నాసక్తుండై
ఏగుణములు మే లొనరుచు
నాగుణముల ననుసరించి యలరుము వేమా!

మానవున కెట్టిగుణము లాపదల గలుగఁజేయునో యట్టిగుణములు తప్పక విసర్జింప వలయును. ఏగుణములు మేలు సమకూర్చునో వాని ననుసరించి కాలము గడుపవలయును.

ఆ. ఐకమత్య మెన్న నాల్మగలకు వాసి
మగని బుద్ధు లెల్ల మగువ నేర్చు
దానిరక్షణంబె వానిరక్షణ మగు, వి... 2527

దంపతులకైకమత్యమే మేలు నిచ్చును. ఆదాని రక్షించుకొనుటయే వారి కాత్మరక్షణ మనఁదగును. ఐకమత్యమున్నచో భర్తృసుగుణముల నన్నిఁటి భార్య నేర్చుకొన వీలగును.

ఆ. ఐకమత్య మొక్క టావశ్యకం బెప్డు
దానిబలిమి నెంత యైనఁ గూడు
గడ్డివెంటఁ బెట్టి కట్టరా యేనుంగు? వి... 2528

ఐకమత్యము ముఖ్యములగువానిలో నొకటి. దానివలన నెంతపనియైనను సుసాధ్యమగును. గడ్డిపఱకలు తోడైనచో నేనుంగును సైతము గట్టివేయుటలేదా!

ఆ. ఐదువ్రేళ్లబలిమి హస్తంబు పనిఁజేయు
నం దొకటియు వీడ బొందిక చెడు
స్నేయుఁ డొకఁడు విడిన చెడుఁగదా పనిబల్మి? వి.

ఐదువ్రేళ్లసహాయమున్న గాని హస్తము పనిచేయఁజాలదు. అందొకటి విడిచిపోయినచో హస్తముతనపనిచేయలేదు. అటులే తనవాఁడొకఁడు తన్ను విడచెనేని కార్యములన్నియుఁ జెడును.

ఆ. ఐనవారలంచు నాప్తు లటంచును
బందుగులను నమ్మ పాడిగాదు
తనకు నైనవాఁడు తా నొకఁడే యగు, వి...

ఆప్తులని అయినవారలని బందుగులని నమ్మకుము. ఎవనికి వాఁడొక్కఁడే ఆప్తుఁడగును. ఆపత్కాలమునఁ దనకుఁదానొకఁడె యగును. ఆపు డీబందుగులు తోడుపడరు.

ఆ. ఔరసుండె నీకు వారసుం డగుఁ గాక
వేశ్యయందుఁ బుట్టు వెధవకొడుకు
నీవు పోయినపుడు నీరైన వదలునా? వి...2531

ఔరసుఁడు వారసగుగాని తొత్తుకొడుకు వారసుఁడుగాఁడు. తొత్తుకొడుకు పెట్టినంతవఱకుఁ దినును గాని యావలఁ జేరెడు నీరైన వదలఁడు.

క. కనరానిది పరపంచన
వినరానిది గురునినింద విని కనియును తా
ననరానిది పెద్దలమతి
మనరానిది మానహాని మహిలో వేమా! 2532

పరులవంచింపవలయునని యనుకొనునెడ వినుటయుఁదప్పు. గురునింద చెవిని జొరనిచ్చుట దోషము. పెద్దలనడవడి నాక్షేపిం



చుట కలుషము. మానహాని సంభవించిన పిదప జీవించుటకంటె నీచములేదు.

క. కఱకంఠునికోపమువలె
వరగౌతముశాపమట్టు వర్ణింపంగాఁ
జిరకష్టజీవులై తగు
నరులును మది నొచ్చి తిట్ట నాశమె వేమా!

ఈశునికోపమువలెను గౌతముని శాపమువలెను కష్టజీవులు సంతాపము నొంది తిట్టినచో ఆతిట్టు కులమునుగూడ నశింపఁ జేయును.

ఆ. కల్ల నిజము రెండు కఱకంఠుఁ డెఱుఁగును
నీరు పల్ల మెఱుఁగు నిజముగాను
తనయునిజన్మంబు తల్లి తా నెఱుఁగును, వి...

సత్యాసత్యముల నీశుఁడును మెట్టపల్లములను నీరును ఎఱుఁగును. తనకుమారుని జన్మక్రమము తల్లి యెఱుంగును. ఇతరు లెటు లెఱుంగఁగలరు?

ఆ. ఖగములందు చూడఁగా ముచ్చటగ నుండు
తెగలు గన్న నైన తేటపడదె
దేవు డీనిసొగసు దేబె నీకేలరా? వి... 2535

పక్షులకు దైవము జక్కని యీఁకెలు అందమగునాకారము నొసంగియున్నాఁడు. వానిలోఁ బెక్కుతెగలున్నను వేనికవియే మనోహరముగానున్నవి. అటులే దేవుఁడు మనుజులకాకారము

ప్రసాదించియున్నాఁడు. దేవుఁడీయనియందము తెచ్చిపెట్టు
కొనవచ్చునా?

ఆ. ఖలులతోడిపొందు కలుషంబు గలిగించు
మాన దెంత మేటిమానికైన
వానిచేరఁదీయ వలవదు చెడుదువు, వి...

దుష్టులతోడిసహవాసము ఎంతటివారికైనను కీడును గలిగించును. దుస్సహవాసమువలన మునులకైనఁ జెట్టలు తప్పవు. కావున నెన్నఁటికి నీచుని జేరఁదీసి చెడకుము.

ఆ. చిక్కియున్నవేళ సింహంబు నైనను
బక్కకుక్క యైన బాధసేయు
బలిమి లేనివేళ పంతముల్ చెల్లవు, వి...2537

కాలముచాలనిచో నెంతటి బలవంతులనైనను అల్పులు బాధించెదరు. చిక్కి కృశించియున్నచో సింహమును గుక్కసైతము పీడించుటకు మొదలుపెట్టును.

ఆ. చెప్పులోనిరాయి చెవిలోనిజోరీగ
కంటిలోనినలుసు కాలిముల్లు
ఇంటిలోనిపోరు ఇంతంతకాదయా, వి...2538

చెప్పులోనిరాయి చెవిలో దూరిన జోరీగ కంటిలోఁ బడిన నలుసు కాలిలో విఱిగినముల్లును చిన్నదైనను గొప్పకష్టమును గల్గించును. వీనిబాధకు మితియేలేదు.

ఆ. చక్కదనము లేల సంపద లేలను
విద్య లేల భూమి విరివి యేల



పుత్రపదవికన్నఁ బుట్టునె పదవులు? వి... 2539

పుత్రసంపదకంటెను పరలోకముల నీయఁగల సంపద లితరము లేవియును లేవు. చక్కదనము, సంపద, విద్య, భూమి మొదలగువానికంటెఁ బుత్రసంపదయే గొప్పది.

ఆ. చదివినతనికన్న చాకలియే మేలు
కులము వేల్పుకన్న కుక్క మేలు
సకలసురలకన్న జారభామిని మేలు, వి...2540

అవివేకియై చదువుకొనియు నుపయోగములేనివానికంటెఁ జదువుకొనని చాకలిమేలు. మ్రొక్కినఫలములేని కులదైవతములకంటె నిల్లుకాచుకుక్క మేలు. మోక్షము ప్రసాదింపని వేల్పులకంటెఁ గామముదీర్చు జారకాంతయే యుత్తమురాలు.

ఆ. జంత్రమంత్రమహిమ జాతవేదుఁ డెఱుంగు
మంత్రవాది యెఱుఁగు తంత్రమహిమ
తింత్రిణీకమహిమ తినువాఁ డెఱుంగును, వి...

యంత్రములయొక్కయు మంత్రములయొక్కయు మహిమ యగ్నిహోత్రుఁ డెఱుంగును. తంత్రముల మహిమ మంత్రశాస్త్రవేత్త యెఱుంగును. చింతపండురుచి యటులే తినువానికిఁ దెలియును.

ఆ. జీవి తొలఁగనపుడె జీవనౌషధ మిచ్చి
జీవి నిలుపవలయు జీవనముగ
జీవి తొలఁగెనేని జీవనౌషధ మేల? వి...2542

ప్రాణము పోకముందు వైద్యుఁడగువాఁడు జీవనౌషధముల

నొసంగి రోగికి సేవచేయవలయును. ప్రాణము పోయినపిదప నౌషధములన్నియు నిష్ఫలములు గావున ముందె జాగ్రత్తపడుట యుక్తము.

ఆ. జన్నములను మఱియు జన్నియల ననేక
ములు నొనర్చి యున్న ఫలము గాన
రాక యుండునీతి లేకున్నమాత్రాన, వి...2543

ఎన్నివిధములగు యజ్ఞాదులను జేసియున్నను నీతిలేకున్నచో నన్నియు నిష్ఫలములు.

ఆ. ఝషము నీరువెడల జచ్చుటే సిద్ధము
నీట నుండె నేని నిక్కిపడును
అండ తొలఁగునెడల నందఱని యట్లె, వి...

చేప నీటిలో నున్నంతవఱ కెగిరియెగిరిపడును. బయటికి వచ్చినచోఁ జచ్చును. అటులె మానవుఁడు అండగలిగియున్నవఱ కెగిరిపడును. పిదప వానిగతి తెలుపఁబనిలేదు.

ఆ. డీకొనంగఁ దగదు డెంద మెఱుంగక
యడుగవచ్చి కొంత యనిన వాని
చెప్పునంత వినియు మెప్పుగాఁ బలుకుమీ, వి.

ఎదటివానితోఁ దగవులాడుట యెన్నఁటికిఁ దగదు. వాఁడే విషయమునేని యడుగవచ్చినయెడల నడుగుట పూర్తియగుదనుక విని పిదప నెమ్మదిగా జవాబుచెప్పుట యుక్తము.

ఆ. తగవు తీర్చువేళ ధర్మంబు దప్పిన
మానవుండు ముక్తి మానియుండు



ధర్మమునె పలికిన దైవంబు తోడగు, వి...

తగవును తీర్చునపుడు ధర్మమును దప్పిన మనుజునకు ముక్తి దొరకదు. ధర్మముచెప్పి ప్రజాద్వేషియైనచో నట్టివానికి దైవముతోడై సహాయముచేయును.

ఆ. తగినకులజుఁడైన తనయెత్తుధనమైన
పరపురుషుని నేల పట్ట నిచ్చు
పరమసాధ్విచూడ నొరుల నంటదు సుమా! వి.

గొప్పకులమువాఁడైనను, తనయెత్తు ద్రవ్యముపోసినను, పతివ్రత పరపురుషుని కనులఁజేరియైనచూడదు. ఒరుల నంటదు. అంటుకొననీయదు. ఇది యుత్తమకాంతల లక్షణము.

ఆ. తండ్రిమాటలు విని తల్లిని దెగటార్చి
పరశురాముఁ డేమి ఫలము గనెను
నిలువ నీడ లేక కులగిరిఁ జేరఁడా? వి... 2548

తండ్రిమాటలనువిని తల్లికి ద్రోహము చేయరాదు. చేసిన పరశురామునకు నిలువనీడలేక మహేంద్రగిరికిఁ దపముచేసికొనుటకై పోయెనుగదా!

ఆ. తనయుఁ డెవ్వఁడేని తనతండ్రికంటెను
పేరుతెచ్చునట్టి పెద్దయైన
జనకు హీను జేయ సాహసించినఁ జేటు
మూఁడు నిహపరముల మొనసి వేమ! 2549

కొమారుఁడు గొప్పవాఁడైనను తండ్రికంటె నుత్తమోత్త

ముఁడైనను తండ్రినిమాత్ర మవమానింపరాదు. అట్టికుమారునకు ఇహమునం బరమున దుర్గతి కలుగును.

ఆ. తన్ను గన్నయట్టి తల్లివంటిది సుమ్ము
అన్యకాంత న్యాయ మరసిచూడ
కన్నదానిజనులు కానంగలేరయా, వి... 2550

పరస్త్రీ తనకు మాతృసమాన. ఇట్టిదని అందఱు నెఱింగియే యున్నను ప్రవర్తనలలో గానలేరు.

ఆ. తప్పుపలుకు పలికి తాటోటు జేసిన
కూడియున్న లక్ష్మి క్రుంగిపోవు
నోటికుండ నీళ్లు నొనరఁగా నిల్చునా? వి...

అసత్యము లాడెడువానియింట నెన్నఁటికి లక్ష్మి నిలువదు. ఓటికుండలో నీరుపోసినయెడల నిలువవుగదా?

ఆ. తరుణి పుణ్యపతిగ వరుని పట్టియె యగు
పాపిని యగుమగని ప్రాపువలన
భర్తవర్తనంబె పడఁతులయం దుండు, వి...2552

మగనిని బట్టియే స్త్రీ పతివ్రత యగుచున్నది. మగనిని బట్టియే స్త్రీ అంకుటాలగుచున్నది. ఆఁడుదానిమంచినడవడికి చెడునడవడికి మగనినడవడియె ప్రధానహేతువని యెఱుంగ నగును.

ఆ. తల్లిదండ్రులందు దారిద్ర్యయుతులందు
నమ్మిన నిరుపేదనరులయందు
ప్రభులయందుఁ జూడ భయభక్తులుంచుము, వి.



తల్లిదండ్రులయందును, నిరుపేదలయందును, దన్ను నమ్మిన బీదవారియందును,రాజులయందును భయభక్తులనుంచుట శ్రేయస్కరము.

ఆ. దళముకొని యొకళ్లు దారిద్ర్య మేర్పడ
హీనకార్యములు సహించి చేయ
బరువు మాయునింతె ఫలమింత చిక్కదు, వి.

దారిద్ర్యమునకు లోఁగినవా రేపనులఁ జేయరాదు. చేసిననో ఫలము కొంచెమేనిలేకయుండును; దరిద్రావస్థలోఁజేసిన పనులు కష్టములచేటేగాని ఫలప్రదములు గావు.

ఆ. దానధర్మములును దయయు సత్యము నీతి
వినయధైర్యశౌర్యవితరణములు
రాజుపాలిటి కివి రాజయోగంబులు, వి...2555

త్యాగముచేయుట, ధర్మమునొనరించుట, దయ, సత్యము, నీతి, వినయము, తెగువ, పరాక్రమము, దానము లోనగు నుత్తమధర్మములు రాజుల కవశ్యము ఆచరణీయములు. ఇవి రాజులకు రాజయోగమువంటివి.

ఆ. దొంగతనము అంకు దొరసియుండు జగతి
అంకులాడి కింట శంకపుట్టు
దొంగకెన్న జేవెలుం గొప్పకానట్టు, వి... 2556

దొంగతనమునకు అంకుతనమునకు సంబంధము మిక్కిలి దగ్గఱిగా నుండును. దొంగవానికి వెన్నెల రుచించనివిధముగా

అంతుదానికిగూడఁ గాపురము రుచించదుగాన నీయిరువు రొక తెగవారు.

ఆ. దొంగమాటలాడ దొరకునె మోక్షము
చేతగానిపలుకు చేటుదెచ్చు
గురువుపద్దు గాదు గుణహైన్య మది యగు, వి.

గురువులమని చెప్పుకొనువారు దొంగమాటలాడిన ఫలము లేదు. దాన మోక్షమును కలుగదు. ఇది యెన్నఁటికి గురునిలక్షణముగాదు. గాన కపటగురువు లీగుణహీనతఁ దొలంగించుకొనుట యుక్తము.

ఆ. దొమ్మతెగులుచేత దూలినగేదెకు
వాతవేయ బ్రదికి వచ్చెనేని
ప్రాఁతయెనుముపాలు రోఁతనవచ్చునా? వి...

దొమ్మ తగిలిన గేదె వాతవేసినఁ బ్రదుకునేని గ్రాహ్యమే గాని పరిత్యాజ్యము గాదు. దానిపాలుగూడ నటులె గ్రాహ్యములు గాని త్యాజ్యములు గావు.

ఆ. ద్విజకులంబునందు తేజరిల్లుచుఁ బుట్టి
తాఁ దరించి యొరుల దాఁటఁ జేయ
లేనియాతఁ డున్న లేకున్న నొక్కటే, వి...2559

బ్రాహ్మణవంశమునందు పుట్టి తాను తరించి పరులనుతరింపఁ జేయలేనివాఁ డున్నను పోయినను నొక్కటే యగును.

ఆ. ద్విజుల ఖేదపెట్టి తిట్టఁ దొడఁగువాఁడు
మృతిని బొంది తాను వెతలఁ బడఁగ



గాలుదరినిజేరఁ గడతేఱలేఁడయా, వి...2560

అకారణముగ బ్రహ్మజ్ఞులగువారిని దూషించుచు వారిని ఖేదపఱచువారు చచ్చి నానావస్థలకు లోనై తుదకు యమలోకమునఁ జేరి యెన్నటికిఁ గడతేఱలేకపోవుదురు.

ఆ. దోసకారియైన దూసరికాఁడైన
పతితుఁడైన వేదబాహ్యుఁడైన
పట్టిలేనివేదవాని కీఁదగు నీవి, వి... 2561

దోసములు చేయువాఁడైనను తగవులమారియైనను కులహీనుఁడైనను వేదాచార దూరుఁడైనను బీదవాఁడైనచో వారిలోపములను బాటింపక దాతతోఁచినంత వాని కొసంగుట ధర్మము.

క. నందనుఁడు పెరిగి పెద్దల
కందఱకు విధేయుఁడైన నానందముగున్
పొందిక చెడి సత్పురుషుల
నిందను బడఁ జింత కలుగు నిక్కము వేమా!

తండ్రికి దనకుమారుఁడు పెఱిఁగి పెద్దవాఁడై నలుగురకుఁ దలలో నాలుకవలెనున్నచో గలుగునానందమునకు మేరలేదు. తగవు మాలి నలుగురిలో నిందాపాత్రుఁడగుచోఁ గలుగువిచారమునకు నటులే మేరయుండదు.

క. నలుగురుగలచోటను దా
దల చూపుచు మెలఁగుచుండి ధన్యత గనఁగాఁ
దలఁచెడియాతఁడు నిచ్చలు
గలమాటలె పలుకుచుండఁగాఁ దగు వేమా!

నలుగురిలోఁ దిరుగుచు గౌరవముగా వర్తింపఁ దలంచినవాఁడు యెల్లపుడు యథార్థము చెప్పుచుండవలయును. అటుల మెలఁగినచో మంచితనము దక్కును.

ఆ. నాగుబాము గన్న నంబిబ్రాహ్మణు గన్న
చెవులపిల్లి గన్న చేటువచ్చు
గరుడుని గనుఁగొన్న గలుగును కోరికల్, వి...

నాగుబాము అర్చకబ్రాహ్మణుఁడు కుందేలు ప్రయాణసమయములో నెదురు పడినచోఁ గార్యభంగమును, గరుడుఁడెదురైన నాకార్యము తప్పక సిద్ధించును.

ఆ. నిక్కమైన మంచినీల మొక్కటి చాలు
తళుకు బెళుకు రాలు తట్టెఁడేల
చదువ పద్యమరయ చాలదా యొక్కటి? వి...

నిక్కమగు నీలమొక్కటియె చాలినట్లు పిచ్చిపద్యములు వేలకొలఁది నేర్చియుండుటకంటె మంచిది యొక్కటియే నేర్చుకొనుట యుత్తమముగా నుండును.

ఆ. నిజము లాడువాని నిందించు జగమెల్ల,
నిజముఁ బల్కరాదు నీచులకడ
నిజమహాత్ముఁ గూడ నిజ మాడవలయురా, వి...

నిజము పలికినచో నీచులునిందింతురు గాన కాలోచితముగా వర్తింప వలయునుగాని నిజముపలుకవలెనని నీచులకడ దీక్షపట్టరాదు. నిజము మహాత్ముల వద్దను మాత్రమే పలుకనగును.



ఆ. నీతి జ్యోతి లేక నిర్మలం బగు నేది
ఎట్లు కలుగుఁ బరమ దెంత దైన
ధనము గల్గియున్న దైవంబు గలుగదు, వి...

నీతియను జ్యోతిసహాయము కాకున్నచో అజ్ఞానాంధకారావృతుఁడగు మానవుఁడు బ్రహ్మస్వరూపమును గుర్తింపలేఁడు. ధనము గలిగినంత మాత్రమున దేవుఁడు వారికిఁ బ్రత్యక్షమై కామితము లొసంగఁడు.

ఆ. నీతి దెలియఁ జెప్ప నిజముగ వేమన
పాతకముల నెల్ల బాఱఁబట్టి
లోతుతత్త్వ మరసి లోకులకును జెప్పె, వి...

వేమన మహాయోగి నీతితత్త్వము లోకులకు బోధించుటకై యేవేవి పాపకార్యములో ముందు స్పష్టముగా నెఱింగించి పిదపఁ దత్త్వరహస్యమును బోధింపసాగెను. గాన నీతిలేనిది తత్త్వము కుదురదు.

క. పగ యుడుగుఁ గోప ముడిగిన
పగ యుడుగఁ గోర్కు లుడుగుఁ బరజన్మంబుం
దగు లుడుగు భేద ముడిగిన
ద్రిగుణము లుడుగంగ ముక్తి స్థిరమగు వేమా!

ఇతరుల ద్వేషించు స్వభావము విడువఁదగినది. దానిని వదలినచోఁ గోపము దనంతఁ బోవును. దాన విషయవాంఛలు నశించును. పిదప జన్మాంతరాయాసములు అభేదముగా

వర్తించినచో తీరును. త్రిగుణము లుడిగిన ముక్తిసాధ్య మగును.

ఆ. పట్టి విడువరాదు పదిలక్షలకు నైనఁ
బెట్టి దెప్పరాదు పేద కైన
వెట్టిగొలువరాదు విభుఁ డెట్టి ఘనుఁడైన, వి...

ఎంతలాభము వచ్చినను సరే అభయహస్త మొసంగి చేపట్టిన వానిని విడువరాదు. నిరుపేదకైనను బెట్టి దెప్పరాదు. ఎంత ప్రభువు నైనను నీచుఁడైనచోఁ గొలువరాదు.

తే. పటుతరంబుగ తనయాత్మభావ మంది
నిటలదుర్గముపై నున్న నియతి మీఱి
ఘటము మఱచినవాఁడు పో ఘనుఁడు సుమ్మి
కుటిలకర్ముల కిది యెట్లు కూడు వేమ! 2571

నిశ్చలహృదయుఁడై హృదయమునందు ధ్యానించుచు తలంపును నిటలమున హత్తించి తన్నుతాను మఱచి సమాధిలో నుండువాఁడె యుత్తముఁడు. పాపాత్ములకిది యెన్నఁటికి సాధ్యము కాదు.

ఆ. పడుచు నిచ్చినతని బత్తె మిచ్చినవానిఁ
గడుపు చల్లఁ జేసి ఘనత నిడుచు
నడుప నేర నతఁడు నాలిముచ్చె గదా! వి...

కన్యకనిచ్చువానిని అన్నముపెట్టినవానిని ఎల్లప్పుడును గౌరవించుచునే యుండవలయును. అటుల గౌరవింపనివాఁడు మిగులఁ బాపాత్ముఁ డనఁదగును.



ఆ. పతకమందు నొప్పు బలురత్నముల పెంపు
బంగరందు గూర్పఁబరువు గనును
గాని యితరలోహ మైన హీనముకాదె, వి...

రత్నముల యందముకాంతి బంగరుపతకములోఁ జెక్కఁబడినపుడె తెలియును. ఇతరలోహములలోఁ జెక్కినవానికున్న కాంతియును సజ్జనదుర్జనసాంగత్యములిట్టివి.

ఆ. పత్తనములఁ గలరు ప్రౌఢాంగనలు వారు
పల్లెలందు నిలిచి బ్రదుకఁ గలరె
సుఖులు పరమదారి శోభింపఁజాలరు, వి...

పట్టణముల నేర్పుగల చెలువలు చాలమంది గలరు. వారిని బల్లెలలోనుంచినచో బ్రతుకఁజాలరు. అటులే సుఖమునపేక్షించువారు మోక్షమును బడయుట కెన్నఁటికిఁ బనికిరారు.

ఆ. పంది పిల్ల లీను పదునైదు నొకటిని
కుంజరంబ దీను కొదమ నొకటి
నుత్తమపురుషుఁ డటు లొక్కఁడు చాలఁడా? వి.

ఉత్తమగుణములను గలుగుకొమరు నొక్కని గనుటయే బహుసంతానముఁగనుటకన్న నుత్తమము. పంది పదునైదుపిల్లలఁ బెట్టుచున్నది. ఫలమేమి? ఏనుఁగు ఒకకొదమనే పెట్టుచున్నది. చూడుము.

ఆ. పదుగురాడు మాట పాటియై ధరఁ జెల్లు
నొక్కఁ డాడుమాట యొక్క దెందు
నూరకుండ వానికూ రెల్ల నోపదు, వి... 2576

ఒకఁడు మంచిచెప్పినను చెడుగుచెప్పినను బాటిచేయరు. తప్పో ఒప్పో పదిమంది యొకమాట చెప్పినచో తలదాల్చు చుందురు. అట్టితరుణములో మాటలాడక యూరకున్నవాఁడె ధన్యుఁడు. వాని నెవరేమి చేయలేరు?

ఆ. పనసతొనలకన్న పంచదారలకన్న
జుంటితేనెకన్న జున్నుకన్న
చెఱకురసముకన్న చెలులమాటలు తీపి, వి...

పనసతొనలు పంచదార జుంటితేనె జున్ను మున్నగుమధుర పదార్థములన్నిటికంటెను స్త్రీలమాటలు మిగుల మధురములుగా నుండును.

ఆ. పప్పులేనికూడు పరుల కసహ్యమై
యప్పులేనివాఁడె యధికబలుఁడు
ముప్పులేనివాఁడు మొదటిసుజ్ఞానిరా, వి...

పప్పులేని భోజనము భోజనమే కాదు. ఒరులకు బాకిపడని వాఁడె ధన్యుఁడు. ఐహికసంబంధములగు విషయనిర్బంధములకుఁ దగులుకొననివాఁడె జ్ఞానశాలి యని యెఱుంగవలయును.

ఆ. పరఁగ రాజకులులు పాతినధన మెల్ల
భటులపాలొ కవులపాలొ తలఁప
నొనర హీనజనుని ధనము దాయాదుల
పాలొ జారకాంతపాలొ వేమ! 2579

రాజులు పూడ్చినధనము భటులు కవులు మున్నగువారి



పాలు అగును. నీచులధనము దాయాదులపాల పడును. లేదా లంకుటాండ్రపాలగును గాని సుకృతమున కుపకరింపదు.

ఆ. పరులదత్త మొప్పి పాలన చేసిన
నిల స్వదత్తమునకు నినుమడియగు
నవనిపరులదత్త మపహరింపఁగ రాదు, వి...

పరులిచ్చిన ధర్మము పాలించినచో తా నిచ్చినదానికంటె రెట్టింపుఫలము నిచ్చును. ఎన్నఁటికి ధర్మార్థముగా పరులొసంగిన ద్రవ్యము నపహరింపరాదు.

ఆ. పరులమేలు చూచి పలుగాకివలె నేడ్చి
వట్టిమాటలాడువాఁ డధముఁడు
అట్టివాని బ్రదుకు టది యేల మంటికా, వి...

పరుల మేలున కోర్వలేనివాఁడు అధముఁడేయగును. మనుజుఁ డితరుల శ్రేయస్సుల కానందింపవలయును. అటులానందింపని వాని బ్రదుకొక బ్రదుకుగాదు.

ఆ. పరులవిత్తమందు భ్రాంతిమానినయట్టి
పురుషుఁ డవనిలోనఁ బుణ్యమూర్తి
పరులవిత్త మరయ పాపసంచిత మగు, వి...

పరద్రవ్యమునందు ఇచ్ఛ మానినవాఁడే విచారించినచో పుణ్యమూర్తి యగును. పరులవిత్తమును సంగ్రహముచేయ నెంచుట పాపమును మూఁటఁగట్టుకొనుటయే!

ఆ. పలుగువాని కేల పరసమృద్ధి దలంపఁ
బలుకు వరుసవానిబలిమితప్ప

చలమువాని కేల సాత్వికధర్మము? వి... 2583

ఓరువలేనివానికిఁ బరుల యైశ్వర్యాదికములు రుచించవు. తనగొప్పతనమునకె తా నానందించును. అటులే పట్టుదలగల్గి తనమాటయే నెగ్గవలయు ననువానికి శాంతగుణము గూడ రుచింపదు.

ఆ. పలుతెఱఁగులుగాను బగ యుండుచోటుల
చిటుకు మనఁగ ప్రియముఁ జెప్పవలయు
కాల్పఁదగినకట్టె కడఁకతో మ్రింగదా, వి...

అనేకవిధముల శత్రుత్వ మున్నను ప్రియమును మాత్రము త్వరగా నెఱింగింపవలయును. కట్టె అగ్నిలోఁబడి రూపుమాయు నట్లు తగవును శాంతవాక్యములతో రూపుమాయును.

ఆ. పాడి గాదు జగతి పంచాంగములు సెప్పి
కొంచెమైన బుద్ధి నొంచ లేక
బ్రహ్మ మెఱుఁగ కిట్లు పౌరోహితము జేయ, వి.

బ్రహ్మము నుపాసింపక బ్రాహ్మణు లీవిధమున పంచాంగమును చెప్పుట పౌరోహిత్యము చేయుటయును మంచిది కాదు. బ్రహ్మస్వరూప మెఱుంగుట ముఖ్యము.

ఆ. పాపరాశిఁ బుట్టి పాపంబు దెలియక
పాపబుద్ధిచేత బరఁగియుండు
భక్తి గలిగియున్న పాపంబు లేదయా, వి...

మనుజుఁడు పాపరాశిలో జనించియుఁ బాపమనేమో



తెలిసికొనక పాపబుద్ధులతో మెలఁగుచుండును. భక్తియున్నచో నట్టిపాపము లెన్నఁటికి మానవు నావరింపఁజాలవు.

ఆ. పాలపక్షి శకున ఫల మిచ్చు నందురు
పాలపక్షి కేమి ఫలము తెలియు
తనదు మేలు కీళ్లు తనతోడ నుండఁగ, వి...2587

శకునములు పాలపిట్టవలనఁ దెలియునని మూర్ఖులు భ్రాంతి పడెదరు. పాలపిట్టకు ఆగామిఫలము లెట్లు తెలియును? తన మంచి తనచెడుగు తనతోనుండ పక్షియెట్లు నిశ్చయించును?

ఆ. అన్న మధిక మైన నరయ మృత్యువు నిజం
బన్న మంట కున్న నాత్మ నొచ్చు
చంపఁ బెంప బువ్వ చాలదా వేమేల? వి...

అన్నము మితిమీఱితిన్నచో అజీర్ణాదికములచే మరణించుట నిశ్చయము. అన్నము తిననిచో ఆత్మ మిగుల క్షోభించును. కావున మనుజుల చంపుటకు వృద్ధినొందించుటకు అన్నమొక్కటియే చాలును.

ఆ. అన్న మిడుటకన్న నధికదానంబుల
నెన్ని చేయనేమి యెన్న బోరు
అన్న మెన్న జీవనాధార మగునయా, వి...

జీవనాధార మగుటచేత అన్నదానముకంటెను మించిన దాన మింకొకటి యుత్తమమైనది లేదు. ఏదానమువలనను జనులు తృప్తిపడరుగాని యన్నదానమువలన దృప్తిపడుదురు.

ఆ. ఆరుగురుని జంపి హరిమీఁద ధ్యానంబు
నిలిపి నిశ్చయముగ నెగడి యాత్మ
గతి నెఱుంగుచుండు ఘనుఁడగుయోగిరా, వి.

అరిషడ్వర్గములను జంపి ఈశ్వరునిపై మనస్సును నిలిపి ముక్తుఁ డగుటకై యత్నించువాఁడె ఆత్మశుద్ధిగలవాఁడు. వాఁడె యోగియనఁదగినవాఁడు.

ఆ. ఇన్ని ఫలములందు నేఫలం బెక్కువ
అన్నఫలముకంటె నధికమేది
కన్నది గననిది కాన్పించునారూపు, వి... 2591

పుణ్యము లన్నింటికంటె గొప్పదియు, అన్నదానఫలముకంటె నెక్కువయైనదియు నేదియనినచో దృశ్యాదృశ్యములను జూపగల యాత్మజ్ఞానమే గొప్పదిగాఁ జెప్పనగును.

ఆ. ఊకయందుఁ బుట్టి యున్నది యన్నంబు
మ్రాకునందు ఫలము మానితమగు
సోకుగాలిపట్టి శోధించుచుండురా, వి... 2592

ఊకగల ధాన్యములనుండి యన్నము లభించుచున్నది. ఫలములు మ్రాకులనుండి లభించుచున్నవి. వాయువు వీచి జీవులదేహముల శోధించుచు శుద్ధి చేయుచున్నవి.

ఆ. దానములను నన్నదానమే దొడ్డది
గానములను సామగాన మెచ్చు
ధ్యానములను శివుని ధ్యానమే శ్రేష్ఠంబు, వి.



దానములలో నన్నదానమును గానములలో సామగానమును ధ్యానములలో శివధ్యానమును ఉత్తమములు.

క. భయమంతయు దేహమునకె
భయ ముడిగిన నిశ్చయంబు పరమాత్మునకే
లయమంతయు జీవునకే
జయ మాత్మకు ననుచు జగతి చాటుర వేమా!

భయక్రోధాదులవలని భయములన్నియు దేహమునకె. భయ ముడిగినచో పరమాత్మ సాక్షాత్కారమగును. దేహమునకు నశించుట తప్పదు. ఆత్మకుఁ గడకు విజయము కలుగుననుట సత్యము.

ఆ. భారతమునఁ బలుకు పలుధర్మములయందు
సత్యనిష్ఠ మేటిసత్యమె కద
వసుధ దాన కలుగు వన్నియ మిన్నయా, వి.

భారతములోని ధర్మము లన్నిటిలో సత్యనిష్ఠయే యుత్తమ ధర్మ మనఁ బడెను గాన దాని నవలంబింపుము. సత్యనిష్ఠవలన వచ్చు కీర్తికి సాటియేలేదు.

ఆ. భావ మరసి తన్ను భార్య సేవించిన
నింటి కైన నగును నీశ్వరుండు
అదియు లేక బ్రదుకు టధమము భువిలోన, వి.

తనమనస్సును కనిపెట్టి భార్య యనుకూలయై తన్ను సేవించినచో ఈశ్వరుఁడు తనకు సదా సన్నిహితుఁ డైయేయుం

డును. అదిలేని సంసారి బ్రదుకుకంటె నధమము వేఱొకటి లేదు.

ఆ. భాషలాడ కున్న పరులు మెచ్చరు గాన
భాషలాడవలయు పరువుఁ జూచి
భాష పరువు తెలుఁగు పరమాత్ముఁడెఱుఁగురా, వి.

మాటలాడనిచో వ్యవహారము జరుగదు. కావున ఎంతటి వాని యయ్యును వ్యవహారమునకై భాషించుచునే యుండవలయును. మాటల సత్యాసత్యములను బరమాత్ముఁడు చూచుచునే యుండును.

ఆ భూపతికృప నమ్మి భూమి చెఱచువాఁడు
ప్రజలయుసురుదాఁకి పడును పిదప
నెగురవేయు బంతి యొగదాఁక నిలుచురా, వి.

రాజుల నాశ్రయించి ప్రజలవృత్తులను దోఁచుకొను మంత్రి ప్రజల యుసురుదాఁకి యెన్నఁటికైనఁ జచ్చును. ఎగురవేసినబంతి యెన్నఁటికైన క్రిందఁబడకుండునా?

ఆ. భూమి నాది యనిన భూమి పక్కున నవ్వ
దానహీనుఁ జూచి ధనము నవ్వ
కదనభీతుఁ జూచి కాలుఁడు నవ్వును, వి...

అస్థిరములగు దేహములుగల యీమానవు లీభూమి నాదియనిన భూదేవత పరిహసించును. దానహీనుని గాంచినచో ధనము పరిహసించును. యుద్ధమునకు భయపడు పిఱికివానినిగాంచిన యముఁడు నవ్వును.



ఆ. భూమిపేరువల్ల పుణ్యస్థలములాయె
వెలయ రాళ్లవల్ల వేల్పులాయె
నీళ్లపేరువల్ల నిఖిలతీర్థము లాయె, వి... 2600

పుణ్యక్షేత్రములకు మహిమ భూములనుబట్టియే యేర్పడుచున్నది. రాళ్లవలననే దైవత విగ్రహము లేర్పడుచున్నవి. నీళ్లవలననే తీర్థరాజము లేర్పడుచున్నవి. సామాన్యు లిది గ్రహింపఁజాలరు.

ఆ. భూమిమీఁద పుణ్యపురుషులు లేకున్న
జగము లేల వెలుఁగు పగలు రాత్రి
అంత బయలు కాదె యాఁడకాఁడకుఁ జూడ, వి

పుణ్యాత్ములు భూలోకమున నుంటవలననే సూర్యచంద్రులుదయించుట ఎండ వెన్నెలలుగాయుట పగలురాత్రులు కలుగుట తటస్థించుచున్నది. లేనిచో ప్రపంచమంతయు బంగరుబయలయ్యెడిదే!

ఆ. మగువకాలమందు మగువ కష్టించిన
సుతుల కాలమందు సుఖముఁ జెందు
కలిమిలేము లెంత గల వెంతవారికి
బలిమిపుత్త్ర బలిమె బలిమి వేమ! 2602

ఆఁడుది కష్టకాలమువచ్చి తనబిడ్డలుపసివారుగానున్నపుడు శ్రమపడినచో బిడ్డలు పెద్దవారైన పిదప ఆకష్టములన్నియుఁ దీఱిపోవును. కాన పుత్త్రసంపదవంటిసంపద స్త్రీకి వేఱొకటి లేదనుట సత్యము.

ఆ. మగనిమీఁద భక్తి మానకుండినకాంత
మూఁడులోకములను ముక్తి గనును
మగువలందఱకును మగలె దేవతలయా, వి...

మగనిపైని భక్తి గలిగినస్త్రీ ముల్లోకములను చూఱకొనఁ జాలును. కావున స్త్రీలకందఱకును భర్తలే దైవములు.

ఆ. మనసు దెలిసి యొకనిమాటకు బ్రతిచెప్ప
సంతసించు నతఁడు చాల మెచ్చు
మనసు తెలియకున్న గునిసుచు నను నేదో, వి.

మనసు కనిపెట్టి పలికినచో నెంతటివారైనను సంతసింతురు. ఎదటివానిమనస్సు గుర్తింపక యేదియో పలికినచో వారు గునిసి వ్యతిరేకింతురు.

ఆ. మనుట లెల్ల కల్ల మన సెల్ల దొంగ యిం
కేటిప్రాణ మింక నేటిబ్రదుకు
మాట సత్యమైన మరి శతాయుష్యంబు, వి...

మనుట లన్నియును కల్లలు. మన స్సొకదొంగ. ఇట్టిస్థితిలో శతాయుష్యాదులు ఎట్లు కలుగును? మాటమాత్రము సత్యమైనచో శతాయుష్యము కలుగును.

ఆ. మైలకోకతోడ మాసినతలతోడ
నొడలిముఱికితోడ నుండెనేని
అధికకులజునైన నట్టిట్టు పిలువరు, వి... 2606

ఎంత యుత్తమకులజులైనను తలమాసి యొడలుమాసి మఱికిబట్టలతోఁ బరుల నాశ్రయించినచో వానిని దప్పక గేలి



చేయుదురుగాని గౌరవింపరు. అందులకై శుభ్రముగానుంట మంచిది.

ఆ. మాటఁ జెప్ప వినని మనుజుఁడు మూర్ఖుఁడు
మాట విన్న నరుఁడు మాన్యుఁ డగును
మాట వినఁగఁ జెప్ప మానుట కూడదు, వి...

ఎదటివాఁడు చెప్పుమాటలోని మంచి చెడుగులు గుర్తించి యాలకింపనివాఁడు మూర్ఖుఁడు. మాటవిన్నవాఁడు ఉత్తముఁడు. ఇతరులు ఉచితవిషయము వినుట లేదని న్యాయశాలి యెన్నఁటికిఁ దానెఱింగిన తగవు చెప్పుట మానుకొనరాదు.

క. మాయిల్లని మాపాల మని
కాయము తనసొమ్మటంచు గామాతురుఁడై
మాయని పదవిని గోరక
దాయాదులపాలు చేయఁ దగదుర వేమా!

సర్వమును తాను తనది యనుమమత్వము నుంచికొని యనశ్వరమగు పదవినిబొంది బ్రదికినాలుగునాళ్లు విఱ్ఱవీగి మోక్షాపేక్షమాని కడకు. ఉన్నదంతయుఁ బాలివాండ్ర పాలుచేయుట తగదు.

ఆ. మాల మాలగాఁడు మహిమీఁద నేప్రొద్దు
మాట తిరుగువాఁడె మాలగాక
వాని మాల యన్న వాఁడెపో పెనుమాల, వి...

నిజమును విచారించినచో మాలవానికంటెను మాట తిరిఁ

గెడివాఁడే ఎక్కుడు మాల యగును. కులము మాలను అంత్యజుఁడనువాఁడే అంత్యజుఁడు.

ఆ. మాలవాఁడయినను మఱి యాత్మమీఁదను
మనసునిలిపెనేని మాలగాఁడు
మనసు నిలుపకున్న మహిమీఁద మాలఁడౌ, వి.

మాలవాఁడైనప్పటికిని ఆత్మధ్యానము గలిగినచో వాఁడు మాల కానేరఁడు. అగ్రవర్ణుఁడు అయ్యు ఆత్మజ్ఞానశాలి కాఁడేని యట్టివాఁడే మాలవాఁడగును.

ఆ. మాలవానిఁ జూచి యేల నిందింపంగ
పాటిలేనిమాట పలుకుటే గద
వానిలోనఁ బలుకువానికులం బేది? వి... 2611

పాటిలేనిమాటలఁ బల్కుచు మాల యని యేలయనెదరు? వాఁడు మాలయైనచో వానిలోనివాఁ డెవ్వఁడో తెలిసికొనుఁడు. ఆత్మకులేని కులభేదములు మనుజులకేల?

ఆ. ముండమోపి కేల ముత్యాలపాపట
వన్నె లెల్ల పుణ్యవతికిఁగాక
కుక్కయేపి కేల కుచ్చులపల్లంబు, వి... 2612

ముండమోపికి ముత్యములపాపట నిరర్థకము. అట్టియలంకారము పుణ్యకాంతకే తగును. అట్టులే కుక్కకు గుఱ్ఱమునకుఁ గట్టఁదగిన కుచ్చులపల్లము గట్టుటయును నిరర్థకము.

ఆ. మేడిపండుఁ జూడ మేలిమై యుండును
పొట్ట విచ్చిచూడ పురుగు లుండు



బెరుకువాని మదిని బింక మీలాగురా, వి...

మేడిపండు బయటి కెంతయు మనోహరముగా నుండును గాని విచ్చిచూచినయెడల లోనఁ బురుగు లసహ్యముగా నుండును. అటులే నీచుఁడు బయటికి బాగుగాఁ గానవచ్చినను లోన నెంతయో విషముండును.

ఆ. రజ్జులాడరాదు రణభూమిలోపల
బుజ్జగింపరాదు బొంకువాని
నొజ్జతోడ వాదు లొనరంగ మానరా, వి...

రణరంగమునఁ దమలోఁ దాము తగవులాడరాదు. బొంకువానినిచేరదీసి వానిని గౌరవింపఁదగదు. గురువులతో నెన్నఁటికి వాదు లాడరాదు. ఇవి యనర్థకములు.

ఆ. లక్ష్మి యేలినట్టిలంకాధిపతిపురి
పిల్లక్రోఁతి పాజు కొల్లఁబెట్టె
కలసివచ్చువేళ ఘను లౌదు రల్పులు, వి...2615

లక్ష్మికి నిలయ మనఁబడిన లంకేశునంతటివానినగరు కూడ క్రోఁతులు కొల్లఁబెట్టినవి. కాల మనుకూలింపనిచో నల్పులు ఘనులగుదురు. ఘను లల్పులగుదురు.

ఆ. వసుధ నొడ్డెకేల వైద్యకార్యంబులు
గ్రుడ్డివాని కేల గునుగుపరుగు
బుడ్డవాని కేల పో కుప్పిగంతులు, వి... 2616

ఒడ్డెవానికి వైద్యమును గ్రుడ్డివానికి పరుగులెత్తుటలును బుడ్డవానికి కుప్పిగంతులు సాధ్యములుకావు.

ఆ. వావివర్తనలును వరుసలు మర్యాద
దప్పి నడచెనేని తగులుకీడు
వదల దపుడు తాకువందురఁ దప్పదు, వి...

వావివర్తనలును వరుసయును మర్యాదయును తప్పినడచెడివాఁడు ఎప్పుడో యొకప్పుడు కీడును పొందనేపొందును. అపుడేడ్చి పశ్చాత్తాపపడియు లాభములేదు.

ఆ. విద్య గలిగి యుండి వినయము లేకున్న
వైదుపలకు మేలిమైనమణుల
సొమ్ము లుండి కంఠసూత్రము లేనట్టు, వి...

విద్య యున్నను వినయము లేకపోయిన పండితులపాండిత్యము, సొమ్ములుండియు మంగళసూత్రము లేనికాంతల జీవితమువలె నిష్ఫలము.

క. విద్యలలోపల నీతియు
వాద్యంబులోన వీణ వరరసికులకున్
హృద్యంబై విలసిల్లును
విద్యలలో బ్రహ్మవిద్య విద్యర వేమా! 2319

విద్యలలో నీతియును బ్రహ్మవిద్యయును వాద్యములలో వీణయును హృద్యమై విలసిల్లుచుండును.

ఆ. విశ్వనాథునందు విప్రులయందును
విభునియందు వేదవిధులయందు
భక్తిలేనివాఁడు పాపాత్ముఁ డిలలోన, వి. 2620

శివునియందును బ్రాహ్మణులయందును రాజులయందును



వేదశాస్త్రములయందును భక్తిలేనివాఁడు మిగులఁ బాపాత్ముఁడు.

ఆ. వెలఁదిచక్కఁదనము వెలువైన యీడును
విభునికరుణ లేమి విగతి నుండు
నీదు కరుణ లేమి నేర్పులు కొరగావు, వి...

స్త్రీకి చక్కఁదన మెంత యున్నను పెనిమిటికరుణలేక ప్రకాశింపనట్టులనే దేవునిదయలేక ఎట్టినేర్పులును కొఱగావు. కాన దైవానుగ్రహము సంపాదింపఁదగినది.

ఆ. జవ్వనంబునందు జవరాండ్రతో పొందు
గోరకుండువాఁ డి కేడ లేఁడు
కాని దాని గోరకయె యున్నఘనుఁడురా, వి...

యౌవనమునందు జవరాండ్రపొందుగోరక యుండువాఁడే యుత్తముఁ డనఁదగినవాఁడు. అట్టియుత్తములు మిగుల నరుదుగానున్నారు. వారు వంద్యులు.

ఆ. జడలు దాలుచుటకు జగము ఛీ యనునట్లు
నొడలు విఱచుటెల్ల యోగమెల్ల
ముక్తికాంతతోడ ముద్దాడుటకెగదా, వి.

లోకులంద అసహ్యించుకొనునటుల జడలుదాల్చుటయు, ఒడలు విఱిచి తిరుగుటయు యోగముల నభ్యసించుటయుం మోక్షమును బొందుటకే యనుమాట సత్యము.

ఆ. తలను వ్రేలవేసి తాలిమి లేకయ
యోగి తెఱచు గనులు మూయుచుండు

జ్ఞాన మింక నెట్టుండు కష్టజీవికి చెపుమ, వి...

డాంబికులగు యోగులు లోకులను వంచించుటకై తల త్రేలవైచి కనులఁ దెఱచుచు మూయుచు ద్రవ్యసంగ్రహపరాయణులై యుందురు. ఇట్టివారికి జ్ఞానముకలుగుననుట కల్ల.

ఆ. కసవు సేతి తినెడుపసరముఁ దినువాని
మాల యండ్రుగాదె మహిని నరులు
పట్టి కోడిఁ దిన్న బాప లటందురా? వి...

కసవుతిని క్షీరములొసంగి మనుజుల కుపకరించు పశువులను దినువానిని మాలవాఁడని ప్రజలాడుచున్నారు. తృణధాన్యములు దినుకోడిని తినువానిని బ్రాహ్మణుఁడని యనుట యుక్తమగునా? (బ్రాహ్మణునకు మాంసభక్షణము యుక్తముకాదని భావము.)

ఆ. కాననంబుఁ జేరి కడుశ్రమ నొందిన
నానలుండు రాజ్యమందె మరల
కష్టములకు నోర్వఁగల్గును సుఖములు, వి...

అడవులఁ బడి యిడుమలఁ బడినందున నలుఁడు చివరకు రాజ్యము నొందెను. కావున కష్టముల నోర్చుకొనిన సుఖములు కలుగును. కష్టము లొందనిది సుఖము లబ్బవు.

ఆ. కాలకంఠు నెదిరి ఘనముగాఁ బోరిన
నర్జునునకు వశము కర్జమైన
పాశుపతము గలిగె పగతుర దునుమాడ, వి...

కాలకంఠు నెదిర్చి పోరినయర్జునునకు పాశుపతము లభించెను. కావున పోరుటకైనను గొప్పవానితోడనే యత్నింపవలయును. అపుడు శ్రమ ఫలమునకు వచ్చును.



ఆ. కావిబట్టఁ గట్టి ఘనయోగివలె నుండి
వెలయ రాత్రిగాఁగ విడిచిపెట్టి
తొడరి తిరుగువాఁడు దొరకోలు సన్న్యాసి, వి...

కావిబట్టలు గట్టికొని యుండి పగలంతయు డంబముగాఁ దిరిగి రాత్రి కాఁగానే విడిచివేసి మేలిదుస్తులతో తిరుగుచుండెడివాఁడు దౌర్భాగ్యపుసన్న్యాసి యగును.

ఆ. కావుకావు మంచు కరుణకై యేడ్చెడి
శిశువు చేరఁ దీసి చిత్తమలర
పాల నిచ్చునట్టి పడఁతి పుణ్యాత్మరా, వి...2629

ఎదటబిడ్డ పాలులేక కావు కావని యేడ్చుచున్నపుడు చేరఁ బోయి బిడ్డకుఁ దనివిదీరునటుల మనస్ఫూర్తిగాఁ బాలొసంగు స్త్రీరత్నమును పుణ్యాత్మురాలని ప్రశంసింపవలయును.

ఆ. కాశినీళ్లు మోసి కాళ్లు మొగము వాచి
యెందు సుఖము లేక నెండి యుండి
చచ్చి వెనుక ముక్తి సాధింపఁగలరొకో! వి...

కాశిగంగయని నీళ్ళను మోసిమోసి బుజములు పుండ్లుపడి చచ్చినపిమ్మట ముక్తిని సాధింపఁగలరో లేరో కావున ముందుగనే ముక్తికై యత్నింపవలయును.

ఆ. కాశియాత్రఁ జేసి గాసినొందఁగ నేల
రోయుగుణవికారరూప మడఁచు

మోసపోక యెఱుక మూలంబు గనుచుండు, వి.

తీర్థయాత్రలకని కాశిరామేశ్వరములకని నానావస్థలనొంద వలసిన యవసరములేదు. త్రిగుణముల వికారమునడంచి యజ్ఞానములలోనుగాక బ్రహ్మస్వరూపమును గనువాఁడు ధన్యుఁడు.

ఆ. కుండ పగిలె నేని క్రొత్తది గొనవచ్చు
భూతలంబునందు పొందుగాను
కూలఁబడిననరుఁడు కుదురుట యరుదయా, వి.

కుండపగిలిపోయినచోఁ గ్రొత్తకుండఁగొని కుండలేనిలోటు తీర్చుకొనవచ్చునుగాని యింటికైనమగవాఁడు చనిపోయినచో నాలోపము నేవిధముగనైన సవరింప శక్యముకాదు.

ఆ. కొంపలోన మఱుఁగు కోకలోన మఱుఁగు
కన్నతల్లిమఱుఁగు కడుపుమఱుఁగు
ఇన్నిమఱుఁగు లందు నీశుఁడు మఱుఁగురా, వి.

ప్రపంచమంతయును మఱుఁగులతో నిండియున్నది. ఇంటిలోని గుట్టు మఱుఁగు, వలువలోని యవయవము మఱుఁగు, మాతృగర్భము మఱుఁగు, కుక్షి మఱుఁగు ఇన్ని మఱుఁగులు మానవవిషయములోనుండ నిఁక బరమాత్ముఁడు మఱుఁగనుటలో నాశ్చర్యమేమున్నది!

ఆ. గంగ స్నానమాడి ఘనులైనవారెల్ల
భంగపడిరి పెక్కుబాధ లంది
గంగనీటికన్న గయతీర్థముల కన్న
నెన్న వేముతీర్థ మెచ్చు వేమ! 2634



గంగాస్నానముచేసిన భవబంధములనుండి ముక్తులము గావచ్చునని తలంచినవారందఱు రోగాదులచే నానావస్థల పడుచున్నారు. అట్టివారికి గంగా గయాతీర్థములకంటె వేపచెట్టు ద్రవమె ఆరోగ్యకరము.

ఆ. గురుని సేవఁ జేసి గురితోడ భుజియింప
వలెనటంచు నరులు వాంఛదీఱఁ
బలుకుచుంద్రు గాని భావంబు గానరు, వి...

గురుని సేవించి లక్ష్యముతో నతనిపంక్తిని భోజనము చేయవలయునందురే కాని యందలి యంతరార్థమును కనలేరు. గురునివద్ద విజ్ఞానమొందుట యన్నిఁటికంటె ముఖ్యము.

ఆ. గొడ్డుటావుఁ బిదుకఁ గుండఁ జేకొని పోవ
పండులూడఁ దన్ను బాల నియదు
లోభివాని నడుగ లాభంబు లేదయా, వి...

గొడ్డుటావు బిదికిన పాలులేక పైఁగా పండ్లూడదన్నినట్టులనే లోభి నడిగినను ప్రయోజనము లేకపోవును.

ఆ. చిన్ననాఁటినుండి చేసినకర్మంబు
పిన్నపెద్దలకును బెరిగి వచ్చు
మంటి మింటి నడుమ మది నిల్పి చూడగా, వి.

బాల్యమునుండి చేసినకర్మ మెంతవారికి అయినను అనుభవమునకు రాకమానదు. దానినుండి విముక్తి కాఁ దలంచితివేని భూమ్యాకాశములు నిండియున్న జ్యోతిర్మూర్తిని దర్శింప యత్నింపుము.

ఆ. చీము గారుపంట చెదలుపట్టినయింట
బురుగుముట్టుగుంట బుసులకంట
బిడ్డచీకుచంట బిగి యుండ నేర్చునా? వి...

చీముగారుచున్న దంతములకును చెదలుపట్టియున్న యింటికి పురుగులతో నిండియున్న కొలనునకు పుసియోడ్చుచున్న కంటికి బిడ్డపాలు చీకుచున్న చన్నుగవకు బిగిత మించుకయేని యుండఁజాలదు.

ఆ. చదువుఁ జదువకున్న సౌఖ్యంబులును లేవు
చదువుఁ జదివెనేని సరసుఁ డగును
చదువు మర్మ మెఱిఁగి చదువఁగఁజూడుము, వి.

చదువునేర్వకున్న మానవున కెట్టిసౌఖ్యము లభింపఁజాలదు. చదువుకొన్నవాఁడే సరసుఁడు. చదువుకొనువాఁడు విద్యలలోని మర్మము గ్రహించుటకుఁ జదువవలయును గాని వృథా పఠన మొనర్పఁదగదు.

ఆ. ఛత్రమున్నఁ దగిన ఛాయ యేర్పడియుండు
శాస్త్రమెఱుఁగఁదగినజ్ఞాన మొదవు
నబ్బయున్నవాని కండయున్నట్టులే, వి...2640

తండ్రిగలవాని కండయున్నటుల ఛత్రమున్నవానికి నీడ లభించునటుల, శాస్త్రపరిచయముగలవానికి జ్ఞానముకలిగి తీఱు ననుట సత్యము.

ఆ. తావు తెలిసినతఁడు తాపీలు వెంబడి
ఏవిధముననైన నిరవు సేరు



భావ మెఱుఁగకున్న పర మెఱుంగుట యెట్లు? వి.

స్థానము నెఱింగియున్నచో ఎట్లైనను ఇల్లు చేరఁగలుగు నట్లే భావ ముండినచో పరేశ్వరు నెట్లయినను పొందగలఁడు. గాన సద్భావము సాధకున కావశ్యము.

ఆ. తావు తప్పకుండ తనమనంబున నిల్పి
తావుఁ జేరునట్లు తంత్రపఱచి
తాను దావుఁ జేర తావుఁ దా నేకమౌ, వి...

హృదయమును విషయాదులపైకిఁ బోకుండ నిలిపి మోక్షముపైఁ బదిలపఱచి బ్రహ్మస్వరూపమును గాంచఁగలిగినచో తాను బ్రహ్మస్వరూపముతోఁ గలియవచ్చును.

ఆ. తోఁక గల్గువాని దొడరిగొంతులు గోసి
మేఁకజీవములను మెడలు విఱిచి
కడమవాని నెల్ల గాల్చుక తిందురు, వి...

మాంసాహారులగు మానవులు జీవవాత్సల్యమును బోనాడి జిహ్వాచాంచల్యలోలురై గొఱ్ఱెలు మేఁకలు లోనగు జీవములను దిని కడుపునించుకొనుచున్నారు. ఇది మిగుల నీచకార్యము.

ఆ. దున్నపోతుమడక దురుతుగా సాగదు
ఎద్దుమడకకంటె హెచ్చుగాదు
ముద్దరాలి మగఁడు ముదుసలి మెచ్చునా? వి.

దున్నపోతుతో దున్నసాగినయెడలఁ గొంచెమేని పనిగాదు. ఎద్దులమడక యొంతయో మంచిది. పడుచువాఁడు ముదుసలిని

మెచ్చునట్లు ఎద్దుమడకముందు దున్నపోతుమడకను లోకులు మెచ్చుకొనరు.

ఆ. నియమమునను వేత్త నేమంబు నొనగూర్చి
షోడశోపచారసూక్తు లిలను
జేసి శివుని నెపుడు సేవించుచుండును, వి...

వేదవేత్త నియమముతో షోడశపూజల నెప్పుడు నీశుని పూజించి సంతుష్టునిఁ జేయుచుండును.

ఆ. నోటిపుప్పి కెల్ల నొప్పి లేకుంటకు
నాకుపోకసున్న మౌషధముగఁ
బెట్టకుండెనేని బెనురోఁత వేయురా, వి...

నోటిపుప్పికి నొప్పిపోవుటకై మందు వేయనిచో రోఁత పుట్టించును. దానికి ముఖ్యమగుమందు ఆకు పోక సున్నముతోఁ గూడిన తాంబూలమె!

ఆ. నేర్పు గలుగువారు నెఱతనముగలారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిఁడిగలుగువారి బానిసకొడుకులు, వి...2647

సమస్తవ్యవహారములలో నేర్పరులు, వ్యవహారవేత్తలు, విద్యగలవారమని విఱ్ఱవీగువారు, ద్రవ్యవంతునకు బానిసకొడుకు వంటివారు ద్రవ్యములేని వీరిప్రజ్ఞ నిరర్థకము.

ఆ. పట్టువస్త్రములను పరఁగ భూషణములను
కుదువ లిడుట లెల్ల గొదువ పద్దు
లనుభవింపకూడ దతఁ డెట్టివాఁడైన, వి...



పట్టువస్త్రములను భూషణములను కుదువయుంచుట కాని పని. తానెంతవాఁడైనను కుదువవస్తువులను ఋణదాత యుపయోగింపఁదగదు.

ఆ. పరుల కుపకరించి పరుసొమ్ముపరునకుఁ
బరఁగ నిచ్చెనేని పరము కలుగు
బరముకన్న నేమి పావన మాసొమ్ము, వి...

ఇతరుల కుపకరించి వారిసొమ్ము వారికిచ్చివేసినఁ బరము కలుగును. విచారించినచో పరముకంటెను ఆసొమ్ము అంత ఎక్కువ పవిత్రమైనది కాదు. గాన ఋణ ముంచుకొనఁదగదు.

ఆ. పరుల మోసపుచ్చి ధర ధన మార్జించి
కడుపు నించికొనుట కానిపద్దు
ఋణము సేయుమనుజుఁ డెక్కువ కెక్కునా? వి.

ఇతరులను మోసము చేసి ధనము నార్జించుటయును ఋణము తీయుటయును తగనికార్యములు. ఋణముచేసినవాఁ డెంతవాఁడైన మంచిపేరు గడింపలేఁడు.

ఆ. పరులు చదువఁ జూచి నిరసనబుద్ధితో
వట్టిమాటలాడ వ్యర్థుఁ డగును
అట్టివానిబ్రదుకు లరయఁగా నేటికి? వి...2651

ఇతరులు చదివికొనిరని ఏవగించువారుపరమమూర్ఖులు. అట్టివారున్నను పోయినను ఒకటియే యగును.

ఆ. పూసపోగుఁ బెట్టి పురుషునిబుజ మెక్కి
కన్నులార్చి వారకాంతఁ జేరి
తనకు లొంగువానిఁ దడయక చంపురా, వి...

వేశ్య పరపురుషుల వలపించుటకై సొమ్ములుపెట్టికొని మగవాండ్ర బుజములు పట్టుకొని కనులార్పుచు గులుకుచు నటించి తనకు లొంగినవాని ప్రాణము లెపుడో నిలువునఁ దీయును.

ఆ. పెట్టెడిపతియింటఁ బెట్టనిలోభున్నఁ
దిట్టితిట్టి తిరుగఁ గొట్టుచుండు
పండినచేనిలో పల్లేరుఁ బోలును, వి.... 2653

దాతయగు ప్రభువు గృహములో లోభియున్నచో యాచకులను త్రిప్పి త్రిప్పి వెడలఁ గొట్టుచుండును. దాతను విడువని లోభి పండిన చేనిలోనున్న పల్లేరుకంపవంటివాఁడు.

ఆ. బాపఁ డెముకకూడు భక్షింపసాగెను
బోవు పేరటంబు బొచ్చుముండ
కులముమానముడుగఁ గోర్కులు మెండయ్యె, వి.

కలికాలవశమున వర్ణాశ్రమధర్మము లడుగంటుచున్నవి. బ్రాహ్మణులు మాంసాహారు లగుచున్నారు. వితంతువులు వెండ్రుకలు గొఱిగించుకొనక పేరటములు చేయుచున్నారు. కులగౌరవములు రూపుమాయుకొలఁది జనులలో నీచబుద్ధులతిశయించుచున్నవి.

ఆ. బాపలన్న దొడ్డపరువునఁ జూతురు
కానిపనులు సేయ హీనులండ్రు



కులము లెక్కయేమి గుణము ప్రధానంబు, వి...

బ్రాహ్మణులనిన గౌరవించెదరు కాని అనుచితములను చేసినచో వారినికూడ హీను లందురు. కులమును బట్టి కాదు గుణమునుబట్టి జనుల గౌరవింపవలయును.

ఆ. బిడియ మింత లేక పెద్దను నే నంచు
బొంకములను బలుకు సంకరునకు
హెచ్చు కల్గ దిచటఁ జచ్చినరాదాడ, వి...

సిగ్గు ఇసుమంతయైనను లేక నేను పెద్దనని ఎన్ని బింకములు పల్కినను హెచ్చు ఇచ్చటనురాదు. అచ్చటను రాదు. ఇహపరములలో వాఁ డనామకుఁడే.

ఆ. బ్రహ్మను తలఁగొట్టి పారవైచినయప్పు
డడ్డపడఁగ నోపరైరి సురలు
శివునికరుణ లేమిఁ జెడిపోక పోదురా, వి....

శివుఁడు బ్రహ్మతల నఱికి పాఱవైచినపుడు దేవతలుచూచుచుండిరిగాని యొకరైన నడ్డుపడరైరి. శివుని వ్యతిరేకించియెదురాడినచోఁ దాము చెడిపోదుమనియే యూఱకుండిరి.

ఆ. మత్తచిత్తులు తమమర్మంబు తెలియక
చిత్తచలనమంది చెడిరి భువిని
భక్తిలేనివాఁడు పరమాత్మ నెఱుఁగునా? వి...

మదాంధులగు మానవులు మర్మముగ్రహింపఁజాలక చిత్తము నిలుపలేక చెడిపోవుచున్నారు. భక్తితో మెలఁగకుండువా రెన్నఁటికిఁ బరమాత్ముని దర్శింపఁజాలరు.

ఆ. మనసున దయలేని మాలకొడుకునొద్దఁ
జేరియున్న ప్రజకుఁ జేటు నిజము
పెద్దతనము లెంచఁ బెంకెలచందము, వి....

మనసు నిలుకడలేని దుర్మార్గునివద్దఁజేరిన ప్రజల కెన్నఁటి కైనను అపాయము కలుగుననుట సత్యము. వాండ్రు పెద్దచిన్న తనము లెంచక ఆశ్రయించినవారికే ద్రోహము చేయుదురు.

ఆ. మనసు నిల్పలేని మాయావిరక్తులు
మనసుపడుదు రేల మగువకొఱకు
ఇంతవ్యర్థజన్మ మింక నెందులకయా? వి....

బయటికి విరక్తునివలె నటించుచున్న యీమాయాసన్యాసులు పరకాంతలనిన నాసపడి వారికై పెనుఁగులాడుచుందురు. ఇట్టి నీచజన్మము వారికి దేవుఁడేల యొసంగెనో కదా!

ఆ. మాటలాడఁ గలుగు మర్మము లెఱిఁగిన
పిన్నపెద్దతనము లెన్నవలదు
పిన్నచేతిదివ్వె పెద్దగా వెలుఁగదా? వి...2661

యుక్తాయుక్తముల నెఱింగి మాటలాడ నేర్చినవారినిగూర్చి పెద్దచిన్న తనములు విచారించుట యనవసరము. చిన్నవానిచేత నున్నను దీపము బాగుగానే ప్రకాశించునుగదా!

ఆ. మాటలాడవచ్చు మనసు నిల్పగలేదు
తెలుపవచ్చు దన్ను దెలియలేదు
సురియఁబట్టవచ్చు శూరుఁడు గాలేదు, వి...

మానవుఁడు మాటలెన్నియేని చెప్పఁగలఁడుగాని మనస్సు



మాత్రము చెప్పినటుల నిలుపలేఁడు. ఇతరులకేదియో తెలుపఁ గలఁడుగాని తన్నుఁదాను తెలిసికొనఁజాలఁడు. ఆయుధము పట్టుకొనఁగలఁడుగాని శూరుఁడు మాత్రము కాఁజాలఁడు.

ఆ. మాట విననియాలు మగనికి బందాలు
దారిఁ జేరఁ బ్రాణమానహాని
అట్టియాలి విడిచి యడవి నుండుట మేలు, వి.

అనుకూలవతి కానియాలు మనుజునకు సంకెల కావున అట్టివానిని విడిచి యడవిలో నొంటిగా నుండుటయే యుత్తమము. దానివలనఁ బ్రాణహానియుఁ దటస్థించును.

ఆ. మాలకన్నియలకు మంచిరూపంబున్న
ముట్టనే త్రిశంకుపట్టి నాఁడు
కానిపనులు సేయ ఘను లాసపడుదురా? వి...

మాలకన్నెలగు విశ్వామిత్రునిపుత్రికలు రూపవతులు వలచి పైఁబడినను హరిశ్చంద్రుఁడు నిరాకరించెను. ఉత్తములగువా రెన్నఁటికి నీచకార్యములు చేయుటకు నియ్యకొనరు.

ఆ. మాలవానిఁ జూచి యేల నిందింతురు
తూలుమాటపలుక దొమ్మ యేమొ
ఆకుఁ జూచి పలుకు నతనికులం బేది? వి...2665

అదియేమి రోగమోగాని లోకులు మాలవానిని జూడఁగానే మాటలు తూలుచుందురు. శాస్త్రగ్రంథములను దిరుగవేసి చూచినచో వానికులము బాగుగా బోధయగును. వాఁడనుకొన్నంత హీనుఁడు కాఁడు.

ఆ. మాలవాని నేల మహిమీఁద నిందింప
నొడల రక్తమాంస మొకటె కాదె
వానిలోన మెలఁగు వానికులం బేది? వి...2666

మనవలెనే మాలకును రక్తమాంసము లొక్కటిగానేయుండె గదా! ఇఁక మాల నేల నిందింపవలయును? వానికులముతోఁ బనియేమి! వానిహృదయ మందలి యాత్మకులము విచారింప వలయును.

ఆ. రాజయోగ మూని తేజమందుట ముక్తి
తేజమందకున్న దేబెలరయ
మర్మరహితగురుని మహిఁ జేరవలెనయా, వి...

రాజయోగము నవలంబించి మోక్షము గడింపఁగలుగుటయే ముక్తి. అట్లు మోక్షమునొందనివార లవివేకులు. ఇందులకు మాయమర్మములు లేనిగురువర్యు నాశ్రయింపవలయును.

ఆ. విటుఁడు డాగుఁజేసి విడిచి పెట్టినయది
పేదపెనిమిటికి గని ప్రియము సేయు
కుప్పలోనిచెప్పుఁ గుక్క తిన్నట్లయా, వి...

విటుఁడు కులము చెఱిచి విడచిపెట్టిన లంజె నిరుపేదయగు తనపెనిమిటితో మంచిగాఁ గాపురము చేయసాగును. రాశిగా నున్న చెప్పులఁగాంచినచో గుక్కయు గుట్టు చక్కఁగానొక్కొకటి తినసాగును.

ఆ. విటుఁడు స్త్రీని రోసి విడిచిపెట్టినపిదప
నేడనున్న సిగ్గు నెంచనేల



కుడిచి వేయుపుల్లె గోతుల దొర్లదా, వి...2669

విటుఁడు బాగుగాభోగించి విడచినలంజె ఎక్కడు సిగ్గుతో నున్న నించుకేనియు ఫలములేదు. పుల్లియాకు గోతులలోదొర్లినట్లు లజ్జతో నెంత మారుమూలల కొదిగినను నిష్ఫలము.

ఆ. విశ్వకర్మ మహిమ వినఁగను చిత్రము
విశ్వకర్మమహిమ శాశ్వతంబు
విశ్వకర్మ లేమి విశ్వంబు నిలుచునా? వి... 2670

విశ్వకర్మప్రభావము వినుటకు మిగుల నాశ్చర్యమైనది. విశ్వకర్మమహిమ శాశ్వతమైనది. విశ్వకర్మయే లేకున్నచో నీవిశ్వమీవిధముగా నిలచుటకే యవకాశము లేకపోయెడిది.

ఆ. వేషభాష లెఱిఁగి గాషాయవస్త్రముల్
బోడినెత్తు లొప్పఁ బొరయుచుండ్రు
తలలు బోడు లైనఁ దలఁపులు బోడులా? వి.

పంచకులు వేషభాషలతోను కాషాయవస్త్రములతోను బోడితలలతోను తిరిగెదరు; కాని తలఁపులు మాయనంతపఱకు వేషములు మాఱి బోడితలలైనమాత్రమున ఫలములేదు.

ఆ. సతుల గవయుటయును సుతులఁ బడసెద మని
వెతలఁబడుట యెంతొ వెఱ్ఱితనము
నేల నున్నతాయి నెత్తి కెత్తినయట్లు, వి....

సంతానముగాంచి వారివలనఁ బుణ్యలోకములను బడయ వచ్చునని సతులతో నుపభోగించుట మిగుల నవివేకకార్యము. ఇది నేలనున్న తాయిని నెత్తిపైకొనుట వంటిది.

ఆ. హాని కలుగఁ బోదు హరి మది నెంచెడు
వాని కబ్బు పరము వసుధయందు
పూని నిష్ఠమీఱి పొదలక యుండుము, వి...

హరిని సర్వదా ధ్యానించువాని కెప్పటికిని హాని కలుగదు. వానికి పరము లభించును. కావున నిష్ఠతో దేవుని ధ్యానించుచు నిశ్చలుఁడవై యుక్తముగ ప్రవర్తించుము.

---

# * కూటవేదాంతపద్ధతి.

---

సీ. అవనిలో నొకకప్ప యైదుపాములఁబట్టి
విడిఁబడ మ్రింగిన విధ మదేమి?
యొనర నొక్కట రెండు ఘనకపుల్ చెలరేఁగి

* కూటమనఁగాఁ బ్రశ్నరూపముగా విషయమును బ్రతిపాదించునవి. ఇవియొకవిధములగు సమస్యలు. వేమనయోగి వ్రాసిన కూటవేదాంతపద్యముల భావము సుగమము గాలేదు. కవిభావము గుర్తింపక తోఁచినటుల వ్రాయుట యుక్తముగాదని కూటవేదాంతపద్ధతిలోని పద్యములకు భావములు వ్రాయలేదు. కవియు కూటవేదాంతభాగములో నుపమేయములనుమాత్రమే పేర్కొనుటచే ఉపమానాంశములు గ్రహించుట యసాధ్యమనియు నెటులో నూహించిన కవియూహకు భిన్నముగనుండునేమో యని యథావిధిగఁ బద్యములనె ప్రచురించితిమి.



యొంటిపిల్లల నీను నోజ యేమి?
కలియుగంబున నక్క గర్భవాసమునందు
కామధేనువు పుట్టుకట్ట దేమి?
అవికారవృక్షంబు నరటిఫలంబులు
పుట్టినయట్టి యాపాలు పదేమి?
తే. అరయ నేర్చిన సర్వజ్ఞులైనవారు
చెప్ప నేర్చినవారొండు చెప్పనేల?
శివుని గాంతురు భువిలోఁ బ్రసిద్ధముగను
నీకుఁ దెలియని దేముండు నిజము వేమ!

ఇనుమునఁ జేసిన మైనపుకడ్డి
ముంటిమొనను నట్టావుల దొడ్డి
కూర్చుండి మేపిన కుందనగడ్డి
విప్పి చెప్పరా వేమా రెడ్డి! 2675

ఆ. ఎడ్లు రెండు తిన్న నిహమున స్తంభించు
నెడ్లుమూఁడు తిన్న నిహము విడుచు
ఎడ్లు తెలియుమనుజుఁ డేర్పడ యోగిరా, వి...

ఆ. కృష్ణపర్వమందు కృత్తికలైదుండు
కృత్తులైదుపట్టి కృష్ణ మ్రింగె
వలయు కృష్ణలైదు వేమన మ్రింగెరా, వి...

క. చరణంబులు పదితోఁకలు
పరగంగ న్మూఁడుతలలు బయలను తిరుగున్

వరభూమి తల్లడిల్లఁగ
నిరవొందఁగ దీనిదెలియు మిలలో వేమా!

సీ. దినకరచంద్రులు చనుత్రోవలను గట్టి
పాన్పుతోడ నిరులు పాదు పెట్టి
మూఁడుమూలల యింటి మ్రోఁతలు పోకార్చి
పరఁగుముంగిలిమీఁద బడిలపఱిచి
కడుసన్నమగు గుర్తు నడయను నడివీథి
శోధించి మాత్రను మీఁదఁ బెట్టి
అణు వనుజ్యోతియై యానందరూపమై
దివ్యతేజంబుపై దృష్టినిల్పి
తే. తలఁప నెది లేక భేదంబు తలఁగనీక
జోలలందును నర్థియై జోలలాడు
చున్న యోగీంద్రుఁ డని చెప్ప నుచితమగును
వేమ నని యెడి యోగిని వెలయ భువిని.

ఆ. నాల్గునాలుగింట ననువుగాఁ దగుఁగాని
నాలవయిలు వాని నయ మెఱుఁగరు
అట్టివాని నరయు నాతఁడే శివయోగి, వి....

ఆ. నీరు కార మాయె కారంబు నీరాయె
గారమైన నీరె కారమాయె
కారమందు నీరు కడు గమ్యముగ నుండు, వి...

ఆ. నీరు కార మాను నీరాను కారంబు
వానివద్ద నిద్రఁ బోవవచ్చు



నీటిలోననుండు నిఖిల బ్రహ్మాండముల్, వి....

సీ. మహిలోన నొకయీఁగ మఱికేక లిడుచును
పంచంబు మ్రింగిన మహిమ యేమి
మానుషవంతుఁడై మహిమీఁదఁ బొలుండు
మ్రాను నమలినట్టి మఱి పదేమి
తోడరి దోమలు గిరి నొడిసిపట్టుక తాము
పరఁగ గతించిన బల మదేమి
పంచవన్నెల చిల్కలు పరఁగ నైదును గూడి
పర్వతంబుదిన్న బల మదేమి
తే. గొడ్డె దొడ్డిని బడి చెట్టు చిదుమఁజూడ
విరులు పూచినయట్టి విధ మదేమి
అరయ నేర్చిన చెప్పఁడు అఖిలజనులు
వివరముగఁ బల్కినట్టైన వినర వేమ! 2683

సీ. మొదలు మీఁదికిఁ గాను దుద మొదలుగ నున్న
వృక్షంబు మొలచినవింత యేమి
మహి మింటిమీఁదను మదగజం బొక్కటి
వివరించుచున్నట్టి వివర మేమి
చిదిమి పెట్టిన బంటువిధమున నేనుంగు
జీమలు మ్రింగిన చిత్ర మేమి
పులిచింత మీఁదను దలమీఁద నొకచింత
మ్రానుగట్టిన యట్టి మరుగదేమి

తే. చింతవృక్షముమీఁదఁ జేమంతిపూలు
చెలఁగి పూచినయట్టి చిత్రమేమి
అరయ నేర్చిన సర్వజ్ఞు లైనవారు
వివరముగఁ బల్కినట్లైన వినర వేమ! 2684

# జీవన్ముక్తి పద్ధతి.

అవతారిక. 'పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి' అను శ్రుతివచనమునుబట్టి ప్రపంచమున నొకపాదమున మాయఁగలదనియుఁ త్రిగుణసంబంధములేక కేవల శుద్ధసత్త్వ ప్రధానయగునది మాయయనియు, అందు మాయ ప్రతిబింబించఁగా మాయోపాధికమైన బ్రహ్మచైతన్యము ఈశ్వరుఁడనియుఁ, అవిద్యయందుఁ బ్రతిబింబించి యవిద్యోపాధికమైన బ్రహ్మచైతన్యము జీవుఁడనియు ఇట్టిజీవేశ్వరుల తత్త్వమెఱింగి కర్మపాశబద్ధుఁడుగాక సద్గురూపదేశమువలన ఉపాధికన్న విలక్షణుఁడనని తలంచువాఁడు జీవన్ముక్తుఁడనియు వేమనమహాయోగి లోకమున నీక్రిందివిధముగా నెఱుంగఁజేయుచున్నాఁడు.—

ఆ. జీవసంజ్ఞ గలుగు జీవతత్త్వంబును
జీవపరుని గురుని జెందఁజేసి
తనువు నిలుపువాఁడు తత్త్వజ్ఞుఁ డగుయోగి, వి.

జీవసంజ్ఞగలుగు జీవతత్త్వమే బ్రహ్మము. అట్టిదానిని నిలుపువాఁడే తత్త్వజ్ఞుఁడు.



ఆ. జ్ఞానియైనవాని మానక పూజించు
మనుజుఁ డెప్డు పరమునను ముదంబు
సుఖము నందుచుండు సూరులు వర్ణింప, వి...

జ్ఞానిని గుర్తించి యెల్లపుడు పూజచేయు పుణ్యాత్ముఁడు ఇహాపరములయందు సర్వసౌఖ్యము లనుభవింపఁ గలుగును.

ఆ. తత్త్వము తిరమైన తావుల వెదకుచు
తాను తత్త్వమగుట దలఁచి యోగి
తలఁపు లన్ని యుడుగ తత్త్వము తానగు, వి.

తత్త్వము స్థిరముగా నున్నతావులను వెదకి తానును తత్త్వమగుట నెఱిఁగి కోరికలడంచువాఁడె ముక్తుఁ డగును.

తే. తత్త్వములలోనఁ బరమాత్మతత్త్వ మెఱిఁగి
నిత్యనిర్ముక్తపరిపూర్ణనిలయమంది
సరి పరబ్రహ్మమయమని సంచరించు
నతఁడె పో పరశివుఁ డన నగును వేమ! 2688

తత్త్వము లన్నింటిలోను పరతత్త్వమునే యెఱింగి పూర్ణుఁడైయుండుటే గాక బ్రహ్మమును గుర్తించి ప్రపంచమంతయుఁ బ్రహ్మస్వరూపమని తలంచువాఁడే శివస్వరూపుఁడు.

ఆ. తత్త్వ మెఱుఁగువాఁడు దైవంబు నెఱుఁగును
సర్వసారములను జూడఁజేయు
కదళిమ్రింగునట్లె గరళంబు మ్రింగును, వి...

తత్త్వవేత్తలు దైవమును ఎఱుంగఁజాలుదురు. సమస్తసం

సారమును రూపు పోఁగొట్టఁజాలుదురు. అరటిపండు మ్రింగు నటుల విషమునైన మ్రింగి నిర్వికారు లగుదురు.

ఆ. తనదు దేహమందు తత్త్వార్థ మెన్నుచు
మందబుద్ధిలేక మహితుఁ డగుచు
లోనిగుట్టు దెలిసి లోకములో నుండు, వి...

తనశరీరములో నున్నజీవతత్త్వమునే యెన్నుచు మాంద్యము లేక జ్ఞానియై మహితుఁడగుచు నాత్మానుభవము నార్జించిన వాఁడే సర్వవిధముల ధన్యుఁడు.

ఆ. తనువు నస్థిర మని ధనము నస్థిర మని
తెలుప నేర్చి తాను దెలియ నేర్చి
పాత్రుఁడైన యోగి పరమాత్ముఁడే సుమా, వి.

ధనతనువు లస్థిరము లని యొరులకుఁ జెప్పి తాను నేర్చి తిరుగువాఁడే నిక్కమగు యోగి. యాతఁడే పరమాత్మస్వరూపుఁడని యెఱుంగుము.

ఆ. తన్ను తాఁ దెలిసిన దైవంబు మఱిలేదు
తానె దైవ మంచు తత్త్వయోగి
తలఁచుచుండు నెపుడు ధరలోన నరయుము,వి.

అహంబ్రహ్మాస్మి యనుసూక్తి యనుభవ సిద్ధముగా గ్రహించినవానికి దైవముతోఁ బనిలేదు. వాఁడే దైవముగఁ దన్ను దలంచుకొనుచు గడతేర యత్నించును.

ఆ. తన్ను వెదకి చూడ దానె యా జీవుండు
తత్త్వ మరయ నగును తానె యాత్మ



మన్ను మిన్ను లేదు మాయయు లేదయా, వి.

తనను పరికించి చూచినచో తానే జీవుఁడు తానే తత్త్వము తానే యాత్మయై ప్రకాశించును. ఈవిషయములో మిన్ను మన్ను శోధించినను మాయగాని మర్మముగాని లేదు.

ఆ. తన్నెఱుంగువాఁడు తాను తానై యుండు
తన్నెఱుఁగనివాఁడు తాను తానె
తనదులోనివాఁడు తానె తా నవునయా, వి...

తన్ను తానెఱింగిన వాఁడీశ్వరస్వరూపుఁడని గణింపఁదగిన వాఁడు. తన్ను తానెఱుంగనివాఁ డజ్ఞాని. తనలోనున్నవాఁడె యీశ్వరుఁ డనునది గమనింపఁదగినయంశము.

ఆ. తలఁపులోనఁ గలుగు దా దైవ మేప్రొద్దు
తలఁచి చూడ నదియు తత్త్వ మగును
తలఁపులోనితలఁపు దలఁచుచు నుండుము, వి.

దైవము నిత్యము మానవుని తలంపునందే యిమిడియున్నాఁడు. అట్టిదైవమును గుర్తింపఁ గలుగుటయే తత్త్వమనఁబడును. కావునఁ దలఁపులోనున్న యీశ్వరునే ధ్యానముచేసి ముక్తుఁడ వగుటకు యత్నింపుము.

ఆ. తల్లి పార్వతి యగు దండ్రియా శంభుఁడు
ప్రమథగణము లఖిలబంధువితతి
తనకు పుట్టినిల్లు తనరి కైలాసము, వి.... 2696

ఎల్లపుడు యోగానుభవ మార్జించి మెలఁగు విరాగియగు వానికి తల్లిదండ్రులు బంధువులు మున్నగువారెల్లరును పార్వతీ

పరమేశ్వరులును ప్రమథగణములనియు నివాసము కైలాసమని యుం తెలియుము.

ఆ. తాను తానె యనెడి తత్త్వంబు లోపల
సన్వయంబు తెలియఁ డబ్బతోడు
తాను తానె యైన తల్లడం బేలరా? వి....2697

తానే ఈశ్వరస్వరూపుఁడను తత్త్వసూక్తియందలి భావమును సామాన్యులు గ్రహింపఁజాలకున్నారు. అట్లు గ్రహించి తా నీశ్వరత్వమునొందినచో మోక్షము మోక్షమని తల్లడింపఁ బనియుండఁజాలదు.

ఆ. తాను నింద్రియముల దనర జయించిన
తత్త్వ మరసి చూడ తానె యగును
రాజయోగి యిట్లు దేజరిల్లఁగవలె, వి... 2698

తా నింద్రియముల జయించెనేని తత్త్వము తన కలవడును. రాజయోగి యీరీతి నుండవలయును.

క. తా నొకటి దెలియు నన్నది
తాను మెయి న్లేక యెల్లతావులు తానై
తా నెఱిఁగి పరిణమించిన
మానవుఁ డిల ముక్తుఁడతఁడె మాన్యుఁడు వేమా!

తాను ఏవిషయము నెఱుంగనని తలంచుచు దేహాభిమానములు పరిత్యజించి సర్వవస్తువులయందున్న యాత్మస్వరూపమును గురుతించి మెలఁగుమానవుఁడే ప్రపంచమున ముక్తుఁడు, మాన్యుఁ డనఁబడును.



ఆ. తారుమారుగాక తత్త్వదర్శన మూని
మేరుశిఖర మెక్కి మెలఁగువాఁడు
కేరి యెలుకలోనఁ గీడణఁగించును, వి... 2700

చలనము నొందక సహస్రార కమలమున నీశ్వరస్వరూపము గు ప్రకాశముగాంచి యుప్పొంగువాఁడు జ్ఞానియై యైహికములగు నంతరాయముల నన్నింటిని దొలంగించు కొనఁ గలఁడు.

ఆ. తిరిగి తిరిగి యింక దిరుగంగఁ దిరుగంగ
తిరుగు గలదె యెంత తెలివియున్న
తిరుగనట్టిత్రోవఁ దిరుగు మెల్లప్పుడు, వి...

పుణ్యక్షేత్రములు తిరిగినను దేశదేశములు తిరిగినను గొంచెమేని ఫలములేదు. ఎంత తెలివియున్నను ఈతిరుగుట యంతయు వ్యర్థమే. కానఁ దిరుగ నవసరము లేనిదగు మోక్షముకొఱకు యత్నింపనగును.

తే. నిక్కమగు జ్ఞాననిష్ఠలో నేర్పుమీఱ
సొక్కి సోలియు భ్రమయక సూక్ష్మ మంది
చిక్కువడకుండువాఁడె పో చిన్మయుండు
దక్కువగ వానిఁ గనలేరు ధరను వేమ! 2702

నిజమగు జ్ఞానానందమున సంతోషించుచుఁ దన్మయమందుచు మాయావికృతులకు లోనుగాక బ్రహ్మస్వరూపము దర్శించుచు మోసములకు లోనుగానివాఁడె జ్ఞాని. వాఁడు సామాన్యుఁడు కాఁడు.

ఆ. నిజము దెలిసియున్న సుజనుఁ డానిజము నె
పలుకవలయుగాని పరులకొఱకు
దాఁపఁగూడ దింక నోఁప దన్యము పల్క, వి...

నిజముఁ దెలిసిన సుజనుఁడు సాధ్యమైనంతవఱకును నిజముము పల్కుటకే యత్నింపవలయును. పరులకొఱకు నిజము దాఁచి యెన్నటికిని అనృతమును జెప్పరాదు.

ఆ. నిజము వరుస నెఱిఁగి నిర్గుణత్వం బంద
పలుకులోని శబ్ద మలరఁ దెలియఁ
బలుకకుండువాఁడె పరమాత్మయగునురా, వి...

సత్యమును గ్రహించి హృదయస్థమగు నిర్గుణస్వరూపమును దెలిసికొనినవానికిఁ బ్రణవనాదము గోచరించును. ఆనాదానుసారముగ నిశ్శబ్దముగా నున్న తేజమే బ్రహ్మమని తెల్లమగును.

## సంకీర్ణపద్ధతి.

అవతారిక. మానవధర్మములను గూర్చి వేమన మహాయోగి ప్రత్యేక పద్ధతులలో విరివిగా బోధించి దానితోఁ దృప్తినొందక, ఇంకను దేశీయులకు అనుయాయివర్గమునకు వివిధాంశములు, స్వచరిత్రము, ఆపద్ధర్మములు, లోకవృత్తములు సంగ్రహముగాఁ జెప్పఁదలంచి తన సంపూర్ణానుభవమును సంకీర్ణపద్ధతిలో నీక్రిందివిధముగా నెఱుఁగఁ జేయుచున్నాఁడు.—



తే. ఎంతకాలమొ వ్యర్థమై యంత వీలు
చక్కగా జిక్క వెంటనే జలక మాడి
పాత్రపుష్పము లిడికొని పట్టినాఁడ
గుహాముఖముసొచ్చి కనుఁగొంటి గురుని వేమ!

ఎంతకాలమో వ్యర్థ మయ్యె నని చింతిల్లి చివరకు వీలుచిక్కగానే స్నానముఁ జేసి పువ్వులు తీసికొని గుహాముఖమున నివసించు యోగీశ్వరుని దర్శించి కృతార్థుఁడనైతిని.

ఆ. ఒరులకొఱకు భూమి నొడిగించువారలు
నవనిపతికి వశ్యులైనవారు
పాలవంటికులమువారు కాఁపులెఱుంగు, వి...

కాఁపులు సాధువులు. ఇతరులకు భూమిని సాగుఁజేసి రాజులకు విధేయులై యుండెడివారు. వారు పాలవంటి పవిత్రవంశమునఁ బుట్టిన యుత్తమోత్తములు.

ఆ. చిగురుచెట్టుచూచి చింతపువ్వులుచూచి
నిమ్మపండు పండు నిమిషమునను
డాలుచెడకమునుపె దానిని తినవలె, వి. 2707

చిగురుచెట్టును జింతచెట్టును జూచుచు అప్పుడె పండిన మంచినిమ్మపండును ఆలసింపక భుజించుట (యేరోగమునకో మంచిది. సుప్రసిద్ధయోగమని) వేమన చెప్పుచున్నాఁడు.

ఆ. చెవిని నిల్లుగట్టి చెప్పెను వేమన
బట్టబయలనుండు బ్రహ్మ మనుచు
బుద్ధిగలిగి యందుఁ బొందిసుఖింపుఁడీ, వి...

వేమన చెవి నిల్లుగట్టుకొని (అంతటిశ్రద్ధతో)బట్టబయలనే బ్రహ్మ మున్నదని చెప్పెను. కావున బుద్ధిశాలురగువారు బ్రహ్మ ము నొంది సుఖింపవలయును.

తే. పరమగురుఁ డభిరామయపాదములకుఁ
జేతులను సాచి మ్రొక్కితి శిరముఁ జేర్చి
తప్పు వినియును క్షమియించె నొప్పిదముగ
దలఁపఁడే నండఁ దనపాటు ఫలము వేమ! 2709

పరమగురుఁ డగునభిరామయ్య పాదములకు మ్రొక్కి మన్నింప వేడితిని. ఆయన నాతప్పును వినియును క్షమియించెను. నాశ్రమ కాయన ప్రతిఫలము నొసంగుటయందు నేర్పుగలవాఁడే!

క. ప్రతిదినమును నుదయమ్మున
మితకాలము లెక్కఁగొనక మీఱి పనికి రాఁ
గతమేమి యనుచు రామయ
వ్రత మరయఁగఁ గంటి నిట్టివాసిని వేమా! 2710

ప్రతిదినమును అభిరామయ్య సన్నిధికి వేళ యతిక్రమించి పోవుటవల్ల నాయనఁ గాలాతిక్రమణముగూర్చి మందలించెను. దాన జాగరూకుఁడ నగుటచేతనే ధన్యుఁడనైతిని.

తే. రోఁతపుట్టెను మగువపైఁ బ్రీతి దొరఁగ
నాఁటనుండియు నాకేమి పాటు లేమి
కాలమును బుచ్చ నీకర్మశాలయందు
గూరుచుండఁగఁగాదె నీగురుఁడు వేమ! 2711



ఆనాఁడు మొదలుకొని మగువపై ననహ్యము కలిగి వలపు పోయెను. బంగరు పనిచేయు నింటిలో గూర్చుండుటవలననే కాలక్షేపము సక్రమముగాఁ జేయ వీలు కలిగెను. దానిచే నభిరామయ్యవంటి గురుఁడు లభించెను.

క. టక్కరులఁ గూడి తిరుగుచు
నెక్కుడు కాలంబు జ్ఞాన మెఱుఁగఁగలే కే
నొక్కవెలయాలిపొందును
మిక్కుట మగు మోక్ష మనుచు మెలఁగితి వేమా!

మోసగాండ్రతో కలసి తిరుగుచు చిరకాలము వేశ్యాలంపటుఁడనై జ్ఞానహీనుఁడనై అదియే మోక్ష మని పెక్కునాళ్లు తిరిగితిని. ఇప్పటి కది లోపమని బాగుగాఁ దెలియవచ్చెను.

చ. ధర నతికీర్తిమంతుఁడును దైవసముం డతిగోప్యుఁ
డోర్పు మీఱ రహిని కొండవీటియభిరామయ
నా గురువర్యుఁ డాతఁడు, న్మఱియుఁ బ్రభుండ
వీవు ననుమానము లేదిఁక మీఁదునామముల్,
స్థిరముగ నుండుఁగాక యిది సిద్ధము సుమ్ము జగాన వేమనా! 2713

లోకమునందు దైవసముఁడగు కొండవీటి యభిరామయ్యయే గురువు. ఆతనికి ప్రభువునగు నీవు శిష్యుఁడవు. ఇఁక మీయిద్దఱపేరులు శాశ్వతములుగా నుండఁగలవు. ఇది సత్యము.

ఆ. గండికోటలోనఁ గత్తిఁ బట్టినయంత
రాజుగారిదొడ్డరౌతు గాఁడు

ఎంతవారి నైన నెత్తినఁ గొట్టునా? వి....2714

పిటికివాఁడు గండికోటలో కత్తిఁ బట్టుకొనినంతనే గొప్ప శూరుఁడు కాఁజాలఁడు. రాజుగారి రౌతుగాఁడు. ఎంతవాఁడైన నెదిరించినచో పిటికివాఁడు తిరుగఁబడి చంపలేఁడు.

ఆ. పాకనాటిరెడ్డి పరఁగ మోటారెడ్డి
యొసఁగుతోటపెద్దయెట్టిరెడ్డి
మొఱకులందఱుభువిమొనగాండ్లుఅయిరయ్యా,వి.

నిన్న మొన్నఁటిదనుక పేరుప్రతిష్ఠలు లేకున్న పాకనాటి రెడ్లు మోటారెడ్లు తోటరెడ్లు ఎట్టిరెడ్లు మొదలగు మూర్ఖులందఱు రానురాను నేర్పరులగుచున్నారు.

ఆ. నిమ్మపండుపుట్టె నిజమైనరసముండె
హేమమునకు నేడ్తు రేల జనులు
సత్తుపొత్తుఁజేసి సాధింపలేరొకో, వి... 2716

నిమ్మపండు గలదు. నిజమైన రసము (పారదాదులు) గలవు. వానితో రసతంత్రానుసారముగా సత్తును జతపఱచి కొన్నినియమములతో బంగారము చేయఁదగు నవకాశములుకలవు. దీనిని గమనింపక ప్రజలు బంగారము బంగారమో యని యేల యేడ్చెదరో గదా?

క. నందనసంవత్సరమునఁ
బొందుగఁ గార్తికమునందుఁ బున్నమనాఁ డీ
వింధ్యాద్రిసేతువులకును
నందున నొకవీరుఁ డేలు సాటర వేమా! 2717



నందన సంవత్సర కార్తీక పూర్ణిమ దినము మొదలుకొని యావద్దేశమునంతయు నొక వీరుఁడె పరిపాలింపఁగలఁడు. ఈవిషయమును లోకమునం దెల్లెడ సాటఁ బ్రయత్నింపుము.

క. కాదనఁ డెవ్వరితోడను
వాదాడఁగ బోఁడు వెఱ్ఱివానివిధమునన్
భేదాభేద మెఱుంగును
వేదాంతరహస్యములను వేమన నుడువున్.2718

వేమన ఎవ్వరికిని బదులును చెప్పక వెఱ్ఱివానివలె తిరుగుచుండును. ఎవరితో వాదములాడఁడు కాని వేదాంతములోని రహస్యములన్నియు భేదాభేదములన్నియు నెఱుంగును.

క. సమయంబు మంచిదయ్యెను
క్షమియించితిరయ్య నాకు సాధ్యం బయ్యెన్
తమఫల మటంచు చెప్పితిఁ
గ్రమముగ నికమీఁది ముప్పు గడచెను వేమా!

సమయ మనుకూలించుటచే గురువర్యా! నాలోపములనన్నింటిని క్షమించితిరి. మోక్షవిద్య సాధ్యమయ్యెను. ఐహికములగు నాపదలు తీఱిపోయినవి. గురుసేవాఫలముచేకూరుటచేఁ గృతార్థుఁడ నైతినని వేమన గురునితోఁ జెప్పికొనుచున్నాఁడు.

---

# ఫలశ్రుతి.

అవతారిక. ప్రపంచ తత్త్వార్థమై వేమనమహాయోగి వివిధములగు నీతులు ప్రపంచవర్తనలు ఆచారములు కర్మయోగము బ్రహ్మవిద్యా రహస్యములు జీవన్ముక్తిపద్ధతి ప్రజలకు నెఱింగించి వాని నన్నింటిని సక్రమముగా నాచరించిన లోకులుసన్మార్గమునఁ బడి తరింతురనియు, ఇంతసులభముగా నిటులసుబోధముగఁ బ్రపంచధర్మముల నెఱింగించినవారు లేరు గాన నీపద్యములను బఠించి భావమును గ్రహించి జనులు ఫలము ననుభవింపవలయునని తెలుపుటకై గ్రంథపఠనవలన లభించు ఫలితాంశము నీక్రింది విధముగాఁ జెప్పుచున్నాఁడు.—

తే. అరయ వేమన్న చెప్పినయాత్మవిధము
దెలియలేనట్టి యజ్ఞాని దేబెలెల్ల
తలను వీడినవెండ్రుకదారివలెను
భుక్తిముక్తులఁ బొసఁగఁగా లేరు వేమ! 2720

వేమన్న చెప్పిన యాత్మ విధమును తెలియలేకున్నవారెల్లరును అజ్ఞానులును దేబెలునై తలవీడినవెండ్రుకలవలె ఎందునకు పనికిరాక భుక్తికి ముక్తికిఁ గొఱగాక పోవుదురు.

ఆ. ఇహపరంబులకును నిది సాధనం బని
వ్రాసి చదివి విన్నవారి కెల్ల
మంగళంబు లొసరు మహిలోన నిజ మిది, వి.



ఇహపరముల సాధించుటకు వేమనపద్యములే యాధారమని తలంచి ప్రత్యంతరములువ్రాసి యాలకించు సజ్జనులకు సమస్త మంగళములు కలుగుననుట సత్యము.

క. ఒకపద్యంబును మది నిడి
ప్రకటిత మగుగుట్టు దెలిసి పఠించినచో
సకలంబును శ్రుత్యర్థము
నికటంబగు నిటరహస్యనిలయము వేమా! 2722

ఈపద్యములలో నొక్కదానినైనను మనస్సులో నుంచుకొని మర్మమును కనుఁగొని పఠించినచో వేదాంతము సమర్మకముగా వెల్లడి యగును.

ఆ. ముక్తిమార్గమునకు మూలమై తగునట్టి
గ్రంథ మంత జనులు గడఁగి చదువ
విన్నవారి కెల్ల విభవముల్ కలవయా, వి. ...

ముక్తికి మూల మగునీగ్రంథమును సాంగముగా చదివి విన్నవారికి ఎల్లవిభవములను లభించును.

క. వేమన చెప్పిన కల్పం
బే మానవుఁ డైనఁ గాని యెద నూహింపన్
దామస మేటికి కల్గును
వేమనయే సిద్ధుఁ డరయ విధ మిది వేమా!

వేమన వ్రాసిన పద్యగ్రంథము నేమానవుఁడైనఁ బఠించినయెడల వానికిఁగల కోపస్వభావమంతయును నశించును. వేమనయోగి సామాన్య మనుష్యుఁడు కాఁడు. సిద్ధుఁడు.

క. వేమన చెప్పినమాటలు
సామంబున సకలవేదసారంబుగదా

సామెత పంచాక్షరితో
సీమహిమలు దెలిసియుంట యింపగు వేమా!

వేమన చెప్పినమాటలన్నియును వేదసారములు; గనుక సర్వదా పంచాక్షరివలె జపింపఁదగును.

ఆ. వేమ ననఁగ యోగి వెలసె లోకములోనఁ
బూజ లిడుఁడు పుణ్యపురుషులార
పూజ లిడినయంత భుక్తిముక్తుల నిచ్చు, వి ...

వేమన యను నొక యోగి లోకములో వెలసెను; కావున నతనిఁ బూజించి కృతార్థు లగుటకు యత్నింపుఁడు. పూజించిన ఇహమున భుక్తి పరమున ముక్తికలుగును.

ఆ. వేమ నిట్లు చెప్పె వేలపద్యంబులు
తప్పు లెన్ని యున్న నొప్పియుండు
తత్త్వపడకందు జిత్తము నిల్పుము, వి.... 2727

వేమన యీతీఱుగా వేలకొలఁది పద్యములను చెప్పియున్నాఁడు. అందు ఎన్నియైన తప్పులు దొరకవచ్చును గాని ఆమాత్రమున త్వరపడక యందలి యర్థమును చక్కఁగా మననముఁ జేయుము.

క. వేమనపద్యము లెల్లను
సామముతోఁ జదివినట్టి సజ్జను లెల్లన్
సోమనతలగలయాతని
సామీప్యము నొందఁ గలరుసత్యము వేమా!

వేమనచెప్పిన పద్యములను శాంతముగఁ జదువుకొను సజ్జనులు ఈశ్వర సాన్నిధ్యముఁ జేరి కృతార్థులగుదురు.

---

# అనుక్రమణిక.

---

